# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

రెండవ సంపుటము

# శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

## రెండవ సంపుటము

సంపాదకులు :

సాహిత్యభూషణ, విద్యాసాగర

ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ఎం.ఏ., బి.ఎల్.,బి.టి.పి. గారు.



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4.

# విజ్ఞప్తి

ఈశ్వరకటాక్షమువలన శ్రీవివేకానంద సంపూర్ణగ్రంథావళి లోని రెండవ సంపుటమును మా పాఠకుల కందింపజాలుచుంటిమి. స్వామిజీ మహోపన్యాసములందలి సముజ్జ్వలభావములు "రాజయోగము" "మతము" "మతాచార్యులు" మున్నగు శీర్షికలతో ప్రస్తుతగ్రంథమున పరిఢవిల్లుచున్నవి. "రాజయోగము" ప్రత్యేక గ్రంథముగా ప్రకటింపబడినది. ఇందది సంస్కరింపబడి, పరిశోధింప బడినది. ప్రత్యేకగ్రంథముగా సేవాధర్మముగా నీవరలో దాని ననువదించిన శ్రీచిరంతనానందస్వామికి మేము కృతజ్ఞులము.

భక్తి, జ్ఞాన, కర్మ, రాజయోగములలో నేదియైనను సాధకుని మోక్షద్వారమున నిలుపజాలునని శ్రీ వివేకానందస్వామి పలికిరి. బహుసంఖ్యాకులకు "రాజయోగము" పై ప్రీతికలదు. ఇందలి యంశములు, ముఖ్యముగా ప్రాణాయామమునకు సంబంధించిన భాగము, గురుసాహాయ్యమువలననే అనుష్ఠింపబడవలెనని స్వామిజీ హెచ్చరించిరి. కాని "రాజయోగ"మందలి ప్రాథమికాంశములు సులభముగ హృదయంగమములగును. వీనివలన నేకాగ్రదృష్టి అలవడ గలదు. వీనిని స్వామిజీ అరటి పండొలిచిపెట్టినట్లు పఠితల కందించిరి.

మానవుని దృష్టిలో ననేకాశయములు కలవనియు, స్వీయ శక్తిని పురస్కరించుకొని, సాధకు డాశయసిద్ధి నందజాలుననియు "రాజయోగము" తెలుపుచున్నది. కొన్ని భేదములున్నను "పాతంజలయోగదర్శనము" "సాంఖ్యదర్శనము"పై నాధారపడియున్నది. పరమగురురూపమున పతంజలి సాకారదైవము నంగీకరించుచున్నాడు.

పూర్ణసిద్ధుని, సృష్టిలో నొక కల్పమునకు తాత్కాలికముగా అధిపత్యము పొందిన కొండొక పురుషుని, విడిచి ఇతర దైవమును సాంఖ్యు లంగీకరింపరు. రాజయోగము సాధకులకు మహత్తరమైన ఆత్మవిశ్వాసమును ప్రసాదించును.

"మతము" "మతాచార్యులు" మున్నగువిషయములను శ్రీ పి. సీతారామబ్రహ్మముగారనువదించిరి. 'నా గురుదేవుడు' అను అధ్యాయము శ్రీ సిద్ధేశ్వరానందస్వామిచే అనువదింపబడినది. ఆచార్య జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు సమగ్రసంపుటమును పరిశోధించి, సంస్కరణ మొనరించిరి. అందందు కొన్ని భాగములను అనువదించిరి. వీరందరికిని మా హృదయపూర్వక ధన్యవాదముల నర్పించుచున్నాము.

ఈ గ్రంథపఠనమువలన పాఠకుల యాధ్యాత్మిక జిజ్ఞాస ఘనతరమగుచో మాకృషి ఫలించినదని ఆనందింతుము.

మద్రాసు,
మే, 1962

ప్రకాశకులు.

# విషయసూచిక

## రాజయోగము



శ్రీ వివేకానంద స్వామి

# రాజయోగము

---

## ప్రథమాధ్యాయము

## ఉపోద్ఘాతము

మన జ్ఞానమున కంతకును అనుభవమే మూలాధారము. తర్క-శాస్త్రమున రెండు తీరుల హేతుసమీక్ష కలదు. దృష్టిని కొన్ని ప్రత్యేకాంశములపై సారించి విశ్వజనీనసిద్ధాంతమును ప్రకృతి సమత్వమును పురస్కరించుకొని కనుగొందుము. ఇది ఒక విధము. సర్వజనీన సిద్ధాంతమునుండి ఒక ప్రత్యేకాంశమును నిర్ధారణ మొనరించుట రెండవ విధము. ఈ సిద్ధాంతకరణీయ పరిజ్ఞానము అనుభూతిపై ఆధారపడియున్నది. ప్రతిమనుష్యుని యనుభవములకును సరివచ్చుటచే నిశ్చితశాస్త్రములు అని చెప్పబడు భౌతిక విజ్ఞానశాస్త్రములందలి సత్యమును జనులు సులభముగ గ్రహించుచున్నారు. ప్రకృతిశాస్త్రజ్ఞుడు దేనినిగాని నిర్హేతుకముగ నమ్మవలయునని మీతో జెప్పుటలేదు. స్వానుభవమునకు ఫలితముగ ఆతనికి కొన్ని సిద్ధాంతము లేర్పడుచున్నవి. ఈ స్వానుభవములపై హేతువిమర్శ చేసి శాస్త్రజ్ఞుడు మనము తన సిద్ధాంతములను నమ్మవలయునని చెప్పినప్పుడు సర్వజన సామాన్యానుభవము నేదియో యొక దానిని ఊతగా గ్రహించుచున్నాడు. ప్రతినిశ్చితశాస్త్రమునందును సర్వజన సామాన్యమైన యిట్టి మూలాధారమొకటి కలదు. దాని ననుసరించి, యాతడు తేల్చిన సిద్ధాంతముల సత్యాసత్యములను వెంటనే మనము కనుగొనవచ్చును. ఇప్పుడు, మతమున కట్టి మూలాధారమున్నదా? లేదా? యను ప్రశ్న

వెలువడుచున్నది. ఇందులకు నేను 'ఉన్నది' అనియు, 'లేదు' అనియు గూడ సమాధానము చెప్పవలసియున్నది.

మతమనునది భక్తి విశ్వాసములపై నాధారపడియున్నట్లు చెప్పబడుచున్నది. లోకమందంతటను సాధారణముగ మతమును గూర్చి యీ విధముగనే బోధించుచున్నారు. ఇందులకు తోడుగ అనేక సందర్భములలో మతమనునది కేవలము వివిధ సిద్ధాంతముల సంపుటిగ నున్నది. మతములన్నిటిలో అంతఃకలహము లుండుటకు కారణ మిదియే యని మనము గ్రహింపవచ్చును. ఈ సిద్ధాంతములు తిరిగి విశ్వాసముపై నాధారపడియున్నవి. అంతరిక్షములో నెక్క-డనో కూర్చుండి బ్రహ్మాండముల నన్నిటిని పరిపాలించుచున్న వ్యక్తి యొకడు కలడని నాతో నొకడు చెప్పుచున్నాడు. తానట్లు యూహగ జెప్పుచుండుటయే ఆగమప్రమాణముగ అంగీకరించి నేను తన మాటలను నమ్మవలయునట! ఇదేరీతిగ నాకు కొన్ని యభిప్రాయము లుండవచ్చును. వీని నితరులు నమ్మవలయునని చెప్పుచున్నాను. ఏల నమ్మవలయునని నన్ను వా రడిగినపక్షమున కారణము చూపజాలను! ఇందుచేతనే యీ దినములలో మతమన్నను, వేదాంతమన్నను దురభిప్రాయము కలుగుచున్నది. "ఓహో! ప్రతివ్యక్తియు తనకు నచ్చిన యూహలను బోధించుచున్నాడు. వాని మంచి చెడ్డలను నిర్ణయించుట కొక ప్రమాణమనునది లేదు. ఈ మతములన్నియు వట్టి సిద్ధాంతపు కట్టలు" అని విద్యాధికుల యభిప్రాయమై యున్నట్లు కనబడుచున్నది. ఐనను, భిన్న దేశములలో భిన్న మతస్థుల భిన్నాభిప్రాయములనేగాక, భిన్న సిద్ధాంతములనుగూడ సమన్వయపఱచుచు, ఆస్తికతకు సర్వజన సామాన్యమై యున్న మూలాధారమొకటి కలదు. మూలమునకు పోయి చూచినప్పుడవియు సర్వజనసామాన్యమైన అనుభూతిమీదనే ఆధారపడి యున్నట్లు కనుగొనవచ్చును.

ప్రపంచములోనున్న వివిధమతముల నన్నిటిని విభజించి చూచిన పక్షమున ఆగమప్రామాణ్యము లేక గ్రంథప్రామాణ్యము

గలవియు లేనివియు నని రెండు తరగతులుగ నున్నట్లు తోచును. గ్రంథప్రామాణ్యముగల మతములు ప్రాబల్యములగుటచే చాల మంది వానిని అవలంబించుచున్నారు. అదిలేని మతములు చాలవఱకు నశించినవి. మఱి క్రొత్తగ బయలుదేఱిన కొలది మతముల నవలంబించినవారును చాల తక్కువగనున్నారు. ఐనను వీనిచే బోధింపబడుచున్న తత్త్వములన్నియు ప్రత్యేక వ్యక్తులయొక్క అనుభవఫలితము లనువిషయమున నీ మతము లన్నియు నేకీభవించుచున్నట్లు కానవచ్చును. తన మతమును నమ్ముడని క్రైస్తవుడు మీకు జెప్పుచున్నాడు. ఆతని మాటలను విని మీరు క్రీస్తునందును, క్రీస్తుయొక్క సాక్షాద్భగవదవతారత్వము నందును, దేవునియందును, జీవునియందును, జీవుని భవిష్యదుత్తమస్థితియందును విశ్వసనీయులు కావలయునట. 'కారణమే' మని నే నడిగిన వాడది తన నమ్మకమనును. కాని మీరు క్రైస్తవమతముయొక్క మూలమునకు పోయి చూచిన పక్షమున అనుభూతియే దాని కాధారమని గ్రహింపగలరు. క్రీస్తు తాను భగవంతుని జూచితినని చెప్పియున్నాడు. ఆతని శిష్యులు తాము భగవదనుభవమును బొందితిమని చెప్పియున్నారు. ఇట్టి విషయము లనేకములు కలవు. ఈరీతిగనే బౌద్ధమతమునందు బుద్ధుని యనుభూతియే ప్రధానముగానున్నది. బుద్ధుడు కొన్ని సత్యములను ఆత్మానుభూతివలన గ్రహించెను. వాని నవలోకించెను. వాని సన్నిహితసంపర్కము నందెను. ఆతడు తత్త్వదర్శియై లోకమునకు తత్త్వోపదేశము గావించి యున్నాడు. హిందువుల విషయముగూడ నిట్టిదే. స్మృత్యాదులను రచించిన ఋషులు తాము తత్త్వదర్శనము చేసితిమని చాటుచు తాము గనిన తత్త్వములనే లోకమునకు బోధించుచున్నారు. జ్ఞానమున కంతకును ప్రత్యక్షానుభూతియే పునాది. ప్రపంచములోనున్న మతముల కన్నిటికిని త్రికాలాబాధితమైన యిట్టి ప్రత్యక్షాను

భూతియే మూలాధారమైయున్నదని మన కిందువలన స్పష్టమగు
చున్నది. మతప్రవక్త లందఱును భగవంతుని సందర్శించినవారే.
ఆత్మద్రష్టలై, త్రికాలజ్ఞులై, తమ శాశ్వతత్వమును దర్శించి
తాము కన్నదానిని వారు లోకమునకు బోధించియున్నారు. ఈ
యనుభూతులు నేఁడసాధ్యములనియు మొట్ట మొదట మతములను
స్థాపించిన యేకొలది వ్యక్తులకో అవి సాధ్యములైనవనియు (వారి
యనంతరము మతములు వారి నామములను వహించినవనియు)
ముఖ్యముగా ఈ దినములలో అనేక మతములనుండి యొక
విచిత్రమైన వాదము వెలువడు చున్నది. ఈ యనుభూతులు
ప్రస్తుత కాలమునందు చెల్లవట! అందుచే మతమునకు
నమ్మకముకంటె వేఱొక యాధార మేదియు లేదట! ఈ
సిద్ధాంతమును నేను సమూలముగ ఖండించెదను. ఏ విజ్ఞానము
నందుగాని యీ లోకములో నొక యనుభవము సిద్ధించిననాఁడు
అంతకుముం దనేకకోట్లపర్యాయము లది సిద్ధించియున్నదనియు,
శాశ్వతముగా మరల మరల సిద్ధించుచుండు ననియు నిరాఘాట
ముగా నేర్పడుచున్నది. ఒకప్పుడు సంభవమైనది సర్వదా
సంభవమైయుండును. ఈ యేకరూపత్వము నిరంకుశమైన ప్రకృతి
శాసనము.

అందుచే, ప్రాచీనకాలమునందు సిద్ధించిన యనుభూతి
మీఁదనే మత మాధారపడియుండునది కాదనియు, అట్టి
స్వానుభవము కలిగిననే కాని మనుష్యుఁడు పారమార్థికుఁడు కానేర
డనియు యోగశాస్త్రాచార్యులు చాటుచున్నారు. మనకీ
యనుభూతి కలుగు విధానమును బోధించునట్టి శాస్త్రమే
యోగశాస్త్రము. స్వానుభవము లేనిదే మతమునుగూర్చి
ప్రసంగించుట నిష్ప్రయోజనము. భగవంతుని పేరిట నింత
కల్లోలము, ఇంత గందరగోళము, ఇంత కలహమును ఎందుచే
సంభవించుచున్నవి? మూలకారణమును గ్రహింపక జనులు

తమ తాతముత్తాతల యాచారములకు తలయూపుటతో సంతృప్తి నొంది, యితరులును తమ్మనుసరింప వలయునని భావించియుండుటచే దేవుని పేరిట జరిగినంత రక్తపాతము మఱియొక నిమిత్తము వలన జరుగలేదు. స్వానుభవము లేనిదే ఆత్మ కలదనుటకును, చూడనిదే దేవుడు కలడనుటకును మానవునకేమి 'హక్కు' కలదు? భగవంతుఁ డొకడు కలడందురా, మన మాతని జూడవలయును. ఆత్మ కలదందురా, దానిని మనము కనవలయును. లేకున్న నమ్మక పోవుటయే మేలు.

ఆస్తికుఁడను కపటవేషము వేయుటకంటె బాహాటముగ నాస్తికుఁడగుటయే మంచిది. నవీన 'విద్యాధికులు' మతము, వేదాంతము, పారమార్థికచింత యనునవన్నియు వ్యర్థములని తలచుచున్నారు. ఇక నివి యన్నియు కేవలము నిరాధారములనియు, లోకహితముచేయుటకై మనలను ప్రేరేపించుటకంటె వీనికి మఱియొక ప్రయోజనమనునది లేదనియు అల్పవిద్యావంతుల యభిప్రాయమై యున్నట్లు కనిపించును. జను లాస్తికత నవలంబించుటవలన యోగ్యులును నీతిపరులునునై సత్పౌరులగుటకు కొంత యవకాశ మేర్పడుచున్నదట! ఇట్లు లూహించుచున్నందులకు వీరిని నిందింపవలసినది లేదు. ఏలయన, నిస్సారములైన ప్రలాపములను నమ్ముచుండిన జాలునని వీరు పొందుచున్న బోధనలన్నిటికిని సారాంశము. మాటలను బట్టుకొని ప్రాకులాడుచుండుడని వీరి కుపదేశించియున్నారు. కాని వీరిట్లు కాలక్షేపము చేయగల్గిననాడు మానవస్వభావము నాకిక లేశమైనను మాన్యము కానేరదు. మానవు డెప్పుడును సత్యమునే కోరును; తదనుభవమునకై వాని మానసము పరితపించుచుండును. సత్యము గ్రహించి, అంతరాత్మయందు తదనుభవము పొంది సత్యసందర్శనము చేసినప్పుడే సమస్త సంశయములును తెగి అజ్ఞానమునాశనమై సమస్త కర్మములును నశించునని వేదములు

చాటుచున్నవి.* "దివ్యలోక నివాసులగు నో అమృతపుత్రు లారా! (మోక్షమార్గమును) వినుడు : ఈ యజ్ఞానసముద్రము నుండి తరించు మార్గ మొకటి కలదు. అజ్ఞానాంధకారమున కవ్వల వెలుఁగొందు పరమపురుషుని గనుగొనుటయే ఆ మార్గము; వేఱొక మార్గము లేదు."†

ఈ తత్త్వదర్శనార్థము శాస్త్రసిద్ధమైన రాజమార్గమును మానవకోటికి జూపుటయే రాజయోగాశయము. ప్రతి శాస్త్రమునకును స్వతంత్రమైన శోధనపద్ధతి యొకటి కావలయును. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడవు కాదలచి యొకచోట గూర్చుండి "ఓ జ్యోతిశ్శాస్త్రమా! జ్యోతిశ్శాస్త్రమా!" అని యెన్నిసార్లు మొఱపెట్టినను అది నీ యొద్ద కెన్నడును రాదు. రసాయనశాస్త్ర విషయముకూడ నిట్టిదే. అందులకు మన మొకానొక పద్ధతి ననుసరింపవలసి యున్నది. పరిశోధనశాలకు బోయి, భిన్న ద్రవ్యములను దీసికొని, వానిని జేర్చి, సక్రమముగ సంయోగము చేసి పరిశోధనలు సాగింపవలయును. ఇన్నిటి ఫలితముగ రసాయనశాస్త్ర జ్ఞానము కలుగుచున్నది. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడవు కాదలచిన పక్షమున నక్షత్రపరిశీలనశాలకు బోయి దూరదర్శనయంత్రము దీసికొని దానితో నక్షత్రములను గ్రహములను పదేపదే పరిశోధింపగా తుదకు జ్యోతిషసిద్ధాంతి వగుచున్నావు. ఒక్కొక్క శాస్త్రమున కొక్కొక పద్ధతి కావలసియున్నది. మతధర్మములనుగూర్చి నేను వేలకొలది యుపన్యాసముల నిచ్చెదనుగాక. అందుల కనువగు మార్గము నవలంబింపనిదే మీకు పారమార్థికజీవన మలవడదు. సర్వకాల సర్వ

---

* భిద్యతే హృదయగ్రంథిః, ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే-పరావరే॥ (ముండకోపనిషత్)

† శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః, ఆయే ధామాని దివ్యాని తస్థుః।
వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్।
తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ॥
(శ్వేతాశ్వతరోపనిషత్)

దేశములందును లోకకల్యాణముకంటె మఱియొక సంకల్పము లేని పవిత్ర చరిత్రులైన ఋషులు వచించిన సత్యములివి. ఇంద్రియములచే గ్రాహ్యమగునట్టి సత్యముకంటె మహత్తరమైన తత్త్వమొకటి తాము కనుగొంటిమని ఘోషించుటయేగాక తమ సిద్ధాంతమునందలి సత్యాసత్యములను పరిశోధించుటకు తామావిష్కరించిన సిద్ధాంతము సత్యమైనదని దృష్టాంతపూర్వకముగా దృఢమొనరించుటకు వారు మనల నాహ్వానించుచున్నారు. మఱియు తాము చెప్పిన మార్గమును స్వీకరించి సత్యనిష్ఠతో సాధనచేయుడని మనలను హెచ్చరించు చున్నారు. అనుష్ఠించిన యనంతరము ఈ పరమసత్యము కానరాని నాడు వారి వాదము కల్ల యనుటకు మీా కధికారము కలదు. కాని యంతకుముందుగనే నిరాకరించుట యనునది వివేకలక్షణము కా నేరదు. అందుచే నియమితవిధుల ననుసరించి శ్రద్ధతో కృషిచేయుట మనకు విధాయకమైయున్నది ; తప్పక వికాసము కలుగును.

జ్ఞానమును అలవఱుచుకొనుతఱి మనము తార్కికవిధానము ననుసరించిన సిద్ధాంతమును వినియోగించుకొందుము. ఈ సిద్ధాంతము పరిశీలనముపై ఆధారపడియుండును. మొదట మనము విషయములను పరిశీలించి, సామాన్య ధర్మములను నిర్ణయించి అనంతరము సిద్ధాంతముల నేర్పఱుచు చుందుము. మున్ముందు అంతరంగమునందలి విషయములను గమనించునట్టి శక్తి సంపాదింపనంతవఱకు మనస్సునుగూర్చియు, మనుష్యుని అంతరప్రకృతిని గూర్చియు, భావనాతత్త్వమునుగూర్చియు జ్ఞాన మెన్నటికిని గలుగదు. అనేక సాధనములు నిర్మింపబడియుండుటచే వాని సాయమున బాహ్యప్రపంచ విషయములను పరిశీలించుట కొంతవఱకు సులభమని చెప్పవచ్చును. కాని అంతరప్రపంచమును శోధించుటకై మనకట్టి సాధనసంపత్తి యేదియు లేదు. ఐనను నిజమైన శాస్త్ర మేర్పడుటకు పరిశీలన మావశ్యకమని మనకు తెలియును. విషయవిశ్లేషణసహితమైన పరిశోధన లేనిదే భౌతిక శాస్త్రమనున దేదియు నిలువనేరదు. ఇందువలననే మానసిక

శాస్త్రజ్ఞులలో పరిశీలనసాధనములను కనుగొనిన యే కొలది మందియో తక్క, మిగిలిన వారందఱును సృష్ట్యాదినుండియు తమలో తాము తగవులాడుచున్నారు.

ఆంతరస్థితులను పరిశీలించుట కిట్టి సాధనములను మనకు జూపుటయే మున్ముందు రాజయోగాశయము. మనస్సే యిందులకు సాధనము. ఏకాగ్రతాశక్తిని సక్రమ మార్గమునకు దెచ్చి ఆంతర ప్రపంచముపైపునకు మరల్చినప్పు డది మనస్సును విమర్శించి యంతకుముందు మనకు దెలియని విషయములను ప్రకాశింపజేయుచున్నది. చెదరిన సూర్యకిరణములను కేంద్రీకరించినప్పు డవి తీక్ష్ణముగా వెలుగును. ఇట్లే యేకాగ్రత వలన మనశ్శక్తులు దీప్తిచెందును. జ్ఞానమున కిదియే సాధనము. బాహ్యాంతర ప్రపంచములు రెండిటియందును ప్రతి మానవుడు ఏకాగ్రతాశక్తిని వినియోగించుచునే యున్నాడు. ఈ కర్తవ్య నిర్వాహణమునకు విశేషమైన అభ్యాసమావశ్యకమై యున్నది. చిన్న నాటినుండియు ఆంతర ప్రపంచవిషయములను విడిచి బాహ్యవిషయములనే లక్షింప నేర్చుకొనియున్నందున మనలో చాలమందికి మనోయంత్రమెట్లు నడచుచున్నదియు గమనించు శక్తి చాలవఱకు నశించినది. చిత్తవృత్తుల నరికట్టి మనస్సు నంతర్ముఖముచేసి సర్వ మానసికశక్తుల నేకాగ్రతకు దెచ్చి మనస్సుపై బఱపి మనస్సును విమర్శించి మనస్సువలననే మనస్స్వభావమును గ్రహించుట యనునది సులభసాధ్యమైనపనికాదు. ఐనను అట్టి విషయవిమర్శనమే శాస్త్రీయ మనదగిన పద్ధతి. అదిగాక మఱియొకటి లేదని చెప్పవలసియున్నది. బాహ్యజగత్తుపై భౌతికశాస్త్రవేత్త తన నిశితదృష్టి నెట్లు సాధించునో, మన శాస్త్రవేత్త ఆంతరంగిక జగతిపై తీక్ష్ణమైన అంతర దృష్టి సారింపవలెను.

ఇక నిట్టి జ్ఞానమువలన ప్రయోజన మేమని యడుగవచ్చును. జ్ఞానసాధనముచే పొందదగిన పరమపురుషార్థము జ్ఞానోపలబ్ధియే.

మఱియు జ్ఞానసంపాదనముచే నొక ప్రయోజనముకూడ సిద్ధించుచున్నది. జ్ఞానమువలన సర్వ దుఃఖములును నివృత్తియగుచున్నవి. అంతఃకరణమును శోధించి తన్మూలమున నాశరహితమును, స్వతస్సిద్ధముగ నిత్యమును, నిష్కళంకమును, పరిపూర్ణమును నగు వస్తువును ప్రత్యక్షముగా దర్శించినవాని కిక శోకమోహము లెక్కడివి? భయమును, తీరనికోర్కెయు — ఇదియే దుఃఖమునకు పుట్టినిల్లు. మృత్యువనునది మిథ్యయని తెలియగనే మానవునకు మరణభయము తొలగుచున్నది. పరిపూర్ణుడనని గ్రహించినంతనే మనుష్యునకు వ్యర్థవాంఛ లంతరించుచున్నవి. ఇక నీ హేతువులు రెండును నివర్తించుటచే ఈ శరీరమునందుండగనే సర్వదుఃఖములును నశించి, సంపూర్ణానందము లభించుచున్నది.

ఈజ్ఞానము పొందుటకు 'ఏకాగ్రత' యను దానికంటె వేఱు సాధనము లేదు. రసాయనశాస్త్రజ్ఞుడు తన మానసికశక్తుల నన్నిటిని ఏకాగ్రస్థితికి దెచ్చి వానిని తాను పరిశోధించుచున్న పదార్థములపై బఱపి వాని రహస్యములను దెలిసికొనుచున్నాడు. జ్యోతిశ్శాస్త్రవేత్త తన మానసికశక్తుల నన్నిటిని కేంద్రీకరించి దూరదర్శక యంత్రము మూలమున ఆకసముపై బఱుపగా సూర్యచంద్రనక్షత్రములు తమతమ రహస్యముల నాతనికి వెల్లడి చేయుచున్నవి. మీకు జెప్పుచున్న విషయములను గూర్చి నా భావముల నెంతెంత యేకాగ్రము చేయగల్గుదునో విషయ మంతంత సుబోధకమగుచున్నది. నా మాటల నాలకించుచున్న మీరు మీభావముల నెంతెంత యేకాగ్రతకు దెచ్చుచుందురో నే జెప్పనలసిన విషయము నంతంత స్పష్టముగా గ్రహించుచుందురు.

లోకమునందు మన కుపలబ్ధమైన జ్ఞానమంతయు చిత్తైకాగ్రతవలన కలిగిన జ్ఞానమే. ప్రయత్నించు పద్ధతిని తెలిసికొన గల్గితిమా, సాధనవిధానమును గ్రహింపగల్గితిమా,

లోకము తన రహస్యములను వెలిబుచ్చుటకు సిద్ధముగానున్నది. ఇట్టి సాధనకు గావలసిన శక్తిసామర్థ్యములు ఏకాగ్రతవలన గలుగుచున్నవి. మనుష్యుని సంకల్పశక్తికి పరిమితిలేదు. మనస్సు ఎంతెంత యేకాగ్రత చెందుచున్నదో అంతంత విషయపరిశీలనశక్తియు గలుగుచున్నది. ఇదియే రహస్యము.

మనస్సు సహజముగా బాహ్యప్రవృత్తి గలిగియుండుటచే బాహ్యవిషయములందు మనస్సును నిలుపుట సులభము. కాని మతము, మానసికశాస్త్రము, వేదాంతము అను విషయములందు, చూచువాడగు దృక్కును, చూడబడునదగు దృశ్యమును, ఒకే వస్తువు అగుటచే మనస్సును ఏకాగ్రము నొనర్చుట సులభసాధ్యము కాదు. మనస్సే విషయమైయున్నది. అదియూ, అంతరింద్రియము. పరిశీలించునదియు పరిశీలింపవలసినదియు మనస్సే. సాధనాంతరము లేకుండుటచే మనస్సుచేతనే మనస్సును శోధింపవలసియున్నది. అందువలన చిత్తైకాగ్రత మానసిక శాస్త్రాదుల విషయమున కష్టసాధ్యమైయున్నది. మనస్సునకు పర్యాలోచనశక్తి కలదని మనకు తెలియును. నేను మీతో సంభాషించుచు, ఏకకాలమున నింకొక పురుషునివలె ప్రక్క-న నిలువబడి చెప్పుచున్న విషయమును వినుచు గ్రహించుచున్నాను. మీరు పనిచేయుచు నాలోచించుచుండ, ఏకకాలమున, మీ మనస్సులో నొక భాగము ఒత్తిలి నిలిచి మీ రాలోచించుచున్న విషయమును గమనించుచున్నది. మనశ్శక్తుల నేకాగ్రపఱిచి మఱల మనస్సుపై లగ్నము చేయవలయును. తీక్ష్ణమైన సూర్యకిరణములముందు చిమ్మచీకటిలో నున్న రహస్యములు సహితము బట్టబయ లగుచున్నవిధమున ఏకాగ్రమైన చిత్తముముందు అంతరాత్మలోనున్న గూఢ విషయములైనను నిర్భిన్నములై వెలువడుచున్నవి. విశ్వాసమునకు మూలాధారమగు యథార్థమతము నిట్లు మనము సమీపింపగలము. జీవాత్మ యనునది సత్యమా? అసత్యమా?

జీవితము మూడునాళ్ల ముచ్చటయా, లేక కలకాల ముండునదియా? లోకమునందు దేవుడనువా డొకడుండుట యథార్థమా? మిథ్యయా? అను నిట్టి విషయములలో నున్న సత్యాసత్యములు మన కట్టెదుట నిలుచును. ఇట్టి ప్రత్యక్షానుభూతిని గల్గించుటయే రాజయోగాశయము. చిత్తైకాగ్రత కల్గుట కుపాయమేమి? అనంతరము అంతరంగమునందలి పరమరహస్యముల నెట్లు గ్రహింపగలము? అటువెనుక మనోధర్మములను నిర్ణయించుటెట్లు? అను నంశములను బోధించుటయే రాజయోగమునకు ముఖ్యోద్దేశము. అందువలన 'మీ మతమేమి? మీరు ద్వైతులా? లేక నాస్తికులా? క్రైస్తవులా? యూదులా? లేక బౌద్ధులా?' అని రాజయోగ మెన్నడును మనలను ప్రశ్నింపదు మనము మానవజాతివారము. ఈ యర్హత చాలును. మనుష్యమాత్రుడైన ప్రతివానికిని తత్త్వాన్వేషణము చేయుటకు అధికారము కలదు; సామర్థ్యమున్నది. శ్రమపడుటకు సంసిద్ధుడై యున్నచో స్వతంత్రముగ జిజ్ఞాస నొనర్చి సమాధానము పొందుటకు ప్రతి మానవునకును 'హక్కు' గలదు.

ఇంతవఱకు రాజయోగజిజ్ఞాసకు నమ్మిక యనునది అనవసరమని తెలిసినది నీయంతట నీకు గోచరముకానిదే దేనినిగాని నమ్మకుమని రాజయోగము మన కుపదేశించును. సత్యము నిలుచుట కెట్టి చేయూత అక్కఱలేదు. జాగ్రదవస్థలో మనకు ప్రత్యక్షముగా నున్న విషయములను నిరూపించుటకు స్వప్నము[illegible] ఊహలు అవసరమా? లేదు. రాజయోగమును సాధించుటకు చాలకాలముపట్టును; నిరంతరమైన అభ్యాస మావశ్యకము. కొంతవఱకు శరీర సంబంధముగా నున్నను ఈ యభ్యాసము ముఖ్యముగా మానసికమై యున్నది. మనశ్శరీరములకు ఎంతటి సన్నిహితసంబంధ మున్నదియు ముందు ముందు మనకు వెల్లడికాగలదు. సూక్ష్మమైన శరీరాంశమే మనస్సగుచున్నదనియు, మనస్సునందెట్టి మార్పు కలిగినను తదనుగుణమైన మార్పు శరీరమునందు కనబడుచున్నదనియు విశ్వసించిననాడు శరీరములో కలిగినమార్పుల కనుగుణమైనవి మనస్సునందును కలుగ

వలయునని నమ్ముట యుక్తివిరుద్ధము కానేరదు. శరీరమునందు స్వస్థత లేకుండునప్పుడు మనస్సునందును అస్వస్థత కలుగుచున్నది. శరీర మారోగ్యముగ నుండిననాడు మనస్సునందును బలారోగ్యము లేర్పడుచున్నవి. ఒకనికి కోపము వచ్చినప్పుడు వానిమనస్సు క్షోభ పడుచున్నది. ఇదేరీతిగ మనస్సునందు కలత కలిగిన పక్షమున శరీరమునందును కలత కలుగుచున్నది. జనసామాన్యమునందు మనోవికాసము బహుస్వల్పముగా నుండుటచే మనస్సు విశేషముగా శరీరాధీనమైయుండును. ఇంచుమించుగా చాలమంది మృగప్రాయులై యున్నారు. అంతియకాక వారి మనోనిగ్రహశక్తి క్షుద్రజంతువుల నిగ్రహశక్తికంటె విశేషమైనది కాదని యనేక సందర్భములందు వెల్లడి యగును. మనస్సుపై మన కంతగా పెత్తనము లేదు. అందుచే, ఇట్టి స్వాధీనత కలుగుటకును మనశ్శరీరములను వశపఱచుకొనుటకును శారీర సాహాయ్యమును కొంతవఱకు పొందవలసియున్నది. తగినంత శరీరస్వాధీనత సంపాదించినప్పుడు మనస్సును నేర్పుతో త్రిప్పుటకు ప్రయత్నింపవచ్చును. ఇట్టి నేర్పుచే మనస్సును స్వాధీనముచేసికొని మన యిష్టానుసారముగ వర్తించునట్లు చేయగలము. మనము కోరిన రీతిని తన శక్తుల నేకాగ్రము చేయునట్లు మనస్సును నిర్బంధింపగలము.

రాజయోగుల ననుసరించి బాహ్యప్రపంచము, ఆంతర ప్రపంచము (లేక సూక్ష్మప్రపంచము) యొక్క బాహ్యరూపమై యున్నది. స్థూలమెప్పుడు కార్యము; సూక్ష్మము కారణము. ఇందువలన బాహ్యప్రపంచము కార్యమనియు, ఆంతరప్రపంచము కారణమనియు ఏర్పడుచున్నది. ఇట్లే బాహ్యశక్తులు స్థూలాంశములును, అంతశ్శక్తులు వీని సూక్ష్మాంశములునై యున్నవి. అంతశ్శక్తులను కనుగొని వానిని నేర్పుతో నడుపనేర్చినవానికి ప్రకృతి యంతయు స్వాధీనమగును. యావత్ప్రపంచమును, సమస్త ప్రకృతిని తనవశమొనర్చుకొనుట అను బ్రహ్మాండమైన కార్యమును సాధించుటకై యోగి సంకల్పించుచున్నాడు. "ప్రకృతిశాసనముల" కిక తనపై నాధిపత్యము లేని స్థానమును జేరుటయే, సమస్తమైన

ప్రకృతి నియమములను అతిక్రమింపగల్గిన స్థితిని బొందుటయే యోగి లక్ష్యము. అప్పు డాతడు ప్రకృతి కంతకును ప్రభువగును. నాగరకత యనగా నేమి? మానవకోటియొక్క పురోవృద్ధియనగా నేమి? ప్రకృతిని వశపఱచుకొనుటయే.

ప్రకృతినిరోధముకొఱకు వివిధజాతుల జనులు వివిధ మార్గముల నవలంబించుచున్నారు. ఒకేసంఘమునందు కొందఱు బాహ్యప్రకృతిని, మఱికొందఱు ఆంతరప్రకృతిని వశము చేసికొన దలచుచున్నారు. ఇట్లే కొన్ని జాతులవారు ఆంతరమైనట్టియు మఱికొన్ని జాతులవారు బాహ్యమైనట్టియు ప్రకృతిని స్వాధీనము చేసికొన గోరెదరు. కొందఱు ఆంతర ప్రకృతినిరోధమువలన సమస్తమును నిగ్రహింపవచ్చునందురు. మఱికొందఱు బాహ్య ప్రకృతినిరోధమువలన సర్వమును చేజిక్క నందురు. ప్రకృతియందు బాహ్యము, అభ్యంతరము అను విభజన లేకుండుటచే పర్యవసానమునం దీ రెండు వాదములును న్యాయ సమ్మతములే. బాహ్యాంతరము లనునవి కేవలము కల్పితమైన పరిమితులు. బాహ్యాంతరవాదు లిరువురును తమతమ విజ్ఞానావధులను జేరునప్పుడొక్కచోటనే కలియుట విధివిహితము. పదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు తన విజ్ఞానపరమావధిని సమీపించినంతనే విజ్ఞానము తత్త్వశాస్త్రమునందు లయించిపోవుచున్నట్లు కనుగొనును. ఇట్లే, వస్తువు ఒక్కటియే కావున తత్త్వశాస్త్రజ్ఞుడు తాను మనః ప్రకృతులని చెప్పునట్టి తత్త్వములు కేవలము బాహ్యభేదములే యనియు సద్వస్తువు ఒక్కటియే అనియు గ్రహించును.

ఎయ్యది అనేకత్వముగా నున్నదో, ఎందుండి బహుత్వము నిర్మాణమగుచున్నదో అట్టి యేకత్వమును కనుగొనుటయే సమస్త మైన శాస్త్రములకును పరమావధి. ఆంతరప్రపంచమునుండి ప్రారంభించి ఆంతరప్రకృతిని పరిశోధించి తన్మూలమున బాహ్యాంతర ప్రకృతినంతయు వశపఱచుకొనుటయే రాజయోగాశయము. ఇది చాల పురాతనమైన యత్నము. ముఖ్యముగా హిందూదేశము

ఈ సాధనకు పట్టుగొమ్మయైయున్నను, అన్యదేశీయులును ఈ విషయమున కృషిచేసియేయున్నారు. పాశ్చాత్యదేశములం దిది యేదియో గూఢవిద్యయనియెంచి యిట్టిసాధన చేయబూనినవారిని మాంత్రికులనియు తాంత్రికులనియు భావించి వారిని మంటలలోత్రోసి చంపియుండిరి. ఇక హిందూదేశమునం దిది యనేక కారణములచే స్వార్థపరుల పాలైనది. వారు ఈ విద్యను నూటికి తొంబదిపాళ్లు ధ్వంసముచేసి మిగిలిన దానిని రెండవకంటివానికి తెలియని పరమ రహస్యముగ నుంచుటకు ప్రయత్నించియుండిరి. ఈ దినములలో పాశ్చాత్యదేశములందు గురువుల పేరిట చాలమంది బయలుదేఱి యున్నారు. హిందూదేశములోకూడ నిట్టి యుపదేశకులు బయలుదేఱినను వారీ విషయమున కొంతవఱకు పరిజ్ఞానము కలిగియుండుటచే ఏమియు తెలియని యీ నవీన వ్యాఖ్యాతలకంటె యోగ్యులని చెప్పవలసియున్నది.

ఈ యోగపద్ధతులలో ఏది గుప్తముగా నుండునో, పరమ రహస్యముగా నుండునో దానిని వెంటనే పరిత్యజింపవలయును. బలమే జీవయాత్రయందు మనకు సరియైన త్రోవజూపుచున్నది. సమస్త విషయములందును మిమ్ములను బలహీనులనుగ జేయుచున్నదానినెల్ల విసర్జించునట్లు, పారమార్థిక విషయములందు సయితము అట్టిదానిని విసర్జింపుడు. దానితో మీ కెట్టి జోక్యమును వలదు. మంత్రతంత్రబంధుర విషయాన్వేషణమువలన మనుష్యుని మేధ బలహీనమగును. శాస్త్రములకెల్ల మేలిమి బంగారమనదగిన యోగశాస్త్రము దీనివలన నించుమించుగా ధ్వంసమైపోయినది. ఇప్పటికి నాలుగువేల సంవత్సరములకు పూర్వము నిర్మాణమైనది మొదలుగా ఋషులు యోగశాస్త్రమును హిందూదేశమునందు విశిష్టమైన ఆకృతికి దెచ్చి, సూత్రీకరించి బోధించియున్నారు. వ్యాఖ్యానకర్త నవీనుడైనకొలదియు వ్యాఖ్యానమునందు దోషము లధికముగా గానబడుచుండుటయు, గ్రంథకర్త ప్రాచీనుడైనకొలదియు వ్యాఖ్యానము హేతుబద్ధమై సమంజసమై యుండుటయు స్పష్టము. నవీన

గ్రంథకర్తలలో అనేకులు ఏవేవియో అగమ్యగోచరములైన రహస్యములనుగూర్చి చెప్పుచుందురు. దివ్యాలోక సందీపితమై ప్రకాశించుటకుమాఱు యోగ మీ విధముగా ఏ కొందఱిచేతులలోనో పడుటతోడనే వారు యోగసిద్ధులకు తామే పట్టాభిషిక్తులు కావలయునని, భావించి దానిని పరమరహస్యముగ నుంచిరి. ఆ శక్తులు తమకే దక్కవలెనను నుద్దేశముతో వారట్లొనరించిరి.

నేను చేయుచున్న బోధనలలో మర్మ మేదియు లేదని గ్రహింతురుగాక. నాకు తెలిసినంతవఱకు మీకు చెప్పివైచెదను. హేతువిమర్శచేసి నిరూపింపగలిగినంతవఱకు నిరూపించెదను. ఇక నాకు తెలియని యంశముల విషయమై గ్రంథము లేమని వచించుచున్నవో చెప్పి యూరకుందును. అంధప్రాయముగా నమ్ముట సరికాదు. మీ విమర్శనశక్తిని వినియోగించి సత్యదృష్టితో సాధనచేసి యీ సంగతులు జరుగునదియు లేనిదియు చూడవలయును. సరిగా ఇతర శాస్త్రముల నభ్యసించుటయందే విధానమును మీ రవలంబించుచుందురో, ఆ విధానమునే మీ రవలంబించి యీ శాస్త్రాభ్యాసము చేయవలయును. ఇందెట్టి మర్మమును, ప్రమాదమును లేవు. ఈ శాస్త్రము యథార్థమై యున్నంతవఱకు నడివీథులలో బాహాటముగా బోధింపవలయును. ఈ విషయములను మర్మముగానుంచి భ్రమింపజేయుట కేమాత్రము యత్నించినను అట్టి యత్నమువలన మహా విపత్తు సంభవించుచున్నది.

విషయములో ప్రవేశించుటకుముందు రాజయోగమున కంతకును మూలాధారమైయున్న సాంఖ్యదర్శనమునుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. సాంఖ్యదర్శనము ప్రకారము ఇంద్రియానుభవముయొక్క ఉత్పత్తిక్రమము ఈ క్రింది విధముగా నుండును :

బాహ్యవిషయములవలన గలుగుచున్న స్పర్శలు వాని బాహ్యోపకరణములవలన వానివాని యింద్రియముల కడకు తీసికొనిపోబడుచున్నవి. ఇంద్రియము లీ స్పర్శలను మనస్సున కందజేయును.

మనస్సు వానిని బుద్ధి కిచ్చును. బుద్ధియొద్దనుండి పురుషుడు (ఆత్మ) వానిని గ్రహించును. అప్పు డింద్రియానుభవము కలుగుచున్నది. అంతట పురుషుడు కర్మేంద్రియములను కావలసిన పని చేయుటకు నియమించుచున్నాడు. పురుషుడు తక్క— ఇవి యన్నియు ప్రకృతి సంబంధములైన తత్త్వములే; కాని బాహ్యేంద్రియములకంటె మనస్సు సూక్ష్మతరమైన ప్రకృతివలన నిర్మాణమైయున్నది. మనస్సునకు కారణమైన తత్త్వమువలననే తన్మాత్రలనబడు సూక్ష్మభూతములేర్పడుచున్నవి. ఇవి మరల స్థూలభూతములై వానివలన బాహ్యప్రకృతి కలుగుచున్నది. ఇది సాంఖ్యప్రోక్త మనశ్శాస్త్ర విషయము. దీనివలన బాహ్యమైన స్థూలప్రకృతికిని బుద్ధికిని స్థితి ననుసరించి భేదమే కాని వస్తుతః భేదములేదని యేర్పడును. పురుషుడు (ఆత్మ) తక్క—, మిగిలినదంతయు జడమైన ప్రకృతి. బాహ్యవిషయములను గ్రహించుటకై మనస్సు ఆత్మచేతిలోనున్న సాధనమని చెప్పవచ్చును. మనస్సు అనుక్షణమును సంకల్పవికల్పములచే మారుచున్నను, సిద్ధావస్థయందు ఇంద్రియములలో కొన్నిటితోగాని, ఒక్కటితోగాని సంయోగము పొందుటకును, ఏ యింద్రియముతోడను సంయోగపడకుండుటకును సమర్థమై యుండును. ఇందుల కొక దృష్టాంతమును జూడుడు. శ్రద్ధగా నే నీ గడియారపు శబ్దము వినుచున్న పక్షమున కండ్లు తెఱచుకొనియున్నను నాకేమియు గోచరింపక పోవచ్చును. దీనివలన నా మనస్సు కర్ణేంద్రియముతో సంయోగమైనప్పుడు నేత్రేంద్రియముతో సంయోగము కాజాలదని విదితమగుచున్నది. కాని పూర్ణావస్థను పొందిన మనస్సు నేకకాలమున సకలేంద్రియముల తోడను సంయోగము చేయవచ్చును. మనస్సునకు అంతరవలోకనశక్తికలదు ఈ శక్తివలన మనస్సు తనలోతు తాను తెలిసికొనగలదు. యోగి పొందగోరున దీయంతరవలోకనశక్తియే. మనశ్శక్తుల నేకాగ్రపఱచి అంతర్ముఖముచేసి లోన నేమి జరుగుచున్నదియు యోగి గ్రహించును. ఇది తత్త్వశాస్త్రవేత్తలు పరిశోధించి తేల్చిన సారాంశము కాని, వట్టి నమ్మకముపై నాధారపడి

యున్న విషయముకాదని గ్రహింపుడు. నవీనశరీరశాస్త్రజ్ఞులు, నేత్రేంద్రియము కంటిలో లేదనియు, మెదడునందలి నాడీ కేంద్రములలో నొకదానియందు ఈ నేత్రేంద్రియ మేర్పడియున్నదనియు, ఇతరేంద్రియముల విషయముకూడ నిట్టిదే యనియు చెప్పుచున్నారు. మఱియు ఏ పదార్థమువలన మెదడు నిర్మాణమగుచున్నదో ఆ పదార్థమువలననే ఈ నాడీకేంద్రములును నిర్మాణమగుచున్నవని వారు చెప్పెదరు. సాంఖ్యులు వచించునట్టి విషయము కూడ నిదియే. ఈ ప్రతిపాదనములం దొకటి శారీరకముగను మఱియొకటి మానసికముగను వర్తించుచున్నవి. ఐనను ఈ రెండింటి యభిప్రాయమును ఒక్కటియే. ఇక మనము పరిశోధింపవలసిన విషయమో, మనశ్శరీరములకు రెండింటికిని అతీతమైయున్నది.

ఏ సూక్ష్మావలోకనస్థితిని పొందుటచే వివిధమానసికావస్థలన్నియు కంటికి గట్టినట్లు గోచరించునో అట్టి సూక్ష్మావలోకన స్థితిని పొందుటకై యోగి సంకల్పించుచున్నాడు. మనోనేత్రముతో ఈ స్థితుల నన్నిటిని చూడవలసియున్నది. ఇంద్రియములకు బాహ్యవిషయ సంసర్గముచే గల్గునట్టి స్పర్శయొక్క గమన మెట్లున్నది? ఆ స్పర్శను మనస్సు ఏ రీతిగా గ్రహించుచున్నది? బుద్ధి యే విధముగా దానిని నిర్ధారణ చేయుచున్నది? అనంతర మీ నిర్ధారణమును పురుషునకు (ఆత్మకు) ఎట్లు తెలుపుచున్నది? అను నీ విషయము లన్నియు యోగికి కట్టెదుట కానబడును. ఏ భౌతిక శాస్త్రాభ్యాసము చేయుటకైనను కొంత సాధనార్హతను సంపాదించి, ఆ శాస్త్రమునకు నియమితమైయున్న పద్ధతి ననుసరించి కృషి చేసిననే గాని తచ్ఛాస్త్రజ్ఞానము కలుగ నేరదుగదా. రాజయోగమునందును ఈ నియమములు వర్తించునని వేఱుగ జెప్పనక్కఱలేదు.

మున్ముందు ఆహారవిషయమై కొన్ని నియమములను పాటించుటావశ్యకము. మనస్సును సత్త్వగుణప్రధానముగ చేయు నాహారమే మీ రుపయోగింపవలయును. జంతుప్రదర్శనశాలకు పోయి చూచిననాడు వెంటనే మీకు దీనికి నిదర్శనము కానబడును. ఏనుగులను

చూడుడు. బ్రహ్మాండములైన జంతువులై యుండియు సాధుస్వభావము కలిగి యవి శాంతముగా నుండును. ఇక పులులును సింహములు గల బోనులవైపు మరలగనే విశ్రాంతియనున దా జంతువు లెఱుగవని తోచును. చూచితిరా, ఆహారమువలన గలిగిన మార్పు! మన శరీరమందలి శక్తులన్నియు ఆహారము వలననే కలుగుచున్నవి. ప్రతిదినమును ఈ విషయము మనకు కానవచ్చుచునేయున్నది. ఉపవాసము చేయుటకు ప్రారంభింపగనే ముందు మీ శరీరము నీరసించును; శరీరశక్తులు సన్నగిల్లును. కొన్నాళ్ళకు మీ మనశ్శక్తులు కూడ క్రుంగిపోవును. ఇందు ప్రారంభమున జ్ఞాపకశక్తి క్షీణించును. అనంతరము ఆలోచన చేయుటకైనను శక్తిలేని స్థితి సంప్రాప్తమగును. అట్టిస్థితియందొక విషయమునుగూర్చి [illegible] చేయుటకు దగిన సామర్థ్యము అంతకుముందే అంతరించును. అందుచే ఆహారవిషయమై జాగరూకత గలిగియుండు టావశ్యకము. తగినంత బలమును చేకూర్చుకొని సాధనయందభివృద్ధి పొందిన వెనుక ఆహారవిషయమునుగూర్చి అంతగా పాటింప నక్కఱలేదు. అపాయమును నివారించుటకై, ఎదుగుచున్న మొక్కచుట్టును కంచె వేయవలయును. చెట్టుదిగిన తరువాత కంచె యూడదీయుదురు; అప్పుడెట్టి తాకుడు కలిగినను ఎదిర్చి నిలుచుటకు చెట్టుకు తగినంత చేవ చేకూరును.

ఒక వైపున భోగలాలసత్వమును, మఱియొక వైపున ఉగ్రతపశ్చర్యలను యోగసాధకుడు విసర్జింపవలసియున్నది. యోగాభ్యాసకుడు నిరాహారియై శరీరమును హింసింపరాదు; అట్టివాడు యోగి కానేరడని భగవద్గీత తెలుపుచున్నది. గీతాశాస్త్రమందలి వాక్కులను గమనింపుడు: "నిరాహారి యోగమున కనర్హుడు. నిద్రారహితుడును యోగి కానేరడు. అమితముగా నిద్రపోవువానికి యోగమసాధ్యము. మితిమీఱి పరిశ్రమ చేయువాడు యోగియగుట దుర్లభము. పనిపాటులు చేయనివానికి యోగార్హత లేదు." (౬–16, 17).



# ద్వితీయాధ్యాయము

## ప్రారంభ విధులు

రాజయోగమును అష్టాంగములుగ విభజించియున్నారు. అహింస, సత్యము, అస్తేయము (దొంగిలింపకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (దానము పట్టకుండుట) అను నియమములు ప్రథమాంగమగు 'యమ' మగుచున్నవి. శౌచము, (శుచిగా నుండుట) సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము, అను విధులు చేరి 'నియమ' మగును. 'ఆసనము' తృతీయాంగము. నాల్గవది 'ప్రాణాయామము' లేక ప్రాణనిరోధము. శబ్దాదులగు బాహ్యవిషయములనుండి ఇంద్రియములను మరల్చుటయం దేర్పడుచున్న 'ప్రత్యాహారము' ఐదవది. ఆఱవ యంగము ఏక విషయమునందు మనస్సును నిలుపుటయం దేర్పడుచున్న 'ధారణ'. అష్టాంగములలో నిక మిగిలినవి రెండును 'ధ్యాన సమాధులు'. యమనియమములు నీతి వర్తనమును బోధించుట కేర్పడిన విధులని గ్రహింపవచ్చును. యోగాభ్యాససాధమున కివి పునాదులై యున్నవి. యమనియమములు సుస్థిరముగా నేర్పడినంతనే యోగి తన సాధనచే గలుగు ఫలముల ననుభవించుట కారంభించును. మనోవాక్కాయ కర్మములలో దేనిచేగాని యోగియైనవా డెవ్వనికిని హింస కల్గించుటకు సంకల్పింపరాదు. మానవులయందు మాత్రమే కాక సమస్త జీవరాసులయందును, సర్వప్రపంచమునందును దయకలిగి వర్తింపవలయును.

తరువాతి నియమ మాసనము. కొన్ని యున్నతస్థితులను పొందువఱకు శారీరకముగను, మానసికముగను ప్రతిదినము వరుసగా కొన్ని యభ్యాసములను చేయవలసియుండును. అందువలన ఏ యాసనమునందు మనము చాలసేపుండగలమో అట్టి యాసనమును కనుగొనవలయును. ఎవ్వని కేది విశేషముగా సులభమై యుండునో వా డట్టి యాసనమును ఎన్నుకొనవలయును. ఆలోచన చేయుట

ఒకానొక యాసన మొకనికి సులభము; మఱియొకని కది చాల కష్టముగా నుండవచ్చును. మానసిక విషయములందు పరిశ్రమ చేయుకాలమున శరీరములో విశేషమైన సంచలనము కలుగునని మున్ముందు మనకు విశదము కాగలదు. నాడులను ప్రాతమార్గముల నుండి మరల్చి వానికి క్రొత్తదారులను చూపవలసి యుండును. వీని యందు నూతన స్పందనములు ప్రారంభమై శరీరప్రకృతి యంతయు సమూలముగ మాఱిపోవునని చెప్పవచ్చును. ఈ ప్రక్రియ చాలవఱకు సుషుమ్నకు సంబంధించి యుండుటచే ఱొమ్మును, తలను, మెడను నిబ్బరముగా నిలిపి కశేరుక యనబడు వెన్నెముకను చక్కగా నియమించి కూరుచుండుటయే ఆసనమునందు ముఖ్యమైన విషయము. వెన్నెముకను సరిగా నిలిపి శరీరభారమంతయు పర్శుకలనబడు ప్రక్క-యెముకలపై బడునట్లు కూరుచున్నపక్షమున స్వాభావికమైన యాసనము మీకు సిద్ధించును. వక్షఃస్థలము ముడుచుకొని యున్నప్పుడంతగా ఉన్నతభావములను భావింపజాలమని సులభముగా మీరు గ్రహింపవచ్చును.

స్థూలశరీరమును విశేష బలిష్ఠముగా జేయుటయే ముఖ్యోద్దేశముగాగల్గి పూర్తిగ స్థూలశరీరముతోడనే సంబంధించియున్న హఠయోగమునకు రాజయోగమునందలి యీ భాగము చాల సన్నిహితముగా నుండును. హఠయోగసాధనలు బహుకష్టసాధ్యములు; చిరకాలము వానిని అభ్యసింపవలసియుండును. శ్రమపడి యెట్లో సాధించినను అంతగా ఆధ్యాత్మికాభివృద్ధి కలుగజేయునవి కావు. అందువలన హఠయోగముతో నిక్కడ మనకెట్టి ప్రసక్తియు లేదు. అనేక విధములైన ఆసనములతో సంబంధించిన యిట్టి హఠయోగాభ్యాసములు 'డెల్‌సార్టె' దొరగారును తదితరాచార్యులును చేయుచున్న బోధనలలో మీకు కానబడు చుండును. వీనియందలి ఆశయము శారీరకమే కాని మానసికముకాదు. శరీరమందలి ప్రతిస్నాయువు (కండరము) ను సంపూర్ణముగా మనము స్వాధీనము చేసికొనగలము. ఇందుకు చిక్కని ధమనిస్నాయువులు లేవు. తలచుటయే తడవుగ

హృదయము నాపివేయవచ్చును; మరల కొట్టుకొననీయవచ్చును. ప్రతి అవయవమును ఇట్లు మనము వశపఱచుకొనవచ్చును.

మానవులను దీర్ఘాయుష్మంతులనుగ జేయుటయే ఈ హఠయోగాభ్యాసమునకు ఫలితము; హఠయోగులకు ఆరోగ్యమే ప్రధానాశయము, పరమావధి. వ్యాధిగ్రస్తుడను కానని హఠయోగి ప్రతిజ్ఞ వహించుచున్నాడు. హఠయోగి కారోగ్యము చెడదు; ఆతడు బహుకాలము జీవించును. నూఱేండ్లాతని కొక లెక్కలోనివికావు. ఒక్క తలవెంట్రుకయైనను నెరయక నూటయేబదియేండ్ల వయస్సున హఠయోగి ప్రాయములో నుండును. ఇంతకంటె విశేష మేమియు లేదు. మఱ్ఱిచెట్టు ఐదువేల యేండ్లవఱకు జీవించుచున్నది; కాని మఱ్ఱిచెట్టు మఱ్ఱిచెట్టే. అందుచే చిరకాల మొకడు జీవించియుండె నందురా, ఆతడారోగ్యముగల జంతువని మాత్రమే యేర్పడుచున్నది. సాధారణములైన హఠయోగాభ్యాసములలో నొకటి రెండు చాల ప్రయోజనకరములు. ఇందుల కొక నిదర్శనమును జూపెదను. ఉదయమున లేచినవెంటనే నాసికాద్వారమున చల్లని నీరు త్రాగుట వలన తలనొప్పిపోవును. ఆ దినమంతయు మీ మెదడునందు చల్లగను హాయిగను ఉండును. మీ కెన్నడును పడిసెము పట్టదు. కొందఱిట్లు చేసి చూడవచ్చును. ఇది సులభసాధ్యమైనపని. నీటిలో ముక్కు నుంచి ముక్కుపుటములచే నీటిని పీల్చి యా నీటిని గొంతుకలోనికి దెచ్చి తిరిగి ముక్కుపుటములచే బయటికి విడువవలయును.

స్థిరాసనము ఏర్పడిన తరువాత, కొందఱు రాజయోగుల సంప్రదాయము ప్రకారము, నాడీశౌచమను క్రియ నభ్యాసము చేయవలయును. ఈ భాగము రాజయోగమునకు సంబంధించినది కాదని కొందఱు దీనిని నిరాకరించియున్నారు. ఐనను శంకరాచార్యునంతటి ప్రామాణిక వ్యాఖ్యానకారుడీ సాధన నామోదించియుండుటచే నేను దానిని సూచించుట యుచితమని భావించుచు, శ్వేతాశ్వతరోపనిషత్తున కాతడు వ్రాసిన భాష్యమునుండి ఆతడు సూచించిన విధులనే యుదాహరించెదను: "ప్రాణాయామముచే మనస్సునందలి మాలిన్య

ములు నశించినంతనే అట్టి మనస్సు బ్రహ్మమునందు నిలుకడ చెందును. అందుచే ప్రాణాయామము విధింపబడినది. నాడులను మొట్ట మొదట శుద్ధి చేయవలయును. అప్పుడు ప్రాణాయామము నభ్యాసము చేయుటకు సామర్థ్యము కలుగును. కుడిముక్కు-పుటమును బొటనవ్రేలితో మూసి, సామర్థ్యము ననుసరించి యెడమముక్కు-పుటముచే గాలిని పూరింపవలయును; వెంటనే, ఆలసింపక, యెడమ ముక్కు-పుటమును మూసి కుడిముక్కు-పుటముద్వారా గాలిని వదలివేయవలయును. మరల కుడిముక్కు-పుటమున యథాశక్తిగా గాలినిపీల్చి యెడమ పుటమున విడువవలయును. ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము, అర్ధరాత్రి—ఈ నాలుగు వేళలందు ప్రతివేళను మూడు లేక ఐదుసార్లు ఇట్లభ్యాసము చేయుచు వచ్చినయెడల ఒక పక్షము లేక నెల దినములలో నాడీశౌచ మేర్పడును. ప్రాణాయామ మప్పుడారంభమగు చున్నది''.

సాధన విధాయకము. ప్రతిదినమును వేళకువచ్చి కూర్చుండి మీరు నా వచనములను శ్రద్ధతో వినవచ్చును. కాని సాధన చేయని దే మీ రొక్క- యడుగైనను గమ్యస్థానము దెస బోవుట లేదు. ఇది యంతయు అభ్యాసమును పురస్కరించుకొని యున్నది. వీని యనుభవము కలుగనిదే ఈ విషయము లెన్నటికిని మనకు బోధపడవు. స్వానుభవముచే నిందలి సత్యాసత్యములను కనుగొనవలసియున్నవి. ఊరక పూర్వపక్షసిద్ధాంతములను వినుటతో సరిపడదు. సాధనయందనేకమైన ఆటంకములు కలవు. అనారోగ్యమైన శరీరము మొదటి యాటంకము. శరీరము సరియైనస్థితిలో లేనప్పుడు సాధన కభ్యంతరము గలుగుచున్నది; అందుచే శరీరారోగ్యమును కాపాడుకొనవలయును. మన ఆహార విహారాదులను గూర్చి జాగరూకులమై యుండవలయును. శరీరారోగ్యమును కాపాడుకొనుటకై సాధారణముగా 'క్రైస్తవ విజ్ఞానము' అనబడు మానసికయత్నమును సదా వినియోగించుచుండుడు. శరీరమునుగూర్చి యింతకంటె విశేషముగా చెప్పనక్కఱ లేదు. ఆరోగ్యమే పురుషార్థముకాదు. పురుషార్థమున కిదియొక

సాధనమాత్రమని మనము జ్ఞప్తిలోనుంచుకొనవలయును. ఆరోగ్యమే పరమపురుషార్థమై యున్ననాడు మనము మృగప్రాయులమై యుందుము; జంతువుల కెన్నడో కాని ఆరోగ్యము చెడదు.

సంశయము యోగాభ్యాసమునకు రెండవ యాటంకము. చూడని విషయములనుగూర్చి మన కెప్పుడును సందేహముగనే యుండును. మనమెంతేని ప్రయత్నింతుముగాక; మాటలను బట్టుకొని ప్రాకులాడుచుండుట మనవలన కాదు. అందుచే ఈ విషయములందేమైనను సత్యమున్నదా? లేదా? యని మనకు సంశయము గలుగుచుండును. మనకని చెప్పనేల? మనలో నారితేఱిన వారికిగూడ ఈ సందేహ మప్పుడప్పుడు వచ్చుచునే యుండును. సాధన చేయుచు వచ్చిన, కొలది దినములకే యోగమహిమ చూచాయగా గనబడును. సాధకునకు ధైర్యోత్సాహములు కలుగుట కది చాలును. యోగశాస్త్ర వ్యాఖ్యానకారు డొకడు చెప్పుచున్నరీతిగా, "ఒక్క చిన్న నిదర్శనము కనబడుటతోడనే సమస్తమైన యోగశాస్త్రమునందును మనకు విశ్వాసము కలుగుచున్నది". ఉదాహరణమునకు, సాధన ప్రారంభించి కొలది నెలలైన తరువాత మీ రితరుల తలపులను కల రూపమున గ్రహింప నారంభింతురు. ఇతరుల మనోభావములు చిత్రపటములోనున్నట్లు మీ కెదుట వచ్చినిలుచును. వివవలయునను సంకల్పముతో చిత్తము నేకాగ్రము చేయుటవలన అతిదూరమున జరుగుచున్న దేదియో మీకు వినబడవచ్చును. ఇట్టి చూచాయలు మీకు మొట్టమొదట కొంచెముగా గనబడినను ధైర్య, బల, విశ్వాసములను కల్గించుట కవి చాలును. ఉదాహరణమునకు, నాసికాగ్రమున మీ భావములను కేంద్రీకరించుచువచ్చిన, కొలదిదినములలో దివ్యపరిమళము నాఘ్రాణించుట కారంభింతురు. భౌతికవిషయ సంసర్గము లేకయే స్పష్టముగా మనకు కొన్ని విషయానుభవములు కలుగుచున్నవని దీనివలన మనకు వెల్లడియగుచున్నది. ఈ సాధన విధానమున కంతకును మోక్షమే ఆదర్శమనియు, పరమ ప్రయోజన మనియు, పరమావధియనియు మీరు, సదా జ్ఞప్తిలో నుంచుకొన

వలయును. ఈ యోగసిద్ధులన్నియు కేవలము సాధనములను సంగతి మీ రెన్నడును మఱవరాదు. నిరంకుశమైన ప్రకృతి వశీకరణమే మీ లక్ష్యము కావలసియున్నది. ప్రకృతికి మనము దాసులముకాక, అధిపతులము కావలయును. మనశ్శరీరములలో నేదియు మనపై పెత్తనము వహించుటకు వలనుపడదు. శరీరము మన యధీనములో నున్నది. కాని మనము శరీరాధీనులము కామని సర్వదా మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును.

ఒకప్పు డొక దేవతయు అసురుడును ఆత్మజ్ఞానము పొందవలయునని యెంచి యొక మహర్షి యొద్దకు బోయి బహుకాల మతని యొద్ద విద్యాభ్యాసము చేసిరి. తుద కాతడు "మీరు వెదకుచున్న వస్తువు మీయందే కల" దని వారితో జెప్పగా వారు శరీరమే యాత్మయని భావించి సంతృప్తినొంది తమ సన్నిహితుల యొద్దకుబోయి "నేర్వవలసినదంతయు మేము నేర్చితిమి. మీ రిక యథేచ్ఛగా తినుచు, త్రాగుచు, హాయిగా నుండుడు. ఆత్మ యనునది మనమే. మనలను మించి మఱేదియు లేదు" అని చెప్పిరి. సహజముగా జ్ఞానహీనుడైన యా రాక్షసుడు ఆత్మ యనగా శరీరమే యని తలచి యంతటితో సంతృప్తినొందెను. విశుద్ధ స్వభావముగల్గినదయ్యును ఆ దేవత మున్ముందు ప్రమాదవశమున నిట్లు భావించెను: "ఈ శరీరమే బ్రహ్మము కావున శరీరమున బలపటుత్వములను కాపాడుకొనవలయును. దివ్యవస్త్రములను ధరించుచు సమస్త భోగములను అనుభవించుచుండ వలయును." కాని కొన్ని దినములైన వెనుక గురువగు మహర్షి వచనములకు తాత్పర్య మది కానేరదనియు, ఆతని యభిప్రాయ మంతకంటె నుత్తమమైనది కావలయుననియు గ్రహించి తిరిగి మహర్షి యొద్దకుపోయి, అంతేవాసి "మునివరా! 'ఈ శరీరమే, ఆత్మ' యని నాకు బోధించితిరా? శరీరములన్నియు నశించుచుండగా, ఆత్మ మరణ రహితమై యున్నట్లు తోచుచున్నది; ఇందుల కేమనియెదరు?" అని యడుగగా, మహర్షి, "నీవే తెలిసికొనవలయును. ఆత్మవు నీవే" యని 'తత్త్వమసి' వాక్యోపదేశము చేసెను. అంతట దేవత 'శరీరము

నందలి ప్రాణములే ఆత్మయని మహర్షి యభిప్రాయము' అని తలచెను. కాని కొంతకాలమైన వెనుక దేవత, తాను భుజించినప్పుడు ప్రాణములు శక్తిమంతము లగుచుండుటయు, పస్తుపడియున్నప్పుడు నీరసించుచుండుటయు కనుగొని, తిరిగి ఋషియొద్దకుపోయి, "గురువరా! ప్రాణములే ఆత్మయని తమ యభిప్రాయమా?" అని యడిగెను. ఋషిపుంగవుడు 'నీవే యాత్మ' వని మఱియొకసారి 'తత్త్వమసి' వాక్యము నుద్ఘాటించెను. 'ప్రాయశః, మనస్సే ఆత్మయై యుండవలయును' అని తలచుచు దేవత యింటికి మరలెను. కాని కొంతకాలమైనంతనే దేవత 'యొకప్పుడు యోగ్యములుగను మఱియొకప్పు డయోగ్యములుగను మాఱిపోవుచుండు వివిధభావములతో గూడిన మనస్సే ఆత్మయైయుండు నెన్నడును సంభవింపనేర'దని గ్రహించి మరల ఋషియొద్దకు బోయి, 'గురువరేణ్యా! మనస్సే ఆత్మయనియెదరా? నేనట్లు భావింపను' అనియెను. ఋషీశ్వరుడందులకు 'కాదు, నీవే యాత్మవు. స్వయముగా కనుగొను'మని యుద్బోధించెను. దేవత యింటికి మరలి, ఆత్మసందర్శనైకదీక్షతో తత్త్వవిచారమునందు నిమగ్నమైనంతనే తానే యాత్మనని కనుగొనెను — అవాఙ్మానసగోచరమును, అద్వితీయమును, జననమరణరహితమును, కత్తులచే, అగ్నిచే, వాయువుచే, జలముచే నెట్టి వికారమును పొందనిదియు, ఆద్యంతరహితమును, అచలమును, అస్పృశ్యమును, సర్వజ్ఞమును, సర్వశక్తిమంతమును అగునట్టి యాత్మయే తాననియు, మనశ్శరీరాదుల కతీతుడననియు గ్రహించిన యా దేవతకు నిరంకుశమైన తృప్తి కల్గెను. కాని, పాపమా దానవునకు శరీరమునందలి మోహముచే పరమార్థము లభింప లేదు.

ఈ లోకమునందు రాక్షసస్వభావముకలవా రనేకులున్నను దేవతలును కొందఱు కలరు. ఎవ్వడైనను భోగానుభవశక్తి నభివృద్ధిచేయుటకై శాస్త్ర మేదియైనను బోధించుట కుద్యమించెనా, కోట్లకొలది జను లందులకు సంసిద్ధులైయున్నారు. ఇక పరమపురుషార్థమును జూపుట కెవ్వడైనను పూనుకొనెనా, పట్టుమని పదిమంది

యైనను వాని మాటలను చెవియొగ్గి వినకున్నారు. పరమార్థమును గ్రహించు సామర్థ్యము కలవా రెక్కడనో కాని లేరు. అందులకు తగిన సావధానము కలవారు దొరకుట మఱింత దుర్లభము. కాని శరీరమును నూఱేండ్లు జీవింపజేసినను, వేయేండ్లు జీవింపజేసినను ఫలిత మొక్కటియే యని గ్రహించినవారును కొందఱు కలరు. శరీరమును నిలుపుచున్న శక్తులు వికలమగుటతోడనే శరీరపతనము కాక తప్పదు. పరిణామవశము కాకుండునట్లు క్షణకాలమైనను శరీరమును నిరోధింపగల్గిన మనుష్యు డిదివఱకు జన్మింపలేదు. పరిణామ పరంపరకే శరీరమని పేరు. ''నదియందలి నీటి సముదాయము క్షణక్షణమును నీ యెదుట మాఱుచున్నను, అదేరూపమున క్రొత్తనీరు వచ్చుచున్నదికదా, ఈశరీరపరిస్థితియు నిట్టిదే''. ఐనను శరీర బలారోగ్యములను కాపాడుకొనవలసి యున్నది. మనకున్న ఉత్తమసాధనము శరీరమే కదా!

లోకములో మానవశరీరమే ఉత్తమమైన శరీరము. మనుష్యుడే ఉత్తమోత్తమమైన జీవి. జంతువు లన్నిటికంటెను, దేవత లందఱికంటెను మనుష్యుడే గొప్పవాడు. దేవతలు సహితము మరల క్రిందికివచ్చి మనుష్యశరీరము మూలమున ముక్తిపొందవలసి యున్నది. ముక్తిపొందుట మనుష్యునకు మాత్రమే సాధ్యము; దేవతలకైనను సాధ్యముకాదు. యూదులును, మహమ్మదీయులును ఈ యభిప్రాయమును వ్యక్తీకరించిరి; భగవంతుడు దేవతలు మొదలగువారి నందఱను సృష్టించినతరువాత మనుష్యుని సృష్టించి, దేవతలువచ్చి మనుష్యునకు నమస్కరింపవలసినదని నియమించెను. అంతట 'ఇబ్లిస్' అను దేవత తక్క, మిగిలినవారందఱును దేవుని యాజ్ఞను శిరసావహించిరి. తన యాజ్ఞను మన్నింపని హేతువుచే దేవుడు శపించినంతనే 'ఇబ్లిస్' సైతానయ్యెను. మానవజన్మము అత్యుత్తమ మనుటయే యీ యుపాఖ్యానమునందలి మహత్తరమైన సత్యము. సృష్టిజాతమునం దధమస్థితియందున్న పశుజాతి తమస్సం

భూతమై మాంద్యస్వభావముతో గూడియున్నది. జంతువుల కున్నత భావము లేవియు గలుగజాలవు. మానవజన్మము బొందనిదే దేవతల కైనను ముక్తి లభించుటలేదు. అట్లే మానవకోటియందు మితి మీఱిన యైశ్వర్యముగాని, పరమ దారిద్ర్యముగాని, ఆత్మోన్నతికి గొప్ప ప్రతిబంధకమైయున్నది. మధ్యమ తరగతులనుండియే లోకము నందలి మహాపురుషులు వెలువడుచున్నారు; మధ్యమ తరగతి జనులందే కలిమిలేములును, శక్తులును సరిసమానముగానుండును.

ఇక ప్రస్తుతాంశమగు ప్రాణాయామమునకు మరలుదము. ప్రాణాయామమునకును, చిత్తైకాగ్రతకునుగల సంబంధమేమి? శరీర మను యంత్రమునందు శ్వాస యొక యాధారచక్రము. పెద్ద పెద్ద యంత్రములలో మొట్టమొదట ఆధారచక్రము కదలుచుండుట మీరు చూచియుండవచ్చును. ఈ గమనము సూక్ష్మసుసూక్ష్మ భాగముల పర్యంతము వ్యాపించుచుండును. అంతటితో అత్యంతము సున్నితమైన యంత్రభాగములుకూడ కదలుచుండును. మన శరీరమునందలి ప్రతి భాగమునకును చలన శక్తిని గల్గించి శరీరవ్యాపారములను సక్రమముగా నడుపుచున్న శ్వాస మీ యాధారచక్రము వంటిది.

ఒకప్పుడొక మహారాజు తన మంత్రి యపరాధము చేసి నందులకై అత్యున్నతమైన యొక గోపురాగ్రమున నాతని బంధించు నట్లు శిక్షవిధించెను. తదాజ్ఞ ననుసరించి రాజభటులు వాని నక్కడ కడతేర్చుటకై దిగవిడిచిరి. ఐనను, పతిభక్తిపరాయణురాలగు నాతని భార్య రాత్రి సమయమున నా గోపురమునొద్దకు బోయి తా నెట్లు తోడ్పడ గలనని యాతని నడిగెను. పొడవైన యొక పగ్గమును, పురిత్రాటిని, లావుగ పెనవైచిన దారమును, పట్టునూలును, ఒక పేడపురుగును, రవంత తేనెను తీసికొని మఱునటినాటి రాత్రి తానున్న గోపురమునొద్దకు తిరిగి రావలయునని యాత డామెతో చెప్పిపంపెను. ఆ సాధ్వి వీని ప్రయోజన మేమైయుండునోయని విశేషముగా ఆశ్చర్య పడుచు ఆతడు కోరిన వస్తువులను నియమితకాలమునకు తీసికొని పోయెను.

పట్టుదారము నా పేడపురుగునకు గట్టిగా నతికి దానికొమ్ముల కొక తేనెచుక్కను రాచి, యనంతరము దాని మూర్ధ్వముఖముగా జేసి గోపురపుగోడపై స్వేచ్ఛగా విడిచిపెట్టుమని యాత డామెకు సూచించెను. ఈ నియమముల నామె యథావిధిగా నిర్వర్తించి నంతనే పేడపురుగు తన దీర్ఘయాత్రను ప్రారంభించెను. మీదనున్న తేనె వాసనను గ్రహించి దాని నందుకొను నాశతో ఆ కీటకము నెమ్మదిగా మీదికి ప్రాకి చిట్టచివరకు గోపురాగ్రమును చేరగనే మంత్రి దానిని పట్టుకొని పట్టుదారమును చేపట్టి, దాని యూనతి కొఱకు పేనినదారము నదుకవలసినదని చెప్పి, యాదారమును నదుకొని తిరిగి పురిత్రాడును, కడకు పగ్గమును తనకు చిక్కుటకై యాతడా మార్గమునే యనుసరించెను. మిగిలిన కథ యిక సులభము. పగ్గమును పట్టుకొని మంత్రి క్రిందికి దిగి త్రోవను జూచుకొనెను. మన శరీరములోనున్న శ్వాసమే యీ పట్టునూలు. దీనిని చేపట్టినంతనే 'నాడీ వాహిను' లను పేనవైచినదారము మన వశమగును. దాని మూలమున మనోభావము లను పురిత్రాడు మనకు చేజిక్కును. కడకు ప్రాణ మను పగ్గము మన యధీనమగును. ప్రాణ నిరోధము కల్గినంతనే ఆత్మస్వాతంత్ర్యము లభించుచున్నది.

మన శరీరమునుగూర్చి మన కేమియు తెలియదు; మనము తెలిసికొనలేము. కాకున్న నిర్జీవమైన కళేబరము నొకదానిని తీసికొని ఖండఖండములుగా కోయగలుగుచున్నాము. ఇక బ్రతికి యుండగనే యొకజంతువును తీసికొని దానిశరీరములో నేమున్నదో చూచుటకై ముక్కముక్కలుగా కోయునట్టి ధీమంతులును కొందఱున్నారు. ఎన్ని చేసినను ఈ కళేబరపరీక్షకును మన శరీరమునకును సంబంధ మేమియు లేదు. శరీరమునుగూర్చి మనకు గల జ్ఞానము స్వల్పము. ఇందులకు హేతు వేమి? మన చిత్తైకాగ్రత శరీరాంతర్గతమైన సూక్ష్మగతులను గ్రహించునంతటి తీవ్రవిచక్షణ గలది కాదు. మనస్సు సూక్ష్మతరమై శరీరతత్త్వమును శోధించినప్పుడు మాత్రమే శరీరాంతర్గత

విషయములు మనకు బోధపడును. సూక్ష్మవిషయికజ్ఞానము కలుగుటకుముందు మనము స్థూలవిషయికజ్ఞానమును సంపాదింపవలయును. శరీరయంత్రమున కంతకును చలనము గలుగజేయుచున్న ప్రాణశక్తిని మనము స్వాధీనము చేసికొనవలయును. ప్రాణము శ్వాసరూపమున మనకు స్పష్టముగా గోచరించుచున్నది. అనంతర మీ శ్వాసముతో బాటు నెమ్మదిగా మనము శరీరములో ప్రవేశించి, శరీరమునందంతటను ప్రవహించుచున్న నాడీవాహిను లనునట్టి సూక్ష్మశక్తుల స్థితిగతులనుగూర్చి గ్రహింపగలము. ఈ సూక్ష్మశక్తులను కనిపెట్టి తదనుభవము బొంద నేర్చుటతోడనే వానితో బాటుగా శరీరమును మన యధీనమగుట కారంభించును. వివిధములైన యీ నాడీ వాహినుల మూలముననే మనస్సునందును చలన మేర్పడుచున్నది. ఇట్లు తుదకు మనశ్శరీరములను సంపూర్ణముగా స్వాధీనము చేసికొని వానిని మన సేవకులనుగ జేసికొనునట్టి స్థితి లభించును. జ్ఞానమే సామర్థ్యము ; ఈ సామర్థ్యమును బొందుటకై, యోగమునకు మూలమగు ప్రాణాయామముతో మనము సాధన ప్రారంభింపవలయును. ప్రాణాయామము విపులమైన విషయమగుటచే దానిని సమగ్రముగ నిరూపించుటకు చాల పాఠములు పట్టును. అందుచే ఒక్కొక్క భాగముగా తీసికొని పరిశీలింతము.

ఇందలి ప్రతి అభ్యాసమును ఏ కారణములచే నేర్పడియున్నదియు, ఈ యభ్యాసములచే శరీరమునం దేయేశక్తులుద్దీప్తములగుచున్నదియు క్రమముగా మనకు విశదము కాగలదు. తన్మూలమున మనశ్శరీరశక్తుల నన్నిటిని బొందవచ్చును. కాని యిందులకు నిరంతరమైన సాధన ఆవశ్యకము. అభ్యాసమువలన మన కీవిషయములు రుజువగును. మీ యంతట మీరు ధ్రువపఱచుకొననిదే నే నెంతటి హేతునిరూపణము చేసినను మీ కిది రూఢికానేరదు. శరీరమునం దంతటను నాడీవాహినులు ప్రవహించుచున్నట్లు మీరు గుర్తించుట కారంభించినంతనే సంశయములన్నియు మాయమగును.

కాని యందఱకు ప్రతిదినమును తీవ్రమైన సాధన చేయుట యావశ్యకము. దినమునకు అధమపక్షము రెండుసారులైనను అభ్యసింపవలయును. ఉదయ సాయంసమయము లిందులకు విశేషముగా అనుకూలములు. సంధ్యాసమయములందు తక్కిన వేళలకంటె ప్రశాంతముగా నుండును. ఉదయసాయంసమయములందు మీరును ప్రశాంతచిత్తులగుట కనుకూలురై యుందురు. ఇట్టి స్వాభావికమైన స్థితిని చేకూర్చుకొని మనము సాధన చేయుట కారంభింపవలయును. 'సాధన చేయనిదే భుజింప' నని నియమ మేర్పఱచుకొనుము. ఇట్లు చేసిన పక్షమున ఆకటిబాధయే మీ ప్రాలుమాలికను వదలించును. సంధ్యోపాసనాదులను ఆచరింపనిదే యెన్నడును భుజింపవలదని భారతదేశమున బిడ్డలకు బోధింతురు. అందుచే కొంతకాలమైన వెనుక అదియే వారికి సహజమగును. స్నానము నాచరించి యుపాసింపనిదే ఆ కుఱ్ఱవానికి ఆకలివేయదు.

అవకాశము కలవారీ సాధనకొఱకు ప్రత్యేకముగా నొకగది నేర్పాటు చేసికొనుట మంచిది. ఆ గదిలో నిద్రపోవలదు; దానిని పవిత్రముగా నుంచవలయును. స్నానముచేసి మనశ్శరీరములను పరిశుద్ధ మొనర్చుకొనినగాని, మీ రా గదిలో ప్రవేశింపరాదు. ఆ గదిలో నెప్పుడును పూవులను, ఇంపైన పటములను ఉంచుచుండుము; యోగి యగువాని కివి చక్కని పరిసరములు. ఉదయాస్తమయములలో పరిమళద్రవ్యముల నందు ధూపము వేయుము. ఆ గదిలో కలహమునకుగాని కోపమునకుగాని, అపవిత్రమైన సంకల్పమునకుగాని చోటీయకుము. సత్సంకల్పము కలవారలను మాత్రమే అందు ప్రవేశింపనీయుము. ఇట్లు చేయుచువచ్చిన, క్రమక్రమముగా ఆ గదిలో పవిత్రమైన వాతావరణ మేర్పడును. అందుచే మీకు దుఃఖముగాని పరితాపముగాని సందిగ్ధావస్థగాని తటస్థించినప్పుడును క్షోభము కలిగినప్పుడును ఆ గదిలో ప్రవేశించినంత మాత్రముననే మీకు మనశ్శాంతి కలుగును. దేవాలయములు, క్రైస్తవ ప్రార్థనాలయములు మొదలగువానియందలి అభిప్రాయ

మిదియే. వీనియందు కొన్నిటిలో నేటికిని మీ కిందులకు నిదర్శనము కానబడును; ఐనను ఈ యాలయములందు చాలవఱకీ యభిప్రాయ మంతరించినది. పవిత్ర సంకల్పములను ఉదాత్త భావములను అందు స్పందన మొందజేయుటచే, ఆ స్థలములు దివ్య తేజోవంతములై విరాజిల్లుసనుటయే యిట్టి యాలయనిర్మాణమునందలి ముఖ్యోద్దేశము. ప్రత్యేకముగా నొకగది నేర్పాటుచేసికొనుట కవకాశము లేనివారు తమ కనువైనచోట సాధనచేయవచ్చును. స్థిరమైన యాసనమున గూర్చుండి పవిత్రసంకల్పముచే సృష్టిజాతమున కంతకును మొట్టమొదట శుభాకాంక్ష చేయవలయును; ''సమస్త జీవులకును శాంతి, ఆనందము, కలుగుగాక'' అని సంకల్పింపుడు. ఇదే విధమున నలుదిక్కులకును శుభాకాంక్ష చేయుడు. ఇట్టి శుభాకాంక్ష చేసిన కొలదియు మీకు ప్రసన్నచిత్తత కలుగుచుండును. ఇతరు లారోగ్యవంతులగుటకు తోడ్పడుటయే మన మారోగ్యవంతుల మగుటకు సులభతమమైన మార్గము; ఇతరులు సుఖించుటకు తోడ్పడుటయే మనము సుఖించుట కతిసులభమైన పద్ధతి. అనంతరము, ఆస్తికులైనవారు భగవంతుని ప్రార్థింపవలయును—ఈ ప్రార్థన, ధనము, ఆరోగ్యము, స్వర్గములకొఱకుగాదు; జ్ఞాన ప్రాప్తికై, ఆత్మవికాసము కొఱకై మీరు ప్రార్థింపవలయును. తదితర ప్రార్థనలన్నియు స్వార్థభూయిష్ఠములు. తదుపరి మీ శరీర విషయమును గమనించి శరీరారోగ్యమును దార్ఢ్యమును కలుగ జేసికొనవలయును. శరీరమేకదా మనకున్న ఉత్తమసాధనము. శరీరమునకు వజ్రసన్నిభమైన పటుత్వము కల్గినట్లు భావింపుడు; ఈ శరీరసాహాయ్యమున సంసార సముద్రమును తరింపగలమని తలపుడు. మోక్ష మెన్నటికిని బలహీనులకు లభ్యము కానేరదు. సమస్త దౌర్బల్యము నావలకు త్రోసివేయుడు. ''నీవు దృఢగాత్రమ''వని మీ శరీరమున కుద్బోధింపుడు. ''బలీయమైనదాన''వని మీ మనస్సునకు బోధింపుడు. అపారములైన ధైర్య విశ్వాసములను బూనుడు.

# తృతీయాధ్యాయము

## ప్రాణము

ప్రాణాయామ మనగా శ్వాసమును గూర్చిన విషయమని చాలమంది యభిప్రాయము. ఇది సరికాదు. ప్రాణాయామమునకు శ్వాసముతో సంబంధమున్నదని యున్నప్పటికిని, వాస్తవమున కది బహుస్వల్పము. నిజమైన ప్రాణాయామమునకు శ్వాసనియమన మను నది కేవల మొకానొక సాధనముకంటె విశేషమైనది కాదు. ప్రాణా యామ మనగా ప్రాణనిరోధమని యర్థము. హిందూ తత్త్వశాస్త్ర జ్ఞుల ననుసరించి, విశ్వమంతయు రెండు తత్త్వములచే నిర్మింపబడి యున్నది; వారీ రెంటిలో నొక దానిని ఆకాశమందురు. ఆకాశము సర్వవ్యాపియై సర్వాంతర్గతమైన వస్తువు. రూపముగల ప్రతివస్తువును, సమ్మేళనమువలన నుత్పత్తియైన ప్రతి పదార్థమును ఆకాశము నుండియే బయలువెడలుచున్నది. ఆకాశమే వాయు వగుచున్నది. ఆకాశమే ద్రవపదార్థములును ఘనపదార్థములును అగుచున్నది. ఆకాశమే భూసూర్యచంద్రనక్షత్రములును, ధూమకేతువులు (తోకచుక్కలు)ను అగుచున్నది. ఆకాశమే మనుష్యశరీరమును, జంతుశరీరమును, చెట్టుచేమలును అగుచున్నది. మనకు కానవచ్చు చున్న ప్రతిరూపమును, ఇంద్రియగోచరమైన ప్రతి విషయమును, అస్తిత్వము గల ప్రతివస్తువును ఆకాశమువలననే ఉత్పత్తి యగు చున్నది. అత్యంతము సూక్ష్మమైనదగుటచే ఆకాశము ఎన్నడును ఇంద్రియగోచరము కానేరదు. స్థూలరూపముదాల్చినప్పుడే ఆకార మును జూడగల్గుదుము. ఆకాశము మాత్రమే సృష్టిప్రారంభమున నున్న వస్తువు. కల్పాంతమున ఘనపదార్థములును, ద్రవపదార్థము లును, వాయుపదార్థములును సర్వమును ఆకాశమునందు కరిగి లయించుచున్నవి. ఇదేవిధమున ఆకాశమునుండి మరల సృష్టి వెలు వడుచున్నది.

ఏ శక్తివలన ఆకాశ మీ విశ్వముగా నిర్మాణమగుచున్నది? ప్రాణశక్తివలన. ఆకాశము ఎట్లు అనంతమును, సర్వవ్యాపకమును, జగన్నిర్మాణమునకు మూలపదార్థమును నైయున్నదో, అట్లే ప్రాణ మనంతమును, సర్వవ్యాపకమునునగు జగత్సృజనశక్తియై యున్నది. కల్పాదియందును కల్పాంతమునందును సర్వమును ఆకాశమగును; విశ్వములో నున్న సమస్తశక్తులును తిరిగి ప్రాణమునందు లయిం చును. విశ్వమునందలి సమస్తశక్తులును ప్రాణమునుండియే వెలు వడుచున్నవి. ప్రాణమే చలనరూపమున వ్యక్తమగుచున్నది. ఆకర్షణశక్తి (మేగ్నెటిజమ్) గను, గురుత్వాకర్షణ శక్తి (గ్రేవిటేషన్) గను వ్యక్తమగు చున్నదియు ప్రాణమే. ప్రాణమే శరీరవ్యాపార ములుగను, నాడీవాహినులుగను, యోచనశక్తిగను ప్రకటమగు చున్నది. మానసిక సంకల్పమునుండి అత్యల్పమైన శరీరవ్యాపారము వఱకును గల ప్రతిక్రియయు ప్రాణశక్తియొక్క వ్యక్తీకరణమే. మానసికశక్తులు కానిండు, భౌతికశక్తులు కానిండు, జగత్తునందలి శక్తులన్నియు సాముదాయకముగా వాని మూలస్థితిలోనికి సమీాక రింపబడినపుడు ప్రాణమనబడుచున్నవి. ''వస్తువుగాని శూన్యముగాని లేక, అంధకారముచే అంధకారము ఆవరింపబడియున్న సమయ మున నున్నదేమి? చలనరహితమగు నాకాశమే అప్పుడున్న వస్తువు''. అట్టి స్థితియందు ప్రాణముయొక్క భౌతికచలనము నిరో ధింపబడి యుండినను ప్రాణము నిలిచియే యుండును. ఇప్పుడు విశ్వమునందు ప్రదర్శితమగుచున్న శక్తులన్నియు కల్పాంతమున సామ్యావస్థను బొంది నిద్రాణములగును. మఱియొక కల్పారంభమున నవి మేల్కొని ఆకాశముతో సంఘర్షము పొందును; అప్పు డాకాశమునుండి యీ రూపములన్నియు వెలువడుచున్నవి; ఆకాశమునకు వికారము కలిగినంతనే ప్రాణమును వికారముబొంది యీ సమస్తమైన శక్తులుగ వ్యక్తమగుచున్నది. ప్రాణాయామ మనగా ఈ ప్రాణమునుగూర్చిన జ్ఞానమును ప్రాణవశీకరణమునని భావము.

ప్రాణాయామము మూలమున అపారమైన శక్తి మన వశమగును. ప్రాణతత్త్వము, తన్నిగ్రహము నొకడు సమూలముగా గ్రహించెననుకొనుడు. ఇక వానికి లభ్యముకాని శక్తి యేది? ప్రాణశక్తి వానికి స్వాధీనమగుటచే సూర్యచంద్రనక్షత్రముల నాతడు తలక్రిందు చేయగల్గును; అణువు మొదలుకొని బ్రహ్మాండము వఱకును సమస్తమును నిరోధింపగలడు. ఇదియే ప్రాణాయామమునకు పరమావధి. యోగి పరిపూర్ణసిద్ధుడైనపుడు ప్రకృతియం దాతనికి వశముగాని దేదియు నుండదు. దేవతలను కానిండు, విగతజీవులను కానిండు, ఆతడు "రండు" అని యాజ్ఞాపించినంతనే వారు శిరసావహించి రావలసినదే. ప్రకృతియందలి సమస్తశక్తులును ఆతని బానిసలై యనువర్తించును. అజ్ఞానులీ యోగశక్తులను చూచి వీనిని మహిమము లందురు. సాధ్యమగు తుది సిద్ధాంతముపై లక్ష్యముంచి, ఆ సిద్ధాంతమునకు మార్గదర్శకములగు విపులాంశసమీక్షకు పిదప గడగుట హిందూమనస్సుకు సహజమైన అభ్యాసము. "దేని యెఱుకచే సమస్తమును గ్రహింపగలమో అట్టిదేది?" అని వేదములలో ప్రశ్న బయలువెడలినది. ఏ జ్ఞానముచే సమస్తమైన జ్ఞానమును గలుగుచున్నదో దానిని నిరూపించుటకే సమస్త గ్రంథములును, సమస్త తత్త్వశాస్త్రములును వెలువడినవి. విశ్వమునుగూర్చి లేశలేశముగ నొకడు గ్రహింప నెంచెనా, ప్రతి సైకతరేణువును గూర్చియు ఆతడు గ్రహింపవలసియుండును; ఇది వానికసాధ్యము. ఇక జ్ఞానము కలుగుటెట్లు? ప్రత్యేకాంశములపై దృష్టినిలిపి విశ్వవిస్తృత సమస్తాంశముల పరిజ్ఞానమును మానవుడందుటెట్లు? ప్రత్యేక భావముల వెనుక ఒక సిద్ధాంతము కలదని యోగులు చెప్పుచుందురు. దానిని గ్రహించితిరా, సమస్తమును గ్రహించినవారలయ్యెదరు. వేదములందీ విశ్వమంతయు నామరూపాతీతమైన అద్వితీయవస్తువుగా సమీకరింపబడియున్న విధముననే, సమస్త శక్తులును ప్రాణము లోనికి సమీకరింపబడియున్నవి; అద్వితీయ వస్తువును గ్రహించినవాడు సమస్త విశ్వమును గ్రహించియున్న విధముననే, ప్రాణతత్త్వమును

గ్రహించినవాడు విశ్వమునందలి భౌతికమానసికశక్తుల నన్నిటిని గ్రహించుచున్నాడు. ప్రాణశక్తిని వశపఱుచుకొనినవాడు తన మనస్సునే కాక మనస్సుల నన్నిటిని స్వాధీనము చేసికొనుచున్నాడు. ప్రాణము శక్తియొక్క సమీకరణరూపమగు వ్యక్తీకరణమైయుండుటచే ప్రాణవశీకరణమును పొందినవానికి స్వశరీరమే కాక సమస్త శరీరములు వశమగుచున్నవి.

ప్రాణము నెట్లు వశము చేసికొనవలయు ననునదియే ప్రాణాయామమునకు ముఖ్యోద్దేశము. ఈ పరమప్రయోజనము నుద్దేశించియే ఇందలి సమస్త సాధనలును, సమస్త శిక్షణములును ఏర్పడియున్నవి. ప్రతి మనుష్యుడును తా నున్నచోటునుండియే ఆరంభించి తన కత్యంతసమీపముననున్న వస్తువులను స్వాధీనము చేసికొనుటకు నేర్వవలయును. బాహ్యప్రపంచములోనున్న వస్తువు లన్నిటికంటెను ఈ శరీరము మన కతి సమీపముగా నున్నది; ఈ మనస్సు మనకు అత్యంత సమీపముగా నున్నది. ఈ మనశ్శరీరముల కాధారమైయున్న ప్రాణము లోకమునందలి సమస్తమైన ప్రాణముకంటెను మనకు దాపుననున్నది. మనశరీర మానసిక శక్తులనునట్టి యీ చిన్న ప్రాణతరంగమే అపారమైన ప్రాణ సముద్రమునందలి యల లన్నిటికంటెను మన కత్యంత సన్నిహితముగా నున్నది. ఈ చిన్నతరంగమును వశము చేసికొనగల్గిననే కాని ప్రాణశక్తి నంతయు వశము చేసికొనజాలము. ప్రాణము వశమైన యోగి పరిపూర్ణుడగును. ఇక నాత డేశక్తికిని అధీనుడు కాడు. ఆతడు సర్వశక్తిమంతుడును సర్వజ్ఞుడును అగునని చెప్పనగును. ప్రాణవశీకరణమును సాధింప యత్నించునట్టి సంఘములు ప్రతి దేశమునందును గలవు. ఈ దేశములో మానసిక చికిత్సకులును, విశ్వాసచికిత్సకులును, ఆధ్యాత్మికవాదులును, క్రైస్తవ వైజ్ఞానికులును, సమ్మోహనశాస్త్రజ్ఞులును, ఇంక నిట్టివారును ఎందఱో కలరు. పరిశీలించిచూచిన పక్షమున, ఈ సంఘములకు తెలిసినను తెలియకున్నను, వీని యన్నిటికిని ఆధారభూతమైయున్న శక్తి

ప్రాణవశీకరణమేయని మనము గ్రహింపవచ్చును. ఇదియే వారి సిద్ధాంతముల కన్నిటికిని సారాంశము. ఎఱుగకయే వారీ ప్రాణ శక్తిని వినియోగించుచున్నారు. ఇది వారికి యాదృచ్ఛికముగ లభించినది. యోగులు వినియోగించుచున్న శక్తియు నీ ప్రాణ శక్తియే.

ప్రాణమే జీవశక్తియైయున్నది. అతిసూక్ష్మమైనట్టియు, అత్యున్నతమైనట్టియు ప్రాణవ్యాపారమే మనోవృత్తి. సాధారణముగా మన కనుభవములోనున్న మనోవ్యాపారమే కాక ఇతరమైన మనోవ్యాపారములుకూడ కలవు. సహజజ్ఞానమనియు, బోధరహితజ్ఞానమనియు చెప్పబడు మనోవ్యాపార మొకటి కలదు. మనోవృత్తుల కిది బీజావస్థయై యున్నది. మనల నొక దోమ కుట్టినప్పుడు చేయి తనయంతట తాను సహజముగా దానిపై తట్టును. ఇది యొకవిధమైన మనోవ్యాపారము యొక్క వ్యక్తీకరణము. మన యెఱుక లేకయే జరుగుచున్న శరీర వ్యాపారములన్నియు ఈ తరగతి మనోవ్యాపారమునకు చెందును. బోధతో గూడిన మనోవ్యాపారము మఱియొకటి కలదు: హేతు విమర్శ చేయుచు, నిర్ణయించుచు, ఆలోచించుచు కొన్ని వస్తువుల పూర్వాపరవిషయములను సమగ్రముగా పరిశీలించుచున్నాము. ఇంతటితో సరికాదు. హేతువిమర్శ పరిమితమైనట్టిదని మనకు తెలియును. తత్త్వవిచారమునందు హేతువాదము మనకు కొంతవఱకు తోడ్పడగల్గినను, తనహద్దు నది అతిక్రమింపజాలదు కావున, పూర్ణమైన తత్త్వజ్ఞానమును గలుగజేయజాలదు. హేతువాదము నిజముగా అతిపరిమితమైన వృత్తములో తిరుగాడుచుండును. ఐనను ఈ హేతు వాదపు వలయములోనికి కొన్ని సత్యాంశములు తోకచుక్కలవలె చొరుచుకొనివచ్చి పడుచున్నవి. మన హేతు విమర్శ యొక పరిమితిని దాటి పైకి పోజాలకున్నను ఈ సత్యాంశములు పైనుండి వచ్చు చుండుట నిశ్చయము. హేతువిమర్శయను నీ చిన్న యావరణములో వానియంతటనవిగా వచ్చిపడుచున్న యీ సంఘటనల హేతువులు

హేతువాదపరిమితి కవ్వల నున్నవి. మనస్సు ఇంతకంటె నున్నత తరమైన అతీంద్రియజ్ఞానావస్థను పొందగలదు. పరిపూర్ణ చిత్తైకాగ్రతయు, అతీంద్రియజ్ఞానావస్థయునై, సమాధియని వ్యవహరింపబడు చున్న యీ (ఉత్తమోత్తమ) స్థితిని పొందినపుడు మనస్సు హేతువాద పరిమితి నతిక్రమించి, సహజజ్ఞానము వలనగాని, తార్కికజ్ఞానము వలనగాని తెలియరాని సత్యములను ప్రత్యక్షముగా దర్శించును. ప్రాణముయొక్క వివిధ రూపములగు శారీరక సూక్ష్మశక్తులక్రియలు, క్రమశిక్షణమువలన మనస్సును వికాసవంత మొనర్చి అతీంద్రియజ్ఞాన సిద్ధికి తోడ్పడుచున్నవి.

చరాచరాత్మకమైన ప్రపంచమునం దెక్కడ చూచినను అవిచ్ఛిన్నమైన యేకపదార్థము వెలయుచున్నది. భౌతికముగా ఈ విశ్వమంతయు ఏకమైయున్నది ; సూర్యునకును నీకును భేదములేదు. భేదమున్నదందురా. ప్రకృతి శాస్త్రజ్ఞు డిది వట్టికల్పితమని చెప్పును. ఈ బల్లకును నాకును వస్తుతః భేదములేదు. పదార్థజాతమునందీ బల్ల యొక బిందువు ; నే నింకొక బిందువను. అనంతజడజగత్సాగరమున ప్రతి రూపమును ఒక్కొక్క సుడిగుండమని చెప్పనొప్పును. ఈరూపములలో నేదియు స్థిరమైనదికాదు. నదీప్రవాహమున కోట్లకొలది సుడిగుండము లుండవచ్చును. కొన్ని క్షణములకాల మవి దిర్దిరతిరుగుచు, అనంతర, మంతరించిపోవుచు, వానిస్థానమును తిరిగి క్రొత్త నీటిసముదాయ మాక్రమించుచుండును. ఇట్లనుక్షణమును ప్రతి సుడిగుండములోనున్న నీరును మాఱిపోవుచున్నది. ఈ రీతిగ జగత్తంతయు సదా వికారము పొందునట్టి యేకపదార్థజాతము. ఇందున్న రూపములన్నియు పైన జెప్పిన యనేకములైన జలావర్తములు. పదార్థరాశి యొకటి మానవ శరీరమను సుడిలో ప్రవేశించి, కొంతకాల మందు నిలిచి మార్పు చెంది, జంతుశరీరమను మఱియొక సుడిలో జొచ్చి, కొన్ని సంవత్సరము లైనవెనుక లోహపుముద్ద యనబడు మఱియొక సుడిలో జేరుచున్నది. నిరంతరముగ సాగుచున్న పరిణామ మిది. ఏ శరీరమును

జూచినను అస్థిరమైనదియే. మాటలలోగల భేదమేకాని నీ శరీర
మనియు, నాశరీరమనియు ప్రత్యేకముగా నొకవస్తు వెక్కడను లేదు.
బ్రహ్మాండమైన యేక పదార్థరాశిలో నొకబిందువు చంద్రుడనియు,
మఱియొకటి సూర్యుడనియు, నింకొకటి మనుష్యుడనియు, వేఱొకటి
భూమియనియు, నింకొకటి చెట్టనియు, మఱొకటి పుట్టయనియు
చెప్పుచున్నాము. పదార్థజాతము శాశ్వతముగా ఏకత్వభిన్నత్వము
లను పొందుచున్నది. ఇట్టిస్థితిలో స్థిరవస్తువనదగిన దేదియు లేదు. ప్రతి
వస్తువునకును వికారము గలుగుచున్నది. మనస్సు విషయమునకూడ
నిట్టిదే. ఆకాశమే పదార్థజాతమై యున్నది. ప్రాణవ్యాపార మతి
సూక్ష్మముగా నున్నప్పుడు సూక్ష్మతరమైన స్పందనస్థితియం దీ
యాకాశమే మనస్సగుచున్నది. ఆస్థితియందది యింకను అవిభాజ్య
మైన పదార్థరాశిగా నుండును. ఈ సూక్ష్మ స్పందన స్థితిని మీరు పొంద
గల్గినంతనే బ్రహ్మాండ మంతయు సూక్ష్మస్పందనములతో గూడుకొని
యున్నట్లు తోచును. ఒక్కొక్కప్పుడు కొన్ని మూలికలు మనము
జాగ్రదవస్థలో నుండగనే మనల నా స్థితికి దీసికొని పోగలవు. సర్
హంఫ్రీ డేవీ అను శాస్త్రజ్ఞుని విఖ్యాతపరిశోధనము,—హాస్యజనక
వాయువు లాఫింగ్ గాస్ లేక నైట్రస్ ఆక్సైడ్ ఎక్కువగా పీల్చినప్పు
డాత డెట్లుపన్యాసమధ్యమున నట్టె నిలిచిపోయి, అనంతరము జగ
త్తంతయు భావనానిర్మితమై యున్నదని చెప్పియుండెనో,—మీలో
చాలమందికి జ్ఞప్తిలో నుండవచ్చును. ఈ సంఘటన జరుగుచుండినంత
పర్యంతము స్థూలస్పందనము లాగిపోయి, ఆతనిచే భావన లని చెప్ప
బడిన సూక్ష్మస్పందనములుమాత్ర మాతనియెదుట నుండెనని చెప్పి
నను జెప్పవచ్చును. తనచుట్టు నుండిన సూక్ష్మస్పందనములను మాత్ర
మాతడు చూడగల్గెను ; సమస్తమును భావనామాత్ర మయ్యెను.
ప్రపంచమంతయు భావనాసముద్రముగా తోచెను ; అందు, తానే
కాక తనతో బాటుగా సమస్తమైన జనులును భావన లనబడు చిన్న
చిన్న సుడిగుండములై పోయిరి.

ఈ రీతిని మనకు భావనాప్రపంచమునందుగూడ ఏకత్వము కాన్పించుచున్నది. కడ కాత్మయొద్దకు బోయి చూచినప్పుడు ఆత్మ యెన్నటికి నొక్కటియే యని మనము గ్రహింతుము. స్థూలసూక్ష్మ వస్థలయందు పదార్థజాతమునకు గలుగునట్టి చలనములకును స్పందనములకును అవ్వల నొకే వస్తువు కలదు. వ్యక్తమగు చలనమునందును ఏకత్వము కలదు. మన మీ విషయముల నిక మిథ్యలని నిరాకరింపజాలము. విశ్వశక్తులను సమీకరించి చూచిన యెడల వాని పరిమాణ మెల్లప్పుడు నొక్క విధముగనే యుండునని నవీనప్రకృతిశాస్త్రజ్ఞులును నిరూపించియున్నారు. విశ్వశక్తి యంతయు రెండవస్థలలో నుండునని వారిచే ధ్రువపఱుపబడినది. అవ్యక్తమగు మూలశక్తి సామ్యావస్థను బొంది, తిరిగి వివిధములైన శక్తులుగను వ్యక్తమగుచు, నింకొకప్పుడు అవ్యక్తావస్థను బొందుచు, మరల వ్యక్తస్థితిని బొందుచుండును. ఇట్లు సదా సంకోచ వికాసములు గలుగుచుండును. పైన జెప్పినవిధమున నిట్టి ప్రాణశక్తివశీకరణమే ప్రాణాయామ మనబడుచున్నది.

మనుష్యశరీరమున ప్రాణశక్తివ్యాపారము ఊపిరితిత్తుల చలనమునందు విస్పష్టముగ కానగును. ఈ చలనము స్తంభించినంతనే శరీరమునందలి యితరశక్తుల వ్యాపారములన్నియు తప్పక వెంటనే నిలిచిపోవును. కాని, ఊపిరితిత్తుల చలన మాగిపోయినను జీవించి యుండ నేర్చినవారు కలరు. బహుదినముల పర్యంతము భూస్థాపితులై యుండి, శ్వాసింపకయే జీవింపగలవారు కొందఱుకలరు. సూక్ష్మస్థితిని బొందుటకు మనము స్థూలావస్థయొక్క సాహాయ్యము తీసికొని, అతి సూక్ష్మమగు పరమార్థమును ప్రాపించునంతవఱకు సావధానులమై వికాసము పొందుచుండవలయును.

ఊపిరితిత్తుల చలనమును నిరోధించుటయే ప్రాణాయామము. ఈ చలనము శ్వాసముతో సంబంధించియున్నను శ్వాసమువలన గలుగుటలేదు. ఊపిరితిత్తుల చలనమే శ్వాసమునకు కారణము. ఈ

చలనము జలయంత్రమువలె గాలిని లోనికి లాగుచు బయటికి విడుచుచున్నది. ప్రాణము ఊపిరితిత్తులను గదల్చునప్పుడు వాని కదలికచే గాలి లోనికి లాగబడును. అందుచే ప్రాణాయామ మనగా ఊపిరి పీల్చుటయు విడుచుటయు గాదనియు, కండరముల శక్తిరూపముగ ఊపిరితిత్తులను గదల్చు ప్రాణశక్తిని వశపఱచుకొనుటయే ప్రాణాయామమనియు నేర్పడుచున్నది. నాడులనుండి కండరములకు బోయి, వానినుండి ఊపిరితిత్తులకడకు బోయి, వాని నొకానొక విధమున గదల్చుచున్న స్నాయుశక్తియే ప్రాణము. ప్రాణాయామమున మనము నిరోధింపవలసిన దీ ప్రాణమే. ప్రాణము వశమగుటతోడనే ప్రాణవ్యాపారము లన్నియు మెల్లగా స్వాధీనమగును. శరీరమునందలి ప్రతిస్నాయువును వశము గావించుకొనిన వారిని స్వయముగా నేను చూచియున్నాను. మన కిది సాధ్యము. కొన్ని కండరములు నా యధీనమై యుండినయెడల శరీరమందలి ప్రతి కండరమును ప్రతినాడియు స్వాధీనమగుట కభ్యంతరమేమి? ప్రస్తుత మిట్టి స్వాధీనత తప్పుటచే అవయవములకు స్వతంత్రగతి యేర్పడినది. ఇచ్ఛానుసారముగా మన చెవులను గదల్పజాలము; కాని జంతువుల కీ శక్తి కలదని మనకు తెలియును. మనము వినియోగింపకుండుటయే మన కిట్టి శక్తి లేకుండుటకు కారణము. ఇదియే 'ఎటవిజమ్' అని చెప్పబడుచున్న నవీనశాస్త్రసిద్ధాంతము.

అవ్యక్తావస్థలోనున్న చలనమును తిరిగి వ్యక్తావస్థకు దీసికొని రావచ్చునని మనకు తెలియును. నిద్రాణములగు కొన్ని శరీర వ్యాపారములను కఠినమగు సాధనవలనను, పరిశ్రమవలనను సంపూర్ణముగా తిరిగి మన యధీనములలోనికి తీసికొని రావచ్చును. విమర్శించి చూచినయెడల మన కీ కార్య మసాధ్యముకాదనియు, ప్రతి అవయవమును వశము గావించుకొనుటకు వలసినంత యవకాశము కలదనియు గ్రహింపవచ్చును. యోగు లీ కార్యమును ప్రాణాయామము మూలమున సాధింతురు. ప్రాణాయామమునందు ఊపిరిని లోనికి పీల్చుకొనునప్పుడు శరీరమునంతయు ప్రాణముచే పూరింపవలయునని

మీలో కొందఱు చదివియుండవచ్చును. ఇట్లు పూరించు పెట్లని మీ రడుగవచ్చును. ఆంగ్లానువాదములలో ప్రాణమనగా శ్వాసమని చెప్పబడియున్నది. ఇది యనువాదకుని దోషము. శరీరమునందలి ప్రతి భాగమును ప్రాణశక్తిమయము గావింపవచ్చును; అప్పుడు మీకు శరీరమంతయు వశమగును. సర్వవ్యాధులను సమస్తబాధలను సంపూర్ణముగా నివారించుకొనుటయేకాక పరుల శరీరములను సహితము స్వాధీనము గావించుకొనగలరు. మంచి కాని, చెడుగు కాని ప్రపంచమునందు సర్వమును అన్యోన్యముగా సంక్రమించుచున్నది. తనయొక్క స్థితి నితరులకు గలుగజేయుట శరీరస్వభావము. మీరు బలారోగ్యవంతులై యున్నయెడల మీకు సన్నిహితులగు వారును బలారోగ్యవంతులగుట కున్ముఖులై యుందురు. మీరు రోగగ్రస్తులై దుర్బలులై యున్నయెడల వారును అట్టి స్థితినిబొందుట కుద్యుక్తులైయుందురు. ఒకడు తన యారోగ్యమును మఱియొకనికి సంక్రమింపజేయుటయే రోగనివారణయత్నమునందలి ప్రథమోపాయము. ఆదిమ చికిత్సావిధాన మిదియే. ప్రయత్నపూర్వకముగాగాని అప్రయత్నముగాగాని ఆరోగ్యమును ఒరులకు సంక్రమింపజేయవచ్చును. బలాఢ్యు డొకడు బలహీనుని పొంత నివసించుచున్నయెడల ఆతడు, తనకు తెలిసినను తెలియకున్నను, ఆ బలహీనునకు కొంతబలమును చేకూర్చును. ప్రయత్నపూర్వకముగా నిట్లొనర్చినయెడల శీఘ్రముగా ఫలముకలుగును. స్వయముగా తాము విశేషారోగ్యవంతులు కాకున్నను ఇతరుల కారోగ్యమును గూర్చుటకు సమర్థులగు చికిత్సకులునుగలరు. ఇట్టి సందర్భములందు, ప్రాణశక్తి చికిత్సకున కితరులకంటె కొంచె మెక్కువగా వశమైయుండుటచే, ఆతడు తన ప్రాణము నొకానొక స్పందనస్థితికి దీసికొనివచ్చి మఱియొకనికి దానిని సంక్రమింపజేయగల్గియుండును.

ఎదుటనుగాక దూరమున నున్న రోగుల కిట్టి చికిత్సా విధానము జరుపబడియుండిన సంఘటన లనేకములు కలవు. కాని 'అంతరము' అను నర్థమున నిజముగా దూరమనునది యెచ్చటను లేదు.

నీకును సూర్యునకును మధ్య నేమైనను అంతరమున్నదా? విశ్వమంతయు అవిచ్ఛిన్నమైన యేకపదార్థజాతము. ఇందు సూర్యుడొక భాగమును నీ వొక భాగమును నై యున్నారు. నదిలో నొకభాగమునకును మఱియొకభాగమునకును మధ్య విభజన మనునది కలదా? లేదని యంగీకరించినయెడల విద్యుచ్ఛక్తివంటి శక్తి యొకచోటినుండి మఱియొకచోటికి బోవుట కభ్యంతర మేమి? పోజాలదనుటకు తగిన హేతువేదియు లేదు. దూరమునుండి రోగనివారణ చేయుట యథార్థమే ప్రాణశక్తిని అతిదూరస్థలమునకు బంపవచ్చును. కాని యిట్టి సంఘటన లన్నియు నమ్మదగినవి కావు; నూటికొకటి యథార్థమై యుండినయెడల మిగిలినవన్నియు మోసకృత్యములై యుండును. ఇట్టి చికిత్సావిధానము మన మనుకొనునంత సులభసాధ్యము కాదు. ఇట్టి విషయములలో సర్వసాధారణముగా ఈ చికిత్సకులు మానవ శరీరమునకు సహజముగాగల ఆరోగ్యస్థితిని రోగనివారణసాధనముగా గ్రహించుచుందురు. 'అలోపతి' వైద్యుడు వచ్చి విషూచిరోగికి తన మందు నిచ్చును. 'హోమియోపతి' వైద్యుడు తన విధానము ననుసరించి చికిత్సచేయును. 'హోమియోపతి' వైద్యుడు రోగి కలజడి కలిగింపక, చికిత్సను ప్రకృతిమాతచేతులలో నుంచుట కంగీకరించుటచే, 'అలోపతి' వైద్యునికంటె బాగుగా రోగమును నివారింపవచ్చును. ఇక విశ్వాస చికిత్సకుడు వచ్చి చికిత్సచేయునెడల, తన మనోబలమును వినియోగించి, విశ్వాసమును పురికొల్పి, రోగియందలి నిద్రాణమగు ప్రాణశక్తిని మేల్కొల్పుటచే 'హోమియోపతి' వైద్యునికంటె మఱింత సులభముగా రోగమును నివారించును.

తఱచుగా విశ్వాసచికిత్సకులు లోనగునట్టి ప్రమాదమొకటి కలదు; స్వయముగా విశ్వాసమే మనుష్యుని రోగనివారణ చేయుచున్నదని వా రనుకొందురు. కాని, రోగనివారణమునకు విశ్వాసమొక్కటియే కారణము కానేరదు. తనకు రోగము కలదని రోగి యెన్నడును తలచి యెఱుగని విషమలక్షణములుగల రోగము లనేక

ములు కలవు. రోగియొక్క ఈ అపారమగు విశ్వాసమే రోగమున కొక లక్షణమై, శీఘ్రముగా రోగిమరణించునని సూచించును. విశ్వాసమువలననే రోగనివారణ మగునను సిద్ధాంత మిట్టి సందర్భములందు వర్తింపదు. విశ్వాసమే రోగనివారణహేతువగు పక్షమున పైన జెప్పిన రోగికిని రోగనివారణమై యుండెడిది. ప్రాణమువలననే నిజమగు రోగనివారణ కలుగుచున్నది. ప్రాణవశీకరణము గల శుద్ధమనస్కుడు, ప్రాణము నొకానొక స్పందనస్థితికి దెచ్చి, యితరులకు సంక్రమింప జేసి, వారియం దట్టి స్పందనస్థితి నుద్దీపింపజేయగలడు. మన కిది ప్రత్యక్షవిషయము. మీతో నేను సంభాషించునప్పుడు నేను చేయునట్టి ప్రయత్నమేమి? నామనస్సు నొకానొక స్పందనస్థితికి దెచ్చుటయే. నే నిట్లు చేయగల్గిన కొలదియు నా వచనములు మీ చిత్తమున హత్తుకొనుచుండును. విశేషముగా నే నుత్సాహపూరితుడనై యున్న దినమున నా యుపన్యాసము మీ కింపుగా నుండుటయు, అంత యుత్సాహము లేని దినమున రుచింప కుండుటయు మీ రంద ఱెఱిగిన విషయమేకదా.

ప్రచండసంకల్పశక్తిచే ప్రపంచపరివర్తనములను గల్గించు మహాపురుషులు తమ ప్రాణశక్తి నొకానొక ఉన్నతస్పందనస్థితికి దెచ్చుటకు సమర్థులై యుందురు. క్షణములో నట్టి సంకల్ప మితరులను జేరుటకు సమర్థమైయుండుటచే వేలకొలది జనులు వారివైపున కాకర్షింపబడుటయేకాక ప్రపంచమునం దర్ధభాగము వా రెట్లు తలచిన నట్లు తలచుచుండును. ప్రపంచ మహాప్రవక్త లత్యద్భుతమగు ప్రాణవశీకరణము పడసియున్నారు. దానివలన వారి కద్వితీయమగు సంకల్పశక్తి లభించియున్నది. తమ ప్రాణశక్తి నత్యున్నతమగు స్పందనస్థితికి దెచ్చియుండుటచేతనే వారు ప్రపంచము నుఱ్ఱూతలూగింపగల్గియుండిరి. నానావిధములుగా వ్యక్తమగు శక్తియంతయు ప్రాణవశీకరణమువలననే కలుగుచున్నది. జను లీరహస్యమును గ్రహించినను గ్రహింపకున్నను శక్తి సామర్థ్యముల కిదియే కార

ణము. మన శరీరమునం దెక్కడెక్కడప్పుడు ప్రాణశక్తి యొకభాగమున కెక్కువగనో తక్కువగనో ప్రవహించుచుండుటచే శరీరమునందలి సామ్యస్థితి చెడుచుండును. సామ్యస్థితి చెడుటయే రోగ మనబడును. మఱియు అధికముగా నున్న ప్రాణమును తొలగించుటకాని ఆవశ్యకమగు ప్రాణమును సమకూర్చుటగాని రోగనివారణ మనబడును. ప్రాణాయామ మనునదియు నిదియే; ప్రాణశక్తి శరీరములో నొకభాగమునం దుండవలసినదానికంటె ఎక్కువగనో తక్కువగనో ఉండుటను గ్రహించుటయే ప్రాణాయామము. కాలి వ్రేలియందో, చేతి వ్రేలియందో అచ్చట నుండవలసినదానికంటె ప్రాణము తక్కువగా నున్నదని గ్రహించునంతటి సూక్ష్మావలోకనశక్తి మనసునకు గలుగుటయు, కావలసిన ప్రాణమును సమకూర్చుటకు దగిన సామర్థ్యము గల్గియుండుటయు ప్రాణాయామమువలన గలుగు కొన్ని ప్రయోజనములు. ఇట్టి సాధనలను క్రమముగా అభ్యసింపవలయును. ప్రాణశక్తిని వశపఱచుకొని, దానిని వివిధ మనస్స్థితులందు నడపుటయే రాజయోగమునకు ముఖ్యోద్దేశమని మనము గ్రహింపనగును. మనుష్యుడు తన శక్తుల నేకాగ్రస్థితికి దెచ్చిన యెడల శరీరమునందలి ప్రాణశక్తి యాతనికి వశమగును. ధ్యాన సమయమునందు ప్రాణమునే కేంద్రీకరించుచున్నాము.

సముద్రమునందు మహోత్తుంగతరంగములును, సామాన్య తరంగములును, అంతకంటె చిన్నవియు కడకు బుడగల పర్యంతమును అలలు కలవు. కాని వీని యన్నిటికిని అపారమగు సముద్రమే యాధారమైయున్నది. బుద్బుద మొకప్రక్క, మహోత్తుంగ తరంగము మఱియొక ప్రక్క, ఒకే సముద్రముతో సంబంధించియున్నవి. ఇట్లే యొకడు మహోన్నత శక్తిమంతుడై యుండవచ్చును; మఱియొకడు నీటిబుడగవలె అల్పుడై యుండవచ్చును. కాని వీ రిరువురును అనంత శక్తి సాగరమునకు సంబంధించినవారే. ఇట్టి యనంత శక్తిసాగరుడగు ఈశ్వరుని బొందుటకు ప్రతిజీవికిని 'హక్కు' కలదు. చైతన్యము ఎచ్చట ప్రకాశించుచున్నను అనంత శక్తినిలయము దానివెనుకనే

యున్నది. అత్యల్పమును, అతిసూక్ష్మమును నగు బుద్బుదమువంటి యే ప్రాణుడుగనో వెలువడి, ఆ యనంతశక్తినిలయము నుండియే జీవశక్తిని గ్రహించుచు నొకరూపము నెమ్మదిగా, నిలుకడగా మార్పుచెందుచు కాలక్రమమున నొక మొక్కయై, అనంతర మొక జంతువై, క్రమముగా నొక మనుష్యుడై, కాలాంతరమున భగవంతు డగుచున్నది. ఈ మహాకార్యము కొనసాగుటకు కోట్లకొలది యుగము లగుచున్నవి. కాని కాలమొక లెక్కలోనిది కాదు. త్వరిత గతియు, తీవ్రసాధనయు కాలపరిమాణమును తగ్గింపజేయును. చిర కాలము పట్టునట్టి కార్యమును కార్యదీక్షచే స్వల్పకాలముననే సాధింప వచ్చునని యోగులు వచింతురు. అపారమగు నీ విశ్వశక్తిని అత్య ల్పముగా నొకడు గ్రహించుచు వచ్చినయెడల దేవత్వమును బొందుట కాతనికి బహుశః లక్ష సంవత్సరములు కావలసి వచ్చును; ఇంద్రత్వ మును బొందుట కాతనికి ఐదులక్షల సంవత్సరములు పట్టవచ్చును; ఇక నఖండ పరిపూర్ణ సచ్చిదానందస్థితిని బొందుట కాతని కైదుకోట్ల యేండ్లు పట్టినను పట్టవచ్చును. తీవ్రాభివృద్ధి కల్గినయెడల కాలపరి మితి తగ్గును. ప్రబలమగు దీక్షతో సాధన చేసినయెడల ఆఱునెలలకే, లేక ఆఱేండ్లకే యిట్టి పరిపూర్ణస్థితి నేల పొందరాదు? విమర్శించి చూచినపక్షమున నిందుల కొకానొక కాలపరిమితి యనునది లేదని వెల్లడియగును. కొంత బొగ్గువలన నొక యంత్రము గంటకు రెండు మైళ్లదూరము పోవుచున్నయెడల, అంతకంటె నధికమగు బొగ్గువలన స్వల్పకాలముననే ఆదూర మెందుచే పోజాలదు? ఇట్లే తీవ్రసాధన నొనర్చినయెడల మానవున కీ జన్మమునందే పరిపూర్ణత యేల సిద్ధింప కుండును? ప్రతిజీవియు తుదకు ఆ పరమావధిని బొందునని మనకు తెలియును. కాని యుగ యుగముల పర్యంతము ఇందులకై నిరీ క్షించుకొని యుండుటకు సంసిద్ధు లెవ్వరు? ఇప్పుడే, ఈ జన్మముననే, ఆ పరమావధి నేల పొందరాదు? ఇప్పుడే ఆ యనంతజ్ఞానమును, ఆ యనంతశక్తిని నే నేల పొందరాదు?

మోక్షమార్గమునం దడుగులో నడుగువేయుచు, మందగమనము చేయుచు, మానవజాతికంతకును ముక్తి లభించునంతవఱకు వేచియుండుట కంటె, గ్రహణశక్తిని తీక్ష్ణముగా నొనర్చుకొని పరమార్థమును స్వల్పకాలముననే సాధించునట్టి విధానమును బోధించుటయే యోగులకును యోగశాస్త్రమునకును ప్రధానోద్దేశము. ప్రపంచమునందలి మహాప్రవక్తలును, మహాత్ములును, తత్త్వదర్శులును కావించిన మహాకార్యమేమి ? ఒకే జీవితకాలమునందు, వారు మానవకోటియొక్క ఆయుఃప్రమాణము నంతయు జీవించి సామాన్య మానవులు ముక్తులగుటకు వలయు కాలపరిమితినంతయు ముగించి యున్నారు, ఒకే జీవితకాలమునందు వారు పరిపూర్ణులగుదురు. మోక్షేచ్ఛకంటె మఱియొక చింత యనునది లేక, క్షణకాలమైనను ఇతర చింతలకై వ్యయింపకుండుటచే మోక్షము వారికి కరతలామలకమై యొప్పినది. ఏకాగ్రత యనగా నేమి ? గ్రహణశక్తిని తీక్ష్ణముగా నొనర్చి కార్యసాధనకు వలయు కాలపరిమితిని సంక్షేపించుటయే కదా. ఇట్టి చిత్తైకాగ్రతను బొందు విధానమును మనకు బోధించునట్టి శాస్త్రమే రాజయోగము.

ఇప్పుడు అధ్యాత్మవాదమునకును ప్రాణాయామమునకును గల సంబంధమునుగూర్చి విచారింతము. ప్రాణాయామము నందలి తత్త్వము నే అధ్యాత్మవాదము నిరూపించును. విగతజీవులుండుటయు, వానిని మనము చూడజాలకుండుటయు స్పృశింపజాలకుండుటయు, సత్యమైనయెడల మనచుట్టును అట్టిజీవులు వేలకొలదియు లక్షలకొలదియు నుండియుండవచ్చును. అసంభవ మనదగిన హేతువేదియు కాన్పింపదు. సదా మనము వాని శరీరముల మధ్య జొచ్చుకొనుచు వెలువడుచు సంచరించుచుండి యుండవచ్చును ; ఆ జీవులును మనలను జూడవు, స్పృశింపవు. ఇది యొక వలయములో నున్న వలయము ; విశ్వమునం దంతర్విశ్వము. పంచేంద్రియములను గల్గిన మనయందు ప్రాణ మొకానొక స్పందనస్థితిలో నున్నది. ఈ స్థితిలోనున్న

జీవులన్నియు నొకదాని నొకటి చూచుచున్నవి. కాని యింతకంటె ఉన్నత స్పందనస్థితిలోనున్న జీవులు వీనికి కానబడవు. మనమొక దీపకాంతిని, చూచుటకు శక్యముకాని యంతవఱకు వృద్ధిచేయుచు బోవచ్చును. ఐనను అట్టి తీక్ష్ణకాంతిని సహితము చూడగల్గిన జీవు లుండవచ్చును. మఱియు అత్యల్పముగా కాంతి నిచ్చు వెలుతురు మనకు గోచరింపకుండును. కాని పిల్లులు, గ్రుడ్లగూబలు మొదలగు నవి అట్టి కాంతిని జూడగల్గును. ఒకానొక పరిమితిగల ప్రాణస్పంద నములను మాత్రమే మనము కనుగొనగలము. ఉదాహరణమునకు వాతావరణమును దీసికొందము. వాతావరణము పొరలు పొరలుగా నేర్పడియున్నది. భూమికి దగ్గఱగా నుండు పొరలు పై భాగమున నుండు పొరలకంటె దట్టముగా నుండును. మీదికి పోయినకొలదియు వాతావరణము పలుచబడి పోవుచుండును. సముద్రముకూడ నిట్టిదే. లోతునకు పోయినకొలదియు నీటియొత్తిడి అధికమగుచుండును. అధో భాగమునందుండు జంతువు లెన్నడు ఉపరిభాగమునకు రాజాలవు; వచ్చినయెడల వెంటనే నశించును.

విశ్వ మాకాశసముద్ర మనియు ప్రాణవ్యాపారముచే నీ యాకాశమునందలి పొరలు వివిధస్పందనస్థితులలో నున్నవనియు భావింపుడు; అప్పుడు కేంద్రమునకు దూరముగా నుండు స్పందన ములు మందముగను, దగ్గఱగానుండునవి యొకదానికంటె మఱి యొకటి తీవ్రముగను నుండును; ఒకవిధమగు స్పందనము లోక మండలముగా నేర్పడును. అప్పుడు కొన్నికోట్ల మైళ్లవఱకును ఒక తరగతి స్పందనములు కలవనియు, మఱికొన్నికోట్ల మైళ్లవఱ కును అంతకంటె నున్నతమగు మఱియొక విధమగు స్పందనములు కలవనియు నిట్లు వివిధమండలములుగా విభజింపబడియున్న వనియు నూహింపుడు. ఇం దొక మండలములోనున్న జీవులు ఒకదానిని మఱియొకటి గుర్తింపగల్గినను మీది మండలములలో నుండు జీవులను గుర్తింపజాలకుండును. కాని, దూరదర్శక సూక్ష్మదర్శక యంత్ర

ములచే మన దృక్పరిమితి వృద్ధియగుచున్న రీతిని, యోగశక్తివలన మఱియొక మండలమునందలి స్పందనస్థితినిబొంది అచ్చట జరుగు సంఘటనములను కనుగొనవచ్చును. మనకు కానరాని జీవులతో నీ గది నిండియున్న దనుకొనుడు. అప్పుడు అవి యొక స్పందనస్థితి యందును, మన మింకొక స్పందనస్థితియందును నుందుము. వాని యొక్క స్పందనస్థితి సూక్ష్మమనియు మనయొక్క స్పందనస్థితి స్థూలమనియు భావింపుడు. ఆ జీవులును మనమును ఒకే ప్రాణతత్త్వ ముచే నిర్మింపబడియుంటిమి. ఎల్లరును ఒకే ప్రాణసముద్రమునందలి భాగములు; స్పందనస్థితియందుమాత్రమే వానికిని మనకును భేదముకలదు. నేను సూక్ష్మమగు స్పందనస్థితిని పొందగల్గిన యెడల నాకీ మండలము కాగరాదు; నేనిక మిమ్ములను జూడజాల కుందును; అప్పుడు మీ రదృశ్యులై పైనజెప్పిన జీవులు కన బడును. ఇది యథార్థమని మీలో కొందఱు గ్రహించియుండ వచ్చును. మనస్సున కున్నత స్పందన స్థితిని గల్గించు విధానమంతయు యోగమునందు సమాధియను నొక్కమాటలో నిమిడియున్నది. ఈ యున్నతస్పందన స్థితులన్నియు, అతీంద్రియ జ్ఞానస్పందనము లన్నియు సమాధియను నీ యొక్కమాటలో నిమిడియున్నవి. సామాన్యమగు సమాధిస్థితులందు దివ్యదర్శనములు కలుగుచుండును. చరాచరప్రపంచమునందలి సమస్తజీవులును ఎందుండి నిర్మాణమగు చున్నవో, ఏ మూలకారణమును కనుగొనినంతనే సర్వమును జ్ఞాన గోచరమగుచున్నదో అట్టి సచ్చిదానందవస్తు సాక్షాత్కారమును గల్గించు సమాధియే అత్యున్నతమగు సమాధి.

కావున అధ్యాత్మవాదమునందలి సత్యాంశములన్నియు ప్రాణాయామమునం దిమిడియున్నవని గ్రహించియున్నాము. ఏ సమాజము కాని సంఘముకాని ఏదియో యొక రహస్యతత్త్వమును కనుగొనుటకై, మర్మమును గ్రహించుటకై యత్నించునప్పుడెల్ల. అచ్చట చేయబడుచున్న యత్నము యోగమే, ప్రాణవశీకరణమే.

అసాధారణమగు శక్తి యెచ్చట ప్రకటనమగుచున్నను ప్రాణశక్తియే అచ్చట వ్యక్తమగుచున్నది. భౌతిక విజ్ఞానశాస్త్రములనుగూడ ప్రాణాయామమున జేర్పవచ్చును. ఆవిరియంత్రము దేనివలన నడచుచున్నది? ఆవిరి యను ప్రాణశక్తివలననే. విద్యుచ్ఛక్తివంటి ప్రకృతి శక్తులన్నియు ప్రాణశక్తులే. భౌతిక విజ్ఞానశాస్త్ర మన నేమి? బాహ్యసాధనములవలన వ్యక్తమగు ప్రాణాయామ శాస్త్రమే. మానసిక శక్తిరూపమున వ్యక్తమగు ప్రాణమును మానసిక సాధనముల వలననే నిరోధింపనగును. భౌతికశక్తిరూపమున వ్యక్తమగు ప్రాణమును భౌతిక సాధనములవలన నిరోధించుటకు యత్నించునట్టి ప్రాణాయామ భాగమును భౌతిక విజ్ఞానశాస్త్రమనియు, మానసిక శక్తిరూపమున వ్యక్తమగు ప్రాణమును మానసిక సాధనలచే నిరోధింప యత్నించు ప్రాణాయామ భాగమును రాజయోగమనియు వ్యవహరించుచున్నాము.

---

## చతుర్థాధ్యాయము

# యౌగిక ప్రాణము

వెన్నెముకయందు 'ఇడ', 'పింగళ' యను రెండు నాడులు కలవని యోగులు తెలుపుచుందురు. వెన్నెముక పొడవునను బోలుగానుండు నొక కాలువయు కలదు. దీనిని యోగులు 'సుషుమ్న' యందురు. ఈ కాలువ క్రిందిచివరను 'కుండలినీ చక్రము' కలదు. ఈ చక్రము లేక కమలము త్రికోణాకారముగా నుండునట్లు వర్ణింపబడియున్నది. యోగపరిభాష ననుసరించి, దీనియందు 'కుండలినీ' యను శక్తి చుట్టచుట్టుకొనియున్నది. ఈ శక్తి మేల్కొని నంతనే సుషుమ్నా ద్వారమున ప్రవేశించి ఊర్ధ్వముఖముగా పోవుటకై యత్నించును. ఇట్లూర్ధ్వాభిముఖమై క్రమముగా

పైకి పోవునప్పుడు, మనస్సుయొక్క పొరలు ఒకదానివెంబడి నొకటిగా తొలగిపోయి యోగికి వివిధములగు దివ్య దర్శనములును, అద్భుత శక్తులును కలుగ నారంభించును. ఈ శక్తి మెదడును చేరుటతోడనే మనశ్శరీరములనుండి యోగి సంపూర్ణముగా విముక్తుడై ఆత్మ స్వాతంత్ర్యమును పొందును. వెన్నుపాము విచిత్రముగా నిర్మింపబడి యున్నదని మీకు తెలియును. ఎనిమిదంకెను అడ్డముగా వేసి చూచిన యెడల ( ∞ ) రెండుభాగములు మధ్యభాగమునం దతుకబడి యుండును. దీని నొకదానిపై నొకటిగా పేర్చిన పక్షమున వెన్ను పామును సూచించును. ఇం దెడమవైపునయుండునది 'ఇడానాడి', కుడివైపున నుండునది 'పింగళనాడి'. ఈ రెండుభాగములు కలిసి నప్పుడు మధ్యగా పోవుచున్న కాలువ సుషుమ్నయగును. వెన్ను పూసలు త్రికోణిక యనబడు కటిప్రదేశము నందంతమగుచున్నప్పుడు వీనినుండి సన్నని తంతు వొకటి క్రిందుగా బోవును. దీనియందుగూడ సుషుమ్నాద్వార మేర్పడియుండును. కాని యిది బహు సూక్ష్మము గానుండి క్రిందిచివరను మూయబడియుండును. ఇచ్చట నేర్పడియుండు తంతుసముదాయము త్రికోణాకృతి కలిగియుండునని శరీర శాస్త్రజ్ఞులు చెప్పెదరు. సుషుమ్నా ద్వారమునందు యోగులకు కానవచ్చునట్టి వివిధచక్రములు లేక కమలములు వెన్నెముకయం దాయాభాగ ములలో శరీర శాస్త్రజ్ఞులు చూపునట్టి నాడీకూటములకు సరిపడును.

మూలాధారము మొదలుకొని మెదడునందలి సహస్రారమను సహస్రదళ కమలము వఱకును వివిధములగు కేంద్రములు లేక కమల ములు కలవని యోగులు భావింతురు. పైన జెప్పబడిన వివిధములగు నాడీకూటములే యీ కమలములని మనము భావించిన యెడల నవీన శరీరశాస్త్రపరిభాషలో యోగులభావము మనకు సులభముగా బోధ పడును. ఈ నాడులందు రెండు విధములైన క్రియలు సాగుచున్నట్లు మనకు తెలియుచున్నది. ఈ నాడీవాహినులలో నొకటి అంతర్ముఖమై యున్నయెడల రెండవది బహిర్ముఖమై యుండును. ఒకటి జ్ఞాన

కారకమై యుండినయెడల రెండవది చలనకారకమై యుండును. ఒకటి కేంద్రాభిముఖమై యున్నపక్షమున రెండవది కేంద్రాపసారమై యుండును. ఒకటి బయటనుండి వార్తలు మెదడునకు గొనిపోవుచున్నది; రెండవది వార్తలు మెదడునుండి బయటికి గొనిపోవుచున్నది. నాడీస్పందనములన్నియు కడపట మెదడుతో సంబంధించి యున్నవి. రానున్న విషయములు మనకు సుబోధకముగా నుండుటకై యింకను మన మనేక విషయములను జ్ఞప్తిలో నుంచుకొనవలయును. మజ్జ యం దొకవిధమైన అండము మెదటితో జేరియుండక అందొక ద్రవపదార్థములో తేలుచుండును. తలపై దెబ్బ తగిలిన యెడల, దానివలన గలుగు తాకుడు ఈ ద్రవమునందు చెదరిపోవుటచే పైన జెప్పబడిన అండమున కెట్టి అపాయమును కలుగకుండును. వెన్నుపాము మెదడును జేరి యీ అండమునం దంతమగును. ముఖ్యముగా మన మీ యంశమును జ్ఞప్తిలో నుంచుకొనవలయును. మఱియు చక్రములన్నిటిలో మూలాధారమును, మెదడునందలి సహస్రారము లేక సహస్రదళ చక్రమును, నాభీదేశమునందలి మణిపురమును గమనింపదగినవి.

ఇక పదార్థ విజ్ఞానశాస్త్రమునుండి యొక విషయమును గమనింతము. విద్యుచ్ఛక్తినిగూర్చియు, తత్సంబంధములగు నితరశక్తులను గూర్చియు మీ రందఱును వినియున్నారుకదా. విద్యుచ్ఛక్తి యనగా నెట్టిదో యెవ్వరికిని సరిగా తెలియదు. ఐనను తెలిసినంతవఱ కిది యొక విధమైన చలనముగా నున్నది. ప్రపంచమున నితరములగు చలనము లనేకములు కలవు. విద్యుచ్ఛక్తికిని వీనికిని గల భేదమేమి? ఈ బల్ల కదలుచున్నదనుకొనుడు.—ఈ బల్లగా నేర్పడిన పరమాణువు లన్నివైపులకును గదలుచున్నవి. విద్యుచ్ఛక్తిచే వీనినన్నిటిని ఒకేవైపునకు గదల్పవచ్చును. ఏ వస్తువునందలి పరమాణువులనైనను విద్యుచ్చలనముచే ఒకేవైపునకు గదల్పవచ్చును. ఒక గది యందలి వాయుపరమాణువు లన్నియు ఒకేవైపునకు గదలునట్లు చేసినయెడల ఆ గది యొక బ్రహ్మాండమైన విద్యుద్యంత్రమగును.

శరీరశాస్త్రమునుండి మఱియొక విషయమును మనము గమనింప వలయును: శ్వాసకోశమును నడపునట్టి కేంద్రమునకు నాడీకోశ మొకవిధముగా అధీనమై పనిచేయుచుండును.

ఇక శ్వాసనియమనము నభ్యసించుటకు గల కారణములను పరిశీలింతము. మున్ముందు మనము గ్రహింపవలసిన విషయమొకటి కలదు: క్రమగతి ననుసరించి శ్వాసించుటవలన శరీరమునందలి పరమాణువులన్నియు నొకేవైపునకు గదలుట కుద్యుక్తములై యుండును. మనస్సు సంకల్పముగా పరిణమించినప్పుడు నాడీవాహినులు విద్యుచ్ఛక్తివంటి చలనములోనికి మార్పు చెందును. ఏలయన విద్యుత్ప్రసారములను నాడులపై బఱపినయెడల నాడులు భ్రమణాభిముఖత్వమును జూపునని శాస్త్రజ్ఞులు నిర్ణయించియున్నారు. సంకల్పము నాడీప్రవాహరూపమును దాల్చునప్పుడు విద్యుచ్ఛక్తివంటి యొకానొక శక్తిగా మాఱుచున్నదని దీనివలన వెల్లడియగుచున్నది. శరీరమునందలి చలనములన్నియు పూర్తిగా క్రమగతి ననుసరించి కలుగుచున్నయెడల శరీరము సంకల్పమునునట్టి బ్రహ్మాండమగు విద్యుద్యంత్రమగునని చెప్పనొప్పును. యోగి పడయగోరున దిట్టి మహా సంకల్పశక్తియే. కావున శరీరశాస్త్రదృష్టితో జూచినను శ్వాసనియమము నభ్యసించు టెట్టి యవసరమో తెలియుచున్నది. శరీరమునం దీ శ్వాసనియమనము క్రమగతి కల్గించుట కనుకూలించుటచే, శ్వాసకోశముమూలమున తదితరకోశములను వశపఱచుకొనుటకు శ్వాసనియమనము మనకు తోడ్పడును. మూలాధారమునందు అణగి యుండు కుండలినీశక్తిని మేల్కొల్పుటయే ఇందు ప్రాణాయామము వలన గలుగు ప్రయోజనము.

మనము దేనిని జూచినను, దేనినిగూర్చి భావించినను, కల గనినను, ఆయా అనుభవములను ఒకానొకస్థలముననే కాని పొంద జాలము. ఈ సామాన్యస్థలము లేక దేశమునే మహాకాశమనియు భౌతికదేశమనియు చెప్పుదురు. యోగులు ఇతరుల తలపులను కల

రూపున కనుగొనునప్పుడుగాని, అతీంద్రియవిషయములను దర్శించు నప్పుడుగాని, అట్టి యనుభవములను మానసిక దేశమగు చిత్తాకాశ మను మఱియొక విధమైన దేశమునందు పొందుదురు. నిర్విషయజ్ఞాన ముచే స్వయంజ్యోతియై ఆత్మ ప్రకాశించునప్పుడు అట్టి దేశము చిదాకాశము లేక జ్ఞానదేశమని చెప్పబడును. కుండలిని మేల్కొని సుషుమ్నానాడియందు ప్రవేశించునప్పుడు కలుగునట్టి యనుభవము లన్నియు చిత్తాకాశ మందలివై యుండును. మెదడులోనికి బోవు నట్టి సుషుమ్నా నాడియొక్క తుదిభాగమును కుండలినీశక్తి చేరుట తోడనే నిర్విషయజ్ఞానము కలుగును. ఇట్టి నిర్విషయజ్ఞానానుభవము చిదాకాశము నందలిదై యుండును. ప్రకృతిని విద్యుచ్ఛక్తితో బోల్చి చూచినయెడల మనుష్యుడు తంతిమూలమున మాత్రమే విద్యుత్ప్రవాహమును బంపగల్గుచున్నాడనియు, ప్రకృతి యిట్లుగాక తన మహాశక్తివాహినులను ఒకచోటనుండి మఱియొకచోటికి బంపుట కట్టి తంతులను అపేక్షించుటలేదనియు విదిత మగును. అందుచేత తంతియనునది నిజముగా నిందులకనావశ్యకమనియు, మన మస మర్థుల మగుటచే తంతి నుపయోగింపవలసి వచ్చుచున్న దనియు స్పష్టమగుచున్నది. *

ఇట్లే శరీరమునందు గలుగు నింద్రియానుభవములును చలన ములును నాడీతంతువు లనునట్టి తంత్రుల మూలమున మెదడులోని కిని మెదడునుండి బయటికిని పంపబడుచున్నవి. వెన్నుపామునందలి యీ తంతుజాలమునందుండు జ్ఞానకారకమగు తంతులను ఇడానాడి యనియు చలనకారకమగుతంతులను పింగళా నాడియనియు యోగులు వచింతురు. మెదడునకు వార్తలను దీసికొని పోవునట్టి కేంద్రాభిముఖవాహినులును, మెదడునుండి వార్తలను బయటికి దెచ్చునట్టి కేంద్రాపసారవాహినులును ముఖ్యముగా ఈ నాడీ

* తంతిలేకయే 'తంతివార్తల'ను బంపునట్టి (వైర్‌లెస్ టెలిగ్రాఫీ) విద్యను కనుగొనుటకుపూర్వమే యీ విషయము చెప్పబడియున్నదని పాఠకులు గమనింతురు గాక.

మార్గములందే ప్రవహించుచుండును. కాని యీ తంత్రీసాహాయ్యము లేకయే వార్తలను బంపుటగాని, గ్రహించుటగాని మనస్సున కేల సాధ్యము కానేరదు? ప్రకృతియం దిట్లు జరుగుచున్నది. ఈ కార్యమును సాధింపగల్గిన యెడల ప్రకృతికి మీరు దాస్యము చేయుటక్కఱ లేదని యోగులు చెప్పుచున్నారు. ఇది చేయుట ఎట్లు? సుషుమ్నా నాడీమార్గమున సంకల్పప్రవాహమును బంపగల్గిన యెడల మీరు దీనిని స్యను పరిష్కరింపగలరు. మనస్సే నాడీకోశమును నీ తంతుజాలమును నిర్మాణము చేసికొనియున్నది; తంత్రులమూలమున వర్తింప నక్కఱ లేకుండుటకై మనస్సే యీ తంతుజాలమును భేదింపవలసియున్నది. ఈ కార్యమును సాధించినంతనే సమస్తజ్ఞానము మన వశమగును; శరీరమున కిక నెంతమాత్రమును దాస్యము చేయనక్కఱ లేదు. కావున సుషుమ్నానాడిని వశపఱచుకొను టావశ్యకము. నాడీ తంతువు లేవియు తంత్రులుగ నుండవలసిన నిమిత్తము లేకయే సంకల్ప ప్రవాహమును మనము సుషుమ్నానాడీమూలమున బంపగల్గిన యెడల మన సమస్య తీరుననియు, మన మీ కార్యమును సాధింపగలమనియు యోగులు చెప్పుచున్నారు.

సామాన్యజనులందీ సుషుమ్నయొక్క క్రిందికొన మూసికొనియుండును; ఆ స్థితియందది క్రియారహితమై యుండును. ఈ కొనను తెఱచి నాడీప్రవాహములను సుషుమ్నాద్వారమున బంపుటకై యోగు లొక సాధనవిధానమును బ్రతిపాదించుచున్నారు. ఏ వార్తయైనను నాడీకేంద్రమునకు గొనిపోబడినప్పుడా కేంద్రమునందు ప్రతిక్రియ గలుగును. స్వతశ్చలన కేంద్రములలో ప్రతిక్రియ గల్గినతోడనే చలనము కలుగును. జ్ఞాన కేంద్రములందీ ప్రతిక్రియ ననుసరించి మొదట విషయజ్ఞానమును అనంతరము చలనమును గలుగును. మనకు గలుగునట్టి జ్ఞానమంతయు బాహ్య ప్రపంచమునుండి కలుగు క్రియకు ప్రతిక్రియయై యున్నది. ఇక స్వప్నములందు విషయజ్ఞాన మెట్లు కలుగుచున్నదందురా? అచ్చట బాహ్యప్రపంచవ్యాపార మేదియు లోనికి ప్రవేశింపకున్నను

జ్ఞానేంద్రియవ్యాపారము లెక్కడనో అణగిమణగి యుండును. నే నొక నగరమును చూచుచున్నాననుకొనుడు. ఆ నగరమునకు చెందిన బాహ్యవిషయములవలన గలుగునట్టి స్పర్శల కనుగుణమగు ప్రతిక్రియ నా మనస్సున గల్గినంతనే ఆ నగరము నాకు గోచరించుచున్నది. అనగా మెదడునకు వార్తలను గొనిపోవునట్టి నాడులకు నగరమునందలి బాహ్యవిషయముల చే చలనము కలుగుననియు, వీని చలనమువలన మెదడునందలి పరమాణువుల కొకవిధమగు చలన మేర్పడుననియు నిందలిభావము. ఇక చాలకాలమైన తరువాతకూడ ఆ నగరమును నేను జ్ఞప్తికి దెచ్చుకొనగలను. పైనజెప్పిన విధమున నే ఈ స్మృతి కలుగుచున్నను, ప్రత్యక్షసందర్శనముకంటె స్మృతి వలన గలుగు ననుభవము మందముగా నుండును. ఐనను ప్రత్యక్ష దర్శనమునందు గలుగు స్పందనములవంటివే మెదడునం దెట్లు గలుగుచున్నవి? ప్రత్యక్షానుభవమునుండి కాదుకదా. కావున నివి యెచ్చటనో అణగియుండుననియు వానివలన స్వప్నప్రతీతి యను మందమగు ప్రతిక్రియ కలుగుచున్నదనియు నూహింపవలసియున్నది. ఇట్లు శేషించియుండు స్పర్శలన్నియు మూలాధారమను కేంద్రము నందు కూడబెట్టబడియుండునని చెప్పవచ్చును. అందణగియుండు కార్యశక్తియే కుండలిని యని చెప్పబడుచున్నది. 'కుండలిని' యనగా చుట్టుకొనియున్నదని యర్థము. ఏకాగ్రతతో గ్రంథపఠనము నొనర్చినప్పుడుగాని, తీవ్రముగా దేనినిగూర్చియైనను యోచన చేసినప్పుడుగాని మూలాధారప్రాంత శరీరభాగమునకు వేడిమి కలుగుచున్నది. కావున శరీరమునందు శేషించియుండు చలనశక్తియు ఈ మూలాధార కేంద్రమునందే కూడియుండు ననుటకు ప్రబలమగు హేతువు కలదు. కుండలినీశక్తిని మేల్కొల్పి, ప్రాణవంత మొనర్చి, సుషుమ్నానాడిలో ఊర్ధ్వముఖముగా చరించునట్లు చేసిన యెడల ఈ శక్తి యొక చక్రమునకు తరువాత మఱియొక చక్రముపై తన ప్రభావమును జూపునప్పు డత్యద్భుతమగు ప్రతిక్రియ కలుగును.

కుండలినీశక్తియందొక సూక్ష్మాంశము నాడీతంతువునుండి పోవునప్పుడు ఆ యా కేంద్రస్థానములు ప్రతిక్రియ నొనర్చుటచే మనకు స్వప్నము గాని మనఃకల్పనగాని కలుగును. కాని బహుకాలము ధ్యానించుటచే లభించు బలముచే ఈ శక్తి సంచయమంతయు సుషుమ్నా ద్వారమున ఊర్ధ్వముఖముగా బోవుచు ఆ యా కేంద్రస్థానములను తాకునప్పుడు స్వప్నాదులకంటె మహత్తరమగు ప్రతిక్రియ కలుగును. అదియే అతీంద్రియజ్ఞానము. ఇంద్రియానుభవములకు కేంద్రస్థానమగు మెదడును ఈ కుండలినీశక్తి చేరుటతోడనే మెదడు, కాదు - మెదడంతయు ప్రతిక్రియ నొనర్చుటచే పూర్ణచైతన్యప్రకాశ మనదగు ఆత్మసాక్షాత్కారము లభించును. కుండలినీశక్తి యొక చక్రమునుండి మఱియొక చక్రమునకు ఊర్ధ్వముఖముగా బోవునప్పుడు మనస్సుయొక్క పొరలు ఒక దాని వెంబడి నొకటిగా తొలగిపోవును; అంతట యోగులు విశ్వముయొక్క సూక్ష్మరూపమును లేక కారణరూపమును దర్శింతురు; శబ్దాదివిషయములందును, ఇంద్రియానుభవములందును, వ్యక్తమగు జగత్కారణములను, ప్రత్యక్షముగా జూతురు. జగత్కారణములను గ్రహించినంతనే, కార్యముల జ్ఞానము తప్పక కలిగితీఱును.

ఇట్లు అతీంద్రియజ్ఞానమును, ఆత్మసాక్షాత్కారమును, దివ్యజ్ఞానమును బడయుటకై కుండలినీయుద్బోధన మొక్కటియే మార్గము. తాత్త్వికుని విశ్లేషణసామర్థ్యమువలనగాని ఈశ్వరప్రేమచేగాని, సిద్ధులైనవారి యనుగ్రహమువలనగాని, నిత్యానిత్యవస్తువివేచనా సామర్థ్యమువలనగాని బహువిధములుగా కుండలినీశక్తి మేల్కొనవచ్చును. ప్రకృత్యతీతమనియు, అలౌకికమనియు జెప్పబడు శక్తిజ్ఞానము ఎచ్చట వ్యక్తమగుచుండునో అచ్చట కుండలినీశక్తి కొలదిగ సుషుమ్నా ద్వారమునందు ప్రవేశించియున్నదని యూహింపవలయును. సాధారణముగా నిట్టిసందర్భము లనేకములందు, కుండలినీశక్తియందొక లవలేశమును మేల్కొల్పునట్టి సాధన

నేదియో యొకదానిని తమకు తెలియకయే జను లవలంబించు చుందురు. ఎఱుకతో నొనర్చినను, ఎఱుక లేకయే యొనర్చినను, ఉపాసనలవలన కలుగు ఫలము ఇదియే. తన ప్రార్థన లెవ్వరివలననో సఫల మగుచున్నవని భావించువా డట్టి సిద్ధి తనయందుండియే గల్గుచున్నదని యెఱుగడు; తనయందే యణగియున్న యీ యనంత శక్తియం దొకలేశమును ప్రార్థనాపూర్వకమగు మనఃప్రవృత్తిచే తాను మేల్కొల్పగల్గితినని గ్రహింపకున్నాడు. కుండలినీశక్తి ప్రతి జీవియందును అణగియున్నది. తదనుగ్రహమును బొందు మార్గమును గ్రహించిన మాత్రమున మనకు శాశ్వతానందమును జేకూర్చును. జను లజ్ఞానముచే భయభ్రాంతులకు లోనై యనేక నామములతో నర్చించుచుండునట్టి దీ కుండలినీశక్తియే యని యోగులు చాటుచున్నారు. మఱియు సమస్తమైన ఉపాసనలకును, ప్రార్థనలకును, శాస్త్రవిధులకును, క్రియాకలాపములకును ఆధారభూతమగు మూల తత్త్వమును నిరూపించునట్టి మతతత్త్వ శాస్త్రమే రాజయోగము.

## పంచమాధ్యాయము

## యౌగిక ప్రాణనిరోధము

లేక

# ప్రాణాయామము

ప్రాణాయామము నందలి సాధనలను గూర్చి మన మిక చర్చింపవలసియున్నది. యోగుల ననుసరించి ఊపిరితిత్తుల చలనమును నిరోధించుట యోగమునకు ప్రథమ సోపానమని మనము గ్రహించి యున్నాము. శరీరాంతర్గతమగు సూక్ష్మచలనములను మనము కనుగొనవలసియున్నది. మన చిత్తము బహిర్ముఖమై బాహ్యవిషయములందు సంచరించుచు అంతర్గతమగు సూక్ష్మచలనములను గమనింప

కున్నది. వీనిని కనుగొనినంతనే మనకివి స్వాధీనమగుట కారంభించును. నాడీవాహినులు శరీరము నందంతటను సంచరించుచు ప్రతి కండరమునకును జవసత్వములను గలుగజేయుచున్నను తదనుభవము మనకు గలుగుట లేదు. ఐనను యోగసాధనముచే నిట్టి యనుభవమును బొందనగునని యోగులు వచించెదరు; దీర్ఘకాలము ప్రాణాయామము నభ్యసించుటచే సూక్ష్మనాళములను వశపఱచుకొనగలము.

ఇక ప్రాణాయామమునందలి సాధనలనుగూర్చి విచారింతము. శరీరమును నిక్కించి సమముగా కూర్చుండుట ప్రథమ విధి. వెన్నుపాము వెన్నెముక నంటియుండకపోయినను దానిలోపల నున్నది. వంకరగా కూర్చొనిన యెడల వెన్నుపాముయొక్క స్థితి చెడును; అందుచే దానిని సమముగా నుంచవలయును. వంకరగా కూర్చొని ధ్యానించుటకు మీరు యత్నించినపుడెల్ల మీ కది హానికరమగుచున్నది. శరీరమునందలి ఱొమ్ము, మెడ, తల యను నీ మూడు భాగములను నిక్కించి సదా నిలువుగా నుంచవలయును. ఇట్లు కొలదికాలము ఆసనము నభ్యసించినంతనే శ్వాసించు టెంత సులభమో అంతసులభముగా నీ స్థితి మీ కలవడును. నాడులను స్వాధీనము గావించుకొనుట రెండవవిషయము. శ్వాసకోశమును నియమించు నాడీకేంద్రమునకు ఇతరనాడులు లోకవిధముగా అధీనమై పనిచేయుచుండుననియు, అందుచే శ్వాసనియమన మభ్యసించుటావశ్యకమనియు చెప్పియున్నాము. ఊపిరి పీల్చునప్పుడును విడుచునప్పుడును సాధారణముగా మన మొక నియమము ననుసరించుచున్నామని చెప్పుటకు వలనుపడదు. మఱియు స్త్రీలకును పురుషులకును ఉచ్ఛ్వాస నిశ్వాసములలో స్వతస్సిద్ధమైన కొన్ని భేదములు కలవు

ఒకానొక పరిమితి ననుసరించి ఊపిరి పీల్చుచు విడుచుచుండుటయే ప్రాణాయామములోని ప్రథమసాధన. దీనివలన శరీరము

నందు క్రమగతి యేర్పడును. కొంతకాల మిట్లు సాధన చేసినతరువాత. ఉచ్ఛ్వాసనిశ్వాసములతో 'ఓమ్' అను మంత్రమునుగాని, మఱి యే యితరమంత్రమునుగాని చేర్చుట మంచిది. ఒకటి, రెండు, మూడు, నాలుగు అని లెక్కించుటకు మాఱు హిందూదేశమునందు మేము కొన్ని సాంకేతికపదముల నుపయోగించుచుందుము. పవిత్రమగు నిట్టి శబ్దములను ప్రాణాయామముతో జేర్చి మానసికముగా నుచ్చరించుట మంచిదని మీకు నేను చెప్పుచుండుట కిదియే కారణము. ఇట్టి మంత్రోచ్చారణమును శ్వాసముతో జేర్చి, నియమానుసారముగా క్రమగతిలో ఊపిరిపీల్చుచు విడుచుచుండవలయును. ఇట్లు చేయుచున్నయెడల శరీరమునందంతటను క్రమగతి కలుగ నారంభించును. అప్పుడు విశ్రాంతి యనగా నెట్టిదో మీకు తెలియును. ఇట్టి విశ్రాంతితో పోల్చి చూచినయెడల నిద్రయనునది విశ్రాంతిగా తోపదు. ఒక్కసారి ఇట్టి విశ్రాంతి పడయగల్గినయెడల ఎంత బడలియున్న నాడులైనను ఉపశమనము పొందును; అంతకు ముం దెన్నడును నిజమైన విశ్రాంతి యనునది పొందియుండలేదని మీకు తోచును.

ఈ యభ్యాసముయొక్క ప్రథమఫలితము సాధకుని ముఖవైఖరియందు గలుగు మార్పు; మొగమున మోటుదన మదృశ్యమగును; ముఖమున ప్రశాంతి ద్యోతమగును. తరువాత కోమలమైన కంఠస్వరము కలుగును. అశ్రావ్యమగు కంఠధ్వని గల్గిన యోగిని నే నెన్నడును జూచియుండలేదు. కొన్ని నెలలవఱకును యోగము నభ్యసించినతరువాత నీ లక్షణములు కానవచ్చును. పైనజెప్పినవిధమున శ్వాసనియమనమును కొన్ని దినములవఱ కభ్యసించిన పిమ్మట, అంతకంటె ఉన్నతమగు మఱియొక సాధన నవలంబింపవలయును. 'ఇడానాడీ' మార్గమున, అనగా ఎడమవైపున నుండు ముక్కుపుటము మూలమున, ఊపిరిపీల్చుచు మనస్సు నా నాడిపై నేకాగ్రము చేసి నెమ్మదిగా ఊపిరితిత్తులను శ్వాసముతో నింపింపవలయును. దీనివలన మీరు నాడీప్రవాహమును వెన్ను

హాము క్రిందిభాగమునకు బంపి త్రికోణాకృతి గలిగినదియు, కుండలినీ స్థానమును నైన మూలాధారచక్రమును నాడీకూటమునకు ప్రబల సంఘర్షము గల్గించుచున్నారని చెప్పవచ్చును. తరువాత కొంత సేపటివఱకును నాడీవాహిని నచ్చట నిలుపవలయును. 'పింగళా నాడి' ద్వారా శ్వాసతోగూడ ఈ నాడీప్రవాహమును మెల్లగా లాగుకొనుచున్నామని భావించి, అనంతరము నెమ్మదిగా కుడిముక్కు-రంధ్రమున శ్వాసమును విడువవలయును. ఈ సాధన కొంచెము కష్టసాధ్యముగా నున్నట్లుతోచును. ఇందుల కతిసులభమగు మార్గమును చెప్పెదను: కుడిముక్కును బొటనవ్రేలితో మూసి యెడమ ముక్కు ద్వారమున మెల్లగా శ్వాసమును లోనికి బీల్చుము; అనంతరము బొటనవ్రేలితోడను, తర్జని లేక చూపుడువ్రేలితోడను రెండు ముక్కు పుటములను మూసి, నాడీప్రవాహమును క్రిందికి బంపుచున్నామనియు దానిచే సుషుమ్నయొక్క అడుగుభాగమును తట్టుచున్నామనియు భావింపుము; అపుడు బొటనవ్రేలిని తీసివైచి, కుడి పుటమున శ్వాసమును విడువవలయును. అనంతరము ఎడమ ముక్కును తర్జనితో మూసి కుడిపుటమున శ్వాసమును పీల్చుకొనవలయును; తదుపరి పైనజెప్పినరీతినే రెండు ముక్కుపుటములను మూయుట మొదలైనవి పూర్తిచేయవలయును. హిందువులు చిన్ననాటినుండియు నిట్లభ్యసించుటచే వారి యూపిరితిత్తు లిందులకు దగియుండుటవలన హిందువు లనుసరించు పద్ధతి నవలంబించుట యీ దేశస్థులకు కష్టతరముగా నుండును. ఈ దేశమునందు పూరకమును నాలుగు క్షణములతో నారంభించి మెల్లగా వృద్ధిచేయుచు బోవుట మంచిది. నాలుగు క్షణములకాలము శ్వాసమును పీల్చి, పదునాఱు క్షణములకాలము శ్వాసమును నిలిపి, ఎనిమిది క్షణములలో విడువవలయును. ఇది యొక ప్రాణాయామ మగును. ఇట్లు ప్రాణాయామముచేయుచు త్రికోణాకృతిగల మూలాధారచక్రమును గూర్చి భావింపవలయును. ఇట్టి భావన మీకు చాలవఱకు సహాయకారిగా నుండును. తదుపరి చేయవలసిన మఱియొక సాధన: పైన జెప్పిన

సంఖ్యానియమమునే అవలంబించుచు శ్వాసమును మెల్లగా పీల్చుకొని, వెంటనే నెమ్మదిగా విడిచి స్తంభించియుండవలయును. మొదటిసారి శ్వాసము కుంభింపబడియుండగా రెండవసారి స్తంభింపబడియుండుటయే యిందలి భేదము ఇప్పుడు చెప్పబడిన ప్రాణాయామము పై దానికంటె సులువైనది. ఊపిరితిత్తులు గాలిచే నింపబడియుండు కుంభక ప్రాణాయామము నంతగా నభ్యసింపక ఉదయము నాల్గుసారులును, సాయంకాలము నాలుగుసారులును మాత్రమే అభ్యసింపవలయును. సామర్థ్యమును, ఉత్సాహమును గలుగుచున్న కొలదియు సంఖ్యాపరిమితిని కాలపరిమితిని క్రమముగా వృద్ధిచేయవచ్చును సమర్థులమని తోచినకొలదియు, అతి జాగరూకతతో నాలుగుసారులకు బదులుగా ఆఱుసార్లకు హెచ్చుచేయవచ్చును. ఇందు క్రమము తప్పినయెడల హానికరమగును.

నాడీశుద్ధికై పైన వివరింపబడియున్న యీ మూడుపద్ధతులందును మొదటిదియు, కడపటిదియు అంతగా కష్టసాధ్యములుగాని, హానికరములుగాని కానేరవు. మొదటిపద్ధతి ననుసరించి అభ్యసించిన కొలదియు మనఃప్రశాంతి గలుగుచుండును. కేవలము 'ఓంకారము'ను గూర్చి భావించిన జాలును; పనిచేయు కాలమున గూడ మీరు ఈ సాధన నభ్యసింపగలరు. ఓంకారభావన మీకు మఱింత తోడ్పడును. పూనికతో సాధన నభ్యసించినయెడల ఒకానొక దినమున కుండలినీశక్తి మేల్కొనును. దినమున కొకటి రెండు మాఱులు సాధనము చేయువారికి కొంచెము మనఃప్రశాంతియు, శరీరస్వస్థతయు, చక్కని కంఠస్వరమును మాత్రము లభించును. సాధన నింకను సాగించువారియందు మాత్రమే కుండలినీశక్తి మేల్కొనును; కుండలినీశక్తి మేల్కొంచినంతనే ప్రకృతియంతయు మాఱిపోవ నారంభించును; జ్ఞాననేత్ర మంతట వికసించును. జ్ఞానార్జనమునకు గ్రంథపఠన మిక ననావశ్యకము; మీ మనస్సే మీకు అనంతజ్ఞాననిలయమగు గ్రంథరాజమై యొప్పును. వెన్నెముక కిఱువైపులనున్న ఇడా పింగళ నాడులనుగూర్చియు వెన్నుపామునడుమ నేర్పడియున్న

సుషుమ్నానాడినిగూర్చియు నింతకుముందు చెప్పియుంటిమిక దా. ఈ నాడులు మూడును ప్రతి జంతువునందును గలవు; వెన్నెముక గల ప్రతి జంతువునందును ఈ మూడువిధములగు నాడీక్రియలుండును తావున్నది. కాని సామాన్య జనులం దీ సుషుమ్నా ద్వారము మూసికొని యుండుననియు, పని చేయుచున్నట్లు కానబడదనియు, ఇడాపింగళానాడులవలన శరీరము నందలి వివిధభాగములకు జవసత్వములు గలుగుచున్నవనియు యోగులు వచింతురు.

యోగులయందుమాత్రమే సుషుమ్న తెఱచుకొనియుండును. సుషుమ్నా ద్వారమును తెఱచుకొని కుండలినీశక్తి ఊర్ధ్వముఖముగా బోవుట కారంభించినంతనే, అవాఙ్మనస గోచరమగు అతీంద్రియ జ్ఞానము లభించుచున్నది. కావున సుషుమ్నా ద్వారమును తెఱచుటయే యోగుల ప్రధానోద్దేశము. యోగపరిభాషయందు చక్రములనియు కమలములనియు జెప్పబడు నాడీకేంద్రములు సుషుమ్నా ద్వారము పొడవునను వ్యాపించియున్నవని యోగులు చెప్పెదరు. అన్నిటికంటెను క్రిందనున్న కేంద్రము లేక చక్రము మూలాధారమనియు, దానికి పైనుండునది స్వాధిష్ఠానమనియు, మూడవది మణిపురమనియు, నాల్గవది అనాహతమనియు, ఐదవది విశుద్ధమనియు, ఆఱవది ఆజ్ఞయనియు, మెదడులోనున్న కడపటి చక్రము సహస్రారము లేక సహస్రదళ కమలమనియు చెప్పబడుచున్నవి. వీనియన్నిటిలో క్రిందనున్న మూలాధారమును గూర్చియు పైనున్న సహస్రారమునుగూర్చియు ప్రస్తుతము పరిశీలింతము. శక్తినంతయు మూలాధార కేంద్రమునుండి సహస్రారమునకు దీసికొని పోవలయును. ఓజశ్శక్తి మనుష్య శరీరమునందలి శక్తు లన్నిటియందును మహత్తరమైన శక్తియని యోగులు వర్ణింతురు. ఓజశ్శక్తి మెదడునందు సంగ్రహింపబడియున్నది. ఓజశ్శక్తి అధికముగా నున్న కొలదియు మనుష్యునకు విశేషమగు శక్తిసామర్థ్యములును, బుద్ధిబలమును, ఆధ్యాత్మికశక్తియు గలుగును. వృధ

మధురభాషయందు చక్కని భావముల నొకడు కుమ్మరించుచున్నను ఆతని భావములు జనుల చిత్తములందు హత్తుకొనక పోవచ్చును; మఱియొకడు సొగసైన భాషనుగాని, చక్కని భావములనుగాని వెల్లడింపకున్నను ఆతని వచనములు జనులను ముగ్ధులుగ నొనర్ప వచ్చును. ఆతని ప్రతిపాలనమును శక్తిమంతమైయుండును. ఇది యంతయు ఓజశ్శక్తియొక్క ప్రభావము.

ప్రతి మనుష్యునకును, అధికముగనో, అల్పముగనో ఇట్టి యోజశ్శక్తి కలదు. శరీరశక్తులన్నియు ఉత్తమోత్తమస్థితియందు ఓజశ్శక్తిగా మార్పుచెందును ఇట్టి పరిణామమే యిందలి ప్రధానవిషయమని మీరు గుర్తింతురుగాక. బాహ్యప్రపంచమున విద్యుచ్ఛక్తిగను ఆకర్షణశక్తిగను వ్యక్తమగు శక్తియే ఆంతరప్రపంచమున మానసిక శక్తిగా పరిణమించుచున్నది. కండరములశక్తిరూపమున వర్తించు శక్తులే ఓజశ్శక్తి యగుచున్నవి సంభోగేచ్ఛారూపమున వ్యక్తమగు కామశక్తి, నిరోధింపబడినచో, సులభముగా ఓజస్సులోనికి మారునని యోగులు వచింతురు. ఈ శక్తులన్నియు మూలాధారమున కధీనమై యుండుటచే యోగి మూలాధారకేంద్రమును ప్రత్యేకముగా రక్షించును. కామసంబంధమగు శక్తినంతయు సంగ్రహించి ఓజస్సులోనికి మార్చుట కాతడు యత్నించును. స్త్రీలు కానిండు, పురుషులు కానిండు,—పరిశుద్ధ వర్తనులు మాత్రమే ఓజశ్శక్తిని మేల్కొల్పి మెదడునందు కూడబెట్టుటకు సమర్థులగుచున్నారు. కావుననే బ్రహ్మచర్యమెల్లప్పుడును ఉత్తమోత్తమగుణముగా పరిగణింపబడియున్నది. బ్రహ్మచర్యమును కాపాడుకొనజాలని యెడల మన పారమార్థికత యంతయు భగ్నమగును; మనోబలము క్షీణించును; నైతిక దార్ఢ్యము మనలను విడనాడును. ఆధ్యాత్మిక మహిమాన్వితులైన లోకోత్తర చరిత్రులను ప్రభవింపజేసిన మత సంప్రదాయములన్నియు బ్రహ్మచర్యము నంతగా లక్షించుచుండుట కిదియే కారణము. వివాహము ఫలదని

సన్న్యాసులు వెలువడుట కిదియే హేతువు. మనోవాక్కాయ కర్మములచే సంపూర్ణబ్రహ్మచర్యము నవలంబింపనిదే రాజయోగాభ్యాసము హానికరమై, ఉన్మాదహేతువగును రాజయోగాభ్యాసము చేయుచు, అయోగ్యమగు జీవితమును గడపునట్టి జనులు, తాము యోగులు కాదలచినచో, అది యెట్లు పొసగును?

---

## షష్ఠాధ్యాయము

# ప్రత్యాహారము : ధారణ

అష్టాంగములలో ప్రాణాయామమునకు తరువాతి యంగము ప్రత్యాహార మనబడును. ప్రత్యాహార మనగా నేమి? ఇంద్రియానుభవము లెట్లు కలుగునదియు మీరు గ్రహించియున్నారు. బాహ్యేంద్రియముల వెనుక, మెదడులోని కేంద్రముల మూలమున పనిచేయునట్టి అంతరింద్రియములు, వాని వెనుక మనస్సును కలవు. ఇవియన్నియు నేదైన నొక బాహ్యవిషయముతో సంయోగమైన నంతనే ఆ విషయ మింద్రియగోచర మగుచున్నది. ఐనను చిత్తము నేకాగ్రముచేసి ఒకే యింద్రియముతో సంయోగము చేయుట కష్టసాధ్యము; స్వాతంత్ర్యరహితమగు మనచిత్తము బానిసవంటిదికదా.

"యోగ్యుడ వగుము; యోగ్యుడ వగుము; యోగ్యుడ వగుము" అని ప్రపంచమందంతటను బోధనలు వినవచ్చుచున్నవి. "దొంగిలింపవలదు; అసత్యమాడవలదు" అను హితోపదేశములను ప్రపంచమునందలి బిడ్డలందఱును పొందుచునేయున్నారు. ఇట్టి యుపదేశములు నిష్ప్రయోజనములు. దొంగిలింపరాదనుటకు హేతువేమి? దొంగిలింపకుండుట యనునది యెట్లు సాధ్యమగునో మనము బాలునకు జెప్పక "దొంగిలింపకు" మని మాత్రమే ఉపదేశించు

చుండును. బాహ్యాంతర వ్యాపారము లన్నియు మనస్సు ఇంద్రియములతో సంయోగమగుటచే గలుగుచున్నవి. ఇచ్ఛాపూర్వకముగా గాని, అనిచ్ఛాపూర్వకముగాగాని మనస్సు ఇంద్రియములచే ఆకర్షింపబడి వానితో సంయోగము పొందుచుండును; జనులు తెలివి మాలినపనులు చేయుచు దుఃఖించుచుండుట కిదియే కారణము. మనస్సు వారి కధీనమై యున్ననాడు వా రిట్లు వర్తింపరుకదా. మనోనిగ్రహమువలన గలుగుఫలమేమి? మనస్సు ఇంద్రియములతో సంయోగము పొందకుండుటచే కామరాగములు మన యధీనములై యుండును. ఇంతవఱకును స్పష్టముగా నున్నది. ఇక నిది సాధ్యమా యనిన, పరిపూర్ణముగా సాధ్యము. నేడీ విషయములు మనకు ప్రత్యక్షానుభవములై యున్నవి దుఃఖదోషము లనునవి లేవని నిరాకరింపవలయునని విశ్వాసచికిత్సకులు (ఫెయిత్ హీలర్స్) జనులకు బోధించుచున్నారు. వీరి తత్త్వము సూటిగా దెలుపకున్నను యోగమునం దిది యంతర్భాగమైయున్నది; కాకతాళీయముగ వీరికీ యోగవిధానము చేజిక్కియున్నది. బాధయనునది లేదని నమ్మించుటచే రోగి బాధను వీరు తొలగింపగల్గినపుడెల్ల, ఇంద్రియములను లక్ష్యపెట్టకుండునంతటి మనోబలమును రోగికి గల్గించుచుండుటచే నిజముగా వీరు ప్రత్యాహారము నందొక భాగమును వినియోగించుచున్నారు. ఇట్లే సమ్మోహనశాస్త్రవేత్తలు (హిప్నోటిస్ట్స్) తమ సూచనలచే నొకవిధమగు వికృత ప్రత్యాహారమును తాత్కాలికముగా రోగియందు దీపింపజేయుదురు. సమ్మోహనశాస్త్రజ్ఞుల సూచనలు దుర్బలమనస్కుల మీదనే పనిచేయగల్గును; మఱియు నిశ్చలదృష్టివలనగాని, సాధనాంతరముచేగాని వశ్యుని మనస్సును స్తంభింపజేసి ఒకవిధమగు వికృతస్థితికి దేగల్గిననేకాని వారి సూచనలు ప్రయోజనకరములు కానేరవు.

సమ్మోహనశాస్త్రజ్ఞుడుగాని విశ్వాసచికిత్సకుడుగాని రోగికి తాత్కాలికముగా గల్గించు ఇంద్రియనిగ్రహము, తుదకు హానికరమగుటచే గర్హింపదగియున్నది. ఈ విధానమువలన రోగి తన అంత

రింద్రియములను నిజముగా స్వసంకల్పశక్తిచే నిగ్రహింపక, ఆకస్మికముగా అన్యుని సంకల్పప్రాబల్యమునకు వశుడై మనస్సును స్తంభింపజేసికొనుచున్నాడు. ఇది, రివ్వురివ్వున పరిగెత్తు మేటి తురంగములను భుజబలముకొలదియు కళ్ళెములను లాగి నిలుపక, తాత్కాలికముగా వానిని ఆపుటకై పరులచే వాని తలలపై దెబ్బలుగొట్టించు పని వంటిది. ఇట్టి చికిత్సావిధానము లన్నిటియందును యథార్థమగు చిత్తవశీకరణశక్తి లభ్యమగుటకు మాఱు మనుష్యుని మనశ్శక్తులు చాల వఱకు క్షీణించును. వికృతమగు మనస్స్థితి సంప్రాప్తించును, తుదకునున్మత్త శరణాలయమే వానికి గమ్యస్థానమగుచుండును.

స్వాతంత్ర్యమును విడనాడి అన్యునిమూలమున మనోనిగ్రహమును బడయుటకు యత్నించు మనుష్యుడు హానికరమగుటయేగాక స్వకార్యవినాశహేతువగును. స్వాతంత్ర్యమే, సర్వాధిపత్యమే,—ప్రకృతిదాస్యవిమోచనమే, బాహ్యాంతరప్రకృతివశీకరణమే,—ప్రతి జీవికిని పరమావధియై యున్నది. ఇంద్రియములను అన్యుని సంకల్ప ప్రాబల్యమువలన నొకేసారిగ నిగ్రహించినను, [illegible] నొనర్చి నిగ్రహించినను, అట్టి అన్యసంకల్పము మన బంధవిముక్తికి తోడ్పడుటకు మాఱుగా, పూర్వసంస్కారములచే, మూఢవిశ్వాసములచే నిర్మితమైయున్న మన సంసార పాశములను మఱింత బిగువుము లగునట్లు చేయుచున్నది. కావున మీరు పరులకు వశులు కాకుండుటకై జాగరూకులై యుండుడు. ఎఱుఁగకయో ఒరులకు మీరు హానిచేయుచుందురు; కావున మెలకువ గలిగి వర్తింపుడు. వారి వారికి నూతన మనఃప్రవృత్తులను కల్పించి కొందఱనేకులకు మేలొన గూర్చుచుండుట నిజమే; ఐనను ఈ సమ్మోహనశాస్త్రవేత్తలలో పలువురు తెలియరాని తమ సూచనలచే కోట్లకొలది స్త్రీపురుషులకు నిర్జీవమును వికృతమునునైన సమ్మోహనస్థితిని గల్గించి తుదకు వారిని వట్టి మట్టిబొమ్మలుగా నొనర్చి నశింపజేయుచున్నారు. అంధప్రాయముగా నితరులు తన్ను విశ్వసింపవలయునని యెవ్వడు చెప్పినను,

ప్రబలమై, వశీకరణసమర్థమైన తన సంకల్పశక్తిచే జనుల నెవ్వడు తన వెనుకకు త్రిప్పుకొనుచున్నను, అనిచ్ఛాపూర్వకముగా ఆతడు మానవకోటికి హాని చేయుచున్నాడు.

కావున మనస్వాతంత్ర్యమును విడువకుడు. స్వయముగా మన శ్శరీరములను స్వాధీనము చేసికొనుడు. రోగగ్రస్తులు కానంతవఱకు మీపై నెట్టి బాహ్యసంకల్పమును పనిచేయజాలదని గుర్తింపుడు. అంధప్రాయముగా తన్ను విశ్వసింపవలయునని చెప్పువా డెంతటి మహనీయుడైనను, ఎంతటి యోగ్యుడైనను వాని మాటలను వినకుడు. గగ్గోలుచేయు సభలును, గంతులు వేయు సంఘములును, చిందులుత్రొక్కు సమాజములును ప్రపంచమందంతటను వెలసియున్నవి; నృత్యగీతములతో వీరు బోధించుటకు ప్రారంభించినంతనే అంటురోగమువలె వ్యాపించుచున్నారు. వీరును ఒకవిధమైన వశీకరణవేత్తలే. మెత్తనిమనసు గలవారిపై తాత్కాలికముగా వీరు తమ వశీకరణప్రాబల్యమును జూపుచుందురు; ఆహా! జనసంఘములను కాలక్రమమున వీరిట్లు తఱచు సమూలముగా నశింపజేయుచుందురు కదా. ఔను, చైతన్యవిరహితమైన మనస్స్థితిలో బాహ్యనిరోధముచే యోగ్యులుగా గానబడుటకంటె దుర్మార్గులైయుండుటయే వ్యక్తులకైనను, జాతులకైనను క్షేమకరము. పాపము, వీరు సదుద్దేశమునే గల్గియుండవచ్చును; కాని, బాధ్యతను గుర్తెఱుగని యిట్టి మతావేశపూరితులచే, మానవకోటికి గలిగిన హానిని గూర్చి తలచిన కడుపు తఱుగుకొనిపోవును. నృత్యగీతములతో గూడిన తమ బోధనలచే ఆకస్మికముగా ఆధ్యాత్మికోన్నతి కెగసిన జనులు తుదకు వట్టి మందబుద్ధులై, అశక్తులై స్తబ్ధులై పోవుచున్నారనియు, అందుచే మఱియొకప్పు డెంతటి దుష్ప్రేరణమునకైనను అనాయాసముగా వశముకాగలరనియు, పాపము, వీరు లేశమైనను గ్రహింపరు. అంతరిక్షములోనున్న యే దివ్యపురుషుడో మానవహృదయ పరివర్తనసమర్థమైన అద్భుతశక్తిని తమకు ప్రసాదించెనని తలచుచు, అట్టిశక్తి తమకు

లభించినందులకు తమ్ము తా మభినందించుకొనునట్టి ఈ మహాంధ మానవులు, ఈ భ్రాంతచిత్తులు, జనులకు తమవలన పతనమును, పాతకమును, ఉన్మాదమును, తుదకు మరణమును సంభవించు చుండునని స్వప్నమందైనను ఊహింపరుకదా? కావున మీ స్వాతంత్ర్యము నెవ్వరును హరింపకుండునట్లు అప్రమత్తులై యుండుడు. అస్వాతంత్ర్యము హానికరమని గ్రహింపుడు. మానసిక క్షోభను అట్టిహానిని నెట్టించి, సదా మీ స్వాతంత్ర్యమును కాపాడుకొనుడు.

సంకల్పించినంతనే మనస్సు నింద్రియములతో సంయోగమును చేయుటకుగాని, ఇంద్రియములనుండి ఉపసంహరించుకొనుటకుగాని సమర్థుడగువానికి ప్రత్యాహారము సిద్ధించుచున్నది. ప్రత్యాహార మనగా మనశ్శక్తుల సేకరించుటయనియును, మనస్సుయొక్క బాహ్యముఖములైన వ్యాపారముల నరికట్టుటయనియును, ఇంద్రియదాస్యము నుండి మనస్సునకు విమోచనము గల్గించుటయనియు భావము. ఇట్లు చేయగల్గిననాడే మనకు నిజమైన శీలమేర్పడుచున్నది; ఆనాడే స్వాతంత్ర్యము మనకు సన్నిహితమగుచున్నది. అంతవరకును మనము వట్టి నిర్జీవయంత్రములము.

మనోనిగ్రహ మెంత కష్టసాధ్యము! మతిచెడిన కోతికిని మనస్సునకును మంచి పోలిక గలదు. కోతులన్నిటివలెనే సహజముగా చంచలమైన దొకకోతి యుండెను. స్వాభావికమగు నిట్టి చాంచల్యము దానికి చాలదో యనునట్లు, ఎవ్వరో దానిచే యథేచ్ఛగా కల్లు త్రావించిరి. అందుచే దానికి చాంచల్యము హెచ్చెను. ఈ స్థితిలో దాని నొక తేలు కుట్టెను. మనలను తేలు కుట్టినప్పుడు ఆ దినమంతయు మనము గంతులు వేయుచుందుము గదా, పాప మాకోతి దురవస్థ యిక చెప్పవలయునా? ఈ గ్రహచారము చాలక దానికొకదయ్యము పట్టెను. ఇక దాని చాంచల్యస్థితినిగూర్చి మీరే యూహించుకొనుడు. మన మనస్సు ఆ కోతివంటిది. క్షణకాలమైనను నిలుకడ యనునది లేక సదా పరుగెత్తుచుండుట దీనిస్వభావము. ఇక

నిది విషయవాంఛ యను మద్యపానము చేసినంతనే దీని సంక్షోభము మఱింత వృద్ధియగుచున్నది. అనంతరము అసూయ అను తేలు కుట్టుచున్నది. తుదకు అహంభావము అను పిశాచము ఆవేశించి అందఱికంటెను తానే ప్రముఖుడనని మనుష్యుని గర్వింపజేయుచున్నది. ఇట్టి మనస్సును నిగ్రహించు టెంతటి కష్టసాధ్యమో తలంపుడు.

కొంతసేపు ఒకచోట కూర్చుండి మనస్సును యథేచ్ఛగా పరుగెత్తనిచ్చుటయే మనోనిగ్రహమునకు ప్రథమోపాయము. అట్లు కూర్చుండియున్నంతసేపును మనస్సు అటునిటు గంతులు వేయుచు, నిలుకడలేని కోతివలె, ఎగిరిపడుచుండును. ఈ మనోమర్కటమును శక్తికొలదియు నెగురనిచ్చి మీరు పరీక్షించుచుండుడు. 'జ్ఞానమే శక్తి' యను వచనము యథార్థము. మనోవ్యాపారము మీకు తెలియకుండునంతవఱకు మనస్సును నిగ్రహింపజాలరు. స్వేచ్ఛగా దానిని సంచరింపనిండు; వికృతాలోచన లనేకములు కలుగును; అట్టి తలపులు కలిగినందులకు మీ కాశ్చర్యమగును. కాని క్రమముగా, ఆనాటి కానాడు చాంచల్యము క్షీణించి మన శ్శాంతి పెంపొందుచుండును. మున్ముందు కొన్ని నెలలవఱకును మనోవృత్తులు అపరిమితముగా నున్నట్లు కాన్పించును. అనంతర మవి క్రమముగా క్షీణించిపోవుచుండును. తుదకు మనస్సు సంపూర్ణముగా వశమగును. కాని ప్రతిదినమును పూనికతో మనము సాధన చేయవలయును. ఓరిమి వహింపవలయును. ఆవిరి . విడువగనే యంత్రము నడుచుచున్న విధమున విషయము లెదుట బడుటతోడనే తప్పక మన కింద్రియగోచరము లగుచున్నవి. తా నిట్టి నిర్జీవమైన యంత్రమను కానని నిరూపించుటకై మానవుడు తన స్వాతంత్ర్యమును ప్రకటించుకొనవలయును. ఇట్టి మనోనిగ్రహమే, మనస్సు నింద్రియములతో సంయోగము కానీయకుండుటయే, ప్రత్యాహారమనబడును. ప్రత్యాహారమును సాధించుటెట్లు? మహత్తరమైన

యీకార్యము నొక్కసారిగా ఒక్కదినమున సాధింపజాలము. తాలిమి వహించి సంవత్సరములకొలదియు నిరంతరకృషి చేసినగాని ప్రత్యాహారము మనకు సిద్ధింపదు.

కొంతకాలము ప్రత్యాహారము నభ్యసించిన తరువాత ధారణ నవలంబింపవలయును. చిత్తము నొక లక్ష్యముపై నిలుపుటయే ధారణ యనబడును. శరీరము నందలి కొన్ని భాగములను దీసికొని, మిగిలినవానిని విడిచి, యాభాగములందే శరీరానుభవము కలిగి యుండునట్లు మనస్సును నిరోధింపవలయును. ఎట్లన, శరీరమునందలి తక్కినభాగముల నన్నిటిని విడిచి యొక్క చేతియందే స్పర్శానుభవమును గలిగియుండుటకు యత్నింపుము. ఇట్లు ఒకానొకస్థానమును నతిక్రమింపకుండునట్లు మనస్సును నియమించుటయే ధారణయని చెప్పనొప్పును. ధారణ బహువిధములుగా నుండును. ధారణకు తోడుగా భావనాశక్తిని కొంతవఱకు వినియోగించుట మేలు. ఎట్లన, హృదయమునం దొకస్థానమును గూర్చి భావించునట్లు మనస్సును నియమింపవలయును. ఇది కష్టసాధ్యము కావున అచ్చట నొక కమలము కలదని భావించుట యంతకంటె సులభమగు విధానము. దివ్యతేజోమయమైన యాకమలముపై మనస్సును నిలుపుము. లేదా, మెదడు నందలి సహస్రారకమలము తేజోమయమై యున్నట్లు భావింపుము. లేక సుషుమ్నామార్గము నందలి చక్రములను గూర్చి భావింపుము.

యోగి సర్వదా సాధన చేయుచుండవలయును. ఏకాంతముగా నుండుటకు యత్నింపవలయును; వివిధములగు నడవడులు గల జనులతో సహవాసము చేయుటవలన మనసు చెదరును. అమితముగా సంభాషింపరాదు; సంభాషణవలన మనసు చెదరును. అమితముగా పరిశ్రమ చేయరాదు; అమితపరిశ్రమవలన మనసు చెదరును; దినమంతయు కఠినపరిశ్రమ చేసినపిమ్మట మనస్సును నిగ్రహింపజాలము. ఈ నియమములను పాటించుటచే యోగము సిద్ధించును. ఏమాత్ర మభ్యసించినను యోగమువలన మహత్తరమగు మేలు

కలుగును. యోగ మంతటి మహిమాన్వితమైనది. ఎవ్వనికిని యోగమువలన హాని కలుగదు. యోగము సర్వజనులకును శ్రేయోదాయకము. మున్ముందు, నాడీదౌర్బల్యముచే గలుగు నుద్రేకము నణచి ప్రశాంతిదాయకమై యోగము పరిశీలనశక్తిని వృద్ధిపఱచును. మఱియు, గుణస్వభావములను చక్కజేయును ఆరోగ్యమును పెంపొందించును. చెక్కుచెదరని దార్ఢ్యమును, విన సొంపగు కంఠస్వరమును యోగసిద్ధికి ప్రథమలక్షణములై యొప్పును. కంఠస్వరము నందలి లోపములు తొలగుట మొదటిఫలితము. పూనికతో సాధించిన యెడల ఇతరలక్షణము లనేకములు కానబడును, ఒకప్పుడు ధ్వనులు వినవచ్చుచుండును; దూరమున నెచ్చటనో గణగణమను గంటల మ్రోత మేళవించి యేకస్వరముగా చెవిని బడుచుండును. కాంతిమంతములైన కణములు తేలియాడుచు, క్రమముగా పెద్దవగుచున్నట్లు, ఒక్కొక్కప్పుడు, కాన్పించుచుండును. ఇట్టి నిదర్శనములచే తీవ్రముగు నభివృద్ధి కలుగుచున్నదని గ్రహింపవలయును.

తీవ్రసాధన జేయగోరువారు మున్ముందాహారవిషయమున జాగరూకులై యుండవలయును. వ్యావహారికజీవనార్థమై కొంచెము యోగసాధన చేయగోరువారు యథేచ్ఛగా నేదియైనను తినవచ్చును, కాని మితిమీరి భుజించుటమాత్రము తగదు.

శీఘ్రముగా యోగమం దభివృద్ధి పొందగోరువారు తీవ్రసాధన చేయబూనువారును కఠినమగు నాహారనియమము నవలంబించుటత్యావశ్యకము. కొన్ని నెలలవఱకును పాలను కాయధాన్యములను మాత్రమే ఉపయోగించుచువచ్చిన, విశేషసాహాయ్యకారిగా నుండును. సూక్ష్మమగు శరీరస్థితి యేర్పడుచున్న కొలదియు, ప్రారంభమున ఆహారనియమము నేమాత్ర ముల్లంఘించినను శరీరస్థితియంతయు చెడును. పూర్ణనిగ్రహము కలుగనంతవఱకు ఒక్క ముద్ద యెక్కువయైనను, తక్కువయైనను శరీరస్థితియంతయు తాఱుమాఱగును. పూర్ణనిగ్రహము కలిగినపిమ్మట యోగి యథేచ్ఛగా

తినుటకు సమర్థమగును. చిత్తైకాగ్రతకలుగ నారంభించినంతనే సూది జారుటవలన కలిగిన శబ్దమును మెదడును బ్రద్దలుచేసికొని పోవుచున్న పిడుగువలె తోచుచుండును. ఇంద్రియములు సూక్ష్మస్థితిని బొందు చున్నకొలదియు ఇంద్రియానుభవములును సూక్ష్మము లగుచుండును. ఈస్థితులనన్నిటిని మనము దాటిపోవలయును. కార్యదీక్షతో సాధన చేయువారలకును యోగము సిద్ధించును, వాగ్వాదములను విసర్జింపుడు. మనసును కలవరపఱచు విషయములను దరికి రానీయకుడు. అర్థరహితములైన శుష్క-వాదములవలన నేమి ప్రయోజనము? వాగ్వాదములచే మనశ్శాంతి చెడును; చిత్తక్షోభము కలుగును. అనుభూతివలననే సూక్ష్మములగు నాధ్యాత్మిక విషయములను గ్రహింపగలము. మహత్తరమగు నీ కార్యము మాటలవలన సిద్ధించునా? కావున వ్యర్థసంభాషణలను విసర్జింపుడు. ఆత్మాను భవముగల మహనీయులు వ్రాసిన గ్రంథములను మాత్రమే పఠింపుడు.

సముద్రమునందలి ముత్తెపుజిప్పవలె వర్తింపుడు. స్వాతి వర్షమునం దొకబిందువు ముత్తెపుజిప్పలో బడుటతోడనే ముత్యమగు నని భారతదేశమునం దొక చక్కని పురాతనవిశ్వాసము కలదు. ముత్తెపుజిప్ప లీ సత్యమును గ్రహించి స్వాతినక్షత్రము ప్రకాశించు చున్నప్పుడు నీటిపైకివచ్చి అమూల్యమైన వర్షబిందువుకొఱకై యెదురుచూచుచుండును. చినుకొకటి పడుటతోడనే అవి తమచిప్పలను మూసికొని, మెల్లగా దానిని ముత్యముగా మార్చుటకై, నీటి యడుగునకు పోవును. మన మిట్టి ముత్తెపుజిప్పలవలె వర్తింపవలయును. మున్ముందు తత్త్వమును విని తరువాత మననము చేయుడు. తదుపరి మనసును కలవరపఱచునట్టి బాహ్యవిషయములను సంపూర్ణముగా విసర్జించి సత్యసందర్శనైకదీక్షను బూనుడు. నూతనసత్యముచే మోహితులమై మనమొక భావమును గైకొని, అంతకంటె నూతన మైన భావము కానవచ్చినంతనే పూర్వాభిప్రాయమును విడనాడుచు, క్రమముగా మన శక్తిసామర్థ్యములను వ్యర్థము చేసికొనకుందుము

గాక. ఒక భావమును జేపట్టి తుదముట్టునఱకును దాని ననుసరింపవలయును; అంతవఱకును దానిని విడువరాదు. ఒక భావమును గూర్చి ఉన్మత్తునిగాఁ గల్గినవానికిమాత్రమే వికాసము కలుగుచున్నది. కానవచ్చిన దానినెల్ల రుచిచూచుచుండువారి కెన్నఁడును ఆకలి తీరదు. చపలచిత్తులకు క్షణకాలము భావోద్రేకము గలిగి అంతటితో ఆ పొంగు చల్లారును; వారు ప్రకృతికి దాసులై ఇంద్రియముల నెన్నఁడును జయింపజాలరు.

నిజముగా యోగికానెంచువాఁ డొక్కమ్రాఁడిగా నిట్టి చాపల్యమును విసర్జింపవలయును. ఒకభావమును జేపట్టుము. దానిని నీ జీవితసమస్యగా జేసికొనుము. దానినిగూర్చి మననముచేయుము; కలగనుము. తన్మనస్కుఁడవై జీవింపుము. నీ మెదడును, కండరములును, నరములును, శరీరమందలి ప్రతిభాగమును ఆ భావముతో తన్మయత్వమును పొందవలయును. ఇదియే కార్యసిద్ధికి మార్గము. అలౌకికచరిత్రులైన ఆధ్యాత్మికమహిమాన్వితులను ప్రభవింపజేసిన దీ విధానమే. ఇతరులు వట్టి వాచాలురు. మనము ధన్యులమై యితరులను ధన్యులను జేయనెంచినయెడల పూనికతో సాధన నవలంబింపవలయును. మనసును కలవరపఱచుకొనకుండుటయు, కలవరపఱచునట్టి భావములు గలవారితో సంసర్గము లేకుండుటయు నిందులకు ప్రథమోపాయము. కొందఱు జనులను, కొన్ని స్థలములను, కొన్ని ఆహారపదార్థములను చూచినంతనే విముఖత గలుగుచుండుట మీరందఱెఱిగినదే కదా. అట్టివానిని విసర్జింపుఁడు. ఇక నుత్తమోత్తమస్థితిని బొందగోరువారు సత్సాంగత్యమునైనను దుస్సాంగత్యమునైనను సమస్తమైన సంసర్గమును పరిత్యజింపవలసినదే. తీవ్రమైన సాధన చేయుము; నీవు జీవించినను, మరణించినను సరియే. ఫలచింతను విడిచి కార్యనిమగ్నుడవు కావలయును. ధీరుఁడవైనయెడల ఆఱునెలలకే పూర్ణయోగివి కాఁగలవు. ఇతరవిషయములన్నిటితో బాటుగా రవంత యోగాభ్యాసము చేయువారి కెట్టి యభివృద్ధియు

కలుగదు. యోగసాధనను గూర్చి వరుసగా కొన్ని పాఠములను నేర్చినంతనే ప్రయోజనము లేదు. తమస్సునందు మునిగి, అజ్ఞానులై, స్తబ్ధులై, యెట్టిభావము నందును మనసు నిలువక, వేడుకకొఱకై యీ యోగసాధనను అవలంబింపగోరునట్టి వారికి మత వేదాంతములు కేవలము వినోదకరములుగా గానబడును. వీరు కార్యనిరతులు కారు. ఏ లోకప్రసంగమును విని, చాలబాగుగా నున్నదని యెంచుకొని, యింటికి పోయినతరువాత దానినిగూర్చి పూర్తిగా విస్మరింతురు. కార్యసిద్ధికి మీరు నిశ్చలమైన దీక్షను బూనవలయును; అద్వితీయమైన ప్రతిజ్ఞను దాల్పవలయును. కార్యతత్పరుడు "సముద్రము నొక్కుమ్మడి త్రాగివైచెదను. నేను సంకల్పించితినా, పర్వతములు కూలి పడి చూర్ణము కావలసినదే" యని పలుకును. ఇట్టి వీర్యోత్సాహవంతుడవై, ఇట్టి దృఢసంకల్పమును పూని తీవ్రసాధన చేయుము. తప్పక గమ్యస్థానమును చేరెదవు. పరమావధిని పడయుదువు.



## సప్తమాధ్యాయము

# ధ్యానము; సమాధి

రాజయోగమునందలి మొదటి ఆఱు అంగములనుగూర్చి స్థూలదృష్టితో విమర్శించియున్నాము. ఇక మిగిలినవి ఏకాగ్రతను బోధించునట్టి సూక్ష్మసాధనలు. ఏకాగ్రతయే రాజయోగమునకు పరమప్రయోజనము. ఆంతరంగికమైన జ్ఞానమును పురస్కరించుకొని చేతనశక్తి ననుసరించి, బాహ్యవస్తు వెట్టిదో ఎద్దియో గ్రహింతము. ఈ బల్లనుగూర్చియు నీయొక్క ఉనికినిగూర్చియు నాకుగల ఎఱుక వలన బల్లయు నీవును ఇచ్చట నున్నారని తెలిసికొనుచున్నాను. ఇది యిట్లుండగా నా ఉనికియందు విశేషభాగము నాకు తెలియదు

వరుసగా కొన్ని పాఠములను నేర్చి
మస్సునందు మునిగి, అజ్ఞానులై,
నసు నిలువక, వేసుకొనుక్కై ...
రునట్టివారికి సుత వేదాంతములు
డును. వీరు కార్యనిరతులు కారు.
బాగుగా నున్నదని (నుకొని).
గూర్చి పూర్తిగా విస్మరింతురు.
ను బూనవలయును ; అద్వితీయ
కార్యతత్పరుడు "సముద్రము
ను సంకల్పించితినా, పర్వతములు
యుని పలుకును. ఇట్టి కీర్త్యుత్సాహ
ప పూని తీవ్రసాధన చేయుము.
పరమావధిని పడయుదువు.

---

యము

## సమాధి

నటి ఆఱు అంగములనుగూర్చి
. ఇక మిగిలినవి ఏకాగ్రతను
కాగ్రతయే రాజయోగమునకు
న జ్ఞానమును పురస్కరించుకొని
వెట్టిదో ఎద్దియో గ్రహింతము.
నికినిగూర్చియు నాకుగల ఎఱుక
న్నారని తెలిసికొనుచున్నాను.
శేషభాగము నాకు తెలియదు



శరీరమునందలి వివిధములైన ఇంద్రియములను గూర్చియు, మెదడు నందలి వివిధ భాగములను గూర్చియు ఎవ్వరికిని ఎట్టి ఎఱుకయు లేదు.

నే నాహారమును తినునప్పుడు తత్కార్యము నొనర్చుచున్నానను ఎఱుక నాకు గలదు. జీర్ణము చేసికొనునప్పు డట్టియెఱుక నాకు లేదు. ఆహారము రక్తముగా మాఱునప్పుడును, రక్తమువలన శరీరమునందలి వివిధభాగములకు జవసత్త్వములు గలుగునప్పుడును నాయెఱుక లేకయే ఈ క్రియలన్నియు జరుగుచున్నవి. ఐనను ఈ వ్యాపారమంతయు చేయుచున్నవాడను నేనే. ఈ శరీర మొక్కదానిలో నిరువదిమంది మనుష్యులుండ నేరరుకదా. ఈ కార్యములను చేయుచున్నది నేనేయనియు మఱియొకరు కాదనియు నాకు తెలియుటెట్లు? తినుటయు, జీర్ణించుకొనుటయు నాపనియనియు, ఆహారమువలన శరీరమునకు పుష్టి కలిగించుట మఱియొక రెవ్వరో నాకొఱకు చేయుచున్న కార్యమనియు వాదింపవచ్చును. అది యసంభవము. మొత్తముమీద, ఇప్పుడు మన కెఱుకలేకయే జరుగుచున్న ప్రతివ్యాపారమును బోధపూర్వకమైన మనస్స్థితికి దీసికొనిరావచ్చునని ధ్రువపఱుపవచ్చును. మన స్వాధీనము లేకయే మనహృదయములు కొట్టుకొనుచున్నట్లు కనబడుచున్నది ; ఇక్కడ మనలో నెవ్వరును హృదయమును నిలుపుటకు సమర్థులు కారు. అది స్వతంత్రమైన మార్గము ననుసరించి పోవుచున్నది. నెమ్మదిగా గాని, వేగముగా గాని, సరిగా మన సంకల్పానుసారముగ హృదయము కొట్టుకొనునట్లు చేయవలెను, దరిదాపుగా దానిని నిలిపివేయు పర్యంతమును, హృదయమునుగూడ సాధనచే మన యధీనమునకు దీసికొని రావచ్చును. దాదాపుగా శరీరమందలి ప్రతి భాగమును మనము వశముచేసికొనవచ్చును. దీనివలన తెలియున దేమి? మన కెఱుకలేకయే జరుగుచున్న ఇంద్రియ వ్యాపారములు మనవలననే చేయబడుచున్నవనియు, అట్టి క్రియలను కేవలము ప్రజ్ఞావిరహితముగా నొనర్చుచున్నామనియు కదా మనము గ్రహింపవలెను. అనగా, మనమనస్సు రెండు క్షేత్రములలో పనిచేయుచున్నది. ఒకటి అహంపూర్వకమైన జ్ఞానక్షేత్రము. ఈ క్షేత్రమునందు చేయబడు

సకలవ్యాపారములందును 'నేను' అను వృత్తి కలుగుచుండును. ప్రజ్ఞా విరహితమగు రెండవక్షేత్రమునందు చేయబడు వ్యాపారము లన్నిటి యందును ఇట్టి అహంపూర్వకవృత్తి కలుగదు. ఇట్లు మనోవ్యాపారము 'నేను' అను వృత్తితోఁ గూడినదిగను, 'నేను' అను వృత్తి లేనిదిగను రెండువిధములుగా నున్నది. అధమ జంతువులలో ఈ రెండవవిధమగు మనోవ్యాపారము సహజజ్ఞానము (ఇన్‌స్టింక్ట్) అని చెప్పబడుచున్నది. ఉత్తమ జంతువులందును మనుష్యుని యందును బోధపూర్వకమైన మనోవ్యాపారము విశేషముగా వ్యక్తమగుచుండును.

ఇంతమాత్రమే కాదు. బోధపూర్వకస్థితికంటె నున్నతమైన మఱియొక స్థితి, మనోవ్యాపారమునకు కలదు. 'నేను' అను వృత్తితోఁ గూడిన జ్ఞానస్థితిని మనస్సు అతిక్రమింపగలదు. బోధపూర్వక మనోవ్యాపారము బోధరహిత మనోవ్యాపారముకంటె ఉన్నతమైయున్న విధముననే, బోధావస్థను మించిన మనస్స్థితి మఱియొకటి కలదు. ఇట్టి బోధాతీతావస్థయందును 'నేను' అను వృత్తి కలుగదు. ఈ మనస్స్థితులలో మధ్యనున్న బోధావస్థయందుమాత్రమే 'నేను' అను వృత్తి కలుగుచున్నది. పైనున్న బోధాతీతావస్థయందును, క్రిందనున్న బోధరహితావస్థయందును 'నేను' అను వృత్తి కలుగదు; ఐనను మనస్సు పనిచేయుచునేయున్నది. బోధావస్థను మనస్సు అతిక్రమించునప్పు డట్టి స్థితి సమాధియనియు, అతీంద్రియజ్ఞానమనియు జెప్పబడును. ఒకవేళ సమాధిమగ్నుడగు పురుషుడు బోధావస్థ నతిక్రమించుటకుమాఱు పతనముపొంది అంతకంటె తక్కువస్థితిలోనికి బోలేదని మన కెట్లు తెలియునని యడుగ నచ్చును. ఈ రెండవస్థల యందలి మనోవ్యాపారమునందును 'నేను' అనునట్టి వృత్తి కలుగకుండుట నిజము. కాని పర్యవసానమునుబట్టి, ఉచ్చస్థితి యేదియో, నీచస్థితి యేదియో గ్రహింపగల మనునదియే యిందులకు సమాధానము ఒకనికి గాఢనిద్రపట్టినప్పుడు ఆతడు బోధావస్థకు క్రిందనున్న మనస్స్థితిని బొందుచున్నాడు. శ్వాసించుచు, ఎఱుకలేకయే నిద్రలో నాతడు శరీరమును గదల్చుచుండవచ్చును. నిద్రించు

చున్నంతసేపును ఆతడిట్లు శరీరవ్యాపారములను జేయుచునేయున్నను ఆతని కట్టిమెఱుక లేకుండును. నిద్రపోవుటకుముందాతడెట్టి స్థితిలో నుండునో నిద్రనుండి మేల్కొనినప్పుడును అట్టి స్థితియందే యుండును. నిద్రించుటకు పూర్వ మాతడెంత జ్ఞానవంతుడై యుండునో నిద్రానంతరమునను అంతయే జ్ఞానవంతుడై యుండును. ఎంతమాత్రమును ఆతని జ్ఞానము వృద్ధిపొందుట లేదు. ఆతనికెట్టి తత్త్వదర్శనమును గలుగుట లేదు. కాని సమాధిస్థితిని బొందినవాడు అంతకుముందు మూఢుడై యుండినయెడల సమాధిస్థితినుండి ఋషియై వెలువడుచున్నాడు.

ఈ తారతమ్యమునకు హేతువేమి? ఒక యవస్థనుండి వెలువడునప్పుడు మనుష్యుడు తన పూర్వస్థితియందే యున్నాడు. ఇక మఱియొక యవస్థనుండి వెలువడునప్పుడు తత్త్వదర్శియై, ఋషియై, ప్రవక్తయై, పరమపావనుడై, పరివర్తితశీలుడై, పునరుజ్జీవితుడై, అఖండ జ్ఞానసంపన్నుడై వెల్గొందుచున్నాడు. ఇవి రెండు విధములైన ఫలితములు. కార్యములు వేర్వేఱై యుండుటచే కారణములును భిన్నములై యుండవలయును. సమాధిస్థితినుండి వెలువడునట్టి పురుషునకు గలుగు దివ్యానుభూతి బోధరహితావస్థయందు లభింపదు. ఈ దివ్యానుభూతి బోధావస్థయందు గలుగు తార్కికజ్ఞానముకంటె మహత్తరమైనది. కావున నిది అతీంద్రియ జ్ఞానమై యుండవలయును. సమాధియే అతీంద్రియ జ్ఞానావస్థయని చెప్పబడుచున్నది.

సంగ్రహముగా నిదియే సమాధియని చెప్పవచ్చును. ఇక సమాధివలని ప్రయోజన మేమందురా, చెప్పెదను. హేతువాదము, లేక బోధపూర్వకమైన మనోవ్యాపారము అతిపరిమితమగునట్టి జ్ఞానమును మాత్రమే కల్గించును. హేతువాదము ఇంద్రియజన్యజ్ఞానము నెన్నడును అతిక్రమింపజాలదు. మానవకోటికి ప్రాణతుల్యములగు విషయములనుగూర్చిన జ్ఞానమంతయు హేతువాదాతీతమైయున్నది.

ఆత్మ శాశ్వత మనుట నిజమా? దేవు డొక డుండుట వాస్తవమా? విశ్వమును నియమించు ననంతజ్ఞానశక్తి యొకానొకటి కలదా? అను నిట్టి ప్రశ్నలన్నియు హేతువాదాతీతమగు ప్రశ్నలు. హేతువాద మెన్నటికిని ఈ ప్రశ్నలకు సమాధాన మొసగజాలదు. హేతువాద మేమని చెప్పును? "నే నజ్ఞేయవాదిని. ఔనని కాని కాదని కాని చెప్పుటకు నాకు సమర్థత లే"దనియే కదా. ఐనను మనకీ సమస్య లత్యంత ప్రధానములు. వీనికి సరియగు సమాధానము లభింపనంత వఱకు మానవజీవితము నిష్ప్రయోజనము. మన నైతికసిద్ధాంతము లన్నియు, ధార్మిక ప్రవృత్తులన్నియు, మానవ స్వభావమునందలి మహోన్నతాంశములన్నియు, హేతువాదాతీతమగు తత్త్వముల మీదనే ఆధారపడియున్నవి. కావున నీ ప్రశ్నలకు సమాధానమును కనుగొను టావశ్యకము. జీవిత మొక క్రీడామాత్రమై యున్నచో, అణుసంయోగముచే నీ విశ్వ మాకస్మికముగా నుత్పన్నమై యున్నచో, నేను మఱియొకనికి మేలు చేయనేల? జీవకారుణ్యమును, న్యాయ్యవర్తనమును, పరస్పరానుభూతియు సుగుణములను పెంచవలెను? ఎల్లవారును ఇహలోకమున, దీప మున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకొనుచు స్వలాభపరాయణులై యుండుటయే శ్రేయస్కరము. జన్మాంతరమును, లోకాంతరమును గలవను నాశ లంతరించిన యెడల నే నెందుచే నా సోదరుని ప్రేమింపవలయును? వాని కుత్తుక నెందుచే నఱకరాదు? ఎచ్చట చూచినను నిర్జీవములగు క్రూరశాసనములే కాని మోక్షమనునది లేనిచో, దృశ్యప్రపంచమున కవ్వల నేమియు లేనిచో, ఐహికసుఖముల ననుభవించుటకు యథాశక్తిగా యత్నించుటయే నాకు విధ్యుక్తము కదా. ఐహికప్రయోజనము నాధారముగ చేసికొని నీతివర్తనము నిర్మాణమైయున్నదని నేడు కొందఱు చెప్పుచుండుట మీరు వినుచుందురు. ఈ యాధార మేమి? అధిక సంఖ్యాకులకు అధికసుఖమును గూర్చుటయా? ఎందుచే నే నిట్లు చేయవలయును? నా ప్రయోజనము దానిచే నెఱవేఱుచున్న యెడల అధికసంఖ్యాకులకు అధికదుఃఖము నెందుచే కల్గింపరాదు? ఐహికప్రయోజనవాదు లీ

ప్రశ్నల కెట్లు సమాధానము చెప్పెదరు? ఏది న్యాయమో, ఏది యన్యాయమో నీ కెట్లు తెలియును? సుఖవాంఛాప్రేరితుడనై నా సంకల్పము నెఱవేర్చుకొనుచున్నాను; నా కిది సహజము; ఇంతకంటె నాకు తెలియదు. నా కీ కోరికలున్నవి. నేను వానిని తృప్తిపఱచు కొనవలయును. వలదని నీ వేల మొఱపెట్టవలయును? మనుష్య జీవితమును గుఱించియు, నీతిని గుఱించియు, మృత్యువు నెఱుగని ఆత్మనుగుఱించియు, ఈశ్వరుని గుఱించియు, ప్రేమసానుభూతులను గూర్చియు, సత్ప్రవర్తనమునుగూర్చియు, అన్నిటికంటెను మించి స్వార్థరాహిత్యమును గూర్చియు, బోధించు నీతత్త్వసిద్ధాంతముల కన్నిటికిని మూలాధార మేమి?

నీతిశాస్త్రమంతయు, మానవుని నడవడి యంతయు, విజ్ఞాన మంతయు, స్వార్థరాహిత్యమను నీ భావముమీదనే ఆధారపడి యున్నవి. మానవజీవితాశయముల నన్నిటిని 'స్వార్థరాహిత్యము' అను నీ యొక్క మాటలో నిముడ్పవచ్చును. స్వలాభము నెందుచే విసర్జింపవలయును? నేను స్వార్థరహితుడనై యుండవలయునను విధి యెందున్నది? ప్రబలకారణ మెందున్నది? స్వార్థపరుడనై యుండ రాదనుటకు కారణము చూపింపుము. స్వలాభాపేక్షారహితుడవై యుండుమని మన మొకనితో జెప్పుట కావ్యయోగ్యమై యుండ వచ్చు; కాని కవిత్వము హేతునిరూపణము కానేరదు. నాకొక కారణమును జూపుడు. స్వలాభము నెందుచే నేను విడువవలయును? ఎందుచే యోగ్యుడనై యుండవలయును? ఎవరో యొక పురుషుడో, స్త్రీయో అట్లు ఆనతిచ్చుచుండుటచేత నని చెప్పెదరా, నాకది సరి పడదు. నేను స్వలాభరహితుడనై యుండుటవలన ప్రయోజనమేమి? ప్రయోజన మనుదానికి అత్యధికసుఖమని యర్థము చేసినయెడల స్వార్థపరుడనై యుండుటయే నాప్రయోజనము. ఐహిక ప్రయోజన వాదులు దీనికెన్నడును సమాధానమును జూపజాలరు. ఈ దృశ్య ప్రపంచము అపారమైన సముద్రమునం దొక నీటిబొట్టనియు, అనంత పదార్థరాశియం దిది యొక అణువనియునే ఇందులకు సమాధానము.

మానవకోటికి స్వార్థరాహిత్యమునుగూర్చి ప్రబోధమునర్పిన మహా నీయులీ భావము నెట్లు గ్రహించియున్నారు? సహజజ్ఞానముచే కాదని మనకు తెలియును; సహజజ్ఞానముచే నర్తించుచున్న జంతువులీ స్వార్థరాహిత్యము నెఱుగవు. తార్కికజ్ఞానము వలనను ఈ భావము కలుగకున్నది; తార్కికజ్ఞాన మీ విషయములనుగూర్చి మౌనము వహించుచున్నది. ఇక నివి యెందుండి వెలువడుచున్నవి?

ప్రపంచమునందలి మహామతబోధకులందఱును ఒక్క విషయమునం దేకీభవించి యుండిరని చరిత్రమూలమున మనము కనుగొందుము. తమతమ తత్త్వసిద్ధాంతములు తమకు పైనుండి లభించినవని వారందఱును జెప్పుచున్నారు. ఐనను నిజముగా నెచటనుండి లభించుచుండినదియు మాత్రము వారిలో చాలమందికి తెలియకుండెను. ఇందులకు నిదర్శనముగా నొక దేవదూత ఱెక్కలతో మానవరూపమున అంతరిక్షమునుండి తనకడకు దిగివచ్చి "ఓయీ! ఈ సందేశమును వినుము" అని తనతో జెప్పెనని యొకడు పలుకును. మఱియొక డొక దేవత తనకు ప్రత్యక్షమైనదని వచించును. తనపూర్వు డొకడు దివ్యాంశములను కొన్నిటిని తనకు వెల్లడించినట్లు కలగంటినని యొకడు ప్రకటించును. వానికి దెలిసిన దంతయే. ఐనను ఇట్టి దివ్యజ్ఞానము తమకు తార్కికశక్తిచే స్వీయప్రజ్ఞచే గలుగలేదనియు పైనుండి లభించినదనియు చెప్పుటలో వారందఱును ఏకీభవించుచున్నారు. ఇక యోగశాస్త్ర మేమని వచించునో చూతము. వారు తమకు లభించిన దివ్యజ్ఞానమంతయు హేతువాదాతీతమనుట సమంజసమే యనియు, ఐనను అట్టి జ్ఞానము వారల యంతరంగమునుండియే ఉద్భవించుచున్నదనియు, యోగశాస్త్రము బోధించుచున్నది.

హేతువాదాతీతమై, అతీంద్రియజ్ఞానావస్థయై యొప్పు మహోన్నతస్థితి మనస్సునందే కలదనియు, అట్టిస్థితిని ప్రాపించుటవలన అతీంద్రియజ్ఞానము లభించుననియు యోగులు బోధింతురు. సామాన్యమానవస్వభావాతీతమును, తార్కికజ్ఞానాతిరిక్తమును,

నగు నిట్టి మనస్స్థితినిగూర్చిన శాస్త్రోక్తవిధానము నెఱుగని వానికొకప్పుడు దైవవశమున నిట్టి దివ్యజ్ఞానము కలుగవచ్చును. ఇట్లు తలవని తలంపుగ అతీంద్రియజ్ఞానము తనకు లభించునప్పు డాతడు, పైనుండి లభించినదని సాధారణముగ చెప్పుచున్నాడు. కావున దివ్యావేశముగాని, అతీంద్రియజ్ఞానముగాని, నానాదేశములం దొకే విధముగ నున్నను, ఒకదేశమునందు దేవదూతమూలమునను, మఱియొక దేశమున దేవతమూలమునను, వేఱొకదేశమున దేవుని మూలమునను లభించుచున్నట్లు కానవచ్చుచుండుట కిదియే కారణము. అనగా నేమి? సహజముగనే మనస్సునం దీ జ్ఞానము గలుగుచున్నదనియు, ఎవ్వనియం దిది వ్యక్తమగుచున్నదో వాని విద్యాబుద్ధుల ననుసరించియు, విశ్వాసముల ననుసరించియు నిందులకు హేతునిరూపణము చేయబడుచున్నదనియు నిందలి సారాంశము. యథార్థ మేమనగా, అతీంద్రియజ్ఞానము వీరికి కాకతాళీయముగ గలుగుచున్నది.

కాకతాళీయముగ నిట్టి దివ్యజ్ఞానమును బొందుట హానికరమని యోగులు వచింతురు. అనేకుల కిందువలన మతిభ్రమము కలుగవచ్చును. ఎంతటి మహిమాన్వితులైనను, ఇందలి తత్త్వమును గ్రహింపకయే, ఆకస్మికముగ నిట్టి మనఃస్థితిని బొందిన వారందఱును విధిగా అంధకారమున బ్రాకులాడుచుండిరనియు, తమ దివ్యజ్ఞానమునకు తోడుగా విచిత్రమైన కొన్ని మూఢవిశ్వాసములను గూడ నమ్ముచుండిరనియు గ్రహింపనగును. మనో విభ్రమములకు వారు గుఱియైరి. ఒకదినమున 'గేబ్రియల్' అను దేవదూత గుహాలోనున్న తనయొద్దకు వచ్చి 'హరాక్' అను దివ్యతురంగముపై తన్నిడుకొని కొనిపోయెననియు, అంతట దివ్య లోకములను తాను సందర్శించితి ననియు మహమ్మదు చెప్పుచున్నాడు. ఐనను, అద్భుతమగు సత్యములను కొన్నిటిని మహమ్మదు వెల్లడించియున్నాడు. 'కొరాను' చదువునప్పుడు అత్యద్భుతమైన సత్యములు మూఢవిశ్వాసములతో మేళవింప

బడియున్నట్లు కాన్పించును. ఇందులకు హేతు వేమి? ఆతనికి దివ్యావేశము కలిగినదనుట నిస్సంశయము; కాని యది కాకతాళీయముగ తటస్థించినది. ఆతఁడు సుశిక్షితుఁడైన యోగి కాకుండుటచే తాను చేసిన కార్యముల కాతఁడు కారణమును గ్రహింపలేఁడు. మహమ్మదు ప్రపంచమున కొనరించిన మేలునుగూర్చియు, ఆతని మతావేశ పారవశ్యమువలన లోకమునకు సంభవించిన కీడునుగూర్చియు చింతింపుఁడు. కోట్లకొలఁది జను లెందఱాతని యుపదేశములవలన హత్యగావింపబడినదియు, ఎందఱు తల్లులు తమపిల్లలను గోల్పోయినదియు, ఎందఱు బిడ్డలు దిక్కుమాలినవారైనదియు, ఎన్ని దేశములు సమూలముగా నాశనమొందినదియు, ఎందఱు చిత్రవధపాలైనదియు తలంపుఁడు!

కావున మహమ్మదు మొదలైన మహనీయుల దేశముల జీవిత విమర్శనమువలన వారెట్లు ఈ ప్రమాదమునకు గురియైనదియు గ్రహింపనగును. వారందఱును దివ్యావేశమును బొందినవారే. భావోద్రేకముచే ప్రవక్తయగుచు నతీంద్రియానుభవమును బొందినప్పుడెల్ల కొన్ని తత్త్వములను సంగ్రహించుటయేకాక కొన్ని మూఢవిశ్వాసములకును గురియగుచున్నారు; మహమ్మదునకు ఆతని ఉపదేశములచే ప్రపంచమున కెంతటి మేలు చేకూరినదో, ఆతని మూఢవిశ్వాసములవలన లోకమున కంతటి కీడువాటిల్లినది. మానవచరిత మను నసంగతవిషయవిన్యాసరాశినుండి మన మేదైనను సమంజసమైన భావమును గ్రహింపవలయునన్నయెడల హేతువాదము నతిక్రమింపవలసియున్నది. అందులకు మూఢవిశ్వాసములను పరిత్యజించి ప్రశాంతముగా శాస్త్రసమ్మతమైన సత్యసాధన నవలంబింపవలయును. ఇతర శాస్త్రములవలెనే రాజయోగశాస్త్రమును సహేతుకము పరిశీలింపవలయును. హేతువిమర్శ నాధారము చేసికొని సత్యాన్వేషణమునకు తోడ్పడునంతవఱకు తప్పక దానిని అవలంబింపవలయును. హేతువిమర్శ నిలువజాలనప్పుడదియే ఉన్నతావస్థను

బొందుట కుపాయమును జూపును. ఎవ్వడైనను "నేనీశ్వర ప్రేరితుడ" నని పలుకుచు, వెంటనే యుక్తివిరుద్ధముగా సంభాషింప నారంభించిన యెడల వాని మాటలను నిరాకరింపుడు. ఏలయన సహజజ్ఞానము, తార్కికజ్ఞానము, అతీంద్రియజ్ఞానము,—లేక బోధరహితావస్థ, బోధావస్థ, బోధాతీతావస్థ—యను నీమూడును ఒకేమనస్సునకు సంబంధించునట్టివి. ఒక్కనియందు మూడుమనస్సు లుండజాలవు. కాని యొక మనఃస్థితి వికాసవంతమై, ఉన్నతస్థితులను బొందును. సహజ జ్ఞానము తార్కికజ్ఞానముగా పరిణమించును. మఱియు తార్కిక జ్ఞానము అతీంద్రియజ్ఞానముగా విస్తరిల్లును. ఇవి పరస్పరవిరుద్ధస్థితులు కావు. నిజమైన దివ్యావేశము లేక దివ్యజ్ఞానము యుక్తివిరుద్ధము కాకుండుటయేకాక యుక్తిని సిద్ధింపజేయును. "నా ఆశయము ప్రతిష్ఠాపనమేకాని విధ్వంసముకా"దని మహాప్రవక్తలు వచించి యున్నరీతిని దివ్యజ్ఞాన మెల్లప్పుడును హేతుజ్ఞానమునకు తోడ్పడుచు హేతుజ్ఞానమును సిద్ధింప జేయుచుండును.

శాస్త్రోక్తవిధానము ననుసరించి మనకు అతీంద్రియజ్ఞానావస్థ యగు సమాధిస్థితిని గల్గించుటయే వివిధములగు యోగాంగముల వలన గలుగు ప్రయోజనము. మఱియు ప్రాచీన మహర్షులకు దివ్య జ్ఞానము స్వభావసిద్ధమై యుండినచో ప్రతి మానవునకును స్వభావ సిద్ధమే యనునది మనము గమనింపవలసిన ముఖ్యాంశము. వా రద్వితీయులు కారు, వారును మనవంటి మానవులే. వారు మహా యోగు లైరి. అతీంద్రియజ్ఞానము వారికి సిద్ధించినచో మనకును సిద్ధించును. వారు విచిత్రవ్యక్తులు కారు. ఒకానొక పురుషు డట్టి స్థితిని బొందె నను విషయమువలననే ప్రతిమనుష్యుడును దానిని సాధింపగలడని ధ్రువపడుచున్నది. సాధ్యమనుటతో సరికాదు; ప్రతిమనుష్యుడును తుద కట్టిస్థితిని బొందితీఱవలయును. అతీంద్రియ జ్ఞానము సాధించుటయే మత మనబడును. స్వానుభవమే మన గురువు. జీవితకాల మంతయు వాదోపవాదములను జేయుచుందుము

గాక, స్వానుభవము కలుగునంతవఱకు లేశమైనను సత్యమును గ్రహింపజాలము. ఒకని చేతికి కొన్ని వైద్యగ్రంథము లిచ్చినంతనే మనమాతనిని వైద్యుని జేయజాలముకదా. ఒకానొక దేశమును జూడవలయునను నా వాంఛను ఆ దేశపుపటమును జూపుటచే నీవు తృప్తిపఱుపజాలవు; అందులకు నేను ప్రత్యక్షానుభవమును బొందవలయును. విశేషజ్ఞానమును సముపార్జింపవలయుననెడు కుతూహలమును గల్గించుటయే పటములవలన గలుగు ప్రయోజనము. అంతియే. పుస్తకములను బట్టీకొట్టి ప్రాకులాడుచుండుటవలన మనోబుద్ధిబలము క్షీణించుచున్నది. బ్రహ్మజ్ఞానమంతయు నేదియో యొకానొక గ్రంథమునందు నిక్షిప్తమై యున్నదని పలుకుటకంటె ఈశ్వరనిందనము మఱియొకటి కలదా? భగవంతుడప్రమేయుడనియు, అనంతుడనియు జెప్పుచు వానినొక చిన్నపుస్తకపుట్టల మధ్యమున నిముడ్చుటకే యత్నించుటెంతటి సాహసకృత్యము! గ్రంథములందు జెప్పబడిన విషయములను విశ్వసింపకుండుటచే, బ్రహ్మజ్ఞానమంతయు నొకానొక పుస్తకపుట్టల మధ్యమున గానరాకుండుటచే, కోట్లకొలది జనులు హతులైరి. ఈ హత్యలను, యుద్ధములను మనము మఱచియున్నమాట నిజమే కాని గ్రంథములం దింకను లోకము ఘోర విశ్వాసముచే బద్ధమైయున్నది.

శాస్త్రోక్తవిధానము ననుసరించి సమాధిస్థితి బొందుటకై రాజయోగమునందలి వివిధాంగములను క్రమముగా నభ్యసింపవలయును. ప్రత్యాహార ధారణలకు తరువాత ధ్యానమును గూర్చి వివేచింపవలసియున్నది. బాహ్యముగాని, ఆంతరముగాని యేదైన నొక లక్ష్యముపై నిశ్చలముగా నిలువగల్గినంతనే, చిత్తము ఆ లక్ష్యమువైపునకు అవిచ్ఛిన్న ప్రవాహరూపముగా బోవునట్టి శక్తిని బొందును. ఈ స్థితినే ధ్యాన మందురు. ప్రతీతి లేక ఇంద్రియానుభవమునందలి బాహ్యాంశమును తొలగించి అంతరాంశమగు నర్థమును మాత్రమే ధ్యానించునంతటి తీవ్రమనశ్శక్తి కలిగినప్పు డట్టి

స్థితి సమాధి యనబడును. ధ్యాన ధారణ సమాధులు మూడును చేరిన సంయమ మని చెప్పబడును. అనగా, మొట్టమొదట నొక అవలంబముపై చిత్త మేకాగ్రత పొందవలయును; అట్టి యేకాగ్ర స్థితియందు కొంత సేపటివఱకును నిలువవలయును; అంతట, ఇట్టి అవిచ్ఛిన్న ధ్యానముచే, ఇంద్రియానుభవమునందలి యే బాహ్యాంశము అవలంబరూపమగు కార్యమై యున్నదో అట్టి బాహ్యాంశమును విడిచి అంతరాంశమునందు మాత్రమే చిత్తము నిలుపవలయును;- ఇట్టి చిత్తమునకు సర్వమును వశమగును.

ఇదియే అత్యున్నతమైన సమాధిస్థితి. కోరికలున్నంతవఱకు నిజమైన సుఖము కలుగజాలదు. ధ్యానాయత్తచిత్తులమై, సాక్షిభూతులమై విషయముల నవలోకించుటవలననే మనము నిజమైన సుఖమును ఆనందమును పొందుదుము. జంతువు ఇంద్రియములందును, మనుష్యుడు బుద్ధివైభవమునందును, దివ్యపురుషు డాత్మధ్యానమునందును రమించుచున్నారు. ధ్యానావస్థితచిత్తుడగువానికే ప్రపంచము నిజముగా రమణీయమై కన్పట్టును. కోరికలను విడిచి, సంగరహితుడై యుండువానికి ప్రకృతియందలి వివిధ పరిణామము లన్నియు దివ్య సుందర దృశ్యములై చూపట్టును.

ధ్యానమునుగూర్చి మనము గ్రహింపవలసిన విషయము లివి: మన మొక శబ్దమును విందుము. ఇందు మొదటిది బాహ్యస్పందనము; రెండవది ఈ స్పందనమును మెదడునకు గొనిపోవునట్టి నాడీగమనము; మూడవది మనసు చేయునట్టి ప్రతిక్రియ ఆకాశమునం దుద్భవించు స్పందనము మొదలుకొని మనస్సునందు గలుగు ప్రతికారమువఱకును గల వివిధ పరిణామములకు మనము వినునట్టి శబ్దము బాహ్యకారణమై యున్నది. మనస్సునందు ప్రతిక్రియ కలిగినంతనే శబ్దజ్ఞాన మేర్పడుచున్నది. యోగపరిభాషయం దివి శబ్దము, అర్థము, జ్ఞానము అనియు, శరీరశాస్త్రపరిభాషయందు ఆకాశ సంబంధమగు స్పందనము, నాడులందును మెదడునందును గలుగు

చలనము, మనఃప్రతిక్రియ అనియు చెప్పబడుచున్నవి. స్పష్టముగా
నివి వేర్వేఱు వ్యాపారములై యున్నను సన్నిహితత్వముండుటచే వీని
యందలి విశిష్టత గోచరింపకున్నది. వీనివలన గలుగు సంయుక్త
కార్యమే కాని ఇందలి ప్రత్యేకవ్యాపార మేదియు గ్రహింపజాల
కున్నాము. ఈ సంయుక్త కార్యమునే మనము బాహ్యవిషయ మని
చెప్పుచున్నాము. ఇంద్రియానుభవము లన్నిటియందును ఈ వ్యాపార
ములు మూడును కలవు. మనము వీనిని విభజించి గ్రహింపజాల
మనుటకు హేతు వేదియు లేదు.

యమనియమాదిసాధనల నభ్యసించుటవలన చిత్తస్థైర్యము
కలుగును. మనోనిగ్రహ మేర్పడును. దానివలన సూక్ష్మగ్రహణ
సామర్థ్యములబ్బును. ఇట్టి చిత్తమును ధ్యానమునందు నియోగింప
వలయును. ధ్యానమును స్థూలమైన అవలంబములతో ప్రారంభించి,
క్రమముగా సూక్ష్మావలంబములను గ్రహించుచు, కడకు నిరాలంబ
ముగా జేయవలయును. మనస్సుచే మొదట సుఖదుఃఖాది
సంవేదనలయొక్క బాహ్యకారణములను, అనంతరము అంతర్వ్యాపార
మును, పిమ్మట మనఃప్రతిక్రియను పరిశీలింప వలయును. ఇంద్రియాను
భవముల బాహ్యకారణములను చక్కగా గ్రహించినంతనే, సూక్ష్మ
పదార్థములను, సూక్ష్మ విషయములను, సూక్ష్మరూపములను గను
గొనగలము. శరీరాంతర్గతములగు చలనములను యథారూపమున
దర్శింపగలిగినంతనే, మనోవృత్తులు భౌతిక శక్తిగా మాఱుటకు ముందు
గనే మనస్సు వానిని నిరోధింపగల్గును. ఇంద్రియగోచరమగు ప్రతి
విషయమును, ప్రతిభావమును, మనఃప్రతిక్రియవలన గలుగు ఫలిత
ములే కావున మనఃప్రతిక్రియ పూర్ణముగా గ్రహించినంతనే యోగి
సర్వజ్ఞుడగును; మనస్స్వయాప మాతనికి కట్టుబడుట కన్పట్టును;
సంపూర్ణ మనోనిగ్రహము సిద్ధించును; అనేక యోగసిద్ధు లబ్బును.
కాని వీనిచే మోహితు డయ్యెనా, వాని పురోవృద్ధి యిక నంతటితో
సరి. భోగ కాంక్షలు మహావిపత్కరములు. ఇట్టి దివ్యశక్తులను

సహితము నిరాకరింపగల్గిన యెడల, యోగి సంపూర్ణమగు చిత్తవృత్తి నిరోధము అను పరమావధిని పడయజాలును. అపుడు మనోవిక్షేపములచే, శరీరవ్యాపారములచే చలింపక, స్వయంజ్యోతియై, జ్ఞానస్వరూపమై, శాశ్వతమై, సర్వవ్యాప్తమై దీపించు స్వస్థితి నాతడధిష్ఠించుచున్నాడు.

ఇట్టి సమాధిస్థితిని బొందుటకు ప్రతిమానవునకును, మానవుడననేల, ప్రతిజంతువునకును 'హక్కు' కలదు, అత్యల్పజంతువు మొదలుకొని మహోత్తమమగు దేవతవఱకును ప్రతిజీవియు నేనాటికైనను సమాధ్యవస్థను బొందితీఱవలయును. నాడే ఆ జీవికి నిజమైన పారమార్థిక జీవితము ప్రారంభమగును. అంతవఱకును మనము సాధన చేయవలయును. స్వానుభవము లేనియెడల మనకును నాస్తికులకును భేద మేమి? ఈ దివ్యానుభవమును గల్గింపని యెడల ఏకాగ్రత నిష్ప్రయోజనమైపోవును. ఇందులకు విధింపబడిన యోగాంగములన్నియు సహేతుకముగా, సక్రమముగా, శాస్త్రసమ్మతముగా నియమింపబడియున్నవి. శ్రద్ధతో నిట్టియోగము నభ్యసించుటవలన తప్పక వాంఛితార్థము చేకూరును; సర్వదుఃఖములును నశించిపోవును; కర్మబీజములు దగ్ధములగును; శాశ్వతానందప్రదమగు మోక్షము లభించును.



## అష్టమాధ్యాయము

# రాజయోగ సంగ్రహము

ఈ దిగువనున్నది కూర్మపురాణమునుండి ధారాళముగా ననువదింపబడిన రాజయోగ సంగ్రహము.

యోగాగ్ని మనుష్యు నావరించియున్న పాపపంజరమును భస్మముచేయును. జ్ఞానము పరిశుద్ధమగుటతోడనే నిర్వాణము

సిద్ధించును. యోగమువలన జ్ఞానము కలుగును; జ్ఞానము మొదలు యోగికి తోడ్పడుచున్నది. యోగ జ్ఞానములు రెండింటిని సమన్వయముగ నవలంబించునో అట్టివాడు పరమేశ్వరునకు ప్రీతిపాత్రుడు. దినమునకు ఒక సారిగాని, రెండుసారులుగాని, మూడుసారులుగాని, సర్వకాలములందుగాని మహాయోగము నవలంబించువారు దేవుని గ్రహింపుదు. అభావయోగ మనియు, మహాయోగ మనియు యోగము రెండువిధములుగా నున్నది. శూన్యమనియు, నిర్గుణమనియు ఆత్మ ధ్యానింపబడునప్పు డది అభావయోగ మని చెప్పబడును. ఆత్మ నిష్కళంకమనియు, ఆనందస్వరూపమనియు, పరమాత్మతో నైక్యమనియు భావింపబడునప్పు డది మహాయోగమని చెప్పబడును. ఈ రెండు మార్గములలో యోగి దేని నవలంబించినను ఆత్మసాక్షాత్కారము పొందును. ఏస్థితియందు యోగి తాను సమస్తవిశ్వమునుగూడ బ్రహ్మమేయని కనుగొనునో, దివ్యమైన అట్టి మహాయోగమునకు ఇతర యోగము లేవియు సాటిరావు.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామము, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధు లనునవి రాజయోగాంగములు. అహింస, సత్యము, అస్తేయము *, బ్రహ్మచర్యము, అపరిగ్రహము † లనునవి యమము మని చెప్పబడును. దీనివలన చిత్తశుద్ధి కలుగును. మనోవాక్కాయ కర్మములలో దేనిచేగాని, ఏ జీవజంతువునకుగాని బాధకలిగింపకుండుటయే అహింసయని చెప్పబడును. అహింసను మించిన ధర్మము వేఱొకటిలేదు. సృష్టిజాతమునకు తనవలన నెట్టిహానియు గలుగని యట్టి చిత్తవృత్తిచే మనుష్యునకు దివ్యానందము గలుగును. సత్యము వలన కర్మఫలములను పొందుదుము. సత్యమువలననే సర్వమును లభించును ; సత్యమునందే సమస్తమును నెలకొనియున్నది. ఉన్న విషయముల నున్నట్లు తెలుపుటయే సత్యము. దొంగతనముగాగాని

* పరద్రవ్యమును దొంగిలింపకుండుట.

† ఒకరివలన నేదియు పుచ్చుకొనకుండుట.

బలాత్కారముగాఁగాని పరులసొత్తు గ్రహింపకుండుటయే అస్తేయము. సర్వకాల సర్వావస్థలయందును మనోవాక్కాయ కర్మములందు పరిశుద్ధత గలిగి యుండుటయే బ్రహ్మచర్యము. ఎంతటి మహాకష్ట దశలో నున్నను ఎవ్వరియొద్దను ఎట్టికానుకను గ్రహింపకుండుటయే అపరిగ్రహము. పరిగ్రహమువలన మనుష్యుడు తన హృదయ పారిశుద్ధ్యమును గోల్పోవును; అల్పుడగును; అస్వతంత్రుడై యాతడు బద్ధుడగును.

ఈ దిగువనున్న సాధనలు యోగసిద్ధికి తోడ్పడును: శాస్త్ర విహిత వర్తనము, తపస్సు, స్వాధ్యాయము, సంతోషము, శౌచము, ఈశ్వరప్రణిధానము లేక ఈశ్వరారాధనము. ఉపవాసాదికములచే గలుగు నింద్రియ నిగ్రహము శారీరకతపస్సు అని చెప్పబడును.

వేదాధ్యయనమువలనను మంత్రజపమువలనను శరీరమునందు సత్త్వశుద్ధి గలుగును. ఇట్టి అధ్యయనమే స్వాధ్యాయమని చెప్పబడును. వినబడునట్లుచ్చరించుటయు, పెదవులుమాత్రము కదల్చుచు పైకి వినబడకుండునట్లుచ్చరించుటయు, మంత్రార్థమును గూర్చి భావించుచు మనస్సునందు జపించుటయు నని మంత్రజపము మూడు విధములుగా నున్నది. ఇందు వినబడునట్లు చేయు మంత్రజపము అధమము. మానసికజప ముత్తమము. బాహ్యశౌచమనియు, అంతశ్శౌచమనియు శౌచము రెండువిధములని ఋషులు వచింతురు. నీరు, మట్టి మొదలైనవానితో స్నానాదులను జేయుటచే గలుగు శరీర శుద్ధియే బాహ్యశౌచము. సత్యాది సద్గుణములచే అంతశ్శౌచము సిద్ధించును. ఈ రెండు శౌచములును ఆవశ్యకములే. బాహ్యముగా అపరిశుద్ధుడై మనశ్శుద్ధి గలిగి యున్నంతమాత్రమున చాలదు. బాహ్యాంతశ్శౌచములు రెండును లభింపని పక్షమున అంతశ్శౌచము శ్రేష్ఠతరము. కాని యోగి కాఁ నెంచువాఁడు బాహ్యాంతరములు రెండిటియందును తప్పక శుద్ధుడై యుండవలయును.

సంకీర్తనచేగాని, ధ్యానముచేగాని, భక్తిచేగాని మనము భగవంతుని సేవింపవచ్చును, యమనియమములను గూర్చి ముచ్చటించియున్నాము కదా. ఇక, ఆసనమునుగూర్చి గ్రహింప వలసియున్నది. రొమ్మును, భుజములును, తలను నిబ్బరముగా నిలిపి శరీరమును సరిగా నుంచుటయే ఇందలి ముఖ్యాంశము. తరువాతి విషయము ప్రాణాయామము. ప్రాణ మనగా శరీరమునందలి వివిధ జీవశక్తులని గ్రహింపవలెను; 'ఆయామ' మనగా ప్రాణవ్యాపారమును నిరోధించుట యని భావము. సామాన్యమనియు, మధ్యమమనియు, ఉత్తమమనియు మూడువిధములైన ప్రాణాయామములు కలవు. మఱియు పూరక, రేచక, కుంభకములని ప్రాణాయామమునందు మూడుభాగములు కలవు. పండ్రెండు క్షణములలో నారంభమగు ప్రాణాయామము సామాన్యము. ఇరువదినాలుగు క్షణములలో, నారంభమగునట్టిది మధ్యమము. ముప్పదియాఱు క్షణములలో ప్రారంభమగు ప్రాణాయామము సర్వోత్తమము. సామాన్య ప్రాణాయామమునందు చెమటపట్టును; మధ్యమ ప్రాణాయామమునందు శరీరము వణకును; ఉత్తమప్రాణాయామమునందు శరీరము భూమిని విడిచి మీదికి లేచుటయు, గొప్ప దివ్యానందమును బొందుటయు జరుగును. గాయత్రి పరమపవిత్రమైన వేదమంత్రము. "ఎవని వలన ఈ విశ్వముత్పత్తి యగుచున్నదో అట్టి పరమపురుషుని వైభవమును ధ్యానింతుము, దానివలన మాకు జ్ఞానోదయ మగుగాక". ఇట్టి గాయత్రీమంత్ర మాద్యంతములందు ఓంకారముతో గూడి యుండును. ఒక్క ప్రాణాయామమునందు గాయత్రిని మూడుసార్లు జపింపుడు. రేచకము (ఊపిరి విడుచుట), పూరకము (ఊపిరి పీల్చుకొనుట), కుంభకము (ఊపిరిని నిలుపుట) అని ప్రాణాయామము మూడు విధములుగా నున్నదని సమస్తగ్రంథములందును చెప్పబడియున్నది. ఇంద్రియములు బహిర్ముఖములై బాహ్యవిషయములతో సంయోగము పొందుచుండును. విషయములనుండి మరల్చి ఇంద్రియములను వశము గావించుకొనుటయే ప్రత్యాహారమని చెప్పబడును.

ప్రత్యాహార మనగా ఉపసంహరించుకొనుట లేక తనయందు జేర్చుకొనుట యని యర్థము. హృదయకమలమునందుగాని, శిరస్సునందలి సహస్రార కమలమునందుగాని మనస్సును నిలుపుట ధారణ యనబడును. ఏదైన నొక అవలంబము నాశ్రయించి మనస్సు దానియందు లగ్నమైయుండునప్పు డొకానొక విధమైన వృత్తులు మనస్సునందు గలుగును. ఈ వృత్తు లితరవృత్తులచే బాధింపబడవు. ప్రత్యేకమైన యీ వృత్తులు ప్రస్ఫుటము లైనకొలదియు విజాతీయవృత్తులు క్రమముగా క్షీణించుచు తుద కంతరించిపోవును. అనంతర మీ సజాతీయమైన వృత్తు లేకమై ధ్యేయాకారవృత్తి యొక్కటియే చిత్తమునందు నిలుచును. ఇదియే ధ్యానము. అవలంబము లేకయే చిత్తము ఏక ప్రత్యయ ప్రవాహరూపమును బొందునప్పుడు * సమాధి యని చెప్పబడును. ఈ స్థితియందు అవలంబము (లేక ధ్యేయము) యొక్క సాయము లేకయే స్థలకేంద్రముల సాహాయ్యము లేకయే భావార్థము మాత్రమే భాసించుచుండును. ధ్యేయముపై మనస్సును పండ్రెండు క్షణముల కాలము నిలుపునప్పు డది ధారణ యగును. అట్టి పండ్రెండు ధారణలు చేరిన, ఒక ధ్యాన మగును. ఇట్టి పండ్రెండు ధ్యానము లొక సమాధి యగును.

అగ్నిభయము గల చోటను, నీటియందును, ఎండుటాకులు రాలిన తావునను, చీమల పుట్టలుండుచోటను, క్రూరజంతువులుండు స్థలమునను, అట్టి ప్రమాదము గల పట్టునను, నాలుగు బాటలు కలియు తావునను, అమితముగా ధ్వని గలుగుచుండు చోటను, దుర్జనప్రాంతములందును యోగాభ్యాసము చేయరాదు. ఈ విషయములు ముఖ్యముగా భారతీయుల కనువర్తించును. దేహము ప్రాలుమాలికగా గాని, అనారోగ్యముగా గాని యున్నప్పుడును, మనస్సు దుఃఖదైన్యములతో గూడియుండు నప్పుడును, యోగసాధన చేయు

* అనగా ఎడతెగక, ధ్యేయమునందలి అర్థము భాసించుచుండునప్పుడని భావము.

దగదు. ఇతరులవలన బాధకలుగని విహారస్థ ప్రదేశమునకు పోవలయును. అపరిశుద్ధముగా నున్న స్థలమును విడిచి సౌందర్య సందీపితమైన స్థలమునుగాని, మీ యింటిలో చక్కని గదినిగాని సాధనకై యెన్నుకొనవలయును. ముందుగా ప్రాచీనయోగులకును, నీ గురువునకును, భగవంతునకును మ్రొక్కి, పిమ్మట యోగసాధన నారంభింపుము.

ఇంతవఱకును ధ్యానమునుగూర్చి వివరించితిమి. ఇక ధ్యేయ విషయమున కొన్ని యుదాహరణములు తెలుపబడును. ఉచితరీతిని కూర్చుండి నాసికాగ్రమును లక్షింపవలయును. దీనివలన మనస్సు ఎట్లు ఏకాగ్రమగునో, నేత్రనాడులు వశమగుటవలన చిత్తవృత్తుల నరికట్టి, తన్మాత్రలయందు సంకల్పము నెట్లు నిరోధింపగలమో, మున్ముందు మనకు వెల్లడి కాగలదు. ఇప్పుడు కొన్ని ధ్యానవిధానములు తెలుపబడును. జ్ఞానమును తూడుగాను, ధర్మమును కర్ణికగాను గూడిన యొక పద్మము నీ శిరస్సునందు, కొన్ని యంగుళముల యెత్తున నున్నట్లు భావింపుము. అష్టసిద్ధులును ఆ కమలమునకు అష్టదళములు; త్యాగమే అందలి కింజల్కపరాగములు. దళరూపమున బాహ్యముగానున్న యీ యోగసిద్ధులను పరిత్యజించి, కింజల్కపరాగములుగా లోనున్న పరిపూర్ణ త్యాగము నవలంబించినయెడల మోక్షము లభించును. ఓంకారాభిధేయుడును, అవాఙ్మనసగోచరుడును సర్వేశ్వరుడును నగు శ్రీమన్నారాయణుడు కమలమునందు దేదీప్యమానుడై భాసిల్లుచున్నట్లు భావించి వానిని ధ్యానింపుము. మఱియొకవిధమైన ధ్యానము కలదు. నీ హృదయాకాశమధ్యమున నొకజ్యోతి ప్రకాశించుచున్నట్లు భావింపుము. ఆ జ్యోతియే నీ యాత్మయనియు, దివ్యతేజోమయమగు మఱియొక జ్యోతి దానియందు వెల్గొందుచున్నదనియు, అదియే పరమాత్మ యనియు భావించి దానిని ధ్యానింపుము. బ్రహ్మచర్యము, అహింస, ఘోరశత్రువునందైనను దయజూపునట్టి క్షమ, సత్యము, ఆస్తిక

భావము అను నివియన్నియు వివిధములైన వృత్తులు. ఇట్టి సద్గుణము లన్నిటియందును పరిపూర్ణుడవు కానియెడల భయపడవలదు; సాధనచే నివియన్నియు తప్పక సిద్ధించును. నిస్సంగుడును, క్రోధవర్జితుడును, భయరహితుడును, భగవదాయత్తచిత్తుడును, శరణాగతుడును పవిత్రహృదయుడునునగు భక్తుని యభీష్టము భగవానుడు నెఱవేర్చును. జ్ఞానభక్తి వైరాగ్యవంతుడవై పరమేశ్వరు నారాధింపుము.

"ద్వేషరహితుడును, సర్వభూతహితుడును, దయామయుడును తనది యనునదేదియు లేనివాడు అహంకార మమకార వర్జితుడును, సుఖదుఃఖాదులయందు సమచిత్తుడును, క్షమావంతుడును, సంతుష్టుడును, యోగనిరతుడును, సంయమోపేతుడును, దృఢసంకల్పుడును, ధృతిమంతుడును తన మనోబుద్ధులను నాయం దుంచినవాడును నగు భక్తుడు నాకత్యంతప్రియుడు. దేనిమీదను ఆధారపడనివాడును, పవిత్రచిత్తుడై, కర్తవ్యనిర్వహణమునబద్ధదీక్షితుడై బాగోగులను లెక్క చేయకుండువాడును లోకులకు వెఱపుగల్గింపనివాడును, లోకులవలన వెఱపును బొందనివాడును, హర్షము, క్రోధము, భయము, విషాదము ననువానిచే వికారము నొందనివాడును నాకు ప్రియుడు. అపేక్షారహితుడును, శుచిమంతుడును, దక్షుడును (అనగా నే కార్యమునైనను ఆలసింపక చేయువాడు), ఫలవిషయమున నుదాసీనుడును, శోకరహితుడును, మానావమానములయందు సముడును, ప్రశాంతచిత్తుడును, ప్రాప్తమైనదాని చేతనే సంతుష్టుడగువాడును, ప్రపంచమే తన యిల్లని భావించువాడును, స్థిరచిత్తుడును నైన భక్తుడు నాకు ప్రియుడు."* అట్టివాడు యోగియగును.

* * * *

దేవఋషివరేణ్యుడును సర్వలోకసంచారియు నగు నారదుడొకప్పు డరణ్యమార్గమున బోవుచు ధ్యాననిమగ్నుడైన యొక

* చూడుడు : గీత, ౧౨ వ అ., ౧౩—౧౯ శ్లో.

పురుషుని జూచెను. ఆతనిపై పుట్టలు పెరిగియుండెను. ఆతడు నారదుని జూచి "తాపసోత్తమా, తామెచటకు బోవుచున్నా" రని యడుగగా "కైలాసమున" కని నారదుడు ప్రత్యుత్తరమిచ్చెను. అంత నాతడు పరమేశ్వరునకు దనపై ననుగ్రహము గల్గునది యెన్నడో, తనకు ముక్తి లభించునది యెన్నడో కనుగొనిరండని నారదుని ప్రార్థించెను. నారదుడు వల్లెయని కొంతదూరము పోగనుపిమ్మట మఱియొక పురుషుడు కానబడెను. అతడాడుచు, పాడుచు, నెగిరి గంతులు వైచుచు నారదుని జూచి "మునీంద్రా! తామెచ్చటకు బోవుచున్నా" రని యడిగెను. ఆతని కంఠస్వరమును చేష్టలును విచిత్రముగా నుండెను. "కైలాసమున" కని నారదుడు చెప్పినంతనే తనకెప్పుడు మోక్షము లభించునో కనుగొనిరండని యాతడు వేడుకొనెను. నారదు డందుల కంగీకరించి తన దారిని వెడలెను. కాలక్రమమున నారదు డా మార్గముననే వచ్చుట తటస్థించగా, చెదల పుట్టలో ధ్యానించుచుండిన తాపసి దేవఋషిని జూచి "మునివరా! నన్ను గూర్చి దేవదేవు డేమనియె" నని యడిగెను. "ఇక నాలుగు జన్మములలో నీకు ముక్తి కలుగునని దేవదేవుడు వచించె" నని నారదుడు చెప్పెను. అంత నాతడు "చెదలు నాపై పుట్టలుపోయునఱకను ధ్యానించుచుంటినే; అయ్యో! నేనింకను, నాలుగుజన్మముల నెత్తవలయునా?" అని పెద్దపెట్టున విలపింపసాగెను. నారదుడు రెండవవానియొద్దకు బోయినంతనే యాతడు "నన్ను గూర్చి మహాదేవు నడిగితిరికదా?" యని ప్రశ్నించెను. "అడిగితిని. ఈ చింతచెట్టును జూడుము. దీనికెన్ని యాకులున్నవో నీ వన్నిజన్మముల నెత్తవలయును. అప్పుడు నీకు ముక్తి కలుగు" నని నారదుడు ప్రత్యుత్తరమిచ్చెను. అంత నాతడు "ఆహా! ఇంత శీఘ్రకాలములో నాకు ముక్తి లభించుచున్నదే" యని యానందపరవశుడై తాండవింపసాగెను; అంతట "నా తండ్రీ! నీ వీ క్షణముననే ముక్తుడ వయ్యెద" వని యశరీరవాణి పలికెను. ఆతని కార్యదీక్షాపరత్వమున కది ప్రతిఫలము. ఎన్ని జన్మములైనను సాధనచేయుట కాతడు సంసిద్ధుడై

యుండెను. ఇక మొదటివానికి నాలుగు జన్మములే దుర్భరమగు దీర్ఘకాలముగా దోఁచెను. యుగయుగములపర్యంతము నిరీక్షించుకొని యుండుటకు సంసిద్ధుఁడగు నాతని కార్యదీక్షవంటి కార్యదీక్షయే మహోన్నత ఫలదాయక మగుచున్నది.

---

# పాతంజలయోగసూత్రములు

## ఉపోద్ఘాతము

యోగసూత్ర ప్రస్తావన చేయుటకు ముందుగా నొక ముఖ్యాంశమునుగూర్చి విమర్శించుటకు యత్నింతును. యోగ మత సిద్ధాంతములన్నియు దీనిమీఁదనే ఆధారపడియున్నవి. నామరూపాత్మకమైన మన ప్రస్తుత సోపాధికస్థితి వెనుక నామరూపాతీతమైన నిరుపాధికస్థితి యొకటి కలదనియు, అదియే మన ద్వైతప్రపంచముగా వ్యక్తమగుచున్నదనియు, మఱల నా నిరుపాధికస్థితిని బొందుట కున్ముఖులమై చరించుచున్నామనియు, ప్రపంచమునందలి మేధానిధు లందఱేకగ్రీవముగా నంగీకరించియున్నారు. ప్రకృతిశాస్త్ర పరిశోధనల వలనను చాలవఱ కీవిషయము నిరూపింపబడియున్నది. ఇక నీ సోపాధిక నిరుపాధికస్థితులు రెండిటియందును నేది శ్రేష్ఠతర మని శంకింపవచ్చును. వ్యక్తావస్థయే మనుష్యుని అత్యున్నతావస్థయని భావించువారును కలరు. మన ద్వైతప్రపంచము అవ్యక్తమునుండి వెలువడుచున్నదనియు అవ్యక్తావస్థకంటె వ్యక్తావస్థయే శ్రేష్ఠతర మనియు కొందఱు ధీమంతుల యభిప్రాయము. నిరుపాధికసత్తాయం దెట్టి గుణము నుండజాలదనియు, అది యచేతనమై, జడమై, నిర్జీవమై, యుండుననియు, ఐహికజన్మమే అనుభవయోగ్యమైనట్టిదనియు, అందుచే మనము దీని నంటిపెట్టుకొని ప్రాకులాడుచుండవలయుననియు వీరి యూహ. ప్రస్తుతము ఇతరములగు జీవితసమస్యలను

గూర్చియు నాని పరిష్కారములను గూర్చియు కొంతవఱకు పరిశీలింతము. మరణానంతరము మనుష్యుడు ఎప్పటివలెనే యుండుననియు, ఆతని దుస్స్వభావము తక్క సత్స్వభావమంతయు శాశ్వతముగా నక్షయముగ నుండుననియు ప్రతిపాదించు ప్రాచీనసిద్ధాంత మొకటి కలదు, అది క్రైస్తవమతానుసారముగా చెప్పినయెడల ప్రపంచము మనుష్యుని పాపావశేషముగా నుండదని సిద్ధాంతము. ప్రపంచములోని లోపములను తొలగించి, కొంచెము మున్నస్థితికి దెచ్చినయెడల ప్రపంచమే వారు చెప్పునట్లు స్వర్గమగును. దుఃఖమన్నను జరుగదు. ఇప్పుడు నది అసంగతమనియు, అద్వైతప్రమాణమునను ఈ సిద్ధాంతమునకు కూడి నంతనే స్పష్టమగుచున్నది. కీడు లేనిచో మేలన్నదియు గలుగదు; మేలు లేనిచో కీడు సంభవింపదు. దోషరహితప్రపంచము నూహించుట యనునది సంస్కృతభాషయందు వచించు "గగనకుసుమము" లేక "గాలిలోని కల"వంటిది. పరిణామము బొందుట యనునది లేక సదా పరివర్తనమును బొందుచు పునఃసృష్టికే మరలుచుండుటయే మన విధియని నేటి సంప్రదాయములనుండి మఱియొక సిద్ధాంతము తెలుపుచున్నది. ఈ సిద్ధాంతము సమంజసముగా నున్నట్లు కానవచ్చినను పరిశీలించినయెడల నిదియు యుక్తివిరుద్ధమనియే చెప్పవలసివచ్చును. ఏలయన, గమన మనునది యెన్నడును సరళరేఖారూపమున గలుగదు. గమన మెప్పుడును వృత్తరూపమున గలుగుచున్నది. నీవొక ఱాతిని చేపట్టి, అంతరిక్షములోనికి బోవునట్లు దానిని విసరివైచి, చిరంజీవివై యుండినయెడల, ఆ ఱాతి కేట్టి యాటంకమును గలుగనిచో, తిరిగి సరిగా అది నీ చేతియొద్దకు వచ్చును. సరళరేఖ ననంతముగా పొడిగించినప్పుడది యొక వృత్తముగా పరిణమించుచున్నది. అందుచే, సదా పరిణామమును బొందుచుండుటయే మనుష్యుని విధి యను నీ సిద్ధాంతము పేలుతు విరుద్ధముగా నున్నది. ప్రస్తుతవిషయమున కంతగా సంబంధింపకున్నను, పరులను మన 'మెన్నడును ద్వేషింపరాదు, ప్రేమింప

వలెను' అను నైతికసిద్ధాంతమున కిదియే ప్రధానహేతువని చెప్ప గలను. విద్యుచ్ఛక్తినిగూర్చిన నవీనసిద్ధాంతము ననుసరించి యీ శక్తి విద్యుదుత్పాదకయంత్రమును విడిచి, పరిభ్రమించి తిరిగి తన యుత్పత్తి స్థానమును జేరుచున్నది. ఇట్లే రాగద్వేషము లెవ్వాని యందుండి వెలువడుచున్నవో తుద కవి వానినే వచ్చిచేరును. కావున నీ వెవ్వరిని ద్వేషింపవలదు. ఏలయన నీ ద్వేషము కాలాంతరమున నీమీదికే వచ్చును. నీ వొరులను ప్రేమించిన యెడల, ఆ ప్రేమయు తిరిగి నీ యొద్దకు వచ్చును. ఇట్లే నీయందుండి వెలువడు నట్టి ద్వేషభావములన్నియు అప్రతిహతశక్తితో దారుణాస్త్రముల వలె మరల నీమీదికి వచ్చును.

ప్రత్యక్షములగు నితర హేతువులనుబట్టి చూచినను ఈ శాశ్వతపరిణామసిద్ధాంతము నిలువజాలదు. ఏలయన సృష్టిజాతము నందు నశింపని దేదియు లేదు. మన పోరాటములన్నిటికిని, దుఃఖము లన్నిటికిని వినాశమే గమ్యస్థానము. 'జాతస్య మరణం ధ్రువమ్' అనునట్లు మనమందఱమును ఎన్నడో యొకప్పుడు మృత్యువునోట బడవలసినవారమే. ఇది నిశ్చయము. అట్టియెడ సరళరేఖయందు చక్రగమనమనదగు నీ యనంతపరిణామసిద్ధాంతము కేవలము హేతు రహితము; యుక్తివిరుద్ధము. కానిచో నిది సత్యమును గ్రహించు టకై కొంతదూరమువఱకును బోయి మరల వెనుకకు మరలుచున్నది. వాయురూపమగు సూక్ష్మస్థితినుండి సూర్యచంద్రనక్షత్రము లుత్పత్తియై, ప్రళయావసరమున మరల సూక్ష్మావస్థ నెట్లు పొందు చున్నవో గమనింపుడు. ప్రపంచమునందంతటను జరుగుచున్న వ్యాపార మిదియే. నేలనుండి మొక్క తనకు గావలసిన పదార్థమును లాగుకొని, తన ప్రయోజనము తీరినంతనే మరల దానిని బయటికి త్రోసి వేయు చున్నది. ప్రతిరూపమును తనచుట్టునున్న అణువులనుండి యుత్పత్తియై తిరిగియాయణురూపమును బొందుచున్నది. ఒకే నియమము వేర్వేఱు స్థలములందు వేర్వేఱువిధములుగానుండ నేరదు. నియమ మనునది సర్వ

కాల సర్వావస్థలయందును ఒక్కవిధముగనే యుండును. ఇది నిశ్చయము. బాహ్యప్రకృతినియమ మిట్లున్నయెడల, ఆంతరప్రకృతియందును నిది వర్తించును. మనస్సు తిరిగి తన యుత్పత్తిస్థానమునందు లయించుచున్నది. మనము వాంఛించినను, వాంఛింపకున్నను సరియే, ఈశ్వరుడనియు పరబ్రహ్మమనియు జెప్పబడు మన సహజస్థితిని మనము పొందితీరవలయును. ఈశ్వరుడే మన కందఱకును మూలకారణము. మరల మనమందఱమును ఈశ్వరుని జేరుట విధివిహితము. ఇట్టి మూలకారణమును భగవంతు డనుడు, పరబ్రహ్మ మనుడు, ప్రకృతియనుడు, ఇందలి యథార్థ మిదియే. "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి"—అనగా, నెవనియందుండి ఈ సృష్టిజాతమంతయు నుత్పత్తియై, ఎవనియందు జీవించుచు, తిరిగి యెవనియందు ప్రవేశించుచున్నదో—అని వేదములు వచించుచున్నవి. ఇది యథార్థము, ప్రకృతి యొకే విధమున వర్తించుచున్నది. ఒక గోళమునందు వర్తించుచున్న ధర్మములే కోట్లకొలది గోళములందు వర్తించుచున్నవి. గ్రహములందు కానవచ్చునట్టి ధర్మములే భూమండలమునందును, మనుష్యులయందును, సమస్త సృష్టిజాతమునందును కానవచ్చుచున్నవి. మహోత్తుంగతరంగము కోట్లకొలది చిన్నచిన్న యలల కూడికయై యున్నది. కోట్లకొలది జీవరాసుల యుత్పత్తియే ప్రపంచోత్పత్తియగును. సమస్త వసుంధరాస్తమయము కోట్లకొలది జీవరాసుల సంయుక్తాస్తమయము. వీని ప్రళయమే ప్రపంచ ప్రళయమగును.

ఇట్లు తిరిగి భగవంతుని జేరుట ఉన్నతావస్థయా, కాదా? అను ప్రశ్న తలయెత్తుచున్నది. ఉన్నతావస్థయే యని యోగతత్త్వజ్ఞులు వక్కాణించుచు, అట్టి యున్నతావస్థనుండి కలిగిన పతనమే మానవుని ప్రస్తుతస్థితియని చెప్పుచున్నారు. సర్వమతములును మనుష్యస్థితికంటె బ్రాహ్మస్థితి యుచ్చస్థితి యని యంగీకరించు

చున్నవి. అనగా మానవుడు తొలుత విశుద్ధుడై యుండుననియు, పరమనికృష్టస్థితి ప్రాపించునంతవఱకును పతనము పొందుచుండు ననియు, మరల పునరుజ్జీవితుడై, ఉచ్చస్థితిని బొందునట్టి సమయము వచ్చితీఱుననియు భావము. ఇట్లాతడు పరివర్తనము పొందుచు నొకప్పుడు తానెంతటి నీచస్థితిని బొందినను మరల గమ్యస్థానోన్ముఖుడై, భగవంతుని జేరుట విధివిహితము. తొలుత మనుష్యుడు భగవంతునియందుండి వెలువడును. నడుమ నాతడు మనుష్యస్థితిని బొందును, తుదకు మరల భగవంతుని జేరును. ఇది ద్వైతమతాభిప్రాయము. మనుష్యుడు భగవంతుడేయనియు, తిరిగి భగవంతునియందైక్యమగుననియు అద్వైతమతాభిప్రాయము. మన ప్రస్తుతావస్థయే ఉన్నతస్థితియై యున్నయెడల, ఇన్ని పెడబొబ్బ లెందులకు? ఇన్ని హాహాకారము లెందులకు? తుదకు వీని కన్నిటికిని స్వస్తి చెప్పుటెందులకు? ప్రస్తుతావస్థయే శ్రేష్ఠమైనయెడల నిది యంతమొందనేల? క్షయవినాశములతో గూడిన స్థితి యెన్నడును ఉత్తమస్థితి కానేరదు. కాని, మన ప్రస్తుతావస్థ యింత ఘోరమై, అసంతృప్తికరమై దుర్భరమై యుండుటకు హేతువేమి? మనకు ఉత్తమగతి లభించుట కాధారభూతమై యుండుటచే, దివ్యత్వమును బొందుటకు సాధనభూతమై యుండుటచే, ప్రస్తుతావస్థల నిరసింపజాలము. భూమిలో నాటబడిన బీజము శిథిలమై కొంతకాలమైన పిమ్మట లయించినంతనే అందుండి దివ్యవృక్షము బయల్వెడలుచున్నది. ఇట్లే దివ్యత్వమును బొందుటకై ప్రతిజీవియు తనజీవత్వమును లయింపజేసికొనవలయును. కావున 'మనుష్యావస్థ' యను నీ ప్రస్తుత స్థితినుండి యెంత శీఘ్రముగా వెలువడిన నంత శ్రేయస్కరము. ఆత్మహత్యచే మన కీ స్థితినుండి విమోచనము కలుగునా యనిన, ఎన్నటికిని గలుగదు. ఆత్మహత్యవలన మఱింత కీడు మూడును; ఆత్మహింసచే గాని ప్రపంచ దూషణముచేగాని ప్రస్తుతావస్థనుండి మన కెన్నడును విమోచనము కలుగజాలదు. నైరాశ్యము, నిస్సహాయతయు నను

పంకిలమును దాటి ఈ సంసారసాగరమునుండి మనము తరింపవల యును; ఎంత శీఘ్రముగా తరించిన అంత శ్రేయస్కరము. మనుష్య స్థితియే మహోన్నతస్థితి కాదని గుర్తింపుడు.

మహోన్నతస్థితియు, నిరుపాధికావస్థయు నగు బ్రాహ్మీస్థితి, కొందఱు తలచున ట్లొకవిధమైన జలచరస్థితికాని, పాషాణస్థితిగాని కాదని గ్రహింతుముగాక. అస్తిత్వ మనునది పాషాణస్థితిగనైనను భావస్థితిగనైనను నుండవలయునని వీరి యూహ. ఇట్లు నియమించుట కేవలము యుక్తివిరుద్ధము, భావస్థితికంటె కోటిరెట్లు ఘనతరమైన అతీంద్రియస్థితి లేదని వీ రెట్లు చెప్పగలరు? జ్యోతిస్స్పందనములు అత్యల్పముగా నున్నప్పుడు వానిని మనము చూడజాలము. అంతకంటె కొంచె మధికముగా నున్నప్పుడు మన కవి వెలుతురు నిచ్చుచున్నవి. అత్యధికముగా నున్నప్పుడు మరల మన కవి కానవచ్చుటలేదు; అప్పుడు చీకటియగును. ఈ చీకటియు మొదటనున్న చీకటియు నొక్కటియేనా? ఎన్నటికిని కాదు. ఈ రెండు స్థితులకును ఉత్తర దక్షిణ ధ్రువముల కున్నంత తారతమ్యము కలదు. ఱాతియందలి భావరహితస్థితియు, పరబ్రహ్మమునందలి భావరహితస్థితియు ఒక్కటి యేనా, కానేరదు, అవి పరస్పర భిన్నములు. భగవంతుడు చింతింపడు, తర్కింపడు. భగవంతు డెందులకు తర్కింపవలయును? భగవంతుడు యోచింపవలసి యుండుటకు ఆతనికి తెలియని దేమైన కలదా? సర్వజ్ఞుడగు భగవంతుడు హేతువాదము చేయు టెందులకు? తర్కించుటకు ఱాతికి సమర్థత లేదు; భగవంతుని కిచ్ఛ లేదు. ఇంతటి తారతమ్యముకలదు. ఈ తత్త్వవేత్తలు భావస్థితి నతిక్రమించుట మహోపద్రవకరమని భావించుచున్నారు. భావస్థితిని మించిన దేదియు లేదని వీరి భావము.

తార్కికజ్ఞానావస్థకంటె, హేతుశక్తికంటె అత్యున్నతమగు మనఃస్థితులుకలవు. బోధ నతిక్రమించుటయే పారమార్థికజీవిత మునకు ప్రథమసోపానము. భావమును, బుద్ధిని, తార్కికజ్ఞానమును

సంపూర్ణముగా నతిక్రమించిననేకాని ఆధ్యాత్మికసాధన నీ కారంభము కానేరదు. అదియే నిజమగు జీవితారంభము. సాధారణముగా మనము జీవితమనునది ఆధ్యాత్మికజీవితమునకు బీజావస్థ.

అతీంద్రియస్థితియే అత్యున్నతస్థితి యనుటకు ప్రమాణమేమి? అని ఇక ప్రశ్న. ఒకటి: వాక్శూరులవలెగాక స్వార్థరహితులై, అప్రతిమానప్రతిభావంతులై, ప్రపంచము నుఱ్ఱూతలూగించిన మహాపురుషు లందఱును, సర్వాతీతమగు ననంత పరిపూర్ణస్థితిని బొందుటకై మానవజీవితము మనకొక సాధనమాత్రమని చాటుచున్నారు. రెండు: ఇట్లు చెప్పుటయేకాక, వారు సర్వజనులకును దారి చూపుచున్నారు; ఎల్లరును తమ యడుగుజాడల ననుసరించి ఈశ్వరుని బ్రాపింపగలుగునట్లు తమ పద్ధతులను విశదీకరించియున్నారు. మూడు: జీవితసమస్యకు వేఱొక సమాధానము లేదు. మనుష్యస్థితియే మహోన్నతస్థితియగునెడల మన మీ సంసారచక్రమునందు పరిభ్రమింప నేల? జగద్వ్యాపార మిట్లుండవలయు ననుటకు దగిన హేతువేమి? ఇంద్రియగోచరమగు ప్రపంచమును మన మతిక్రమింప జాలనియెడల, అతీంద్రియజ్ఞానమును బొంద నెంచుట నిష్ఫలమైనయెడల, దృశ్యప్రపంచమే మన జ్ఞానమునకు సరిహద్దై యుండును. ఇదియే అజ్ఞేయవాద మనబడును. సరియే కాని, ఇంద్రియముల ద్వారా సాధ్యమగు ప్రత్యక్షప్రమాణమును విశ్వసింపవలయుననుటకు హేతువేమి? నడివీథిలో నిశ్చలుడై, నిలువబడి ప్రాణములు విడుచువాడెవ్వడో అతడే నిజమైన అజ్ఞేయవాది యని చెప్పెదను. తార్కికజ్ఞానమును మించినదేదియు లేనియెడల, మనము నాస్తికవాదము నవలంబింపవలసియుండును. ధనకీర్తి గౌరవములయెడగాక మిగిలిన విషయము లన్నిటియెడలను అజ్ఞేయవాదము నవలంబించునట్టివాడు పట్టి డాంబికుడు. దురంతమును, దుర్భేద్యమును నగు తార్కికజ్ఞానము నావరణము నతిక్రమింపజాలమని 'కాంటు' స్పష్టముగా నిరూపించియున్నాడు. కాని హైందవజ్ఞానమున కిది ప్రథమ

సోపానము. తార్కికజ్ఞానాతీతమగు దివ్యజ్ఞానమును బొందుటకై హిందువులు సాహసించి విజయము గాంచియున్నారు. అతీంద్రియ జ్ఞానమువలననే ప్రస్తుత సమస్యల కన్నిటికిని సమాధానమును బడయ నగును. సంసారసముద్రమునుండి తరించుటయే మన కిందువలన గలుగు ప్రయోజనము. "తండ్రీ! మమ్ముల నీ యజ్ఞానసాగరము నుండి తరింపజేయు" మని ప్రార్థించుటయే పరమమైన మతధర్మము. మఱేదియుగాదు.

---

## పాతంజలయోగసూత్రములు

## ప్రథమాధ్యాయము

## ఏకాగ్రత—దాని ఆధ్యాత్మిక ప్రయోజనములు

# సమాధి - పాదము

1. అథ యోగానుశాసనమ్.

ఇప్పుడు యోగముయొక్క స్వరూపలక్షణములు చెప్పబడు చున్నవి.

2. యోగః చిత్తవృత్తినిరోధః.

చిత్త (అంతఃకరణ) వృత్తులను నిగ్రహించుటయే యోగ మనబడును.

ఇచ్చట విపులముగా విశదీకరింపవలసియున్నది. చిత్తమన నేమియో వృత్తులన నేమియో తెలిసికొనవలయును నాకు కన్నులున్నవి. కన్నులు తమంతట తాము చూడవు. మెదడునందలి నేత్రనాడీకేంద్రమును దీసివేయుడు. కన్నులు యథాప్రకారముగనే యుండును. నేత్రాంతఃపటలము (రెటినా) లేక దృగ్యంత్రమును పరి

పూర్ణముగనే యుండును. దానిపై బడు ప్రతిమలును అచ్చటనే యుండును. ఐనను కన్నులు చూడజాలవు. దీనినిబట్టి కన్నులప్రధానమైన సాధనములు మాత్రమేయనియు, చూచునట్టి ఇంద్రియములు కావనియు దేలుచున్నది. చూచునట్టి ఇంద్రియము మెదడునందలి యొకానొక నాడీకేంద్రమునం దున్నది. దృష్టియేర్పడుట కీ రెండు కన్నులును జాలవు. ఒకప్పుడు కన్నులను దెఱచుకొని యొకడు నిద్ర పోవుచుండును. అప్పుడు చూపేర్పడుటకు గావలసిన వెలుతు రచ్చట నున్నది. బాహ్యవస్తువులనుండి పడుచున్న ప్రతిమయు నచ్చట నున్నది. కాని వీనికి దోడు మూడవ దొకటి కావలసియున్నది; మనస్సు ఇంద్రియముతో సంయోగము పొందవలయును. నేత్రము బాహ్యోపకరణము. మనకు దీనికి సాయము మెదడునందలి కేంద్రమును, మనస్సుయొక్క నియంతృత్వమును ఆవశ్యకములు. వీథివెంట బండ్లు పోవుచున్నను వానిచే గలుగునట్టి ధ్వని మీకు వినబడుట లేదు. కారణ మేమి? శ్రవణేంద్రియముతో మీ మనస్సు సంయోగము పొందకుండుటవలన. మొదట ఉపకరణమును, అనంతర మింద్రియమును, మూడవది మనస్సునకు ఈ రెండింటితోడను సంయోగము నను మూడు విషయములు కలవు. వీనిచే కలుగునట్టి స్పర్శ లేక వార్తను మనస్సు లోనికి గొనిపోయి నిశ్చయాత్మకమగు బుద్ధికి నివేదించును. అపు డీ బుద్ధి ప్రతిక్రియను సల్పును. ఈ ప్రతిక్రియను వెన్నంటి అహంభావము భాసించును. అప్పు డీ క్రియా ప్రతిక్రియల సంయోగము, నిజమైన ఆత్మయగు పురుషునకు నివేదింపబడుచున్నది. ఇట్టి సంయోగాంతరమున పురుషుడు విషయము నుపలక్షించుచున్నాడు. ఇంద్రియములును, మనస్సును, నిశ్చయాత్మకమైన బుద్ధియు, అహంకారమును గూడి అంతఃకరణచతుష్టయమని చెప్పబడును. ఇవి యన్నియు కేవలము చిత్తమునందలి వేర్వేఱు వ్యాపారములు. చిత్తమునందలి యోచనతరంగములు వృత్తులన బడుచున్నవి. (వృత్తులనగా సుడిగుండములని యర్థము). యోచన యన నేమి? భూమ్యాకర్షణశక్తి, వికర్షణశక్తి మొదలగు

వాసివలెనే యోచనగూడ ఒకవిధమైన శక్తియై యున్నది. ప్రకృతియందలి అనంతశక్తి సంజాతమునుండి చిత్తము కొంత శక్తిని గ్రహించి దానిని యోచనరూపమున బయటికి బంపుచున్నది. ఈ శక్తి మనకు ఆహారమువలన గలుగును. ఆహారమునుండియే శరీరము గమనాదికమైన శక్తులను బొందుచున్నది. అందుండియే ఇతరములగు సూక్ష్మతరశక్తులను యోచనరూపమున వెలువడజేయుచున్నది. కావున చిత్తము చైతన్యవంతము కాదని మనము గ్రహింపవచ్చును. ఐనను చిత్తము చైతన్యవంతమై యున్నట్లు కానబడుచుండును. ఎందుచేత? చైతన్యవంతుడగు పురుషుడు చిత్తమువెనుక నుండుటచేత. చైతన్యయుతుడవు నీవే; బాహ్యప్రపంచమును గ్రహించుటకు చిత్తము నీకొక సాధనమాత్రము. ఉదాహరణమున కీ పుస్తకమును దీసికొందము. ఈ పుస్తకము పుస్తకరూపమున బాహ్యప్రపంచమునందు లేదు. ఇయ్యది బాహ్యమున నేమై యున్నదియు మనకు దెలియదు; తెలియబడనేరదు. పుస్తకమను నీ యజ్ఞాతవస్తువువలన చిత్తమునకు సంఘర్షము కలుగును. ఱాతిని నీటిలో బడవైచినయెడల నీరు తరంగరూపమున దానిపై బడుచున్న విధముననే. యిట్టి సంఘర్షమును బొందినంతనే చిత్తము పుస్తకరూపమగు ప్రతిక్రియను గల్గించుచున్నది. ప్రపంచ మనునది నిజముగా బాహ్యవిషయములకు చిత్త మొనర్చునట్టి ప్రతిక్రియరూపమగు సంఘటనము. పుస్తకరూపముగాని, గజరూపముగాని, మనుష్యరూపముగాని బాహ్యప్రపంచమునందు లేదు. బాహ్యస్పర్శవలన చిత్తమునందు గలుగు ప్రతిక్రియ మాత్రమే మనకు గోచరించును. "స్పర్శాది ఇంద్రియానుభూతుల శాశ్వత సంభవనీయతయే భౌతిక ప్రకృతి" యని జాన్ స్టూవర్ట్ మిల్ చెప్పియున్నాడు. శబ్దాది విషయములు మాత్రమే బాహ్యప్రపంచమునందు గలవు. ఉదాహరణమునకు ముత్తెపు జిప్పను దీసికొనుడు. మంచి ముత్తెము లెట్లు నిర్మాణమగుచున్నవో

మీకు దెలియునుకదా. పరశరీరము నాశ్రయించి జీవించునట్టి పురుగొకటి ముత్తెపుజిప్పలో బ్రవేశించి ముత్తెపుజిప్పకు 'గులగుల' కలిగించును. అంతట ముత్తెపుజిప్ప పింగాణివంటి పదార్థమును దానిచుట్టును వెలువరించును; అదియే ముత్యమగును. ఇట్లు దృశ్యప్రపంచము మనవలన నుత్పన్నమగునట్టి పింగాణియని చెప్పనొప్పును. ఇక నందులకు మూలకారణమగు పై జెప్పిన కీటకమే యథార్థప్రపంచమగును. సామాన్యజను లీ యథార్థప్రపంచము నెన్నడును తెలిసికొనజాలరు. తెలిసికొన యత్నించినయెడల తాము కల్పించుకొనునట్టి భావనాప్రపంచమే వారికి గోచరించుచుండును. చిత్తవృత్తులనగా నేమియో మన మిప్పుడు గ్రహించియున్నాము. పురుషుడు మనస్సున కాధారభూతుడు; మనస్సు ఆతని చేతియందలి సాధనము; ఆతని చైతన్యమే మనస్సుద్వారా వెలువడుచున్నది. మనస్సునకు నీ వాధారభూతుడవై యుండుటచేతనే మనస్సు చైతన్యవంతమగుచున్నది. పురుషుడు మనస్సును పరిత్యజించినంతనే మనస్సు నశించును. ఇట్లు, చిత్త మన నేమియో తెలిసికొంటిమి. ఇది మనోపదార్థము. బాహ్యవిషయములకును చిత్తమునకును సంయోగము కలుగుటచే వృత్తు లను తరంగములు చిత్తమునందు లేచుచుండును. ఈ వృత్తులే మనయొక్క ప్రపంచము.

అలలతో గూడిన సరస్సుయొక్క అడుగుభాగమును మనము చూడజాలము. తరంగము లణగి నిశ్చలముగా నున్నప్పుడే అధోభాగము క్షణకాలము మనకు గోచరించును. నీరు మలినమైయున్నను, చలించుచున్నను, మనకు నీటి యడుగుభాగము కానబడదు. మన నిజస్వరూపమగు ఆత్మయే చిత్తమను నీ సరస్సునందలి అధోభాగము. చిత్తవృత్తులే తరంగములు. మఱియు చిత్తమునకు సాత్త్విక, రాజసిక, తామసిక స్థితులు గలవు. తామసికస్థితి పశువులందును పశుతుల్యులందును విశేషముగా గాన్పించును. ఈ స్థితి హానికరము. ఒరులకు హాని చేయనెంచుటయే ఈ స్థితియందున్న

చిత్తమునకు సహజ ప్రవృత్తియైయుండును. విషయభోగములను, అధికారమును వాంఛించుచుండుట రాజసికచిత్తమునకు ప్రధానలక్షణములు. ఇట్టి చిత్తస్థితి "శక్తిమంతుడనై ఇతరులపై నధికారమును నెఱపుదునుగాక" యని ప్రేరేపించుచుండును. ఇక శాంతమై ప్రసన్నమైయొప్పు సాత్త్వికస్థితియందు మనస్సరోవరము నిస్తరంగమై నిర్మలమైయుండును. జడమగు మనఃస్థితి సాత్త్వికస్థితి కానేరదు. సాత్త్వికమనఃస్థితి ధృత్యుత్సాహసమన్వితమైయుండును. శాంతముగా నుండుట యనగా అత్యధికమగు శక్తిని ప్రదర్శించుటయని భావము. పనిచేయుచుండుటయే సులభము. కళ్లెములను విడిచినంతనే గుఱ్ఱములు యథేచ్ఛగా పరుగెత్త నారంభించును. ప్రతివానికిని ఇది సాధ్యము. కాని మహావేగమున పరుగెత్తు గుఱ్ఱములను నిలుపగల్గినవాడే నిజమైన బలశాలి. నిలుపుటకే విశేషమగు బలము కావలయును. వదలివేయుటకు బలమెందులకు? కావున శాంతచిత్తుడనగా, పనిపాటులులేక మందుడై అలసుడై యుండునట్టివాడు కాడు. సత్త్వమనగా అలసతయనిగాని సోమరితనమనిగాని తలంపకుడు. చిత్తవృత్తులను నిరోధించునట్టివాడే ప్రశాంతచిత్తుడు. నికృష్టమగు బలప్రకటనము ప్రవృత్తి; ఉత్కృష్టమగు బలప్రకటనము ప్రశాంతత.

మనస్సెప్పుడును తన స్వాభావిక శుద్ధావస్థకు మరలుటకై యత్నించుచుండును; కాని ఇంద్రియములు మనస్సును బయటికి లాగుచున్నవి. మనోనిగ్రహమే, మనస్సుయొక్క బహిఃప్రవృత్తి నరికట్టి ప్రజ్ఞానఘనమగు నాత్మస్థితిని బొందించుటకై మనస్సును అంతర్ముఖము చేయుటయే యోగమునకు ప్రథమసోపానము. మనోనిగ్రహమున కిదియే సరియైన మార్గము.

క్రిమికీటకములనుండి పశుపక్ష్యాదులవఱకును సమస్త జంతువులందును మనోవ్యాపారము కానవచ్చుచున్నను, మానవునియందు మాత్రమే మనస్సు బుద్ధిరూపమును బొందుచున్నది. చిత్తము బుద్ధి

రూపమును బొందనిదే నివృత్తిమార్గము నవలంబించి వివిధసాధనల మూలమున ఆత్మమోక్షమును గల్గింపజాలడు, ఆవు కుక్క మొదలగు జంతువులకు మనస్సున్నను, వాని మనస్సు బుద్ధి యను నట్టి రూపము నింకను బొందజాలకుండుటచే వెంటనే ముక్తిని బొందుట వానికి సాధ్యము కానేరదు.

క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అని చిత్తమునకు వివిధావస్థలు కలవు. ప్రవృత్తియే క్షిప్తావస్థకు లక్షణము. ఇట్టి మనఃస్థితి సుఖదుఃఖములందు వ్యక్తమగుచుండును. ప్రమాదహేతువగు సోమరితనము మూఢావస్థకు లక్షణము. క్షిప్తావస్థ దేవతలకును, మూఢావస్థ రాక్షసులకును సహజములని యోగసూత్రవ్యాఖ్యానకారుడు చెప్పుచున్నాడు. నివృత్తియే విక్షిప్తావస్థకు లక్షణము. చిత్తము ఏకాగ్రమగుటకు యత్నించునపుడు ఏకాగ్రస్థితి యగును. ఏకాగ్రస్థితినుండి సమాధి స్థితికి గొనిపోవునట్టి స్థితియే నిరుద్ధావస్థ.

3. తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్.

అప్పుడు (అనగా యోగావస్థయందుండు కాలమున) సాక్షి యగు పురుషుడు స్వస్వరూపమునందు నెలకొనియుండును.

అల లణగి, సరస్సు నిర్మలమై యున్నప్పుడు అడుగుభాగమును మనము చూడగలము. ఇట్లే మనస్సు ప్రశాంతముగా నున్నప్పుడు స్వస్వరూపమును గనుగొందుము. అప్పుడు మనస్సుతో తాదాత్మ్యమును బొందక ఆత్మస్వరూపులమై యుందుము.

4. వృత్తి-సారూప్య మితరత్ర.

ఇతరసమయములందు (అనగా యోగములేని దశయందు) పురుషుడు వృత్తులతో సమానస్వరూపమును బొందియుండును.

ఎట్లన, నొకడు నన్ను తిట్టు ననుకొనుడు; దానివలన నా మనస్సునందొకానొక వృత్తి కలుగుచున్నది. ఆ వృత్తితో

నేను తాదాత్మ్యమును బొందుచున్నాను. దుఃఖ మందులకు ఫలిత మగుచున్నది.

5. వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః.

క్లేశములు కలవియు, క్లేశములు లేనివియు నగు వృత్తు లయిదు విధములుగా నున్నవి.

6. ప్రమాణ-విపర్యయ-వికల్ప-నిద్రా-స్మృతయః.

ప్రమాణవృత్తి, విపర్యయవృత్తి, వికల్పవృత్తి, నిద్రావృత్తి, స్మృతివృత్తి అని వృత్తు లైదువిధములు.

7. ప్రత్యక్ష అనుమాన-ఆగమాః ప్రమాణాని.

ప్రత్యక్షము, అనుమానము, ఆగమము (శబ్దము) అని ప్రమాణములు మూడువిధములు.

శబ్దాదివిషయములవలన మనకు కలుగునట్టి రెండు ప్రత్యక్షానుభవములు ఒకదానికొకటి విరుద్ధముగా లేనియెడల దానిని ప్రమాణ మందుము. నా కొక శబ్దము వినబడు ననుకొనుడు. నా పూర్వానుభవమున కిది విరుద్ధముగా నున్నయెడల నేను దీనిని విశ్వసింపక, నిరాకరింప నారంభింతును. మఱియు ప్రత్యక్షమనియు, అనుమానమనియు, ఆప్తవాక్యమనియు ప్రమాణములు మూడు విధములుగా నున్నవి. భ్రమించుట కెట్టి హేతువును లేనియెడల, మనకు గలుగునట్టి అనుభవము ప్రత్యక్షప్రమాణమగును. ప్రపంచము కలదనుటకు ప్రపంచము నాకు గోచరించుటయే ప్రమాణము. లక్షణమునుండి లక్ష్యవస్తువును గ్రహించుట అనుమానప్రమాణ మనబడును. తత్త్వదర్శులగు యోగుల ప్రత్యక్షానుభవమే ఆప్త వాక్యము. జ్ఞానమును బడయుటకై మనము యత్నించుచున్నను, అందులకై విశేషాయాసప్రదమైన హేతువాదము నవలంబించుచు ఓర్పుతో బహుకాలము కృషి చేయవలసియున్నది. ఋషులును యోగులును ఇట్లు శ్రమపడనక్కఱలేదు. వారి సామాన్యపద్ధతుల

నతిక్రమించియున్నారు. భూత భవిష్యద్వర్తమానములు వారికి సమానములై యేకగ్రంథముగా నుండునని చెప్పనొప్పును. జ్ఞానసంపాదనమునకై క్లేశయుతములగు మన పద్ధతులను వా రవలంబింప నక్కఱలేదు. తమయందే సమస్తవిజ్ఞానమును వారికి గానవచ్చుటచే వారి వాక్యములు మనకు ఆప్తవాక్యములై ప్రమాణములై యొప్పును. వారియందుండియే శ్రుతి స్మృతులు వెలువడుచున్నవి. కావున వేద శాస్త్రములు మనకు ప్రమాణములు. నేడిట్టి మహాత్ములెవ్వరైనను జీవించి యున్న యెడల వారి వచనములు మనకు పరమప్రమాణములు. ఆప్తవాక్యప్రామాణ్యమును గూర్చి యితర తత్త్వజ్ఞులు దీర్ఘవాదములను జేయుచు "వారి వచనములకు ప్రమాణమే" మని ప్రశ్నించుచుందురు. వారి ప్రత్యక్షానుభవమే అందులకు ప్రమాణము. ఏలయన, నీ పూర్వానుభవమునకు ప్రత్యక్షమైన నీ ప్రస్తుతానుభవము విరుద్ధము కానియెడల అది నీకు ప్రమాణమగును. అతీంద్రియజ్ఞానము మన తార్కికజ్ఞానమునకును, పూర్వానుభవమునకును విరుద్ధము కానియెడల అట్టి జ్ఞానము సదా ప్రమాణమగును. పిచ్చివా డొకడీ గదిలోనికి వచ్చి, తన చుట్టును తనకు దేవతలు కాన్పించుచున్నారని చెప్పవచ్చును. అంతటితో వాని మాటలు మనకు ప్రామాణ్యములు కానేరవు. జ్ఞానము యథార్థమై యుండవలయును. మఱియు పూర్వానుభవమున కది విరుద్ధముగా నుండరాదు. తన యనుభవమును వెల్లడించువాని శీలముపై నాతని యనుభవ మాధారపడి యుండవలయును. ఒకని శీలముకంటె వాని వచనములే ప్రధానములనియు, కావున మున్ముందు వానివచనములను వినవలయుననియు కొందఱు చెప్పుచుండగా వినియున్నాను. వ్యావహారికవిషయములం దీసూత్రము యథార్థమై యుండవచ్చును. దుర్మార్గుడై యుండియు జ్యోతిశ్శాస్త్రమునం దొకడు నూతనవిషయములను కనుగొనవచ్చును. కాని పారమార్థికవిషయములం దీ సూత్రము వర్తింపదు. ఏలయన, దుర్మార్గు డెన్నడును తత్త్వ

జ్ఞానమును బొందజాలడు. అందుచే తా నాప్తుడనని వచించునట్టి వాడు స్వార్థరహితుడగునా, కాదా? పవిత్రహృదయు డగునా, కాదా? జితేంద్రియు డగునా, కాదా? వాని వచనములు మానవకోటి కింతవఱకును ఉపలబ్ధమైయున్న విజ్ఞానమున కనుగుణముగా నున్నవా, లేదా? యని మున్ముందు మనము నిశ్చయించుకొనవలయును. ఎట్టి నూతనధర్మమైనను సనాతనధర్మమునకు విరుద్ధముగా నుండక తదనుగుణముగా నుండును. మఱియు నాతడు కనుగొనిన విషయము పరిశీలనయోగ్యమై యుండవలయును. నాతో నొకడు తా నొక దివ్యదృశ్యమును జూచితిననియు అట్టిదృశ్యమును జూచుటకు నా కధికారము లేదనియు జెప్పినపక్షమున నేను వాని మాటలను నమ్మజాలను. స్వయముగా నెవ్వడైనను ఆ దృశ్యమును జూడగల్గియుండవలయును. మఱియు తనజ్ఞానమును విక్రయించునట్టి వాడు ఆప్తుడు కానేరడు. ఆప్తుడగువాడు పరిశుద్ధహృదయుడై, స్వలాభాపేక్షారహితుడై యుండవలయును. కీర్తిప్రతిష్ఠల నాతడాశింపరాదు; ఆత డతీంద్రియజ్ఞానవంతుడని మనకు దెలియవలయును. ఆతడు వెల్లడించునట్టి విషయము లతీంద్రియవిషయములై యుండుటయేకాక ఇతర పారమార్థికతత్త్వముల కనుగుణములై లోకకల్యాణకరములై యుండవలయును. మఱియు, నాతని తత్త్వజ్ఞానము ఇతరములగు ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములకు విరుద్ధముగా నుండరాదు; ఉన్నయెడల వెంటనే దానిని పరిత్యజింపుడు. ఆతని కొక్కనికేకాక సర్వజనులకును ఆతని తత్త్వజ్ఞానము సాధ్యమై యుండవలయును. ఈ నియమములన్నియు వర్తించిననేకాని, ఆతడాప్తుడు కానేరడు. ఇట్లు ప్రత్యక్షమనియు, అనుమానమనియు, ఆప్తవాక్యమనియు ప్రమాణములు మూడువిధములుగా నున్నవి. ఆప్తుడను పదము నాంగ్లములోని కనువర్తింపబడజాలదు. ఏలయన ఆప్తుడనగా దివ్యావేశమును బొందినవాడని చెప్పినయెడల, ఆవేశము పైనుండి కలుగునని నమ్ముచున్నాము. దివ్యజ్ఞానమో, పురుషుని

యందుండి వెలువడుచున్నది. 'ఆప్త' మనగా పొందబడినదని యర్థము.

8. విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప-ప్రతిష్ఠమ్.

లేనివస్తువుయొక్క రూపమునందు ఆ వస్తువు కలదనెడి మిథ్యావిజ్ఞానమే విపర్యయవృత్తి.

ముత్తెపుజిప్పను జూచి వెండియని భ్రాంతి చెందునట్లు, ఒక వస్తువునుజూచి యది వేఱొకవస్తువని భ్రాంతిచెందుటయే విపర్యయ వృత్తి.

9. శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః.

శబ్దానుగుణమైన వస్తువు లేకుండినను, శబ్దజ్ఞానముచే ననుసరింపబడునట్టి వృత్తి వికల్పవృత్తి యనబడును.

వికల్ప మను వేఱొకవిధమైన వృత్తికలదు. ఒకశబ్ద ముచ్చరింపబడిన దనుకొనుడు. సావధానులమై ఆ శబ్దార్థ మేమని విచారింపక వెంటనే నిర్ధారణచేయుచుందుము. ఇది చిత్త దౌర్బల్యమునకు లక్షణము. మనోనిగ్రహమును ప్రతిపాదించునట్టి సిద్ధాంతము మన కిందువలన సుబోధకము కాగలదు. దుర్బలుడగు కొలదియు మానవునకు మనోనిగ్రహము క్షీణించుచుండును. ఆత్మపరీక్ష కెప్పుడును ఈ ప్రమాణము నవలంబింపుడు. కోపముగాని, దుఃఖముగాని కలుగనున్న సమయమున, "ఏదియో యొకవార్తను వినినంతనే అనివార్యముగా నాకేల ప్రత్యేకమగు నీకోపవృత్తిగాని దుఃఖవృత్తి గాని కలుగవలయును?" అని నీలో నీవు విమర్శించుకొనుము.

10. అభావ-ప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా.

అభావము నాశ్రయించి యుండునట్టి వృత్తి నిద్రావృత్తి యనబడును.

నిద్రావృత్తియనియు, స్వప్నవృత్తియనియు, మఱియొకవిధ మగు వృత్తులు కలవు. మనము నిద్ర మేల్కొనినప్పుడు నిద్రపోయి

యుంటిమను జ్ఞానము మనకుండును. ఐనను తదనుభవమును గూర్చి జ్ఞప్తిమాత్రమే మనకు గలుగును. అనుభవింపని విషయమును గూర్చి మన కెప్పుడును స్మృతి కలుగజాలదు. ప్రతి చిత్తవృత్తియు సరస్సునందలి అల వంటిది. నిద్రించుచుండినప్పుడు చిత్తములో నెట్టి వృత్తులును లేకుండినయెడల అనుకూలానుభవములుగాని ప్రతికూలానుభవములుగాని కలుగజాలవు. కావున వానిని మనము జ్ఞప్తి యందుంచుకొనుటెన్నడును సంభవింపదు కాని నిద్రించితిమను స్మృతివలననే నిద్రావస్థయందును చిత్తమునం దొకవిధమైన వృత్తులుండి యుండునని స్పష్టమగుచున్నది. స్మృతియనునది మఱియొక విధమైన వృత్తి.

## 11. అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః.

(ప్రమాణాది వృత్తులచే) అనుభవింపబడిన విషయములు జ్ఞప్తికి వచ్చుటయే స్మృతివృత్తి యనబడును.

ప్రత్యక్షానుభవమువలనగాని, మిథ్యాజ్ఞానమువలనగాని, వికల్పమువలనగాని, నిద్రవలనగాని, స్మృతి కలుగవచ్చును. ఎట్లన, నీవొకశబ్దమును వినుచున్నావు ఱాతిని విసరినయెడల సరస్సునందల లేర్పడునట్లే ఆ శబ్దమువలన చిత్తమునం దొక యల బయలుదేరుచున్నది; దానివలన క్రమముగా అనేకమైన చిన్నయలలు లేచుచున్నవి. ఇదియే స్మృతి. నిద్రయందును ఇట్లే జరుగును. నిద్రయనునట్టి విచిత్రమైన యొక వృత్తివలన చిత్తమునందు స్మృతియను వృత్తి కలిగినప్పుడు అది స్వప్నమనబడును. జాగ్రదవస్థ యందలి స్మృతి వృత్తియే నిద్రావస్థయందు స్వప్నరూపమును బొందుచున్నది.

## 12. అభ్యాస-వైరాగ్యాభ్యాం తన్నిరోధః.

అభ్యాస వైరాగ్యములచే పైజెప్పబడిన వృత్తులు నిరోధింపబడుచున్నవి.

వైరాగ్యము గలుగుటకై మనస్సు నిర్మలమై, సాధనార్హమై, విచారయోగ్యమై యుండవలయును. సాధనచేయు టెందులకో విచారింతము. మనము చేయు ప్రతికార్యమును సరస్సు పైభాగమున చలించుచుండునట్టి అలవంటిది. శబ్దాది విషయానుభవములు అదృశ్యమైనంతనే వానివలన గలుగు సంస్కారములు నిలిచియుండును. అనేకములగు సంస్కారములు కూడి అభ్యాసము అనునది యేర్పడుచున్నది. అభ్యాసము అపరస్వభావమని చెప్పబడుచున్నది. 'సాక్షాత్ స్వభావము'ను సంపూర్ణ స్వభావమును గూడ అభ్యాసమే. మనము సజ్జనులమైయున్నను దుర్జనులమైయున్నను, అంతయు అభ్యాసఫలితమే. అట్టియెడ మనమొక యభ్యాసము నలవఱుచుకొనుటకుగాని, విడుచుటకుగాని సమర్థులము; కావున మన ప్రస్తుత స్వభావమును గూర్చి నిరాశ చెందనక్కఱలేదు. సుఖదుఃఖాది అనుభవములు మనస్సున సంస్కారములను గల్గించుచుండును. ఈసంస్కారముల ఫలితమే మనశీలము. ఎట్టి సంస్కారములు బలవత్తరములై యుండునో వానినిబట్టి శీల మేర్పడుచుండును. సత్సంస్కారములు విశేషముగా నున్నయెడల సద్వర్తనమలవడును. దుష్టసంస్కారములు ప్రబలముగా నున్నయెడల దుష్టవర్తనమును గలుగుచుండును. ఇట్లే సంతోషకరమగు సంస్కారములచే మనము సంతుష్టులమై యుందుము. దురభ్యాసములను మానుటకు తద్వ్యతిరేక మనోవృత్తుల నవలంబించుటయే మన కుపాయము. దుష్టసంస్కార జనకములగు దురభ్యాసములను సదభ్యాసములచే నిరోధింపవలయును. కావున మంచి చేయుచు, సదా సద్భావములనే చింతింపుచుండుము; దుష్ట సంస్కారములను నిరోధించుట కిదియే మార్గము. ఎంతటి దుర్జనుని గుఱించి సమీక్షించినను, 'ఇక నతడు యోగ్యుడు కానేర' డని చెప్పవలదు. ఏలయన, అతని ప్రస్తుతవర్తన మాతని యభ్యాసఫలితమే కదా. నూతనమైన సదభ్యాసములచే తన పూర్వాభ్యాసముల నాతడు నిగ్రహింపవచ్చును. అభ్యాసఫలితమే శీలము కావున

మంచి యలవాటుల నలవఱుచుకొనుటయే శీలమును జక్క జేసి కొనుటకు మార్గము.

13. తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః.

చిత్తవృత్తులను సంపూర్ణముగా నిరోధించుటకై చేయు నిరంతరమైన యత్నమే అభ్యాసము.

సాధన యన నేమి? చిత్తమును వృత్తిరూపమును బొందకుండునట్లు చేయుట—చిత్తవృత్తి నిరోధము. ఇదియే సాధన యనబడును.

14. స తు దీర్ఘకాలనైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః.

ఆ యభ్యాసము బహుకాలము ఎడతెగక ఆదరాతిశయముతో సేవింపబడినయెడల స్థిరమైనస్థితి కలుగును.

మనోనిగ్రహము ఒక్కనాడు కృషిచేసినంతనే లభించునట్టిది కాదు; చిరకాలము నిరంతరమైన సాధన చేయుటవలన సిద్ధించును.

15. దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్.

ఇహపరములం దనుభవింపదగిన విషయముల యం దాశ లేనివానికి విషయములు తనకు వశమైనవని తెలియుటయే వైరాగ్యము.

రెండువిధములైన ప్రేరణములచే మనము కార్యములను జేయుచుందుము. ఒకటి ప్రత్యక్షమైన స్వానుభవము; రెండవది ఇతరుల యనుభవము. వీని ప్రాబల్యమువలన చిత్తమున వివిధవృత్తి తరంగములు గలుగుచున్నవి. ఈ శక్తులతో పోరాడి మనస్సును నిగ్రహించు సామర్థ్యమే వైరాగ్యము. చిత్తవృత్తులను విసర్జింపవలయును. నే నొక వీథివెంట పోవుచున్నా ననుకొనుడు. అంతట నొకడు వచ్చి నా గడియారము నెత్తుకొని పోవుచున్నాడు. ఇది నా

వైరాగ్యము గలుగుటకై మనస్సు నిర్మలమై, సాధనార్హమై, విచారయోగ్యమై యుండవలయును. సాధనచేయు టెందులకో విచారింతము. మనము చేయు ప్రతికార్యమును సరస్సు పైభాగమున చలించుచుండునట్టి అలవంటిది. శబ్దాది విషయానుభవములు అదృశ్యమైనంతనే వానివలన గలుగు సంస్కారములు నిలిచియుండును. అనేకములగు సంస్కారములు కూడి అభ్యాసము అనునది యేర్పడుచున్నది. అభ్యాసము అపరస్వభావమని చెప్పబడుచున్నది. 'సాక్షాత్ స్వభావము'ను సంపూర్ణ స్వభావమును గూడ అభ్యాసమే. మనము సజ్జనులమైయున్నను దుర్జనులమైయున్నను, అంతయు అభ్యాసఫలితమే. అట్టియెడ మనమొక యభ్యాసము నలవఱచుకొనుటకుగాని, విడుచుటకుగాని సమర్థులము; కావున మన ప్రస్తుత స్వభావమును గూర్చి నిరాశ చెంద నక్కఱలేదు. సుఖదుఃఖాది అనుభవములు మనస్సున సంస్కారములను గల్గించుచుండును. ఈసంస్కారముల ఫలితమే మనశీలము. ఎట్టి సంస్కారములు బలవత్తరములై యుండునో వానినిబట్టి శీల మేర్పడుచుండును. సత్సంస్కారములు విశేషముగా నున్నయెడల సద్వర్తనమలవడును. దుష్టసంస్కారములు ప్రబలముగా నున్నయెడల దుష్టవర్తనమును గలుగుచుండును. ఇట్లే సంతోషకరమగు సంస్కారములచే మనము సంతుష్టులమై యుందుము. దురభ్యాసములను మానుటకు తద్వ్యతిరేక మనోవృత్తుల నవలంబించుటయే మన కుపాయము. దుష్టసంస్కార జనకములగు దురభ్యాసములను సదభ్యాసములచే నిరోధింపవలయును. కావున మంచి చేయుచు, సదా సద్భావములనే చింతింపుచుండుము; దుష్ట సంస్కారములను నిరోధించుట కిదియే మార్గము. ఎంతటి దుర్జనుని గుఱించి సమీక్షించినను, 'ఇక నతడు యోగ్యుడు కానేర' డని చెప్పవలదు. ఏలయన, అతని ప్రస్తుతవర్తన మాతని యభ్యాస ఫలితమే కదా. నూతనమైన సదభ్యాసములచే తన పూర్వాభ్యాసముల నాతడు నిగ్రహింపవచ్చును. అభ్యాసఫలితమే శీలము కావున

యున్నారు. పురుషుడు ప్రకృతి కతీతుడై, సర్వాతీతుడై, నిత్య శుద్ధ బుద్ధ ముక్తుడై యున్నాడు. ప్రకృతియందు మనకు గోచరించు జ్ఞాన శక్తియంతయు ప్రకృతియందు పురుషుని ప్రతిబింబమే కాని మఱి యొకటి కాదు. ప్రకృతి స్వయముగా, జడము, అచేతనము. మనస్తత్త్వమును ప్రకృతి తత్త్వమునందే చేరియున్నదని మనము గుర్తింపవలయును. సంకల్పము మొదలుకొని అత్యంతస్థూలభూతముల వరకును, సమస్తమును ప్రకృతితత్త్వములోనివే; ప్రకృతి వ్యక్తీకరణములే. ప్రకృతి పురుషు నావరించియున్నది. ఈ యావరణమును తొలగించుకొనుటతోడనే పురుషుడు సహజతేజమున ప్రకాశించును. పదునేనవసూత్రమున జెప్పబడిన విధమున వైరాగ్యము పురుషుని వ్యక్తీకరణమునకు తోడ్పడును. రాబోవు సూత్రమున యోగపర మావధి యగు సమాధిస్థితి నిర్వచింపబడుచున్నది.

17. వితర్క-విచారానందాస్మితానుగమాత్ సంప్రజ్ఞాతః.

వితర్కమనియు, విచార (యుక్తాయుక్తవిచక్షణ) మనియు, ఆనందమనియు, అస్మితమనియు జెప్పబడు స్థితులతో గూడిన సమాధిస్థితి సంప్రజ్ఞాత సమాధి యనబడును.

సంప్రజ్ఞాతసమాధియనియు, అసంప్రజ్ఞాత సమాధియనియు సమాధిస్థితి రెండువిధములుగా నున్నది. సంప్రజ్ఞాతసమాధివలన ప్రకృతివశీకరణమున కావశ్యకమగు సిద్ధులన్నియు లభించును. ఈ సంప్రజ్ఞాతసమాధి నాలుగువిధములుగా నున్నది. ఇందు మొదటిదగు సవితర్కస్థితియందు మనస్సు ఒకానొకవిషయమును తదితరవిషయములనుండి వేఱుపఱచి దానిని పదేపదే ధ్యానించును. సాంఖ్యులచే నిర్వచింపబడిన ఇరువదియైదు తత్త్వములందును (1) జడములగు నిరువదినాలుగు ప్రకృతితత్త్వములును, (2) చేతనుడగు పురుషుడు నని రెండువిధములైన ధ్యేయములు గలవు. యోగమునం దీభాగము పూర్తిగా సాంఖ్యదర్శనముపై నాధారపడి యున్నది. సాంఖ్యదర్శనమునుగూర్చి యింతకుముందు మీాకు

జెప్పియున్నానుగదా. మనస్సును, బుద్ధియు, అహంకారమును చిత్తమునుండి నిర్మాణమై చిత్తముపై నాధారపడియున్నవి. చిత్తము ప్రకృతి శక్తులను గ్రహించి వానిని సంకల్పరూపమున వెలువఱుచుచున్నది. జడత్వమును శక్తియు నేకమగుస్థితి యొకటి యుండియుండవలయును. ఇదియే సృష్టికి పూర్వమునం దుండునట్టి అవ్యక్తావస్థ. కల్పాంతమున ప్రకృతి అవ్యక్తావస్థనుబొందుచు మరల వ్యక్తమగుచుండును. పురుషుడు వ్యక్తాఽవ్యక్తస్థితుల కతీతుడై, జ్ఞానస్వరూపుడై వెల్గొందుచున్నాడు. జ్ఞానమే శక్తి. మన మొక విషయమును గ్రహింప నారంభించినంతనే మన కది వశమగుచుండును. ఇట్లే వివిధప్రకృతితత్త్వములిందు సంయమము చేయుట మొదలిడినతోడనే చిత్తమున కవి వశమగుచుండును. ప్రకృతి యందలి స్థూలతత్త్వములను ధ్యేయములుగా గ్రహించునట్టి ధ్యానము సవితర్కము అనబడును.

వితర్క మనగా ప్రశ్న; సవితర్క మనగా ప్రశ్నతోఁగూడినదని యర్థము. ప్రకృతితత్త్వములను ధ్యానించుట యనగా ప్రకృతి శక్తులను, ప్రకృతిరహస్యములను వశపఱచుకొనుటకై విచారణ సల్పుట యని చెప్పనచ్చును. యోగసిద్ధులను బొందుట ముక్తి కానేరదు. అందులకై యత్నించుట ఐహికసుఖాన్వేషణమే కాని మఱియొకటి కాదు. సుఖమనునది ఐహికజీవనమునందు లేదు. కావున సుఖాన్వేషణము నిరర్థకము. ఈ పురాతనగుణపాఠమును గ్రహించుట మానవునకు దుస్సాధ్యముగా నున్నది. ఎట్లో గ్రహించెనా, అట్టి మానవుడు ప్రపంచాతీతుడై ముక్తుడగుచున్నాడు. యోగసిద్ధులను బొందుటవలని ఫలమేమి? సంసారబంధములను మఱింత బలీయముగా జేసికొనుటయే. దుఃఖములనుమఱింత దృఢపఱచుకొనుటయే అందులకు ఫలము. శాస్త్రకారుని విధి ననుసరించి పతంజలి యోగసిద్ధులను వెల్లడించియున్నను, వీనినిగూర్చి జాగరూకులమై యుండవలయునని మాటిమాటికిని మనలను హెచ్చరించుచునే యున్నాడు.

దేశకాలములనుండి పృథివ్యాదిభూతములను వేఱుపఱచి యథా రూపమున వానినిగూర్చి చింతించునప్పు డీధ్యానమే నిర్వితర్కమన బడును. ధ్యాన మభివృద్ధిచెందినంతనే తన్మాత్రలను ధ్యేయములుగా గ్రహించి వానినిగూర్చి దేశకాలములలో నున్నట్లు చింతించునప్పు డట్టి ధ్యానము సవిచారమని చెప్పబడును. ఆ ధ్యానమునందే దేశ కాలములను తొలగించి సూక్ష్మభూతములను యథారూపమున చింతించునప్పు డట్టి ధ్యానము నిర్విచారమని చెప్పబడును. స్థూల సూక్ష్మ భూతములను రెండిటినిగూడ విడిచి అంతరింద్రియమగు మనస్సే ధ్యేయమైయున్నప్పుడది పై జెప్పినదానికంటె ఉన్నతమైన ధ్యాన మగును. అంతఃకరణము రజస్తమోగుణరహితమై యున్న దని భావింపబడునప్పు డట్టి స్థితి సానందసమాధి యనబడును. అస్మితసమాధియందు మనస్సే ధ్యేయమైయుండి, ధ్యాన మత్యంత పరిపక్వమై స్థిరమైయుండును; అందు స్థూల సూక్ష్మ భూతములను గూర్చిన భావనలన్నియు తొలగును; మఱియు అహంకారము ధ్యేయేతరవిషయములనుండి ప్రత్యేకింపబడి స్వాత్త్వికస్థితియందు మాత్రమే నిలిచియుండును. ఇట్టి సమాధ్యవస్థను బొందిన పురుషుడు వేదములు వచించు విదేహస్థితిని బొందుచున్నాడు. ఇట్టి పురుషుడు తాను స్థూలశరీరహితుడనని భావింపగల్గినను, సూక్ష్మశరీరభావన నింకను విడువజాలడు. పరమావధిని బొందకయే లయమగునట్టి విదేహులు ప్రకృతిలయు లనబడుదురు. విదేహస్థితితో నాగిపోక, గమ్యస్థానోన్ముఖులై సాధనను విడువకుండునట్టి యోగులు ముక్త లయ్యెదరు.

18. విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః

చిత్తవృత్తుల నన్నిటిని నిరాకరించునట్టి నిరంతరాభ్యాసము వలన పొందబడునట్టిదియు, అవ్యక్తమైన సంస్కారములు మాత్రము చిత్తమునందు శేషించియుండునట్టిదియు నగు మఱియొకసమాధి కలదు.

ఇదియే అతీంద్రియజ్ఞానావస్థయగు అసంప్రజ్ఞాతసమాధి. దీని వలన మోక్షము లభించును. సంప్రజ్ఞాతసమాధి మోక్షప్రదము కానేరదు. సర్వసిద్ధులను బడసినను, మరల పతనము కలుగ వచ్చును. ప్రకృతి నతిక్రమింపకుండునంతవఱకు మనకు సంసార భయము తొలగునట్టిది కాదు. ప్రకృతివశీకరణ మనునది సులభముగా గాన్పించినను బహుకష్టసాధ్యము. ఐనను మనస్సున సంకల్పములను గలుగనీయక, మనస్సునే ధ్యానించుచు, సంకల్ప ముదయించి నంతనే దానిని నిరోధించుచు, మనస్సును శూన్యముగా జేయుటయే ప్రకృతివశీకరణమున కుపాయము. ఈ మహాకార్యమును సాధించిన పురుషునకు మోక్షము కరతలామలకమగును. అభ్యాసవైరాగ్యముల నవలంబింపకయే మనస్సును సంకల్పశూన్యముగా జేయ యత్నించు వాడు వివేకహీనుడు. తమోపరివృతులై అట్టివారు మనస్సును శూన్యముగా నొనర్చు చున్నామని తలచుచుందురు. మనస్సును వృత్తిశూన్యముగా జేయుట కుత్కృష్టమైనబలమును, అత్యున్నత మగు నిగ్రహమును ఆవశ్యకములు. అతీంద్రియజ్ఞానావస్థయగు నీ యసంప్రజ్ఞాత సమాధిని బొందుటచే సమాధి నిర్బీజమగుచున్నది. ఏ సమాధిస్థితియందు 'నేను' అను జ్ఞానము భాసించుచుండునో, చిత్త వృత్తులను శాంతింపజేసి వానిని నిరోధించుటకు మాత్రము మనస్సు సమర్థమైయుండునో అట్టి సంప్రజ్ఞాతసమాధిస్థితియందు చిత్తవృత్తు లింకను సంస్కారరూపమున నిలిచియుండును. ఈ సంస్కారములు లేక బీజములు తగు సమయమువచ్చినంతనే వృత్తిరూపమున మొలకలెత్తును. కాని వీనిని నిర్మూలమొనర్చి, యించుమించుగా మనోనాశనముచేయుటచే నిర్బీజసమాధి సిద్ధించును. అంతట నిరంతర జనన మరణ ప్రవాహరూపక సంసారవృక్షమునకు కారణమగు కర్మబీజములు నశించును.

మనస్సును, ఎఱుకయు లేకుండునట్టి స్థితి యెట్లుండునని మీరడుగవచ్చును. 'నేను' అను జ్ఞానము భాసించుచున్నట్టి బోధా

వస్థ బోధాతీతానవస్థకంటె క్రిందిస్థితి. అత్యంతస్థితులు చాలవఱకొకే విధముగ నుండునని మనము గుర్తింపవలయును. అత్యల్ప స్పందన స్థితిలో నున్న ఆకాశమును చీకటి యనియు మధ్యమస్థితిలో నున్న దానిని వెలుతురనియు భావించినయెడల, అత్యధిక స్పందనస్థితిలో నున్నప్పుడు మరల చీకటిగా నుండును. ఇట్లే అజ్ఞానము క్రిందిస్థితి; జ్ఞానము మధ్యమావస్థ: జ్ఞానాతీతస్థితి మహోన్నతస్థితి. అత్యంతములైన జ్ఞానాజ్ఞానములు రెండును ఒకేవిధముగ నున్నట్లు కనబడును. స్వతస్సిద్ధముగా జ్ఞానావస్థ కృత్రిమము; కల్పితము; యథార్థమైనట్టిదికాదు.

సదాధ్యానము నభ్యసించుటవలన ఫలమేమనిన, చిత్తవిక్షేప హేతువులగు పూర్వసంస్కారములును తామసికచిత్తవృత్తులును మాత్రమే కాక సాత్త్వికసంస్కారములుగూడ నశించును. గని నుండి తీయబడిన బంగారమునందలి మాలిన్యమును తొలగించుటకును, అందు జేరియుండు నితరలోహములను వేఱుపఱుచుటకును రసాయనముల నుపయోగింతుము. ఇట్టి బంగారమును కఱగించునపుడు రసాయనములతోబాటు లోహపుచిట్టెముకూడ కాలిపోవును. ఇట్లే సదా మనోనిగ్రహము నభ్యసించుటవలన పూర్వపు దుష్టసంస్కారములేకాక సాత్త్వికసంస్కారములుగూడ నిర్మూలమగును. ఈ సంస్కారములన్నియు ఒండొంటిని నిరోధించినంతనే ద్వంద్వాతీతమును సర్వవ్యాప్తమును, సర్వశక్తిమంతమును స్వయంజ్యోతియునైన వెల్గొందు ప్రత్యగాత్మ శేషించి యుండును. అంత యోగి తాను జననమరణరహితుడననియు సర్వలోకాతీతుడననియు, గమనాగమనరహితుడననియు గ్రహించును. మఱియు ప్రకృతియే వికారమును బొందుచున్నదనియు, ప్రకృతివికారము పురుషునియందు ప్రతిబింబించుచున్నదనియు నాతడు కనుగొనును. అద్దపుగాంతి తనపై ప్రతిఫలించునపుడు ప్రతిబింబము చలించుట జూచి తెలివి మాలిన గోడ తాను చలించుచుంటినని తలచుచుండును. ఈ

విధముగనే వివిధరూపములను బొందుచు చిత్తము సదా చలించు చుండగా, నీ రూపములన్నియు మనమే యని భ్రమించుచున్నాము. అతీంద్రియజ్ఞానమును బొందినంతనే యిట్టి భ్రమములన్నియు పటాపంచలగును. తనసంకల్పము నెఱవేఱుటకై ముక్తపురుషుడు వినమ్రుడై యొకనిని వేడుకొన నక్కఱలేదు; దీనుడై ప్రార్థింపనక్కఱలేదు. ఆత డాజ్ఞాపించినంతనే, ఎట్టి కోరికయైనను సఫలమగును. ముక్తపురుషు డిచ్ఛామయుడు; ఆతడేమి సంకల్పించినను చేయగలడు. సాంఖ్యులు నిరీశ్వరవాదులు. ఈశ్వరు డనువా డున్నయెడల ఆతడొక పురుషుడై యుండవలయుననియు, పురుషుడు ముక్తుడుగాగాని బద్ధుడుగాగాని యుండుననియు, అందుచే నీశ్వరుడు కలడనుట కుపపత్తి యేదియు లేదనియు సాంఖ్యులు చెప్పుదురు. ప్రకృతిబద్ధుడును, అస్వతంత్రుడును నగు పురుషు డెట్లు సృష్టింపగలడు? మఱియు ముక్తపురుషుడు సృష్టించుటకుగాని ప్రపంచనియంతృత్వమును వహించుటకుగాని హేతువేమి? ముక్తపురుషునకు కోరికలుండవు. కావున నాతనికి సృష్టింపవలసిన ఆవశ్యక మేదియు నుండజాలదు. అంతియకాక మన మీశ్వరసిద్ధాంతమును ప్రతిపాదింప నక్కఱలేదనియు అన్నిటికిని ప్రకృతియే కారణమనియు సాంఖ్యులు వచింతురు. అట్టియెడ భగవంతుడు కలడనుటవలన ప్రయోజనమేమి? ఐనను కపిలుడు బహుపురుషులు కలరనియు, ఇంచుమించుగా వారు పరిపూర్ణులైనను సిద్ధులను పూర్ణముగా విడువజాలకుండుటచే పరమావధిని బొందకుందురనియు వచించును. అట్టి పురుషుల చిత్తము ప్రకృతియందు కొంతకాలము లయమగును. మరల వారు ప్రకృతి కధిపతు లగుదురు. ఇట్టి భగవంతులు కలరు. మన మందఱమును ఇట్టి భగవంతులము కావచ్చును. వేదములు వచించు పరమాత్మ సాంఖ్యుల ననుసరించి పై జెప్పిన ముక్తపురుషులలో నొకడు. స్వతంత్రుడును శాశ్వతుడును నగు సృష్టికర్త మఱియొకడు లేడు. ఇక యోగులు ''అట్లుకాదు; భగవంతుడు కలడు; పురుషులందఱికంటెను విలక్షణుడగు పరమపురుషు డొకడు కలడు; ఆతడే సృష్టికర్త. ఆతడు సదా

ముక్తుడు; గురోర్గురువు" అని చెప్పెదరు. సాంఖ్యుల 'ప్రకృతి లయుల'ను గూడ యోగు లంగీకరింతురు. పరిపూర్ణులగుటకు కొంచెము కొఱవడిన యోగులే ప్రకృతిలయులనియు, కొంత కాలమువరకును పరమావధిని బొందుటకు వారనర్హులై యున్నను లోకపాలకులై యుందురనియు యోగులు భావింతురు.

19. భవ-ప్రత్యయో విదేహ-ప్రకృతిలయానామ్.

(తీవ్రవైరాగ్యము లేనప్పుడీ సమాధి) విదేహుల (దేవతల) కును, ప్రకృతిలయులకును పునర్జన్మహేతువగును.

"పంచభూతములు, ఇంద్రియములు అను వికృతితత్త్వములు గాని, అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు అను ప్రకృతితత్త్వములుగాని పైన జెప్పబడినవన్నియు (ఆత్మతత్త్వము కాకున్నను) ఆత్మ యనెడిభావమును, దానివలనగలుగు యోగమును భవప్రత్యయమనబడును."

దేవతలనగా కొన్ని యున్నతపదవుల నలంకరించువారని హైందవతత్త్వశాస్త్రజ్ఞులు పరిగణింతురు. ఈ పదవులను జీవులొకరి తరువాత మఱియొకరాక్రమించుచుందురు. కాని వీరిలో నెవ్వరును పరిపూర్ణులై ముక్తులై యున్నవారు కారు.

20. శ్రద్ధా-వీర్య-స్మృతి-సమాధి-ప్రజ్ఞా-పూర్వక ఇతరేషామ్.

ఇతరులకు (విదేహప్రకృతిలయులు కానివారలకు) ఈ సమాధి శ్రద్ధ, వీర్యము, స్మృతి, ఏకాగ్రత, ప్రజ్ఞ (తత్త్వవిచారము) అనువానివలన గలుగుచున్నది.

వీరు దివ్యత్వమునుగాని కల్పాధిపత్యమునుగాని కాంక్షించునట్టివారు కారు. ఇట్టివారు ముక్తులగుదురు.

21. తీవ్రసంవేగానామాసన్నః.

తీవ్రమగుకార్యదీక్షగలవారలకు త్వరితముగ ఫలము గలుగును.

22. మృదుమధ్యాధిమాత్రత్వాత్తతోఽపి విశేషః.

మందము, సామాన్యము, తీవ్రము అను సాధనభేదముల ననుసరించి యోగులకు సిద్ధియందు తారతమ్యము కలదు.

23. ఈశ్వరప్రణిధానాద్వా.

ఈశ్వరప్రణిధానము (అనగా కర్మఫలముల నీశ్వరుని కర్పించుట) వలనగాని (యోగము సిద్ధించును).

24. క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః.

క్లేశము, కర్మము, కర్మఫలము, కామము అనువానిచే బాధితుఁడుకాని యొకానొక పురుషు డీశ్వరు డనబడును.

యోగులవలె సాంఖ్యులు భగవంతుఁడు కలడని యంగీకరింపకున్నను పాతంజలయోగదర్శనము సాంఖ్యతత్త్వముపై నాధారపడి యున్నదను సంగతి మనము మఱువరాదు. ఐనను యోగులు భగవంతుని సృష్ట్యాదిధర్మముల నంతగా జెప్పకుండుటయేకాక ఈశ్వరుడనగా సృష్టికర్తయని భావింపరు. ఐనను శ్రుతిప్రమాణము ననుసరించి ఈశ్వరుడే జగత్కర్త. విశ్వమునం దేకత్వము నెలకొనియుండుటచే ఒకే సంకల్పశక్తివలన విశ్వము సృష్టింపబడియుండవలయును. యోగు లీశ్వరుడు కలడని నిరూపించుటకై విచిత్రమగు హేతువులను జూపుచు నిట్లు చెప్పుదురు.

25. తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్.

ఇతరులయందు బీజ(మాత్ర)ముగా నుండునట్టి సర్వజ్ఞత్వ మాతని (ఈశ్వరుని)యం దనంతముగా నుండును.

మన స్సెప్పుడును ద్వంద్వముల మధ్యమున తిరుగాడుచుండును. పరిమితమగు దేశమునుగూర్చి భావింపగల్గినయెడల, అపరిమితమగు మహాకాశము గలదని దానివలననే మనకు వెల్లడి యగుచున్నది. కన్నులు మూసికొని పరిమితమగు దేశము లేక స్థలమునుగూర్చి

భావింపుడు. అంతట నొక యావరణము మీకు గోచరించును. దాని చుట్టును అపరిమితమగు మఱియొక యావరణ మేర్పడియుండును. ఇట్లే యొక క్షణమునుగూర్చి భావించుటకు యత్నింపుడు. వెనువెంటనే అనంతమగు కాలమున్నట్లు గోచరించును. మనుష్యునియందు జ్ఞానము బీజమాత్రముగా నున్నది. కాని యిట్టి కించిజ్జ్ఞత్వమువలననే సర్వజ్ఞత్వము కలదని యూహింపవలసి యున్నది. ఇట్లు మన మనస్తత్త్వము వలననే అనంతమైన జ్ఞానము కలదని మనకు వెల్లడియగుచున్నది. యోగులీ యనంతజ్ఞానమునే భగవంతుడని చెప్పుచున్నారు.

26. స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్.

అతడు త్రికాలాబాధితుడగుటచే సనాతనాచార్యులకు గూడ గురువై యున్నాడు.

జ్ఞానమంతయు మనయందే కలదనుట నిజము. ఐనను ఈ జ్ఞానమును మఱియొక విధమైన జ్ఞానముచే వ్యక్తము చేయవలసియున్నది. గ్రహణశక్తి మనయందే యున్నను దానిని ప్రకటింపవలసి యున్నది. ఇందులకు మఱియొకవిధమైన జ్ఞాన మావశ్యకమని యోగులు వచింతురు. అచేతనమగు ప్రకృతి యెన్నడును జ్ఞానమును ప్రకటింపజాలదు. జ్ఞానము జ్ఞానమువలననే వ్యక్తము కావలయును. జ్ఞానులతోడి సంసర్గమువలన మనయందలి జ్ఞానము వెలువడుచున్నది. ఇందువలననే గురుజను లావశ్యకమై యున్నారు. లోకమున సద్గురువు లెల్లప్పుడును గలరు. గురువులేనిదే జ్ఞానము గలుగదు. భగవంతుడు గురోర్గురువు. ఏలయన, మన గురువు లెంతటి మహనీయులైనను, ఎంతటి దేవతలైనను భగవంతునివలె అప్రమేయులుకారు; అపరిచ్ఛిన్నులుకారు; దేశకాలాతీతులుకారు. ఇవ్విషయమై యోగులు విచిత్రములైన రెండు సిద్ధాంతములను ప్రతిపాదించుచున్నారు. పరిమితమగు వస్తువునుగూర్చి భావించునప్పుడు మనస్సు అపరిమితమగు దానినిగూర్చి భావింపవలసి యుండుననియు, నివిరెండును ఒకే మనస్సునకు గోచరించు విషయమునందలి రెండుభాగములగుటచే

వాని విలువయు సమానమై యుండుననియు, కావున నిందొకటి యథార్థమై యుండునెడల రెండవదియు యథార్థమై యుండవలయు ననియు మొదటి సిద్ధాంతము ప్రతిపాదించును. మనుష్యుడు కించిజ్ఞుడనుటవలననే భగవంతుడు సర్వజ్ఞుడని యేర్పడుచున్నది. ఈ రెంటిలో నొక భావము నంగీకరించినయెడల రెండవదాని నేల యంగీకరింపరాదు? స్వీకరించిన, రెంటిని స్వీకరింపవలయుననియు, పరిత్యజించిన, రెంటిని పరిత్యజింపవలయుననియు హేతువాదము నియమించును. మానవుడు కించిజ్ఞుడని నేను విశ్వసించినయెడల వాని వెనుక సర్వజ్ఞుడగు నొకడు కలడని యంగీకరింపవలసి యుండును. గురువులేనిదే జ్ఞానము కలుగదనునది రెండవ సిద్ధాంతము. ఆధునిక తత్త్వజ్ఞులు వచించు విధమున క్రమముగా వికాసము పొందు నొకానొక తత్త్వము మనుష్యునియందు కలదనుట నిజము. సమస్తమైన జ్ఞానమును మానవునియందే కలదు. కాని దానిని ప్రదర్శించుటకు కొన్ని పరిస్థితు లావశ్యకమై యున్నవి. మానవగురువులైనను. దేవగురువులైనను గురువు లందఱును దేశకాలబద్ధులే. ఇక పరమగురు వెవ్వడు? తుదకు మనము త్రికాలాబాధితుడైన యొక గురువు కలడని యంగీకరింపక తీరదు. అఖండజ్ఞానస్వరూపుడగు నిట్టి పరమగురువే భగవంతు డనబడుచున్నాడు.

27. తస్య వాచకః ప్రణవః

ఓంకారమే అతని నామధేయము.

మనస్సున గలుగు ప్రతి భావమునకును ప్రతిరూప మనదగు పదమొకటి కలదు. పదమును, అర్థమును అవిభాజ్యములై యుండును. ఒకే విషయముయొక్క బాహ్యరూపమును పదమనియు, అంతర్భాగమును అర్థమనియు జెప్పుచున్నాము. అర్థమునుండి పదము నెవ్వడును వేఱుపఱుపజాలడు. జనులవలన—కొందఱు జను లొకచోట కూర్చుండి పదములను నిర్ణయించుటవలన—భాష నిర్మింపబడినదను సిద్ధాంతము హేతువిరుద్ధమని నిశ్చయింపబడియున్నది. సృష్టిలో

మనుష్యు లున్నంతవఱకు మాటలును భాషయు నుండియే యున్నవి. అర్థమునకును పదములకును గల సంబంధమేమి? భావము ననుసరించి పదము లేర్పడినవని మన మూహించినను, ఒకానొక భావమును దెలుపుట కొకానొకమాటయే కావలయునను నియమము లేదు. ఒకే భావమును దెలుపుట కిరువది దేశములలో నిరువదివేర్వేఱు భాషలుండవచ్చును. ఒక్కొక్క భావమును దెలుపుటకై మన కొక్కొక్క మాట కావలసియున్నది. కాని వీనికి ఒకేవిధమగు శబ్దము లుండనక్కఱలేదు. వివిధదేశములందు శబ్దములు వివిధములై యుండును. "భావమునకును పదమునకును సంపూర్ణముగా స్వాభావికమగు సంబంధమున్నను, ఒకానొక భావమునకును ఒకానొక శబ్దమునకును అవినాభావమగు సంబంధ ముండవలయునని యూహింపరాదు" అని వ్యాఖ్యానకారుడు చెప్పుచున్నాడు. శబ్దములు వేర్వేఱై యున్నను శబ్దములకును భావములకును సహజసంబంధ మేర్పడియున్నది. సంజ్ఞకును దానిచే దెలుపబడు వస్తువు లేక విషయమునకును సరియగు సంబంధముండిననేకాని శబ్దములకును భావములకును సమంజసమగు సంబంధ మేర్పడనేరదు. అంతవఱకును ఆ సంజ్ఞ వాడుకలోనికి రాజాలదు. సంజ్ఞయనగా నిర్దేశింపబడినవస్తువు లేక విషయమును దెలుపునట్టి పదము. నిర్దిష్టవస్తువున కిదివఱకే యొకసంజ్ఞ యేర్పడియున్నయెడల, మఱియు ఆ వస్తువా సంజ్ఞచే అనేక పర్యాయములు వెల్లడింపబడుచున్నదని యనుభవపూర్వకముగా మనకు దెలిసినయెడల, ఆ రెంటికిని అన్యోన్యసంబంధము కలదని మనము నిశ్చయింపవచ్చును. వస్తువులు తమయెదుట లేకున్నను వానిని గ్రహించునట్టివారు వేలకొలది జనులుందురు. సంజ్ఞకును దానిచే నిర్దిష్టమగు వస్తువునకును స్వాభావికమైన సంబంధముండ వలయును. అప్పుడు సంజ్ఞ నుచ్చరించినంతనే నిర్దిష్టవస్తువు నది మనకు స్ఫురింపజేయును. ఓంకారము భగవంతుని దెలుపు సంజ్ఞయని చెప్పుచు వ్యాఖ్యానకర్త ఓంకారము నంత ప్రధానముగా పరిగణించుటకు

కారణమేమి? భగవంతుని దెలుపుటకై వందలకొలది పదములు కలవు. ఒకేభావము వేయిపదములతో సంబంధించి యుండవచ్చును. 'భగవంతుడు' అనునట్టి భావము వందలకొలది పదములతో సంబంధించియున్నది. వీనిలో ప్రతిపదమును భగవంతుని కొక సంజ్ఞయై యున్నది. అగుగాక. కాని యీ సంజ్ఞలన్నిటిని సమీకరించుచు వీనికి మూలాధారమగు సంజ్ఞయొకటి యున్నయెడల అట్టిసంజ్ఞ వీని భావముల నన్నిటిని దెలుపుచుండుటచే ఉత్తమోత్తమ సంజ్ఞ యగును. శబ్దోచ్చారణమునందు మనము కంఠమునందలి స్వర పేటికను, అంగిలిని శబ్దఫలకముగ నుపయోగించుచున్నాము. ఏశబ్దమునుండి తదితర శబ్దములన్నియు వ్యక్తమగుచున్నవో అత్యంత స్వాభావికమైన యట్టిశబ్ద మేదియైన నొకటిగలదా? సర్వ శబ్దములకును మూలమగు ప్రణవము లేక ఓంకార మట్టిశబ్దము. ఇందు మొదటిభాగమగు అకారము నాలుకయొక్క-గాని అంగిలియొక్క-గాని యే భాగమువలనను నుచ్చరింపబడనిదై ఓంకారమునకు బీజమై యున్నది. మకారము కడపటిదై మూయబడిన పెదవులచే నుచ్చరింప బడుచున్నది. ఉకారము నోటియందలి శబ్దోచ్చారణఫలకమున మూల భాగమునుండి అంత్యభాగమువఱకును దొరలుచున్నది. ఇట్లు ఓంకా రము శబ్దోచ్చారణ ప్రక్రియనంతను జూపుచున్నది. కావున నిదియే శబ్దములన్నిటికిని మూలమగు స్వాభావికసంజ్ఞయై యుండవలయును. సమస్త శబ్దజాలమును ఓంకారమునం దిమిడియున్నది. మఱియు భారతదేశమునందలి వివిధ మతాభిప్రాయములన్నియు ఓంకారముపై నాధారపడియున్నవి. ఆంగ్లేయులుకాని మఱి యే యితర దేశీయులు గాని దీనివలన గ్రహింపవలసినదేమన, భారతదేశమున నెప్పుడెప్పుడు మతాభివృద్ధి కలిగినను ఓంకారము ప్రధానముగా పరిగణింపబడు టయేకాక భగవంతునిగూర్చిన సాకారనిరాకారభావములన్నియు ఓంకారము మూలముననే అన్వయింపబడుచు వచ్చినవి. వేదము లందలి వివిధమతాశయము లన్నిటికిని ఓంకారమే పట్టుగొమ్మ. ద్వైతులును, అద్వైతులును, విశిష్టాద్వైతులును, శైవ శాక్తే

యాది స్వతంత్రమతస్థులును, తుదకు నాస్తికులునుగూడ ఓంకారమును స్వీకరించియున్నారు. జనబాహుళ్యమునకు ఓంకారము మతపరమావధిని దెలుపు చిహ్నముగా నేర్పడియున్నది. ఉదాహరణమునకు భగవంతుడను నర్థమిచ్చునట్టి 'గాడ్' అను నాంగ్లేయపదమును దీసికొందము, 'గాడ్' అనుపదము భగవంతునిగూర్చి సమగ్రమైన భావమును దెలుపజాలదు. సాకారనిరాకారములను సూచించుటకై 'గాడ్' అను పదమునకు (పెర్సనల్ అనియు 'ఇమ్‌పెర్సనల్' అనియు 'అబ్‌సొల్యూట్' అనియు) విశేషణములను జేర్పవలసియున్నది. ఇతర భాషలన్నిటియందును భగవంతుని దెలుపు పదము లిట్టివే. అతిపరిమితమైన భావము నవి ప్రకటించుచుండును. ఓంకారమున నిట్లుకాక భగవంతునిగూర్చిన వివిధభావములన్నియు కేంద్రీకరింపబడియున్నవి. కావున ఓంకారము నెల్లవారును స్వీకరింపవచ్చును.

## 28. తజ్జపస్తదర్థభావనమ్.

ఇట్టి ఓంకారమును జపించుటయు, ఓంకారముయొక్క అర్థమును భావించుటయు (మోక్షసాధనము).

మంత్రములను జపింపవలయు ననుటకు కారణమేమి? సంస్కారము లన్నియు చిత్తమునందు నిలిచియుండు ననుసంస్కారసిద్ధాంతమును మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. చిత్తమునందివి సూక్ష్మస్థితిని బొందియుండును. తగు ప్రేరణ కలిగినంతనే మరల నివి వెలువడుచుండును. పరమాణువు లప్పుడును స్పందించుచునే యున్నవి. ప్రపంచప్రళయము గలిగినంతనే స్థూలస్పందనములన్నియు అదృశ్యములగుటచే భూసూర్యచంద్రనక్షత్రములు విలయము నొందినను అణువులయందు స్పందనము నిలిచియుండును. బ్రహ్మాండమునందలి వ్యాపారము ప్రత్యణువునందును కానవచ్చును. ఇట్లే చిత్తమునందలి స్పందనములు శాంతించినను, అందలి పరమాణుస్పందనములు సాగుచునేయుండును. తగు ప్రేరణము కలిగినంతనే యీ స్పందనములు మరల వెలువడును. కావున జపమువలన గలుగు

ప్రయోజనమును మనము గ్రహింపవచ్చును. జపమువలననే ఆధ్యాత్మికసంస్కారము లుద్దీప్తము లగుచున్నవి. ''క్షణమపి సజ్జన సంగతిరేకా భవతి భవార్ణవ తరణే నౌకా'' యనునట్లు క్షణకాలమైనను సజ్జనసాంగత్యము చేయుటవలన సంసారసముద్రమును తరింపనగును. సంసర్గమున కంతటి ప్రభావము కలదు. ఓంకారజపమువలనను, తదర్థభావనవలనను మనస్సునందే సత్సాంగత్యమును నిర్మించుకొనుచున్నాము. తత్త్వమునుగూర్చి చింతింపుడు; చింతితాంశమును ధ్యానింపుడు. తత్త్వదర్శనమున కిదియే విధానము.

ఓంకారమును జపించుటయేకాక తదర్థమునుగూర్చి భావించుచుండవలయును. దుస్సాంగత్యము నీయందలి దుష్టసంస్కారముల నుద్దీపింపజేయును. కావున దుస్సాంగత్యమును విసర్జింపుము. సత్సాంగత్యముకంటె పవిత్రమైనది మఱియొకటిలేదు. సత్సాంగత్యమువలన సద్వాసనలు వెలువడును.

29. తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ.

దానివలన (ఓంకారజపమువలన) అంతర్దృష్టియు(జ్ఞానము)ను, విఘ్నముల వినాశమును గలుగును.

ఓంకారజపమువలనను, ధ్యానమువలనను అంతరవలోకనశక్తి క్రమముగా వృద్ధిపొంద నారంభించును. కాయికవిఘ్నములును మానసికవిఘ్నములును తొలగును. యోగవిఘ్నములేవి?

30. వ్యాధిస్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి భ్రాంతిదర్శనాలబ్ధ-భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః.

రోగము, మానసికజడత్వము, సంశయము, అజాగ్రత్త, మత్తత, అతృప్తి, భ్రమ, చిత్తస్థైర్యము నిలువకుండుట అనునవి (యోగమునకు) అంతరాయములు.

రోగము :—ఈ శరీరము మనలను సంసారసముద్రమునుండి తరింపజేయు నౌక. కావున శరీరమును కాపాడుకొనవలయును. ఆరోగ్యహీనులు యోగులు కానేరరు. మానసికజడతవలన యోగమునందు మన కభిరుచి గలుగకుండును. అభిరుచి కలుగనిదే సాధన చేయవలయు నను దృఢసంకల్పముగాని, అందులకు దగిన సామర్థ్యము గాని గలుగజాలదు. మనోనిశ్చయ మెంత దృఢముగా నున్నను, దూరదృష్టి, దూరశ్రవణము మొదలగు చిత్రమగు కొన్ని యోగానుభవములు గలుగనిదే యోగ శాస్త్రమునందలి సత్యాసత్యములను గూర్చి సంశయము కలుగుచునే యుండును. చూచాయగానైనను ఇట్టిశక్తులు కలుగుటచే మనోబలమును పూనికయు అలవడును.

చిత్తస్థైర్యము నిలువకుండుట :— సాధనచేయుకాలమున కొన్నిదినములవఱకును లేక కొన్నివారములవఱకును మనస్సు ప్రశాంతముగానుండి సులభముగా ఏకాగ్రస్థితిని పొందుచు శీఘ్రముగా యోగమునం దభివృద్ధికలుగుచుండునట్లు కాన్పించును; అకస్మాత్తుగా నిట్టి యభివృద్ధి యొకనాడు నిలిచిపోవచ్చును. దానివలన దిగ్భ్రమము కలుగవచ్చును. ఇట్టిసమయములందు పూనిక విడువక సాధన చేయుము. వృద్ధి క్షయములతోడనే అభివృద్ధి కలుగుచుండును.

31. దుఃఖదౌర్మనస్యాంగమేజయత్వశ్వాసప్రశ్వాసా
విక్షేపసహభువః.

దుఃఖము, చిత్తక్షోభము, శరీరమునందు కంపము, క్రమ విరహితమైన శ్వాసము, అనునవి చిత్తవిక్షేపమునకు (సహకారులు) తోబుట్టువులు.

చిత్తైకాగ్రత నభ్యసించినపుడెల్ల మనశ్శరీరములకు సంపూర్ణమగు విశ్రాంతి కలుగును. సక్రమమార్గము ననుసరించి సాధనచేయకుండుటచేగాని, తగు మనోనిగ్రహము లేకుండుటచేగాని పైని జెప్పబడిన బాధలు కలుగుచుండును. ప్రణవజపము వలనను, భగవంతుని

శరణుబొందుటవలనను మనస్థైర్యము గలుగుటయేకాక నూతనమగు శక్తిసామర్థ్యములు లభించును. సాధారణముగా యోగసాధకుల కందఱకును ఇట్టి నాడీకంపములు కలుగుచునే యుండును. కావున వాని నెంతమాత్రమును లెక్కచేయక పూనికతో సాధనచేయుము. సాధనవలన నిట్టిబాధలన్నియు తొలగును ; స్థైర్యము కలుగును.

32. తత్ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః.

దానిని (చిత్తచాంచల్యమును) నివారించుకొనుటకై ఏక తత్త్వము నభ్యసింపవలయును.

క్రమము తప్పక కొంతకాలమువఱకును మనస్సు నొకే విషయమునందు నిలిపి ధ్యేయాకారమును బొందునట్లుచేయుటవలన పైనిజెప్పిన విఘ్నములు తొలగును. ఇది సాధారణోపాయము. రాబోవు సూత్రములందు ప్రత్యేకసందర్భముల ననుసరించి విషయము విపులీకరింపబడును. ఒకేమార్గ మెల్లరకును సరిపడదు. కావున వివిధ మార్గములు తెలుపబడును. సాధకుడు వానిలో తన కమితోప యుక్తమైన దేదియో స్వానుభవముచే కనుగొనవచ్చును.

33. మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిష - యాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్.

సుఖదుఃఖ పుణ్యాపాప విషయములనుగూర్చి మైత్రి (స్నేహము), కరుణ (దయ), ముదిత (సంతోషము), ఉపేక్ష (ఉదాసీనత) అను నీ వృత్తులను క్రమానుసారముగా భావనచేయుటవలన చిత్త ప్రసన్నత కలుగును. (చిత్తము ప్రఫుల్లమై చిత్త చాంచల్యము నశించును).

విషయములయెడల మనము నాలుగువిధములైన మనోభావ ముల నవలంబింపవలయును. అందఱయెడలను స్నేహముకలిగి వర్తింపవలయును. దుఃస్థితిలోనున్నవారియందు కరుణయు, సుఖించు వారియెడల సంతోషమును, దుర్మార్గులయెడల ఉదాసీనతయు గలిగి

యుండు టుచితము. మనకు గోచరించునట్టి సర్వ విషయములందును నిర్లిప్తే వర్తింపవలయును. సద్విషయములందు స్నేహభావమును, దుఃఖజనకమగు విషయములందు కరుణయు, పుణ్యకార్యములయెడల సంతోషమును, పాపకార్యములయం దుదాసీనతయు వహింపవల యును. మన కిందువలన మనశ్శాంతి కలుగును. మనస్సు నిట్లు నియ మింపజాలకుండుటవలననే జీవితమునం దనేకబాధల ననుభవించు చుందుము. ఒకడు మనకెగ్గుచేసినయెడల వెంటనే ప్రతీకారమును చేయనెంతుము. ప్రతీకారము మనోనిగ్రహసామర్థ్యము కొఱవడి యున్నదని వెల్లడించును. దుర్వృత్తి నవలంబించినంతనే మనోబల మును కోల్పోవుచున్నాము. ఒకనిని ద్వేషించుటచేగాని, వానికి హాని చేయుటచేగాని ప్రతీకారము చేసినప్పుడెల్ల మనస్సున కెంతయో అనర్థము వాటిల్లుచున్నది. దుష్ప్రవృత్తినిగాని ద్వేషప్రేరితమగు కార్యమునుగాని, ప్రతీకారము చేయవలయునను మఱెట్టి సంకల్ప మునుగాని నిగ్రహించినప్పుడెల్ల మనకది ప్రయోజనకరమగు చున్నది. మనోనిగ్రమువలన అపారమగు శక్తి లభించును. నిగ్రహము వలన మన కెన్నడును నష్టము కలుగదు. ద్వేషమునుగాని క్రోధ మునుగాని నిగ్రహించినప్పుడెల్ల మహోప యుక్తమగు సత్త్వశక్తిని, వీర్యమును, ప్రాణశక్తిని చేకూర్చుకొను చున్నాము. ఇట్టి సత్త్వ శక్తి నుండియే ఉన్నత మానసికశక్తులు వెలువడుచున్నవి.

## 34. ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య.

. ప్రాణము (శ్వాసము)ను విడుచుటచేతను, నిలుపుటచేతను (అనగా ప్రాణాయామముచేత) గాని (మనఃప్రసన్నత కలుగును).

ఇచ్చట నుపయోగింపబడిన 'ప్రాణ' మను పదమును గమ నింపుడు. ప్రాణమనగా శ్వాసమని భావింపవలదు. విశ్వమునందలి శక్తియే ప్రాణ మనబడుచున్నది. చరాచరప్రపంచ మంతయు ప్రాణ స్వరూపమైయున్నది. సాముదాయకముగ విశ్వమునందలి శక్తికి ప్రాణ మనిపేరు. ప్రాణశక్తి కల్పారంభమున నించుమించుగా చలనరహిత

స్థితిలోనుండి సృష్టికాలమున వ్యక్తమగుట కారంభించును. భౌతిక చలన రూపముననూ, మనుష్యులందును జంతువులందును నాడీచలనరూపమునను వ్యక్తమగు శక్తి ప్రాణమే. ప్రాణమే మనస్సంకల్ప వికల్పములుగ వ్యక్తమగుచున్నది. విశ్వమంతయు ప్రాణాకాశములయొక్క సంయోగమైయున్నది. మానవశరీరముకూడ నిట్టిదే. ఇంద్రియగోచరమగునదంతయు ఆకాశమునుండి వెలువడుచున్నది. సర్వశక్తులును ప్రాణమునుండి వెలువడుచున్నవి. ప్రాణమును విడుచుటయు నిలుపుటయునే ప్రాణాయామ మనబడును. యోగదర్శనమునకు జనకుడనదగు పతంజలిమహర్షి ప్రాణాయామమును గూర్చి ప్రత్యేకవిధుల నంతగా సూచించుచుండుట లేదు. కాని యితర యోగులు ప్రాణాయామమును గూర్చి యనేకవిషయములను కనుగొని ఘనమగు శాస్త్రమును నిర్మించియున్నారు. పతంజలి మహర్షి ప్రాణాయామమును యోగసాధనములలో నొకానొక సాధనముగా పరిగణించునేకాని ప్రాణాయామ మన్నింటికంటెను ప్రధానమని చెప్పుటలేదు. కొలదిగా రేచక పూరక కుంభకముల నభ్యసించిన జాలుననియు దానివలన మనఃప్రసన్నత కలుగుననియు పతంజలిమహర్షి యభిప్రాయము. కాలక్రమమున ప్రాణాయామము శాస్త్రరూపమును దాల్చినది. ఇతర యోగులు ప్రాణాయామమును గూర్చి తెలుపునట్టి విషయములను కొంచెము గమనింతము.

ఈ విషయమై కొంతవఱకు నే నింతకుముందు తెలిపియున్నను మరల నిచ్చట తెలుపుట విషయమును మీరు బాగుగా గుర్తించుటకు తోడ్పడును. ప్రాణమనగా శ్వాసము కాదని మొట్టమొదట మీరు గమనింపవలయును. శ్వాసమునకు చలనమును గల్గించుచు శ్వాసమునకు మూలమగు శక్తియే ప్రాణము. ప్రాణమను పదము ఇంద్రియములను సూచించుటకును ఉపయోగింపబడుచున్నది. ఇంద్రియములు ప్రాణములని చెప్పబడుచున్నవి. మనస్సును ప్రాణమని పేర్కొనబడుచున్నది. కావున ప్రాణమనగా మనము శక్తియని గ్రహింపవచ్చును. ఐనను శక్తియనునది ప్రాణరూపమై యుండుటచే

ప్రాణమే శక్తియని చెప్పజాలము. ప్రాణము శక్తిరూపమునను, చలన రూపమునను వ్యక్తమగుచున్నది. చిత్తము తనచుట్టునున్న ప్రాణశక్తిని లోనికి లాగుకొనుచు అందుండి శరీరపోషణమునకు గావలసిన భౌతిక శక్తులనేకాక ఇచ్ఛాజ్ఞానాది వివిధ మానసిక శక్తులనుగూడ నిర్మాణము చేయునట్టి యంత్రమని చెప్పవచ్చును. శ్వాసనియమనము నభ్యసించుటవలన శరీరమునందలి వివిధచలనములను, నాడీ వాహినులను మనయధీనము గావించుకొనవచ్చును. మున్ముందు వానియొక్క స్థితిగతులను కనుగొనుటచే క్రమముగా వానిని వశపఱచుకొనగలము.

మనశరీరమునందు ఇడాపింగళాసుషుమ్నా నాడు లను మూడునాడులు కలవనియు, వెన్నెముకకు కుడివైపున పింగళా నాడియు, ఎడమవైపున ఇడానాడియు, మధ్యభాగమున సుషుమ్నా నాడి యను బోలుగా నుండు కాలువయు నేర్పడి యున్నవనియు ఇడాపింగళానాడులు ప్రతిమానవునియందును క్రియావంతమగు నాడులనియు, వీనిమూలముననే శరీరవ్యాపారము లన్నియు సాగుచున్నవనియు యోగులు చెప్పెదరు. సాధ్యావస్థయందు సర్వజనులందును సుషుమ్నానాడి కలదు. కాని యోగులందు మాత్రమే సుషుమ్న క్రియావంతమై యుండును. యోగాభ్యాసమువలన శరీరము మార్పు చెందునని మనము గమనింపవలసి యున్నది. యోగము నభ్యసించిన కొలదియు శరీరమున పరిణామము గలుగుచుండును. క్రమముగా నూతనశరీర మేర్పడును. ఎట్లన మనకు గలుగు ప్రతి నూతనభావమును మేదస్సునందు నాగటిచాలువంటి యొక రేఖను నిర్మించుచుండునని చెప్పవచ్చును. పూర్వాభ్యాసములను విడువజాలక వానిని బట్టుకొని మనము ప్రాకులాడుచుండుట కిదియే కారణము. పూర్వాభ్యాసముల ననుసరించుట సులభమగుటచే మానవస్వభావము ప్రాత పుంతలనుబట్టి పోగోరుచుండును. ఉదాహరణమునకు మనస్సు ఒక సూదివంటిదనియు, మేదఃపదార్థము దానిముందున్న యొక మెత్తని ముద్ద యనియు భావించినయెడల మనకు గలుగునట్టి ప్రతిభావమును మెదటియందు నాగటిచాలువంటి యొక మార్గమును

నిర్మించుచున్నదని చెప్పవచ్చును. మఱియు మెదడునందలి శ్వేత ధాతువు (గ్రేమేటర్) వచ్చి యీ మార్గమును ప్రత్యేకముగా నుంచుటకై దానిపై నొక పొరను గప్పియుంచినయెడల ఈమార్గము మూయబడిపోవునని మన మూహింపవచ్చును. మెదడునం దీ శ్వేత ధాతువు లేనియెడల స్మృతియనునది కలుగజాలదు. ఏలయన, స్మృతి యనగా ఒకానొక భావమును వెదకి పట్టుకొనుటకై యీ ప్రాత పుంతలను బట్టి పోవుటయే కదా. ప్రతిమానవునకును బాగుగా తెలిసిన భావములను గొన్నిటిని దీసికొని వాని నొండొంటితో నన్వయించుచు నొకడు సంభాషించునప్పు డెవ్వనికైనను విషయము సుబోధకమగును. ఏలయన ప్రతిమానవుని మెదడు నందును అట్టి మార్గము లేర్పడియుండుననియు తిరిగి వానిని కనుగొనుటయే అతడు చేయవలసిన పనియనియు మనము గ్రహింపవచ్చును. కాని క్రొత్త విషయమును గ్రహింపవలసివచ్చినపుడెల్ల నూతన మార్గములను నిర్మించుకొనవలసి యుండుటచే వెంటనే యా విషయములను గ్రహింపజాలము. అజ్ఞాతముగా మెదడు — జనులు కాదు. — నూతన భావములకు తావిచ్చుటకు నిరాకరించుచుండుట కిదియే కారణము. మెదడు నూతన భావములను ప్రతిఘటించుచుండును. ప్రాణమో, నూతనమార్గములను నిర్మింపజూచుచుండును. పూర్వాభ్యాసముల యందు మనకుండునట్టి పట్టుదలయందలి రహస్య మిదియే. మెదడునం దీ రేఖలు తక్కువగా నున్నకొలదియు, ప్రాణమను సూది వీనిని తక్కువగా నిర్మించినకొలదియు, మెదడు నూతనభావములను ప్రతిఘటించుచు వానితో పోరాడుచుండును. మనుష్యుడు విచారశీలుడైన కొలదియు వాని మెదడునందలి త్రోవలు సమ్మిశ్రమై యుండుటచే సులభముగా నాతడు నూతనభావములను గ్రహించుచుండును. ప్రతి నూతనభావమువిషయమునను ఇట్లే జరుగుచుండును. మెదడునందు మనము నూతనసంస్కారములను నిర్మించుకొని నూతనమార్గముల నేర్పఱచుకొనుచుందుము. యోగమనగా నూతనభావములును నూతనాశయములునే కావున యోగాభ్యాసమునందు మున్ముందు దైహిక

ప్రాతికూల్యము విశేషముగా గాన్పించుచుండుట కిదియే హేతువు. ఇందువలననే బాహ్యప్రకృతితో సంబంధించియుండునట్టి మత విషయములను జను లెక్కువగా ఆమోదించుచుండుటయు, ఆంతర ప్రకృతితో సంబంధించియుండు వేదాంత మానసిక శాస్త్రాది మత విషయములను తఱచు గమనింపకుండుటయు సంభవించుచున్నది.

మనము వసించు ఈ ప్రపంచమెట్టిదో మనము గ్రహింప వలెను. బోధావస్థను బొందిన అనంతసచ్చిదానందస్వరూపమే ఇంద్రియగోచరమగు మన ప్రపంచమని గుర్తింపుడు. అనంతసచ్చిదానందస్వరూపమునం దొక స్వల్పాంశము బోధావస్థను బొందియున్నది. దానినే మనము ప్రపంచ మనుచున్నాము. ప్రపంచాతీతమగు ననంతవస్తు వొకటి కలదు. మతమనున దీ రెండిటితోడను, అనగా మన ప్రపంచ మనబడు చిన్న మంటిముద్దతోడను, ప్రపంచాతీతమగు ననంతవస్తువుతోడను సంబంధించియుండవలయును. లేకున్న నట్టి మతము సమగ్రమైన మతము కానేరదు. రెండిటితోడను మతమను నది సంబంధించియుండవలయును. దేశకాలనిమిత్తములచే నిర్మింపబడిన పంజరమనదగు బోధావస్థయం దనంతసచ్చిదానందస్వరూపము బంధింపబడియున్నది. ఇంతవఱకును మన మిట్టి బాహ్యప్రపంచము నందు నెలకొనియున్నాము. అనాదికాలమునుండియు బాహ్య ప్రపంచమునుగూర్చిన భావములు మనల నాశ్రయించుకొని యున్నవి. కావున బాహ్యప్రకృతితో సంబంధించియుండు మత విషయములు మనకు నూతనములు కానేరవు. ఆంతరప్రకృతి సంబంధములగు పారమార్థికవిషయము లిట్లుకాక నూతనములై యుండుటచే మొదడునం దవి క్రొత్తత్రోవల నేర్పఱచుచుండును. అందుచే శారీర ప్రకృతి పూర్తిగా మార్పుచెందును. సామాన్యమానవులు యోగాభ్యాసము నారంభింపగనే వారి శారీరమానసికపరిస్థితులు తాఱు మాఱగుచుండుట కిదియే కారణము. సాధ్యమైనంతవఱ కిట్టి బాధలను నివారించుకొనుటకై, మన కనుకూలమగు పద్ధతి ననుసరించి

సాధనచేయుటకై, పతంజలి యిట్టి వివిధోపాయములను గనుగొని యున్నాడు.

35. విషయవతీ వా ప్రవృత్తిరుత్పన్నా మనసః స్థితినిబంధినీ.

అ: ప్రాకృతవిషయానుభవమువలన కలుగు మనః ప్రవృత్తి యైనను చిత్తస్థైర్యమును గలుగజేయును.

సహజముగా నిది ధారణవలన కలుగుచున్నది. నాసికాగ్రమున చిత్తము నేకాగ్రముచేయుట కొన్నిదినములైనంతనే సాధకుడు దివ్యపరిమళముల నాఘ్రాణింప సాగునని యోగులు వచింతురు. జిహ్వామూలమునందు చిత్తము నేకాగ్రముచేయుటచే నాదములు వినవచ్చుచుండును. జిహ్వాగ్రమునం దేకాగ్రముచేయుటచే అద్భుతరుచులు గలుగుచుండును. నాలుకమధ్య భాగమున ధారణచేయుటచే అబ్బురముగలిగించు విషయములు గోచరించును. తాలువునందు ధారణచేయుటవలన నేదియో అపూర్వదృశ్యము కానవచ్చుచుండును. స్థిరచిత్తత కలుగనివా రిట్టిసాధనల నభ్యసింప దలచియు, ఇందలి సత్యమునుగూర్చి శంకించుచుండినయెడల, కొంత కాలము సాధనచేయుటచే నిట్టి యోగానుభవములు కలుగును. అంతట పూనికతో వారు సాధనచేయ నారంభింతురు.

36. విశోకా వా జ్యోతిష్మతీ.

సమస్తదుఃఖాతీతమైన దివ్యజ్యోతిని (ధ్యానించుటవలన) (చిత్తస్థైర్యము గలుగును).

ఇది యొక విధమైన ధారణ. అధోముఖముగా నున్న దళములతోడను, అందుండి పోవుచున్న సుషుమ్నానాళముతోడను గూడిన హృదయకమలమునుగూర్చి భావింపుము. ఊపిరిపీల్చుకొని దానిని విడుచునప్పుడు ఆ కమల మూర్ధ్వముఖముగా తిరిగియున్న దనియు దానియందు దేదీప్యమానమగు జ్యోతి కలదనియు భావింపుము. ఆ జ్యోతిని ధ్యానింపుము.

37. వీతరాగవిషయం వా చిత్తమ్.

విషయవాసనలను పరిత్యజించిన చిత్తమును (ధ్యానించుట వలన) గాని (చిత్తస్థైర్యము గలుగును).

పరమపూజ్యుడనియు, నిస్సంగుడనియు నీవు భావించు నొక పుణ్యపురుషుని హృదయమునుగూర్చి భావింపుము. రాగరహిత మగునట్టి హృదయమును ధ్యానించుటచే మనఃప్రసన్నత కలుగును. ఇదియు నీకు సాధ్యముకానిపక్షమున మఱియొకమార్గము కలదు :

38. స్వప్ననిద్రాజ్ఞానాలంబనం వా.

స్వప్నము లేక నిద్రయందు గలిగెడు జ్ఞానమునుగూర్చి భావించుటవలనగాని (మనఃప్రసన్నత కలుగును).

కొన్ని సమయములందు సాధకుడు తనయొద్దకు దేవతలువచ్చి తనతో సంభాషించుటచే తాను దివ్యానందము ననుభవించినట్లును, వాతావరణమునందు తేలియాడుచున్న దివ్యగానమును విన్నట్లును కలగనును. అట్టి స్వప్నమునం దాతడు దివ్యానందమును బొంది యుండుటచే జాగ్రదవస్థయం దా యనుభవమాతని మనస్సున నాటు కొనును. ఇట్టి స్వప్నము కలిగినయెడల దానిని యథార్థమని భావించి ధ్యానింపుము. ఇదియు సాధ్యముకానియెడల నీ కభిమత మగు నే సద్విషయమును గూర్చియైనను భావింపుము.

39. యథాభిమతధ్యానాద్వా.

తన కభిమతమగు నేవిషయమునైనను ధ్యానించుటవలనగాని (స్థిరచిత్తత కలుగును).

దీనివలన దుర్విషయములనుగూర్చి చింతింపవచ్చునని భావింప రాదు. నీ కభిమతమగు సద్విషయమని కాని, చక్కని యొక స్థల మనికాని, ప్రకృతిరమ్యప్రదేశమనికాని, సద్భావమనికాని, చిత్తైకా గ్రత గల్గించునట్టి మఱి యెట్టివిషయమనికాని యీ సూత్రాభి ప్రాయము.

40. పరమాణుపరమమహత్త్వాంతోఽస్య వశీకారః.

ఇట్లు ధ్యానించు యోగిచిత్తమునకు పరమాణువు మొదలుకొని అనంతత్వమువఱకును (ధ్యాన) వశీకారమై యుండును.

ఇట్టి సాధనవలన చిత్తము అత్యంతసూక్ష్మవిషయములనే కాక, అతిస్థూలవిషయములనుగూడ సులభముగా ధ్యానింపగలుగును. ఇట్లు మనోవృత్తులు క్రమముగా క్షీణించును.

41. క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతాసమాపత్తిః.

క్షీణమైన (నిగ్రహింపబడిన) వృత్తులుగల యోగి గృహీత యందును గ్రహణ (సాధన) మందును, గ్రాహ్యమునందును (అనగా ఆత్మ లేక పురుషునియందును, మనస్సునందును, బాహ్యవిషయము లందును) వివిధవర్ణములతో గూడిన వస్తువులయెదుటనున్న స్ఫటికము (మణి) వలె ఏకాగ్రతను, తాదాత్మ్యమును బొందును.

ఎడతెగని ధ్యానమువలన గలుగు ఫలమేమి? ఇంతకుముందొక సూత్రమునందు పతంజలి ధ్యానమునందలి వివిధావస్థలను నిరూపించుచు, మున్ముందు స్థూలావలంబములను, అనంతరము సూక్ష్మావలంబములను తుద కతిసూక్ష్మావలంబములను గ్రహించుచు ధ్యానమునం దభివృద్ధి పొందవలయునని సూచించి యున్నాడు. స్థూలవిషయములవలెనే సూక్ష్మవిషయములను గూడ సులభముగా ధ్యానింపగలుటయే యిట్టి ధ్యానమువలన గలుగు ఫలము. అంతట గృహీత యగు పురుషుడును, గ్రాహ్యమగు బాహ్యవిషయమును, గ్రహణసాధనమగు చిత్తమును యోగికి గోచరించును. శరీరము లేక భౌతికవస్తువులబోలు స్థూలావలంబము లనియు, మనశ్చిత్తములవంటి సూక్ష్మావలంబములనియు, అహంకారవిశిష్టుడగు పురుషుడనియు మూడువిధములైన ధ్యేయములు కలవు. సాధనచే నిట్టి ధ్యానము లన్నియు యోగికి సిద్ధించును. ధ్యానించునప్పుడెల్ల ధ్యేయేతర

విషయములను మనస్సులోనికి రానీయకుండుటచే ధ్యేయవస్తువుతో యోగి తాదాత్మ్యము లేక యేకత్వమును బొందగలుగును. ధ్యానస్థితుడగు యోగి పుష్పసాన్నిధ్యమున నుండు స్ఫటికమువంటివాడు. పుష్ప మెఱ్ఱగా నున్నయెడల తత్సాన్నిధ్యమున నుండు స్ఫటికమును ఎఱ్ఱగా నున్నట్లు కాన్పించును; పుష్పము నీలముగా నున్నయెడల స్ఫటికమును నీలముగా నున్నట్లు కానబడును.

42. తత్ర శబ్దార్థజ్ఞానవికల్పైః సంకీర్ణా సవితర్కా సమపత్తిః.

శబ్దము, అర్థము, జ్ఞానము అనునవి మూడు కలిసి యున్నప్పుడు సవితర్క-సమాధి యని చెప్పబడును.

శబ్దమనగా నిచ్చట స్పందనమనియు, అర్థమనగా దానిని మెదడునకు గొనిపోవునట్టి నాడులనియు, జ్ఞానమనగా మనస్సునందు గలుగు ప్రతిక్రియయనియు చెప్పవచ్చును. పైన వివరింపబడిన ధ్యానములను పతంజలి సవితర్క-ధ్యానములని చెప్పుచు క్రమముగా ఉన్నతమైన ధ్యానములను దెలుపును. శబ్దార్థజ్ఞాన సంయోగము వలన గలుగు సవితర్క సమాధియందు విషయి విషయములయొక్క ద్వైతము భాసించుచుండును. బాహ్యస్పందనమగు శబ్దమే జ్ఞాననాడులవలన లోనికి గొనిపోబడినప్పుడు అర్థమగును. అంతట చిత్తమునందు ప్రతిక్రియాత్మకమగు వృత్తి కలుగుచున్నది. అదియే జ్ఞానము. కాని మనము జ్ఞానమని చెప్పునట్టి సంఘటనము శబ్దార్థజ్ఞానము లను నీ మూడింటి యొక్కయు సంయోగమైయున్నది. ఇంతవఱకును జెప్పబడిన ధ్యానములలో ఇట్టి మిశ్రితవిషయముననే ధ్యేయముగా గ్రహించుచున్నాము. క్రింద చెప్పబడు సమాధి యింతకంటె ఉన్నతమైన సమాధి.

43. స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా.

స్మృతి పరిశుద్ధమైన లేక స్వరూపశూన్యమై (గుణరహితమై) ధ్యేయముయొక్క అర్థమును మాత్రము భాసింప జేయుచున్నప్పుడు నిర్వితర్క-సమాధి (కలుగుచున్నది).

శబ్దార్థజ్ఞానము లను త్రిపుటితో గూడిన సవితర్క-ధ్యాన సాధన మూలముననే యివిమూడును కలియకుండునట్టి నిర్వితర్క-సమాధిస్థితిని బొందుదుము. ఇవి మిశ్రితము కాకుండునట్లు చేయ వచ్చును. మున్ముం దీ శబ్దార్థజ్ఞానము లన నేమో గ్రహింప యత్నింతము. చిత్తము సరస్సువంటిదనియు, శబ్ద మను స్పందన మీ సరస్సునందు లేచు నలవంటిదనియు సదా మనము జ్ఞప్తిలో నుంచు కొనవలయును. మీయందు చిత్త మను ప్రశాంతమగు సరస్సు కలదు. నే నిప్పుడు 'ఆవు' అను శబ్దము నుచ్చరించుచున్నాను. ఈ శబ్దము మీ చెవులలో ప్రవేశించి నంతనే మీ చిత్తమునం దొక వృత్తి కలుగుచున్నది. ఈ వృత్తియే 'ఆవు' అనునట్టి భావము. దీనినే 'ఆవు' అను రూపమనియు, 'ఆవు' అను శబ్దముయొక్క అర్థ మనియు జెప్పుదుము. బాహ్యాంతర శబ్దస్పందనములకు ప్రతి క్రియారూపమున చిత్తమునందు గలుగు వృత్తియే మీకు గోచరించు నట్టి ఆవు. ఈ వృత్తినే మీరు 'ఆవు' అని గ్రహించుచున్నారు. శబ్దముతో వృత్తి లయించుచున్నది. శబ్దము లేనిదే వృత్తి యెన్న డును గలుగదు. 'ఆవు'ను గూర్చి భావించుచున్నామే కాని 'ఆవు' అను శబ్దమును వినుట లేదే. కావున నిది యెట్లు సాధ్యమగునని మీ రడుగ వచ్చును. 'ఆవు' అని మెల్లగా మీ మనస్సులో మీరే యా శబ్దము నుచ్చరించుచున్నారు. దానివలన 'ఆవు' అనునట్టి వృత్తి కలుగుచున్నది. బాహ్యముగాగాని అంతరముగాగాని ఇట్టి శబ్ద ప్రేరణము లేనిదే వృత్తి యెన్నడును గలుగదు. శబ్దమంతరించి నంతనే వృత్తియు లయించును. ఇక మిగులునదేమి? చిత్తమునందు గలుగు ప్రతిక్రియాఫలితమే. అదియే జ్ఞానము. శబ్దార్థజ్ఞానము లను నీ మూడును సమ్మిశ్రమై యుండుటచే మనము వానిని విభజింపజాల కున్నాము. శబ్దము వెలువడినంతనే ఇంద్రియములందు స్పందనము కలుగును. అంతట చిత్తమునందు ప్రతిక్రియాత్మకమగు వృత్తి జనిం చును. అతివేగముగా నివి యొకదానివెంబడిని మఱియొకటిగా వెలువడుచుండుటచే మనము వీనిని విభజించి గ్రహింపజాల

కున్నాము. నిర్వితర్క-ధ్యానమును చిరకాల మభ్యసించుటచే సమస్తవృత్తులకును ఆశ్రయమగు స్మృతి పరిశుద్ధమగును. అంతట శబ్దార్థజ్ఞానములను వేర్వేఱుగా గ్రహింపగలము. ఇదియే నిర్వికల్ప సమాధి యని చెప్పబడుచున్నది.

44. ఏతయైవ సవిచారా నిర్విచారాచ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా.

ఈ పద్ధతి ననుసరించియే సూక్ష్మవిషయములతో గూడిన సవిచార నిర్విచారసమాధులును వివరింపబడుచున్నవి.

పైనజెప్పబడిన విధానమే యిచ్చటను అవలంబింపబడు చున్నది. కాని పై జెప్పిన ధ్యానములందు గ్రహింపబడిన అవలంబ ములు స్థూలములు. ఇవియో సూక్ష్మములు.

45. సూక్ష్మవిషయత్వం చాలింగపర్యవసానమ్.

సూక్ష్మవిషయములు ప్రధానతత్త్వము (అలింగము). తో అంతమగుచున్నవి.

పృథివ్యాదిభూతములును, వానివలన నిర్మాణమగున వన్నియు స్థూలవిషయములై యున్నవి. సూక్ష్మవిషయములు తన్మాత్ర, లనబడు పరమాణువులతో ప్రారంభమగును. పురుషు డొక్కడుతక్క మిగిలిన తత్త్వములన్నియు, అనగా ఇంద్రియములును, మనస్సును, అహం కారమును, (నామరూప జగత్తునకు కారణమగు) చిత్తమును, సత్త్వరజస్తమస్సులయొక్క సామ్యావస్థయై ప్రధానమనియు, అవ్యక్త మనియు జెప్పబడు ప్రకృతియు సూక్ష్మవిషయములందు జేరును.

46. తా ఏవ సబీజః సమాధిః

ఇవి సబీజసమాధులై యున్నవి.

సబీజసమాధులు పూర్వకర్మబీజములను నిర్మూలింపజాలవు. కావున వీనివలన మోక్షము సిద్ధింపదు. ఐనను యోగి వీనివలన గలుగు ప్రయోజన మీ క్రిందిసూత్రమునందు వివరింపబడును.

47. నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః.

నిర్విచారసమాధి పరిశుద్ధమగుటవలన అధ్యాత్మప్రసాదము లేక స్థిరచిత్తత గలుగుచున్నది.

48. ఋతంభరా తత్ర ప్రజ్ఞా.

దానియందలి ప్రజ్ఞ సత్యపరిపూర్ణమైనట్టిదని చెప్పబడును. క్రిందిసూత్రమునం దీ విషయము వివరింపబడును.

49. శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్.

ప్రత్యక్షానుమానములచే లభించునట్టి జ్ఞానము సామాన్య విషయములనుగూర్చి తెలుపును. ఇచ్చట చెప్పబడిన సమాధివలన గలిగెడు ప్రజ్ఞ ప్రత్యక్షానుమానములచే గ్రహింపదగని విషయములను ప్రకాశింప జేయగల్గియుండుటచే విలక్షణమైనట్టిది.

మనజ్ఞానము ప్రత్యక్షము, అనుమానము, ఆప్తవాక్యము అనునట్టి ప్రమాణములవలన గలుగుచున్నదని భావము. ఆప్తు లనుటచే యోగులెప్పుడును ఋషులు లేక తత్త్వదర్శులని భావింతురు. ఆప్తవాక్యములై యుండుటచేతనే వేదములు మనకు పరమప్రామాణ్యములైయున్నను, స్వయముగా వేదములు మనకు సాక్షాత్కారమును గల్గింపజాలవని యోగు లెన్నుదురు. వేదముల నన్నిటిని పఠించినను మనకెట్టి సాక్షాత్కారమును గలుగజాలదు. కాని వేదవిధుల ననుసరించి సాధనచేయుటచే అవాఙ్మనసగోచరమగు అఖండసచ్చిదానందస్థితిని ప్రాపింపగల మనునదియే యీ సూత్రమునందలి భావము. ఆత్మసందర్శనమే, భగవత్సాక్షాత్కారమే నిజమైన మతము. మిగిలినదంతయు మత సన్నాహము కాని మతము కానేరదు. ఉపన్యాసములను వినుటయు, గ్రంథములను జదువుటయు, హేతువాదముచేయుటయు మతసాధనములు కాని మతము కానేరవు. యుక్తివాదము ననుసరించి భగవంతుడు కలడని యంగీకరించుటగాని, యంగీకరింపకుండుటగాని మతము కానేరదు. ప్రత్యక్షములగు శబ్దాది విషయములకంటె విస్పష్టముగా

పారమార్థిక సత్యములను దర్శింపగలమనునదియే యోగుల ముఖ్యాభిప్రాయము. ఆత్మపరమాత్మలవంటి తత్త్వములు బాహ్యేంద్రియ గోచరములు కానేరవు. పరమాత్మను నా కన్నులతో జూడజాలను; నా చేతులతో తాకజాలను. హేతువాదమువలన నెన్నడును అతీంద్రియజ్ఞానము కలుగజాలదని మనకు తెలియును. సంశయాత్మకమగు జ్ఞానమే హేతువాదమునకు ఫలము. యుగయుగములనుండి జనులు తర్కించుచునే యున్నారు. జీవితకాలమంతయు తర్కించినను మతతత్త్వములు సత్యములనికాని, అసత్యములనికాని నిరూపింపజాలము. ప్రత్యక్షానుభవమే హేతువాదమున కాధారభూతమై యున్నది. హేతువాద మింద్రియోపలబ్ధమగు జ్ఞానము నతిక్రమింపజాలదు. ఇంద్రియజన్యజ్ఞానము నతిక్రమించిననేకాని సాక్షాత్కారమునన దెన్నటికిని గలుగదు. మానవుడు ప్రత్యక్షానుభవమునే కాక తార్కికజ్ఞానమును సహిత మతిక్రమింపగలడని యోగులు చాటుచున్నారు. మఱియు తార్కికజ్ఞానాతీతుడు కాజాలునట్టి శక్తి మానవునకు గలదు. మానవున కనేల! ప్రతిజీవికిని, ప్రతి ప్రాణికిని గలదు. యోగాభ్యాసముచే నీశక్తి వికసించినంతనే మానవుడు తార్కికజ్ఞానాతీతుడై అతీంద్రియవిషయములను ప్రత్యక్షముగా నవలోకించును.

50. తజ్జః సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ.

ఈ సమాధివలన గలుగునట్టి సంస్కారము ఇతర సంస్కారముల నన్నిటిని నిరోధించును.

పై జెప్పిన సూత్రమునందు ధారణావస్థ నతిక్రమించుటయే అతీంద్రియజ్ఞానమును బొందుట కుపాయమనియు, చిత్తమునకు ధారణ కలుగకుండునట్లు చేయునవి పూర్వసంస్కారములనియు గమనించి యున్నాము. ఏకాగ్రము చేయుటకై యత్నించినంతనే చిత్తము నలువైపులకును పరుగెత్తుచుండుట మీ రెఱిగినదే కదా. భగవంతుని ధ్యానించుటకు యత్నించునప్పుడే చిత్తవృత్తులు విజృంభించు

చుండును. మఱియొకప్పు డవియంత ప్రబలముగా నుండవు. వలదను నప్పుడే చిత్తము నావరించుట కవి యత్నించుచుండును. ఇందులకు కారణమేమి? ధ్యానసమయమున చిత్తవృత్తు లంత ప్రబలముగా నుండుటకు హేతువేమి? నీవు వానిని నిరోధింపజూచునప్పు డవి తమ యావచ్ఛక్తితోడను ప్రతిఘటించుచుండుటయే హేతువు. చిత్తమునం దెచ్చటనో దాగియుండి సమయము చిక్కినప్పుడు పులులవలె నుఱుకుటకై వేచియుండునట్టి యీ పూర్వసంస్కారము లెన్ని కోట్లుండునోకదా! ఇతరవృత్తులను విడిచి మనకు గావలసిన ధ్యేయాకారవృత్తి యొకటియే వెలువడుటకై యీ వృత్తులనన్నిటిని నిరోధింపవలసియుండును. ఇందులకు మాఱుగా చిత్తవృత్తులన్నియు ఒక్కసారిగా వెలువడుటకై ప్రబలయత్నము చేయుచుండును. సంస్కారము లింతటి బలవత్తరములై యుండుటచేతనే చిత్తైకాగ్రతను గలుగనీయకుండును. ఇచ్చట తెలుపబడిన సమాధిసంస్కారములను నిరోధింపల్గియుండుటచే తప్పక దీని నభ్యసింపవలయును. ఈ విధమగు చిత్తైకాగ్రతవలన గలుగు సంస్కారము లితర సంస్కారవ్యాపారములను నిరోధించు నంతటి బలీయములై యుండును.

51. తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః.

ఇతరసంస్కారములను నిరోధించు నీ సంస్కారమును సహితము నిరోధించుటవలన సర్వమును నిరోధింపబడుటచే నిర్బీజ సమాధి కలుగును.

సాక్షాత్కారమే మన పరమావధియని మనము గ్రహించియున్నాము. ప్రకృతితోడను, మనస్సుతోడను, శరీరముతోడను తాదాత్మ్యము పొందియుండుటచే పురుషుని మనము సందర్శింప జాలకున్నాము. పామరుడు తన శరీరమే ఆత్మ లేక పురుషుడనుకొనును. పండితుడు తన మనస్సే ఆత్మయని తలచును. కాని వీరిరువురును కూడ భ్రమించుచున్నారు. శరీరాదులతో పురుషున కిట్లు తాదా

త్మ్యము గల్గించునదేది? వివిధములగు చిత్తవృత్తులు పురుషు నావరించియుండుటచే ఈ యావరణము నుండి పురుషుని ప్రతిబింబము మనకు ఛాయామాత్రముగ గోచరించుచున్నది. కావున కోపమను చిత్తవృత్తి కల్గినంతనే ''నాకు కోపము వచ్చినది'' అనుచు పురుషునకు లేక ఆత్మకు కోపము వచ్చినట్లు తలచుచుందుము. ''ప్రేమ'' యను చిత్తవృత్తి కలిగినంతనే మన ప్రతిబింబము పురుషునియందు కని ''మాకు ప్రేమకల'' దని చెప్పుచుందుము. దౌర్బల్యమను వృత్తియందు పురుషుడు ప్రతిబింబింపబడినప్పుడు మనము దుర్బలులమని భావించుచుందుము. వివిధములగు నీ మనోభావములన్నియు పురుషు నావరించియుండునట్టి సంస్కారములవలన గలుగుచున్నవి. చిత్త మను సరస్సును వృత్తు లను తరంగములావరించియున్నంతవఱకు పురుషుని కనుగొనజాలము. చిత్తవృత్తులన్నియు శాంతించిననే కాని పురుషస్వరూపము మనకు గోచరము కాఁజాలదు. కావున మున్ముందు చిత్తవృత్తులయొక్క స్వభావస్థితులనుగూర్చియు, అనంతరము చిత్తవృత్తులను నిరోధించు నుత్తమోపాయములనుగూర్చియు, అగ్ని నగ్ని దహించురీతిని ఒక్క వృత్తి యితరవృత్తుల నన్నిటిని నిరోధించునంతటి ప్రబలమగునట్లు చేయు విధానమునుగూర్చియు, పతంజలి మనకు బోధించును. ఒకే చిత్తవృత్తి నిలిచియుండునప్పు డా వృత్తిని సహితము నిరోధించుట సులభము. అప్పుడు కలుగునట్టి సమాధి నిర్బీజసమాధియని చెప్పబడును. ఇట్లు సర్వవృత్తినిరోధము సిద్ధించినంతనే అద్వితీయుడును, కేవలుడును, జననమరణ రహితుడును, నిత్యుడును, నిర్వికారుడును, స్వయంజ్యోతియు నగు పురుషుడు సహజవైభవమున వెల్గొందుచుండుటను వీక్షింతుము.

---

## పాతంజలయోగసూత్రములు

### ద్వితీయాధ్యాయము

# సాధన - పాదము

## (ఏకాగ్రత - దాని అభ్యాసము)

1. తపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః.

తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము (కర్మఫలముల నీశ్వరార్పణము చేయుట) యనునవి చేరి క్రియాయోగమనబడును.

ప్రథమాధ్యాయమున జెప్పబడిన సమాధులు కష్టసాధ్యములై యుండుటచే సావధానులమై వాని నభ్యసింపవలయును. అందులకు క్రియాయోగమనునది ప్రథమసోపానము. క్రియాయోగమనగా కర్మాచరణమనియు, యోగసాధనయనియు భావము. ఇంద్రియములే గుఱ్ఱములు; మనస్సే కళ్లెము; బుద్ధియే సారథి; ఆత్మయే రథికుడు; శరీరమే రథము. గృహ యజమాని, రాజు, మనుష్యాత్మ, ఈ రథమున అధివసించియుండును. గుఱ్ఱములు బలిష్ఠములై పగ్గములకు వశముకానియెడల, సారథియైనవానిని నిరోధించు నుపాయము నెఱుంగనియెడల, రథము దుర్గతి పాలగును. అట్లుగాక ఇంద్రియములను గుఱ్ఱములను చక్కగా వశపఱచుకొని బుద్ధియను సారథి మానస మను కళ్లెమును హస్తగతము గావించుకొనినయెడల ఈ రథము గమ్యస్థానమును జేరును. ఈ తపస్సన నేమి? మనశ్శరీరములను స్వవశము గావించుకొని వానిని యథేచ్ఛగా సంచరింపనీయక ఉచితరీతిని నిరోధించుటయే తపస్సనబడును.

స్వాధ్యాయము :—స్వాధ్యాయ మనగా నేమి? నవలలను, కథల పుస్తకములను వల్లించుట కాదు; ముక్తిమార్గమును గఱపు సద్గ్రంథ పఠనమే స్వాధ్యాయము. మఱియు తార్కిక గ్రంథపఠనము స్వాధ్యాయము కానేరదు. యోగి తార్కికదశ నతిక్రమించెనని

భావింతుము. వలసినంతకాలము పూర్వపక్ష సిద్ధాంతములందు గడపి యాతడు తృప్తి వహించియున్నాడు. తన సిద్ధాంతములను దృఢపఱచుకొనుటయే అధ్యయనమువలన నాతనికి గలుగు ప్రయోజనము. పూర్వపక్షము, సిద్ధాంతము అని వైదికజ్ఞానము రెండు విధములుగా నున్నది. అజ్ఞానదశయందు సాధకు డిందు మొదటిదగు పూర్వపక్షము నవలంబించి యుక్తిప్రయుక్తులను వినియోగించుచుండును. తార్కికావస్థ ముగిసినంతనే సిద్ధాంతదశకు వచ్చును. ఇట్లు సిద్ధాంతమునకు వచ్చుటతోడనే సరికాదు; సిద్ధాంతమును దృఢపఱచుకొన వలయును. పఠింపవలసిన గ్రంథము లనంతములుగా నున్నవి. వ్యవధియో, అతిపరిమితము. కావున సారభూతమగు విషయమును గ్రహించుటయే జ్ఞానార్జనమున కుపాయము. పరమార్థమును గ్రహించి తదనుగుణమగు జీవితమును గడపుటకు యత్నింపుము. నీటిని పాలను జేర్చి రాజహంసయెదుట నుంచినయెడల రాజహంస నీటిని విడిచి పాలనుమాత్రము గ్రహించునని ఆర్యులు విశ్వసింతురు. ఇట్లే సర్వశాస్త్రములందును సారాంశమును గ్రహించి అప్రధానములగు మిగిలిన విషయములను విసర్జింపవలయును. వాదప్రతివాదములతో గూడిన తార్కిక వ్యాయామము ప్రారంభదశయందావశ్యకము. దేనినిగాని అంధప్రాయముగా అవలంబింపరాదు యోగి తార్కికదశ నతిక్రమించి శిలాసదృశమగు సిద్ధాంతదశకు వచ్చియున్నాడు. సిద్ధాంతమును దృఢపఱచుకొనుటయే ఆతడు చేయవలసిన కార్యము. ''వాదింపకుము. ఒరులు నీతో వాదింప బూనినయెడల మౌనము వహించియుండుము'' అని యోగి వచించును. ఏవాదమునకును బదులుచెప్పక నిశ్శబ్దముగా అట్టి తావును విడిచిపొమ్ము. వాద ప్రతివాదములవలన మనశ్శాంతి చెడును. మనోబలమును చేకూర్చుకొనుట మన కావశ్యకము. ఊరక మనస్సును కలవర పఱచుకొనుటవలన ప్రయోజనమేమి? దుర్బలమగు ధీశక్తిచే అతీంద్రియజ్ఞానమును బొందజాలము. యోగి

పడయనేరనట్టిది అతీంద్రియజ్ఞానమగుటచే తార్కికజ్ఞాన మాతనికి నిష్ప్రయోజనము. ఇదియే యాతని నిశ్చితాభిప్రాయము కావున నాతడు వాదప్రతివాదములను జేయక మౌనము వహించి యుండును. వాగ్వాదము లాతని మనశ్శాంతికి భంగకరమగును; మనస్సును కలవరపఱచును. హేతువాదములును, యుక్తిప్రయుక్తులును అప్రధానములు. హేతువాదాతీతమగు మహోన్నతాంశము లనేకములు కలవు. బడిబాలుర వాగ్వాదములకొఱకును, తార్కిక సంఘముల కొఱకును జీవిత మేర్పడియున్నదని భావింపరాదు.

ఈశ్వరప్రణిధానము లేక కర్మముల నీశ్వరార్పణముచేయుట యనగా కార్యసాఫల్యమునకు ప్రతిష్ఠనుగాని, కార్యవిఘాతమునకు నిందనుగాని మనపై బెట్టుకొనక రెంటిని ఈశ్వరునకే అర్పించి స్వస్థచిత్తులమైయుండుట యని భావము.

2. సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ.

సమాధిని సిద్ధింపజేయుటకును (అవిద్యాది) క్లేశములను క్షీణింపజేయుటకును (క్రియాయోగ మేర్పడియున్నది).

మనోనిగ్రహమనునది లేక మనలో చాలమంది యథేచ్ఛగా మనస్సును వదలివైచి తుదకెందుకును కొఱగాకుండునట్లు చేయుచుందురు. కావున మనోనిగ్రహమును బొందుటకై సదా క్రియాయోగము నభ్యసించు టావశ్యకము. మనోనిగ్రహము లేకుండుటచే యోగమున కాటంకములు గలుగుచు మన కవి క్లేశకారణము లగుచున్నవి. క్రియాయోగము వలన గలుగు మనోనిగ్రహమే క్లేశనివారణోపాయము.

3. అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః.

అవిద్య, అస్మిత (అహంకారము), రాగము, ద్వేషము, అభినివేశము (ప్రాణమునందలి తీపి) అనునవి యైదును క్లేశములు.

క్లేశము లైదింటియందును అవిద్య లేక అజ్ఞానమనునది కారణము; మిగిలిన నాల్గును కార్యములు; ఇవి మనకు సంసార

బంధమును గల్పించునట్టి పంచపాశములు. అజ్ఞానముకంటె దుఃఖ కారణము మఱియొకటిలేదు. సహజముగ పురుషు డానంద స్వరూపుడు. మాయకంటె, భ్రాంతికంటె, అజ్ఞానముకంటె పురుషునకు దుఃఖహేతు వేది? పురుషుని దుఃఖమంతయు భ్రాంతియే కాని మఱియొకటికాదు.

**4. అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణామ్.**

ఇవి (క్లేశములు) నిద్రాణములై యున్నను, మందస్థితిలో నున్నను, అణగియున్నను, విజృంభించియున్నను,—అహంకారము నకును, రాగద్వేషములకును, ప్రాణమునందలి మమకారమునకును అవిద్యయే మూలకారణము.

అహంకారమునకును, రాగమునకును, ద్వేషమునకును, అభినివేశము లేక ప్రాణమునందలి మమకారమునకును అవిద్యయే కారణము. ఈ సంస్కారములు వివిధావస్థలలో నుండును. కొన్ని సమయములం దివి పైకి కానబడక నిద్రాణములై యుండును. 'పసిబిడ్డవలె అమాయకు'డని యొకనినిగూర్చి చెప్పుచుండగా తఱచు మీరు వినుచుందురు. ఐనను పసిబాలునియందు రాక్షసావస్థయో, దేవతావస్థయో గర్భితముగానుండి క్రమముగా వ్యక్తము కావచ్చును. తమయం దీ సంస్కారములు అతి సూక్ష్మస్థితిలోనుండుటచే యోగులు వానిని నిర్మూలింపగలరు. అణగియుండుట యనగా ఒకజాతి సంస్కారములు అంతకంటె ప్రబలమైన మఱియొకజాతి సంస్కారములచే తాత్కాలికముగా నిరోధింపబడియుండుననియు, ప్రతిబంధము తొలగినంతనే మరల వ్యక్తమగుచుండుననియు భావము. సంస్కారముల కనుకూలపరిస్థితు లేర్పడినంతనే అవి సద్వృత్తులుగనో దుర్వృత్తులుగనో విజృంభించును.

**5. అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా.**

అనిత్యమైనవానిని నిత్యముగను, అశుద్ధమైనవానిని శుద్ధముగను, దుఃఖాత్మకమైయున్నవానిని సుఖాత్మకముగను, అనాత్మమై యున్నవానిని ఆత్మగను భావించుటయే అవిద్య యనబడుచున్నది.

వివిధములైన యీ సంస్కారము లన్నిటికిని అవిద్యయే మూలకారణము. అవిద్యయనగా నేమి? 'శరీరమే నేను' అనియు, 'శుద్ధమై, స్వయంజ్యోతియై, సచ్చిదానందమయమైయున్న ఆత్మను నేనుకా'ననియు మనము భావించుచున్నాము. ఇదియే అజ్ఞానము. (భగవంతుని విడిచి) మనుష్యునిగూర్చి భావించుచు శరీరమే మనుష్యుడని తలంచుచుందుము. ఇదియే మహామాయ.

## 6. దృగ్దర్శనశక్త్యోరేకాత్మతైవాస్మితా.

సాక్షిత్వమునకు సాధనభూతమగు అంతఃకరణముతో పురుషుడు తాదాత్మ్యమును బొందుటయే అస్మిత యనబడు క్లేశము.

సాక్షియైన పురుషుడు నిజముగా నిత్యశుద్ధబుద్ధముక్తుడైన ఆత్మయే కాని వేఱుకాదు. ఇక మనస్సును, బుద్ధియు, చిత్తమును, ఇంద్రియములును బాహ్యప్రపంచానుభవము పొందుటకై పురుషునకు సాధనములై యున్నవి. ఈ సాధనములతో పురుషుడు తాదాత్మ్యమును బొందుటయే 'అస్మిత' లేక అహంకారమగును. 'నేను మనస్సు' ననియు, 'సంకల్పము' ననియు, 'నాకు కోపమువచ్చిన' దనియు, 'నేను సుఖి' ననియు మనము చెప్పుచుందుము. ఆత్మస్వరూపులమగు మనకు రాగద్వేషము లెట్లు కలుగును? ఆత్మతో నేకత్వమును బొందవలయును. ఆత్మ నిర్వికారుడు కావున ఆత్మ కొకప్పుడు సుఖమును మఱియొకప్పుడు దుఃఖమును గలుగజాలవు. నిర్వికారుడును, నిత్యుడును, సర్వగతుడును నగు నాత్మ కేదియు వికారము కల్గింపజాలదు. ఆత్మ సర్వాతీతుడు; ప్రకృతి నియమములకు బద్ధుడుకాడు. ఐనను అజ్ఞానముచే అంతఃకరణముతో మనము తాదాత్మ్యమును బొంది 'మనము సుఖించుచున్నా' మనియు, తలచుచుందుము.

## 7. సుఖానుశయీ రాగః.

సుఖము ననుసరించియుండునదియే రాగము.

శబ్దాదివిషయములు కొన్ని మనకు సుఖహేతువులై యుండును. అందుచే మనస్సు ప్రవాహరూపమున వానివంకకు బోవుచుండును. ఇట్లు సుఖహేతువు ననుసరించుటయే రాగమని చెప్పవచ్చును. దుఃఖకరమగు విషయములందు మనకెప్పుడును రాగము కలుగదు. విపరీతమైన విషయములు కొన్ని సమయములందు మనకు సుఖకరములై తోచినను సుఖహేతువులగు విషయములందే రాగము జనించుననుధర్మమే వానియందును వర్తించును.

8. దుఃఖానుశయీ ద్వేషః.

దుఃఖము ననుసరించియుండునదియే ద్వేషము.

మనకు దేనివలన బాధ కలుగునో దానినుండి వెంటనే తొలగి పోవుటకు యత్నింతుము.

9. స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః.

పండితులకు సహితము ప్రాణమునందలి మమకారము దృఢముగానుండును.

ప్రతిజంతువునకును ప్రాణభీతి కలదు. ప్రాణమునందలి తీపిచే జనులు పునర్జన్మమును సహితము కోరుచుందురు. దీని నాధారము చేసికొని పునర్జన్మసిద్ధాంతమును స్థాపించుటకనేక యత్నములు చేయబడియున్నవి. ఈ వాదము నిలువజాలదని చెప్పనవసరము లేకున్నను, ఇందలి విచిత్రాంశ మేమన, ప్రాణభీతి జన్మాంతరమును సూచించు నను విషయము మనుష్యులకే కాని జంతువులకు వర్తింపదని పాశ్చాత్యుల భావము. ఇక హైందవులు పూర్వానుభవమును, పూర్వజన్మమును కలవని నిరూపించుటకీ ప్రాణభీతి నొక హేతువుగా పరిగణించియున్నారు. అనుభవమే మన జ్ఞానమున కంతకును మూలాధారమై యుండుట వాస్తవమైనయెడల మన మెన్నడును అనుభవించియుండని విషయమునుగూర్చి ఊహించుటకాని గ్రహించుటగాని మన కసాధ్యమై యుండవలయును. కోడి తనగ్రుడ్లను పొదిగి పిల్లలను జేసినంతనే అవి తమ యాహారము నేరుకొని తినుటకు మొదలు

పెట్టును. బాతుగ్రుడ్లు కోడిపెట్టలవలన పొదుగబడి, పిల్లలు గ్రుడ్ల నుండి వెలువడినంతనే ఛంగున నీళ్లలోనికి బోవుటయు, అవి నీటిలో మునుగునని తల్లి భయపడుటయు తఱచు కనుగొనుచుందుము. ప్రత్యక్షానుభవ మొక్కటియే జ్ఞానమునకు మూలకారణమై యున్న యెడల కోడిపిల్లలు ఆహారము తినుటయు బాతుపిల్లలు నీరు తమకు సహజమగు వాసస్థానమనియు నెక్కడ నేర్చినవి? అది సహజజ్ఞాన మందురా! ఆ మాట లర్థరహితములు. 'సహజజ్ఞాన' మనుపదమును జూపుట విశదీకరణము కానేరదు. ఈ సహజజ్ఞాన మెట్టిది? మనలో నిట్టి సహజజ్ఞాన ప్రవృత్తు లనేకములు కలవు. మీలో యువతు లనేకులు 'పియానో' వాయింతురుగదా. మొట్టమొదట మీరు నేర్చుకొనునప్పుడు నల్లనివియు తెల్లనివియు నగు శ్రుతులపై ఒకటితరువాత మఱియొకటిగా నెంతజాగరూకతతో మీ వ్రేళ్ల నుంచవలసియుండెడిదో జ్ఞప్తికి దెచ్చుకొనుడు. కాని నేడు మీరు మీ ప్రక్కనున్న స్నేహితులతో సంభాషించుచుండినను, చిరకాలాభ్యాసమువలన మీ చేతివ్రేళ్లు తమంత తామే శ్రుతులను వాయించుచుండును. ఇట్లు వాయించుట మీ వ్రేళ్లకు సహజగుణముగా పరిణమించియున్నది. ఇట్లే మనము చేయు ప్రతికార్యమును అభ్యాసముచే సహజమై దానియంతట నదియే జరుగుచుండును. ఐనను, మనకు దెలిసినంతవఱకు సహజవ్యాపారములని భావింపబడుచున్న క్రియలన్నియు సూక్ష్మావస్థను పొందిన తార్కికజ్ఞానఫలితములు. యోగ పరిభాషయందు చెప్పిన యెడల అవ్యక్తమగు తార్కికజ్ఞానమే సహజజ్ఞానమని చెప్పవచ్చును. సూక్ష్మస్థితియందు తార్కిక జ్ఞానము సంస్కారరూపమును పొందును. కావున సహజజ్ఞాన మనబడున దంతయు అవ్యక్తమగు తార్కికజ్ఞానమే యని తలచుట హేతువిరుద్ధము కానేరదు. అనుభవము వలననేకాని తార్కికజ్ఞానము కలుగజాలకుండుటచే సహజజ్ఞానమనున దంతయు పూర్వానుభవఫలితమై యున్నది. కోడిపిల్లలు గ్రుడ్లగూబను జూచి భయపడుటయు, బాతుపిల్లలు

నీటిపై ప్రీతిని జూపుటయు పూర్వానుభవమువలననే సంభవించుచున్నది. ఇక నీక నీయనుభవము జీవుని యనుభవమా? లేక కేవలము శరీరానుభవమా? బాతుపిల్లల యనుభవము వాని పూర్వుల యనుభవమా? లేక స్వానుభవమా? అని మనము విచారింపవలసియున్నది. నవీన శారీరశాస్త్రజ్ఞు లీ యనుభవము శరీరానుభవ మందురు; శరీర ద్వారమున వ్యక్తమగు మానసికానుభవమని యోగులెన్నుదురు. ఇదియే పునర్జన్మసిద్ధాంతము.

ప్రత్యక్షజ్ఞానమనినను, తార్కిక జ్ఞానమనినను, సహజ ప్రవృత్తియనినను, మన జ్ఞానమంతయు అనుభవమువలననే కలుగుచున్నదనియు, అవ్యక్తమగు పూర్వానుభవ ఫలితమే సహజ ప్రవృత్తియనియు, సహజప్రవృత్తియే తిరిగి తార్కికజ్ఞానముగా పరిణమించుచున్నదనియు మనము గ్రహించియున్నాము. అనుభవమును ప్రధానహేతువుగా గ్రహించి హిందువులు పునర్జన్మ సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నారు. జన్మపరంపరలయందు పలువిధములగు భయముల ననుభవించుటయే కాలక్రమమున ప్రాణభీతికి హేతువగుచున్నది. పూర్వదుఃఖానుభవమువలననే పసిబిడ్డ స్వాభావికముగా భయపడుచున్నది. పూర్వదుఃఖానుభవమువలననే ప్రాణమునందు మమకారము జనించును. శరీర మెప్పటికైనను నశించునట్టిదే యని గ్రహించి ''వేలకొలది జన్మముల నెత్తితిమి; ఆత్మ మృత్యురహితము; కావున భయపడనేల?'' యని వచించు మేధానిధులగు మహాపండితులకు సహితము ప్రాణభీతి కలదు. ప్రాణమునం దిట్టి మమకారము కలుగుటకు హేతువేమి? మన కిది సహజప్రవృత్తియై, యోగులు వచించునట్లు, సంస్కారరూపమును పొందియున్నదని గ్రహించియున్నాము. సూక్ష్మములగు నీ సంస్కారములు నిద్రాణములై చిత్తమునం దణగియున్నవి. ఇంతవఱకును కలిగిన మరణానుభవములన్నియు, సహజ ప్రవృత్తియనునదంతయు అసంప్రజ్ఞాతస్థితిని పొందిన యనుభవము. ఈ సంస్కారములు చిత్తమునం దణగియుండి చిత్తవృత్తులను కలుగజేయుచుండును.

స్థూలములగు చిత్తవృత్తులను (మానసిక తరంగములను) బాగుగా గ్రహింపగలము; వానిని నిరోధించుట సులభము. కాని సూక్ష్మములగు సంస్కారములను నిరోధించుటెట్లు? నాకు కోపము వచ్చినప్పుడు చిత్తమంతయు కోప మను నుత్తుంగతరంగరూపమును దాల్చుచున్నది. కోపమువచ్చినట్లు గ్రహించుచున్నాను. ఇట్లు కోపమును సులభముగా నిగ్రహింపగలను; మరల్చుకొనగలను; ప్రతిఘటింపగలను. కాని కోపకారణమును సమూలముగా గ్రహింపగల్గిననే కాని కోపమును సంపూర్ణముగా నిగ్రహింపజాలను. నాతో నొకడు తీవ్రముగా మాటాడినంతనే నాకు కోపమువచ్చుచున్నట్లు గ్రహింప నారంభింతును. నేనిక సంపూర్ణముగా కోపావేశపూరితుడనై, యొడలు మఱచునంత వఱకును ఆతడట్లు పరుషవాక్యము లాడుచునే యుండును. మొట్టమొదట ఆతడు నన్ను దూషించుటకు ప్రారంభింపగనే ''నాకు కోపమువచ్చుచున్నది'' అని యనుకొంటిని. అప్పుడు కోపము వేఱుగను నేను వేఱుగను ఉంటిమి. కాని నాకు కోపమువచ్చినంతనే కోపమే నేనైతిని. ఈ చిత్తవృత్తులు మొలకెత్తుటకు ముందుగనే, సూక్ష్మములై బీజావస్థయందుండగనే, వాని ప్రాబల్యమును మనము గుర్తించుటకు ముందుగనే వానిని మనము నిరోధింపవలయును. బోధరహితావస్థనుండి కామక్రోధాదులెట్టి సూక్ష్మస్థితులలో వెలువడుచుండునో అనేకు లెఱుగనే యెఱుగరు. సరస్సున నీటి యడుగుభాగమునుండి పైకొక బుడగ వచ్చుచున్నప్పుడుగాని, ఇంచుమించుగా నది పైభాగమునకు వచ్చినప్పుడుగాని మనము దానిని కనుగొనకుందుము. బుడగ విడిపోవుటచే అల యేర్పడినప్పుడు మాత్రమే మన మచ్చట బుడగకలదని గ్రహింతుము. బీజావస్థయందుండగానే కామక్రోధాదులను కనుగొనినయెడల మనము వానిని ప్రతిఘటింప గల్గుదుము. స్థూలములై వెలువడుటకు ముందుగనే మనము వానిని నిరోధింపనియెడల కామక్రోధాదుల నన్నడును నిర్జింపజాలము. సూక్ష్మావస్థయందే చిత్తవృత్తులను నిరో

ధించుటచే వానిని నిర్మూలింపగలము. దగ్ధబీజములవలె మరల నవి మొలకెత్త జాలవు.

10. తే ప్రతిప్రసవహేయాః సూక్ష్మాః.

సూక్ష్మములగు సంస్కారములను ప్రతిలోమపరిణామముచే నిరాకరింపవలయును.

సూక్ష్మ సంస్కారములు తదనంతరము స్థూలరూపములందు వ్యక్తములగును. సూక్ష్మసంస్కారములను నిరోధించుటెట్లు? మున్ముందు స్థూలములగు మనోవికారములను నిగ్రహింప నారంభించి క్రమముగా సూక్ష్మములకడకు పోవలయును. ఒకనికి కోపావేశము కలిగినదనుకొనుడు; అప్పుడు దానిని నిగ్రహించుటెట్లు? తద్వ్యతిరేక మనోభావమును కలుగజేసికొనుటయే అందుల కుపాయము. ప్రేమభావమును తీసికొనుడు. తన మగనిపై కోపించియున్న సమయమున బిడ్డ తనయొద్దకు వచ్చినంతనే తల్లి తనబిడ్డను ముద్దిడుకొనుచున్నది. అంతట పూర్వచిత్తవృత్తి యదృశ్యమై బిడ్డపై ప్రేమ యనెడు నూతనచిత్తవృత్తి కలుగుచున్నది. ప్రేమయే కోపమునకు వ్యతిరేకమనోభావము. కావున మనము నిరోధింపనెంచు చిత్తవృత్తులకు వ్యతిరేకచిత్తవృత్తులను గలుగజేసికొనుటచే వానిని, అనగా పూర్వచిత్తవృత్తులను, నిర్జింపగలమని తెలియనగును. సూక్ష్మములగు నీ వ్యతిరేకమనోభావములను సూక్ష్మమనస్థ్సితియందు గలుగ జేసికొనగలిగినయెడల అంతర్గతమును, సూక్ష్మమును నగు కోపవృత్తి నవి నిరోధింపగల్గును. సహజప్రవృత్తులు మొట్టమొదట బోధపూర్వకములై యుండి క్రమముగా సూక్ష్మస్థితిని బొందుచుండునని గ్రహించియున్నాము. కావున సదాసద్వృత్తులను కలుగజేసికొనుచుండుటచే అవి సూక్ష్మస్థితిని బొంది దుష్టసంస్కారములను నిరోధించును. ధ్యానమువలన ఇవి నాశనము కావు.

11. ధ్యానహేయాస్తద్వృత్తయః.

ధ్యానమువలన వృత్తులయొక్క వికారములను నిరాకరింపవలయును.

చిత్తవృత్తులను నిరోధించుటకు ధ్యానము గొప్ప సాధనము. మనస్సు ధ్యానమువలన వృత్తులను నిగ్రహించునట్లు చేయవచ్చును. ధ్యానము మీకొక యలవాటుగా పరిణమించునంతవఱకు, వలదన్నను ధ్యానస్థితి స్వయముగా కలుగునంత పర్యంతము నెలల కొలదియు, సంవత్సరములకొలదియు ధ్యానము నభ్యసించుచు వచ్చిన యెడల రాగద్వేషములు స్వాధీనములై నిగ్రహింపబడును.

12. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మవేదనీయః.

(అవిద్యాది) క్లేశములే కర్మములకు మూలకారణములు. దృష్టమగు నీజన్మమునగాని, అదృష్టమగు జన్మాంతరమునగాని కర్మానుభవము కలుగుచుండును.

కర్మాశయమనగా సంస్కారసముదాయమని భావము. మన మే పనిచేసినను, చిత్తము వృత్తి యను తరంగరూపమును దాల్చుచున్నది. కార్యము ముగిసినంతనే వృత్తి నశించునని తలచుచున్నాము. కాని నశించుటలేదు. సూక్ష్మరూపమునం దది యచ్చటనే యుండును. ఆకార్యమును స్మరించుటకు యత్నించినంతనే తిరిగి వృత్తిరూపమును పొందుచున్నది. లేనియెడల స్మృతి యనునది కలుగజాలదు. ఇట్లు ప్రతి కర్మమును, ప్రతి భావమును సూక్ష్మస్థితిని పొంది చిత్తమునం దణగియుండును. సుఖదుఃఖహేతువులగు సద్భావములును, దుర్భావములును కూడ క్లేశములనియే చెప్పబడును. ఏలయన కాలాంతరమున నవి క్లేశకరము లగుచున్నవి. ఇంద్రియజన్యమగు సుఖ మంతయు తుదకు దుఃఖహేతు వగును. భోగానుభవములు కామరాగములకు కారణములై దుఃఖదాయకము లగుచున్నవి. మానవుని కోర్కె లనంతములు. విధినిరామములులేక మానవుడు విషయభోగములను వాంఛించుచు తనవాంఛలు నెఱవేఱనియెడల దుఃఖించుచున్నాడు. కావున సద్వృత్తులైనను, దుర్వృత్తులైనను వృత్తులనన్నిటిని యోగులు క్లేశములుగనే పరిగణింతురు. క్లేశములు ఆత్మస్వాతంత్ర్యమునకు ప్రతిబంధకములు,

కర్మములకు మూలకారణములగు సంస్కారములును ఇట్టివే. కర్మఫలములు ప్రస్తుతజన్మమునందుగాని జన్మాంతరమునగాని కలుగుచుండును. అతితీవ్రమగు సంస్కారములు వెంటనే ఫలము నిచ్చును. ప్రబలమగు దుష్కార్యములుగాని సత్కార్యములుగాని ఈజన్మమునందే ఫలించును. సత్సంస్కారములవలన మహాశక్తిసంపన్నులగువారు మరణింపనక్కఱలేదనియు, ఈ జన్మమునందే తమ శరీరమును దేవతాశరీరముగ మార్చుకొనగలరనియు యోగులు వచింతురు. యోగశాస్త్ర గ్రంథములం దిట్టి నిదర్శనము లనేకములు కలవు. తమ శరీరపరమాణువులకు నూతనగతిని నిర్మించుకొని సంపూర్ణముగా నూతనశరీరము సేర్పఱచుకొనుటచే వారి కిక మరణమను నది సంభవింప నేరదు. ఏల సంభవింపవలయును? శారీర శాస్త్రము ననుసరించి సూర్యునియందుండి శక్తిని చేకూర్చుకొనుటయే ఆహారమని చెప్పవచ్చును. ఇట్టి శక్తి యొక మొక్కను చేరుచున్నది; దాని నొక పశువు తినుచున్నది. ఆ పశువును మనుష్యుడు తినుచున్నాడు. అనగా మనము సూర్యుని యందుండి కొంతశక్తిని గ్రహించి మన శరీరమున జేర్చుకొనుచున్నాము. శక్తిసముపార్జనమున కొకేమార్గముండవలయునను నియమము లేదు. ఇందులకు మొక్కను యనరించునట్టి విధానమును మన మనుసరించునట్టి విధానమును నొక్కటి కాదు. ఇట్లే భూమియనుసరించు నట్టి పద్ధతియు మన మనుసరించునట్టి పద్ధతియు వేర్వేఱై యున్నవి. ఐనను ఏదియో యొక విధమున చరాచర ప్రపంచమంతయు శక్తి నార్జించుచునే యున్నది. మన శ్శక్తివలన యోగులు తా మీ కార్యమును జేయగలమనియు, సాధారణపద్ధతుల నవలంబింపకయే వలసినంత శక్తి నాకర్షించుకొనగలమనియు జెప్పుచున్నారు. తనయందుండి వెలువడు పదార్థము నుండియే సాలెపురుగు గూటి నల్లుకొని దానిచే బద్ధమై, ఆ గూటి పోచల ననుసరింపనిదే మఱియొకమార్గమున నెచ్చటికి పోజాలకుండునట్లు మనయందుండియే మన మీ నాడీమండలమును నిర్మించుకొని, నాడులమూలముననే కాని మఱియొక విధమున వర్తింపజాల

కున్నాము. మనమిట్లు బద్ధులము కానక్కఱలేదని యోగులు చెప్పు చున్నారు.

ఇట్లే విద్యుచ్ఛక్తిని మనము ప్రపంచమునందే తావునకు గావలసిన, ఆ తావునకు బంపగలుగుచున్నను, దానిని తంతి మార్గముననే కాని పంపజాలకున్నాము. ప్రకృతియే తంతి సాహాయ్యమును లేకయే అపారమగు విద్యుచ్ఛక్తిని బంపగలుగుచున్నది. మనము నిట్లేల చేయజాలము? మానసికవిద్యుచ్ఛక్తి నిట్లు పంపవచ్చును. 'మనస్సు' అని చెప్పబడు శక్తియు విద్యుచ్ఛక్తి చాలవఱకొక్కటే. నాడీద్రవము ధ్రువాభిముఖమై యుండుటవలనను, విద్యుత్ప్రేరణముల కనుకూలముగా వర్తించుచుండుటవలనను, దీనియందు కొంత విద్యుచ్ఛక్తి యుండవలయునని స్పష్టమగుచున్నది. మనయొక్క విద్యుచ్ఛక్తిని మన మీనాడీమార్గమున మాత్రమే పంపగల్గుచున్నాము. నాడీసాహాయ్యము లేకయే మానసిక విద్యుచ్ఛక్తి నేల పంపరాదు! యోగులీ కార్యము మనకు సంపూర్ణముగా సాధ్యమనియు, అనుభవసిద్ధమనియు, చెప్పుచు నిట్లు చేయగల్గిన యెడల ప్రపంచమునందంతటను మన కిది సాధ్యమగునని పలుకుచున్నారు. నీ యిష్టానుసారముగా నెవ్వనితోనైనను, ఎచ్చటనైనను నాడీకోశముయొక్క సాహాయ్యము లేకయే వర్తింపగలవు. నాడీమార్గమునందాత్మ వర్తించునప్పుడు మనుష్యుడు జీవించియున్నాడనియు, నాడీవ్యాపారము నిలిచిపోయినంతనే యాతడు చనిపోయెననియు జెప్పుచుందుము. నాడీమార్గములున్నను, లేకున్నను వర్తింపగలిగినవానికి జననమరణము లనునవి అర్థరహితములు. భౌతిక శరీరములన్నియు తన్మాత్రలచే నిర్మింపబడియున్నవి. వివిధ శరీరములందలి భేదమంతయు తన్మాత్రల నిర్మాణక్రమము ననుసరించియే కలుగుచున్నది. శరీరమును నిర్మించుకొనువాడవు నీవే కావున నీ యిచ్చవచ్చినరీతిని శరీరము నేర్పఱచుకొనవచ్చును. శరీర నిర్మాణకర్త నీవుగాక మఱియెవ్వరు? ఆహారమును తినువా డెవ్వడు? నీకొఱకు

మఱియొకడు భుజించుచుండినయెడల నీ వెంతకాలము జీవింపగలవు? శరీరమున రక్తమును నిర్మించుకొనువా డెవ్వడు? నీవే కదా. రక్తమును శుభ్రపఱచుకొని నాడుల మూలమున దానిని పంపుచున్న దెవరు? నీవే. శరీరాధిపతులమై మనము శరీరమున నివసించుచున్నాము. ఐనను శరీరమును పునరుజ్జీవింపజేసికొను విధానమును మఱచితిమి. చైతన్యవిరహితులమై క్షీణించితిమి. శరీర పరమాణువుల నేర్పఱచుకొను విధానమును మఱచితిమి. అస్వతంత్రులమై యంత్రములవలె చేయుచున్న కార్యమునే మన మిప్పు డెఱుకతో చేయవలసియున్నది. శరీరాధిపతులమై యుండుటచే శరీరక్రమమును మనమే యేర్పఱచుకొనవలసియున్నది. ఈ కార్యమును నెఱవేర్చినంతనే మన యిష్టానుసారముగా శరీరమును పునరుజ్జీవింపజేసికొన గల్గుదుము. అంతట జననమరణములు, వ్యాధులును మనలను సమీపింపజాలవు.

13. సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః.

కర్మపరిపాకమువలన జాతి, ఆయువు, భోగము లేక సుఖదుఃఖానుభవము అనునవి కలుగుచున్నవి.

కారణములగు సంస్కారములు కర్మానుభవ మను కార్యరూపమున వ్యక్తమగుచున్నవి. కారణమంతరించి కార్యరూపమును దాల్చును. కార్యము రానురాను సూక్ష్మమై మఱియొక కార్యమునకు కారణమగుచుండును. విత్తనమునకు వృక్షమును విత్తనము మఱల వృక్షమునకును కారణమగుచున్నది. మనయొక్క ప్రస్తుత కర్మములన్నియు పూర్వ సంస్కారఫలితములై యున్నవి. మఱల నీ కర్మములు రానున్న కర్మములకు కారణములగుచుండును. సంస్కారములు కారణములై యుండుటచే వాని పరిపాకము వలన జీవకోటిలో నొకటి మనుష్యుడుగను, మఱియొకటి దేవతగను, ఇంకొకటి జంతువుగను, వేఱొకటి రాక్షసుడుగను వ్యక్తమగుచుండునని భావము. కర్మఫలము లొక్కవిధముగా నుండవు. ఒక

డేబదియేండ్లు బ్రదుకుచున్నాడు. మఱియొకడు నూఱేండ్లు జీవించు చున్నాడు. వేఱొకడు పుట్టిన రెండుసంవత్సరములకే పరమపదించు చున్నాడు. ఇట్టి భేదములు వారివారి పూర్వ కర్మానుగుణముగ కలుగుచున్నవి. ఒకడు సుఖించుటకే జన్మించెనా యనునట్లు ఆజన్మాంతము సుఖముల ననుభవించుచుండును. అట్టివానిని నట్ట డవియందు వాక చెట్టునకు కట్టివైచినను సుఖములు వెదకికొని వానిని జేరుచుండును. మఱియొక డెచ్చటికి పోయినను దుఃఖములు వానిని వెన్నాడుచునే యుండును. సర్వమును వానికి దుఃఖకరముగనే పరిణ మించును. ఇదియంతయు, వారివారి పూర్వకర్మముల ఫలము. సత్కర్మము లెప్పుడును సుఖహేతువులనియు, దుష్కర్మములు సదా దుఃఖదాయకము లనియు యోగులు భావింతురు. దుష్కర్మముల నొనర్చినవాడు దుఃఖరూపమున వాని ఫల మనుభవింపక తప్పదు.

14. తే హ్లాదపరితాపఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్.

పుణ్యపాపకర్మములవలన సుఖదుఃఖ ఫలములు గలుగుచున్నవి.

15. పరిణామతాపసంస్కారదుఃఖై ర్గుణవృత్తివిరోధాచ్చ దుఃఖమేవ సర్వం వివేకినః.

పర్యవసానమున దుఃఖహేతువు లగుటచేగాని, సుఖము పోవు ననెడి చింతారూపముగాగాని, సుఖానుభవజన్యములగు సంస్కార ములవలన తిరిగి ఫలమనుభవింపవలయుననెడి వాంఛచేగాని, సత్త్వాది గుణములయొక్క ప్రతిక్రియావృత్తి రూపముగాగాని, వివేకి యగు వానికి సర్వమును దుఃఖకరమే యగుచున్నది.

సర్వ విషయములందును వివేకియైనవానికి దుఃఖమే గోచరించు చున్నది. సుఖదుఃఖములు సర్వజనులకును గలుగుచున్నవి. సుఖమే దుఃఖముగను, దుఃఖమే సుఖముగను పరిణమించుచున్నది. తమ కోరిక లెన్నటికిని తీరుట యనునది లేక జను లెండమావులందు నీరు త్రాగ దలచుచుందురు. యోగుల యభిప్రాయ మిదియే. ప్రతి నిమిషమును ఘనచుట్టును జనులు చని పోవుచుండుట చూచు

చుండియు మనముమాత్ర మెన్నడును మరణింపమని తలచు చుండుటయే జీవితమునందలి మహాద్భుత విషయమని యుధిష్ఠిరు డొకప్పుడు చెప్పియుండెను. నలువైపులను మూర్ఖులచే నావరింపబడి యుంటిమనియు మనము మాత్రమే పండితులమనియు తలచు చుందుము. ప్రేమానురాగముల చంచలస్వభావము మన చుట్టును మూర్తీభవించియున్నను, మన ప్రేమానురాగములు మాత్రము సుస్థిరమైనవని భావించుచుందుము. ఇది యసంభవము. ప్రేమానురాగములును స్వార్థభూయిష్ఠములే. సతీపతుల యనురాగమును, బిడ్డలయందలి వాత్సల్యమును, స్నేహితుల పరస్పర ప్రేమయు సర్వమును తుదకు నశించునట్టివే యని యోగులు చాటుచున్నారు. ఈ జీవితమున నశింపనిదేదియు లేదు. సర్వమును నిష్ప్రయోజనమై ప్రేమసహితము నిరర్థకమైనపుడు మాత్రమే ఈ ప్రపంచమెంతటి మిథ్యయో, ఎట్టి స్వప్నతుల్యమో మానవుని కొక్క త్రుటికాలమున బోధపడును. అంతట వైరాగ్య కిరణములు తనపై ప్రసరించి నంతనే ప్రపంచాతీతమైన సచ్చిదానంద స్వరూపము నాతడు క్షణకాలము సందర్శించును. ఈ లోకమును విసర్జించుటవలన మాత్రమే లోకాంతరము ప్రాప్తించును; దీని నంటిపట్టుకొనియుండుటవలన పరమార్థ మెన్నటికిని ప్రాప్తము కానేరదు. ఇంద్రియ సుఖములను విడువనిదే, విషయభోగములను విసర్జింపనిదే, ఉన్నతిని బొందిన పురుషు డింతవఱకును జన్మించినది లేదు. పరస్పర సంఘర్షముచే ప్రకృతియందలి వివిధశక్తులు ప్రపంచమున శాశ్వతానందమనునది స్వప్నతుల్య మగునట్లు చేయుచున్నవి. ఇదియే మన దుస్స్థితికి కారణము.

## 16. హేయం దుఃఖమనాగతమ్.

ఇంతవరకును గలిగియుండని (అనాగత) దుఃఖమును విడువ వలయును.

కొంత కర్మానుభవము మనకిదివఱకే పూర్తియైనది. ప్రస్తుతము కొంతకర్మము ననుభవించుచున్నాము. ఇక ముందు ఫలించుటకై

మఱికొంత శేషించియున్నది. ఇందు మొదటిదగు సంచితకర్మము గతించినది; రెండవదగు ప్రారబ్ధమును మన మనుభవించుచున్నాము. ఇక ఫలింపబోవునట్టి ఆగామికర్మమును మాత్రమే మనము నిరోధించి నిర్జింపగలము. సంస్కారములను తద్వ్యతిరేక మనోభావములచే నిరోధింపవలయునని చెప్పునప్పుడు పతంజలి యభిప్రాయ మిదియే (2-10).

17. ద్రష్టృదృశ్యయోః సంయోగో హేయహేతుః.

దృగ్దృశ్యములయొక్క సంయోగమే విడువవలసిన దుఃఖమునకు హేతువు.

చూచువా డెవడు? పురుషుడు. చూడబడున దేది? మనస్సు మొదలుకొని స్థూలభూతము వరకును గల ప్రకృతి. ఇవియే దృగ్దృశ్యములు. మనస్సునకు పురుషునితో సంయోగము గల్గుటచే సమస్త దుఃఖములును ఉత్పత్తియగుచున్నవి. సాంఖ్యతత్త్వము ననుసరించి పురుషుడు స్వయముగా శుద్ధుడని మనము గుర్తింపవలయును. ప్రకృతి పురుషసంయోగముచే సుఖదుఃఖములు తనపై ప్రతిబింబించునప్పుడు వానిని పురుషుడు తా ననుభవించునట్లు భావించుచున్నాడు.

18. ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్.

ప్రకాశము, క్రియ, స్థితి యనునవి స్వభావముగా కల్గినదియు, (పృథివ్యాది) భూతములతోడను ఇంద్రియములతోడను గూడినదియు, పురుషునియొక్క భోగమును మోక్షమును ప్రయోజనముగా గల్గినదియు దృశ్యమనబడును.

పృథివ్యాదిభూతములును ఇంద్రియములునుగూడ దృశ్యమగు ప్రకృతి యనబడుచున్నది. ప్రకృతియంతయు స్థూలసూక్ష్మ భూతములతోడను, మనస్సు మొదలైన ఇంద్రియములతోడను గూడినదై త్రిగుణాత్మకమైయున్నది. సత్త్వమువలన ప్రకాశమును, రజస్సు

వలన ప్రవృత్తియు, తమస్సువలన స్థితియు గలుగుచున్నవి. పురుషున కనుభవమును గూర్చుటయే ఇట్టి ప్రకృతియొక్క ప్రయోజనము. పురుషుడు తన దివ్యత్వమును మఱచియున్నాడు. దేవతాధిపతియగు నింద్రు డొకప్పుడు సూకరజన్మము నెత్తి బురదగుంటలో పొర్లాడు చుండెనని యొక కథకలదు. ఇట్టి సమయమున ఆతడొక యాడు పందిని గూడి కావలసినన్ని పిల్లలను గని హాయిగా కాలము గడపు చుండెను. ఆతని దురవస్థను జూచి ఖిన్నులై కొందఱు దేవత లాతని సమీపించి, "అయ్యా, నీవు దేవేంద్రుడవు! దేవతలందఱును నీ యాజ్ఞానువర్తనులై యుండగా నీవీ బురదలో పొర్లాడుచుంటివేల?" అని హెచ్చరించిరి. ఆ పలుకుల కింద్రుడు, "కానిండు, మీరు చింతింపవలసినది లేదు. ఈ యాడుపందియును, ఈ పిల్లలును నాయొద్ద నున్నంతవఱకు నా కేస్వర్గమును వలదు" అని బదులు చెప్పెను. పాప మా దేవతల కేమియుదోపక కడకు పందులనన్నిటిని ఒకదానివెనుక నొకటిగా కడతేర్చుటకు నిశ్చయించుకొనిరి. ఇట్లు మారణకర్మము ముగిసినంత నే దేవేంద్రుడు దీనుడై విలపింపసాగెను. అంతట దేవతలు ఇంద్రు నావరించియున్న సూకరశరీరమును విదలించిరి. తోడనే యింద్రుడందుండి వెలువడి దేవతాధిపతియగు తా నొక సూకరమగుటయు సూకరజన్మమే జన్మమని తలచుటయు, భావించి తనకు గలిగిన విపరీతస్వప్నమును గాంచి వింతపడసాగెను. పురుషుడు ప్రకృతితో తాదాత్మ్యమును బొందుటచే తాను శుద్ధుడననియు, అనంతుడననియు గ్రహింపకున్నాడు. స్వతస్సిద్ధముగా పురుషు డానందస్వరూపుడు; అస్తిత్వమునకు పట్టుగొమ్మ. సచ్చిదానందములు పురుషుని స్వరూపలక్షణములుకాని గుణములు కావు. పరమాత్మ యును, పరమపురుషుడును, పరంజ్యోతియునై వెలుగొందు పురుషుని స్వరూపమే కాని యవి గుణములు కానేరవు. ఆతని సమీపించి "నీవు సూకరమవుకావు" అని చెప్పినంతనే ఘుర్ఘురించి కఱవబోవు నంతటి పతనము పొందినట్లు కాన్పించుచున్నాడు.

ఈ మాయలో, ఈ స్వప్నప్రపంచములో భ్రమించుచున్న మనయొక్క స్థితియు నిట్టిదే. దురంత సంతాపములచే దుఃఖమయ మగు నీ ప్రపంచమునందు కొన్ని బంగారుబంతులు దొరలింపబడు చుండ లోకము వానికై ప్రాకులాడి పట్టుకొనబోవుచున్నది. ప్రకృతి శాసనముల కెన్నఁడును నీవు బద్ధుడవు కావు. ప్రకృతి నీ కెన్నఁడును బంధమును గల్పింపజాలదు. యోగులు నీకుచేయు నుపదేశ మిదియే. దానిని గ్రహించుటకై సావధానుడవగుము. ప్రకృతితో సంయోగ మును బొందుటచే, మనస్సుతోడను సంసారముతోడను తాదాత్మ్య మును బొందుటచే పురుషుడు తాను దీనుడననియు, పరమనికృష్టుడ ననియు భావించుచున్నాడు. స్వానుభవమే సంసారతరణోపాయమని యోగులు చాటుచున్నారు. త్వరితముగా మన మీ యనుభవమును పొందవలయును. మనయంతట మనమే యీ వలలో చిక్కుకొంటిమి. ఇక దీనిని తప్పించుకొని మన మీవల పడవలయును. కావున సతీ పతుల స్వల్పానురాగమును, స్నేహితుల సంకుచిత ప్రేమమును పొందుచు ప్రపంచానుభవమును సంపాదింపుము; స్వస్వరూపమును మఱువనియెడల సమస్త బంధములును తొలగును. ఐహికజీవితము క్షణభంగురమనియు, సంసారమునుండి తరింపవలయుననియు గుర్తిం పుము. స్వానుభవమే, సుఖదుఃఖానుభవమే మనకు పరమగురువు. ఐహికజీవితము తాత్కాలికానుభవము మాత్రమే యని గ్రహింపుము. ఎవ్వనిముం దీ చరాచర ప్రపంచమంతయు సముద్రమున నీటిబొట్టు వలె అత్యల్పమై కానబడకుండునో అట్టి పరమపురుషుని బొందుటయే సమస్తమగు ననుభవములవలనను మనకుగలుగు పరమప్రయో జనము; ఎన్నియనుభవములను పొందినను, పొందవలసియున్నను పరమావధిని మాత్రము మఱువకుందుము గాక.

19. విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి.

గుణములయొక్క స్థితులు నిర్దేశింపబడినవియు, నిర్దేశింప బడనివియు, కేవలము సూచింపబడినవియు, సూచింపబడనివియు నని నాల్గు విధములుగా నున్నవి.

యోగదర్శనము పూర్తిగా సాంఖ్యదర్శనముపై నాధారపడి యున్నదని చెప్పియుంటిమి కదా. ఇచ్చట మఱల సాంఖ్యులసృష్టి క్రమములను జ్ఞప్తికి దెచ్చుకొందము. సాంఖ్యుల ననుసరించి నిమిత్త కారణమును, ఉపాదానకారణమును ప్రకృతియే యైయున్నది. ప్రకృతియందు సత్త్వరజస్తమస్సు లను మూఁడు తత్త్వములుకలవు. అంధకారమును, అజ్ఞానమును, భారమును తామసిక లక్షణములు. ప్రవృత్తి రాజసికలక్షణము. ప్రకాశమును ప్రశాంతియు సాత్త్విక లక్షణములు. సృష్టికి పూర్వము ప్రకృతి అవ్యక్తావస్థయం దనగా నామరూపభేదరహితమై యుండునప్పుడు సత్త్వరజస్తమస్సులు సంపూర్ణముగా సామ్యావస్థలో నుండునని సాంఖ్యులు చెప్పెదరు. అంతట సామ్యావస్థ చెడి సత్త్వరజస్తమస్సులు ఒండొంటితో నానావిధములుగా సంయోగము బొందుటచే ప్రపంచ ముత్పత్తి యగుచున్నది. ప్రతి మనుష్యునియందును ఈ మూఁడుతత్త్వములును గలవు. సత్త్వప్రాబల్యమువలన జ్ఞానమును, రజఃప్రాబల్యమువలన ప్రవృత్తియు, తమఃప్రాబల్యమువలన అంధకారమును, మాంద్యమును, అలసతయు, అజ్ఞానమును గలుగుచున్నవి. సాంఖ్యసిద్ధాంతము ననుసరించి సత్త్వరజస్తమస్సులతో గూడిన ప్రకృతియే ఉన్నతమగు నవ్యక్తావస్థయందు 'మహాత్' అనబడుచున్నది. ఈ మహాత్ లేక సమష్టి బుద్ధితత్త్వమునందొక యంశము మనయందలి బుద్ధితత్త్వమగు చున్నది. సాంఖ్యుల మనశ్శాస్త్రము ననుసరించి మనస్సునకును బుద్ధికిని సూక్ష్మమగు భేదము కలదు. శబ్దాది విషయములను గ్రహించి మనస్సు వానిని బుద్ధికి నివేదించును. వ్యక్తిగతమైన మహాత్ అగు బుద్ధి యంతట వానిని 'ఇదమిత్థ' మని నిశ్చయించును. మహాత్‌నుండి అహంకారమును, అందుండి సూక్ష్మతన్మాత్రలును ఉత్పత్తి యగుచున్నవి. ఈ సూక్ష్మతన్మాత్ర లొండొంటితో సంయోగమై పృథివ్యాది స్థూలభూతము లగుచున్నవి. బుద్ధితత్త్వము మొదలుకొని పాషాణమువఱకునుగల సమస్తసృష్టిజాతమును ఒకే

తత్త్వమునుండి యుత్పత్తియగుచున్నవని సాంఖ్యులు చెప్పుచున్నారు. స్థూలసూక్ష్మస్థితులందు మాత్రమే ఆ తత్త్వములకుగల భేదము. సూక్ష్మావస్థ కారణము; స్థూలావస్థ కార్యము. సాంఖ్యుల ననుసరించి పురుషుడు ప్రకృతి కతీతుడై, ప్రకృతితత్త్వముకంటె భిన్నుడై, బుద్ధికంటెను, మనస్సుకంటెను, తన్మాత్రలకంటెను, స్థూలభూతములకంటెను వేఱైయున్నాడు. వీనిలో నేదియు పురుషునివంటిది కాదు. పురుషుడు సంపూర్ణముగా భిన్నుడు; భిన్నస్వభావుడు. పురుషుడు కేవలుడై యుండుటచే శాశ్వతుడని సాంఖ్యులయొక్క సిద్ధాంతము. సంయోగ సంజనితముకానివస్తువులకెట్టి వికారమును గలుగజాలదు. ఇట్టి పురుషులు లేక ఆత్మలు అనంతముగా నున్నవి.

ఇప్పుడు మనము 'గుణములయొక్క స్థితులు నిర్దేశింపబడినవిగను, నిర్దేశింపబడనివిగను, కేవలము సూచింపబడినవిగను, సంజ్ఞారహితముగను ఉన్న' వనెడి సూత్రార్థమును గ్రహింప ప్రయత్నింతము. నిర్దేశింపబడినవనగా ప్రత్యక్షమగు స్థూలభూతములని భావము. నిర్దేశింపబడనివనగా ఇంద్రియములకు గోచరింపని తన్మాత్రలని భావము. ఐనను యోగాభ్యాసముచే కొంతకాలమునకు మన యింద్రియములు తన్మాత్రలను ప్రత్యక్షముగా జూచునంతటి సూక్ష్మస్థితిని బొందునని పతంజలి వచించును. ప్రతి మనుష్యుడును తన చుట్టును ఒకవిధమగు కాంతిని గలిగియుండునని మీరు వినియుందురు. ప్రతి జీవజంతువును ఇట్టి కాంతిని ప్రసరింపజేయుచున్నది. ఈ కాంతిని యోగులు చూడగలరని పతంజలి పలుకును. మన మీ ప్రకాశమును జూడకున్నను గంధపరమాణువులను పుష్పములు సదా తమయందుండి విడుచుచున్నవిధమున మన మీ తన్మాత్రలను మనయందుండి వెలువడజేయుచు నిరంతరమును మంచిచెడుగులను బయటికి ద్రోయుచున్నాము. మనమెచ్చటికి బోయినను మన చుట్టునున్న వాతావరణము సూక్ష్మమగు నీ యణువులతో నిండియుండును. దేవాలయములను, ప్రార్థనాలయములను నిర్మింపవలయు ననెడి భావ మజ్ఞాతముగా

నిట్లు మనకు గలుగుచున్నది. భగవంతు నారాధించుటకై మనుష్యు డాలయముల నేల నిర్మింపవలయును? మఱి యెచ్చటనైనను భగవంతు నెందుచే పూజింపరాదు? జను లీకారణమును గ్రహింపకున్నను, భజనస్థలములు పవిత్రమగు పరమాణువులతో నిండియుండునని గ్రహించియుండుటచే దినదినమును జనులచ్చటికి బోవుచుందురు; ఇట్లు పోవుచున్న కొలదియు తాము పవిత్రులగుచు ఆ తావులను పవిత్రము చేయుచుందురు. విశేష సత్త్వసంపన్నులు కాని జను లా తావులకు బోయినంతనే అవి వారిపై తమ ప్రభావమును జూపి వారియందలి సత్త్వగుణము నుద్దీపింపజేయును. ఇందుకొఱకే దేవాలయములును పుణ్యస్థలములును ఆవశ్యకములై యున్నవి. ఐనను వానియొక్క పవిత్రత అచ్చట జేరువారి పవిత్రతపై నాధారపడియుండునని మనము గుర్తింపవలయును. మూలమునందున్న భావమును మఱచి మనము గురువును శిష్యునియొద్దకు దీసికొని వచ్చుచుందుము. ఇదియొక గొప్పచిక్కు. పుణ్యస్థలములు మనవలననే పుణ్యస్థలము లగుచున్నవి. తిరిగి కార్యము కారణమై పుణ్యస్థలములు మనలను పునీతులనుగా జేయుచున్నవి. సదా పాపాత్ములే అచ్చటికి బోవుచుండినయెడల ఆ స్థలములు పాపభూయిష్ఠములగును. ఆలయ మనునది మనవలనగాని మందిరమువలన నేర్పడుటలేదు. మన మీ విషయమును తఱచు మఱచుచుందుము. సమధిక సత్త్వసంపన్నులగు మహర్షులును, మహాపురుషులును అద్భుతమగు ప్రభావమును అహోరాత్రములు తమ పరిసరములపై జూపగల్గుచున్నారు. పవిత్రత మనయందు మూర్తీభవించునంతటి పవిత్రులము కాగలము. అంతట మన సంసర్గమువలన నెంతటి పాపియైనను పావనుడగును.

తరువాత 'కేవలము నిర్దేశింపబడినది' అనగా బుద్ధి యని భావము. బుద్ధితత్త్వమే ప్రకృతినుండి మొట్టమొదట వెలువడుచున్నది. దానియందుండి ఇతరతత్త్వములన్నియు వ్యక్తమగు

చున్నవి. కడపటిది 'సంజ్ఞారహితమైనట్టిది'. నవీనభౌతికశాస్త్రజ్ఞులకును తత్త్వశాస్త్రవేత్తలకును ఈ విషయమై భేదాభిప్రాయము కలదు. ప్రతి మతమును చిత్స్వరూపమునుండి ప్రపంచ ముత్పత్తి యగునని భావించును. సాకారనిరాకార దైవభావన లటుండ, మానసిక శాస్త్రానుసారముగ సృష్టిక్రమమునందు బుద్ధితత్త్వమే మొట్టమొదటిదనియు, దృశ్యప్రపంచమందుండి నిర్మాణ మగుచున్నదనియు ఈశ్వరసిద్ధాంతాభిప్రాయము. ఆధునిక తత్త్వజ్ఞులు బుద్ధితత్త్వము సృష్టిక్రమమునందు కడపటిదని చెప్పెదరు. జ్ఞానసంతములగు జీవులు జంతువులుగా పరిణమించుచున్నవనియు, జంతుస్థితినుండి క్రమముగా మనుష్యులగుచున్నవనియు, వారు చెప్పుచున్నారు. సమస్తమును బుద్ధితత్త్వమునుండి కలుగుటకు మాఱు బుద్ధితత్త్వమే కడపటిదని వారి సిద్ధాంతము. ఆధ్యాత్మిక సిద్ధాంతమును, ఆధునిక ప్రకృతిశాస్త్ర సిద్ధాంతమును పరస్పర విరుద్ధములుగా నున్నట్లు కాన్పించుచున్నను రెండును యథార్థములే. 'రా-మ రా-మ రా-మ' అనునట్టి వరుసను దీసికొనుడు. వీనిలో 'రా' అనునదియా, 'మ' అనునదియా, ఏదిముందు? 'రా-మ' అను వరుసను దీసికొనినప్పుడు 'రా' ముందనియు, 'మ-రా' యను వరుసను దీసికొనినప్పుడు 'మ' ముందనియు, మీరు చెప్పెదరు. మన మే దృష్టితో జూతుమో క్రమము దానిపై నాధారపడియుండును. బుద్ధితత్త్వము వికారమును బొంది స్థూలభూతములగుచున్నది; ఇది తిరిగి బుద్ధితత్త్వములో లయించుచున్నది. సాంఖ్యులును, ఇతర మతస్థులును బుద్ధితత్త్వమును ముందుంచుచున్నారు; అంతట ముందు బుద్ధియు తరువాత స్థూలభూతములును అనునట్టి క్రమ మేర్పడుచున్నది. ప్రకృతిశాస్త్రజ్ఞు డీ హారమునందు 'స్థూలభూతము' లను కడియముపై వ్రేలు మోపి స్థూలభూతముల వెనుక బుద్ధితత్త్వ మేర్పడియున్నదనుచున్నను, ఇరువురును ఒకే విషయమును ప్రతిపాదించుచున్నారు. ఇక వేదాంత శాస్త్రము బుద్ధిని, స్థూలభూతములనుగూడ దాటి బుద్ధ్యాతీతుడైన

ఆత్మను గనుగొనుచున్నది. బుద్ధితత్త్వము స్వప్రకాశవంతము కాదు; ఆత్మవలన బుద్ధి ప్రకాశవంతమగుచున్నది.

20. ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః.

సాక్షియగు పురుషుడు చైతన్యమాత్రుడై, శుద్ధుడై యున్నను, బుద్ధియందు భాసించుచున్న వృత్తుల ననుసరించి చూచుచున్నాడు.

ఇది మఱల సాంఖ్యతత్త్వము. పృథివ్యాదిస్థూలభూతములు మొదలుకొని బుద్ధితత్త్వము వఱకును సమస్తమును ప్రకృతియేయని సాంఖ్యతత్త్వము ననుసరించి మనము గ్రహించియున్నాము. నిర్గుణుడగు పురుషుడు (ఆత్మ) ప్రకృతి కతీతుడై యున్నాడు. అట్టియెడ పురుషు డెట్లు సుఖదుఃఖముల ననుభవించుచున్నట్లు కనబడుచున్నాడు? అను ప్రశ్న వెలువడును. స్వచ్ఛమగు స్ఫటికము నెదుట నెఱ్ఱని పుష్పము నుంచినయెడల స్ఫటిక మెఱ్ఱగానున్నట్లు కాన్పించును. ఇట్లే పురుషుని సుఖదుఃఖములు కేవల ప్రతిబింబములు. స్వయముగా పురుషుడు నిర్వికారుడు. ప్రకృతిపురుషులు సదా భిన్నతత్త్వములు. బుద్ధి సంయోగసంజనితమనియు, వృద్ధిక్షయములతో గూడినదనియు, వికారవంతమైయుండుటచే చాలవఱకు శరీరమువంటిదే యనియు సాంఖ్యులు వచింతురు. శరీరమునకు గోళ్ళెట్లో బుద్ధికి శరీరమట్టిది. శరీరమందలి భాగమగు గోటిని నూఱుసార్లు ఖండించినను శరీరమునకు హానికలుగదు. ఇట్లే యీ శరీరమును ఖండించినను, విసర్జించినను, బుద్ధితత్త్వము నశింపక కల్పాంతస్థాయియైయుండును. ఐనను వృద్ధిక్షయములను బొందుచు వికారవంతమై యుండుటచే బుద్ధితత్త్వము శాశ్వతము కానేరదు. వికారము పొందునవన్నియు అశాశ్వతములే. బుద్ధి కల్పితమైయుండుటచే బుద్ధ్యాతీతమగు వస్తువు మఱియొకటి యుండవలయు నని మనకు వెల్లడియగుచున్నది. బుద్ధి స్వతంత్రము కానేరదు. ప్రకృతిసంబంధమగునవి ప్రకృతియం దుండుటచే నెప్పుడును బద్ధమై

యుండును. ఇక స్వతంత్రు డెవఁడు? స్వతంత్రుఁడగువాఁడు సదా కార్యకారణాతీతుఁడై యుండవలయును. మోక్షమనునది భ్రాంతి యనిన యెడల బంధమనునదియు భ్రాంతియేయని చెప్పవలసివచ్చును. బంధమోక్షములు రెండును బోధావస్థలోనివే. వీనిలో నొకదాని నంగీకరించినయెడల రెండవదానిని గూడ మన మంగీకరింపవలయును. ఇవియే బంధమోక్షములను గూర్చిన మన భావములు. మన మొక గోడను దాఁటుకొని పోవలయునని యత్నించి దానిని తాకుటచే తల బొప్పికట్టినంతనే మన మా గోడచే పరిమితులమని గ్రహింతుము. ఇది యటుండ మనకు స్వతంత్రమైన ఇచ్ఛాశక్తి కలదనియు, సర్వ విషయములందును మన సంకల్పము ననుసరించి వర్తింపగల మనియు గాన్పించుచున్నను అడుగడుగునను మనకు పరస్పరవ్యతిరేకాభి ప్రాయములు కలుగుచున్నవి. ఒకప్రక్క మనము స్వతంత్రులమని విశ్వసింపవలసియున్నది. మఱియొక ప్రక్క మన పరాధీనత ప్రతిక్షణ మును మనకు గోచరించుచునేయున్నది. ఇట్టి భిన్నభావములకు మన మెఱుకయే మూలాధారమైయుండుటచే వీనిలోనొకటి భ్రమమైన యెడల రెండవదియు భ్రమ కావలయును. ఒకటి యథార్థమైన యెడల రెండవదియు యథార్థమైయుండవలయును. బుద్ధితత్త్వమునకు సంబంధించినంతవఱకు మనము బద్ధులమనియు, ఆత్మకు సంబంధించి నంతవరకు ముక్తులమనియు నిట్టి భావములు రెండును యథార్థము లేయని యోగులు వచింతురు. కార్యకారణముల కతీతుఁడగు నాత్మ లేక పురుషుఁడు సహజముగనే ముక్తుఁడై యున్నాఁడు. బుద్ధ్యాదిరూప ములను దాల్చిన ప్రకృతియను నావరణమునుండి పురుషుని స్వాతం త్ర్యకాంతి మనకు స్వల్పముగా గోచరించుచున్నది. చరాచర ప్రపంచమునందంతటను వెల్గొందుచున్నది ఆత్మజ్యోతియే. బుద్ధి తత్త్వము స్వయంప్రకాశవంతము కాదు. ప్రతి ఇంద్రియమునకును మెదడునందు ప్రత్యేకమగు కేంద్రముగలదు. అట్లైన ఇంద్రియాను భవములకు సామరస్య మెట్లు కలుగుచున్నది? ఐక్యత వాని

కెక్కడ నేర్పడుచున్నది? మొదటియందైన పక్షమున(కన్ను, ముక్కు, మొదలైన) ఇంద్రియముల కన్నిటికిని ఒకే కేంద్ర మునుండియుండవలయును. ఐనను మనుష్యు డేకకాలమున వినుచు చూడగల్గుచున్నాడు. కావున బుద్ధితత్త్వమున కాధారభూతమగు నేకత్వ మెక్కడనో యేర్పడియుండవలయును. బుద్ధి మొదటికి సంబంధించియున్నది. కాని యెందు వివిధములైన ఇంద్రియానుభవములును, సుఖదుఃఖ సంవేదనలును ఒండొంటితో సంయోగమై యేకత్వముపొందుచున్నవో అట్టి పురుషుడు బుద్ధ్యాతీతుడై యున్నాడు. ఇంద్రియానుభవము లన్నిటికిని పురుషుడే కేంద్రస్థానము. అనుక్షణమును నీవు స్వతంత్రుడవని నీకు జెప్పునట్టి దీ పురుష స్వాతంత్ర్యమే. ఈ స్వాతంత్ర్యము బుద్ధిలక్షణమని భావించినచో వెంటనే బుద్ధి పరాధీనమై యున్నట్లు గోచరించును. ఇక నిది శరీర లక్షణమని తలచుటయు భ్రాంతియే యని ప్రకృతి మనకు ప్రక టించును. ఏది స్వతంత్రమో, ఏది అస్వతంత్రమో యోగి రెంటిని విభజించి తెలిసికొనును. పురుషుడు స్వతంత్రుడనియు, చైతన్య స్వరూపుడనియు, ఈ చైతన్యమే బుద్ధితత్త్వమునుండి భాసించు నప్పుడు జ్ఞానరూపమునుదాల్చి దేశకాల నిమిత్తములవలన బద్ధ మగుచున్నదనియు యోగులు గ్రహింతురు.

21. తదర్థ ఏవ దృశ్యస్యాఽఽత్మా.

దృశ్యము లేక ప్రకృతియొక్క స్వభావము పురుషుని కొఱ కేర్పడియున్నది.

ప్రకృతికి స్వతస్సిద్ధమైన ప్రకాశములేదు. పురుషు డెంత కాలము ప్రకృతితో సంసర్గము కలిగియుండునో అంతవఱకే ప్రకృతి ప్రకాశవంతమై యున్నట్లు కాన్పించును; కాని యీ ప్రకాశము చంద్రకాంతివలె ప్రతిబింబితముకాని స్వతంత్రముకాదు. ప్రకృతి దాల్చునట్టి రూపములన్నియు తనవలననే కలుగుచున్నను పురుషుని మోక్షముకొంకె ప్రకృతికి స్వప్రయోజన మనునది మఱియొకటి లేదని యోగులు వచింతురు.

22. కృతార్థం ప్రతి నష్టమప్యనష్టం తదన్యసాధారణత్వాత్.

కృతార్థుడైనవానికి నివర్తించినను ఇతరులకు సాధారణమై యుండుటచే ప్రకృతి నశింపదు.

తాను పూర్తిగా ప్రకృతినుండి భిన్నుడనని పురుషుని గ్రహింపజేయుటయే ప్రకృతియొక్క ప్రయోజనము. పురుషు డీ జ్ఞానమును బొందినంతనే ప్రకృతిచే నిక మోహితుడు కాడు. కాని ముక్తునకు మాత్రమే ప్రకృతి నివర్తించును. ఇక బద్ధజీవులసంఖ్యాకులై యుండుటచే వారియందు ప్రకృతి వర్తించుచుండును.

23. స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుః సంయోగః.

ప్రకృతియు, ప్రకృతికి ప్రభువైన పురుషుడును అను నీశక్తులు రెండిటియొక్కయు స్వరూపానుభవమునకు సంయోగమే కారణము.

ఈ సూత్రము ననుసరించి ప్రకృతి పురుషసంయోగముచే నీ రెండిటి శక్తులును వ్యక్తమగుననియు, నామరూపములందుండి వెలువడుననియు తెలియనగును అవిద్యయే యీ సంయోగమునకు కారణము. శరీరమే 'నే'నని తలచుచుండుటయే మన సుఖదుఃఖములకు కారణమని నిత్యమును మనకు గోచరించుచునేయున్నది. నే నీ శరీరమను కానను దృఢనిశ్చయము గల్గి యున్నయెడల సుఖదుఃఖములను నేను లక్షింపకుండవలయును. శరీరము సంయోగసంజనితము. నాకొక శరీరమును, నీకొక శరీరమును, సూర్యున కొక శరీరమును కలదనుట మిథ్యకాని మఱియొకటికాదు. జగత్తంతయు ఏకపదార్థరాశి. అందు నీ వొక కణము; నే నొక కణము; సూర్యుడు మఱియొక కణము. జగత్తు సదా మార్పు చెందుచున్నదని మనకు తెలియును. నే డే పదార్థము సూర్యుని నిర్మించుచున్నదో అదియే రేపు మన శరీరపదార్థముగా నేర్పడవచ్చును.

24. తస్య హేతురవిద్యా.

అవిద్యయే దానికి (ఆ సంయోగమునకు) కారణము.

అవిద్యవలననే మన మొక శరీరము నంటిపెట్టుకొని దురవస్థల పాలగుచున్నాము. శరీరమునందు మనకుగల యీ మమత కేవలము భ్రాంతికాని మఱియొకటికాదు. భ్రాంతియే మనకు సుఖదుఃఖము లను గలుగజేయుచున్నది. అవిద్యాసంజనితమగు నీ భ్రాంతియే మనలను శీతోష్ణసుఖదుఃఖములను బొందజేయుచున్నది. మన మీ భ్రాంతిని తొలగించుకొనవలయును. యోగు లిందులకు మనకు మార్గదర్శకులై యున్నారు. కొన్ని మానసిక పరిస్థితులయందు మనుష్యుని అగ్నిలో బడవైచినను, వాని కెట్టి బాధయు కలుగకుండు నని నిరూపింపబడినది. కాని యిట్టి మానసికోన్నతి సుడిగాలివలె హఠాత్తుగా నొక నిమిషమున గాన్పించి మఱుక్షణమున మాయ మగుచుండును. ఐనను యోగమువలన మన కిట్టి మనఃస్థితి లభించిన మెడల చిరస్థాయియై యుండును. అంతటితో శరీరాభిమానము తొలగును.

## 25. తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్.

అది (అవిద్య) నివర్తించుటచే (ప్రకృతిపురుష) సంయోగము నివర్తించును; అదియే సాక్షి (యగు పురుషుని) యొక్క కైవల్యము.

యోగతత్త్వము ననుసరించి పురుషుడు ప్రకృతితో సంయోగము పొందియుండుటకు అవిద్యయే హేతువు. ప్రకృతి కధీనులము కాకుండుటయే యోగమునకు ముఖ్యోద్దేశము. సర్వమతములకును ఇదియే పరమావధి. ప్రతిజీవియందును దివ్యత్వము గర్భితముగా నున్నది. బాహ్యాంతర ప్రకృతినంతయు నిరోధించి అంతర్గతమగు నీ దివ్యత్వమును వ్యక్తముచేయుటయే జీవితమునకు పరమావధి. ఇందులకై కర్మ, ఉపాసన, యోగ, జ్ఞాన మార్గములలో నొక్కటి గాని, కొన్నిటినిగాని, అన్నిటినిగాని యవలంబించి ముక్తులరగుడు. మతమునకంతకు నిదియే సారాంశము. వాదములు, సిద్ధాంతములు, కర్మకలాపములు, గ్రంథములు, దేవాలయములు, విధులు, ఇవన్నియు అప్రధానాంశములు. ఆత్మసంయమమార్గమున నీ పరమా

వధిని బొందుటకై యోగులు యత్నింతురు. ప్రకృతిబంధవిముక్తులము కానంతవఱకు మనము ప్రకృతిదాసులమై ప్రకృతిశాసనబద్ధులమై యందుము. ఎవ్వడు మనస్సును నిరోధించునో వాడే ప్రకృతిని నిరోధించునని యోగులు వక్కాణింతురు. బాహ్యప్రకృతికంటె ఆంతరప్రకృతి మహత్తరమై, నిగ్రహించుటకు కష్టసాధ్యమైయుండుటచే, ఆంతరప్రకృతిని జయించునట్టివాడు ప్రపంచమునంతయు జయించుచున్నాడు. అంతట ప్రపంచ మాతనికి సేవ యొనర్చును. ఇట్టి వశీకరణవిధానమును ప్రతిపాదించునది రాజయోగము. మనకు గోచరమగు ప్రకృతిశక్తులకంటె మహత్తరమగువానిని మనము నిరోధింపవలసియున్నది. శరీరము మనస్సుపైనున్న యొక కోశము వంటిది. ఐనను మనశ్శరీరములు భిన్నములు కావు. ముత్తెపుజేపకు చిప్పయెట్టిదో మనస్సునకు శరీరమటువంటిది. మనశ్శరీరములనునవి కేవలము స్థితిభేదములు. ముత్తెపు జేపలో నున్న జీవపదార్థము బాహ్యపదార్థమును గ్రహించి దానియందుండి చిప్పను నిర్మించుకొనుచున్నది. ఇట్లే అంతఃకరణము లేక మనస్సు అను నంతర్గతమైన సూక్ష్మశక్తులు బాహ్యమగు స్థూలప్రకృతిని గ్రహించి దానియందుండి శరీరమను నీగుల్లను నిర్మాణము చేయుచున్నవి. అందుచే ఆంతరప్రకృతిని నిరోధించినయెడల బాహ్యప్రకృతిని నిరోధించుట బహుసులభము. మఱియు బాహ్యాంతశ్శక్తులు భిన్నములుకావు. కొన్ని భౌతికశక్తులుగను, కొన్ని మానసిక శక్తులుగను లేవు. దృశ్యప్రపంచము సూక్ష్మప్రపంచముయొక్క స్థూలవ్యక్తీకరణమై యున్నచో భౌతికశక్తులు కేవలము సూక్ష్మశక్తులయొక్క స్థూలవ్యక్తీకరణములై యున్నవి.

26. వివేకఖ్యాతిరవిప్లవా హానోపాయః.

నిరంతరమైన వివేకాభ్యాసమే అవిద్యానాశనమున కుపాయము.

నిత్యానిత్యవస్తువివేకము, అనగా పురుషుడు జడమగు ప్రకృతి కాని, మనస్సుకాని కాకుండుటచే నెట్టి వికారమును బొందనేరడని

గ్రహించుటయే మన పరమావధి. ఉత్పత్తిప్రళయములను బొందుచు సదా మార్పు చెందుచుండునట్టిది ప్రకృతి కాని పురుషుడు కాదు. నిశ్చలదీక్షతో నిత్యానిత్యవస్తువివేచన చేయుట కారంభించినంతనే అజ్ఞానమంతరించును. అంతట సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, సర్వగతుడును నగు పురుషుడు స్వయంజ్యోతియై ప్రకాశించును.

27. తస్య సప్తధా ప్రాంతభూమిః ప్రజ్ఞా.

ఆతని ప్రజ్ఞ సప్తజ్ఞానసోపానము (అవస్థ) లతో గూడినదై మహోన్నతమై యొప్పును.

ఈ జ్ఞానము వెలువడునపుడు, ఒకదాని వెనుక నొకటిగా ఏడంతరములలో వెలువడునని చెప్పవచ్చును. మున్ముందు మనకు జ్ఞానోపలబ్ధి యగుచున్నదని గ్రహింతుము. అంతవఱకును గల యసంతుష్టి తొలగి, గ్రహింపవలసిన దానిని గ్రహించితిమను తృప్తి కలుగుటయే ఇందలి ప్రథమావస్థ. గ్రహింపవలయునను నాతురత యున్నంతవఱకు జ్ఞానాన్వేషణము చేయుచు ప్రయత్నము విఫలమైనపు డసంతృప్తిచే నూతనమార్గము నవలంబించుచుందుము. జ్ఞానమంతయు మనయందే కలదనియు ఒరులు మనల నుద్ధరింపజాలరనియు గ్రహింపనిచో నెంతకాల మన్వేషించినను నిష్ప్రయోజనమే. నిత్యానిత్యవస్తువివేకము కలుగుట కారంభించినంతనే పూర్వపు టసంతృప్తి తొలగును. జ్ఞానోదయము కానున్నదనుట కిదియే ప్రథమలక్షణము. అంతట తత్త్వజ్ఞులమైతిమను దృఢనిశ్చయము కలుగును. జ్ఞానోదయమగుచున్నదని గ్రహించినంతనే ధైర్యోత్సాహములతో పరమావధిని ప్రాపించువఱకును కార్యదీక్షను బూనవలయును. సమస్త దుఃఖనివారణమిందు జెప్పబడిన రెండవయవస్థకు లక్షణము. బాహ్యాంతర ప్రపంచములందేదియు మనల నిక బాధింపజాలదు. పరిపూర్ణజ్ఞానమును బొందుటయే మూడవ యవస్థకు లక్షణము. సర్వజ్ఞత్వము మన వశమగును. వివేకమువలన సమస్తకర్మములును నశించును. కర్తవ్యతాబుద్ధి

తొలగుట నాల్గవ యవస్థకును, మనస్స్వాతంత్ర్య మైదవయవస్థకును లక్షణములు. మనస్స్వాతంత్ర్యము లభించినంతనే పర్వతాగ్రము నుండి దొరలిన ఱాయి మఱల పైకిపోజాలనియట్లు సమస్తకష్ట ములును మనసునుండి తరలిపోవును. సంకల్పించుటయే తడవుగ, చిత్తము తన మూల కారణమునందు లయించుట ఆఱవయవస్థకు లక్షణము. తుదకు మన మాత్మస్థితులమనియు, మనశ్శరీరముల కెన్నడును మనతో నెట్టి సంసర్గముగాని సంబంధముగాని కల్గినది లేదనియు కనుగొందుము. మనశ్శరీరములు తమయంత తాము వర్తించుచున్నవి. అవిద్యచే, అజ్ఞానముచే మనము వానితో సంసర్గ మును బొందితిమి. స్వతస్సిద్ధముగా మనము నిరాశ్రయులము; సర్వ గతులము ; సర్వశక్తిమంతులము ; శాశ్వతానందమయులము. నిత్య శుద్ధబుద్ధముక్తమై మన యాత్మ వెల్గొందుచుండ మఱియొక వస్తువును మన మాశ్రయింపనేల? ఆనంద స్వరూపులమగు మన మానందము కొఱ కొకవస్తువు నపేక్షింపనేల? ఇట్టి జ్ఞానము నిరాశ్రయమై యుండుటచే సర్వవిషయములును జ్ఞానతేజము వలననే భాసించు చున్నవి. ఇదియే చరమావస్థ. ఈ స్థితిని బొందుటచే యోగి భ్రాంతి రహితుడై, సర్వదుఃఖాతీతుడై, ప్రశాంతచిత్తుడై, యెప్పుడు సదా తాను ధన్యుడననియు, పరిపూర్ణుడననియు, సర్వశక్తిమంతుడననియు గ్రహించుచున్నాడు.

28. యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః.

యోగాంగముల ననుష్ఠించుటచే చిత్తమాలిన్యము తొలగి వివేకఖ్యాతి కలుగుచున్నది.

ఇప్పు డనుభవసిద్ధమైన జ్ఞానము, అనగా యోగానుష్ఠాన మునుగూర్చి చెప్పబడుచున్నది. ఇంతకు ముందు తెలుపబడిన జ్ఞానము కష్టసాధ్యమైయున్నను పరమావధిమాత్ర మదియే యని గుర్తింతుముగాక. మున్ముందు మనశ్శరీరములను స్వాధీనము చేసి కొనవలయును. అప్పుడు మన యనుభవము లక్ష్యమునందు కుదురు

కొనును. లక్ష్యమును గుర్తించినప్పు డిక చేయవలసిన కార్యము దానిని పొందుటకై సాధనవిధానము నవలంబించుటయే కదా.

29. యమ-నియమాసన - ప్రాణాయామ - ప్రత్యాహార - ధారణా - ధ్యాన - సమాధయోఽష్టావంగాని.

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి యను నీ యెనిమిదియు యోగాంగములు.

30. అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః

అహింస, సత్యము, దొంగిలింకుండుట, బ్రహ్మచర్యము, పరిగ్రహింపకుండుట యనునవి యమ మనబడును.

నిశ్చలయోగి కానెంచు వ్యక్తి స్త్రీ పురుషాభిమానమును విసర్జింపవలయును. ఆత్మకు స్త్రీ పురుషభేదములు లేవు. ఆత్మ తాను స్త్రీననియు, పురుషుడననియు భావించుచు పతనము నొంద నేల? ఇట్టి భావముల నెందులకు విడువవలసినదియు క్రమముగా మనకు విశదము కాగలదు. దానధర్మములను గ్రహించునట్టి పురుషుడు దాతకు వశుడై, అవనతినొందుట కవకాశము కలదు. ప్రతిగ్రహమువలన మనస్స్వాతంత్ర్యము భగ్నమై పరాధీనతకలుగును. కావున పరిగ్రహింపనలదు.

31. ఏతే జాతిదేశకాలసమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతమ్.

ఇవి (ఈ విధులు) దేశకాల నిమిత్తములచేతను జాతి (నియమముల) చేతను తెంపులేనివై (సార్వజనీనములైన) మహావ్రతము లగుచున్నవి.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను నీ విధులను దేశకాలాది వివక్షతలులేక స్త్రీ పురుష బాలబాలిక లెల్లరును అనుష్ఠింపవలయును.

32. శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః.

(బాహ్యాంతర) శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరారాధనము అనునవి నియమములు.

బాహ్యశౌచమనగా శరీరమును పరిశుద్ధముగా నుంచుట. అపరిశుద్ధుడెన్నడును యోగి కానేరడు. అంతశ్శౌచమును ఆవశ్యకమే. 1-33 వ సూత్రమున జెప్పబడిన సద్గుణముల నలవఱచుకొనుటచే అంతశ్శౌచమును బొందనగును. నిజముగా బాహ్యశౌచముకంటె అంతశ్శౌచము విశేషావశ్యకమై యున్నను యోగసిద్ధికి రెండును ఆవశ్యకములే. మఱియు అంతశ్శుద్ధిలేని బాహ్యశుద్ధి నిష్ప్రయోజనము.

33. వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్.

యోగ ప్రతిబంధకములైన భావములను నిరోధించుటకై తద్వ్యతిరేక భావముల నవలంబింపవలయును.

సద్గుణముల నలవఱచుకొనుట కిదియే మార్గము. పరులసొత్తు నపహరింపవలయునను భావము కలిగినంతనే అపహరింపకుండుట యను సద్గుణమునుగూర్చి చింతింపుము. దానధర్మములను గ్రహింపవలయునని తోచినంతనే తద్వ్యతిరేకభావమునుగూర్చి చింతింపవలయును.

34. వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా
లోభక్రోధమోహపూర్వకా మృదుమధ్యాధిమాత్రా
దుఃఖాజ్ఞానానంతఫలా ఇతి ప్రతిపక్షభావనమ్.

లోభము (దురాశ) చేనైనను, క్రోధము (కోపము) చేనైనను, మోహము (అజ్ఞానము) చేనైనను, మందముగానైనను, సామాన్యముగానైనను, ప్రబలముగానైనను, అసత్యము, హింస మొదలైనట్టివి (తాను) చేసినను, (పరులచే) చేయించినను, (పరులు చేసినప్పుడు) ఆమోదించినను, యోగ ప్రతిబంధకములై అనంత

దుఃఖముగను, అజ్ఞానముగను పరిణమించుచున్నవి. ఇదియే ప్రతిపక్షభావనావిధానము.

నేనసత్యమాడినను, మఱియొకనిచే జెప్పించినను, ఒరు లసత్యమాడినప్పు డామోదించినను, ఇవియన్నియు సమానముగనే పాపకార్యము లగుచున్నవి. అతిమృదువైన అసత్యమైనను అసత్యమే. ప్రతి దుర్భావమును, ద్వేషాలోచనయు అతి రహస్యముగా కొండగుహలో గూర్చుండి తలచినను, నిక్షిప్తమై యొకానొకదినమున అప్రతిహతశక్తితో నేదియో యొక దుఃఖరూపమున నిన్ను పొందక తప్పదు. అసూయాద్వేషములు నీయందుండి వెలువడినయెడల వడ్డీకి వడ్డీతో సహితముగా అవి నిన్ను కట్టి కుడుపక మానవు. హరి బ్రహ్మాదులు దాని నష్టగింపజాలరు. ఈర్ష్యాద్వేషములకు నీ వొక్కసారి తావిచ్చినంతనే వాని ప్రతిఫలమును నీ వనుభవింపకతీరదు. ఈ విషయమును జ్ఞప్తియందుంచుకొనుటచే దుష్కార్యములను జేయజాలవు.

## 35. అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః.

అహింసయందు నెలకొనియుండువాని సాన్నిధ్యమున (ఇతరుల యొక్క) వైరములు తొలగును.

అహింసాధర్మమున సుస్థిరుడై యుండువాని సాన్నిధ్యమున, స్వభావముచే క్రూరములైన సింహవ్యాఘ్రాది జంతువులు సహితము శాంతముకలిగి వర్తించును. అట్టి యోగియెదుట పులియు మేకపిల్లయు గలిసి యాటలాడుకొనును. ఈ స్థితిని బొందినప్పుడు మాత్రమే యోగి అహింసయందు సుస్థిరుడని గ్రహింపనగును.

## 36. సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్.

సత్యమునందు నెలకొనియుండుటచే యోగి (తనకొఱకును, ఇతరుల కొఱకునుగూడ) కర్మములను జేయకయే కర్మఫలములను బొందునట్టి శక్తి సంపన్నుడగును.

సత్యశక్తి నీ యందు నెలకొనియున్నయెడల కలలోగూడ కల్లలాడవు; మనోవాక్కాయకర్మములందు సత్యవంతుడవై యుందువు. నీ వేమి పలికినను సత్యమై తీఱును. 'ధన్యుడవగుము' అని నీ వొకనిని జూచి పలికినంతనే ఆతడు ధన్యుడగును. రోగిని జూచి 'నీ కారోగ్యము కలుగుగాక' అని వచించినంతనే ఆతడు స్వస్థుడగును.

37. అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్.

అస్తేయము (దొంగిలింపకుండుట) యందు నెలకొనియుండుటచే యోగికి సర్వసంపదలును గలుగును.

ప్రకృతినుండి నీ వెంత తొలగి వర్తించినను, ప్రకృతి నిన్నంతగా వెంబడించుచుండును. ప్రకృతికాంతను క్రేగంటనైనను జూడకున్నయెడల నీ కామె దాసురాలగును.

38. బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః.

బ్రహ్మచర్య ప్రతిష్ఠచే శక్తిసామర్థ్యములు కలుగును.

బ్రహ్మచర్యమువలన అద్భుతమైన సామర్థ్యమును, బ్రహ్మాండమైన సంకల్పశక్తియు గలుగును. బ్రహ్మచర్యములేనిదే ఎట్టి యాధ్యాత్మికశక్తియు గలుగజాలదు. ఇంద్రియ నిగ్రహమువలన మానవకోటిపై అద్భుతమైన వశీకరణశక్తి లభించును. ఆధ్యాత్మిక మార్గదర్శకులు ప్రబలజితేంద్రియులై యున్నారు. బ్రహ్మచర్యము వారిని మహత్తర శక్తివంతులనుగా జేయుచున్నది. కావున యోగి తప్పక జితేంద్రియుడై యుండవలయును.

39. అపరిగ్రహస్థైర్యే జన్మకథంతాసంబోధః.

అపరిగ్రహమునందు సుస్థిరుడై యుండువానికి పూర్వజన్మజ్ఞానము కలుగును.

దానధర్మములను గ్రహింపకుండునట్టి పురుషు డితరులకు బద్ధుడుగాక స్వతంత్రుడై యుండును. అట్టివాని మనస్సు నిర్మలమై

యుండును. పరిగ్రహమువలన దాతపాపములను గూడ గ్రహించుట కవకాశము కలదు. పరిగ్రహింపకుండుటచే మనస్సు పరిశుద్ధమై యుండును. అందువలన మున్ముందు పూర్వజన్మజ్ఞానము కలుగును. అంతట యోగి తన లక్ష్యమునందు సుస్థిరుడగును. ఇంతవఱకును తాను జన్మపరంపరలను బొందియుంటినని గ్రహించి, 'యీసారి యిక జననమరణ ప్రవాహమునబడి ప్రకృతి బద్ధుడను గాక ముక్తిపొందవలయు' నని నిశ్చయించుకొనును.

40. శౌచాత్స్వాంగజుగుప్సా పరైరసంసర్గః.

(బాహ్యాంతర) శౌచము స్థిరముగా నేర్పడినంతనే శరీరమునందసహ్యమును, ఇతరులతో సంసర్గము లేకుండుటయు గలుగును.

బాహ్యాంతరశౌచ మేర్పడినంతనే శరీరమునం దలక్ష్యము జనించును. శరీరమును సొగసుగా నుంపవలయునను భావము తొలగిపోవును. ఇతరు లతిసుందరవదనమని భావించు ముఖము జ్ఞానహీనమై యున్నయెడల యోగి కది మృగప్రాయముగా గాన్పించును. లోకు లతిసామాన్యమని తలచు ముఖము ఆత్మప్రభతో తేజరిల్లుచున్నయెడల యోగి దానిని దివ్యసుందరవదనముగా భావించును. శరీరాభిమానమే మానవజీవితమునకు మహోపద్రవకరము. కావున శరీరాభిమానము క్షీణించుటయే శౌచమునకు ప్రథమలక్షణము. శుచిత్వము కలుగనిదే శరీరమునందలి మమకారము తొలగదు.

41. సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మదర్శన - యోగ్యత్వాని చ.

(శుచిత్వమువలన) సత్త్వశుద్ధియు, ఉల్లాసమును, ఏకాగ్రతయు, జితేంద్రియత్వము (ఇంద్రియనిగ్రహము) ను, ఆత్మదర్శన యోగ్యతయుగూడ కలుగును.

శుచిత్వమువలన సత్త్వము ప్రబలమగును; దానివలన మనస్సున కేకాగ్రతయు, ఉల్లాసమును గలుగును. ఉల్లాసమే పారమార్థికతకు ప్రథమలక్షణము. మనోవ్యాకులత్వ మజీర్ణవ్యాధిలక్ష

ణము కాని పారమార్థికతకు చిహ్నము కానేరదు. సంతోషదాయకమగు మనోభావమే సత్త్వగుణస్వభావము. సాత్త్వికున కన్నియు ఆనందకరముగనే యుండును. ఇట్టి మనఃప్రసన్నత నీకు చేకూరిన యెడల యోగమునం దభివృద్ధి గలుగుచున్నట్లు గ్రహింపుము. దుఃఖసంతతియు తమోగుణఫలితము. కావున దుఃఖమును విడువ వలయును, చిఱచిఱలాడుచు మొగము ముడుచుకొనియుండుట తామసికలక్షణములలో నొక్కటి. బలవంతులై, దృఢకాయులై, యౌవనవంతులై, ఆరోగ్యసంపన్నులై, సాహసోపేతులై యలరారునట్టివారే యోగులగుటకర్హులు. యోగికి సర్వమును ఆనందమయమై, ప్రతిమానవ ముఖమును సంతోషజనకమై యొప్పును. ఇదియే గుణవంతునకు లక్షణము. పాపముకంటె దుఃఖహేతువు మఱియొకటి లేదు. మొగము ముడుచుకొని యుండునట్టి వారితో మన కేమి పని? అది ఘోరమైన దృశ్యము. మనోవ్యాకులత నీ మొగమున మూర్తీభవించినప్పుడా నాడు నీ వీవలకు రాక తలుపు వైచుకొని గదిలోకూరుచుండుము. ఈ వ్యాధిని ప్రపంచములో వ్యాపింప జేయుటకు నీ కేమి 'హక్కు' కలదు? మనస్సును నీవు వశపఱచుకొనినయెడల శరీరమంతయు నీకు వశమగును. ఈ శరీర యంత్రమునకు నీవు బానిసవగుటకు బదులు శరీరమే నీకు బానిస యగును. ఈ యంత్రము ఆత్మకు అధోగతి గల్గించుటకు మాఱుగా పరమసాహాయ్యకారి యగును.

42. సంతోషాదనుత్తమః సుఖలాభః.

సంతోషమువలన పరమానందము లభించును.

43. కాయేంద్రియసిద్ధిరశుద్ధిక్షయాత్తపసః.

తపస్సువలన మాలిన్యము నశించుటచే శరీరమునకు ఇంద్రియములకును సిద్ధులు గలుగును.

తపస్సువలన కొన్ని సమయములందు దూరశ్రవణము, దూర దృష్టి మొదలగు సిద్ధులు వెంటనే కాన్పించును.

44. స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగః.

స్వాధ్యాయము (మంత్రజపము) వలన ఇష్టదేవత (తాను కోరిన దేవత) ప్రత్యక్షమగును.

ఉత్తమదేవతల సాక్షాత్కారము పొందదలచిన కొలదియు సాధన తీవ్రతరమగుచుండును.

45. సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్.

సర్వమును ఈశ్వరార్పణము చేయుటవలన సమాధిసిద్ధించును.

భగవంతుని శరణుబొందుటచే స్థిరమైనసమాధి కలుగును.

46. స్థిరసుఖమాసనమ్.

స్థిరముగను, సుఖకరముగను నుండునట్టిదే ఆసనము.

ఇప్పు డాసనమునుగూర్చి చెప్పబడుచున్నది. స్థిరాసన మేర్ప డనిదే నీవు ప్రాణాయామసాధనల నభ్యసింపజాలవు. స్థిరాసనమనగా శరీరభావము బొత్తుగా కలుగకుండుట యని భావము. సాధారణ ముగా మనము కూర్చుండుపద్ధతి ననుసరించి కూర్చుండినయెడల కొన్ని నిముసములకు సర్వవిధములైన కలతలును శరీరమున గలుగ నారంభించును. ఈ శరీరమును గూర్చి తలపకుండునప్పుడు శరీర స్పృహ మనకు సమూలముగా నశించినదని గ్రహింపనగును. ఆ స్థితి యందు శరీరసుఖముగాని కష్టముగాని నీకు కలుగకుండును. మఱల శరీర స్పృహ కలిగినంతనే శరీరమెంతయో విశ్రాంతి పొందినట్లు తోచును. పూర్ణమగు నింతటి విశ్రాంతి శరీరమునకు మఱియొక విధమున కలుగ జాలదు. శరీరమును జయించి స్థిరముగా నుంపగల్గినయెడల సాధన స్థిరపడును.

శరీరమువలన నీకు బాధ కలుగుచున్నంతవఱకు నాడులకు ఒత్తిడి కలుగుచుండుటచే చిత్తైకాగ్రతను బొందజాలవు.

47. ప్రయత్నశైథిల్యానంతసమాపత్తిభ్యామ్.

శరీరమునకు స్వాభావికమగు చలనమును నిరోధించుటవలనను అనంతమునుగూర్చి ధ్యానించుటవలనను ఆసనము స్థిరమై సుఖకరమగును.

అనంతవస్తువునుగూర్చి భావించుటవలన ఆసనము స్థిరపడును. అనంతమగు పరమాత్మనుగూర్చి భావింపజాలకున్నను అనంతాకాశమునుగూర్చి భావింపవచ్చును.

48. తతో ద్వంద్వానభిఘాతః.

ఆసనము సిద్ధించిన పిమ్మట (శీతోష్ణాది) ద్వంద్వములు బాధింపకుండును.

అప్పుడు శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు, మొదలగు ద్వంద్వములేవియు నిన్ను బాధింపజాలవు.

49. తస్మిన్ సతిశ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః.

(ఆసనము సిద్ధించిన) తరువాత ఉచ్ఛ్వాస నిశ్వాసముల యొక్క గతి నిరోధమగు ప్రాణాయామము సిద్ధించును.

ఆసనసిద్ధి కలిగినతోడనే ప్రాణచలనమును నిరోధింపవలయును. శరీరమునందలి ప్రాణశక్తులను వశపఱచుకొనుట యను ప్రాణాయామమునుగూర్చి మన మిక విచారింపవలసియున్నది. సాధారణముగా ప్రాణము శ్వాసమని యాంగ్లభాషయం దనువదింపబడుచున్నను ప్రాణమనగా శ్వాసముకాదు. సమస్త విశ్వమందలి సాముదాయకశక్తియే ప్రాణము. ఇదియే ప్రతిశరీరమునందలి శక్తియునై ఊపిరితిత్తుల చలనమునందు మనకు స్పష్టముగా గోచరించుచున్నది. ప్రాణము శ్వాసమును లోనికి లాగుకొనుటవలన చలనమేర్పడుచున్నది. ప్రాణాయామమునందు మనము నిరోధించునట్టిది ప్రాణమే. ప్రాణము నతి సులభముగా వశపఱచుకొనుటకుగాను మొట్టమొదట మనము శ్వాసమును వశపఱచుకొన ప్రయత్నింపవలయును.

50. బాహ్యాభ్యంతరస్తంభవృత్తిః దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః.

ప్రాణాయామక్రియ బాహ్యముగానైనను, ఆంతరముగానైనను, చలనరహితముగానైనను, దేశమువలనను, కాలమువలనను, సంఖ్యవలనను నియమింపబడుచు దీర్ఘముగాగాని, సూక్ష్మముగాగాని యేర్పడియుండును.

ప్రాణాయామమునందు ప్రాణమును లోనికి బీల్చుకొనుటయు, బయటికి విడుచుటయు, ఊపిరితిత్తులయందు నిలుపుటయు లేక శ్వాసము నూపిరితిత్తులయందు చొరనీయకుండుటయు నను మూడు విధములైన వ్యాపారములు కలవు. ఇవి మఱల దేశకాలములనుబట్టి మాఱుచుండును. దేశమనగా శరీరమునందు ప్రత్యేకమైన యొక తావున ప్రాణమును నిలుపుట యని భావము. కాలమనుటచే నట్టి తావున ప్రాణము నెంతకాలము నిలుపవలసినదియు సూచితము. ఇందుచే నొక యావృత్తియం దెన్నిక్షణములవఱకు శ్వాసమును నిలుపవలసినదియు, మఱియొక యావృత్తియం దెన్ని క్షణములపర్యంతము నిలుపవలసినదియు సూచింపబడుచున్నది. ప్రాణాయామమునకు ఫలితము కుండలినిని మేల్కొలుపుట.

51. బాహ్యాభ్యంతరవిషయాక్షేపీ చతుర్థః.

బాహ్యవిషయములందుగాని, ఆంతరవిషయములందుగాని ప్రాణమును వర్తింపజేసి దానిని నిరోధించుట నాల్గవ ప్రాణాయామము.

ఇది నాల్గవవిధమైన ప్రాణాయామము. ప్రాణమును బాహ్యముగాగాని, ఆంతరముగాగాని నడుపవచ్చును.

52. తతః క్షీయతే ప్రకాశావరణమ్.

దానివలన (ప్రాణాయామమువలన) చిత్తప్రకాశమునొక్క ఆవరణము క్షీణించుచున్నది.

చిత్తము సహజముగా సమస్తజ్ఞానమును తనయందే కలిగియున్నది. చిత్తము సాత్త్వికపరమాణువులచే గూర్పబడియున్నను రజోరేణువులును, తమోరేణువులును దానిని గప్పియున్నవి. ప్రాణాయామమునలన ఈ యావరణము తొలగుచున్నది.

53. ధారణాసు చ యోగ్యతా మనసః.

మనస్సు ధారణపొందుటకై యోగ్యమగును.

ఈ యావరణము తొలగిన తరువాత మనస్సు నేకాగ్రపఱచి ధారణ పొందింపగల్గుదుము.

54. స్వస్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార
ఇవేంద్రియాణాం ప్రత్యాహారః.

ఇంద్రియములు తమతమ విషయములను విసర్జించి చిత్తముయొక్క స్వరూపమును బొందుటయే ప్రత్యాహారము.

చిత్తముయొక్క వివిధావస్థలే ఇంద్రియములు. నేనొక పుస్తకమును జూచుచున్నా ననుకొనుడు. నాకు గన్పడునట్టి పుస్తకరూపమా పుస్తకమునందు లేదు; నా మనస్సునందున్నది. బాహ్యమునం దొకానొక వస్తు వీ రూపమును బయటికి దీసికొనివచ్చుచున్నది. నిజమైనరూపము చిత్తమునందున్నది. ఇంద్రియము లే విషయములతో సంయోగముపొందునో వానితో తాదాత్మ్యమును బొందుటచే వానిరూపములను బొందుచున్నవి. ఈ రూపములను బొందకుండునట్లు చిత్తమును నిరోధించినయెడల మనస్సు శాంతినొందును. ఇదియే ప్రత్యాహార మనబడును.

55. తతః పరమా వశ్యతేంద్రియాణామ్.

దానివలన ఉత్కృష్టమైన ఇంద్రియవశీకరణము కలుగును.

యోగి తనయింద్రియములను బాహ్యవిషయములయొక్క రూపములను బొందకుండునట్లు నిరోధించి మనస్సుతో నైక్యము పొందింపగల్గినయెడలసంపూర్ణమైన ఇంద్రియనిగ్రహమును బొందును.

ఇంద్రియములు పూర్ణముగా వశమైనంతనే ప్రతిస్నాయువును, ప్రతి నాడియు స్వాధీనమగును. ఏలయన సమస్తమైన ఇంద్రియానుభవములకును, సమస్త వ్యాపారములకును ఇంద్రియములు కేంద్రములు కదా. జ్ఞానేంద్రియములనియు కర్మేంద్రియములనియు, ఇంద్రియములు రెండు విధములుగానున్నవి. ఇంద్రియములను నిరోధించినంతనే సమస్తమైన మనోభావములను, సర్వవ్యాపారములను యోగి నిగ్రహింపగల్గుచున్నాడు. అంతట శరీరము సంపూర్ణముగా యోగికి వశమగుచున్నది. తాను జన్మించినందుల కానాడే మనుష్యున కానందముగలుగ నారంభించును. ఆ నాడే "నేను జన్మించినందులకు ధన్యుడనైతి" నని యాతడు చెప్పగలడు. ఇట్టి జితేంద్రియత్వము లభించినంతనే నిజముగా నీ శరీర మెంతటి యద్భుతమైనదో మనకు గోచరించును.

---

## పాతంజలయోగసూత్రములు

### తృతీయాధ్యాయము

# విభూతి - పాదము

ఈ యధ్యాయమున యోగసిద్ధులు వివరింపబడుచున్నవి.

1. దేశబంధశ్చిత్తస్య ధారణా.

ఏదియో యొకచోట (అవలంబమున) చిత్తమును నిలుపుటయే ధారణయనబడును.

శరీరమునందుగాని బాహ్యమునగాని ఒకానొక యవలంబము నాశ్రయించి మనస్సు నిలుకడ చెందియుండుట ధారణ యనబడును.

2. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్.

అట్టి యవలంబమునందు ఏకభావప్రవాహరూపమైన జ్ఞానమే ధ్యానము.

శిరస్సుయొక్క పైభాగమునగాని హృదయము మొదలైన వానియందుగాని ఒకానొక లక్ష్యము నేర్పఱచుకొని, శరీరమునందలి మఱియే యితర భాగమునుండియుగాక, ఆ లక్ష్యమునుండి మాత్రమే మనస్సు స్పర్శానుభవము పొందగల్గినయెడల, అట్టిస్థితి ధారణ యన బడును. చిత్త మట్లు కొంతసేపటివఱకు నిలువగల్గినప్పు డదియే ధ్యాన మనబడును.

3. తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః.

రూపములను విడిచి అర్థమునుమాత్రమే భాసింప జేయు చున్నప్పు డది సమాధి యనబడును.

ధ్యానమునందు ధ్యేయముయొక్క రూపమగు బాహ్యభాగ మును విసర్జించినప్పుడు సమాధి యేర్పడుచున్నది. ఎట్లన, నే నొక పుస్తకమును గూర్చి భావించుచు దానిపై మనస్సు నేకాగ్రము చేయగల్గితి ననుకొనుడు. అప్పుడు బాహ్యముగానున్న రూప మదృ శ్యమై అర్థముమాత్రము భాసించునట్టి స్థితియే సమాధియని చెప్ప బడుచున్నది.

4. త్రయమేకత్ర సంయమః.

ఒకే విషయమునందు ఈ మూడును (ధ్యానధారణ సమా ధులు కూడియుండునప్పుడు) సంయమ మనబడును.

ఒకడు తన మనస్సు నేదియో యొకవిషయముపై బఱపి, దానియందు మనస్సును నిలిపి, ఆ విషయముయొక్క అంతర్భాగము నుండి దానిని వేఱుపఱచి అట్లు చాలసేపు మనస్సును నిలిపి యుంచు టయే, లేక ధ్యానధారణసమాధులు ఒకదాని వెంబడి నొకటిగా గలిసి మూడు ఏకమగుటయే సంయమ మనబడును. ఈ స్థితియందు

విషయముయొక్క రూప మదృశ్యమై అర్థము మాత్రమే మనస్సున నిలిచియుండును.

5. తజ్జయాత్ ప్రజ్ఞాలోకః.

దానిని జయించుటచే జ్ఞానప్రకాశము కలుగును.

ఇట్టి సంయమము చేయనేర్చిన యోగికి సిద్ధులన్నియు వశమగును. యోగుల కిది గొప్పకీలకము. విషయములు స్థూలములు, స్థూలతరములు, స్థూలతమములనియు, సూక్ష్మములు, సూక్ష్మతరములు, సూక్ష్మతమములనియు అనంతములుగానున్నవి. మున్ముందు స్థూలవిషయములపై సంయమము జేయుచు స్థూలవిషయజ్ఞానము కలుగ నారంభించినంతనే క్రమముగా సూక్ష్మ విషయములపై సంయమము చేయుచు రావలయును.

6. తస్య భూమిషు వినియోగః.

దానిని (ఆ సంయమమును) క్రమానుసారముగా వినియోగింపవలయును.

సంయమమును త్వరపడి సాగించుటకు యత్నింపరాదని యీ సూత్రము మనలను హెచ్చరించుచున్నది.

7. త్రయమంతరంగం పూర్వేభ్యః.

ఇంతకుముందు జెప్పబడినవానికంటె నీ మూడును విశేషముగా అంతరంగములై యున్నవి.

ధ్యానధారణసమాధులకు బాహ్యాంగములైన ప్రాణాయామ, ఆసన, నియమములనుగూర్చి యింతకు ముందు చర్చించియున్నాము. ధ్యానధారణసమాధులను బొందిన మానవుడు, సర్వశక్తిమంతుడై, సర్వజ్ఞుడై సను ముక్తుడు కానేరడు. ఇవి మూడును మనస్సును నిర్వికల్పముగా జేయజాలకుండుటయే కాక మఱల శరీరమును బొందుటకు కర్మబీజములను శేషింప జేయుచున్నవి. యోగులు వచించు నట్లీబీజములు దగ్ధపటలమైనపుడు మాత్రమే మఱల నివి యంకు

రించుట కవకాశము కలుగకుండును. అణిమాదిసిద్ధులు కర్మబీజములను నశింపజేయ జాలవు.

8. తదపి బహిరంగం నిర్బీజస్య.

అవియును నిర్బీజసమాధికి బాహ్యాంగములే యగును.

నిర్బీజసమాధితో బోల్చిచూచినప్పు డీ ధ్యానధారణ సమాధులు మూడును బాహ్యాంగములే యగుచున్నవి. సర్వోత్తమమగు నిర్వికల్పసమాధిని మన మింకను సమీపింప లేదు. కాని, సిద్ధులతో గూడియుండు నట్టిదియు, జగత్తును భాసింపజేయునట్టిదియు నగు క్రింది తరగతి సమాధిస్థితినిగూర్చి మాత్రమే మన మింతవఱకును గ్రహించి యున్నాము.

9. వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః.

చిత్తమునందు విక్షేపముపొందిన సంస్కారములను నిరోధించుటవలనను, నిరోధసంస్కారము జనించుటవలనను, నిరోధశక్తులను బడసినదై మనస్సు నిరోధసంస్కారములను పొందినదని చెప్పబడుచున్నది.

సమాధియొక్క ప్రథమావస్థయందు చిత్తవృత్తులు సంపూర్ణముగా నిరోధము గాకున్నను చాలవఱకు నిరోధింపబడి యుండును. సంపూర్ణనిరోధము లభించిన నాడు ఇక సంస్కారములనునవియే లేకుండవలయును. చిత్తవృత్తులు మనస్సు నింద్రియములద్వారా బాహ్యప్రపంచమునందు ప్రవేశింప జేయునప్పుడు యోగి వానిని నిరోధింప యత్నించుచున్నాడు. ఇట్టి నిరోధమే ఒక చిత్తవృత్తి యగుచున్నది. ఒక చిత్తవృత్తిని మఱియొకటి నిరోధించుచు నిట్లు వృత్తులన్నియు తుదకు శాంతించిననే కాని నిజమైన సమాధి కలుగ నేరదు. ఐనను మనస్సు ప్రబల వేగమున విషయములందు ప్రవేశించు నట్టి స్థితికంటె నీ క్రింది తరగతి సమాధిస్థితి యుత్తమమగు నిర్వికల్పసమాధికి సన్నిహితముగా నుండును.

10. తస్య ప్రశాంతవాహితా సంస్కారాత్.

సంస్కారబలమువలన మనోనిగ్రహము ప్రవాహరూపమున ప్రశాంతము (స్థిరము)గా నుండును.

నిత్యమును యోగము నభ్యసించినయెడల మనోనిగ్రహము ప్రవాహరూపమున ప్రశాంతమై స్థిరముగా నుండును. మఱియు మనస్సునకు నిరంతరమైన ఏకాగ్రత కలుగును.

11. సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య
సమాధి పరిణామః.

(సర్వవిషయములందును చరించుట యనునట్టి) సర్వార్థత నశించి, (ఏక విషయమునందు నిలుచుట యను) ఏకాగ్రత కలిగినంతనే చిత్తము సమాధి పరిణామమును పొందుచున్నది.

మనస్సు నానావిషయములందును తగులుకొనుచు సకల విషయములందును సంచరించుచుండును. ఇది మనస్సుయొక్క సామాన్యస్థితి. ఒకే విషయమును గ్రహించి మిగిలినవాని నన్నిటిని విసర్జించునట్టి యున్నతావస్థయు మనస్సునకు గలదు. ఇట్టి యున్నతావస్థయొక్క పరిణామమే సమాధిస్థితి.

12. శాంతోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః.

పూర్వకాలమును వర్తమానకాలమును ఒకటిగాజేరి నిలుచుటయే చిత్తముయొక్క ఏకాగ్రతా పరిణామ మనబడును.

చిత్తైకాగ్రత కలిగినదని మనము గ్రహించు టెట్లు? కాలమును గూర్చిన భావన మన కేమాత్రమును గలుగకుండుట వలన, మనకు తెలియకయే కాల మెంత గడచుచుండునో అంత యేకాగ్రత కలుగుచున్నదని గ్రహింపవలయును. మన మొక పుస్తకము జదువుచు నందు నిమగ్నులమైనప్పుడు కాలము విషయమై మన కేమాత్రమును తలపేయుండక, పుస్తకమును జదువుట ముగించినపు డెన్ని గంటలకాలము గడచినదో యని యాశ్చర్యపడుచుండుట మన నిత్య

జీవితములోనున్న యనుభవమే కదా. సమస్తకాలము వర్తమానమునందు వచ్చి నిలుచుట కుద్యమించుచుండును. కావున భూతవర్తమానకాలము లేకమై నిలుచుటయే చిత్తైకాగ్రతయని నిర్వచింపబడినది.

## 13. ఏతేన భూతేంద్రియేషు ధర్మలక్షణావస్థాపరిణామా వ్యాఖ్యాతాః.

దీనివలన (స్థూలసూక్ష్మములైన) భూతములందును, ఇంద్రియములందును గలుగుచున్న ధర్మపరిణామమును, లక్షణపరిణామమును, అవస్థాపరిణామమును విశదీకరింపబడుచున్నవి.

ఈ సూత్రమువలన రూపకాలస్థితులకు సంబంధించిన చిత్తవికారములు స్పష్టీకరింపబడుచున్నవి. చిత్తము వృత్తులలోనికి పరిణమించునప్పు డది వృత్తిరూపమైన వికారమును పొందుచున్నది. చిత్తవికారములను వర్తమానకాలమునందు నిలుప గలుగుట కాలసంబంధమైన పరిణామము. ప్రస్తుతరూపములను గూడ విసర్జించి చిత్తమును పూర్వరూపములను బొందునట్లు చేయగల్గుట అవస్థాపరిణామము. ముందు జెప్పబడిన సూత్రములలో వివరింపబడిన ఏకాగ్రతారూపములు, చిత్తవికారములను యోగి స్వేచ్ఛాపూర్వకముగా నిరోధించుటకు తోడ్పడును. ఈ యధ్యాయమున నాల్గవసూత్రమునందు జెప్పబడిన సంయమ మిట్టి నిరోధమువలననే కాని యోగికి సాధ్యము కానేరదు.

## 14. శాంతోదితావ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ.

భూతభవిష్యద్వర్తమానకాల పరిణామములవలన వికారము పొందుచుండునదియే ధర్మియనబడును.

అనగా కాలమువలనను సంస్కారములవలనను సదా వికారములను బొందుచు మఱలమఱల వ్యక్తమగుచుండునట్టి వస్తువే ధర్మియని భావము.

15. క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః.

క్రమమునందలి భిన్నత్వము పరిణామమునందలి భిన్నత్వమున (అనగా వరుసగా అనేక వికారములు గలుగుట)కు హేతువగు చున్నది.

16. పరిణామత్రయసంయమాదతీతానాగతజ్ఞానమ్.

(ధర్మలక్షణావస్థలు అనునట్టి) ఈ పరిణామములు మూడింటి యందును సంయమము చేయుటవలన భూతభవిష్యత్ జ్ఞానము గలుగును.

సంయమమునుగూర్చి మొట్టమొదట చేయబడిన నిర్వచనమును మనము జ్ఞప్తిలో నుంచుకొనవలయును. విషయము యొక్క బాహ్యరూపమును విడిచి అంతర్భాగముతో మనస్సు ఏకమై చిరకాలానుగతమైన అభ్యాసముచే ఆ యనుభవమును తనయందు పదిల పఱచుకొని తలచినంతనే తిరిగి యా యనుభవమును పొందగలుగుటయే సంయమ మనబడుచున్నది. ఇట్టిస్థితిలో యోగి భూతభవిష్యత్ జ్ఞానమును పొందగోరినయెడల సంస్కారములయందలి మార్పులపై నాతడు సంయమము చేయవలయును. (3-13). కొన్ని సంస్కారము లిప్పు డనుభవములో నున్నవి; మఱికొన్ని యిదివఱకే యనుభవింపబడినవి; ఇంకను కొన్ని యనుభవమునకు వచ్చుటకై వేచియున్నవి. కావున వీనిపై సంయమముచేయుటవలన భూత భవిష్యత్ జ్ఞానము గలుగగలదు.

17. శబ్దార్థప్రత్యయానామితరేతరాధ్యాసామ్ సంకరస్తత్-
ప్రవిభాగసంయమామ్ సర్వభూతరుతజ్ఞానమ్.

('ఇది శబ్ద మిది యర్థ మిది ప్రత్యయ' మను విభేదజ్ఞానము లేకుండుటచే) సాధారణమైన యనుభవములో సాంకర్యముపొందు చున్న శబ్దార్థప్రత్యయము (జ్ఞానము) లందు సంయమముచేయుట వలన సర్వప్రాణులయొక్కయు ధ్వని (భాషా) జ్ఞానము కలుగును.

బాహ్యకారణమే శబ్దము; ఇంద్రియముల మూలమున మెదడునుజేరి బాహ్యస్పర్శలను మెదడున కందజేయునట్టి ఆంతరస్పందనమే అర్థము. ఇక మనస్సువలన గలుగునట్టి ప్రతిక్రియయే ప్రత్యయము, లేక జ్ఞానము. ఈ జ్ఞానమునకు వెనువెంటనే విషయము గోచరించుచున్నది. మన యనుభవములో నీ మూడును సాంకర్యము పొంది విషయములగుచున్నవి. నేనొక మాటను వినుచున్నా ననుకొనుడు. ఇందు మొదటిది బాహ్యస్పందనము. రెండవది శ్రవణేంద్రియ ద్వారమున మనస్సునకు గొనిపోబడునట్టి ఆంతరస్పర్శ. ఈ స్పర్శకు మనస్సు ప్రతిక్రియ నొనర్చుటచే నాకా మాట తెలియుచున్నది. నేను వినునట్టి యీ శబ్దము, స్పందన స్పర్శా ప్రతిక్రియలనునట్టి యీ మూడింటి యొక్కయు సమ్మేళనమైయున్నది. సాధారణముగా నీ మూటిని మన మొకదానినుండి మఱియొకదానిని వేఱు చేయజాలకున్నను యోగులు వీనిని విభజించి గ్రహింపగలరు. ఈ స్థితిని బొందిన వా డేధ్వనియందైనను సంయమము చేసినయెడల మనుష్యునిచే జేయబడినను, జంతువుచే జేయబడినను ఆ ధ్వని యొక్క నిర్దిష్టార్థమును గ్రహింపగలడు.

18. సంస్కారసాక్షాత్కరణాత్ పూర్వజాతిజ్ఞానమ్.

సంస్కారములను గనుగొనుటచే పూర్వజన్మ జ్ఞానము (కలుగును).

మనము పొందునట్టి ప్రత్యనుభవము చిత్తమునందొక వృత్తిరూపముగా గలుగుచున్నది. ఈ వృత్తి చిత్తమునం దణగి క్రమ క్రమముగా అతిసూక్ష్మమై పోవుచుండునే కాని నశింపదు. ఇట్టి సూక్ష్మవృత్తిని మేల్కొల్పి జ్ఞానావస్థకు దీసికొని రాగల్గినయెడల మఱల నది స్మృతియగుచున్నది. కావున నిట్లు చిత్తమునం దణగియుండు పూర్వ సంస్కారములపై యోగి సంయమము చేయగల్గినయెడల తన పూర్వజన్మములను జ్ఞప్తికి దెచ్చుకొనగలడు.

19. ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్.

పరుల శరీరమునందలి (ప్రత్యేక) లక్షణములపై సంయమము చేయుటవలన వారియొక్క చిత్తమునుగూర్చిన జ్ఞానము కలుగును.

ప్రతిమనుష్యుని శరీరమునందును వాని నితరులనుండి వేఱుపఱచి గ్రహించుట కనువగు ప్రత్యేకలక్షణములుండును. ఇట్టి లక్షణములపై యోగి సంయమము చేయుటచే ఆ పురుషుని మనస్స్వభావములను గ్రహించును.

20. న చ తత్ సాలంబనం తస్యావిషయీభూతత్వాత్.

ఆ చిత్తముయొక్క ఆలంబనము (అనగా ఆ చిత్తమున కాశ్రయమైయున్న భావములు) మాత్రము సంయమమునకు విషయము కాకుండుటచే గ్రహింపబడవు.

శరీరముపై యోగి సంయమము చేయుటచే మనోభావములను గ్రహింపజాలడు. అందులకు మొదట శరీరమునందలి లక్షణములందును, తరువాత చిత్తమునందును, ఇట్లు ద్వివిధమైన సంయమము చేయవలసియుండును. అంతట మనస్సులో నున్న ప్రతివిషయమును యోగి గ్రహింపగలడు.

21. కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభే
చక్షుఃప్రకాశాసంయోగేఽంతర్ధానమ్.

శరీరముయొక్క రూపమునందు సంయమము చేయుటవలన రూపగ్రాహ్యశక్తి ప్రతిబంధింపబడును; దానివలన నేత్రేంద్రియమునందలి ప్రకాశకశక్తి వేఱుచేయబడుటచే యోగి శరీరము అదృశ్యమగును.

ఈ గదిలో మన యెదుట నున్న యోగి అంతర్ధానము కాగలడు. నిజముగా నాతడిక్కడనే యున్నను ఎవ్వరికిని గానబడకుండును. ఒకదానినుండి మఱియొకటి వేఱుగుచున్నది. రూపమును తదాశ్రయమైయుండు వస్తువునుండి వేఱుచేయునట్టి ఏకాగ్రతను

పొందిననే కాని యోగి కీ కార్యము సాధ్యము కానేరదని మీరు జ్ఞప్తిలో నుంచుకొనవలయును. రూపముయొక్కయు రూపొందిన వస్తువుయొక్కయు సంయోగము వలన రూపదర్శనశక్తి కలుగుచుండుటచే రూపముపై నాతడు సంయమము చేసినంతనే రూప గ్రాహ్యశక్తి ప్రతిబంధింపబడుచున్నది.

22. ఏతేన శబ్దాద్యంతర్ధానముక్తమ్.

దీనివలననే (పైనజెప్పబడిన రూపాదృశ్యకరణోపాయము వలననే) శబ్దాదులను తెలియనీయకుండుటయు తెలుపబడుచున్నది. (అనగా శబ్దాదులను తెలియనీయకుండుటకును ఇదియే ఉపాయము.)

23. సోపక్రమం నిరుపక్రమంచ కర్మ
తత్సంయమాదపరాంతజ్ఞానమరిష్టేభ్యో వా.

కర్మముసోపక్రమమనియు నిరుపక్రమమనియు (శీఘ్రముగా ధరించుట కుపక్రమించినదనియు, ఉపక్రమింపనిదనియు) రెండు విధములు. వీనియందు సంయమము చేయుటవలన * గాని, అరిష్ట సూచనల వలనగాని సరిగా ఎపుడు మరణము కలుగునదియు తెలియును.

యోగి తనయొక్క కర్మముపై ననగా ప్రస్తుతము కర్మానుభవమును గలుగచేయుచున్న సంస్కారములయందును, అనుభవమునకు వచ్చుటకు నిరీక్షించుకొనియున్న సంస్కారములయందును సంయమము చేయుటచే నిరుపక్రమసంస్కారములను గూర్చిన జ్ఞానమువలన సరిగా తన కెప్పుడు శరీరపతనము కలుగునో తెలిసికొనును. తానెప్పుడు, ఏ గంటను, ఏ నిమిషమున చనిపోవునదియు కనుగొనును. అంత్యకాలమున కలుగునట్టి భావములు పునర్జన్మమును నిర్ణయించుటకు ప్రబలాధారములని భగవద్గీతలు వచించుచుండుటచే హిందువులు, పూర్వజన్మజ్ఞానమును మహత్తరమైన జ్ఞానముగా పరిగణింతురు.

* అరిష్టసూచనలును మరణకాలమున గోచరించును.—అనువాదకుడు.

24. మైత్ర్యాదిషు బలాని.

మైత్రి (స్నేహము), కరుణ మొదలగు (1-33) గుణముల యందు సంయమముచేయుటచే ఆ గుణములు వృద్ధిపొందును.

25. బలేషు హస్తిబలాదీని.

ఏనుగు, సింహము మొదలగువాని బలమునందు సంయమము చేయుటచే ఆయా బలములు యోగికి కలుగును.

ఇట్టి సంయమము సిద్ధించిననెనుక యోగి బలమును కోరి గజ బలముపై సంయమము చేసినంతనే ఆ బలము సిద్ధించుచున్నది; ప్రతి మనుష్యునకును అపారమైన బలము కలదు; దానిని పొందునట్టి విధానమును గ్రహించుటయే మన కావశ్యకము. అట్టి విధానమును యోగి కనుగొనియున్నాడు.

26. ప్రవృత్త్యాలోకన్యాసాత్ సూక్ష్మవ్యవహితవిప్రకృష్టజ్ఞానమ్.

దివ్య జ్యోతిపై సంయమము చేయుటవలన (1-36, జోతిష్మతీ ప్రవృత్తి వలన) సూక్ష్మములైనట్టియు, ప్రతిబంధింప బడినవియు, అతి దూరస్థములైనవియు నగు వస్తువులను గూర్చిన జ్ఞానము (కలుగును).

హృదయమునందలి దివ్యజ్యోతిపై సంయమముచేయుట వలన ఎక్కడనో అతిదూరమునందు జరుగుచున్న విషయములును, పర్వత ములచే ప్రతిబంధింపబడిన వస్తువులును, అతి సూక్ష్మములైన వస్తు వులును యోగికి గోచరించును.

27. భువనజ్ఞానం సూర్యే సంయమాత్.

సూర్యునియందు సంయమముచేయుటవలన (భూలోకము, భువర్లోకము మొదలగు చతుర్దశ) లోకములను గూర్చిన జ్ఞానము (కలుగును).

28. చంద్రే తారావ్యూహజ్ఞానమ్.

చంద్రునియందు (సంయమము చేయుటవలన) నక్షత్ర సమూహముయొక్క జ్ఞానము (సిద్ధించును)

29. ధ్రువే తద్గతిజ్ఞానమ్.

ధ్రువునియందు (సంయమము చేయుటవలన గ్రహ) నక్షత్రముల సంచారజ్ఞానము (కలుగును).

30. నాభిచక్రే కాయవ్యూహజ్ఞానమ్.

నాభిచక్రమునందు (సంయమము చేయుటవలన) శరీర సంస్థితిని (శరీరేంద్రియాదులను) గూర్చిన జ్ఞానము (కలుగును).

31. కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః.

కంఠములోపలి భాగమునందు (సంయమము చేయుటవలన) ఆకలి దప్పులు నివారణమగును.

ఎక్కువగా ఆకలి వేయుచున్నప్పుడు కంఠకూపమునందు సంయమము చేయుటచే ఆకలి శాంతించును.

32. కూర్మనాడ్యాం స్థైర్యమ్.

కూర్మనాడియందు (సంయమము చేయుటవలన శరీర) స్థైర్యము (కలుగును).

సాధన చేయుచున్నప్పుడు శరీరము కలతనొందదు.

33. మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్.

శిరస్సు (సుషుమ్నాంతము) నందుండి వెలువడుచున్న తేజస్సునందు (సంయమము చేయుటవలన) సిద్ధపురుషుల దర్శనము (కలుగును).

సిద్ధులనగా దయ్యములకంటె కొంచె మున్నతస్థితియందున్నవారు. యోగి తన శిరస్సుయొక్క ఉపరిభాగమునందు సంయమము చేయుటచే నిట్టి సిద్ధపురుషులను జూచును. సాధారణముగా 'సిద్ధుడు' అనునట్టి పదము 'ముక్తిపొందినవా' డను నర్థమునం దుపయోగింపబడుచున్నను ఆ పదము అందుల కనువర్తింపదు.

34. ప్రాతిభాద్వా సర్వమ్.

లేదా, ప్రతిభాశక్తిచే* సమస్తమైన జ్ఞానమును (యోగికి సిద్ధించును).

విశుద్ధ వర్తనముచే జ్ఞానప్రకాశమగు ప్రతిభాశక్తిని పొందిన వాని కివి యన్నియు నెట్టి సంయమమును చేయ నక్కఱలేకయే సిద్ధింపగలవు. ఉన్నతమైన ప్రతిభాస్థితిని పొందినవాని కిట్టి దివ్య జ్ఞానప్రకాశము కలుగును. సమస్తమును ఆతనికి ప్రత్యక్షముగా గోచరించును. సంయమము చేయకయే సర్వమును సహజముగనే ఆతనికి చేకూరును.

35. హృదయే చిత్తసంవిత్.

హృదయమునందు (సంయమము చేయుటవలన) మనస్సును (మనోభావములను) గూర్చిన జ్ఞానము కలుగును.

36. సత్త్వపురుషయోరత్యంతాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థత్వాత్ స్వార్థసంయమాత్ పురుషజ్ఞానమ్.

(పరస్పరము) వేర్వేఱుగానున్న సత్త్వము (బుద్ధితత్త్వము)ను గూర్చియు, పురుషునిగూర్చియు వివేకజ్ఞానము లేకుండుటవలన భోగము (విషయానుభవము) కలుగుచున్నది. పురుషునికొఱకు వర్తించునట్టి సత్త్వము వేఱు: స్వార్థతత్త్వము వేఱు. స్వార్థమునందు సంయమము చేయుటవలన పురుషునిగూర్చిన జ్ఞానము కలుగును.

ప్రకృతివికారమై ప్రకాశమును ఆనందమును లక్షణములుగా గల్గిన సత్త్వగుణము పురుషునికొఱకు వర్తించుచున్నది. అహంకారరహితమై పురుషునియొక్క విశుద్ధజ్ఞానముచే ప్రకాశించునట్టి సత్త్వము స్వతంత్రమైయుండుటచే స్వార్థతత్త్వమని చెప్పబడుచున్నది.

37. తతః ప్రాతిభశ్రావణవేదనాదర్శాస్వాదవార్తా జాయంతే.

దీని (స్వాత్మసంయమము) వలన ప్రతిభాసంబంధములైన శ్రవణజ్ఞానము (దివ్యజ్ఞానము)ను, (దివ్య) స్పర్శజ్ఞానమును, (దివ్య)

* ప్రతిభాశక్తియందు సంయమము చేయుటవలన.—అనువాదకుడు.

రూపజ్ఞానమును, (దివ్య) రసజ్ఞానమును, (దివ్య) గంధజ్ఞానమును కలుగును.

38. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః.

ఇవి (ఈ సిద్ధులు) సమాధికి ప్రతిబంధకములు; (ఐనను) సమాధిని విడిచిన కాలమున వ్యావహారికస్థితియందు సిద్ధులుగా నున్నవి.

ఐహికవిషయములు పురుషమానససంయోగమువలన గోచరించుచున్నవి. ప్రకృతిపురుషులు వేర్వే అను జ్ఞానముపై సంయమము చేయుటవలన పురుషునిగూర్చిన జ్ఞానము కలుగును. దానివలన వివేకము సిద్ధించును. ఇట్టి వివేకమును బొందినంతనే యోగి అఖండ ప్రతిభావంతు డగుచున్నాడు. ఐనను, ఈ సిద్ధులన్నియు, పరమావధియైన విశుద్ధాత్మజ్ఞానమునకును మోక్షమునకును ప్రతిబంధకములై యున్నవి. ఇట్టి సిద్ధులను యోగి విసర్జించినయెడల గమ్యస్థానమును జేరునని చెప్పవచ్చును. ఇక నీ సిద్ధులచే మోహితుడైన యెడల ఆతని పురోవృద్ధి యిక నంతటితో సరియగును.

39. బంధకారణశైథిల్యాత్ ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః

బంధకారణము సడలిపోవుటవలనను, ఇంద్రియముల ద్వారమున విషయములందు ప్రసరించునట్టి జ్ఞానము కలిగియుండుట (లేక శరీరమునందలి నాడులను గ్రహించుట) వలనను యోగి మఱియొకని శరీరమునందు ప్రవేశించును.

స్వయముగా తానొక శరీరమునందు వర్తించుచున్నను, యోగి యొక మృతకళేబరమునందు ప్రవేశించి యది లేచి కదలునట్లు చేయగలడు. లేక, యొక సజీవశరీరమునందు ప్రవేశించి, ఆ శరీరముయొక్క మనస్సును ఇంద్రియములను నిరోధించి, తాత్కాలికముగ దానియొక్క శరీరద్వారమున వర్తింపగలడు. ప్రకృతిపురుషవివేకమును సాధించిన యోగియే యిందులకు సమర్థుడు.

యోగుల ననుసరించి ఆత్మమాత్రమే కాక మనస్సుకూడ సర్వగతమై యుండుటచే ఆతడు మఱియొకని శరీరమునందు ప్రవేశింపనెంచిన యెడల ఆ శరీరముపై సంయమముచేసి దానియందు ప్రవేశించును. 'మహత్' అని చెప్పబడు విశ్వమానసమునందు యోగియొక్క మానస మొక యంశము. ఏనను, ఈ శరీరమునందలి నాడీప్రవాహ మూలమున మాత్రమే మనస్సు వర్తింప గలుగుచున్నది. కాని యీ నాడీవాహినులనుండి స్వేచ్ఛను బొందినంతనే యితరమార్గము లందు యోగులు వర్తింపగలరు.

40. ఉదానజయాజ్జలపంకకంటకాదిష్వసంగ ఉత్క్రాంతిశ్చ.

ఉదానవాయువును జయించుటచే (స్వాధీనము చేసికొనుట వలన) యోగి నీటియందుగాని అడుసునందుగాని మునుగకుండును; ముండ్లపై నడునగలడు. మఱియు తన యిచ్ఛవచ్చినప్పుడు మర ణింపగలడు.

శ్వాసకోశమును శరీరమునందలి ఊర్ధ్వభాగములును ఉదాన నాడికి వశమైయుండును. ఈ నాడిని స్వాధీనము చేసికొనుటచే యోగి శరీరము తేలికయగును. ఆత డిక నీటిలో మునుగడు; ముండ్ల మీదను వాడి కత్తుల మొనలమీదను నడువగలడు; అగ్నిలో నిలువగలడు; తన యిచ్ఛానుసారముగా ఈ యుపాధిని విడుచుటకు సమర్థుడై యుండును.

41. సమానజయాత్ ప్రజ్వలనమ్.

సమానవాయువును జయించుటవలన దేదీప్యమైన కాంతి కలుగును.

యోగి కోరినప్పుడెల్ల, ఆతని శరీరమునుండి కాంతి వెలువడును.

42. శ్రోత్రాకాశయోః సంబంధసంయమాద్దివ్యం శ్రోత్రమ్.

శ్రోత్రమునకును ఆకాశమునకును గల సంబంధమునందు సంయమము చేయుటవలన దివ్యశ్రోత్రము అనగా దివ్యశ్రవణశక్తి కలుగుచున్నది.

ఆకాశమునందును శబ్దజ్ఞానసాధనమగు చెవియందును సంయమము చేయుటవలన దివ్యశ్రవణశక్తి యలవడును. దానిచే సమస్తమును యోగి వినును. మైళ్లకొలదిదూరమున జేయబడిన ధ్వనినిగాని మాటలనుగాని యోగి వినగలడు.

43. కాయాకాశయోః సంబంధసంయమాల్లఘు తూలసమాపత్తే—శ్చాకాశగమనమ్.

శరీరాకాశములయొక్క సంబంధమునందు సంయమము చేయుటవలన శరీరము ప్రత్తివలె తేలికయై యోగి ఆకాశమునందు సంచరించును.

ఆకాశమువలననే ఈ శరీరము నిర్మింపబడియున్నది. ఒకానొకరూపము లేక స్థితిలోనున్న ఆకాశమే శరీరమగుచున్నది. తన శరీరమునందలి ఆకాశమునందు యోగి సంయమము చేయుటవలన శరీరమునకు ఆకాశముయొక్క లఘుత్వము సిద్ధించును. ఈ స్థితియందు యోగి తాను తలచినచోటికి వాయుమార్గమున బోగలడు.

44. బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః

శరీరముయొక్క వెలుపల మహావిదేహమనునట్టి యథార్థమైన చిత్తవృత్తి * యందు సంయమము చేయుటవలన ప్రకాశముయొక్క ఆవరణము తొలగుచున్నది.

అజ్ఞానముచే మనస్సు తానీ శరీరవ్యాపారములను జేయుచున్నట్లు తలచుచున్నది. మనస్సు సర్వవ్యాపకమై యున్నయెడల ప్రత్యేకమైన యొక నాడీమండలముచే నేనేల బద్ధుడనై అట్టి శరీరమునందొక దానియందు మాత్రమే "నేను" అను ననుభవమును కలిగియుండవలయును? నేను ఇట్లు బంధితుడనై యుండ తాను కోరిన చోట నెల్ల యోగి "నేను" అను ననుభవమును బొందగోరును. శరీరమునందు అహంకారము లేకుండునపు డుదయించునట్టి చిత్త

* అనగా దేహాహంకారములు లేని చిత్తవృత్తి.—అనువాదకుడు.

వృత్తులు 'అకల్పితవృత్తులు' లేక యథార్థ వృత్తులని కాని 'మహా విదేహ'మని కాని చెప్పబడును. ఇట్టి వృత్తులపై యోగి సంయమము చేయగల్గినంతనే జ్ఞానతేజమును ఆవరించియున్న మాలిన్యములు తొలగి, అజ్ఞానాంధకారము సంపూర్ణముగా నశించును. ఇట్టి స్థితి యందు యోగికి సమస్తమును జ్ఞానమయమై తోచును.

45. స్థూలస్వరూపసూక్ష్మాన్వయార్థవత్త్వసంయమాద్భూతజయః

స్థూలస్వరూపములు మొదలుకొని సూక్ష్మతన్మాత్రలవఱకును గల (పృథివ్యాది) భూతములందు (క్రమముగా) సంయమము చేయుట వలన (పంచ) భూతములయొక్క జయము కలుగును.

యోగి మొట్టమొదట స్థూలభూతములయందును, క్రమముగా సూక్ష్మతన్మాత్రలయందును సంయమము చేయును. బౌద్ధులయందొకానొక సంప్రదాయమునకు జెందినవారు ఇట్టి సంయమము నెక్కువగా అవలంబించుచువచ్చిరి. వీ రొక మంటిముద్దను దీసికొని దానిపై సంయమము చేయుటచే క్రమముగా దానియందలి తన్మాత్రలను బట్టి సూక్ష్మ పరమాణువులను కనుగొన నారంభించిరి. ఇట్లు దానియందలి పరమాణువులన్నిటిని గ్రహించినంతనే ఆ మహాభూతము వారికి వశమగును. ఇదే విధమున భూతముల నన్నిటిని వారు స్వాధీనము చేసికొందురు. సర్వభూతములను యోగి యిట్లు జయింపగలడు.

46. తతోఽణిమాదిప్రాదుర్భావః కాయసంపద్ధర్మానభిఘాతశ్చ.

దానివలన (అనగా పైనజెప్పబడిన భూతజయమువలన) అణిమాద్యష్టసిద్ధులును, శరీరసంబంధమైన సంపదయును, దేహరూపాదులకు వినాశము లేకుండుటయు కలుగుచున్నది.

అనగా యోగి అష్టసిద్ధులను బొందుచున్నాడని భావము. ఇట్టియోగి అణుమాత్రుడు కాగలడు. వలయుచో పర్వతమంతటి స్థూలరూపమును బొందగలడు. భూమియంతటి బరువుగలవాడు కాగలడు. వాయువంతటి తేలికయైనవాడును కాగలడు. కోరిన వస్తువుల

నెల్ల పొందగలడు. సంకల్పించిన దానినెల్ల జయింపగలడు. సింహ మాతనియెదుట మేకపిల్లవలె కూర్చుండును. ఇచ్ఛామాత్రముననే ఆతని కోర్కెలన్నియు నెఱవేఱును.

47. రూపలావణ్యబలవజ్రసంహననత్వాని కాయసంపత్.

రూపము, లావణ్యము, బలము, వజ్రముచేనైనను భేదింప బడని కఠినతయు కాయసంపద యనబడును.

యోగి శరీరము వజ్రకాయమగును. అట్టి శరీరమున కేదియు హానికల్గింపజాలదు. యోగి సంకల్పించిననేకాని దానికేదియు వినాశము గల్గింపజాలదు. "కాలదండమును భేదించి అతడీలోకమున శాశ్వతముగా తనశరీరముతో జీవించియుండును". బాధ యనునది గాని, రోగ మరణము లనునవిగాని యోగినిక సమీపింపజాలవని వేదములందు చెప్పబడియున్నది.

48. గ్రహణస్వరూపాస్మితాన్వయార్థవత్త్వసంయమా-
దింద్రియజయః.

ఇంద్రియములయొక్క బాహ్యావృత్తియందును, విషయములను ప్రకాశింపజేయునట్టి ఇంద్రియశక్తియందును, అస్మిత లేక అహంకారమునందును, ఇంద్రియములందలి గుణస్థితియందును, ఆత్మానుభవ మను నింద్రియప్రయోజనమునందును (క్రమముగా) సంయమము చేయుటచే ఇంద్రియజయము కలుగుచున్నది.

ఇంద్రియములు మనస్సును విడిచి విషయములవైపునకు బోవుచున్నవి. తోడనే విషయములనుగూర్చిన జ్ఞానము కలుగుచున్నది. ఈ వ్యాపారమునందు అహంతత్త్వము చేరియున్నది. వీనియందును, మిగిలిన రెండింటియందును క్రమముగా సంయమము చేయుటచే యోగి ఇంద్రియములను జయించుచున్నాడు. ఏదైన నొక వస్తువును (ఉదాహరణమున కొక పుస్తకమును) తీసికొని మొట్టమొదట నీ మనస్సును దానిపై నేకాగ్రముచేయుము. తరువాత, ఆ పుస్తకరూపమును పొందిన జ్ఞానముపైనను, ఆ పుస్తకమును జూచునట్టి అహంతత్త్వము

నందును ఇట్లు క్రమముగా సంయమమును సాగించుటచే ఇంద్రియము లన్నియు వశమగును.

49. తతో మనోజవత్వం వికరణభావః ప్రధానజయశ్చ.

దానివలన (ఇంద్రియజయమువలన) శరీరమునకు మనస్సువలె శీఘ్రగమనశక్తియు శరీరసాహాయ్యము లేకయే ఇంద్రియములకు స్వయంశక్తిత్వమును ప్రకృతివశీకరణమును గలుగుచున్నవి.

భూతజయమువలన శరీరవైభవము కలుగును. ఇట్లే ఇంద్రియ జయమువలన పైనజెప్పబడిన సిద్ధులు లభించును.

50. సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ.

సత్త్వమును, పురుషుడును వేర్వేఱనునట్టి (వివేక) జ్ఞానముపై సంయమము చేయుటవలన సర్వశక్తిత్వమును సర్వేంగితజ్ఞతయును గలుగుచున్నవి.

పురుషునకును ప్రకృతికిని భేదము గ్రహించి పురుషుడవినాశి యనియు, నిర్మలుడనియు తెలిసికొని ప్రకృతిని జయించుటచేత యోగికి సర్వశక్తిత్వమును సర్వేంగితజ్ఞతయును అలవడును. (అనగా సమస్త శక్తులును, సర్వమును తెలిసికొనుటయు గలుగుచున్నవి.)

51. తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్.

ఈ సిద్ధులను సహితము విసర్జించుటవలన దోషము, లేక క్లేశములు (సమూలముగా) నాశనమై కైవల్యము (ముక్తి) సిద్ధించుచున్నది.

యోగికిక ఆత్మస్వాతంత్ర్యమగు కైవల్యము సిద్ధించుచున్నది. ముక్తి కరతలామలక మగుచున్నది. సర్వజ్ఞాతృత్వమును సర్వశక్తిత్వమును సంపూర్ణముగా నెవ్వడు విసర్జించునో అట్టివాడు సమస్తభోగములను పరిత్యజించుచున్నాడు. ఆతడు తనను మోహింపజేయుటకు దేవతలు చూపునట్టి స్వర్గసౌఖ్యములను గూడ క్రేగంటనైనను జూడడు. ఇట్టి సిద్ధులను బడసియు వానిని పరిత్యజించినయెడల యోగి

పరమావధిని పొందును. సిద్ధులనగా నెట్టివి? పట్టి దృశ్యములు: కలలకంటె నివి ఘనమైనవి కావు. సర్వశక్తిత్వముకూడ స్వప్న తుల్యమే. సర్వశక్తిత్వము మనస్సుపై నాధారపడియున్నది. మనస్సు ఉన్నంతవఱకే సర్వజ్ఞత్వాది శక్తులుండును. మనస్సు నతిక్రమించుటయే యోగియొక్క పరమావధి.

52. స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్.

(యోగి తనయెదుట) దేవతలు చేయునట్టి ప్రస్తావనల వలనను, ప్రార్థనలవలనను అభిలాషనుగాని గర్వమునుగాని పొంద రాదు. అభిలషించిననాడు తిరిగి అనర్థము సంభవించును.

మఱియు ఇతరములగు అపాయములుగూడ కలవు. దేవతలు, యక్షులు మొదలైనవారలు యోగులను తమ మాయలలో బడ ద్రోయుటకు వత్తురు. సంపూర్ణముగా నెవ్వడును ముక్తుడగుట వారికి మనస్కరింపదు. మనవలెనే వారును, ఒక్కొక్కప్పుడు మనకంటె నికృష్టముగకూడ, పరశ్రేయస్సునుజూచి ఓర్వలేకుందురు. తమపదవుల కేమి భంగము వాటిల్లునో యని వారికి అమితమైన భయము. ముక్తులుకాని యోగులు మరణానంతరము దేవతలగుదురు; చక్కని రాజమార్గమును విడిచి వారు సందుగొందులందు బడి యీ సిద్ధులను చేపట్టుదురు. తిరిగి వీరు జన్మింపవలసి యుందురు. ఈ వ్యామోహములకు లోబడక ధైర్యముతో వాని నెదుర్కొని, సూటిగ గమ్యస్థానమును జేరువారు ముక్తులగుచున్నారు.

53. క్షణతత్ క్రమయోః సంయమాద్వివేకజం జ్ఞానమ్.

క్షణకాలమునందును దానియొక్క ముందటి క్షణములందును సంయమము చేయుటవలన వివేకముచే బుట్టిన జ్ఞానము కలుగును.

ఈ దేవతలను, ఈ స్వర్గములను, ఈ సిద్ధులను మనము నివర్తించుకొను టెట్లు? నిత్యానిత్యవస్తు వివేకమువలన. ఇదియే

అంశముల కుపాయము. వివేకమును దృఢ పఱచుకొనుటకై ఇందొక
సంయమము చెప్పబడుచున్నది. ఎట్లన, క్షణకాలము నందును, దాని
ముందటి వెనుకటి క్షణములందును సంయమము చేయవలయును.

54. జాతిలక్షణదేశై రన్యతానవచ్ఛేదాత్తుల్యయో స్తతః ప్రతిపత్తిః.

జాతిచేతను, లక్షణముచేతను, దేశము లేక స్థానవిశేషము
చేతను విభజన చేయబడనేరక సమానముగా నుండునట్టి వస్తువులు
సహితము పైన జెప్పబడిన సంయమమువలన, అవి వేర్వేఱనునట్టి
జ్ఞానము కలుగును.

మన దుఃఖము లజ్ఞానముచే, యుక్తాయుక్త వివేకజ్ఞానము
లేకుండుటచే గలుగుచున్నవి. అయోగ్యమైనదానిని యోగ్యముగా,
స్వప్నమును యథార్థముగా మనము భావించుచున్నాము. ఆత్మ
మాత్రమే నిత్యము. ఇవ్విషయమును మఱచితిమి. శరీరమనునది
క్షణభంగురమగు నొక స్వప్నము. ఐనను మనము శరీరముల మని
భ్రాంతి నొందుచున్నాము. ఇట్టి అవివేకమే, అజ్ఞానమే దుఃఖమునకు
బుట్టినిల్లు. వివేకము మనకు బలమును చేకూర్చును. ఆనాడే మనము
ఈ శరీరములను స్వర్గములను, దేవతలను ఒక్క పెట్టున త్రోసిరాజన
గలము. ఈ యజ్ఞానము జాతిలక్షణదేశములచే వస్తువులను
విభజించుటవలన గలుగు ఫలము. దృష్టాంతమున కొక ఆవును తీసి
కొనుడు. జాతివలన ఆవు వేఱు, కుక్క వేఱు అని తెలిసికొను
చున్నాము. కేవలము ఆవులలోనైనను, ఒక ఆవునుండి మఱియొక
ఆవు వేఱని మనమెట్లు విభజింతుము? లక్షణములవలన గదా. రెండు
వస్తువులు సరిగా ఒకే విధముగా నున్నప్పుడు, అవి వేర్వేఱుచోట్ల
నుండుటవలన వానిని విభజించి తెలిసికొనగలము. ఈ భేదములు సయి
తము మనకు తోడ్పడజాలనంతటి అవిభాజ్యముగా వస్తువులు కలిసి
పోయినప్పుడు పైనజెప్పిన సంయమసాధనవలన వానిని విభజించుటకు
మనము సమర్థుల మగుదుము. పురుషుడు పరిశుద్ధుడనియు, పరిపూర్ణు
డనియు జగత్తునందు పురుషుడొక్కడే కేవలుడనియు, ప్రకటించు
నట్టి సిద్ధాంతమే మహత్తరమగు యోగతత్త్వమునకంతకును మూలా

ధారమై యున్నది. మనశ్శరీరములు ప్రకృతి పురుషులయొక్క సంయోగమువలన కలిగినవై యున్నను మనస్సుతోడను శరీరము తోడను మనము తాదాత్మ్యమును పొందుచున్నాము. (అనగా మనశ్శరీరములే మనమని భ్రమపడుచున్నాము). ప్రకృతి వేఱు, పురుషుడు వేఱు అనునట్టి వివేకము లేకుండుటయే గొప్ప ప్రమాదము. ఇట్టి వివేచనాశక్తి కలుగుట తోడనే, మనస్సంబంధమైనది గానిండు, శరీరసంబంధమైనదిగానిండు, ప్రపంచములో నున్న ప్రతివస్తువును సంయోగ సంజనితమనియు, ఆ కారణమున పురుషతత్త్వము కానేరదనియు గ్రహింతుము.

## 55. తారకం సర్వవిషయం సర్వథావిషయమక్రమంచేతి వివేకజం జ్ఞానమ్.

వివిధపరిణామములలోనున్న (మహదాది) సమస్త (తత్త్వ) విషయములను ఏక కాలమునందు ఆవరించునట్టి వివేకజన్యజ్ఞానము తారక (రక్షక) జ్ఞానము అనబడును.

జననమరణములతో కూడిన సంసారసముద్రము నుండి యోగిని తరింపజేయుటచే నీ జ్ఞానము తారకమని చెప్పబడుచున్నది. స్థూలసూక్ష్మస్థితులను బొందిన సమస్త ప్రకృతియు ఈ జ్ఞానముచే గ్రహింపబడుచున్నది. ఇట్టి జ్ఞానానుభవమునందొకానొక క్రమమనునది లేక చూచినంతనే సర్వమును ఒక్కుమ్మడి గ్రహింపబడును.

## 56. సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి.

సత్త్వమునందును పురుషులయందును నైర్మల్యము ఏక విధముగ నుండుటవలన కైవల్యము ప్రాప్తమగుచున్నది.

దేవతలు మొదలుకొని అత్యల్పమైన పరమాణువు వఱకును గల వస్తువులలో దేనియందును తా నాధారపడి యుండువాడు కాడని పురుషుడు గ్రహించునట్టి స్థితియే కైవల్యము లేక ముక్తి యని చెప్పబడుచున్నది. సత్త్వము లేక బుద్ధితత్త్వము పరిశుద్ధతాపరిశుద్ధతల యొక్క సమ్మేళనము. ఇట్టి సత్త్వము పురుషునితో సమానమై

నిర్మలమైనంతనే కైవల్యము లభించును. అంతట సత్త్వము శుద్ధ సత్త్వస్వరూపుడగు పురుషుని తనయందు ప్రతిఫలింప జేయును.

---

## పాతంజల యోగసూత్రములు

---

### చతుర్థాధ్యాయము

# కైవల్య - పాదము

1. జన్మౌషధిమంత్రతపఃసమాధిజాః సిద్ధయః.

జన్మముచే, మూలికలచే, మంత్రములచే, తపస్సుచే, సమాధిచే, సిద్ధులు కలుగుచున్నవి.

కొన్ని సమయములందు కొందఱు పుట్టునపుడే సిద్ధపురుషులై యుందురు. కాని నిజముగా వీరీసిద్ధులను పూర్వజన్మమునందు సంపాదించుకొని యుందురు. తమ పూర్వజన్మకృషి యొక్క ఫల మనుభవించుటకోయనున ట్లీసారి జన్మింతురు. సాంఖ్యతత్త్వజ్ఞాన మునకు జనకుడగు కపిలమహాముని గూర్చి ఆతడు సిద్ధుడై జన్మించె నని చెప్పబడియున్నది. సిద్ధుడనగా విజయము బొందినవాడని యర్థము.

ఈ సిద్ధులను రసాయనపద్ధతుల మూలమున గూడ బడయ నగునని యోగులు వచింతురు. ఇనుము మొదలైన సామాన్య లోహములను వెండి బంగారములుగా మార్చుటకై రసవాద ముత్పత్తియయ్యెనని అదియే రసాయన శాస్త్రముగా పరిణమించె ననియు మీ కందఱకును దెలిసినవిషయమే. హిందూదేశము నందు సిద్ధసంప్రదాయము అను ఒక తెగవా రుండెడివారు. మతము, వేదాంతము, జ్ఞానము, పరమార్థము మొదలైనవన్నియు సమంజసములే; కాని వీనిని బొందుటకు శరీరమొక్కటియే సాధన

మని వీరి యభిప్రాయము. ప్రతిపర్యాయమును శరీరము వినాశము పాలగుచుండినయెడల గమ్యస్థానమును జేరుట కనంతకాలము పట్టును. ఎట్లనగా, ఒకడు యోగాభ్యాసము చేయవలయుననికాని పరమార్థమును సాధింపవలయుననికాని ప్రయత్నించును. ఇట్టి యత్నమున విశేషమైన అభివృద్ధి పొందకమునుపే మరణించు ననుకొనుడు. అప్పు డాతడు మఱియొక జన్మమును ఎత్తి మఱల చనిపోవుచు నిట్లు జన్మపరంపరలను పొందుచుండును. ఈవిధముగా జననమరణములతో నెంతయోకాలము నష్టమగును. ఇక నిట్లుగాక సుస్థిరమైన శరీరదార్ఢ్యమును సంపాదించి అట్టి కాయసిద్ధివలన జననమరణములను తొలగించుకొనినయెడల పరమార్థమును సాధించుటకై మనకు వలసినంత వ్యవధి చిక్కును. అందువలన నీ రాసాయనులు మొట్టమొదట శరీరదార్ఢ్యమును గలిగించుకొన వలయునని చెప్పెదరు. ఈ శరీరము మరణరహితమై యుండునట్లు చేయుట మనకు సాధ్యమని వీరియొక్క సిద్ధాంతము.

మనస్సు శరీరమును నిర్మాణము చేయుచుండుటయు, ప్రతి మనస్సును అపారమగు శక్తిసాగరమునుండి వెలువడుచున్న ప్రవాహములలో నొక్కటియై యుండుటయు సత్యమైన పక్షమున ప్రతి మనస్సును (బాహ్యమునుండి) పొందునట్టి శక్తికి పరిమితి లేకుండ వలయునని వీరి యభిప్రాయము. శరీరమును శాశ్వతముగా నుండునట్లుచేయుట మనకు అసాధ్యమనుటకు ఎట్టి కారణమును లేదు. మన శరీరముల నన్నిటిని మనమే నిర్మాణము చేసికొనవలసియున్నది. ఈ శరీరము నశించినంతనే మనము మఱియొక శరీరమును నిర్మించుకొన వలసి వచ్చుచున్నది. ఇట్లు నిర్మించుకొన గల్గినయెడల ఇప్పటి యీ శరీరమునుండి వెలువడ కుండగనే సరిగా ఇప్పుడే, ఇక్కడ నుండగనే అట్టి శరీరము నెందుచే నిర్మించుకొనజాలము? ఈ వాదము నిరాక్షేపణీయమైనది. మరణించిన వెనుక మనము జీవించియుండుటయు ఇతర శరీరములను ఏర్పఱచుకొనుటయు సాధ్యమే యని యంగీకరించెదరా? అట్లైన, శరీరమును పూర్ణముగా లయింపజేయకయే

కేవలము దానిని నిరంతరమును మార్చుకొనుచు ఇక్కడనే ఆ శరీరముల నెందుచే ఉత్పత్తిచేసికొనజాలము? పాదరసమునందును, గంధకమునందును అత్యద్భుతమైన శక్తి కలదనియు వీనితో సిద్ధముచేయబడిన కొన్ని ఘుటికలవలన మనుష్యుడు తన యిచ్ఛవచ్చినంత కాలము జీవింపగలడనియు వారు భావించియుండిరి. మఱికొందఱు ఆకాశగమనము మొదలగు సిద్ధులను కొన్ని మూలికల మూలమున బొందనగుననని విశ్వసించిరి. నేటి యౌషధములలో అత్యద్భుతమైనట్టివి అనేకములు. అందు ముఖ్యముగ వైద్యమున లోహములనుపయోగించునట్టి ప్రక్రియ మన కీ రాసాయనుల మూలముననే లభించియున్నది. యోగులలో కొన్ని సంప్రదాయముల వారు తమ యొక్క ప్రధానాచార్యులలో అనేకులింకను పూర్వశరీరముల తోడనే సజీవులైయున్నారని చెప్పెదరు. యోగ శాస్త్రమున కంతకును ప్రామాణికాచార్యుడైన పతంజలి యీ విషయమును నిరాకరించుట లేదు.

మంత్రశక్తి:— విహితపరిస్థితులలో మంత్రోచ్చారణము వలన అద్భుతశక్తులు గలుగును. అహోరాత్రములు మనమిట్టి మహిమల మధ్యమున మెలగుచుండుటచే వానిని గూర్చిన స్పృహయే మనకు గలుగుట లేదు. మనుష్యశక్తికిని, మంత్రశక్తికిని, మానసిక శక్తికిని పరిమితి లేదు.

తపస్సు:— (శారీరకపీడనము) తపశ్చర్యలును ఇంద్రియ నిగ్రహ సాధనలును ప్రతి మతమునందును అవలంబింపబడుచునే యున్నవి. పారమార్థిక విషయములందు హిందువు లెప్పుడును తుద వఱకును బోవుదురు. కొందఱు చేతులను పైకెత్తి అవి యెండి పోవువఱకు యావజ్జీవమును వానిని అట్లేయుంచెదరు. పాదము లుబ్బి పోవువఱకును అహోరాత్రములు నిలువబడియుండునట్టి వారు మఱి కొందఱు కలరు. కర్మము చాలక వీరు బ్రదికిన పక్షమున ఈ స్థితిలో జీవితకాలమంతయు నిలువబడి యుండవలసినదే కాని ఇక వంచుటకు

శక్యముకాని విధమున కాళ్లు బిగిసికొనిపోవును. పైన జెప్పినవిధమున చేతులను పైకెత్తి యుంచుకొనినవానిని నేనొకప్పుడు చూచితిని. ''నీవు మొట్టమొదట దీనిని అభ్యసించినప్పుడు నీ కెట్లుండె''నని వానిని నే నడుగగా, ''ఘోరనరక బాధ ననుభవించితి''నని యాతడు ప్రత్యుత్తరమిచ్చెను. ఈ బాధ కోర్వజాలక అతడొక నదియొద్దకు పోయి కొంచె ముపశాంతికై నీటిలో నుండెడివాడట! ఒక మాసము దినములైన తరువాత బాధతగ్గ నారంభించినదట! ఇట్టి సాధనల మూలమున సిద్ధులను పొందవచ్చును.

సమాధి :— యోగమునకు శరీరమనదగిన సమాధి యిందలి ముఖ్యాంశమై అత్యున్నతమైన యోగసాధనమై యున్నది. పైన జెప్పిన సాధనలు కేవలము అప్రధానములగుటచే వాని మూలమున పరమానధిని బొందజాలము. నైతిక, మానసిక, ఆధ్యాత్మిక విషయములలో నెట్టిదైనను సర్వమును మనకు సమాధి మూలముననే లభించుచున్నది.

2. జాత్యంతరపరిణామః ప్రకృత్యాపూరాత్.

మఱియొక జాతిగా పరిణమించుట (యనునది) ప్రకృతియొక్క పరిణామ సమాప్తివలన గలుగుచున్నది.

ఇట్టి సిద్ధులు జన్మమువలనను, కొన్ని సమయములందు రాసాయనిక సాధనలవలనను, తపస్సువలనను కలుగునని పతంజలి ప్రతిపాదించుచున్నాడు. ఈ శరీరమును ఎంతకాలమైనను నిలుపుట మనకు సాధ్యమనికూడ అంగీకరించును. శరీరము మఱియొకజాతిగా పరిణమించుటకుగల కారణము ప్రకృతియొక్క పరిణామసమాప్తియే యని చెప్పుచు దానిని రానున్న సూత్రమునందు వివరించును.

3. నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్.

సత్కర్మములును, దుష్కర్మములును, స్వయముగ ప్రకృతియొక్క మార్పులకు కారణములు కానేరవు. కాని యవి ప్రకృతి

పరిణామముల ఆటంకములను తొలగించును. వ్యవసాయదారుడు ప్రవాహమునకు ఆటంకములను తొలగించినతోడనే స్వాభావికముగా నీరు పొలములోనికి ప్రవహించును గదా.

పొలములను సాగుచేయుటకై నీరు ఇదివఱకే కాలువలో నున్నది. కాలువయొక్క ద్వారములు మాత్రము మూయబడి యున్నవి. వ్యవసాయదారుడు ఈ తలుపులను తెఱువగనే ప్రకృతి యందలి గురుత్వాకర్షణ నియమము (లా ఆఫ్ గ్రెవిటేషన్) ననుస రించి నీరు సహజముగా పొలములోనికి పాఱుచున్నది. సర్వశక్తులును మనుష్యునియం దిదివఱకే కలవు; పరిపూర్ణత మనుష్యునియొక్క స్వభావము. సహజమైన మార్గమున నిది వ్యక్తము కాకుండునట్లు కేవలము దీనిని మనము ప్రతిబంధించియున్నాము. ఈ యాటంకము తొలగించినంతనే ప్రకృతిశక్తులు మనలోనికి పొర్లిపాఱును. అంతట మనము మన సహజశక్తులను పొందుదుము. ఇట్లు ప్రకృతివాహిని తన యందు ప్రవహించినతోడనే దురాత్ముడు మహాత్ముడగుచున్నాడు. ప్రకృతి ప్రేరణమువలననే మనము మోక్షమార్గమునందు చరించు చున్నాము; సర్వజనుల నామెయే తుదకు గమ్యస్థానమున జేర్చు చున్నది.

పరమార్థమును సాధించుటకై మనము చేయుచున్న యీ సాధనలన్నియు, ఈ విశ్వప్రయత్నములన్నియు, ఇంతకుముందే మనకు సహజమై, జన్మస్వాతంత్ర్యమైయున్న కైవల్యమును పొందుటకై ప్రతిరోధములను తొలగించి, ద్వారములను తెఱచుటకే వినియోగపడు చున్నవి. నేడు ప్రాచీనయోగులయొక్క పరిణామవాదము నవీన ప్రకృతిశాస్త్ర పరిశోధనాదృష్టితో జూచినప్పుడు సువ్యక్తము కాగ లదు. ఐనను ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములకంటె యోగసిద్ధాంతములే యెక్కువ సమంజసమైనవి.

నవీన శాస్త్రజ్ఞులచే పరిణామ హేతువులుగ ప్రతిపాదింప బడుచున్న 'మిథునవరణము' లేక సమాగమేచ్ఛచే జంటను ఎన్ను

కొనుటయు, జీవితసంగ్రామమున అర్హతమమైన ప్రాణులే వినాశము నొందక నిలిచియుండుటయు నను నీ హేతువులు రెండును పరిణామమునకు పూర్ణమగు సమాధానము నీయజాలవు. జీవనాధారమును సంపాదించుకొనుటయందేమి, జంటను చేర్చుకొనుట యందేమి, మనకు గలుగు పరస్పరసంఘర్షణము తొలగించునంతటి విజ్ఞానాభివృద్ధి కలిగినచో నవీన ప్రకృతిశాస్త్రజ్ఞుల ననుసరించి, మానవకోటియొక్క పురోవృద్ధి యంతటితో నిలిచిపోవుటయేకాక మానవజాతి నశించుటయు సంభవించును. లోకకంటకుడైనవాడు, తాను చేయు దౌర్జన్యము ప్రకృతి నియమానుసారమై యున్నదని మనస్సమాధానము పొందుట కీ సిద్ధాంత మనుకూలించు చున్నది. తత్త్వవేత్తలమని చెప్పుకొనుచు, ప్రపంచమందలి దుర్మార్గులను, అనర్హులను సమూలముగా నశింపజేసి, మానవజాతి నుద్ధరింప దలచువా రనేకులు గలరు. అర్హతానర్హతలను నిర్ణయించునట్టివారు వీరే కాబోలును! స్వతస్సిద్ధముగా ప్రతిజీవియందునుగల పరిపూర్ణతయొక్క ప్రకటనమే నిజమైన పరిణామరహస్యమనియు, ఈ పరిపూర్ణత నిరోధింపబడి యుండుటచే లోనున్న ఆత్మప్రభావతరంగము లుబికి బయటపడుటకై విశేషకల్లోలము చేయుచున్నవనియు ప్రాచీనపరిణామతత్త్వవేత్తయగు పతంజలిమహర్షి చాటుచున్నాడు.

ఈ స్పర్ధలును ఈ పోరాటములును మన యజ్ఞానఫలితములే కాని మఱియొకటి కాదు. ఏలయన, ద్వారమును తెఱచి నీటిని ప్రవహింపజేయుటకు సరియైనమార్గము మనకు తెలియకున్నది. అంతర్గతమైయున్న ఈ అపారశక్తితరంగము వెలువడి తీఱవలయును; దృశ్యప్రపంచమున కిదియే మూలకారణము. జీవనాధారము సంపాదించుకొనుటకు గానిండు, సమాగమేచ్ఛను తృప్తిపఱుచుకొనుటకు గానిండు, ఈ పోటీ అంతయు కేవలము తాత్కాలికము. అనావశ్యకము. అజ్ఞాన సంజనితమైన 'అట్టహాసము'. ఈ సంఘర్షమంతయు సమసిపోయినను అంతర్గతమగు నాత్మపరిపూర్ణతయే మనలను ముక్తిమార్గమున చరింపజేయుచుండును. అందుచే ఆత్మవికాసమునకు

సంఘర్షము ఆవశ్యకమని సమ్మోటకు తగిన హేతు వేదియు కాన రాదు. పశుత్వమునందు మానవత్వ మణగియున్నది. కాని, ద్వారము తెఱచినంతనే తటాలున మనుష్యత్వము వెలువడుచున్నది. ఇట్లే మనుష్యునియందు అజ్ఞానపాశబద్ధమై దివ్యత్వము గర్భితముగానున్నది. జ్ఞానఖడ్గమీపాశములను ఛేదించినంతనేదివ్యత్వము వెలువడుచున్నది.

4. నిర్మాణచిత్తాన్యస్మితామాత్రాత్.

(యోగిచే) నిర్మింపబడిన చిత్తములు అస్మిత (అనగా అహంకారము) వలన మాత్రమే కలుగుచున్నవి.

మనము చేయునట్టి సత్కర్మముల యొక్కయు, దుష్కర్మముల యొక్కయు ఫలము మనమే అనుభవించుచుందు మనునది కర్మసిద్ధాంతము. ఐనను ఆత్మవైభవమును పొందుటయే తత్త్వజ్ఞానమునకు పరమావధి. శ్రుతిస్మృతులన్నియు, ఆత్మవైభవమును గూర్చియు, పరమాత్మ వైభవమును గూర్చియు ప్రస్తుతించుచు వెనువెంటనే కర్మమును బోధించుచున్నవి. సత్కర్మమువలన సత్ఫలమును, దుష్కర్మములవలన దుష్ఫలమును ప్రాప్తించుచు, సుకృత దుష్కృతములవలన ఆత్మవికారమును పొందుచుండినయెడల ఆత్మ ప్రభావము నిరర్థకము కావలసివచ్చును. దుష్కర్మములు పురుష స్వభావము వ్యక్తము కాకుండునట్లు చేయుచున్నవి; ఇక సత్కర్మములీ ప్రతిబంధమును తొలగించినంతనే ఆత్మవైభవము వ్యక్తమగుచున్నది. స్వయముగా ఆత్మ యెన్నడును వికారము పొందదు. నీ వెట్టికర్మములను జేసినను సహజమగు నాత్మప్రభావమును, స్వతస్సిద్ధమైన నీ స్వభావమును ఎన్నటికిని నశింపజేయజాలవు. ఏలయన అవిద్యయను నావరణము ఆత్మపరిపూర్ణతను మఱుగుపఱుచునేకాని, ఆత్మకు దేనివలనను వికారము కలుగజాలదు. శీఘ్రముగా కర్మపరిపాకమును బొందుటకై యోగులు కాయవ్యూహములను లేక శరీర సమూహములను నిర్మించుకొని వానియందు కర్మానుభవమును పొందెదరు. ఈ శరీరము లన్నిటికిని 'అస్మిత' లేక అహంతత్త్వము నుండి వారు చిత్తములను నిర్మింతురు. స్వతస్సిద్ధమైన వారి

చిత్తములకును వీనికిని భేదమును తెలియచేయుటకై ఇవి 'కల్పిత చిత్తములు' అని చెప్పబడుచున్నవి.

5. ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్తమేకమనేకేషామ్.

వివిధములైన యీ కల్పితచిత్తములయొక్క ప్రవృత్తులు వేర్వేఱుగానున్నను మూలచిత్తము వీనినన్నిటిని స్వాధీనము చేసికొనుచున్నది.

వేర్వేఱు శరీరములలో వ్యాపారములను నిర్వర్తించునట్టి యీ చిత్తములు కల్పితచిత్తములనియు, ఈ శరీరములు కల్పిత శరీరములనియు చెప్పబడుచున్నవి. మనస్సును, ప్రకృతియు అక్షయమైన రెండు పెన్నిధులు. యోగమువలన ఈ నిధులను వశపఱుచుకొనునట్టి రహస్యము నీకు తెలియగలదు. ఈ జ్ఞానము సదా నీయందేయున్నను నీవు దానిని మఱచితివి. యోగివైనంతనే నీ కది జ్ఞప్తికి వచ్చును. అంతట నీవు దానిని యథేచ్ఛగ వినియోగించుకొనవచ్చును. అది నీ చేతిలోని కీలుబొమ్మ యగును. జగన్నిర్మాణహేతువగు తత్త్వమువలననే కల్పితమనస్సును ఏర్పడుచున్నది. మనస్సు ఒకవస్తువును ప్రకృతి వేఱొకవస్తువును గావు; అవి రెండును ఒకే వస్తువుయొక్క భిన్నస్థితులు. సూక్ష్మస్థితియైన, అస్మిత లేక అహంకారము అనునట్టి తత్త్వమునుండి యీ కల్పిత శరీరములను, కల్పిత చిత్తములను యోగి నిర్మించుకొనుచున్నాడు. అందుచే, ప్రకృతి శక్తులయొక్క రహస్యమును యోగి కనుగొనినంతనే, అహంతత్త్వమునుండి యోగి వలసినన్ని శరీరములను, చిత్తముల‌ను సృష్టించుకొనగలడు.

6. తత్ర ధ్యానజమనాశయమ్.

వివిధములైన ఆ చిత్తము లన్నిటియందును సమాధిచే నిర్మింపబడిన చిత్తము కర్మవాసనారహితమైనది.

సమస్తచిత్తములయందును సమాధిస్థితినిపొందిన చిత్తమత్యుత్తమము. మూలికలవలనగాని, మంత్రములవలనగాని, తపస్సా

ధనలవలనగాని, ఏవో కొన్ని సిద్ధులను సంపాదించినవాని కింకను వాంఛలుండును; కాని యోగమువలన సమాధిస్థితిని పొందిన పురుషుడు సంపూర్ణముగా వాంఛారహితు డగుచున్నాడు.

### 7. కర్మాశుక్లాకృష్ణం యోగినస్త్రివిధ మితరేషామ్.

యోగులకు కర్మములు తెల్లనివిగాకాని నల్లనివిగాకాని యుండవు; ఇతరులకవి తెల్లనివనియు, నల్లనివనియు, మిశ్రమైన వనియు నిట్లు మూడు విధములుగా నుండును.

యోగి పరిపూర్ణుడైనపిమ్మట అతడు చేయుకర్మములును, తత్ ఫలములును వానిని బంధింపజాలవు. ఏలయన, ఆత డా కర్మములను కోరి చేసియుండలేదు. ఫలవాంఛావిరహితముగా ఆతడు తన కర్మములను జేయుచునే యుండును. లోకకల్యాణమునకై ఆతడు ప్రవర్తించుచు సత్కర్మములను జేయుచున్నను వాని ఫలముల నెన్నడును ఆత డాశింపడు; అందుచే వాని నవి అంటవు. ఇక నిట్టి మహోత్తమస్థితిని పొందని సామాన్యజనులకు నల్లనివి (దుష్కర్మములు) అనియు, తెల్లనివి (సత్కర్మములు) అనియు, మిశ్రములనియు కర్మములు మూడు విధములుగా నుండును.

### 8. తత స్తద్విపాకానుగుణానా మేవాభివ్యక్తిర్వాసనానామ్.

ఈ త్రివిధకర్మములనుండియు ఆయాస్థితుల కనుకూలించునట్టి వాసనలే వ్యక్తమగుచుండును. (మిగిలినవి తాత్కాలికముగా అణగియుండును).

నేను సత్కర్మములు, దుష్కర్మములు, మిశ్రకర్మములు అను నీ మూడువిధములైన కర్మములను జేసి మరణానంతరము స్వర్గమునం దొక దేవత నగుచున్నాననుకొనుడు. దేవతా శరీరము నందు కలుగుచున్న వాంఛలును, మానవశరీరమునందలి వాంఛలును ఒకేవిధముగా నుండవు. దేవతాశరీరమునకు అన్నపానము లక్కఱలేదు. అట్టిస్థితిలో క్షుత్పిపాసలను కలిగించు నట్టివియు, ఇంకను అనుభవింపబడనివియు నగు నా పూర్వకర్మముల గతియేమి!

నేనొక దేవతనైనప్పు డీ కర్మ లెక్కడకు పోవుచున్నవి? కర్మవాసన లెప్పుడును తగిన పరిస్థితులయందు మాత్రమే వ్యక్తమగుచుండుననునదియే యిందులకు సమాధానము. పరిస్థితులు ఎట్టి వాసనలకు అనుకూలమైయుండునో అట్టి వాసనలు మాత్రమే వెలువడును; మిగిలినవి సంచితమైయుండును. ఈ జన్మములో మన కనేక దేవతావాసనలును, అనేక మానవ వాసనలును, అనేక పశువాసనలును కలవు. నే నొక దేవతా శరీరమును దాల్చినప్పుడు సద్వాసనలు మాత్రమే వెలువడును; ఏలయనగా, పరిస్థితు లట్టి వాసనలకే యోగ్యముగా నుండును. ఇక నొక జంతుశరీరమును ధరించినప్పుడు, జంతువాసనలు మాత్రమే వ్యక్తమగుచు సద్వాసనలు వెనుక నిలిచియుండును. దీని వలన నేమని యేర్పడుచున్నది? పరిస్థితులమూలమున వాసనలను నిరోధింపగలమనియే కదా! పరిస్థితులకు యుక్తమును అనుకూలమును అగు కర్మముమాత్రమే వెలువడుచుండును. దీనివలన జాతి దేశాదిపరిస్థితులు కర్మానుభవమును సహితము నిరోధింపజాలునని విశదమగుచున్నది,

9. జాతిదేశకాలవ్యవహితానామప్యానంతర్యం
స్మృతిసంస్కారయోరేకరూపత్వాత్.

స్మృతియును, సంస్కారమును ఏకరూపమును పొంది యుండుటచే జాతి, దేశము, కాలము అనువానిచే వేఱుపఱుపబడి యున్నను వాసనల కానంతర్యము కలుగుచున్నది.

కర్మానుభవములు సూక్ష్మస్థితిని పొంది సంస్కారములగును; తిరిగి సంస్కారములు ప్రాణవంతములై స్మృతిరూపము దాల్చును. సంస్కారరూపమందున్న పూర్వానుభవములను, ఇప్పుడు మనము ఎఱుకతో చేయుచున్న వ్యాపారములతో అజ్ఞాతముగా సమానస్థితికి దెచ్చుట స్మృతియందు జేరును. ప్రతిశరీరమునందును సరిగా అట్టి శరీరమునం దంతకుముందు పొందియుండిన సంస్కార సముదాయము మాత్రమే కర్మమునకు హేతువగును. వేఱొక జాతి శరీరమునందు

పొందిన అనుభవములు తాత్కాలికముగ నిరోధింపబడి యుండును. ప్రతిశరీరియు ఆ జాతి శరీర పరంపరకు మాత్రమే సంతతియై యున్నదా యనునట్లు వర్తించుచుండును. ఇట్లు వాసనలయొక్క పౌర్వాపర్యము విచ్ఛేదము కానేరదు.

## 10. తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్.

సుఖపిపాస (సుఖముకొఱకు తీవ్రమైన వాంఛ) అనాదియై యుండుటచే వాంఛలకు ఆది యనునది లేదు.

మన యనుభవమంతయు సుఖమును బొందవలయునను ఇచ్ఛను వెన్నంటియుండును. క్రొత్తగా కలుగునట్టి ప్రత్యనుభవమును పూర్వానుభవసంజనితమైన ప్రవృత్తిపై నాధారపడి యుండుటచే అనుభవమునకు ఆది యనునది లేదు. అందువలన వాసనలనాదిగా నున్నవి.

## 11. హేతుఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వాదేషామభావే తదభావః.

కారణము, కార్యము, ఆశ్రయము (ఆధారము), శబ్దాది విషయములు అనువానితో కూడుకొనియుండుటచే, నివి యన్నియు నెప్పుడు లేకుండునో అప్పుడే అదియు (వాంఛయు)ను లేకుండును.

కోరికలు కార్యకారణముల* చే బంధింపబడియున్నవి. కోరిక గలిగినతోడనే దానియొక్క ఫలమును గలిగింపనిదే యెన్నడును నశింపదు. మఱియు సంస్కారరూపమును పొందిన పూర్వ వాంఛలన్నిటికిని చిత్తము నిలయమైయున్నది. ఈ సంస్కారములు పూర్ణముగా కార్యరూపము పొందనిదే నశింపవు. ఇదిగాక, ఇంద్రియములు బాహ్యవిషయములను గ్రహించుచున్నంతవఱకు నూతన వాంఛలు కలుగుచునే యుండును. కారణము, కార్యము, ఆశ్ర

* క్లేశములే కారణములై యున్నవి (2-3). "ప్రజాతులు, ఆయువు, భోగము" (2-13) అనునవి కార్యములు.

యము, ఇంద్రియవిషయములు అనువాని నన్నిటిని తొలగించుకొనుట మనకు సాధ్యమైనయెడల వాంఛ లంతరించును.

12. అతీతానాగతం స్వరూపతోఽ_స్త్యధ్వభేదాద్ధర్మాణామ్.

భూతభవిష్యత్తులు తమయొక్క స్వభావమునందే నెలకొని యున్నవి; ఇక గుణము లనేకవిధములుగా నున్నవి.

అస్తిత్వము ఎన్నడును అభావమునుండి కలుగనేరదని భావము. భూతభవిష్యత్తులు వ్యక్తస్థితియందు గాకున్నను, సూక్ష్మావస్థలో నిలిచియుండును.

13. తే వ్యక్తసూక్ష్మా గుణాత్మానః.

అవి గుణములయొక్క స్వభావము ననుసరించి వ్యక్తముగా గాని సూక్ష్మముగాగాని యుండును.

సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి త్రిగుణములు. వీనిని గుణములనుటకంటె తత్త్వములనుటయే సమంజసము. ఈ మూడింటి యొక్క స్థూలావస్థయే ఈ దృశ్యప్రపంచము. వీనియొక్క వివిధ వ్యక్తస్థితులనుండి భూతభవిష్యత్తులు వెలువడుచున్నవి.

14. పరిణామైకత్వాద్వస్తుతత్త్వమ్.

పరిణామమునందలి యేకత్వమునుండి వస్తువులయందలి యేకత్వ మేర్పడుచున్నది.

(సత్త్వరజస్తమస్సులు) వేర్వేరైయున్నను పరిణామము నందు సామరస్య మేర్పడియుండుటచే సర్వవిషయములకు సామరస్య మేర్పడుచున్నది.

15. వస్తుసామ్యే చిత్తభేదా_త్తయోర్విభక్తః పన్థాః.

ఇంద్రియానుభవమును కోరికయు ఒకే విషయమునందు వేర్వేరుగా నుండుటచే మనస్సును విషయమును భిన్నస్వభావము కలిగియున్నవి.

మనయొక్క మనస్సులపై నాధారపడకుండునట్టి స్వతంత్ర మైన బాహ్యప్రపంచ మొకటి కలదు. బౌద్ధులవిజ్ఞానవాద మున కిదియొక నిరసనము. ఒకే వస్తువును వేర్వేఱు జనులు వేర్వేఱు విధములుగా జూచుచుండుటచే, అదియొక వ్యక్తియొక్క భావనా మాత్రము కానేరదు. *

వస్తువు మనకు గోచరించుటయే దానియొక్క అస్తిత్వ మునకు ప్రమాణమై యుండినయెడల మనస్సు ఏవిషయమునం దైనను తన్మయత్వము పొందియుండునప్పుడుగాని, సమాధిస్థితిలో నున్నప్పుడుగాని అట్టిమనస్సు ఎవ్వరివలనను చూడబడుటలేదు కదా. అందుచే ఆ మనస్సు లేదని చెప్పవలసివచ్చును. ఈ సిద్ధాంతము మనకు సమ్మతము కానేరదు.

16. తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తు జ్ఞాతాజ్ఞాతమ్.

వస్తువులు చిత్తముపై ప్రతిబింబించునట్టి విధము ననుసరించి అవి తెలియబడినవిగాగాని తెలియబడనివిగాగాని యుండును.

17. సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్.

చిత్తమునకు అధిపతియైన పురుషునకు పరిణామము లేకుండుటచే చిత్తవృత్తులు నిరంతరము తెలియబడుచున్నవి.

జగత్తు మనస్సునకును ప్రకృతికినిగూడ సంబంధించియున్న దని యీ సిద్ధాంతముయొక్క సారాంశము. మనఃప్రకృతులు రెండును సదా మాఱిపోవుచున్నవి. ఈ పుస్తకమనగా నేమి? నిరం తరము వికారము పొందుచున్న పరమాణువులయొక్క కూడిక. ఈ

---

* ఇక్కడ, "నచైక చిత్తతంత్రం వస్తు తదప్రమాణకమ్ తదాకింస్యాత్" అని కొన్నిప్రతులలో మఱియొకసూత్రము కానబడుచున్నది. "వస్తువు ఒకే చిత్తముపై నాధారపడియుండునని చెప్పజాలము. ఈ పక్షమునందు వస్తువు కలదనుటకు ప్రమాణము లేకుండుటచే వస్తువుయొక్క అస్తిత్వమునకు భంగము వాటిల్లును".

పరమాణువులలో కొన్నిటి సముదాయము పైకి పోవుచుండగా మఱి కొన్నిటి సముదాయము లోనికి వచ్చుచున్నది; ఇదియొక సుడి గుండము వంటిది. కాని వీనికి దేనివలన ఏకత్వ మేర్పడుచున్నది? ఏది వీనిని ఒకే పుస్తకముగా నేర్పడ జేయుచున్నది? క్రమవిధానము ననుసరించి యీ మార్పులు కలుగుచున్నవి. ఇందలి భాగములు నిరంతరము మాఱుచున్నను ఏకవిధమున నివి నా మనస్సునకు స్పర్శలను గలిగించుచుండుటచే ఈ స్పర్శలన్నియు నొకదానితో నొకటిచేరి స్థిరమగు రూపము నేర్పఱచుచున్నవి. నా మనస్సును సదా మాఱిపోవుచునే యున్నది. మనస్సును శరీరమును, ఒకేపదార్థము నందున్న రెండు పొరల వంటివి.

ఇవి వేర్వేఱు గతులతో కదలుచున్నవి. సాపేక్షముగా జూచినప్పుడు ఒకటి మందగమముగను, మఱియొకటి తీవ్రగమ ముగను, ఉండుటచే ఈ రెంటిని వేఱుపఱచి తెలిసికొనగలము. ఎట్లనగా, ఒక పొగబండి (ట్రెయిన్) పోవుచుండ దానిప్రక్కనే ఒక (గుఱ్ఱపు) బండి పోవుచున్న దనుకొనుడు. కొంతవఱకు ఈ రెండింటియొక్క గమనమును మనము కనుగొనవచ్చును. ఐనను వీనికి తోడు మఱియొక విషయమును గమనింపవలసి యున్నది. చలింపనట్టి వస్తువు వేఱొకటి యుండిననే గాని చలనమును కను గొనజాలము. కాని రెండుమూడు వస్తువులు వివిధగతులతో కదలు చున్నప్పుడు త్వరితముగా కదలుచున్నదాని గమనమును మొట్ట మొదట కనుగొనగల్గుదుము. తరువాత నెమ్మదిగా కదలుచున్నవాని గమనము మనకు గోచరించును. ఇక మనస్సున కింద్రియానుభవము లెట్లు కలుగుచున్నవి? మనస్సు సదా మార్పు చెందుచునేయున్నది. అందుచే మనస్సుకంటె తక్కువ వేగముగల దొకటియు, దానికంటె మఱింత తక్కువ వేగము కలిగినది మఱొకటియు ఈ విధముగా పోనుపోను అంత మెన్నటికిని మనకు కాన్పింపదు. ఇట్లు అనవస్థ యేర్పడుచుండుటచే నెక్కడనో యొకచోట మనము నిలువవలయును. ఎన్నటికిని మార్పుపొందని యొకానొక వస్తువును కనుగొని యీ

పరంపరను మనము పరిసమాప్తి చేయవలసియున్నది. అనంతమైన యీ పరిణామ ప్రవాహమున కాధారభూతుడు నిర్వికారుడును, నిర్మలుడును, నిత్యశుద్ధుడును అగు పురుషుడు కలడు. చిత్రదీపము (మేజిక్ లేంటెర్న్) తెరపై ప్రతిమలు పడునట్లు చేయుచున్నను తెరకెట్టి వికారమును గల్గింపని విధమున ఈ స్పర్శలన్నియు పురుషుని యందు కేవలము ప్రతిఫలించుచున్నవి.

18. న తత్ స్వాభాసం దృశ్యత్వాత్.

ఆ చిత్తము పురుషునకు (దృశ్య) విషయమై యుండుటచే స్వయంప్రకాశవంతమైనది కాదు.

ప్రకృతియందంతటను అద్భుతశక్తి వ్యక్తమగుచున్నను, ఆ శక్తి స్వప్రకాశవంతమును జ్ఞానవంతమును కానేరదు. పురుషుడు మాత్రమే స్వప్రకాశవంతుడై సర్వమును భాసింపజేయుచున్నాడు. సమస్తప్రకృతినుండియు సర్వశక్తులనుండియు పురుషుని శక్తియే ప్రకాశించుచున్నది.

19. ఏకసమయే చోభయానవధారణమ్.

ఏకకాలమునందే రెండిటిని గ్రహించుట చిత్తమునకు సాధ్యముకానందువలన.

చిత్తము స్వప్రకాశవంతమై యున్నయెడల, ఏకకాలమున తనను, తనయొక్క విషయములను అవలోకింపగలిగియుండును; కాని యిట్లు చూడజాలకున్నది. విషయమును జూచునపుడు తనను తాను అవలోకించుకొనజాలదు. అందువలన పురుషుడే స్వప్రకాశవంతుడు; చిత్తమునకిట్టి స్వప్రకాశకశక్తిలేదు.

20. చిత్తాంతరదృశ్యే బుద్ధిబుద్ధేరతిప్రసఙ్గః స్మృతిసంకరశ్చ.

మఱియొక చిత్తమువలన దర్శనయోగ్యత కలుగుచున్నదని యూహించినయెడల అట్టి యూహలకు అంతమనునది లేకుండుటయు, స్మృతిసంకరమగుటయు సంభవించును.

సాధారణమనస్సును అవలోకించునట్టి మనస్సు మఱియొకటి కలదని యనుకొందము. దానిని అవలోకించుటకు మఱియొక మనస్సు ఉండవలయును. ఈ విధముగా అంత మెన్నటికిని లేకుండును. దీని వలన స్మృతి తాఱుమాఱగుటయు, నిరాధార మగుటయు సంభవించును.

21. చితేరప్రతిసంక్రమాయా స్తదాకాపత్తౌ స్వబుద్ధిసంవేదనమ్.

జ్ఞానస్వరూపము (పురుషుడు) నిర్వికారమై యుండుటచే చిత్తము పురుషుని స్వరూపమును పొందినప్పుడు జ్ఞానవంతమగుచున్నది.

జ్ఞానమనునది పురుషుని గుణముకాదని స్పష్టీకరించుటకై పతంజలి యిట్లు చెప్పుచున్నాడు. చిత్తము పురుషుని సాన్నిధ్యమును బొందినంతనే పురుషుడు దానిపై ప్రతిఫలించును. అంతట తాత్కాలికముగా చిత్తము జ్ఞానవంతమై తానే పురుషుడై యున్నట్లు కనిపించును.

22. ద్రష్టృదృశ్యోపర క్తం చిత్తం సర్వార్థమ్.

ద్రష్టయు దృశ్యము (అనగా పురుషుడు, విషయము) అను వానిచే ప్రతిఫలింపబడిన చిత్తము సర్వవిషయములను గ్రహింపగలుగుచున్నది.

చిత్తమునకు ఒకవైపున దృశ్యప్రపంచము ప్రతిఫలించుచున్నది; ఇంకొకవైపున ద్రష్టయగు పురుషుడు ప్రతిఫలించుచున్నాడు; ఇట్లు చిత్తమునకు సకలవిషయములను గ్రహించునట్టి శక్తి కలుగుచున్నది.

23. తదసంఖ్యేయవాసనాభిశ్చిత్రమపి పరార్థం
సంహత్యకారిత్వాత్.

లెక్కలేనన్ని వాంఛలచే చిత్తము విచిత్రముగానున్నను మఱియొకని (పురుషుని) కొఱకు వర్తించుచున్నది; ఏలయన చిత్తము సంయోగరూపమున వర్తించుచున్నది.

చిత్తము అనేకవిషయములయొక్క సంయోగమైయున్నది ; అందుచే తనకొఱకు తాను వర్తింపజాలదు. లోకమున సంయోగ సంజనితమగు ప్రతివస్తువును మఱియొక వస్తువుకొఱకై యేర్పడు చున్నది. అందువలన చిత్తమనునట్టి యీ సంయోగము పురుషుని కొఱకేర్పడియున్నది.

24. విశేషదర్శిన ఆత్మభావభావనానివృత్తిః.

వివేకియైనవానికి చిత్తమే ఆత్మయనునట్టి భావన నివర్తించు చున్నది.

పురుషుడు చిత్తము కానేరడని వివేకమువలన యోగి గ్రహించుచున్నాడు.

25. తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భావం చిత్తమ్.

అప్పుడు వివేకమునందు నిమగ్నమైయున్న చిత్తము పూర్వావస్థయైన కైవల్యమును బొందుచున్నది. *

ఇట్లు యోగాభ్యాసము వినిర్మలదృష్టి యనదగు వివేకమును గల్గించును. మనకన్నులను గప్పియున్న తెర వీడినంతనే వస్తు తత్త్వము మనకు గోచరించును. ప్రకృతి యనునది సంయోగము వలన నేర్పడుచున్నదనియు సాక్షియగు పురుషునికొఱకు చిత్ర విచిత్రప్రదర్శనమును జూపుచున్నదనియు, ప్రకృతి యెన్నడును ప్రభుస్థానము నాక్రమింపజాలదనియు మనము గ్రహింతుము. హృదయసింహాసనాసీనుడైన పురుషుని వినోదార్థమై ప్రకృతి యీ రూపములను పొందుచున్నదని మనకు వెల్లడియగును. చిరకాలాను గతమైన సాధనవలన వివేకము కలిగినతోడనే భయమనునది మన యొద్ద నుండుటకు భయపడి పాఱిపోవును. అంతట చిత్తములకు కైవల్య మబ్బును.

* 'కైవల్యమువైపునకు మ్రొగ్గుచున్నది' అనియు జెప్పనగును.—అను.

26. తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః.

అందులకు (అనగా అట్టి కైవల్యమునకు) ప్రతిబంధకములుగ వెలువడు భాగములు సంస్కారములవలన గలుగుచున్నవి.

సుఖప్రాప్తికై బాహ్యవిషయమేదియో యొకటి ఆవశ్యక మని మన విశ్వాసము. ఇట్టి విశ్వాసహేతువులగు భావములన్నియు కైవల్యప్రాప్తికి ప్రతిబంధకములు. స్వయముగా పురుషుడు సుఖ స్వరూపుడు; పూర్ణానందమయుడు. కాని, పూర్వసంస్కారములచే ఈ జ్ఞానము ఆవరింపబడియున్నది. ఈ సంస్కారములు అన్నియు క్రియారూపమును పొంది తీరవలయును.

27. హానమేషాం క్లేశవదుక్తమ్.

ఇదివరకు చెప్పబడిన విధమున (2-10), అవిద్య, అస్మితాది క్లేశములను నిగ్రహించినరీతినే ఈ సంస్కారములనుగూడ నిగ్రహింప వలయును.

28. ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘః సమాధిః.

సకలతత్త్వములను చక్కగా వివేచించునట్టి జ్ఞానము పొందియు, ఫలాపేక్షలేక యుండువానికి అట్టి పరిపూర్ణవివేక ఫలితముగ ధర్మ మేఘమను సమాధి కలుగుచున్నది.

ఇట్టి వివేకమును పొందిన యోగికి పూర్వాధ్యాయమున జెప్పబడిన సిద్ధులన్నియు కలుగును; కాని నిజమైన యోగి వాని నన్నిటిని పరిత్యజించును. అట్టివానికి ధర్మమేఘ మనునట్టి విచిత్ర వికాసమగు నపూర్వజ్ఞానము కలుగుచున్నది. ఇతిహాసప్రసిద్ధులైన ప్రపంచమహాప్రవక్తలందఱును ఇట్టి వికాసమును పొందినవారే. సమస్తజ్ఞానమును మనయందుండియే కలుచున్నదని వారు గ్రహించిరి. తత్త్వమును వారు ప్రత్యక్షముగా దర్శించిరి. అప్రాకృతశక్తులను నీయాడంబరమును విసర్జించినంతనే ప్రశాంతియు, పరిపూర్ణ విశుద్ధ తయు వారికి సహజలక్షణములై యొప్పినవి.

29. తతః క్లేశకర్మనివృత్తిః.

దానివలన (అవిద్యాది) క్లేశములయొక్కయు, కర్మముల యొక్కయు నివృత్తి కలుగుచున్నది.

ధర్మమేఘ మను సమాధి కలిగిన యోగి కిక పతన మనునది కలుగ నేరదు ; ఆతని కేదియు చ్యుతి కలిగింపజాలదు. ఇక నాతనికి క్లేశము లనునవి లేవు. ఆతడు సమస్తదుఃఖాతీతుడు.

30. తదా సర్వావరణమలాపేతస్య
జ్ఞానస్యానంత్యాజ్ జ్ఞేయమల్పమ్.

అప్పుడు జ్ఞానము ఆవరణమునుండియు సమస్తమైన మాలిన్యముల నుండియు విడువబడి అనంతమై యుండుటచే జ్ఞేయము (గ్రహింపదగినది) అల్పమగుచున్నది.

జ్ఞానావరణము తొలగినంతనే జ్ఞానము వెల్గొందుచుండును. బుద్ధుడనగా ఆకాశమువలె అనంతమైన జ్ఞానమని బౌద్ధగ్రంథమొకటి బుద్ధత్వమునుగూర్చి నిర్వచించి యున్నది. బుద్ధుడనునది యొకస్థితి యొక్క నామమని మనము గుర్తింతుముగాక. జీసస్ మహాశయు డీస్థితిని పొంది క్రీస్తుగా మారెను. మీరందఱును ఈ స్థితిని పొందెదరు. జ్ఞాన మనంతమైనంతనే తెలియదగినది అల్పమై పోవుచున్నది. అనంత జ్ఞేయవిషయములతో గూడిన యీ బ్రహ్మాండమంతయు పురుషునిముందు సముద్రములో నీటిబొట్టువంటిది. సామాన్యమానవుడు తాను అత్యల్పుడనని తలచును. ఏలయన తాను గ్రహింపవలసినది అనంతముగా నున్నట్లు కానబడుచుండును.

31. తతః కృతార్థానాం పరిణామక్రమసమాప్తిర్గుణానామ్.

అప్పుడు (సత్త్వాది) గుణములు కార్యసాఫల్యము నొందినవగుటచే వాని పరిణామక్రమము పరిసమాప్తమగును.

వేర్వేఱుజాతులందు వేర్వేఱురీతులుగా నుండునట్టి సత్త్వాది గుణములయొక్క వివిధపరిణామములన్నియు శాశ్వతముగా పరిసమాప్తి నొందును.

32. క్షణప్రతియోగీ పరిణామాపరాన్తనిర్గ్రాహ్యః క్రమః.

క్షణముల ననుసరించి కలుగుచున్నవియు, వరుసగా కొన్ని (మార్పులు) కలిగిన తరువాత తెలిసికొనబడునవియు నగు మార్పులే (పరిణామమునందలి) క్రమమై యున్నవి.

ఇక్కడ పతంజలి క్షణములను (లేక కాలమును) అనుసరించి కలుగు పరిణామమగు 'క్రమము' అను పదమును నిర్వచించు చున్నాడు. నేను (ఒక విషయమునుగూర్చి) ఆలోచించుచుండు నప్పుడు అనేకక్షణములు గడచిపోవుచున్నవి. ఇందు ప్రతిక్షణము (రెప్పపాటుకాలము) నందును భావములో నొక మార్పు కలుగు చున్నది. ఐనను వరుసగా నిట్టి మార్పులు కొన్ని జరిగిననే కాని యీ మార్పులను నేను గ్రహించుటలేదు. దీనినే (పరిణామ) క్రమ మందురు. కాని, సర్వగతత్వమును పొందిన చిత్తమున కిక క్రమ మనునది లేదు. సర్వమును అట్టి చిత్తమునకు ప్రస్తుత విషయముగా పరిణమించును; భూత భవిష్యత్తు లనునవి నశించి అట్టి చిత్తమునకు వర్తమాన మనునది మాత్రమే నిలిచియుండును. కాలము ఆ చిత్త మునకు వశమగును. సమస్తజ్ఞానమును త్రుటిలో కట్టెదుట నిలు చును. సర్వమును మెఱుపు మెఱసినట్లు గోచరించును.

33. పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితిశక్తేరితి.

పురుషుని ప్రయోజనముకంటె వేఱొక ఫలాపేక్ష లేని (సత్త్వాది) గుణములను విలోమక్రమమున లయించుటగాని, చిత్ప్ర కాశమును స్వస్వరూపమునందు నెలకొల్పుటగాని కైవల్యమనబడును.

ప్రకృతి వహించిన కార్యము సమాప్తమైనది, ప్రేమ పాత్రు రాలగు ప్రకృతి యను మన దాది, పరోపకారార్థమై తన భుజ ములపై వైచుకొనిన యీ మహాకార్యము పరిసమాప్తమైనది. తన్నుదా మఱచిన పురుషునకు ఆమె మెల్లగా చేయూతనిచ్చి ప్రపం చానుభవముల నన్నిటిని, దృశ్యముల నన్నిటిని జూపి యాతడు తన

విగతవైభవమును బొంది స్వస్వరూపజ్ఞానప్రాప్తిని బడయుపర్యంతము క్రమక్రమముగ వివిధ శరీరముల మూలమున నాతనిని ఉన్నత స్థితికి దెచ్చినది. దయాస్వరూపిణియగు ప్రకృతిమాత దుర్గమజీవితారణ్యమున త్రోవతప్పి చరించుచున్న యితరులకొఱకై తాను వచ్చిన మార్గముననే యిక మరలిపోవుచున్నది. నిరంతరమును ఇట్లామె కృషి చేయుచునే యున్నది.

ఇట్లు సుఖదుఃఖానుభవముల మూలమున, పుణ్యపాపానుభవముల మూలమున, అనంతజీవప్రవాహము ఆత్మసాక్షాత్కార సాగరమున సంగమించుచున్నది.

స్వస్వరూపప్రాప్తిని జెందిన మహనీయులందఱకును జయమగుగాక!

మన కందఱకును వారి యాశీర్వాదములు లభించుగాక!



# అనుబంధము

## శ్వేతాశ్వతరోపనిషత్తు, ద్వితీయాధ్యాయము

అగ్నిర్యత్రాభిమథ్యతే వాయుర్యత్రాధిరుధ్యతే.
సోమో యత్రాతిరిచ్యతే తత్ర సంజాయతే మనః. 6

ఎచ్చట అగ్ని మథింపబడుచున్నదో, ఎచ్చట వాయువు నిరోధింపబడుచున్నదో, ఎచ్చట సోమరసము ప్రవహించుచున్నదో అచ్చట (పరిపూర్ణమగు) మనస్సు ఉత్పత్తియగుచున్నది. *

---

* అనగా యజ్ఞకర్మమునందు మనస్సు ప్రవర్తించుచున్నది.

—అనువాదకుడు.

త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీంద్రియాణి మనసా సన్నివేశ్య,
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయావహాని. 8

వక్షము, కంఠము, శిరస్సు అను నీ మూటిని ఉన్నతముగా నిల్పి (కూర్చుండి), చక్షురాదీంద్రియములను మనస్సును హృదయమున నిల్పి బ్రహ్మమనెడి తెప్పచే భయావహమగు (జననమరణ) ప్రవాహముల నన్నిటిని విద్వాంసుడు దాటుచున్నాడు.

ప్రాణాన్ ప్రపీడ్యేహ సంయుక్తచేష్టః
క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత,
దుష్టాశ్వయుక్తమివ వాహమేనం
విద్వాన్ మనో ధారయేతాప్రమత్తః. 9

(క్రమవిధానము ననుసరించుచు) వివేకియైనవాడు ప్రాణవాయువులను నిరోధింపవలయును. ప్రాణవాయువు శాంతించినపుడు ముక్కుపుటములచే ఊపిరి విడువవలయును. దుష్టాశ్వములను బూన్చిన రథమును సారథి జాగరూకతతో నడిపించునట్లు పూనికతో మనస్సును నిరోధింపవలయును.

సమే శుచౌ శర్కరవహ్నివాలుకా-
వివర్జితే శబ్దజలాశ్రయాదిభిః,
మనోనుకూలే న చ చక్షుపీడనే
గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్. 10

(గుహలవంటి యేకాంతస్థలములందును), రాలును ఇసుకయు లేని సమభూమియందును, పరిశుద్ధ ప్రదేశములందును, అగ్నిభయమును జలపాతాదులవలన శబ్దమును గలుగని తావులందును, కంటికింపై, మనస్సున కనుకూలించు ప్రదేశములందును, యోగము నభ్యసింపవలయును. (పరమాత్మయందు చిత్తమును జేర్చవలయును.)

నీహారధూమార్కానిలానలానామ్
ఖద్యోతవిద్యుత్-స్ఫటిక-శశీనామ్,
ఏతాని రూపాణి పురఃసరాణి
బ్రహ్మణ్యభివ్యక్తికరాణి యోగే. 11

మంచు, పొగ, సూర్యుడు, వాయువు, అగ్ని, మిణుగురులు, మెఱుములు, స్ఫటికము, చంద్రుడు అను నీ రూపములు క్రమముగా యోగమునందు బ్రహ్మమును సూచించును.

పృథ్వ్యప్ తేజోఽనిలఖే సముత్థితే
పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే,
న తస్య రోగో న జరా న మృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్. 12

భూమి, జలము, వెలుతురు, అగ్ని, ఆకాశము అను వానివలన యోగానుభవము లెప్పుడు కలుగునో యోగ మప్పు డారంభమగును. యోగాగ్నిమయమగు శరీరముగల యోగిని రోగజరామరణ దుఃఖము లేవియు సమీపింపజాలవు.

లఘుత్వమారోగ్యమలోలుపత్వమ్
వర్ణప్రసాదః స్వరసౌష్ఠవం చ,
గంధః శుభో మూత్రపురీషమల్పమ్
యోగప్రవృత్తిం ప్రథమాం వదంతి. 13

యోగాభ్యాసమునందు ప్రవర్తించినవానికి మున్ముందు శరీరము తేలికయగును; త్వచ మృదువై ముఖవర్చస్సు ప్రదీప్తమగును; కోమలమగు కంఠస్వరము గలుగును; మూత్ర పురీషము లల్పములై శరీరము సుగంధవంతమయి యొప్పును. ఆర్యు లిట్లు వచింతురు.

యథైవ బింబం మృదయోపలిప్తం
తేజోమయం భ్రాజతే తత్ సుధాంతమ్,
తద్వాత్మతత్త్వం ప్రసమీక్ష్య దేహీ
ఏకః కృతార్థో భవతే వీతశోకః. 14

మంటితో గప్పబడిన వెండిబంగారములు పరిశుద్ధ మొనర్పబడినంతనే ప్రకాశవంతము లగునట్లు దేహధారి యగు పురుషుడు ఆత్మతత్త్వమును కనుగొనినంతనే అద్వితీయుడై, కృతార్థుడై, సర్వదుఃఖాతీతుడై యొప్పును.

---

## శంకరాచార్యునిచే ఉదాహరింపబడిన యాజ్ఞవల్క్య ప్రవచనము

ఆసనాని సమభ్యస్య వాంఛితాని యథావిధి,
ప్రాణాయామం తతో గార్గి జితాసనగతోఽభ్యసేత్.

ఓ గార్గీ, యథావిధిగా ఆసనముల నభ్యసించి అందు జయముగాంచిన పురుషుడు ప్రాణాయామము నభ్యసింపవలయును.

మృద్వాసనే కుశాన్ సమ్యగాస్తీర్యాజినమేవ చ,
లంబోదరం చ సంపూజ్య ఫలమోదకభక్షణైః.
తదాసనే సుఖాసీనః సవ్యే న్యస్యేతరం కరమ్,
సమగ్రీవశిరాః సమ్యక్ సంవృతాస్యః సునిశ్చలః.
ప్రాఙ్ముఖోదఙ్ముఖో వాపి నాసాగ్రన్యస్తలోచనః,
అతిభుక్తమభుక్తం చ వర్జయిత్వా ప్రయత్నతః.
నాడీసంశోధనం కుర్యాదుక్తమార్గేణ యత్నతః,
వృథా క్లేశో భవేత్తస్య తచ్ఛోధనమకుర్వతః.

కుశాసనముపై బఱచిన (జింక లేక పులియొక్క) చర్మముపై సుఖకరమగు నాసనమున గూర్చుండి, ఫలమోదకములచే గణపతి నర్చించి, కుడిచేతి నెడమచేతియందుంచి, వక్షమును, కంఠమును ఉన్నతముగా నిల్పి, పెదవులను చక్కగా మూసికొని, తూర్పుదిశగాగాని ఉత్తరదిశగాగాని కూర్చుండి, నాసికాగ్రమున దృష్టినిలిపి, మితిమీఱి భుజించుటయు, బొత్తిగా భుజింపకుండుటయు ప్రయత్నపూర్వకముగా వర్జించి, నియమితవిధి ననుసరించి నాడులను శుద్ధియొనర్పవలయును. నాడీశోధనము చేయనియెడల సాధనయంతయు నిష్ప్రయోజనమగును.

నాసాగ్రే శశభృద్బీజం చంద్రాతపవితానితమ్,
సప్తమస్య తు వర్గస్య చతుర్థం బిందుసంయుతమ్,
విశ్వమధ్యస్థమాలోక్య నాసాగ్రే చక్షుషీ ఉభే,
ఇడయా పూరయేద్వాయుం బాహ్యం ద్వాదశమాత్రకైః.

ఇడాపింగళానాడులు కలియుతావున 'హం'కారమునుగూర్చి భావించుచు, ఇడను బాహ్యమగు వాయువుచే పండ్రెండు మాత్రల (క్షణముల) కాలములో పూరింపవలయును.

తతోఽగ్నిం పూర్వవద్ధ్యాయేత్ స్ఫురజ్జ్వాలావలీయుతమ్,
రవష్ఠం బిందుసంయుక్తం శిఖిమండలసంస్థితమ్.
ధ్యాయేద్విరేచయేద్వాయుం మన్దం పింగలయా పునః,

ఆ తావునసే 'రంగ్' అను మంత్రముచే యోగి ప్రజ్వలించుచున్న అగ్నిని గూర్చి ధ్యానింపవలయును; అట్లు ధ్యానించుచు కుడిముక్కు పుటమగు పింగళా ద్వారమున నెమ్మదిగా వాయువును విడువవలయును.

పునః పింగలయాపూర్య ప్రాణం దక్షిణతః సుధీః.
తద్వద్విరేచయేద్వాయుమిడయా తు శనైః శనైః,

మఱల పింగళాద్వారమున పూరించి, ఇడాద్వారమున నెమ్మదిగా, అట్లే వాయువును విడువవలయును.

త్రిచతుర్వత్సరం వాపి త్రిచతుర్మాసమేవవా.
గురుణోక్తప్రకారేణ రహస్యేవం సమభ్యసేత్,
ప్రాతర్మధ్యందినే సాయం స్నాత్వాషట్కృత్వ ఆచరేత్.
సంధ్యాది కర్మ కృత్వైవ మధ్యరాత్రేఽపి నిత్యశః,

మూడునాలుగు సంవత్సరములుగాని, మూడు నాలుగు మాసములుగాని గురూపదేశము ననుసరించి, రహస్యముగా (ఒక గదిలో) ఉదయముననుమ, మధ్యాహ్నముననుమ, సాయంకాలముననుమ, అర్ధరాత్రముననుమ నాడులు శుద్ధమగు వఱకును, ఇట్లభ్యసింపవలయును.

నాడీశుద్ధిమవాప్నోతి తచ్చిహ్నం దృశ్యతే పృథక్.
శరీరలఘుతా దీప్తిర్జఠరాగ్నివివర్ధనమ్,
నాదాభివ్యక్తిరిత్యేతల్లింగం తచ్ఛుద్ధిసూచకమ్.

శరీరలఘుత్వమును, దీప్తిమంతమగు ముఖవర్చస్సును, ప్రజ్వలితమగు జఠరాగ్నియు, నాదశ్రవణమును నాడీశుద్ధికి లక్షణములై యొప్పును.

ప్రాణాయామం తతః కుర్యాద్రేచపూరకకుంభకైః,
ప్రాణాపానసమాయోగః ప్రాణాయామః ప్రకీర్తితః.

రేచకపూరక కుంభకములతోఁగూడిన ప్రాణాయామము నప్పు డభ్యసింపవలయును. ప్రాణవాయువు నపానవాయువుతో జేర్చుటయే ప్రాణాయామ మని చెప్పబడును.

*   *   *   *

పూరయేత్ షోడశైర్మాత్రైరాపాదతలమస్తకమ్,
మాత్రైర్ద్వాత్రింశకైః పశ్చాద్రేచయేత్ సుసమాహితః.
సంపూర్ణకుంభవద్వాయోర్నిశ్చలం మూర్ధ్ని దేశతః,
కుంభకం ధారణం గార్గి చతుఃషష్ట్యా తు మాత్రయా.

ఓ గార్గీ, ఆపాదమస్తకపర్యంతమగు శరీరమును పదునాఱు మాత్రల కాలములో పూరింపవలయును; ముప్పదిరెండు మాత్రలలో ప్రాణమును రేచింప వలయును. అరువదినాలుగు మాత్రలలో కుంభింపవలయును.

ఋషయస్తు వదంత్యన్యే ప్రాణాయామపరాయణాః,
పవిత్రీభూతాః పూతాత్మాః ప్రభంజనజయే రతాః.
తత్రాదౌ కుంభకం కృత్వా చతుఃషష్ట్యాతు మాత్రయా,
రేచయేత్ షోడశైర్మాత్రైర్నాసేనైకేన సుందరి,
తతశ్చ పూరయేద్వాయుం శనైః షోడశమాత్రయా.

ప్రాణాయామపరాయణులగు ఋషులు మఱియొక విధమగు ప్రాణాయామమునుగూర్చి వచింతురు. అందు కుంభకమును అరువదినాలుగు మాత్రలలో చేయవలయును; ప్రాణమునంతట పదునాఱు మాత్రలలో విడువవలయును; మఱియు పదునాఱు మాత్రలకాలమున శరీరమును మెల్లగా పూరింపవలయును.

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చ కిల్బిషాన్,
ప్రత్యాహారాచ్చ సంసర్గాన్ధ్యానేనానీశ్వరాన్ గుణాన్.

ప్రాణాయామమువలన శరీరమాలిన్యములును, ధారణవలన మనోమాలిన్యములును, ప్రత్యాహారమువలన రాగసంజనితములగు మాలిన్యములును తొలగుచున్నవి. ఇక సమాధివలన ఆత్మనావరించియుండునట్టి సమస్తదుర్గుణములును నశించును.

# సాంఖ్యసూత్రములు

## తృతీయాధ్యాయము

భావనోపచయాత్ శుద్ధస్య సర్వం ప్రకృతివత్. 29

ధ్యానసిద్ధివలన శుద్ధుడగు పురుషునకు సమస్తప్రకృతిశక్తులును గలుగును.

రాగోపహతిర్ధ్యానమ్. 30

రాగనివృత్తియే ధ్యానము.

వృత్తినిరోధాత్తత్సిద్ధిః. 31

వృత్తినిరోధమువలన ధ్యానము సిద్ధించును.

ధారణాసనస్వకర్మణా తత్ సిద్ధిః. 32

ధారణవలనను, ఆసనమువలనను, స్వకర్మానుష్ఠానమువలనను ధ్యానము సిద్ధించును.

నిరోధశ్ఛర్దివిధారణాభ్యామ్. 33

ప్రాణనిరోధము రేచకకుంభకములు రెండిటివలనను గలుగుచున్నది.

స్థిరసుఖమాసనమ్. 34

స్థిరమును, సుఖకరమును అగునట్టిదియే ఆసనము.

వైరాగ్యాదభ్యాసాచ్చ. 36

వైరాగ్యమువలనను, అభ్యాసమువలననుగూడ ధ్యానము సిద్ధించును.

తత్త్వాభ్యాసాన్నేతి నేతీతి త్యాగాద్వివేకసిద్ధిః. 74

తత్త్వాభ్యాసములవలనను, "నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు) అనుచు ప్రకృతితత్త్వములను విసర్జించుటవలనను వివేకము సిద్ధించును.

## చతుర్థాధ్యాయము

ఆవృత్తిరసకృదుపదేశాత్. 3

మఱలమఱల ఉపదేశించుచుండవలయును.

శ్యేనవత్ సుఖదుఃఖీ త్యాగవియోగాభ్యామ్. 5

డేగయొద్దనున్న ఆహారమును తీసివైచినపు డది దుఃఖించునట్లును, స్వయముగా తానే దానిని (ఆహారమును) వర్జించినయెడల సుఖించునట్లును (ఎవడు స్వయముగా సర్వమును త్యజించునో వాడు సుఖించును).

అహి నిర్ల్వయనీవత్. 6

పాము తన కుబుసమును విడుచుటచే సుఖించునట్లు.

అసాధనానుచింతనం బంధాయ భరతవత్. 8

మోక్షసాధనముకానివిషయమునుగూర్చి తలంపరాదు ; (జడ) భరతుని విషయమున సంభవించిన ట్లది బంధహేతువగును.

బహుభిర్యోగే విరోధో రాగాదిభిః కుమారీశంఖవత్. 9

కుమారియొక్క హస్తమునందలి గుల్లగాజులవలె అనేకవిషయ సంసర్గముచే రాగద్వేషాదులవలన ధ్యానమునకు విఘ్నము సంఘటిల్లును.

ద్వాభ్యామపి తథైవ. 10

రెంటివిషయమునుగూడ నిట్టిదే.

నిరాశః సుఖీ పింగళావత్. 11

పింగళ యను యువతివలె ఆశను త్యజించునట్టివాడు సుఖించును.

బహుశాస్త్రగురూపాసనేఽపి సారాదానం షట్పదవత్. 13

బహుశాస్త్రములను గురువులను, ఉపాసింపవలసియున్నను అనేక పుష్పముల నుండి సారమును గ్రహించు మధుకరమువలె వర్తింపవలయును.

ఇషుకారవన్నైకచిత్తస్య సమాధిహానిః. 14

అమ్ములను నిర్మించువాని చిత్తమువలె నెవ్వని చిత్త మేకాగ్రమగునో వాని ధ్యానమునకు హానికలుగదు.

కృతనియమలంఘనాదానర్థక్యం లోకవత్. 15

ప్రధాననియమముల నుల్లంఘించుటవలన, ఇతర లౌకికవిషయము లందు వలెనే పరమావధి ప్రాప్తింపదు.

ప్రణతిబ్రహ్మచర్యోపసర్పణాని కృత్వా
సిద్ధిర్బహుకాలాత్తద్వత్. 19

(ఇంద్రుని విషయమున సంభవించినట్లు) బ్రహ్మచర్యమువలనను, పూజనము వలనను, గురుభక్తివలనను బహుకాలమునకు సిద్ధికలుగును.

న కాలనియమో వామదేవవత్. 20

వామదేవునియందువలెనే కాలనియమ మనునది లేదు.

లబ్ధాతిశయయోగాద్వా తద్వత్. 24

పరిపూర్ణతను గాంచిన మహనీయుని సంసర్గమువలననైనను (సిద్ధికలుగును).

న భోగాత్ రాగశాంతిర్మునివత్. 27

(చిరకాలము యోగము నభ్యసించిన) మునులకైనను భోగమువలన రాగము శాంతింపదు.

## పంచమాధ్యాయము

యోగసిద్ధయోఽప్యౌషధాదిసిద్ధివన్నాపలపనీయాః. 128

ఔషధాదులవలన గలుగు రోగనివారణవలెనే యోగసిద్ధులను (మిథ్యలని) నిరాకరింపరాదు.

## షష్ఠాధ్యాయము

స్థిరసుఖమాసనమితి న నియమః. 24

స్థిరమును సుఖకరమును అగునట్టి దేదియైనను ఆసనమే; ఇంతకంటె వేఱొక నియమము లేదు.

---

# వ్యాససూత్రములు

## చతుర్థాధ్యాయ ప్రథమపాదము

ఆసీనః సంభవాత్. 7

కూర్చుండియుండునట్టి స్థితిలో ఆరాధనము సంభవమగును.

ధ్యానాచ్చ. 8

ధ్యాననిమిత్తమున.

అచలత్వంచాపేక్ష్య. 9

ధ్యానస్థితుడు అచలమగు భూమితో పోల్పబడుటచేత

స్మరంతి చ. 10

మఱియు స్మృతు లట్లు వచించుచుండుటచేత.

యత్రైకాగ్రతా తత్రావిశేషాత్. 11

స్థలనియమమనునది లేదు; ఎచ్చట మనస్సైకాగ్రచిత్తమగునో అచ్చటనే ఆరాధన చేయవలయును.

ఇచ్చట నుదాహరింపబడిన అంశములు యోగమునుగూర్చి ఇతర హైందవ తత్త్వశాస్త్రముల యభిప్రాయమును సూచించుచున్నవి.



# మతమనగా నేమి?

పెద్ద రైలుఇంజను పట్టాలమీద వేగముగా వచ్చుచున్నది. ఆ పట్టాలమీద ప్రాకుచున్న చిన్న పురుగొకటి ప్రక్కకు తప్పుకొని ప్రాణము రక్షించుకొనినది. క్షణములో నలిగిచచ్చిపోగల ఈ పురుగు మనకెంత నిర్లక్ష్యముగా కనబడుచున్నను ఇది జీవముగలవస్తువు ఇంజను ఎంత పెద్దదిగానున్నను, ఎంత ఘనముగా తోచున్నను అది జీవములేనియంత్రమే. ఒకటి ప్రాణముగలది. రెండవది జడ పదార్థము. దానిశక్తి, బలము, వేగము నిర్జీవయంత్రమునకు గలవియే. అది సాధనముమాత్రమే. పట్టాలమీద ప్రాకిపోవుచున్న పురుగు ఇంజనుస్పర్శమాత్రముచేతనే నశించిపోగలదు. అయినను దానిలోని ఇంజనుతో పోల్చిచూచినయెడల అది మహత్తరమైనదే యని తెల్లమగును. అది యనంతములోని చిన్నభాగము; కనుక శక్తిమంతమైన యంత్రముకంటెగూడ గొప్పదే. ఎందుచేత? జీవమునకు నిర్జీవమునకు గలభేదమెట్లు తెలిసికొనవచ్చును? యంత్రము, తన్ను చేసినవాడు ఏ పనులనుద్దేశించెనో వానినే. అంధప్రాయముగా చేయును. దాని చలనములు ప్రాణికిగల చలనములవంటివికావు. ప్రాణముగలవస్తువునకు ప్రాణములేనివస్తువునకు గలభేదము నెట్లు నిర్ణయించవచ్చును? ప్రాణికి స్వాతంత్ర్యమున్నది, తెలివియున్నది; జడపదార్థములోని సమస్తము బద్ధమే; తెలివిలేదుగనుక స్వాతంత్ర్యముగూడ సాధ్యముగాదు. యంత్రములనుండి మనలను వేఱు పఱచుచున్న మనము పడుచున్న శ్రమయంతయు ఈ స్వాతంత్ర్యము కొఱకే. ఇతోధికమైన స్వాతంత్ర్యమే మన సమస్త ప్రయత్నములకు లక్ష్యము. పూర్ణస్వాతంత్ర్యములోనే పరిపూర్ణత్వమున్నది. మనకు తెలిసినను, తెలియకున్నను స్వాతంత్ర్యపిపాసయే సకలవిధములయిన ఉపాసనలలోను విరాజిల్లుచున్నది.



శ్రీ వివేకానంద స్వామి

లోకములోని ఉపాసనా విధానములన్నిటిని మనము పరిశీలించినచో అనాగరకులు దయ్యములను, పిశాచములను, చనిపోయిన తాతముత్తాతల ఆత్మలను, సర్పములను, తమతమ తెగలకు సంబంధించిన గణదేవతలను, గతించినవారిని పూజించినట్లు తెలియగలదు. వారిట్లు చేయుటకు కారణమేమి? ఏదో, తమకు తెలియనివిధమువలన, వారు తమకంటె గొప్పవారని, శక్తిగలవారని, తమ స్వాతంత్ర్యము నరికట్టువారని, వారు భావింతురు. అందువలన ఉపాస్యదేవతలను సంతృప్తి పఱచుటకు, తమ్ము హింసించకుండ చేయుటకు, అనగా—అధిక స్వాతంత్ర్యము పొందుటకు ప్రయత్నింతురు; వారి యనుగ్రహము పొందుటకు, స్వయంకృషిచేత సాధించవలసినది వారి ప్రసాదముగా పొందుటకు ఆశపడుదురు.

మొత్తముమీద దీనివలన ఏదోమహిమ జరగగలదని లోకమాశించుచున్నట్లు తోచగలదు. ఇది మనలను విడిచిపెట్టెడి యాశ కాదు. మన మెంతగా కాదనుకొనినను మహిమలకొఱకు, అభూతసంఘటనలకొఱకు ఆరాటపడుచున్నాము. జీవితమున కర్థము, జీవిత రహస్యము తెలిసికొనుటకు నిరంతరము జిజ్ఞాస చేయునదియే కదా మనస్సు? సంస్కారవిహీనులుమాత్రమే వానిని కోరుచున్నారని మనము చెప్పుకొనవచ్చును. వారుమాత్ర మేల కోరుకొనవలెనను నదే ప్రశ్న. ఆ ప్రశ్న ఉండనేయున్నది. దానికేమి హేతువు? యూదులు మహిమకొఱకెదురు చూచుచుండిరి. ఇన్నివేల సంవత్సరములుగా సమస్తప్రపంచము ఏదోమహిమకొఱ కాశపడుచునే యున్నది. సర్వజనులలోను ఒకవిధమైన అసంతృప్తియున్నది. మన మొక ఆదర్శమును ప్రతిపాదింతుము. దానిని సగమైనను సమాపించితిమో లేదో, క్రొత్త ఆశయమును లక్ష్యమున నుంచుకొందుము. ఒక లక్ష్యమును చేరుకొనుటకు ఎంతో శ్రమపడుదుము. తరువాత అది మనకు పనికిరాదని గ్రహింతుము. ఈ విధమైన అసంతృప్తి మనకు మాటిమాటికి కలుగుచున్నది. అసంతృప్తియే యుండదగనిదయినచో మనస్సులో నేమియున్నది? అందఱిలోనుగల ఈ యసంతృప్తికి యర్థ

మేమి? మానవ జీవితలక్ష్యము స్వాతంత్ర్యమగుటయే అందుకు కారణము. అతడు సర్వదా దాని నన్వేషించును; అతని జీవిత మంతయు దానికొఱకు జరుగు పోరాటమే. శిశువు జన్మింపగనే శాసనమును ధిక్కరించును.

పుట్టుటతోడనే శిశువు యేడ్చును; తానే బంధములో పడినదో దానిని నిరసించుచు పెట్టు కేకయే ఏడ్పు. స్వాతంత్ర్యకాంక్ష, సర్వ తంత్ర స్వతంత్రుడయిన పురుషుడు కలడను భావమును కలిగించును. ఈశ్వరభావము మానవప్రకృతి యందు అంతర్నిహితమైన ప్రధాన లక్షణము. వేదాంతమునందు ప్రతిపాదింపబడు సచ్చిదానంద పురుషుడు భగవంతుని మానసబుద్ధికి సాధ్యమైన పరమభావము. అది జ్ఞానసారము, ఆనందరసామృతము దాని స్వరూపలక్షణము. చిర కాలముగా ఆ యంతర్వాణిని మన మడచివేయుచు, ఒక క్రమము ననుసరింపజూచుచున్నాము. కాని, మానవప్రకృతి ప్రకృతి శాసనము లను ధిక్కరించు స్వభావముగలది. మనము స్పష్టముగా గ్రహింప నేరకపోవచ్చు గాని మనకు తెలియకుండగానే మానవప్రకృతికి, దివ్యప్రకృతికి, అల్పమనస్సుకు ఉదాత్తమైన మనస్సుకు పోరు జరుగు చునేయున్నది. ఈ పోరాటములో "వ్యక్తిత్వము" అని మనమనెడి ప్రత్యేక జీవితమును కాపాడుటకు ప్రయత్నము జరుగుచున్నది.

మనము పుట్టుకతోనే తిరుగుబాటుదారులమను వైచిత్ర్య మును నరకములుకూడ ప్రతిఘటించుచున్నవి; ప్రాణమునకు ప్రథమ లక్షణము, జీవము కలుగుటతోడనే—మనము ఎలుగెత్తి "మాకు శాసనమువలదు" అని కేకవేయుదుము. శాసనములకు లోబడి యున్నంతకాలము మనము యంత్రములవంటి వారమే. విశ్వము ముందుకు సాగిపోవును. మనము దానిని భేదింపలేము. శాసనములు శాసనములుగా మానవప్రకృతియగును. జీవితము ఉన్నతదశనందు కొనుచున్నదనుటకు మొదటి సూచనగా మనలో జరుగుచున్న ఈ పోరాటమును గుర్తింతుము; ప్రకృతి బంధమును ఛేదించి స్వతంత్రు

లము కాగోరుదుము. "స్వాతంత్ర్యమా! ఓ స్వాతంత్ర్యమా! స్వాతంత్ర్యమా! ఓ స్వాతంత్ర్యమా!" అనునదే ఆత్మ చేయుచుండు గానము. బానిసతనము; పాపము! ప్రకృతికి బద్ధమైయుండుటే దాని విధిగా తోచుచున్నది.

సర్పపూజ, దయ్యముల పూజ, పిశాచముల పూజ ఎందుకేర్పడి నవి? మహిమలను పొందుటకీ విభిన్న మతసిద్ధాంతములు, విధాన ములు ఏల ఏర్పాటుకావలెను? దేనియందో ప్రాణమున్నదని, జీవి కలదని అనుటలో అర్థమేమి కలదు? ఈ యన్వేషణ అంతటిలో, జీవితము నర్థముచేసికొనుటకు, అస్తిత్వమును వ్యాఖ్యానించుటకు చేయు ప్రయత్నములో ఏదో అర్థముండి యుండవలెను. అదంతయు అర్థవిహీనము, నిష్ప్రయోజనముగాదు. స్వతంత్రుడగుటకు మానవుడు నిరంతరము చేయు ప్రయత్నమే యది. సైన్సు అని మన మనెడి విజ్ఞానము వేలకొలది సంవత్సరములుగా స్వాతంత్ర్యమును సాధించుటకు కఠినప్రయత్నము చేయుచున్నది. మానవకోటి స్వాతంత్ర్యమును కోరుచున్నది. అయినను ప్రకృతియందు స్వాతంత్ర్యము కనపడుట లేదు. అదియంతయు శాసనబద్ధము కాని, పోరు సాగుచునేయున్నది. సూర్యమండలముచుండి అణువులవఱకు ప్రకృతియంతయు శాసనమున కధీనమైయున్నది. మానవునకు సహితము స్వాతంత్ర్యము లేదు. కాని, మన మా విషయము నమ్మ జాలకున్నాము. మొదటినుండియు మనము శాసనములనుగుఱించి తెలిసికొనుచునే యున్నాము. కాని, మానవుడు శాసనమున కధీను డని నమ్మజాలకున్నాము; నమ్మబోముకూడ. "స్వాతంత్ర్యమా? ఓ స్వాతంత్రమా?" అని నిరంతరము ఆత్మ ఘోషించుచున్నది. సంపూర్ణ స్వతంత్రుడగు భగవంతునిగుఱించి భావన చేయుచున్న మానవుడు శాశ్వతముగా బంధములో విశ్రాంతి పొందజాలడు. అతడు పైకి పోవుచుండవలసినదే. ఈ పోరాటము తనకొఱకే కానిచో పోరాటము మిక్కిమీఱిన ప్రయాసగా నతనికి తోచగలదు. మానవుడు తనలో తా నిట్లనుకొనును: "నేను పుట్టుకతో బానిసను, నేను

బద్ధుడను. అయిన నేమి? ప్రకృతి బద్ధుడుకాని పురుషుడొకడు కలడు. అతడు ముక్తుడు, ప్రకృతికి యజమాని.''

బంధమునుగుఱించిన భావము ఎంతముఖ్యమో, మన తత్త్వములో ఎంత ప్రధానభాగమో, ఈశ్వరభావముకూడ అంత ముఖ్యము, అంత ప్రధానము. ఈ రెండుభావములు స్వాతంత్ర్య పిపాసనుండి ప్రభవించినవే. స్వాతంత్ర్యభావము లేనిదే మొక్కలో నయినను జీవముండజాలదు. మొక్కలోగాని, పురుగులోగాని జీవము వ్యక్తిత్వమువఱకు వృద్ధిపొందవలెను. ఆ పని యచేతనముగా జరుగుచున్నది. మొక్క, ప్రకృతిని నిలుపుటకుకాక, వైవిధ్యమును, సూత్రమును, రూపమును కాపాడుటకు బ్రతుకుచున్నది. మన పురోగతిని అడుగడుగున ప్రకృతియే నియమించుచున్నదను భావము స్వాతంత్ర్యభావమును కొట్టివేయును. భౌతికప్రపంచమును గుఱించిన భావముతోపాటు స్వాతంత్ర్యమును గుఱించిన భావము వృద్ధిపొందుచున్నది. అయినను సంఘర్షణ జరుగుచునేయున్నది. మతసిద్ధాంతములమధ్య, వివిధమతశాఖలమధ్య జరుగుచున్న సంఘర్షణలను గుఱించి మనము వినుచున్నాము. అయినను మతసిద్ధాంతములు, మతశాఖలు అవసరమే, న్యాయమే. అవి యుండవలసినవే. ఈ సూత్రము దీర్ఘమగుచున్నది. కనుక సంఘర్షణ ఎక్కువగుట సహజము. మనమందఱము ఒకే లక్ష్యమును సాధించుటకు ప్రయత్నించుచున్న విషయము గ్రహించినచో కలహముల కవకాశము లేదు.

మనము దేవుడని భావించునది ప్రకృతియజమాని. స్వాతంత్ర్య స్వరూపము. అతడు కాడని మీరనలేరు. స్వాతంత్ర్యమును గుఱించిన భావము వినా, మీరు చరించలేరు, వసించలేరు కనుక మీరతనిని నిరాకరింపజాలరు. మీరు స్వతంత్రు లనుకొనకపోయినచో, ఇచటికి రాగలిగెడివారేనా? స్వతంత్రులమగుటకు నిరంతరము సాగుచున్న ఈ ప్రయత్నమునకు జీవశాస్త్రజ్ఞుడేదో కారణము చెప్పగలడు, చెప్పును. అదంతయు ఒప్పుకొందము ; అయినను స్వాతంత్ర్య భావము ఉండనేయుండును. ప్రకృతికి లోబడియున్నామనుట, దాని

నతిక్రమింపజాలమనుట ఎంత నిజమో స్వాతంత్ర్యతృష్ణకూడ అంత నిజము.

బంధము, ముక్తి; వెలుగు, నీడ; పుణ్యము, పాపము; ఉండితీఱవలసినదే. బంధము, దాని మఱుగుననున్న స్వాతంత్ర్యమును స్ఫురింపజేయును. ఒకటి నిజమే అయిన, రెండవదికూడ అంతటి నిజమే. స్వాతంత్ర్యభావముండి తీఱవలెను. అనాగరకునిలోగల బంధమును గుఱించిన భావ మతని స్వాతంత్ర్య సాధనే అని మన మిప్పుడు గ్రహింపలేకున్నను స్వాతంత్ర్యమునుగుఱించిన భావ మతనియందున్నది. అనాగరక, ఆటవికుని ప్రకృతి పశుప్రకృతి కంటె కొంచెమే అధికమైనది. కనుక పాపము, ఆ పరిశుద్ధతవలన కలుగగల బంధమునుగుఱించిన అతని జ్ఞానము మిక్కిలి పరిమితమైనది. అతడు పోరాటము సాగించునది తన్ను బంధించుచున్న భౌతిక ప్రకృతితో భౌతికమైన అసంతృప్తితో; తక్కువస్థాయికి చెందిన బంధమును గుఱించిన ఈ యెఱుకనుండియే మానసిక, నైతిక బంధమును గుఱించిన ఎఱుక, ఆత్మస్వాతంత్ర్యపిపాస వికసించును. ఇక్కడ దివ్యత్వము అవిద్యయను యవనికద్వారా మసకమసకగా ప్రకాశించుచున్నట్లు మనము గుర్తింపగలము. ప్రారంభమున తెర దళసరిగా నుండవచ్చును, కాంతి దాదాపు పూర్తిగా మఱుగుపడియుండవచ్చును. కాని, అది యచ్చట ఉన్నమాట తథ్యము. ఎంతమాత్రము క్షీణించక స్వచ్ఛముగానున్నది—అది ప్రసారమగుచున్న స్వాతంత్ర్యాగ్ని, పరిపూర్ణత్వము. దీనిని జగత్పాలకునిగా మానవుడు సంభావించి, సంబోధించును. అదొక్కటి, స్వతంత్రమైనది. అఖిల విశ్వమొక్కటే అనియు, వ్యత్యాసమంతయు తరతమభేదమే అనియు అతనికింకను తెలియదు.

ప్రకృతియంతయు ఈశ్వరుని యుపాసనే. ఎక్కడ ప్రాణమున్నదో అక్కడ స్వాతంత్ర్యముకొఱకన్వేషణకలదు. స్వాతంత్ర్యమును భగవంతుడును ఒక్కటే. ఈ స్వాతంత్ర్యము అనివార్యముగా అఖిలప్రకృతిపై మనకాధిపత్యమిచ్చును. ఇది జ్ఞానము వినా అసంభ

వము. మనమెక్కువగా జ్ఞానము పొందుచున్నయెడల, మనకు ప్రకృతిపై ఆధిపత్యమెక్కువగా కలుగుచుండును. ఈ యాధిపత్యమే మనలను శక్తిమంతులనుగా జేయుచున్నది. ఎవరయిన సర్వతంత్ర స్వతంత్రుడయి, ప్రకృతిపై అధికారము గలిగియున్నచో, అతనికి ప్రకృతినిగుఱించి నిరుపమమైన జ్ఞానముగలదని గ్రహింపవల్లును. అతడు సర్వవ్యాపి, సర్వజ్ఞుడు. స్వాతంత్ర్యము ఈ లక్షణములతో కలసియే యుండవలెను. ఈ లక్షణములన్నియు గలవాడే ప్రకృతికతీతుడు.

ఆనందము, సంపూర్ణ స్వాతంత్ర్యమునుండి యుదయించు శాశ్వత శాంతి, మహోత్కృష్టమైన మతభావము. ఇది వేదాంతము నందు దేవునిగుఱించిన సకలభావములలో గలదు—అది పరమ స్వాతంత్రమైన అస్తిత్వము; అది దేశచేతను పరిమితముకాదు. దానికి మార్పులేదు. అందు ప్రకృతిలేదు. అతనిలో నేదియు మార్పు కలిగింపజాలదు. ఇట్టి స్వాతంత్ర్యము మీలోను, నాలోను గలదు. అదే నిజమైన స్వాతంత్ర్యము.

దేవుడు, నిర్వికారమై, గంభీరమైన తన ఆత్మయందు సుప్రతిష్ఠితుడయి యున్నాడు. మీరు, నేను అతనితో తాదాత్మ్యము పొందుటకు ప్రయత్నింతుము. కాని, మనము ప్రకృతి యందు, జీవితములోని యల్పవిషయములమీద, ధనము, కీర్తి, మానవప్రేమ, బంధముకలిగించు ప్రకృతిలోని మార్పులందు పాదు కొని యున్నాము. ప్రకృతి ప్రకాశించునప్పుడు దేని నాధారము చేసి కొని, దేనిమీద ప్రకాశించుచున్నది? దేవునిపైన, సూర్యుని పైన, చంద్రునిపైన, నక్షత్రములపైనగాదు. సూర్యుని వెలుతురు గాని, మన చేతనయందుగాని, ఎక్కడ ఏదిప్రకాశించినను, అదెల్ల అతడే. అతని ప్రకాశము ననుసరించియే సమస్తము ప్రకాశించును.

ఇట్టి భగవంతుడు స్వప్రకాశుడని, నిర్గుణుడని, సర్వజ్ఞుడని, ప్రకృతిజ్ఞాతయని, అధిపతియని, సర్వమునకు ప్రభువని మనము

గ్రహించితిమి. సకలపూజలకు లక్ష్యమతడే. అతని కనుగుణముగానే పూజ జరుగుచున్నది. ఈ విషయము మనము గ్రహింప గలిగియుండ వచ్చును, గ్రహింపలేకపోవచ్చును. నేను మఱొక అడుగు ముందుకు పోయెదను. మనము దేనినిగూర్చి అద్భుతపడుదుమో, దేనిని మనము పాపమని పలుకుదుమో అదియును అతని పూజయే. ఇది కూడ స్వాతంత్ర్యములో భాగమే. నేనింకను దారుణమైనమాట చెప్పెదను. మీరు పాపకార్యము చేయుచున్నప్పుడు దానివెనుక నున్న ప్రేరణకూడ స్వాతంత్ర్యతృష్ణే. అది యపసవ్యమార్గమున పడి యుండవచ్చును; తప్పుగా నడిపింపబడి యుండవచ్చును. కాని, అది యక్కడ ఉన్నమాట నిజము, వెనుకనుండి స్వాతంత్ర్యము ప్రోత్స హించనిదే జీవితమే అసంభవము; ఏవిధమైన ప్రేరణయు ఉండ జాలదు. స్వాతంత్ర్యము శాసించుటవలననే జగత్తులో చలనము కలుగుచున్నది. విశ్వహృదయములో ఐక్యములేనిదే మనము నానా త్వము నర్థముచేసికొనజాలము. జగత్ప్రభువును గుఱించి ఉపనిషత్తు లలో గల భావమిది. కొన్ని తావులందు ఇంతకంటెను ఉత్కృష్ట మైనభావము మనకు లక్ష్యముగా సూచింపబడినది. దాని ఔన్నత్య మునకు మనము మొదట భయవిభ్రాంతుల మగుదుముకూడ— తాత్త్వికదృష్టితో పరిశీలించిన మనమును అదియు నొక్కటే. సీతా కోకచిలుక రెక్కలలోని రంగులు, గులాబిమొగ్గ వికాసము ఎవరో, అతడు మొక్కలోను, సీతాకోకచిలుకలోను గలశక్తియే. మనకు జీవమిచ్చుచున్నవాడు మనలో నున్నశక్తియే. అతని యగ్నినుండియే జీవ ముద్భవించును; ఘోరమృత్యువు సహిత మతనిశక్తియే. అతని ఛాయమృత్యువు; అమృత జీవముకూడ అతని ఛాయయే. మఱి కొంత ఉన్నతముగా భావింపుడు. వేటాడబడుచున్న కుందేళ్లవలె మనమందఱము భయంకరమైన దానినుండి యెట్లు పాఱిపోవు చున్నామో, వానివలెనే మనము తలలు దాచుకొని సురక్షితముగా నున్నా మనుకొనుచున్నామో గమనింపుడు భీషణమైన దాని నుండి సమస్తప్రపంచము ఏవిధముగా పాఱిపోవుచున్నదో చూడుడు.

ఒకనాడు నేను కాశీపట్టణవీధిలో పోవుచుంటిని. ఒక తావున ఒక ప్రక్క పెద్ద చెఱువున్నది; రెండవప్రక్క ఎత్తైన గోడయున్నది. ఆప్రాంతములో కోతులెక్కువ. కాశిలోని కోతులు చాలా పెద్దవి. ఒక్కొక్కప్పుడవి ముక్కోపితనముతో ప్రవర్తించును. నన్నావీథిలో పోనీయకూడదని అవి పట్టుపట్టినవి. నేను నడచుచుండగా అవి నాదగ్గఱకువచ్చి అఱచి, అఘాయిత్యముచేసి, నా కాళ్లను గట్టిగా పట్టివేసినవి. నేను వాటి పట్టును విడిపించుకొని పరుగెత్త సాగితిని. నేను వేగముగా పరుగెత్తినకొలది అవి మఱింత వేగముగా నావెంటబడినవి; నన్ను కఱవ నారంభించినవి. వాటినుండి తప్పించుకొనిపోవుట నా కసాధ్యముగా తోచినది. సరిగా ఆసమయమున ఏవరో ఒక వ్యక్తి కనబడి, "వానినెదుర్కొనుడు" అని హెచ్చరిక చేసెను. నేనంతట వాని దిక్కుగా తిరిగితిని; వానినెదిరించితిని. అవి వెనుకకు మరలిపోయెను. ఇది జీవితమంతకు నుపకరించు గుణపాఠము. భీషణమైనదాని దిక్కుగా నిలబడి, ధైర్యముతో ప్రతిఘటింపుడు. ఆ మర్కటముల వలె జీవితమందలి కష్టములు తొలగిపోవును. మన మేనాటికైనను స్వతంత్రులము కాగోరితిమేని, ఆ స్వాతంత్ర్యమెన్నడును పలాయనమువలన సాధ్యముకాదు. ప్రకృతిపై విజయము సాధించుటవలననే సాధ్యమగును. పిరికిపందలు విజయములను పొందలేరు. భయము, కష్టములు, అజ్ఞానము తొలగిపోవలెననిన మనము ధీరులమై వానితో పోరాడవలసినదే.

మృత్యువేమి? భయమేమి? వానిలో నీకు జగదీశ్వరుని ముఖము కనబడుటలేదా? పాపమునుండి, భయమునుండి, దుఃఖమునుండి నీవు పాఱిపోదలచితివా, అవి నిన్ను వెన్నాడుట తథ్యము. వానిని ప్రతిఘటింపుము. అవి పలాయనమగును. అందఱు సుఖభోగములను పూజింతురు. బాధాకరమైన దాని నుపాసించువారు మిక్కిలి తక్కువ. ఈ రెంటిని అతిక్రమించుటే స్వాతంత్ర్యములోని విషయము. ఈ ద్వారముగుండా పోయినగాని మానవుడు స్వతంత్రుడు కానేరడు. మనమందఱము వీని నెదుర్కొనవలసినదే. సర్వేశ్వరుని ఉపా

సించుటకు మన మాయ త్రిపుటము. కాని, దేహ మాటంకముగా నిలుచును. అతనికిని, మనకును మధ్య ప్రకృతివచ్చి మనదృష్టిని కప్పివేయును. పిడుగులు పడుచున్నప్పుడు, అవమానము మార్కొనునప్పుడు దుఃఖము కలుగునప్పుడు, పాపము ప్రాబల్యము వహించునప్పుడు సహితము మన మాతనిని ఎట్లు ప్రేమించి, ఉపాసింపవలెనో నేర్చుకొనవలెను. భగవంతుడు సకలకళ్యాణగుణ సమన్వితుడని ప్రపంచమందు అంతటను బోధింపబడుచున్నది. నేను పుణ్యాపాపములను సూచించు దేవునిగుఱించి బోధించుచున్నాను. ధైర్యమున్నచో అతనిని ఉపాసింపుడు— అదే ముక్తికి మార్గము; అప్పుడే ఏకత్వమునుండి ప్రభవించగల పరమసత్యము మనకు సాక్షాత్కరించును. అప్పుడే ఒకరికంటె మఱొక రెక్కువ అనెడి భావము తొలగిపోవును. స్వాతంత్ర్యమను శాసనమును మన మెంతెంతగా సమీపించిన, మన మంతంతగా ఈశ్వరాధీనులమగుచుందుము; అంతట కష్టములు మాయమగును. అప్పుడు మనము స్వర్గద్వారమునకు నరకద్వారమునకు భేదమును గుర్తింపము. మానవులలో సహితమును భేదమును పాటింపము. "ఈ జగత్తులోని ప్రతిజీవికంటె నే నధికుడన"ని పలుకము. విశ్వములో పరాత్పరుని తప్ప మఱేమి చూడజాలనంతవఱకు నీ యనర్థములు మనలను విడిచిపెట్టవు; మన మీా భేదములను మన్నించుచునే యుందుము. ఎందుకనగా జగదీశ్వరునియందే— ఆత్మవస్తువునందే మనమందఱము ఒక్కటి; సర్వత్ర మనము ఈశ్వరుని దర్శించగలుగువఱకు మన కీయైక్యము లభించదు.

అందమైన రెండుపక్షులు— ఒకదానినివిడిచి రెండవది ఉండలేనంతటి సన్నిహితమైనవి— ఒకే చెట్టుమీాదను ఒకటిపైన, రెండవది క్రిందఉన్నవి. దిగువనున్న పక్షి వృక్షఫలములు తీయనివి, చేదువి తినుచుండెను. ఒకక్షణములో మధురఫలమును, మఱొక క్షణములో చేదుఫలము తినసాగెను. చేదుపండు తినినప్పుడు అది యేడ్చెను. కొంతసేపటికి మఱొకటి తినెను. అది మఱింత చేదుగానుండెను. అప్పుడది చెట్టుపైకి చూచెను. వృక్షాగ్రము మీాదనున్న

పక్షి తీయనిపండ్లు తినలేదు; చేదుపండ్లు తినలేదు. అది నిశ్చింతగా, శాంతితో తన మహిమయందే ప్రతిష్ఠితమై పరిఢవిల్లుచున్నది. తరువాత దిగువనున్న పక్షి మఱపునపడి, మరల తీయనిపండ్లు, చేదుపండ్లు తిన మొదలిడెను. చివరకొక కాలకూట విషమువంటి పండు తినెను. అప్పుడది భక్షించుట నిలిపివేసి క్రమ్మర వృక్షాగ్రముమీద పక్షిరాజమును వీక్షించెను. అది పైనున్న పక్షిని కొంచెము కొంచెముగా సమీపింపసాగెను; మఱింత దగ్గఱకు వచ్చినప్పుడు దానిపై కాంతికిరణములు పడగా వెలుగు దాని నావరించెను. అంతట నది తాను పక్షిరాజముగా మాఱిపోయినట్లు గుర్తించెను. నిశ్చలత, గాంభీర్యము, స్వాతంత్ర్యము దాని లక్షణములయినవి. చెట్టుమీద నింతవఱకు ఉన్న పక్షి ఒక్కటే అని యది తెలిసికొనెను. దిగువనున్న పక్షి పైనున్న పక్షి ప్రతిబింబమే. నిజమునకు మనమును పరాత్పరుడును ఒక్కటే. ప్రతిబింబములవలన మన మనేకముగా కనబడునట్లు చేయుచున్నది. ఒక్క సూర్యుడు లక్షలకొలది మంచుబిందువుల మీద ప్రసరించగా అనేక చిన్నసూర్యులు కనబడును. స్వతస్సిద్ధమైన మన దివ్యప్రకృతితో మన మేకాత్మత ననుభవించవలె నన్నచో ఈ ప్రతిబింబములు పోవలెను. మన సంతృప్తికి ఈ విశ్వము సహితము ఎన్నడును పరిమితికాదు. అందుచేతనే లుబ్ధుడు అధికాధికముగా డబ్బు కూడబెట్టును. దొంగ కొల్లగొట్టును; పాపి పాపములు చేయుచుండును. ఆ కారణముచేతనే మీరు తత్త్వరహస్యము తెలిసికొనుచున్నారు అందఱి లక్ష్య మొక్కటే. పరిపూర్ణమైన స్వాతంత్ర్య స్థితిని పొందుట దక్క జీవితమునకు వేఱొక లక్ష్యము లేదు. తెలిసియో, తెలియకయో మన మందఱము పరిపూర్ణత్వము కొఱకే ప్రయత్నము చేయుచున్నాము. ప్రతిజీవియు ఆ స్థితిని పొంద వలసినదే.

పాపకార్యములు చేయుచు, దుఃఖపడుచున్నవాడు, నరకమునకు పోవుమార్గమును కోరుకొనువాడుగూడ ఆ స్థితి పొందగలడు. అయితే చాల ఆలస్యమగును. మన మతనిని రక్షింపలేము. దారుణ

మైన కష్టము లతనిని ఈశ్వరాభిముఖుని చేయును. పుణ్యము, పరిశుద్ధత, స్వార్థరాహిత్యము, ఆధ్యాత్మికత — ఈ మార్గము చిట్టచివర దోచును. ఇతరులు తెలియకుండా చేయుచున్నది మనము ప్రయత్నపూర్వకముగ జేయుచున్నాము. ఈ భావమునే సెయింట్ పాల్ యిట్లు తెలియజేసినాడు. "మీరు తెలియకుండ పూజించు దేవుని నేను స్పష్టముగా ప్రకటించుచున్నాను." ఇది ప్రపంచమంతయు నేర్చుకొనవలసిన పాఠము. ఈ యొక్క జీవితలక్ష్యమును సాధించుటకు సహాయపడుటకు గానిచో, ఈ తత్త్వశాస్త్రములు ప్రకృతిని గుఱించిన సిద్ధాంతములు మఱెందుకు? సర్వము ఒక్కటేయను ఎఱుక కలిగించు చైతన్యమును పొందుదుముగాక. మానవుడు తన్ను తాను ప్రతివస్తువునందు దర్శించుగాక. దేవునిగుఱించి సంకుచిత భావములను బోధించు మతసిద్ధాంతములను, మత శాఖలను మన మిక ఉపాసింపకుందుముగాక. జగత్తులోని ప్రతివస్తువునందు మనమతని సిదర్శింతుముగాక. మీరు బ్రహ్మజ్ఞానులయినచో మీ హృదయములో ఎట్టి ఉపాసనాభావము కలదో సర్వత్ర మీరు దానినే దర్శింతురు.

ప్రప్రథమముగా ఈ సంకుచితభావములను విసర్జింపుడు. ప్రతి మానవునియందు దేవుని దర్శింపుడు—అఖిల హస్తములతో పని చేయుచు, అఖిల చరణములతో నడచుచు, ప్రతినోటితో భుజింపుచున్న దేవుని దర్శింపుడు. ప్రతి జీవియందు అతడు నివసించును; అన్ని మనస్సులతో నతడు యోచించును. అతడు స్వప్రకాశుడు. అతడు మనకు మనకంటె సమీపస్థుడు. దీనిని సాధించుటే మతము, విశ్వాసము. మనకట్టి విశ్వాసమును భగవాను డనుగ్రహించుగాక! మన మట్టి అద్వైతానుభూతి పొందునప్పుడు అమృతులమగుదుము. మనము విశ్వముతో ఒక్కటే కనుక భౌతికముగా గూడ అమృతులమే. విశ్వమంతటికి జీవము పోయునదొక్కటి యున్నంతకాలము నేను దానియందు వసింతును. నేనీ పరిమితమైన బద్ధవ్యక్తినిగాను; నేను విశ్వపురుషుడను. గతకాలములోని పుత్త్రులందఱిలోని ప్రాణము నేనే. బుద్ధునిలోను, జీసస్సులోను, మహమ్మదులోను ప్రకాశించిన ఆత్మను నేనే. సకల బోధకులలోని ఆత్మను నేనే. ప్రజలను కొల్లగొట్టిన

దొంగలందఱు నేనే. ఉరితీయబడిన హంతకులందఱు నేనే. నేను విశ్వాత్మను. ఇక లెండు, ఇదే పరమోత్కృష్టమైన ఉపాసన. మీరు విశ్వమంతటితో ఒక్కటి. అదే నిజమైన నమ్రత—చేతులను కూడ కాళ్లుగా చేసికొని ప్రాకుచు, పాపుల మనుకొనుట నమ్రత కాదు. భేదభావమును కలిగించు తెర ఎప్పుడు చిరిగిపోవునో అప్పుడు క్రమపరిణామము నందలి పరాకాష్ఠదశ నందుకొంటిమని గ్రహింతుము గాక. అద్వైతమే పరమోత్కృష్టమైన సిద్ధాంతము. నేను ఫలాన... ఫలాన—ఇది చాలా సంకుచితభావము. నిజమైన ''నేను''ను గుఱించిన విషయము కాదది. నేను విశ్వపురుషుడను; ఈ భావమును ధారణచేసి పరాత్పరుని పరమోత్కృష్టమైన విధముగా ఉపాసింపుడు. భగవంతు డాత్మస్వరూపుడు. అతని నాత్మచేత, సత్యముచేత ఉపాసింపవలెను. క్రిందిస్థాయికి చెందిన ఉపాసనా విధానములద్వారా మానవుని ప్రాపంచిక భావములు మార్పుచెంది ఆధ్యాత్మికోపాసన స్థాయినందుకొనును. కట్టకడపట అనంతుడయిన ఒక్క విశ్వపురుషుడు ఆత్మయందు ఆత్మద్వారా ఉపాసింపబడును. పరిమితమైనది భౌతికమైనది; ఆత్మమాత్రమే యనంతమైనది. భగవంతు డాత్మస్వరూపుడు, అనంతుడు. మానవు డాత్మస్వరూపుడు కనుక అనంతుడు. అనంతుడే అనంతుని యుపాసింపగలడు. మన మనంతుని ఉపాసింతము. అది పరమోత్కృష్టమైన ఆధ్యాత్మికోపాసన. ఈ భావములలోని మహాత్మ్యము ననుభవగతము చేసికొనుట ఎంత కష్టము! నేను సిద్ధాంతము చేయుదును, ప్రసంగింతును, తత్త్వమీమాంస చేయుదును, మఱుక్షణమే ఏదో నాకు ప్రతికూలమగును. అప్రయత్నముగా నేనే నాగ్రహాపరవశుడ నగుదును. ఇంతటి జగత్తులో సంకుచితమైన ఈ ''నేను'' తక్క మఱేమియు లేదనిపించును. ''నేనాత్మను. ఈ యల్పమైన దానివలన నాకు కలుగు నష్టమేమి? నే నాత్మను'' అని భావించుట మఱచిపోదును. ఇదంతయు నా లీలావిలాస మనుసంగతి మఱచిపోదును. నేను దేవుని మఱచిపోదును, నేను స్వతంత్రుడనని మఱచిపోదును.

స్వాతంత్ర్యమును పొందుట కనుసరించదగు పథము దుర్గమము, సుదీర్ఘము. ఇది అసిధారావ్రతము. ఈ మాట ఋషీశ్వరులు పునఃపునః ఉద్ఘాటించిరి. అయినను దౌర్బల్యము, పరాజయము మిమ్ము వశముచేసికొననీయనలదు. "లెండు! మేల్కొనుడు! గమ్యము చేరువఱకు ఆగవద్దు" అని ఉపనిషత్తులు ప్రబోధము చేయుచున్నవి. అట్టి దీక్షతో మన మీ మార్గమును దాటగలము; ఇది అసిధారావ్రతమైనను, దుర్గమమైన దీర్ఘపథమైనను సరే మానవుడు దేవతలకు, పిశాచములకు నధిపతియగును. మన కష్టములకు నిందించుకొనవలసిది మనలనేగాని మఱెవ్వరినికాదు. మానవుడమృతము కొఱకన్వేషింగా అతనికి దారుణ విషపాత్ర లభించునా? అమృతము సిద్ధముగానున్నది. దానికొఱకు శ్రమపడి సాధనచేయు ప్రతివానికి అది లభించగలదు. జగత్ప్రభువే యిట్లు ఉద్బోధించుచున్నాడు: "ఈ సకలమార్గములను, కలహములను కట్టిపెట్టుడు. నన్నే శరణుపొందుడు. నేను నిన్నావలి తీరమునకు గొనిపోదును. భయపడకుడు." ఈ వాణి లోకములోని అన్ని ధర్మగ్రంథముల నుండి మనకు వినబడుచున్నది. "నీ సంకల్పము స్వర్గములో వలెనే పృథివిమీదకూడ నెఱవేఱుగాక." ఏలయనగా, "రాజ్యము, శక్తి, మహిమ నీయవి" అని మనము ప్రార్థించవలెననికూడ ఆ వాణియే మనకు బోధించుచున్నది. ఇదియంతయు కష్టమైనపనియే, చాల కష్టము. నాలోనే నిట్లనుకొందును. "హే! ప్రభూ! ఈ క్షణమే నేను నిన్ను శరణువేడు చున్నాను. నీ ప్రేమకొఱకు నేను సర్వమును త్యజించుచున్నాను. నీ వేదికమీద ఉత్కృష్టమైన సమస్తమును, సర్వపుణ్యమును సమర్పించుచున్నాను. నా పాపములు, నా దుఃఖములు, నా చేష్టలు, నా మంచి చెడ్డలు నీకు సమర్పించుచున్నాను. నీవు వాటిని పరిగ్రహింతువా? నే నెన్నటికి విస్మరింపను." ఒక క్షణములో, "నీ సంకల్పమే నెఱవేఱుగాక" అందును, మఱుక్షణములో నన్ను పరీక్షించుటకేదో జరుగును. నే నాగ్రహపరవశుడనగుదును. అన్ని మతముల లక్ష్యమొక్కటే; ప్రవక్తల భాష

వేర్వేరు. అసత్యమైన "నేను"ను నశింపజేయుట ; తన్మూలముగా సత్యమైన "నేను", పరాత్పరుని పరిపాలనకు వీలుకలుగజేయుటే సమస్త ప్రయత్నమును. "విశ్వేశ్వరుడను, నీ దేవుడను అయిన నేను అసూయాపరుడనయిన దేవుడను. నేనుండగా నీకిక వే దేవుడు ఉండరాదు. అది హీబ్రూ ధర్మగ్రంథములు పలుకుచున్నవి. దేవుడొక్కడే. "నేను కాదు, నీవే" అని మనము చెప్పవలెను. సర్వేశ్వరుని దక్క తక్కిన సర్వమును మనము పరిత్యజింపవలెను. అతడే పరిపాలన చేయవలెను. ప్రాయశః మనము కఠోరసాధన చేయుచునే యుందుము. మఱుక్షణము జారిపడుచుందుము. మరల మనము జగజ్జననివైపు చేతులు చాచుదుము. మన మేకాకిగా నిలబడలేమని భయపడుచుందుము. జీవిత మనంతము. దాని ఒక ప్రకరణము "నీ సంకల్పమే నెఱవేఱుగాక." అన్ని ప్రకరణములు పూర్తిచేసిన గాని పరిపూర్ణత్వము సిద్ధించదు. "నీ సంకల్పమే నెఱవేఱుగాక." అనుక్షణము ద్రోహచింతగల మనస్సు మెదురుతిరుగుచుండును. అందుచే అహంకారమును జయించుటకా ప్రార్థనను మనము పురశ్చరణ చేయుచుండవలసినదే. ద్రోహిని సేవించుచు, మనము రక్షింపబడజాలము. ద్రోహికితక్క తక్కిన వారందఱకు ముక్తి లభించగలదు. మన మంతరాత్మ ప్రబోధమును నిరాకరించినచో మనము ద్రోహులముగా, మనకే మనము ద్రోహులముగా, జగజ్జనని ఔదార్యమునకు ద్రోహులముగా నిరూపితమగుదుము. ఏమైననుసరే. మన దేహములను, మనస్సులను సర్వేశ్వరుని సంకల్పమున కధీనము చేయవలసినదే. ఒక హిందూతత్త్వవేత్త చెప్పినట్లు, "నీ సంకల్పమే నెఱవేఱుగాక." అని రెండు పర్యాయములు పలుకువాడు పాపముచేసినవాడగును. "నీ సంకల్పమే నెఱవేరుగాక." ఇంతకంటె కావలసినదేమి? ఈ మాట రెండుసార్లు పలుకనేల? మంగళప్రదమైనది మంగళప్రదమైనదే. దానిని మఱొకపర్యాయ మేల పలుకవలెను? "స్వర్గములోవలెనే పృథివిమీదగూడ నీ సంకల్పమే నెఱవేఱుగాక. సర్వదా రాజ్యము, అధికారము, మహిమ నీయవి."

# మతప్రభవము *

వనమందలి తరువులపై—రంగురంగుల దళములతో సమీర తరంగములందు శిరములూపుచు ఊఱుకుచు, త్రుళ్లుచుండు సుందర ప్రసూనములును, వనమార్గములలో మధురగీతము లాలపించుచు, చక్కని రెక్కలతో శోభిల్లుచు కన్నులకు విందొనరించు శకుంత ములును నాకు విశేష పరితోషము గలిగించిన నెచ్చెలులు. నిన్ననివి యుండెను. నేడేమైనవి? ఎందుబోయినవి? నాతో కలసి యాడుకొనిన మిత్రులు, నా కష్టసుఖములలో పాల్గొనిన సఖులు, నాకు సుఖమును వినోదమును చేకూర్చినవారు—వారును బోయిరి—ఎచ్చటికి? శైశవదశలో నాకు సంరక్షణము చేసినవారు, నాకు సర్వవిధముల తోడ్పడవలెనను కోర్కె దక్క వేఱొక్క చింతలేనివారు—వారు కూడ గతించిరి. అప్పటి ప్రతివ్యక్తి అస్తమించెను. ప్రతివస్తువు జారి పోయినది, పోవుచున్నది, పోగలదు. వారు పోవున దెచ్చటికో? సమాధానమునకై యీ ప్రశ్న ఆదిమానవుని మనస్సును కలవరపెట్టి నది. "ఎందువలన? తనకన్నుల యెదుటనే సర్వము శిథిలమై, మట్టిలో కలసిపోవుట లేదా? వా రెక్కడకుపోయిరను ప్రశ్నతో తలబ్రద్దలు చేసికొనవలసిన అవసరమేమి గలిగినది?" అని మీ రడుగవచ్చును.

'ఆదిమానవునకు ప్రతివస్తువు సజీవమే' అను విషయమును ప్రప్రథమముగా మనము గమనింపవలెను. 'మృత్యువనగా శూన్యమై పోవుటే' యని చెప్పినయెడల అతని కర్థముగాదు. జనులు వచ్చు చుందురు, వెడలుచుందురు, మరల వచ్చుచుందురు. ఒకొక్క ప్పుడు వారు వెడలుదురు, తిరిగిరారు. కనుకనే ప్రపంచములోని మిక్కిలి ప్రాచీనభాషలో మృత్యువు ఒక విధమైన నిర్గమనముగా పేర్కొనబడినది. ఇదియే మతమునకు ప్రారంభము. ఆదిమాన

---

* స్వామీజీ తొలిసారిగా అమెరికా పోయినపుడు ఒక పాశ్చాత్య శిష్యు డడిగిన ప్రశ్నలకు ఆయన సమాధానముగా వ్రాసినది.

వుడు తనకు గలిగిన సందేహమును తీర్చుకొనుటకు సర్వత్ర అన్వేషణ చేయుచుండెను. అందఱు పోవుచున్న దెచటికనియే అతని సందేహము.

ప్రభాతసూర్యుడు తన వైభవమును ప్రకటించుకొనుచు నిద్రాణమైన ప్రపంచమునకు వెచ్చదనము, వెలుతురు, సంతోషము నిచ్చుచున్నాడు. నెమ్మదిగా అతడు ప్రయాణము చేయును. కాని, పాపము! అతడును చివరకు అడుగున,—అట్టడుగున పడి యదృశ్యుడగును; మరల మఱునాడే అతడు ప్రత్యక్షమగును—వైభవోపేతముగా, మనోజ్ఞముగా ప్రత్యక్షమగును. పద్మమును చూడుడు —నాగరకతకు జన్మస్థలములయిన నైల్, సింధు, టైగ్రిస్ నదుల తీరములలో పూయు అద్భుతమైన పువ్వు ఉదయము సూర్యకిరణములు సోకుటతో తోడనే వికసించును; సూర్యాస్తమయముతో ముకుళించుకొనును. అవతరించుచు, అస్తమించుచు, మరల ఉత్తేజకరమైన నవజీవముతో నుద్భవించుచున్నవి కొన్ని కలవని గ్రహింతుము. ఆదిమానవుని ప్రశ్నకిది తొలి సమాధానము. ఇందుచేతనే మిక్కిలి ప్రాచీనమతములలో సూర్యుడు, పద్మము ప్రధాన సంకేతము లయినవి. ఈ సంకేతము లేల?—ఏలయన, నిగూఢమైన భావము—అదెట్టిదయినను—వ్యక్తమగునప్పుడు స్థూలమైన అకృతి ధరించి, స్పష్టముగా కనబడక తప్పదు. ఇది యుల్లంఘించుటకు వీలుగాని శాసనము. శూన్యమైపోవుట యనిగాక ఉనికియందే నిర్గమించుట యనుభావమును మార్పుచెందుట యనియే వ్యక్తము చేయవలెను. క్షణకాలము పొందు రూపాంతరమది; తొలుత ఏ వస్తువు యింద్రియములను తట్టి, తరంగ సంచారముగా పోయి మనస్సును స్పృశించి క్రొత్తభావమును స్ఫురింపజేయునో, పిమ్మట ఆ వస్తువునే క్రొత్తభావము విధిగా ఆశ్రయించి, తన్నుతాను వ్యక్తము చేసికొనుటకు పరివ్యాప్తమగుచుండును. ఇందువలననే సూర్యుడు, పద్మము తొలి సంకేతములయినవి.

అంతటను లోతైన గోతులున్నవి.—అవి గాఢాంధకార బంధురమై వెలుపు గొలుపుచుండును; దిగువను సర్వము గాఢ సంతమస్సంభరితమై భీకరముగానుండును; నీటిలో మనము కన్నులు తెఱచినను చూడలేముగదా. వెలుగున్నది. ఊర్ధ్వదిశయందే. అచ్చట అంతయు తేజోమయము. రాత్రులందు సహితము సుందరమైన నక్షత్రములు మన కాతిథ్యమిచ్చుచున్నట్లు కాంతి కిరణములను సారించుచుండును. అయితే నాకు ప్రేమ పాత్రులయిన వారెచ్చటికి పోవుదురు? అంధకారబంధురముగానున్న అధోలోకములకు కాదు. నిరంతరము తేజోమయముగానున్న ఊర్ధ్వలోకములకే పోయియుందురనుట నిస్సంశయము. ఈ భావమును వ్యక్తము చేయుటకు మఱియొక సంకేతము కావలసివచ్చినది. ఇందు కగ్నిహోత్రము తగినది. జ్వలించు శిఖలతో అగ్నిహోత్రము మనల నాశ్చర్యచకితులను చేయును. ముహూర్తకాలములో కీకారణ్యమును సహితము నది భస్మము చేయగలదు. అది మన కన్నము వండ పెట్టును; వెచ్చదనము నిచ్చును; అడవి మృగములను తఱిమి వేయును. అగ్ని మనకు ప్రాణమునిచ్చును, ప్రాణమును రక్షించును. అగ్నిశిఖలు ఊర్ధ్వముఖముగా వ్యాపించునేగాని అధోముఖముగా వ్యాపించవు. గతించినవారిని అగ్ని ఊర్ధ్వలోకములకు—జ్యోతిర్మండలములకు గొనిపోవుచున్నది; మనకును, తేజోమండలములకు పోయినవారికిని సంబంధము కలిగించుచున్నది. "ఓ, అగ్నీ! నీవు తేజోమయపురుషుల దగ్గఱకుబోవు మా దూతవు." అని ప్రాచీనతమమైన మానవ స్తవము ప్రారంభమగును. అందువలన జ్యోతిర్మయపురుషుల కేవేవి యిష్టమైనవని భావింతురో అట్టి ఆహారము, పానీయము మొదలగు వానిని అగ్నిలో పడవేయుదురు. యజ్ఞభావమున కిది ప్రారంభదశ.

ఇప్పటికి మొదటి ప్రశ్నకు సమాధానము దొరకినది; కనీసము ఆదిమానవుల యవసరములు తీఱునంతవఱకయినను సమస్యా పరిష్కారమైనది. తరువాత, "ఈ సమస్తము దేనినుండి వచ్చినది?"

అని మఱొక ప్రశ్న తోచినది. ఇది మొదటనే ఏల వచ్చియుండ గూడదు? ఆకస్మికముగా కలిగినమార్పు మనకెక్కువగా జ్ఞాపక ముండును. కావున సుఖము, సంతోషము, కలయిక, భోగము మన మనస్సుపై బలమైన ముద్రలు వేయవు. కష్టము, దుఃఖము, వియోగము మనస్సున గాఢముగా నాటుకొనును. ఆనందము, సుఖానుభవము, సంతోషము, భోగము మనస్వభావ లక్షణములు. అందుచే మన సహజస్థితికంటె, దానికి తీవ్రముగా భంగము వాటిల్లినప్పుడు కలిగెడి బాధ మనస్సుపై బలమైన ముద్రవేయును. కనుక మన సహజస్థితి కెక్కువ విఘాతము కలిగించెడి మృత్యు సమస్యను ప్రప్రథమముగా పరిష్కరించుట అవసరమైనది. సంస్కార మెక్కువగా కలుగుటతో వారెందుండి వత్తురను రెండవ ప్రశ్న స్ఫురించినది. జీవముతో నున్నదానికెల్ల చలనముగలదు: మనము కదలుదుము; మన సంకల్పము మన అవయవములను కదల్చును. మన అవయవములు మన ఇచ్ఛాధీనములయి ఆకారములను సృష్టించుచున్నవి. కనుక కదలిక కలిగించగలిగినదానికెల్ల చలన హేతువుగా ఇచ్ఛగలదని నేటి పసిబాలునివలె ఆదిమానవుడును భావించెను. గాలికి సంకల్పముగలదు; మేఘము, ప్రకృతియందలి సకలవస్తువులందును వేర్వేరుగా ఇచ్ఛ, మనస్సు, ఆత్మ గలవు. మన మనేక వస్తువులు తయారుచేయుచున్నట్లే అవి వివిధ వస్తువులను సృష్టించుచున్నవి. ఆ శక్తులే దేవతలు,—''ఎలోహింలు''. ఆ దేవతలే ఈ సమస్తమును సృష్టించిరి.

మానవసంఘము వికాసము పొందుచున్నది. వృద్ధి పొందుచున్నది. సంఘమునకు రాజు కావలసివచ్చెను. జ్యోతిర్మయులయిన దేవతలకుమాత్ర మెందుకుండగూడదు? కనుక దేవతలకును సర్వాధిపతి గలడు. అతడు దేవాదిదేవుడు. అతడొక్కడే తన ఇచ్ఛామాత్రముచేత ఈ సర్వమును సృష్టించెను. ఆజ్యోతిర్మయులను సహితము అతడే సృష్టించెను. అతడు వివిధగ్రహతారలను సృష్టించినట్లే. ప్రకృతిలోని వివిధ కార్యకలాపములను నిర్వహించుటకు అతడు

పలువురు అధిష్ఠాన దేవతలను నియమించెను. కొందఱు పుట్టువునకు, మఱికొందరు మృత్యువునకు, వేఱుకొందఱు వేఱుకొన్ని సంఘటనలకు అధిపతులు. ఒక్క పరమపురుషుడు-తక్కిన వారందఱికంటె శక్తిమంతుడయినందుననే పరమపురుషుడు - గలడను భావము సకల మతములకు మూలములయిన ఆర్య, సెమెటిక్ జాతుల మతములలో సమానముగా గలదు. ఇందుండి ఆర్యులు మహత్తరమైన నూతన - దృక్పథము ననుసరించిరి. వారి దేవుడు పరమపురుషుడేకాడు ; అతడు జగత్పితగూడ. ప్రేమతత్త్వమున కీభావము ప్రారంభము. సెమిటిక్ జాతులదేవుడు శక్తిమంతుడు, భయంకరుడు, చండశాసనుడు. ఈ భావములకు ఆర్యులు పితృభావమునుకూడ చేర్చిరి. తరువాత కలిగిన అభ్యుదయ దశలలో ఈ భేదము మఱింత ప్రాబల్యము వహించినది. సెమిటిక్ మతముల అభివృద్ధి యిక్కడ నిలిచిపోయినది. సెమిటిక్ దేవుడు దుర్నిరీక్ష్యుడు. అతనిని చూచుట మృత్యుదేవత వాతబడుటే. ఆర్యుల దేవుడు దర్శనీయుడు ; అంతేకాదు. అతడు మన జీవిత లక్ష్యము, అతనిని పొందుటే పరమప్రాప్యము. సెమిటిక్ మతస్థుడు భయకంపితుడయి రాజాధిరాజై జగత్ప్రభువుకులోబడి, అతని యాజ్ఞలను పాలించును. ఆర్యుడు తమదేవుని జనకుడని ప్రేమింతురు. తరువాత అతడు భగవంతుని మాతృమూర్తిగా, సఖునిగా భావించును. ''నన్ను ప్రేమింపుడు, నాకుకన్న ప్రేమింపుడు.'' అను సామెత కలదు. ఆవిధముగా అతడు సృష్టించిన ప్రతిజీవిని ప్రేమించవలెను. జీవులన్నియు అతని సంతానమే. ఈ జీవితము నగరమునకు దూరముగా నున్న సైనిక శిబిరమువంటిదని సెమిటిక్ మతములభావము. మన భక్తి విశ్వాసములను పరీక్షించు నిమిత్తము దేవుడు మనల నిందు నియమించెను ; ఈ జీవితము మనలను గమ్యమునకు గొనిపోవు మార్గమని ఆర్యులభావము. మన విధిని సక్రమముగా నిర్వహించినచో స్వర్గలోకమున మనకు నిత్యానందధామము లభించునని సెమిటిక్ మతము భావించును. భగవంతుడే యట్టి ఆనందధామమని ఆర్యుని విశ్వాసము. ఈశ్వరసేవ లక్ష్యమున కొక సాధనమని సెమిటిక్

మతస్థుని నమ్మకము. జీతముకొఱకు పనిచేయుట వంటిది. సంతోష భోగములే మాన కష్టఫలితము. ఆర్యునకు భోగము, దుఃఖము-ప్రతి యనుభవము సాధనమే. లక్ష్యము దేవుడే. స్వర్గప్రాప్తి కాంక్షించి సెమిటిక్ మతావలంబి దేవుని ఉపాసించును. సర్వేశ్వరుని పొంద గోరి ఆర్యుడు స్వర్గమును నిరాకరించును. ఒక్కమాటలో చెప్ప వలెనన్న భేదమంతయునిది; భగవత్సాక్షాత్కారమే ఆర్యునకు జీవితలక్ష్యము, గమ్యము. ప్రత్యక్షముగా-ప్రియుని దర్శించవలెను. భగవంతుడులేక ఆర్యునకు జీవితమేలేదు; అతడు జీవించలేడు. "నీ సాన్నిధ్యము లేనియెడల రవిచంద్రులు, నక్షత్రములు తమ కాంతిని కోల్పోవును." అని యాతడనును.



# మతము : దాని పద్ధతులు, ప్రయోజనము

ప్రపంచములోని మతములను పరిశీలించినచో వాని వికాసమునందు రెండువిధములయిన క్రమము కానవగును. ఒక క్రమము దేవునితో ప్రారంభమై మానవునితో పరిసమాప్తమగును. సెమిటిక్ జాతుల మతములలో దేవునిగుఱించిన భావము మొదటినుండియు గలదు. వానిలో ఆత్మనుగుఱించిన భావమే మాత్రము లేకపోవుట మిక్కిలి చోద్యము. ప్రాచీన హీబ్రూజాతిలో—మొన్న మొన్నటి వఱకు—మానవాత్మను గుఱించిన భావమే వికసింపలేదు. మానవుడనగా ఒకానొక మనస్సు, కొన్ని భౌతికవస్తువుల కలయికవలన ఏర్పడినవాడనియే భావము. అంతకుమించి మఱేమియుగాదు. మృత్యువుతో సర్వము అంతమగును. కాని, దేవునిగుఱించి భావమాజాతియం దద్భుతముగా వృద్ధిచెందెను—మతవికాసమునం దిది యొక విధమయిన క్రమము. మఱొక క్రమము మానవునితో ప్రారంభమై భగవంతునితో పూర్తియగును. ఇది యార్యుల పద్ధతిలోని విశిష్టత, మొదటిది సెమిటిక్ పద్ధతిలోని విశిష్టత. ఆర్యుడు ఆత్మతో ప్రారంభించెను. దేవునిగుఱించిన వానిభావము లస్పష్టముగా, విశృంఖలముగా విచక్షణకు వీలులేనివిగా నుండెను; ఆత్మను గుఱించిన భావము స్పష్టమగుకొలదియు దేవుని గుఱించిన భావముగూడ స్పష్టమగుచుండెను. ఆత్మను గుఱించిన భావ మెంతెంతగా స్పష్టమగుచుండెనో, ఈశ్వరునిగుఱించిన భావమంతంతగా స్పష్టముకానారంభించెను. కనుక వేదములలో జిజ్ఞాస ఆత్మద్వారానే జరిగెను. ఆర్యులు దేవునిగుఱించి పొందిన జ్ఞానమంతయు ఆత్మజ్ఞానము మూలముననే పొందిరి; వారు దేవునికొఱకు అంతర్ముఖులయి యన్వేషణచేసిరి; ఈ యన్వేషణలోని విశిష్టత వారి తత్త్వశాస్త్రమంతటిపైన ముద్రితమైనది. ఆర్యుడు దేవుని సర్వదా తన యంతరాత్మయందు వెదకుచుండెను. ఈవిధానము కొంతకాలమునకు వానికి

స్వాభావికమై విశిష్టత కలిగించెను. వారి కళలయందు, వారి సామాన్య వ్యవహారములందుగూడ ఈ విశిష్టత కనబడును. నేడుగూడ దైవమును గుఱించి ధ్యానము చేయుచున్నట్లొకని చిత్తరువును పాశ్చాత్యుడు రచించుచో పైకి చూచుచున్నట్లు, ప్రకృతికి యావల నెక్కడనో, అంతరిక్షములో వెదకుచున్నట్లు చిత్రించును. భారతీయ చిత్రకారుడు, ధ్యానభావముగల వ్యక్తిని నిమీలిత నేత్రునిగానే చిత్రించును; ధ్యానముచేయు వ్యక్తియంతర్ముఖుడయినట్లు చూపును.

మానవుడు పరిశోధించి తెలిసికొనవలసిన విషయములు రెండు: బాహ్యప్రకృతి, అంతః ప్రకృతి. సాధారణవ్యక్తికీ రెండును పరస్పర విరుద్ధములుగా తోచును. కాని, బాహ్య ప్రకృతియంతయు నంతఃప్రకృతితో, భావప్రపంచముతో నేర్పడినదే. ప్రతిదేశములో ముఖ్యముగా పాశ్చాత్యప్రపంచములో తత్త్వవాదము లనేకములు. భౌతికతత్త్వము, మనస్సు అను నీ రెండును పరస్పర విరుద్ధవస్తువులను భావముతోనే ప్రారంభమైనవి; కాని, అవి క్రమముగా నేకోన్ముఖమై చివరకొక్కటిగా కలసిపోయి యనంతమైన పూర్ణత్వ మగును. ఈ పరిశీలనవలన దృక్పథములలో నెక్కువతక్కువలను నిరూపించుట నా యభిప్రాయముగాదు. బాహ్యప్రకృతియొక్క పరిశీలన మూలమున సత్యము నన్వేషించువారు తప్పు తెరువు ననుసరించుచున్నారనియు, అంతఃప్రకృతిపరిశీలన మూలమున సత్యము నన్వేషించువారు గొప్పవారనియు నా భావముగాదు. ఈ రెండును రెండుమార్గములు. రెండును ఉండవలసినదే. రెంటిని అధ్యయనము చేయవలసినదే; కడపట నీ రెండును ఏకమగునని మనము గమనింపగలము. దేహము మనస్సుకు విరోధి కాదని, మనస్సు దేహమునకు శత్రువు కాదని మనము గ్రహింతము. ఈ దేహము పనికిమాలినదని, క్షుద్రమయినదని భావించు పలువురు కలరు. ప్రాచీనకాలమున ప్రతిదేశమందును చాలమంది ఈ దేహమును వ్యాధినో, పాపమునో అట్టి మఱిదేనినో జుగుప్సతో జూచునట్లు ఏవగించుకొనెడివారు. తరు

వాత వేదములో చెప్పబడినట్లు దేహము మనస్సునందు, మనస్సు దేహమునందు కరగిపోవునని మనము గ్రహింపనేర్తుము.

వేదములన్నిటియందును స్వర్ణసూత్రమువలె నున్న విషయమును మీరు జ్ఞాపకముంచుకొనవలెను ; ఒక మట్టిముద్దను క్షుణ్ణముగా తెలిసికొనినచో లోకములోగల మట్టియంతటిని గుఱించి తెలియును. అదేవిధమున, దేనిని తెలిసికొనినపక్షమున సర్వము తెలియగలదు ? సుస్పష్టముగా చెప్పినను, అస్పష్టముగా చెప్పినను సకల మానవజ్ఞానములోని విషయమిదియే. మనమందఱము దేని కభిముఖముగా పయనించుచున్నమో ఆ ఐక్యమే యది. మనజీవితములలోని ప్రతిచర్య—భౌతికము, స్థూలము అయిననుసరే, లేదా— సూక్ష్మతమము, పరమోత్కృష్టము, ఆధ్యాత్మికము అయిననుసరే— అన్నియు నొకే ఒక లక్ష్యమును సాధించుటకు చేయబడిన ప్రయత్నములే. ఐక్యమును పొందుటే ఆ లక్ష్యము. వ్యక్తిగా మానవు డొక్కడే. అతడు వివాహమాడును. స్థూలదృష్టికా క్రియ స్వార్థపరత్వముగానే కనబడును. కాని, అంతర్యమున గల ప్రేరణ, ఇచ్ఛాప్రవృత్తి ఐక్యమును పొందుటే. అతనికి పుత్రులు కలుగుదురు, మిత్రులుందురు. అతడు దేశమును, లోకమును ప్రేమించును. చివరకు విశ్వమంతటిని ప్రేమించును. అప్రతిహతముగా పరిపూర్ణత్వము పొందుటకే మనము ప్రయత్నించుచున్నాము. ఐక్యము పొందుటయందే పరిపూర్ణత్వముగలదు. అందునిమిత్తము ఈ సంకుచిత వ్యక్తిత్వము నశింపజేసి అంతకంతకు విస్తృతమగుచుండవలెను. అఖిల విశ్వము ఈ లక్ష్యమును, ఈ చరమగమ్యమును చేరుకొనుటకే ఆరాటపడుచున్నది. ప్రతియణువు ఉన్నచోటనుండి కదలిపోయి దాని ప్రక్కనేయున్న అణువును కలిసికొనుట కాతురపడుచున్నది. అణువులు, అణువులు చేరి పెద్దబంతులగును. భూగోళములు, సూర్యులు, చంద్రులు, నక్షత్రములు గ్రహములగును. తమవంతున నవి వేవేగముగా నొండొంటితో కలసికొనుట కారాటపడు

చున్నవి. చివరకు సమస్తవిశ్వము—మానసిక ప్రపంచము, భౌతిక ప్రపంచము కలసి, యఖండముగ నొక్కటియైపోవును.

పెద్దయెత్తున, బాహ్యజగత్తులో ననుసరింపబడుచున్న క్రమమే చిన్నస్థాయిలో మానసజగత్తులో ననుసరింపబడుచున్నది. బాహ్యజగత్తు, ప్రత్యేకతయందున్నది. అయినను ఐక్యమును, అభేదమును పొందుటకు అది వేగిరపడుచున్నది. మన భిన్నప్రపంచములలో గూడ ప్రతి జీవాత్మ ఇతర ప్రపంచమునుండి వేఱుపడి పుట్టుచున్నది. అజ్ఞానమెంత యెక్కువగానున్న, వికాసమెంత తక్కువయిన అంతగా ఆత్మ తాను ప్రపంచమునకు వేఱని భావించును. మాఢ్యమధికము గలవాడు తాను చనిపోవుదునని, పుట్టుదునని యింకా యేమేమో భావించుచుండును.—ఈయభిప్రాయములు వేఱనెడి భావమును వ్యక్తముచేయునవియే. జ్ఞానము కలిగినకొలది, మానవుడు వికాసము పొందినకొలది వానికి నైతికదృష్టి కలుగును; అభేదభావ మేర్పడును. మానవులు తెలిసికొన గలిగినను, తెలిసికొనలేకపోయినను తెర మరుగుననున్న ఆ శక్తియే వారిలో నిస్వార్థచింతను ప్రేరేపించు చున్నది. అదియే సమస్త నీతిశాస్త్రమునకును పునాది. లోకములో నే ప్రవక్త బోధించినను, ఏ మతములో నుపదేశించినను, ఏ భాషలో చెప్పినను సకల ధర్మముల సారమదియే. ''నీవు నిస్వార్థుడవుకమ్ము''. ''నేనుగాదు, నీవే''—అను నీతినియమావళుల వెనుకగల భావమదియే. దీనితాత్పర్యము వ్యక్తిత్వ రాహిత్యమును గుర్తించుటే—నీలోనిభాగమే, నాలోనిభాగమే అని గ్రహించుట; నీకు నేను హానికలిగించిన నాకు నేను కలిగించుకొనుటే అని, నీకు నేను సహాయచేసిన నాకు నేను సహాయముచేసికొనుటే అని గుర్తించుట; నీవు జీవించియుండగా, నాకు మృత్యు వసంభవమని తెలిసికొనుట. ఈ విశ్వములో క్షుద్రక్రిమి యొక్కటియైన నున్నంతవఱకు నే నెట్లు చనిపోగలను? నాప్రాణ మా క్రిమిప్రాణములో నున్నది కదా. అంతేకాక, మనము సహాయముచేయక ఒక్కజీవునిగూడ

విడనాడుటకు వీలు లేదను విషయముకూడ అది బోధించును. వాని క్షేమమునం దేకదా, నాక్షేమము భద్రమైయున్నది.

వేదాంతమునం దంతటను ఉద్ఘాటింపబడుచున్న విషయ మిదియే. ఇతరమతము లన్నిటియందును బోధింపబడిన విషయ మిదియే. సాధారణముగా మతములలో మూడు భాగములుండును. మొదటిది తాత్త్వికవిషయము; మతసిద్ధాంతములు, మతధర్మముల సారము తక్కినవి. ఈ సిద్ధాంతములు పురాణగాధల రూపమునే దాల్చును—ఋషుల జీవితకథలుగా, వీరుల, అతిమానవుల, దేవతల, దివ్యపురుషుల జీవితగాధ లేర్పడును. పురాణగాధ లన్నింటియందున్న భావ మొక్కటే—శక్తి. తక్కువస్థాయికి చెందిన పురాణగాధలలో—అనాగరక భావములు ప్రబలముగా నున్నవానిలో ఈ శక్తి ప్రదర్శనము కండరములకు సంబంధించినదిగా నుండును; వాటి నాయకులు బలాఢ్యులు, అసాధారణ పురుషులు. ఒక వీరుడు సమస్త ప్రపంచమును జయించును. మానవు డభివృద్ధి పొందుకొలది బలప్రదర్శనము కండరములలోగాక, అంతకంటె ఉత్కృష్టముగా చూపగోరెను; కనుక అతని నాయకులుకూడ ఉత్కృష్టమార్గములలో శక్తిని ప్రదర్శింపవలసిన వారయిరి. ఉత్తమ పురాణగాధలలోని నాయకులు ప్రచండ నైతికశక్తిసంపన్నులు. నీతిని, పరిశుద్ధతను సాధించుటలో వారు తమశక్తిని ప్రదర్శించిరి. వార సహాయశూరులుగా నిలబడి, ఉత్తుంగ తరంగములవలె పైకొను స్వార్థప్రవృత్తిని, అవినీతిని ధిక్కరించగలరు. మతములలోగల మూడవభాగము రూపకల్పన. దానినే మీరు కర్మకాండయని, సంకేతములని అందురు. ఆదర్శములను పురాణగాధలుగా, వీరుల జీవితముల మూలమున తెలియజేసినను అంతటితో అందఱు సంతృప్తిజెంది యుండజాలరు. అంతకంటెగూడ తక్కువస్థాయికి జెందినవారు గలరు. పసిబిడ్డలవలె వారికింకను తక్కువస్థాయిగల మతమవసరము. కనుక ఈ రూపకల్పన లేర్పడినవి. ఇవి స్పష్టమయిన ఉదాహరణలు. వీని యనుష్ఠానముతో వారు

విషయమును భౌతికవిషయములవలె స్పష్టముగా గ్రహించి, యను భవింపగలరు.

ప్రతిమతమునందును మూడుదశలున్నవి: తత్త్వశాస్త్రము, పురాణవాఙ్మయము, కర్మకాండ. వేదాంతమునందొక ప్రత్యేక సౌల భ్యము గలదు. భారతదేశములో అదృష్టవశమున ఈ త్రివిధదశలు స్పష్టముగా వేర్వేరయియున్నవి. ఇతరమతములలో సిద్ధాంతములు పురాణవిషయములతో జిగిబిగిగా పెనవేసికొనిపోయినవి. వానిని స్పష్టముగా వేఱుచేసి గుర్తించుట కష్టము. పురాణగాథలే ప్రాబల్యము వహించి సిద్ధాంతములను కప్పిపుచ్చుచుండును. కొన్ని శతాబ్దములలో ముఖ్యమయిన 'మూలసూత్రములు మఱుగున పడి పోవును. వివరణ, ఉదాహరణ అసలు తత్త్వసూత్రములనే ముంచి వేయును. జనులు వివరణను, ప్రవక్తను, బోధకుని మాత్రమే చూతురు. తాత్త్వికసిద్ధాంతము లెక్కడకు పోయినవో!— దాదాపు నశించిపోయినట్లే. తత్ఫలితముగా నేడు ఎవరయిన క్రైస్తవ మత సిద్ధాంతములను క్రీస్తును మినహాయించి బోధించుటకు యత్నిం చినచో అతడు క్రైస్తవమతమును ఖండించుచున్నాడని భావించి వానిని తీవ్రముగా నెదుర్కొందురు. మహమ్మదీయ మతసిద్ధాంత ముల నావిధముగానే ఎవ్వరైన బోధించుటకు ప్రారంభింపగానే మహమ్మదీయులుగూడ అదేవిధముగా ఆపోహపడుదురు; స్థూల భావ ములు, మహాపురుషుల జీవితములు, ప్రవక్తల జీవితములు తాత్త్విక సూత్రములను పూర్తిగా మఱుగుపఱచినవి.

వేదాంతమునకుగల ప్రత్యేక సౌలభ్య మేమనగా, అది ఒక్క వ్యక్తికృషి కాదు; కనుక సహజముగా, బౌద్ధ క్రైస్తవ మహమ్మ దీయ మతములలోవలె ప్రవక్తయో, గురువో తాత్త్విక సిద్ధాంత ములను పూర్తిగా మఱుగుపఱచుట సంభవింపలేదు. సత్యములే సజీవములు. ప్రవక్తలు రెండవవర్గమునకు జెందినవారు. వారి విషయము వేదాంతమునకు తెలియదు. ఉపనిషత్తు లేయొక్క

ప్రవక్తను గుఱించి చెప్పవు; వివిధ ఋషులను గుఱించియు, తాత్త్విక చింతగల విదుషీమణులను గుఱించియు ప్రస్తావించును. ప్రాచీన హీబ్రూలలో నిట్టివైఖరి కొంతయుండెను. అయినను హీబ్రూసాహిత్యములో మోసెన్ విశేషప్రాధాన్యము వహించెను. ఈ ప్రవక్తలు ఒక జాతిమతముపై తమ ప్రాభవము చూపరాదని నేదెలుపను. కాని, తాత్త్విక సత్యములకు, సిద్ధాంతములకు సంబంధించిన రంగమంతయు పూర్తిగా మఱుగున పడిపోవుట ముమ్మాటికి అపాయకరమే. సిద్ధాంతముల విషయమై మనము చాలవఱకు ఏకీభవింపగలము. కాని, వ్యక్తుల విషయమై ఏకీభవింపజాలము. వ్యక్తులు మనహృదయముల నాకర్షింతురు; సిద్ధాంతములంతకంటె ఉత్కృష్టమైనదాని నాకర్షించును; శాంతసమాహితమైన వివేకము నాకర్షించును. కాలక్రమమున సిద్ధాంతములే యాధిపత్యము వహింపవలెను. అదియే మానవుని వికాసమునకు నిదర్శనము. ఆవేశములు తఱచుగా మనలను పశువులస్థాయికి లాగిపడవేయును. ఇంద్రియములలో తార్కికజ్ఞానముకంటె ఆవేశములకెక్కువ సాన్నిహిత్యముకలదు. కనుక సిద్ధాంతములు పూర్తిగా మఱుగునపడి, ఆవేశములే ప్రాబల్యము వహించుచో మతము మౌఢ్యమునకు, దురభిమానమునకు దారితీయును. అప్పుడవి ప్రత్యేకపక్ష రాజకీయములు మున్నగువానికంటె ఉత్కృష్టములు కావు. దారుణమైన మూఢభావములకు ప్రాధాన్యమీయబడును. ఈ క్షుద్రభావములకొఱకు వేలకొలది తోడిమానవుల కుత్తుకల నుత్తరించుటకు ఆవేశపూరితులైనవారు సంసిద్ధులగుచుందురు. మహాపురుషులు, ప్రవక్తలు ప్రజలను ధర్మమార్గమునకు మరలించుట కుత్తేజము కలిగించిన శక్తిమంతులేయైనను, వారి ప్రభావమువలన వారు ప్రతిపాదించిన సత్యములే మఱుగునపడిపోవుచుండుటచేత అట్టి సందర్భములలో వారి జీవితప్రభావము హానికరముగా పరిణమించుచుండును. అట్టిది సర్వదా స్వమత దురభిమానమునకు దారిదీసి, లోకమును రక్తస్రవంతిలో ముంచెత్తినది. ఈ యాపదను వేదాంతము నివా

గింపగలము. దానికొక్క ప్రత్యేక ప్రవక్తయనువాడు లేడు. దానికి ఋషులనబడు ద్రష్టలు పలువురుగలరు. ఈ సత్యములను లేక మంత్రములను దర్శించినవారే ఋషులు, ద్రష్టలు.

మంత్రమనగా యోచనచేయుట—మనస్సులో చింతనము చేయుట. ఈ భావములను దర్శించినవ్యక్తి ఋషి. అవి ప్రత్యేకముగా యెవరొకొందఱి ఆస్తికాదు; ఆలోచించినవారెంతటివారయినను అవియే యొకపురుషుని సొంతఆస్తికాదు; ఏ యొకస్త్రీ సొంత సొత్తుకాదు; లోకోత్తరుడైన బుద్ధుని, ఆస్తికాదు, ఏసుక్రీస్తుసొత్తుకూడ కాదు. అవి విశ్వజనీనధర్మములు. కనుక అవి యెంతగా బుద్ధుని ఆస్తియో, అంతగా క్షుద్రాతిక్షుద్రుని ఆస్తియే; ఎంతగా క్రీస్తుదేవుని ఆస్తియో అంతగా నేలమీద ప్రాకెడి పురుగు ఆస్తియే. ఆ ధర్మము లెన్నడును కల్పింపబడినవిగావు. అనాదిగా ధర్మములున్నవి; ఇకముందుగూడ అవి యుండును. అవి తయారుచేయబడినవి కావు; నేడు మనకు విజ్ఞానము బోధించు శాసనములేవియు నిర్మించినవి కావు. అవి మఱుగున పడిపోవుచుండును; తిరిగి కనుగొనబడుచుండును. కాని, ప్రకృతియందు శాశ్వతముగా నుండునవియే. న్యూటన్ మహాశయుడు పుట్టియుండక పోయినను గురుత్వాకర్షణశక్తి యనంతకాలముండునదే. దానిధర్మము నది నిర్వహించునదే. దానియందు మార్పు కలిగియుండెడిదికాదు. న్యూటన్ తన ప్రతిభతో దానిని నిర్వచించెను; కనుగొనెను; జ్ఞానావధిలోనికి గొనివచ్చెను; మానవజాతికి దానినిగుఱించి తెలియజేసెను. మతసత్యములుకూడ అట్టివే. అవి యాత్మతత్త్వమును ఆధ్యాత్మిక జీవితమును గుఱించిన మహత్తర సత్యములు. అవి యింతకాలము పనిచేయుచునే యున్నవి. వేదములు, బైబిలు, కొరాన్—యివేవియు లేకపోయినను, ఋషులు, ప్రవక్తలు పుట్టియుండకపోయినను ఈ ధర్మములుండియే తీఱును. ఇవి తాత్కాలికముగా నవ్యక్తముగా నున్నవి. నెమ్మదిగా, క్రమక్రమముగా మానవజాతి సముద్ధరణకు మానవప్రకృతి పరివర్తనకు నివి పనిచేయును. వీనిని గ్రహించి,

దర్శించువారే ప్రవక్తలు. అట్టి ప్రవక్తలే ఆధ్యాత్మికరంగములో పరిశోధకులు. న్యూటన్, గెలీలియో భౌతికవిజ్ఞాన ప్రవక్తలున్నట్లే ఆధ్యాత్మిక రంగములోగూడ ప్రవక్తలుగలరు. ఈ యాధ్యాత్మిక సూత్రములలో దేనిని తమ ప్రత్యేకపుహక్కుగా వారు చెప్పజాలరు; అవి సమస్త ప్రకృతి ఉమ్మడిసొత్తు.

హిందువులు భావించునట్లు వేదములు శాశ్వతములు. ఆ మాట కర్థమేమో మనమిప్పుడు గ్రహింపగలము. ధర్మశాసనముల కాదిలేదు, తుదిలేదు. ప్రకృతికి ఆదిలేదు, తుదిలేదు. భూగోళము తరువాత భూగోళము, గ్రహకూటము తరువాత గ్రహకూటము సృష్టియగును, వృద్ధిపొందును. కొంతకాలము గమనము సాగించును. తరువాత నశించును; కాని విశ్వ మెప్పటియట్లే యుండును. లక్షల కొలది గ్రహకూటములు పుట్టుచున్నవి, లక్షలకొలది గ్రహ కూటములు నశించుచున్నవి. జగత్తు యథాప్రకారముగానే యున్నది. ఒకానొక గ్రహమునకు ఆది, అంతయు చెప్పవచ్చును; కాని, విశ్వమునకు ఆద్యంతము లనుమాట కర్థమే లేదు. ప్రకృతిశాసనములు, భౌతికశాసనములు, మనశ్శాసనములు, ఆధ్యాత్మికశాసనముల విషయమైగూడ అంతే. అవి యనాదిగానున్నవి, అనంతముగానుండును; కొలది సంవత్సరముల క్రితమే, పోల్చి చెప్పవలసినచో—కొలదివేల సంవత్సరముల క్రితమే వానిని తెలియజేయుటకు మానవుడు ప్రయత్నము ప్రారంభించెను. అనంత ప్రకృతి మన యెదుటనే యున్నది. వేదములవలన మనము తొలుతనే గ్రహించగల మహద్విషయ మిది: మత మిప్పుడే ప్రారంభమైనది. ఆధ్యాత్మిక సత్యమనియెడి యనంతసాగరము మన యెదుటనే యున్నది. దానిని మనము మథించవలెను. దర్శింపవలెను. మన జీవితములలోనికి గొనిరావలెను. ప్రపంచ మీనాటికు వేలకొలది ప్రవక్తలను చూచినది, లక్షలకొలది ప్రవక్తల నింకను చూడవలసి యున్నది.

పూర్వకాలమున ప్రతి సంఘమునందును ప్రవక్తలనేకమంది యుండెడివారు. ప్రతిపట్టణములోని ప్రతివీధిలో ప్రవక్తలు నడచు కాల మింకను రావలసియున్నది. పూర్వకాలమున సమాజ జీవితమును నిర్దేశించు శాసనముల ఫలితముగా విచిత్రమైన కొందఱు విశిష్టవ్యక్తులే ప్రవక్తలగుచుండెడివారు. మతానుష్ఠాపరుడగుట యనగా ప్రవక్తయగుటయే అని మన మర్థము చేసికొనగల కాలము వచ్చుచున్నది. ప్రవక్తయైనగాని యే స్త్రీయు, పురుషుడును మతజీవి కాజాలడని గ్రహింపగల కాల మాసన్నమగుచున్నది. మతరహస్యము ఈ విషయము లాలోచింపగలుగుటలోను, వీనిని గుఱించి ముచ్చటింపగలుగుటలోను లేదని, వేదము లుపదేశించునట్లు వాని సాక్షాత్కారము పొందుటయందే గలదని, ఈవఱకును సాక్షాత్కారము చేసికొనినవానితో నిలిచిపోక అంతకంతకు క్రొత్త క్రొత్త యనుభూతులు పొందుచుండవలెనని, క్రొత్త యనుభవములు ఉత్కృష్టానుభవములు పొందుచుండవలెనని, క్రొత్త విషయములు కనుగొనుచు, సమాజమున కందజేయుచుండవలెనని మనము దెలిసికొనవలసియున్నది; మతాధ్యయనమునకు ప్రయోజనము ప్రవక్తలను సుశిక్షితులను జేయుట. పాఠశాలలు, కళాశాలలు ప్రవక్తలను శిక్షితులనుచేయు విద్యాకేంద్రములుకావలెను. విశ్వము ప్రవక్తలతో నిండిపోవలెను. మానవుడు ప్రవక్తయగువఱకు అతనికి మతము హాస్యాస్పదమేయగును. మతము మతానుభూతి నందవలెను. వేయి విధముల బొందవలెను. ఈ గోడనెంత స్పష్టముగా చూచుచున్నామో మతసత్యములనంతకంటె యెక్కువ స్పష్టముగా దర్శింపవలెను.

వివిధమతస్వరూపముల కంతర్గతముగా నొకసూత్రమొకటి కలదు. అదిమనకిప్పుడవగతమయినది. ఐక్యమును కనుగొనిన దశలో ప్రతి విజ్ఞానశాస్త్రము పూర్ణత్వము పొందును. ఐక్యమును దాటి పురోగమించుటకు సాధ్యముగాదు. పురోగతికి చరమగమ్యము ఐక్యమే. సంపూర్ణమయిన ఐక్యమును పొందినతరువాత విజ్ఞానశాస్త్రము మనకు చెప్పగల సూత్రములేవియు నుండవు. మతములు

మనకు చెప్పగలపనియంతయు వివరములు తెలిసికొని యన్వయము చేయుచుండుడనియే. ఏ విజ్ఞాన శాస్త్రమునైనను తీసికొనుడు, రసాయనిక శాస్త్రమును తీసికొనుడు: మూలద్రవ్యము లన్నిటిని తయారుచేయగల మూలద్రవ్యము నొకదానిని కనుగొంటిమను కొనుడు. అంతట రసాయనికశాస్త్రము పూర్ణత్వము పొందినదని యర్థము. అటుతరువాత మనము చేయవలసినదంతయు—ఆయొక్క—వస్తువుతో నితరవస్తువులనుచేర్చి క్రొత్తక్రొత్త మిశ్రమములుచేసి వానిని మన జీవితావసరములకు వినియోగించుటే. మతవిషయమున గూడనంతే. మహత్తరమైన మతసూత్రములు, వానిప్రయోగమున కవకాశము, మతప్రణాళిక యుగములకుమున్నే కనుగొనబడినవి, అప్పుడు మానవుడు వేదముల తుదిపలుకులు గ్రహించెనట. ''నేనతడే''—అనునవే ఆ తుదిపలుకులు. ఒకే ఒకడుకలడు. అతని యందు భౌతిక ప్రపంచము-సర్వము, మానవప్రపంచము సర్వము నేకమగుచున్నవి. అతడే దేవుడు. అతడే బ్రహ్మము, అతడే అల్లా, అతడే జిహోవా. మఱేపేరుతో వ్యవహరించినను అతడే. అతని నతిక్రమించి పోలేము. ఈ మహత్తరసత్యము మనకిదివరకే సూచింపబడినది. ఆ సత్యమును అనుభవించుట జీవితములోని వివిధప్రకరణములకు నన్వయించుట—మన కర్తవ్యము. ప్రతిమానవుడు ప్రవక్తయగుటకై మనమిప్పుడే కృషిప్రారంభించవలెను. మనముందున్నది బృహత్తరకార్యము.

పూర్వకాలమున ప్రవక్తనుగుఱించి తిన్నగా అర్థముచేసికొనలేదు. కాకతాళీయముగా, ఇచ్ఛామాత్రమున, లేక, విశేష ప్రజ్ఞవలన దివ్యజ్ఞానము కలిగెడిదని భావించెడివారు. ఈ కాలమున అట్టి దివ్యజ్ఞానము ప్రతిజీవునికి ఎట్టివానికైనను, ఎందున్నవానికైనను సరే, జన్మహక్కు—అని నిరూపించుటకు సంసిద్ధముగా నున్నాము. ఈ విశ్వములో కాకతాళీయమనునది లేదనికూడ చూపగలము. కాకతాళీయముగా, ఆకస్మికముగా ఎవరో దేనినో పొందిరని భావించెడివారు నెమ్మది నెమ్మదిగా, అవ్యక్తముగా యుగయుగ

ములుగా అందుకొఱకు వారుకృషి చేసిరని గ్రహింపనగును. వారు పొందినది అట్టి కృషిఫలితమే. కనుక మనకు మనము వేసికొనవలసిన ప్రశ్నయిది, "మనము ప్రవక్తలము కాఁగోరుచున్నామా?" కాఁగోరెడి పక్షమున కాఁగలము.

ప్రవక్తలను శిక్షితులను చేయుటే మనముందున్న మహత్తర కార్యము; తెలిసియో, తెలియకయో గొప్ప మత విధానములన్నియు నా దివ్యలక్ష్యమును సాధింపజేయుటకే సహాయపడుచున్నవి. వానిలో కొన్ని ఒక్క విషయమున భేదించును: ఆత్మసాక్షాత్కార మీ జన్మలో కలుగదు. చనిపోవలెను. తదనంతరము మఱొకలోకములో సాక్షాత్కారము కలుగును. అంతవఱకు ఆధ్యాత్మిక సత్యములను నమ్మకముతో మన్నింపవలెను. అటువంటిమాటలు చెప్పెడివారిని వేదాంత మీ విధముగా ప్రశ్నించును: "అటులయినచో అసలు ఆత్మయనునది కలదని మీ కెట్లు తెలియును?" తెలియని, తెలియరాని విషయముల నీపన్మాత్రముగా నీ జీవితమందే దర్శించిన యసాధారణవ్యక్తులు కొందఱు కలరను సమాధానము వారు చెప్పరు.

ఈ సమాధానముగూడ పూర్తిగా సంతృప్తి కలిగింపజాలదు. కేవలము కాకతాళీయకముగా నిట్టి శక్తిగల అసాధారణ వ్యక్తులు కొందఱున్నపక్షమున, వారిని నమ్ముటకు మనకు హక్కు లేదు. మనము తెలిసికొనుటకు వీలులేని కాకతాళీయ సంఘటనలను, శక్తులను నమ్ముట పాపమగును. జ్ఞానమనగానేమి? వైపరీత్యమును నశింపజేయుటే. ఒకడు మృగశాలకుబోయి యొకవిచిత్ర జంతువును చూచును. అదేదియో యతనికి తెలియదు. తరువాత అతడొక దేశమునకు పోవును. అట్టి జంతువులను వందలకొలది చూచును. అతడు సంతృప్తిజెందును. ఆ జంతువులజాతి నతడు తెలిసికొనును. సూత్రమును తెలిసికొనుటే మన జ్ఞానమంతయును. సాధారణ సూత్రముతో సంబంధములేని వైపరీత్యమును కనుగొనుటే అజ్ఞానము. సాధారణ సూత్రమునుండి వేఱుపడి, దానితో సంబంధము

లేని యొకవస్తువునో, కొలదివస్తువులనో మనము చూచినప్పుడు మనము చీకటిలో నున్నట్లగును; మనకేమియు తెలియదు. అతీతముగానున్న సత్యము నీషణ్మాత్రము దర్శించిన ప్రవక్తలు విపరీతమానవులేయగుచో, అతీతసత్యములను దర్శించగల హక్కు వారికి మాత్రమేయున్నచో, మరెవ్వరికిని అట్టిశక్తిలేనిచో—మన మీ ప్రవక్తలను నమ్మనే కూడదు. వారు సాధారణ సూత్రముతో సంబంధము లేని విపరీత వ్యక్తులగుటచేతనే మనము వారిని నమ్మరాదు. మనము ప్రవక్తలమయినప్పుడే వారిని నమ్మగలము.

సాగర సర్పమునుగుఱించిన ఛలోక్తులు మీరందఱు పత్రికలలో చదువుచుందురు; ఆ కథలు వింతగానుండుట కేమికారణము? ఎప్పుడో—అరుదుగా—ఒకొక్కప్పుడు కొలదిమందివచ్చి, యట్టి కథలు చెప్పుచుందురు. ఇతరు లెవ్వరును సాగరసర్పమును చూడలేదు. వాని నన్వయించి చెప్పుటకు వీలయినది ప్రత్యేక సూత్రమేదియు లేదు. అందుచే ఆ కథలను లోకము నమ్మదు. ఎవరేనివచ్చి, ఒకానొక ప్రవక్త వాయువులో కలసి, దానిగుండా పోయెనని చెప్పిన పక్షమున ఆ సంఘటనను చూచుటకునాకు హక్కుగలదు. నేనతని నిట్లడుగుదును: "మీతండ్రిగాని, తాతగాని ఆ దృశ్యమును చూచిరా?" "లేదు, లేదు." అని యతడు బదులుచెప్పును. "కాని అది అయిదువేల సంవత్సరములకు పూర్వము జరిగినది." అని యతడనును. నే నా మాట నమ్మనిపక్షమున శాశ్వతముగా అగ్నిలోనే నాహుతి కావలసినదేయట!

గ్రుడ్డినమ్మక మెంత దృఢముగా నాటుకొనిపోయినది! మానవుని దివ్యత్వమునుండి పశుత్వమునకు పతనమొందించుటే—దీని ఫలితము. నమ్ముటయే మన పనియగుచో మనకు హేతుజ్ఞానమేల నీయబడినది? హేతుజ్ఞానమునకు విరుద్ధముగా నమ్ముట దారుణమైన యపచారముకాదా? భగవంతుడు మనకు ప్రసాదించిన ఈ పరమోత్కృష్టశక్తిని వినియోగింపకుండుటకు మనకేమి హక్కు

గలదు? నమ్ముటకు నిరాకరించి, హేతుజ్ఞానమును వినియోగించు వారిని దేవుడు క్షమింపగలడు; హేతుజ్ఞానమును వినియోగింపక గ్రుడ్డిగా నమ్మెడి వారిని క్షమింపడు. ఇది నానిశ్చితాభిప్రాయము. భగవంతుడు ప్రసాదించిన శక్తుల నుపయోగింపనివా డధోగతిపాలయి పశువులస్థాయికి దిగిపోవును.—తన శక్తులను క్షీణింపజేసి, నశించును. మనము తర్కించవలెను; ప్రతిదేశములోని ప్రాచీన గ్రంథములు ప్రవక్తలను, మహాపురుషులనుగుఱించి చెప్పు విషయములు నిజమే అని మన హేతుజ్ఞానము నిర్ధరించుచో, వారిని నమ్ముదము. మనయందట్టి ప్రవక్తలను కాంచినప్పుడు మనము వారిని నమ్ముదము. అప్పుడు వారు విపరీతవ్యక్తులుకారని, కొన్ని సత్యములకు వారు ప్రత్యక్ష నిదర్శనములని మనము గ్రహింతుము. వారు సాధనచేసిరి; కృషిచేసిరి. సత్యము సహజముగా వ్యక్తమైనది. ఆ సత్యము మనయందు వ్యక్తమగుటకు మనము కృషి, సాధన చేయవలసియున్నది. మనము ప్రవక్తలమైనప్పుడు వారుగూడ ప్రవక్తలని మనము నమ్ముదుము. వారు దివ్య విషయములను దర్శించిరి. వారింద్రియములనధిగమించి, అతీంద్రియవిషయము నీషణ్మాత్రము దర్శించిరి. ఆ విషయము మనముగూడ అట్టిస్థితి పొందగలిగినతరువాత నమ్ముదము; అంతవఱకు నమ్మవలదు.

వేదాంతమునందలి ముఖ్యసిద్ధాంత మదియే. మతానుభూతి యిప్పుడే, యిక్కడే సాధ్యమని వేదాంతము వక్కాణించును. ఈ జీవితము, ఆ జీవితము, జీవితము, మృత్యువు, ఈ ప్రపంచము, ఆప్రపంచము—వీనిని గుఱించిన జిజ్ఞాసకు కారణము మూఢవిశ్వాసము, అపోహయే. మనము కల్పించుకొను విభాగములుతక్క కాలమున వేఱుభాగములే లేవు. పదిగంటలకు, పండ్రెండు గంటలకు భేదమేమి?—ప్రకృతియందుగలుగు కొన్ని మార్పులవలన మనము కల్పించుకొనిన భేదములే కదా! కాలవాహిని యెప్పుడును ఒక్కటే. ఇక ఈ జీవితము, ఆ జీవితము నను మాటల కర్థమేమి? ఎప్పుడనునదియే ప్రశ్న. ఇదివరలో కాలహరణమయినయెడల వేగ

ముగా, కృషి చేసి సాధింపవచ్చును. అందువలన మత సత్యముల నిప్పుడే సాక్షాత్కరింపజేసికొన నగునని వేదాంతము హితవు పలుకుచున్నది. నీవు మతజీవితము సాగించుట యనగా, ఏ మతము లేకుండ నీవు ప్రారంభించి, నీ ఆత్మోన్నతికి కృషి చేసి, సత్యములను దర్శించి, నీకు నీవే స్వాయముగా విషయములు తెలిసికొనుటే; ఆ పని జరిగినతరువాత—తరువాతనే—నీకు మతమనునది యున్నదని గ్రహింపుము. అంతవరకు నీవు నాస్తికునికంటె ఎక్కువగాదు ; తక్కువేగూడ. ఏలయన నాస్తికుడు చిత్తశుద్ధిగలవాడు. "నాకీవిషయములు తెలియవు." అని యతడు నిష్కపటముగా జెప్పును. ఇతరులో ! తమకు తెలియకపోయినను ఇక్కడకు అక్కడకుపోయి, "మేము మతజీవులము" అని చెప్పుచుందురు. వారికిగల మతమేమో యెవరికిని తెలియదు. అమ్మమ్మలుచెప్పిన కథలేవో కొన్ని గుటకవేసిరి. ఏవో కొన్నివిషయములు నమ్మవలసినదని పురోహితులాదేశించిరి ; నమ్మనిచో వారికర్మము వారిదేయందురు. లోకవృత్త మీవిధముగా నడచుచున్నది.

మతసాక్షాత్కారము పొందుటొక్కటేమార్గము. మనలో ప్రతియొక్కరము సాక్షాత్కారము పొందవలసినదే. అయితే, ప్రపంచములోనున్న ధర్మగ్రంథములవలన ప్రయోజనమేమి? అవి చాల ఉపయోగకరములు. అవి దేశపటములవంటివి. నేనిక్కడకు రాకముందు ఇంగ్లాండు దేశపటములను తఱచుగా చూచుచుండెడివాడను. ఇంగ్లాండునుగుఱించి కొంత తెలిసికొనుటకవి చాల ఉపయోగపడినవి. కాని, నేనిక్కడకు వచ్చిచూడగా, ఈ దేశమునకు, ఆ పటములకు నెంతభేదము గలదు! సాక్షాత్కారమునకు, మతగ్రంథములకుగూడ అంతటిభేదముగలదు. ఈ గ్రంథములు గతించిన మహాపురుషుల యనుభవముల పటములు. అవి మనల నుత్తేజితుల నొనరించి అదేవిధముగా, అంతకంటె గొప్ప యనుభవములను కాకపోయినను, కనీస మా యనుభవములనయినను పొందుటకు మనలను కార్యోన్ముఖులను జేయును.

సత్యసాక్షాత్కారమే మతమను విషయము వేదాంతము నందలి ప్రథమసూత్రము. అనుభూతిగలవాడే మతజీవితము గలవాడు; అనుభవములేనివాడు, "నాకు తెలియదు" అని చెప్పువాని కంటె ఎంతమాత్రము నెక్కువ కాడు; ఒకవిధముగా తక్కువేకూడ. తెలియనివాడు తెలియదని భేషజములేకుండ చెప్పును. సాక్షాత్కార సాధనయందు మనకు మతగ్రంథములు విశేషముగా తోడ్పడగలవు. అవి మనకు దారిచూపుటేగాక సాధన విధానములను సూచించును. ఉపదేశములు చేయును. ప్రతి విజ్ఞానమునకు ఒక్కొక్క పరిశోధనా విధానముగలదు. "నేను మతానుష్ఠానపరుడను కావలెనని యనుకొంటిని. ఈ సత్యములననుభవము పొందగోరితిని. కాని నాకు సాధ్యముగాలేదు. కనుక నేను దేనినిగాని నమ్ముటలేదు." అని పలువురు చెప్పుటమీరు వినియేయుందురు. విద్యాధికులలో గూడ నిట్టి విషయములు చెప్పువారుగలరు. ఇంకను అనేక మందియిట్లందురు: "నా జీవితమంతయు మతానుష్ఠానపరుడనగుటకు ప్రయత్నించితిని. అందులో నేమియులేదు." మఱియొకవిచిత్రము గూడ గలదు: గొప్ప రసాయనిక శాస్త్రజ్ఞుడొకడు మీయొద్దకు వచ్చుననుకొనుడు. మీరతనితో, "రసాయనిక శాస్త్రమును గుఱించిన దేదియు నేనునమ్మజాలను. నేను రసాయనిక శాస్త్రజ్ఞుడనగుటకు నా జీవితమంతయు ప్రయత్నించితిని. దానిలో నాకేమియు కనబడలేదు." అనెదరనుకొందము. అంతట అతడు, "మీరెప్పుడు ప్రయత్నించితిరి?" అని ప్రశ్నించును. నేను నిద్రపోవుటకుముందు, "రసాయనిక శాస్త్రమా! రమ్ము, నాదగ్గరకు రమ్ము" అని పలుమారు ఉచ్చరించితిని. అది నాదగ్గరకు రానేలేదు; అది అదేవిధముగానే యున్నది, అని మీరందురు. రసాయనిక శాస్త్రజ్ఞుడు మీ మాటలకు నవ్వి యిట్లనును: "అదియా, సంగతి? అదిగాదు పద్ధతి. ప్రయోగశాలకు మీరేల పోలేదు? అచ్చట ఎన్ని పర్యాయములో ద్రావకములన్నిటితో మీరేల చేతులు కాల్చుకొనలేదు! అప్పుడే మీకు విషయము తెలిసెడిది." మత విషయములో నటువంటి శ్రమపడుదురా? ఒక్కొక్క

విజ్ఞానము నొక్కొక్క విధముగా పొందవలసియున్నది. మతమును గూడ అట్టి పద్ధతివలననే తెలిసికొనవలెను. మతమును తెలిసికొనుటకు కొన్ని విశిష్ట పద్ధతులున్నవి. ప్రపంచములో నవతరించిన ప్రాచీన ప్రవక్తలందఱదగ్గరనుండి, కొంత యనుభూతిపొందిన ప్రతి వ్యక్తిదగ్గఱనుండి, మత సాక్షాత్కారముపొందిన ప్రతివ్యక్తి దగ్గఱ నుండి మనము నేర్చుకొనవలసినది యున్నది. వారు మనకు సాధన పథములు, విశిష్టపథములు సూచింపగలరు. వానిననుసరించుట వలననే మతసత్యములు మన కనుభవగతమగును. వారు తమ జీవితములను వినియోగించి, కఠోరసాధనలుచేసి మనస్సును శిక్షిత మొనరించి సూక్ష్మ సత్యములను దర్శింపగలస్థితికి గొనివచ్చిరి. అట్టి స్థితికి మనస్సును గొనిరాగల విశిష్టపద్ధతులను వారు కనుగొనిరి. మనస్సును సుశిక్షితముచేసిన తరువాత, సుశిక్షితము చేయుట మూలమున వారు మతసత్యములను దర్శించిరి. మతజీవితము గడపుటకు, మతసత్యములను దర్శించుటకు, మతానుభవము పొందుటకు, ప్రవక్తల మగుటకు వారుసూచించు పద్ధతులను గ్రహించి, అవలంబింపవలెను; ఆ తరువాత మన కేమియు కనబడనియెడల, "మతములో నేమియు లేదు. నేను ప్రయత్నించి, విఫలుడనైతిని" అని చెప్పుటకు మన కధికారము గలదు.

అన్నిమతములకు నిది యాచరణ భాగము. ఇది లోకము లోని ప్రతి ధర్మగ్రంథములోను గలదు. మహాపురుషులు సిద్ధాంతములు, సూత్రములు బోధించుట మాత్రమేగాదు. వారి జీవితములలో మీకు సాధనమార్గములు కూడ కనబడును. నడవడిని నియమబద్ధముగా నిర్దేశింపకపోయినను, ఈ ప్రవక్తల జీవితములనుబట్టి వారు తమ ఆహార పానీయములకు గూడ కట్టుబాట్లు విధించుకొని యుండిన సందర్భములు కలవు. వారి జీవితమంతయు, వారి యాచరణ, వారిపద్ధతి, విధానము తమచుట్టు జేరిన ప్రజలకు పూర్తిగా భిన్నమైయుండెను; ఈ కారణముచేతనే ఉత్కృష్టజ్ఞానమును, భగవద్దర్శనమును వారు పొందగలిగిరి. మనముగూడ నట్టి

దర్శనము పొందగోరినయెడల వారిపద్ధతుల ననుసరింపవలెను. సాధన, అభ్యాసము, కృషి ఫలించినతోడనే మనమట్టిస్థితి పొందగలము. కనుక వేదాంత మవలంబించు విధానమిది: సిద్ధాంతములను ప్రతిపాదించుట లక్ష్య స్వరూపమును వివరించుట——తరువాత లక్ష్యమును పొందుటకు, మతము నర్థముచేసికొనుటకు, అనుభూతి పొందుటకు సాధనపద్ధతులు బోధించుట.

ఈ పద్ధతులు వివిధములుగా నుండవలెను. మనస్వభావములు విభిన్నములు. కనుక, ఏయొకపద్ధతియు మనలో నేయిరువురకుగాని యొకే విధముగా నన్వయముగాదు. మనలో ప్రతియొక్కరికిని కొన్ని కొన్ని వైపరీత్యములుండును. కనుక సాధనపద్ధతులు వేర్వేరుగా నుండవలసినదే. కొందఱు ఉద్రేకస్వభావులు; కొందఱు తత్త్వదృష్టి గలవారు, తార్కిక ప్రవృత్తిగలవారు; మఱికొందఱు నానావిధములయిన కర్మ కలాపములం దాసక్తిగలవారు, స్పష్టరూపములలో గ్రహింపగోరువారు. కర్మకాండయందు రూపకల్పనయందు అటువంటి మఱి యే పదతియందుగాని కొందఱకు గౌరవమే యుండదు. వారికవి మృత్యువుతో సమానము. మఱికొందఱు దేహమునిండ తాయెతులు, రక్షలు ధరింతురు. సంకేతములనిన వారికంత యిష్టము! ఆవేశ ప్రవృత్తిగలవారు ప్రతిజీవునియందు కరుణజూపుట కాతురపడుదురు; అట్టివారు దుఃఖింతురు. ప్రేమింతురు. వీరందఱకు ఒకే పద్ధతి ఉపయోగపడదనుట స్పష్టము. సత్యమును చేరుకొనుపద్ధతి ఒకేయొకటియైన పక్షమున అందుల కనుగుణమైన ప్రవృత్తి లేనివారందఱకు మృత్యువే శరణ్యమగుట స్పష్టము. కావున పద్ధతులు భిన్నములు కాకతప్పదు. వేదాంత మీ రహస్యమును గ్రహించి, మనము కృషిచేయుటకై లోకమున కనేకమార్గములను సూచించినది. వానిలో మీ కిష్టమైనదానిని స్వీకరింపుడు; అది మీకు సరిపడనిపక్షమున మఱియొకదానిని గ్రహింపుడు. ఈ దృక్పథముతో చూచినప్పుడు లోకమున అనేకమతములుండుట యెంతటి వైభవమో, గురువులు, ప్రవక్తలు పలువురుండుట యెంత శ్రేయ

స్థిరమో తేట తెల్లము కాగలదు. లోకములో ఒక్క మతము, ఒక్క ప్రవక్తమాత్రమే యుండవలెనని చాలమంది కోరుకొను చుందురు. మహమ్మదీయులు లోకమంతయు మహమ్మదీయ మతమయమై పోవలెనని కాంక్షింతురు; క్రైస్తవులు క్రైస్తవమయమై పోవలెనని, బౌద్ధులు బౌద్ధమయమై పోవలెనని ఆశపడుచుందురు. కాని, వేదాంతము, "మీరు కావలె ననుకొనినచో లోకములోని మానవులెల్లరు ఒక్కొక్కరు, ఎవరికివారు వేఱుగా నుండుడు; కాని, ఐక్యమను నొకే యొక సూత్రము అంతర్గతముగా నుండియే తీఱును. ప్రవక్తలు, గ్రంథములు, ద్రష్టలు, పద్ధతులు ఎంత యధికముగానున్న లోకమున కంత క్షేమము". "సమాజ జీవితములో — వృత్తులసంఖ్య యెంత యెక్కువగానున్న ప్రతి సంఘమున కంత యెక్కువ ప్రయోజనము, సంఘములోని ప్రతివ్యక్తి జీవనము చేయుట కంత యెక్కువ అవకాశములు కలుగును; భావ ప్రపంచము, మత ప్రపంచము విషయము గూడ నింతే. నేడు విజ్ఞానమున ననేక శాఖలుండుటవలన నెంతటి మేలుకలుగుచున్నది!- ఈ వైవిధ్యముతో ప్రతివ్యక్తి మనోవికాసము పొందుటకెంతటి యవకాశము కలుగుచున్నది! భౌతికభూమికయందు అన్ని విధములయిన విషయములు మన ముందు పఱచియుండుట యెంత ప్రయోజనకరము! మనకిష్టమైనదానిని, మన స్వభావమున కెక్కువగా సరిపడుదానిని నేర్చుకొనవచ్చునుగదా! మతప్రపంచమున గూడ నిదే విధము. ప్రపంచములో నిన్ని మతములుండుట జగదీశ్వరుని మహిమాన్వితమైన విధానము; ప్రతివ్యక్తికొక మతమేర్పడువఱకు వీని సంఖ్య వృద్ధిపొందు చుండునుగాక!

వేదాంత మీ విషయమును గ్రహించియే ఒకే ఒక ధర్మమును బోధించి, దానియాచరణకు విభిన్నమార్గములను గుర్తించినది. నీవు క్రైస్తవుడవయినను, బౌద్ధుడవయినను, యూదుడవయినను, హిందువుడవయినను — వ్యతిరేకముగా నొక్కమాట చెప్పదు.

నీవే పురాణమును నమ్మినను, నాజ్ రెత్ ప్రవక్తను పూజించినను, మక్కా పైగంబరును మన్నించినను, భారతీయ ఋషులను గౌరవించినను, మరేమహాత్ముని శిరసావహించినను, నీవే ప్రవక్తవయినను — వేదాంతమున కభ్యంతరము లేదు. ప్రతిమతమునకు ప్రాతిపదికమైన సత్యము నది యుద్ఘాటించును సకలప్రవక్తలు, ఋషులు, ద్రష్టలు ఆ సత్యమునకు ఉదాహరణలు. ప్రకాశములు కావలెనను కొనుచో ప్రవక్తల సంఖ్యను వృద్ధిచేయుము; వేదాంతమున కెట్టి యాక్షేపణయు లేదు. సత్యము నది ప్రతిపాదించినది; సాధన విధానమును నీకు వదలివేసినది. మీ కిష్టమగు మార్గము నవలంబింపుడు. మీ కిష్టమగుప్రవక్త ననుసరింపుడు. మీ ప్రకృతికి అనుగుణమగు మార్గము ననుసరింపుడు; అప్పుడు మీ ప్రగతి తథ్యము.

———

# మతస్వత్వములు

## (జనవరి 5, ఆదివారము)

మనోహరమైన సూర్యోదయమును బాల్యదశలో తిలకించి నప్పుడు మీరు తన్మయులయియుందురు. ఆ యానంద పారవశ్య మిప్పటికిని మీలో చాలమందికి జ్ఞాపకముండి యుండవచ్చును. జీవితములో నెప్పుడో యొకప్పుడు మీరందఱు సుందరమైన సూర్యాస్తమయ దృశ్యమును తదేకదృష్టితో కాంచియుందురు. ఆవలనున్న దేమో తెలిసికొనుటకు ప్రయత్నించి యుందురుకూడ. అఖిల విశ్వమునకును పునాదిగానున్న దదియే.—ప్రత్యక్షమున కావలనుండి ప్రభవించుట, ప్రత్యక్షమునుదాటి యావలకు నిష్క్రమించుట ; సమస్తజగత్తు అజ్ఞాతమైన దానినుండి వచ్చుచున్నది, అజ్ఞాతమైన దానిలో ప్రవేశించుచున్నది. అంధకారములోనుండి పసిబిడ్డవలె ప్రాకివచ్చుచున్నది. వృద్ధునివలె అంధకారములోకి ప్రాకిపోవుచున్నది.

మన జగత్తు :—ఇంద్రియ గోచరమగు జగత్తు, హేతుజ్ఞానగ్రాహ్యమగు జగత్తు, బుద్ధిగ్రాహ్యమగు జగత్తు ఇరు ప్రక్కలను నిరవధికము, అజ్ఞాతము, అజ్ఞేయమునగు దానిచే బద్ధమైనది. అన్వేషణకు రంగమిది, జిజ్ఞాసకు రంగమిది, యథార్థ సంఘటనలుగల తావిది. ఇందుండియే లోకమునకు వెలుగు మతము పేరిట ప్రసరించుచున్నది. మతము ప్రధానముగా నతీంద్రియ భూమికకు చెందినది ; ఇంద్రియబద్ధమగు భూమికకు చెందినది కాదు. అది తర్కమున కతీతమైనది ; బుద్ధిగ్రాహ్యమగునది కాదు. అది యొక అనుభూతి ; సాక్షాత్కారము ; అజ్ఞేయము, అజ్ఞాతమునయి యావలనున్న దానియందు ప్రవేశము. అంతట, తెలియరానిది తెలిసినదానికంటె నెక్కువగా తెలియుచుండును. నిజమునకది ''తెలిసికొనుట''కు సాధ్యముకానిది. మానవుని మనస్సులో ఈ యన్వేషణ మానవజాతిపుట్టి నప్పటినుండియు సాగుచున్నదనియే నా

నమ్మకము. ఈ జిజ్ఞాస విశ్వమున కావలనున్న దానికొఱకే. అన్వేషణ వినా, ప్రపంచ చరిత్రలో నేదశలోగాని తార్కికశక్తి, బుద్ధివికాసము సాధ్యమైయుండవు. మనస్సనెడి మన చిన్నప్రపంచములో భావ తరంగమొకటి లేచును. అది యెందుండి ప్రభవించు చున్నదో, అదృశ్యమగునప్పుడది యెక్కడకు పోవుచున్నదో మనకు తెలియదు. బాహ్య ప్రపంచము, మానవప్రపంచము ఒకే ఇరుసులో, ఒకే దశలో, ఒకే అంతస్తులో సాగిపోవుచున్న ట్లనిపించుచున్నది.

మతములు వెలుపలనుండిగాక మానవుని నుండియే వచ్చినను హిందూ సిద్ధాంతమును మీకు తెలియ చేయుటకు ప్రయత్నింతును. మత విచారమును మనుష్యప్రకృతి యందంతర్నిహితమై యున్న దని నా నమ్మకము. మనస్సును, దేహమును విసర్జించినగాని, ఆలోచన, జీవితము ఆగిపోయినగాని మతదృష్టిని విడనాడుట సాధ్యము గాదు. మానవునకు ఆలోచన యున్నంతవఱకు ఈ ప్రయత్నము సాగిపోవుచుండ వలసినదే. అంతవఱకు ఏదోయొక రూపములోఅతనికి మతముండి తీఱవలసినదే. కనుకనే లోకమున మతస్వరూపము లనేకము లేర్పడినవి. వాని పరిశీలన మన కయోమయము కలిగించును. కాని, పలువురు భావించునట్లు వాని పరిశీలన నిష్ప్రయోజనముమాత్రముగాదు. ఈ సంక్షోభమునందు సమన్వయమున్నది. అపశ్రుతులమధ్య సామరస్యము ధ్వనించుచున్నది. దానిని వినగల వారు స్వరము నందుకొనగలరు.

ఈ కాలమున మనమెదుర్కొనవలసిన ప్రశ్నలన్నిటిలో మిక్కిలి పెద్ద ప్రశ్నయిది: తెలిసినది, తెలియదగినది యిరుప్రక్కల అజ్ఞేయము, అనంతముగా నజ్ఞాతమునయిన దానిచే బద్ధమై యున్నదని యంగీకరింతుము; మరి ఆ అజ్ఞాతమైదాని నన్వేషింప నేల ? తెలిసిన దానితో నేల సంతృప్తిపడరాదు ? తినుటతో, త్రాగుటతో, సంఘమునకేదో కొంచెము మేలుచేయుటతో నేల సంతృప్తి పడగూడదు ? నేడిప్పుడీ భావమే ప్రాబల్యము వహించుచున్నది. విద్వత్ప్రముఖుడయిన ఆచార్యుని మొదలు అప్పుడే

మాటలు నేర్చుకొనుచున్న శిశువులకు అందఱు ''లోకమున కుపకారముచేయుడు. అదే మతము. సృష్టి రహస్యమును గుఱించిన జిజ్ఞాసతో తలబ్రద్దలు కొట్టుకొనవలదు'' అనిచెప్పుట నేర్చుకొనినారు. తత్ఫలితముగా నేడీ వాదములు స్వతః సిద్ధమైనవిగా పరిగణింపబడు చున్నవి.

కాని, మన భాగ్యవశమున సృష్టిమర్మమును భేదింప వలసియే యున్నది. వ్యక్తమైన ఈ వర్తమానము, ఈ ప్రత్యక్షము అవ్యక్తముగానున్న దానిలో నొక అంశమాత్రమే. అనంతమైన ఆత్మప్రపంచము ఇంద్రియ చేతనమగు భూమికపై ఈషణ్మాత్రము వ్యక్తమైనది. ఆవల నేమున్నదో తెలిసికొనక దీని కర్థము చెప్పుటెట్లు? దీని తత్త్వమిదియని నిర్ధరించుట ఏవిధముగా సాధ్యము? ఒకనాడు సోక్రటీసు ఏథెన్సు నగరములోనికిపోయి ఉపన్యసించు చుండగా గ్రీసు దేశమునకుపోయిన బ్రాహ్మణుడొకనిని కలసికొనుట సంభవించెను. సకల విద్యలలో మానవునిగుఱించి తెలిసికొను విద్యయే గొప్పదని సోక్రటీసు విప్రునితోననెను. వెంటనే విప్రుడిట్లు ప్రశ్నించెను : 'దేవుని తెలిసికొనక మానవు నెట్లు తెలిసికొనగలవు?' ఈ దేవుడు, శాశ్వతముగా నజ్ఞేయమైనది, పరమమైనది లేదా, అనంతమైనది, నామరహితమైనది—లేదా, మీకిష్టమైన మఱే పేరుతోనయినను దీనిని వ్యవహరింపుడు—ఇదే ఇదొక్కటె మన ప్రస్తుత జీవితములో తెలిసిన దానికిని, తెలియదగిన దానికిని అర్థము, హేతువు చెప్పగలిగినది. మీరేదయిన, పరమభౌతికమైన దానిని తీసికొనుడు— భౌతికవిజ్ఞాన శాస్త్రములలో దేనినైనను తీసికొనుడు. రసాయనిక శాస్త్రమునో, పదార్థవిజ్ఞాన శాస్త్రమునో, ఖగోళ శాస్త్రమునో, జీవశాస్త్రమునో—అధ్యయనము చేయుడు; ఇంకను పరిశోధనచేయుడు. పరిశోధన నింకను సాగింపుడు. పరిశోధనలో ముందుకుపోగా, పోగా స్థూలరూపములన్నియు కరగి సూక్ష్మము లగును. సూక్ష్మము సూక్ష్మతరమగును. చివరకొకదశలో భౌతిక మునకుగల సరిహద్దుదాటి భౌతికముకాని సీమలో ప్రవేశింపవలసి

వచ్చును. ఏ విషయమునుగుఱించిన జ్ఞానరంగమునగాని స్థూలము సూక్ష్మమగును : పదార్థవిద్య అధివిద్యలో లీనమగును, భౌతికము ఆత్మయగును.

మనకు సంబంధించిన ప్రతివిషయము ఇట్టిదే—మన సంఘము, మన పరస్పర సంబంధములు .—మన మతము, మీరు నీతియనిచెప్పు శాస్త్రము. కేవలము ప్రయోజనదృష్టి ప్రాతిపదికగా నీతిశాస్త్రమును నిర్మించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఎవరయినను సరే, అట్టి హేతుజ్ఞాన నిబద్ధమగు నైతికవిధానమును నిర్మింపగలరా యని నేను సవాలుచేయుచున్నాను. ఇతరుల కుపకారము చేయుడు. ఎందువలన ? అది పరమోత్కృష్ట ప్రయోజనసాధనము గనుక. ''నేను ప్రయోజనముకొఱకు లెక్క-చేయను ; నేను ధనవంతుడ నగుట కితరుల గొంతులు కోయవలెనని యున్నది.'' అని ఎవరయిన పలుకునని యనుకొందము. దీనికేమి సమాధానము ? ప్రపంచమునకు నేనుపకారము చేయుటవలన కలుగు ప్రయోజనమేమి ? ఇతరుల సుఖముకొఱకు నా జీవితమును వినియోగించునంతటి మతిమాలినవాడనా, నేను ? సంఘమునకు మించిన గొప్పచేతన మేమియు లేనిచో—పంచేంద్రియముల కతీతమైన శక్తి జగత్తులో లేనిచో నేనే ఎందుకు సుఖపడరాదు ? రక్షకభటులకు చిక్క-కుండ తప్పించుకొనగలుగుచు, నేను సుఖపడుటకు వీలయినపక్షమున నా సహోదరుల కుత్తుకల నుత్తరింపకుండ నన్ను నివారించుట కేమిగలదు ? ఇందుకు మీ సమాధానమేమి ? ఏదో ప్రయోజనమును మీరు విధిగా చూపవలసిన వారగుచున్నారు. ఉన్నచోటునుండి మిమ్ము త్రోసినయెడల, ''సఖుడా, శుభముచేయుట శుభము.'' అని పలుకు మానవమనస్సులోని శక్తియేది ? ఆత్మ గాంభీర్యమును, శుభమునందలి సౌందర్యమును, శుభమునందలి సర్వాకర్షణశక్తిని, శుభమునందలి యనంతశక్తిని మనయెదుట మనోహరముగా ప్రదర్శించు శక్తియేది ? ఆ శక్తినే మేము దేవుడందుము.

మఱొక సూత్ర విషయమునుగుఱించి కూడ మనవి చేయదలచుచున్నాను. నే జెప్పు విషయమునుగుఱించి వేగిరపాటుతో మీరు సిద్ధాంతములు చేయకుడు. సావధానముగా వినుడు. మనము లోకమున నెక్కువ ఉపకారము చేయజాలము. లోకమున కుపకారము చేయుట చాలమంచిపనియే. అయితే, నిజముగా మనము లోకమున కెక్కువ మేలుచేయగలమా? శతాబ్దములుగా మానవుడు చేయుచున్న కృషిఫలితముగా మన మెక్కువ మేలుసాధించితిమా? ప్రపంచములోని సుఖము మొత్తము మునుపటికంటె పెరిగినదా? లోకములో సుఖమును పెంపొందించుట కనుదినము వేలకొలది యుపాయములు కనిపెట్టబడుచున్నవి. ఈ విధముగా లక్షలకొలది వర్షములుగా కృషి జరుగుచున్నది. నేను మిమ్మొక ప్రశ్న యడుగుచున్నాను. "నేడు ప్రపంచములోని మొత్తము సుఖము శతాబ్దమునకు పూర్వముకంటె ఎక్కువైనదా లేదా. ఎక్కువగుటకు వీలుకాదు. సముద్రములో లేచు ప్రతికెరటమున కొక పల్లమేర్పడక తప్పదు. ఒకచోటున పల్లమేర్పడక మఱొకతావున కెరటము లేచుట సాధ్యముగాదు. ఒక జాతి ధనవంతము శక్తిమంతము అయినచో మఱెక్కడనో ఒక జాతి ఆ మేరకు నష్టపడవలసినదే. మనము కనిపెట్టు ప్రతియంత్ర మిరువదిమందిని ధనవంతులను చేయును; ఇరువదివేల మందిని దరిద్రులను చేయును. అది సర్వోసర్వోత్రగల పోటీసూత్రము. అంతటను ప్రదర్శిత మగుచున్న శక్తి పరిమాణ మొక్కటే. అది పిచ్చి సాహసపు పని. ఒకప్రక్క దుఃఖము లేకుండా సుఖము కలుగజేయవచ్చుననుకొనుట హేతువిరుద్ధము. ఈ సకల సాధనముల పెంపుతో ప్రపంచములోని కొఱత నెక్కువచేయుచున్నారు. కొఱత లెక్కువగుట యనగా తీరని దాహమును కలుగజేయుటే. ఈ కొఱతను, ఈ తృష్ణను తీర్చగలిగినదేది? ఈ తృష్ణ యున్నంత వఱకు దుఃఖము తప్పదు. వంతుల వరుసను సుఖదుఃఖము లనుభవించుటే జీవితలక్షణము. జీవిత స్వభావమే అంత. ఇంకొకసంగతి: నీవు మేలుచేయుటకే ఈ లోకము ఏర్పాటు చేయబడినదా? ఈ

లోకములో పనిచేయుచున్న శక్తి మరేదియు లేదా? ఈ ప్రపంచపు బాధ్యత నీకు, నాకు, అప్పగించి దేవుడు అస్తమించెనా? నిత్యుడు, సర్వశక్తిమంతుడును సర్వదయాపరుడు నిరంతర నిర్నిద్రుడును అనిమేషుడును, జగత్తు నిద్రపోవుచున్నప్పుడును నిద్రలేనివాడునగు భగవంతుడు లేడా? ఈ యనంతాకాశమతని జాగృన్నేత్రము. అతడు చచ్చిపోయెనా? అతడీ విశ్వములో పనిచేయుట లేదా? గమనము నిలిచిపోలేదే? నీ వేమియు నా తొరపడ నవసరము లేదు. నిష్కారణముగా నిన్ను నీవు దుఃఖపెట్టుకొనరాదు.

[ఇచ్చట స్వామీజీ ఒక కథ చెప్పెను: అందలి విషయమిది. ఒకడొక భూతమును తనకు పనిచేసిపెట్టుచుండుమని కోరుచు తపస్సు చేసెను. భూతము ప్రత్యక్షమైనతరువాత దానికి నిర్విరామముగా పనిచెప్పుట అలవికాని పనియయ్యెను. తుదకతడు దానికొక కుక్కనిచ్చి దానితోక సరిచేయుచుండుమని చెప్పెను.]

ప్రపంచమునకు మేలుచేయు విషయమైన మనపనికూడ అటువంటిదే. లక్షలకొలది వర్షములుగా మనము కుక్కతోకను సరిచేయుచున్నాము. అది కీళ్ళవ్యాధివంటిది. పాదములలోనుండి దానిని తఱిమితిరా, అది తలలోకిపోవును. తలలోనుండి తఱిమివేయుడు. అది మఱొకచోటికి పోవును.

ఇది మీలో ననేకమందికి భయంకరమైన నిరాశావాదముగా కనుపించును. కాని, యిది నిరాశావాదముకాదు. నిరాశావాదము, ఆశావాదముకూడ దోషయుక్తములైన సిద్ధాంతములే. యథార్థమునకు రెండును రెండుకొనలు. అన్నవస్త్రములు పుష్కలముగానున్నంతవఱకు మానవుడు గొప్ప ఆశావాదియే; అతడే తన సర్వస్వము గోల్పోయినతరువాత నిరాశావాదియగును. సర్వసంపదను కోల్పోయి, నిరుపేదయైనతరువాత—అప్పుడే—మానవ సౌభ్రాత్రమునుగుఱించిన అభిప్రాయములతనికి బలముగా కలుగును. ఇది ప్రపంచము తీరు. వివిధదేశములకు బోయి, ఈ ప్రపంచతత్త్వమును

గ్రహించుచు, వయస్సు మీాదపడుకొలది నేసీ యుభయ తీవ్రదృక్పథ ములను విడిచిపెట్టుటకు ప్రయత్నించుచున్నాను. ఈ ప్రపంచము మంచిదియుకాదు, చెడ్డదియుకాదు. ఇది సర్వేశ్వరుని ప్రపంచము. ఇది మంచిచెడ్డల కతీతము, స్వయం సంపూర్ణమునయిన ప్రపంచము. అతని సంకల్పము, ఈ వేర్వేఱు పటములనుచూపుచు, నిర్విఘ్న ముగా నెరవేరుచున్నది ; ఆ ద్వంతములు లేక అతనిసంకల్పమే వ్యక్త మగుచున్నది. ఇదియొక గొప్ప తాలింఖానా. మీారు, నేను, లక్షల కొలది ఆత్మ లిచ్చటికివచ్చి, వ్యాయామముచేసి, శక్తిమంతులము, పరిపూర్ణులము నగుచున్నాము. ఇందుకే యిదియున్నది. భగవానుడు పరిపూర్ణమైన ప్రపంచమును సృష్టింపజాలడని కాదు. లోకములోని దుఃఖమును నివారింప లేడనియు కాదు. ఒక మతాచార్యునకును ఒక యువతికిని జరిగిన సంవాదము మీాకు జ్ఞప్తియందుండవచ్చును. వారిరువురు టెలిస్కోప్ ద్వారా చంద్రుని చూచుచు, అందలి కొన్ని మచ్చలను గుర్తించిరి. ''అవి నిశ్చయముగా చర్చిల శిఖరములే,'' అని మతాచార్యుడనెను. ''ఛీ, ఛీ, వారు యువప్రేయసీ ప్రియులు. వారు పరస్పరము చుంబనము చేయుచున్నారు. ఇది నిస్సం శయము.'' అని యువతి పలికెను. ప్రపంచముతో మనవ్యవహార మీా తీరుగానే యున్నది. మనము లోపలనున్నప్పుడు లోపలి భాగ మును చూచుచున్నా మనుకొందుము. మనమున్న అంతస్తునుండి ప్రపంచమును తిలకించుచున్నాము. వంటయింటిలో నిప్పుమంచి దియుకాదు, చెడ్డదియుకాదు. అది మీాకన్నమువండి పెట్టినప్పుడు మీారుదాని నాశీర్వదించి, ''నిప్పెంతమంచిది ?'' అందురు. మీావ్రేలు కాలినప్పుడు, ''ఎంత పాడుపనిచేసినది ?'' అందురు. ''ఈ ప్రపంచము కూడ మంచిదికాదు, చెడ్డదికాదు.'' అనుటకూడ న్యాయము, హేతుసమ్మతము. ఈ ప్రపంచ మీాప్రపంచమే. ఇదెప్పుడు నిట్లే యుండును. ఈ ప్రపంచ కార్యకలాపములు మన కుపయోగ కరముగానుండునట్లు మనము చూడగలినప్పుడది మంచిదందుము. మనకది బాధాకరముగా నుండునట్లు చూచునప్పు డది చెడ్డది

యందుము. బాలబాలికలు అమాయకులుగను, ఆనందముతోను ఉందురు. వారెవ్వరికిని హాని తలపెట్టరు, వారాశావాదులుగ నుందురు; సుందరమైన సుఖస్వప్నములు కనుచుందురు. వృద్ధులు—మనస్సునిండ కోర్కెలు పెట్టుకొని, వానిని నెరవేర్చుకొనగల అవకాశము లేనివారు—ముఖ్యముగా లోకపు ఆటుపోటులకు గుఱియయి, క్రుంగిపోయినవారు—తీవ్ర నిరాశావాదులగుదురు. సత్యము తెలిసికొనుటే మతలక్ష్యము. యథార్థము తెలిసికొనని జీవితము నిరర్థకమని అది గ్రహించిన తొలిపాఠము.

సృష్టిమర్మమును తెలిసికొనని పక్షమున జీవితము ఎడారి వంటిదయి పోవును; మానవజీవితము నిరర్థకమగును. "ప్రస్తుతమున్న దానితో సంతృప్తిపడుడు." అని చెప్పుట విన సొంపుగానే యుండును. ఆవులు, కుక్కలు ఆవిధముగానే యున్నవి. అట్లుండుట వలననే అవి పశువులయినవి. మానవులందఱు ఉన్న దానితోనే తృప్తిపడి, విశ్వమున కావలనున్న దానికొఱకు అన్వేషణ విరమించిన యెడల మానవజాతి మరల పశుస్థాయికి దిగిపోవలసివచ్చును. మతమే—పరతత్త్వమును గుఱించిన జిజ్ఞాసయే మానవుని జంతువుల నుండి వేఱుచేయుచున్నది. స్వాభావికముగానే పైకిచూచు జీవి మానవుడేయనుట యథార్థము. తక్కిన జంతువులన్నియు క్రిందికి చూచును. ఒక్క ఊర్ధ్వాభిముఖము, ఊర్ధ్వగమనము, పరిపూర్ణత్వముపొందుట మోక్షసాధనములు. మానవుడెంత శీఘ్రముగా పైకిపోవుట ప్రారంభించిన, సత్యమే మోక్షమను అభిప్రాయమున కనుగుణముగా అతడంత శీఘ్రగతిని ఉన్నతిబడయును. అది మీ జేబులోనున్న మొత్తము డబ్బెంత యనుదానిపై గాని, మీరు ధరించు దుస్తులపై గాని, మీరు నివసించు గృహముపై గాని కాక—మీ మెదడులోని ఆధ్యాత్మిక భావసంపదపై ఆధారపడియుండును. మానవాభ్యుదయమున కదే గీటురాయి; భౌతికాభివృద్ధికి, జ్ఞానాభివృద్ధికి మూలమదే; వెనుకనుండి నడుపుచున్న ప్రేరకశక్తియదే; మానవకోటి పురోగతికి ప్రోత్సాహము కలిగించునదదే.

మానవజాతి చరమగమ్యమేమి ? సుఖానుభవమా ? ఇంద్రియ భోగమా ? స్వర్గములో తప్పెట్లు వాయించుచు సింహాసనముచుట్టు తాము నివసించుచుందుమని పూర్వము చెప్పుకొనుచుండెడివారు ; ఈ కాలమున ఆ యాశయము చాలదేమో! అక్కడ వివాహములు చేసికొందుమని, భోగము లనుభవింతుమని చెప్పి వెనుకటి ఆశయము నకు మెఱుగు పెట్టిరి. ఈ రెంటిలో నేదో ఒకటి మెరుగుగా నున్న దనుకొనినపక్షమున రెండవదే హీనముగానున్నదని తెలుపజెల్లును. స్వర్గమునుగుఱించిన వివిధసిద్ధాంతములు మనోదౌర్బల్యమునకు నిదర్శనములు. ఆ దౌర్బల్యమిది : ఇంద్రియభోగమే జీవిత పరమా వధియని యనుకొనుట, మొదటిది. పంచేంద్రియముల కతీతమైన దానిని భావించలేకపోవుట రెండవది. ప్రయోజనవాదు లెంతటి సబబులేనివారో, వారును అంతటివారే. అయినను ఆధునిక నాస్తిక ప్రయోజనవాదులకంటె వారు చాల మెరుగు. అసలీ ప్రయోజన దృష్టిలో కఱ్ఱతనమున్నది. "ఇదిగో, యిక్కడ నా కొలబద్ద ఉన్నది. నా కొలబద్దతోనే యావద్విశ్వమును నిర్ణయింపవలెను." అని చెప్పు టకు మీకేమి అధికారమున్నది? తిండి, డబ్బు, బట్టలు—ఇవే దేవుడని బోధించు మీ కొలబద్దతో ప్రతిసత్యమును నిరూపింప బ్రయ త్నించుటకు మీకేమి యధికారముగలదు ?

మతము తిండిలోను, ఇంటిలోను లేదు. "మతమువలన ప్రయోజనమేమి ?" అను ప్రశ్న మాటిమాటికి వేయుచుండుట మనము వినుచుందుము. "అది పేదల దారిద్ర్యమును బాపి వారికి మరికొన్ని దుస్తులీయగలదా?" ఆపని చేయజాలదనియే అనుకొందము. అంతట మత మసత్యమని ఋజువయినట్లేనా? ఖగోళశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతము నొకదానిని మీరు నిరూపించుచున్నప్పుడు బాలుడొకడులేచి, "అది నాకు అల్లంమొరబ్బా తెచ్చిపెట్టునా?" అని యడిగెననుకొందము. "అబ్బే, అది తెచ్చిపెట్టదు." అని కదా, మీరు చెప్పుదురు! "అయితే అదంతయు నిరర్థకము" అని బాలు డనును. నిఖిల విశ్వమును బిడ్డలు తమచూపుతోనే చూతురు ;

అల్లం మొరబ్బా తెచ్చిపెట్టుటతోనే చూతురు. ప్రపంచములోని బిడ్డలందఱు నట్లే యోచింతురు.

ఈ పందొమ్మిదవ శతాబ్దము చివర ఈ యభిప్రాయములను ప్రతిపాదించువారు విద్యాధికులుగా, హేతుజ్ఞాన ప్రపూరితులుగా, ఉద్దండతార్కికులుగా, అపూర్వ ప్రతిభాసంపన్నులుగా ప్రస్తుతింపబడుట శోచనీయము.

ఉత్తమ విషయములను మన తక్కువచూపుతో నిర్ధరించరాదు. ప్రతివిషయమును దానికి సంబంధించిన కొలబద్దతో నిర్ణయించవలెను. అనంతము ననంతప్రమాణముతోనే నిర్ణయించవలెను. మతము మానవజీవిత పరివ్యాప్తము. అది జీవితములోని అన్ని ప్రకరణములలోను వ్యాపించును. ఈ యొక్క జీవితములోనే గాదు. పూర్వవర్తమానభవిష్యజ్జీవితములలో నది వ్యాప్తమగును. అది శాశ్వతమైన ఆత్మకు, శాశ్వతమైన దేవునికిఁగల శాశ్వతమైన సంబంధము. అయిదు నిమిషముల మానవజీవితముపై దాని ప్రభావమునుచూచి, దాని విలువను నిర్ణయించుట సహేతుకమేనా? ఎంతమాత్రమునుగాదు. ఈ చెప్పినవన్నియు ప్రతివాదమును ఖండించు యుక్తులు.

ఇప్పు డసలుప్రశ్ననుగుఱించి యోచింతము: మతమువలన నిజముగా నేమయిన ప్రయోజనముకలదా? కలదు.

మతము అన్నవస్త్రములను సంపాదించిపెట్టగలదా? తెచ్చిపెట్టగలదు. ఆ పని యది సర్వదా చేయుచునేయున్నది. అంతకంటె ననంతమైన మేలుకూడ నది చేయగలదు. అది మానవున కమృతజీవనము ప్రసాదించగలదు. మానవుని ప్రస్తుతస్థితికి గొనివచ్చిన దదియే. అది యింకను ఈ మానవపశువును దేవునిగాఁ చేయును. మతము చేయగలపనియిది. మానవ సమాజమునుండి మతమును తీసివేయుదము. మిగులునదేమి? అడవిమృగములు మాత్రమే. ఇంద్రియభోగమే మానవజీవిత పరమలక్ష్యమనుకొనుట పెద్దతప్పు

అని చూపుటకు నేనింతముందు ప్రయత్నించితిని. దానితోపాటు జ్ఞానసాధనమే జీవితలక్ష్యమని గ్రహింపనగును. సత్యాన్వేషణలో, మానవకోటి సౌభాగ్య సాధనలో వేలకొలది సంవత్సరములుగా పడిన ప్రయాసవలన మనము చెప్పదగినంత అభివృద్ధిపొందలేదని నిరూపించుటకు ప్రయత్నించితిని కాని, మానవుడు జ్ఞానరంగమున అద్భుతముగా పురోగమించెను. కొన్ని శారీరక సౌఖ్యములు కాక, మహత్వము బలీయముగానున్న మానవుని దేవునిగా మార్చుటే ఈ యభివృద్ధివలన కలిగిన పరమోత్కృష్ట ప్రయోజనము. సహజముగా జ్ఞానము ననుసరించియే యుండునది యానందము. ఇంద్రియసౌఖ్యమే గొప్పసౌఖ్యమని బిడ్డలనుకొందురు. ఇంద్రియములందుకంటె బుద్ధియందింకను ఉత్కృష్టమైన సౌఖ్యమున్నదని మీలో చాలమందికి తెలియును. తినుటలో కుక్క పొందు సౌఖ్యము మీలో నెవ్వరును పొందజాలరు. ఈ విషయము మీరు గమనింపుడు. మానవునిలో సౌఖ్య మెచ్చటనుండి వచ్చును? తినుటలో కుక్కకుగాని, పందికిగాని విశేష సౌఖ్యముండును. పంది యెట్లు తినునో చూడుడు. అది తినునప్పుడు ప్రపంచమును పూర్తిగా మఱచిపోవును; దాని యాత్మయంతయు ఆహారముతో ఒక్కటి అయినది. అది తినుచున్నప్పుడు దానిని చంపినను సరే, అది లక్ష్యపెట్టదు. పంది పొందెడి గాఢమైన సౌఖ్యమునుగుఱించి యోచింపుడు? ఏ మానవునికిని అంతటి సౌఖ్యములేదు. అదెక్కడకు పోయినది? దానిని మానవుడు బుద్ధిగతమైన సౌఖ్యముగా మార్చుకొనినాడు. పంది మతమును గుఱించిన ఉపన్యాసముల విని యానందింపజాలదు. బుద్ధిగతమైన సౌఖ్యములకంటె మఱొక మెట్టుపైన ప్రగాఢమైన యుత్కృష్టసౌఖ్య మున్నది. అదిఆత్మానందము. తార్కికదృష్టిని, బుద్ధిని దాటి దివ్యవిషయముల ననుభవించెడి ఆధ్యాత్మికానందమది. అది ఆత్మస్థాయియందే సాధ్యము. దానిని పొందుటకు ఇంద్రియ భోగములన్నిటికి మనము స్వస్తిచెప్పవలెను. ఇది పరమోత్కృష్ట ప్రయోజనము. మన మనుభ

వించునది—ప్రతివ్యక్తి యనుభవించునదే ప్రయోజనము. దాని కొఱకే మన ప్రయాస.

పశువు అనుభవించు ఇంద్రియ సౌఖ్యముకంటె మానవుడు మానసిక సౌఖ్యము నెక్కువగా ననుభవించునని మనకు తెలియును. అతడు మానసిక సౌఖ్యముకంటె ఆత్మానందము నధికముగా ననుభవించును. కనుక పరమోత్కృష్ట జ్ఞానము ఆత్మజ్ఞానమే. ఈ జ్ఞానము వలననే ఆనందము లభించును. ఈ ప్రాపంచిక విషయములన్నియు కేవలము ఛాయామాత్రములే; పరమప్రాప్యమైన యథార్థజ్ఞానమునకు, ఆనందమునకు దిగువనే గణనీయములు.

మానవకోటిని ప్రేమించుటవలన కలుగు ఆనందానుభూతి యది; ఆత్మానందమునకు ఛాయామాత్రమే మానవప్రేమ. అదియు మానవసౌఖ్యము నొక్కటే అని భ్రమింపకుడు. అది దారుణమైన ప్రమాదము. తఱచుగా మనమిట్టి పొరపాటు పడుచుందుము. శారీరకప్రేమ, మానవులప్రేమ, అణువులయెడల మమకారము, సంఘములోని వ్యక్తులయెడలగల విద్యుదాకర్షణ—దీనినే ఆత్మానందమని పొరపడుచుందుము. దీనినే శాశ్వతానందమని భ్రమించుచుందుము. కాని, ఇది యది కాదు. అది శాశ్వతజ్ఞానముకూడ. మన గమ్యమది. ప్రపంచమంతటను, మత మెక్కడిదయినను, క్రొత్తగా మతమెక్కడపుట్టినను, మతములన్నియు ఒకే ఒక మూలమునుండి ప్రభవించినవి. ఆ మూలము వివిధదేశములలో వివిధనామములతో వ్యవహరింపబడినది. అదే అపరోక్షానుభూతి. మతవిషయక జ్ఞానమునకు మూలమనుభూతియే. ఆ యనుభూతియేమి? మతము ముఖ్యముగా అతీంద్రియ స్థాయికి చెందినది. అది యవాఙ్మానస గోచరమైనది. అక్కడకు చూపుచేరదు. కర్ణేంద్రియము దానిని గ్రహింపలేదు. ఉదాత్తమైనది మతరంగము, మతలక్ష్యము. ఈ యంతస్తులోనే మనకనుభూతి కలుగుచున్నది. అనగా, ఇంద్రియముల నధిగమించుట కుపాయమేదో యుండియుండవలెనని గ్రహింపనగును. మన హేతువాద వింద్రియ

ముల నధిగమించజాలదనుట ముమ్మాటికి నిజము. హేతువాద మంతయు నింద్రియబద్ధము. హేతువాదమునకు ప్రాతిపదిక ఇంద్రియ గ్రాహ్యమగు విషయములే. అయితే, మానవుడింద్రియముల నతిక్రమింపగలడా? అతడజ్ఞేయమైనదానిని తెలిసికొనగలడా? ఈ ప్రశ్న పైనే మతవిషయమంతయు నాధారపడియున్నది; నిర్ణయించబడియున్నది. అనాదిగా ఇంద్రియముల నడ్డగించు హద్దుగలదు; అనాదిగా వందలకొలది, వేలకొలది పురుషులు, స్త్రీలు ఈగోడను డీకొని దీనినిదాటి యావలకుపోవుటకై ప్రయత్నించిరి. లక్షలకొలది జనులీ ప్రయత్నమున విఫలులైరి; లక్షలకొలదిజనులు సఫలులైరి. ప్రపంచ చరిత్ర యిది. ఒక్కరయినను ఈ ప్రయత్నములో విజయము బొందినట్లు నమ్మనివారు లక్షలమందిగలరు. వీరే ఈనాటిసంశయవాదులు. ప్రయత్నముచేసినచో మానవుడీగోడను దాటగలడు. మానవునకున్నవి యింద్రియములు, హేతుజ్ఞానము మాత్రమేకాదు. ఇంద్రియములను మించిన దతనిలో చాలగలదు. అదేదో కొంతవివరించుటకు ప్రయత్నింతును. అది మీలోగూడనున్నదని గ్రహింపగలుగుదురని ఆశించుచున్నాను.

నేను నాచేతిని కదపుచున్నాను. నాచేతిని కదపుచున్న సంగతి నాకు తెలియును; నాకా యనుభవముకూడ గలుగును. దీనిని నేను చైతన్యమందును. నాచేతిని కదపుచున్నానను చైతన్యము నాకుగలదు. నాహృదయము స్పందించుచున్నది. నాకాయెఱుక లేదు; అయిననేమి? నాహృదయమును స్పందింపజేయుచున్న దెవరు! ఈ పనిచేయుచున్నదిగూడ అదేవ్యక్తి. చేతులను కదలించుచు, మాట్లాడుచున్న వ్యక్తి—అనగా, చైతన్యముతో పనిచేయుచున్న వ్యక్తి ఎఱుకలేకుండ పనిచేయగలడనుట స్పష్టము. ఒకే జీవుడు రెండంతస్తులలో—చేతన భూమికమీద, దానిదిగువను నిశ్చేతన భూమికమీదగూడ—పనిచేయగలడని మనము గ్రహింపగలము. నిశ్చేతన భూమికనుండి కలుగుచుండు స్ఫురణలను సహజప్రవృత్తి ప్రేరణలందుము. చేతన భూమికనుండి కలుగుచుండు స్ఫురణలను

హేతుజ్ఞానమందుము. ఈ రెంటికి అతీతముగా మఱొకభూమిక గలదు. దీని కతీంద్రియ భూమికయనిపేరు. స్థూలదృష్టికిది నిశ్చేతన భూమికవలె తోచును. ఇది చేతన భూమికకతీతముగా నున్నదిగదా! అయితే యిది చేతన భూమికకు పైన ఉన్నదిగాని క్రిందలేదు. అది శారీరక ప్రేరణకాదు, అతీంద్రియానుభూతి. ఇందుకు నిదర్శన మున్నది. ప్రపంచములో నింతవఱకు పుట్టినప్రవక్తలను, ఋషులను చూడుడు. వారు తమ జీవితములలో అప్పుడప్పుడు బాహ్య ప్రపంచ స్మృతిని కోల్పోయినట్లుందురు; అట్టిస్థితిలోనుండి సాధారణస్థితిలోనికి వచ్చినతరువాత తమనుండి వెలువడెడి జ్ఞానమంతయు తాము ఆస్థితి యందుపొందినదనియే వారు చెప్పిరి. సోక్రటీసు సేనతో నడచి వెడలు నప్పుడొకచోట సూర్యోదయమైనది. మనోహరమైన ఆ దృశ్యమును తిలకించి సోక్రటీస్ నిశ్చేష్టుడయి రెండురోజులక్కడనే నిలబడి పోయెను. ఆ దృశ్యమతని మనస్సులో భావ పరంపరను ప్రేరే పించెను. అట్టి ముహూర్తములోనే అతనికిసృష్టిమర్మము వెల్లడి యయ్యెను. మహాప్రవక్తల అనుభూతి ఇట్టిదే, జగద్గురువులందఱి యనుభవమిట్టిదే. వారు కొన్ని వేళల చేతన భూమికనుండి పైకి పోవుదురు. మరల వారు సాధారణస్థితిలోనికి తేజోనిధులై వత్తురు; అతీతస్థాయినుండి వార్తలు గొనివత్తురు. వీరు సాక్షాత్కారము పొందిన ద్రష్టలు.

అయితే యిక్కడొక పెద్దముప్పుకలదు. ఎవరైననుసరే, తాము సాక్షాత్కారము పొందితిమని చెప్పవచ్చును. పలుమాఱు లిట్లనివారు చెప్పుచుందురు. ఇందుకేమి నిదర్శనముగలదు? సుషుప్తి యందు మనకెఱుకయుండదు. మూఢుడు నిద్రపోవును; మూడు గంటలకాలము ఒడలుమఱచి నిద్రించును; మేల్కొనిన తరువాత అతడు మునుపటి మూఢుడే. నాజరెత్ పౌరుడు జీసస్ అతీంద్రియాను భూతి పొందినాడు. పిదప అతడు ఏసునాథుడుగామాఱినాడు. భేద మంతయు నిదే. ఒకటి అతీంద్రియానుభూతి, మఱొకటి శారీరక ప్రేరణ. ఒకడు అనుభవజ్ఞానముపొందిన వృద్ధుడు, మఱొకడు

బాలుడు. ఇట్టి అపరోక్షానుభూతి మనలో ప్రతియొక్కరికి సాధ్యమే. ఇది సకలమతములకు మూలము; సకల ఉత్కృష్ట జ్ఞానమునకు మూలము. అయిన నిందులో దారుణమైన అపాయములున్నవి. ఒక్కొక్కప్పుడు వంచకులు జనులను మోసగించుటకు ప్రయత్నింతురు. ఈ దినములలో నిట్టి మోస మెక్కువగా జరుగుచున్నది. నా మిత్రునిదగ్గఱ చక్కని చిత్తరువొకటిగలదు. మత దృష్టిగల ధనికుడొకడు ఆచిత్తరువును పొందగోరెను; కాని, నామిత్రుడు దానిని విక్రయించుటకు అంగీకరింప లేదు. ఒకనాడా ధనికుడు నా మిత్రుని దగ్గఱకువచ్చి, “నాకును ఆధ్యాత్మికానుభూతి కలిగినది. భగవంతుడు నాకొక “ఆదేశమిచ్చినాడు.” అని చెప్పెను. నామిత్రుడు, “ఆ యాదేశ మేమి?” అని యడిగెను. “నీ దగ్గఱనున్న చిత్తరువు నాకిచ్చివేయవలెనని యాదేశించెను” అని ధనికుడు బదులుచెప్పెను. నా మిత్రుడు చురుకుగా గ్రహించి వెంటనే, “ఔనౌను! ఎంత బాగున్నది! నాకుగూడ సరిగా అటువంటి యనుభూతియే కలిగినది. నీకు నా చిత్తరువు ఇచ్చివేయవలెననియే దేవుడు నన్నాజ్ఞాపించినాడు. చెక్ తెచ్చితివా?” అనెను. “చెక్? ఏమి చెక్” అన్నాడతడు. “మఱియేమనుకొంటివి? నీయనుభూతి, నీవు వినిన ఆదేశము సరియైనదని నేననుకొనజాలను. ఎవరు లక్షపౌనులిత్తురో, వారికే యీ చిత్తరు వీయవలెనని ఈశ్వరుడు నన్నాజ్ఞాపించినాడు. నీవు మొదట చెక్ తీసికొని రావలసినదే” అని నా మిత్రుడు ఖండితముగా చెప్పెను. అంత నా ధనికుడు తన పాచిక పార లేదని తెలిసికొని, ఈశ్వర సాక్షాత్కార సిద్ధాంతమును విరమించెను. ఇటువంటి అపాయములుకలవు. నేను బోస్టన్‌లోనుండగా నాదగ్గఱ కొకడువచ్చి, తన కేవో అనుభూతులు కలిగినవని, ఏదో తనతో హిందువులభాషలో మాట్లాడినదని అనెను. “అతడుచెప్పినది నేను చూచుటకు వీలయిన యెడల నేను నమ్మెదను” అంటిని. అత డర్థములేని పిచ్చివ్రాత ఏదో చాల వ్రాసెను. నే నర్థము చేసికొనుటకు నాచేతనయిన ప్రయత్నము చేసితిని. కాని, అది బోధపడ లేదు. నాకు తెలిసినంతవఱ కటువంటి

భాష భారతదేశములో నింతవఱకు లేదని, యికముం దుండబోదని, వారు అటువంటి భాషను వ్యవహరించుటకు తగినంత నాగరకులు కాలేదని చెప్పితిని. నేను నాస్తికుడనని, దుర్మార్గుడనని అతడనుకొని తనదారిని బోయెను; అతడు పిచ్చి ఆసుపత్రిలో నున్నాడని ఎవరయిన చెప్పినచో నే నాశ్చర్యపడను. లోకములో నిరువురివలన నిట్టి అపాయములు కలుగుచుండును—మోసగాండ్రవలన, మూర్ఖుల వలన. అంతమాత్రముచే మనము బెదరిపోనక్కఱలేదు. ప్రపంచములో మహద్విషయము లన్నియు అపాయములతో కూడినవే. కాని, మనము తగు జాగ్రత్తలో నుండుటవసరము. ఒక్కొక్కప్పుడే విషయమును గుఱించిగాని తార్కికపరిశీలన చేయగలశక్తి లేనివారి నెందరినో కనుచుందును. ఒకడువచ్చి, "నాకు ఫలానా దేవుని యొద్దనుండి సందేశమువచ్చినది." అనును. అంతటితో ఆగక, "నీవు కాదనగలవా? అటువంటి దేవుడుండుట సాధ్యముకాదా? అతడట్టి సందేశమిచ్చుట సాధ్యముకాదా?" అని రెట్టించును. నూటికి తొంబదిమంది ఆ మాటలు నమ్ముదురు. అతడు చెప్పినది సహేతుకమే అని వారు భావింతురు. కాని, ఒక్కవిషయమును మనము గమనింపవలెను. ఎట్టి సంఘటన యయినను సాధ్యమే. మఱుసంవత్సర మీపృథివి ఏదోనక్షత్రమును ఢీకొని ముక్కలు ముక్కలగుటకూడ సాధ్యమే. నేనొక ప్రతిపాదన చేసినప్పుడు దానిని ఋజువుచేయుడని నిగ్గదీసియడుగుటకు మీ కధికారము గలదు. న్యాయవాదులు చెప్పునట్లు, ప్రతిపాదనచేయువారిదే ఋజువుచేయవలసిన భారమంతయును. నేనొక దేవునినుండి ఆదేశము పొందినట్లు ఋజువుచేయవలసిన బాధ్యత మీదికాదు, నాది. ప్రతిపాదనచేసినవాడను నేనుగనుక. నేను ఋజువుచేయజాలని పక్షమున నోరుమూసికొనుట మేలు. ఈ యుభయులనుండి కలుగగల అపాయములకు దూరముగా నుండుడు. ఇక మీ రెక్కడకు బోయినను క్షేమమే. మనలో చాలమందికి చాల సందేశములు వచ్చుచుండును; వచ్చుచున్నట్లు మనము భావించుచుందుము. అవి

కేవలము మీ స్వవిషయమునకు మాత్రమే సంబంధించినవగుచో మీకు తోచినది చేయుడు. కాని, అవి యితరులతో మనము పెట్టుకొనవలసిన సంబంధములై ఇతరులయెడల మన ప్రవర్తనను గుఱించినవి యగుచో వాని నమలు పఱచుటకి నూఱుపర్యాయము లాలోచింపవలసియుండును. అప్పుడే మీకు క్షేమము.

అతీంద్రియానుభూతి యొక్కటే మతమునకు మూలము. అయిన నది పెక్కు అపాయములతో కూడినది; అన్నిటిలో కష్టపటిది మిక్కిలి విపత్కరమైనది, మితిమీఱిన అధికారమునకు సంబంధించినది. కొందఱు బయలుదేరి తమ కీశ్వరసాక్షాత్కారము కలిగినదని, సర్వశక్తుడయిన భగవంతునికి తాము మాత్రమే ప్రతినిధులమని, మఱెవ్వరికి నట్టి సాక్షాత్కారము పొంద నధికారము లేదని చెప్పుచుందురు. ఇది సహేతుకము కాదని వారి వాదముయొక్క ముఖము మీదనే వ్రాసియున్నది. విశ్వములో నేదియున్నను అది విశ్వజనీనమే కావలెను. ఈ విశ్వమంతయు శాసనబద్ధము. కనుక విశ్వజనీనము కాని చలనమేదియును లేదు. సర్వత్ర సర్వము క్రమబద్ధము, సమన్వయ పూర్వకమునయి యున్నది. ఎక్కడగాని యొకటి యున్నచో అది యంతటను ఉండవలెను. పెద్దసూర్యుడు, నక్షత్రములు ఏసూత్రముపై నిర్మాణమైనవో, ప్రతియణువు అదేసూత్రముపై నిర్మాణమైనది. ఎవరో ఒక్కరు సాక్షాత్కారము పొందియున్నచో మనలో ప్రతియొక్కరము అట్టి సాక్షాత్కారము పొందుట సాధ్యమే. అదే మతము. అయితే అపాయములను, భ్రమలను, భ్రాంతులను, వంచనను, మితిమీఱిన అధికారమును నివారించుకొనుడు. మతానుభవములను ప్రత్యక్షముగా పొందుడు. శాస్త్రీయమైన మతసత్యములనుసూటిగా దర్శింపుడు. అనేకసూత్రములు, సిద్ధాంతములు నమ్ముటలో, చర్చిలకు, దేవాలయములకు పోవుటలో, గ్రంథపఠనములో మతములేదు. మీరు దేవుని దర్శించితిరా? ఆత్మను తిలకించితిరా? లేక, అందుకొఱకు సాధన చేయుచున్నారా? అది యిప్పుడిక్కడ ఉన్నది. భవిష్యత్తులో ఏనాటికొఱకో వేచియుండనవసరము లేదు.

నిరవధికమైన వర్తమానముగాక భవిష్యత్తు అనగానేమి, అనంతకాల మనగా, పునఃపునః తెంపులేకుండ పునరావృత్తమగుచున్న క్షణమే కదా? మతము వర్తమానజీవితములో— యిప్పుడిక్కడ ఉన్నది.

మఱొకప్రశ్న : జీవితలక్ష్యమేమి? మానవు డనంతముగా పురోగమించుచున్నాడనియు, అంతకంతకు ముందుకు పోవుచున్నాడనియు, అతడు పొందగల పరిపూర్ణత్వమనున దేమియు లేదనియు ఈ దినములలో కొందఱు నొక్కి వక్కాణించుచున్నారు. క్రమక్రమముగా లక్ష్యములను సమీపించుచు, ఏనాటికిని దానిని చేరుకొనుటకు వీలులేని దనెడి మాట అసంగతము. సరళరేఖయందు చలనమేమైనగలదా? సరళరేఖ ననంతముగా పొడుగించిన, వృత్తమేర్పడును. అందు ప్రారంభమైనచోటికి తిరిగి వచ్చి చేరవలసినదే. మొదలిడినచోట ముగించక తప్పదు. మీరు భగవంతునినుండి ప్రారంభమైతిరి. తిరిగి భగవంతుని బొందవలసినదే. మిగులునదేమి? వివరణకు కృషి చేయవలసినదే.

ఇంకను మఱియొక ప్రశ్నగలదు: మనము ముందుకుపోవు కొలది క్రొత్త మతసత్యములను కనుగొన వలసియున్నదా? ఈ ప్రశ్నకు సమాధానము "ఔను, కాదు" అనియే. మతమును గుఱించి మనమిక నెక్కువగా నేమియు తెలిసికొనజాల మను విషయమును ప్రప్రథమముగా గుర్తించవలసియున్నది. ఆ విషయమై తెలిసికొనవలసిన దంతయు తెలిసికొనబడినది. మనలో ఐక్యసూత్రమున్నదని ప్రపంచములోని మతములన్నియు నుద్ఘోషించుచున్నవి. మనము భగవంతునితో నొక్కటి గనుక నింతకు మించిన ఐక్యసూత్ర మసంభవము. వైవిధ్యమునందు ఐక్యమును కనుగొనుటే జ్ఞానము. నేను మిమ్ము పురుషులుగాను, స్త్రీలుగాను చూచుచున్నాను. ఇది వైవిధ్యము. మిమ్మందఱను ఒక వర్గముగా పరిగణించి మానవులనుట శాస్త్రీయవిజ్ఞానము. ఉదాహరణకు:

రసాయనిక శాస్త్రము తీసికొనుడు. రసాయనిక శాస్త్రజ్ఞులింత వఱకు దెలిసిన పదార్థములన్నిటికి మూలద్రవ్యములను కనుగొనుటకు ప్రయత్నించుచున్నారు. సాధ్యమగుచో నన్నిటికి మూలమైన ఒక్క ద్రవ్యమును కనుగొనవలెనని వారి ప్రయత్నము. ఆయొక్క ద్రవ్యమును కనుగొనుకాలము రాగలదేమో! ఆ యొక్కటి తక్కిన మూలద్రవ్యములన్నిటికి మూలము. ఆ దశకు వచ్చిన తర్వాత వారు మఱి ముందుకుపోజాలరు; అప్పటికి రసాయనికశాస్త్రము పరిపూర్ణత్వము పొందినదని గ్రహింపగలము. మతవిషయము గూడ నంతే. ఈ ఐక్యసూత్రమును సంపూర్ణముగా సాక్షాత్కరింప జేసికొనినచో అటుపైన అభివృద్ధి కవకాశము లేదు.

"నేను, నా జనకుడు నొక్కరమే" అనుసత్యము సాక్షాత్కారమగుటతో మతవిషయమై తుదిపలుకు పలుకుటయైనది. తరువాత మిగిలినదెల్ల దానికొఱకు సాధన చేయుటే. గ్రుడ్డినమ్మకము వేఱు; సత్యసందీప్తమైన విశ్వాసము వేఱు. జగద్గురువు లెవ్వరు అంధవిశ్వాసమును బోధించలేదు. పతనముతోనే అటువంటి నమ్మకము ప్రారంభమగును. మూఢు లీ మహాత్మునో, ఆ మహాత్మునో అనుసరించుచున్నట్లు నటింతురు. వారు శక్తివిహీనులయినను అంధప్రాయముగా నమ్ముడని ప్రజలకు బోధచేయుచుందురు. దేనిని నమ్మవలెను? గ్రుడ్డిగానమ్ముట యనగా మానవాత్మను పతన మొందించుటే. ఇష్టమగుచో నాస్తికులయినను కండు; కాని విమర్శింపక దేనిని నమ్మకుడు. ఆత్మను పశువులస్థాయి కెందుకు పతన మొందించెదరు? అందుమూలమున మీరు మీకేగాక సంఘమునకు గూడ హాని కలిగింతురు. మీ తరువాత వచ్చెడివారికగూడ అపకారము కలిగింపగలరు. ధీరులయి తర్కింపుడు. గ్రుడ్డినమ్మకము తగదు. మతము స్థితితో, గతితో— ఉనికితో, వికాసముతో సంబంధించినదేగాని, గ్రుడ్డి నమ్మకముతో సంబంధించినదిగాదు. మతమనగా నిది; దానిని మీరు పొందినప్పుడు మీకు మతమున్నట్లు గ్రహింపుడు. అంత వఱకు మీరు జంతు

సంతానముతో సమానమే. మీరు "వినినంత మాత్రమున దేనిని నమ్మకుడు." అని బుద్ధభగవానుడు ప్రవచించినాడు. "తరతరములుగా మీ కందజేయబడిన కారణమున ఏ సిద్ధాంతములను నమ్మకుడు; అంధప్రాయముగా ననేకమంది యనుసరించుచున్నారను కారణమున దేనిని నమ్మకుడు; ఎవరో వృద్ధతపస్వి వచించెనన్న కారణమున నమ్మకుడు; మీ కలవాటయిన కారణమున ఏ సత్యమును నమ్మకుడు; గురువులను, పెద్దలను ప్రమాణముగా గొని, కేవల మా కారణమున నమ్మకుడు. స్వబుద్ధితో విమర్శింపుడు. తర్కింపుడు. ఫలితము హేతుసమ్మతము, సర్వజన మంగళదాయకము నగుచో దాని నంగీకరించి, తదనుగుణముగా జీవింపుడు."

# మతానుష్ఠానము

## (కాలిఫోర్నియాలోని ఆలమెడదగ్గర 1900-వ సంవత్సరము ఏప్రిల్ 18-వ తేదీని చేసిన ఉపన్యాసము)

మన మనేక పుస్తకములు, మతగ్రంథములు చదువుచుందుము. శైశవదశనుండియు మన మనేక భావములు గ్రహించుచున్నాము. తఱచుగా వానిని మార్చుకొనుచుందుము. మతమునుగుఱించిన సిద్ధాంతభాగమనగా నేమో మనకు తెలియును. అనుష్ఠాన మతమనగా నేమో మనకు తెలియుననియే మనమనుకొనుచుందుము. అనుష్ఠాన మతమునుగుఱించి నా యభిప్రాయము మీ కిప్పుడు నివేదించుకొనబోవుచున్నాను.

అనుష్ఠానమతమును గుఱించిన మాటలు మనచుట్టు వినబడుచునేయున్నవి. ఈ విషయమై మనము కనుచున్నదానినెల్ల విమర్శపూర్వకముగా పరిశీలించినచో దాని సారాంశముగా మనకొక్క భావము తోచును—తోడి జీవుల కుపకారము చేయుట. అయితే, మతమనగా ఇంతమాత్రమేనా? అనుదినము మన మీ దేశములో అనుష్ఠాన క్రైస్తవమునుగుఱించి వినుచున్నాము—ఒకానొకరు తోడిమానవులకు కొంత మేలుచేసినట్లు చెప్పుకొనుచుందురు. మతమనగా ఇంతేనా?

జీవిత గమ్యమేమి? ఈ ప్రపంచమేనా మన జీవిత గమ్యము? ఇంతకుమించి మఱేమియు లేదా? మన మిప్పుడెట్లున్నామో అట్లుండవలసినదేనా? ఇంతకంటె నింకేమియు కాదా? మానవుడనగా ఎందును సంఘర్షణలేకుండ సుఖముగా సాగిపోవు యంత్రమువంటివాడా? నేడతడు అనుభవించుచున్న సకలదుఃఖము లతనికి ఉండవలసినవేనా? అవియేనా అతనికి ఉండవలసినవి? ఇంతకంటె ఎక్కువగా అతని కేమియు అక్కఱలేదా?...

పెక్కు మతముల పరమాశయము ప్రపంచమే...వ్యాధి, అస్వస్థత, దారిద్ర్యము, ఏవిధమైన దుఃఖము లేని సమయమెప్పుడు వచ్చునా యని అత్యధిక సంఖ్యాక ప్రజలు కలలుకనుచున్నారు. మన చుట్టు అంతయు అందముగా నుండవలెను. దీనినిబట్టి అనుష్ఠాన మతమనగా వీధులు శుభ్రము చేయుట, వాని నందముగా చేయుట అని అర్థమగుచున్నది. ఇందుకు ఎందరెంతగా సంతోషింతురో మనకు తెలియును.

సుఖానుభవమే నా జీవిత లక్ష్యమా? అగుదో మానవుడగుటే గొప్ప తప్పిదమగును. కుక్కకంటె, పిల్లికంటె ఆహారము తినుటయందు మానవుడేమి యెక్కువ సుఖమనుభవించగలడు? మృగశాలకు పొమ్ము. అచ్చట అడవిమృగములు ఎముకల నంటియున్న మాంసము నెట్లు కొరికివేయుచున్నవో గమనింపుడు. మనుష్యుడా నీవును పక్షివికమ్ము!...మనుష్యజన్మమెత్తుట ఎంతటి తప్పిదము! ఎన్ని సంవత్సరములు వ్యర్థమైనవి!—ఇంద్రియ సౌఖ్యము మాత్రమే కోరెడి మనుష్యుడవతరించుటకై—శతాబ్దములకొలది జరిగిన పోరాటము వ్యర్థమైపోయినది!

కనుక అనుష్ఠాన మతమునుగుఱించి సాధారణముగా జనులనుకొనుచుండు అభిప్రాయఫలిత మేమగునో గమనింపుడు. పరోపకారము గొప్పదే. కాని, పరోపకారమేగాని అంతకంటె మతేమియు లేదనగానే భౌతికవాదములో పడిపోగల అపాయమున్నది. అది మతమే కాదు. నాస్తికత్వముకంటె అది మెరుగు కాదు—కొంచెము తక్కువకూడ...క్రైస్తవ మిత్రులారా! తోడివారికే సేవచేయుట, వైద్యశాలలు నిర్మించుట...ఇంతకంటె బైబిలులో మీకింకేమియు కనబడుట లేదా? ... ఇందొక దుకాణదారుడున్నాడు. జీసస్ దుకాణము నెట్లు పెట్టుకొనునో యితడు చెప్పును! జీసస్ క్షౌరశాల గాని, దుకాణముగాని పెట్టుకొనడు; వార్తాపత్రికకు సంపాదకత్వమును నిర్వహింపడు. ఈవిధమైన అనుష్ఠానమతము మంచిదే. చెడ్డది కాదు; అయితే యిది పసిబిడ్డల మతము. దీనివలన మనకు విశేషముగా చేకూరెడిది ఏమియు లేదు.

...మీరు దేవునియందు విశ్వాసముగలవారే అయినచో మీరు క్రైస్తవులే అయినచో, "నీ సంకల్పమే నెఱవేఱుగాక" అని నిత్యము పలుకుచున్నచో—దాని భావమేమో కొంచెము యోచింపుడు! "హే! భగవాన్ నా సంకల్పము నీవు నెఱవేర్తువుగాక" యని మనసార భావించుచు "నీ సంకల్పమే నెఱవేఱుగాక" అను మాటలను అనుక్షణము పలుకుచుందురు. అనంతుడు తన సంకల్పానుగుణముగా చేయుచునే యున్నాడు. అతడుకూడ తప్పులు చేసెనా? మీరు, నేను వానిని సరిదిద్దుదుమా? విశ్వనిర్మాతకు మన వడ్రంగులు పనిసేర్పుదురా? అతడు ప్రపంచమును చీకటికోణముగా సృష్టించెనా? దానిని మీరు సుందరమందిరముగా మార్చివేయుదురా!

దీనియంతటికి లక్ష్యమేమి? ఇంద్రియములేనా, మనకు పరమోత్కృష్టమైనవి? సుఖానుభవ మెప్పుడయిన మనకు పరమప్రాప్యము కాగలదా? ఈ జీవితము మన ఆత్మకేనాడుగాని లక్ష్యము కాగలదా? ఇదే మనలక్ష్యమగుచో ఈ క్షణమే చనిపోవుట మంచిది; ఇది మనకు వలదు. నిర్దుష్టమైన యంత్రముగా మాఱిపోవుటే మనవిధి యగుచో చెట్లు, రాళ్లు మున్నగు వానిస్థితికి మానవుడు పోవుచున్నాడని గ్రహింపనగును. ఆవు అసత్యము పలుకుచుండగా, చెట్టు దొంగతనము చేయుచుండగా మీరెన్నడయిన చూచినారా? అవి నిర్దుష్టమైన యంత్రములు. అవెన్నడు తప్పులుచేయవు. సర్వము పరిపూర్ణమైన ప్రపంచములో నవియున్నవి......

ఇది అనుష్ఠానమతము కానిపక్షమున అసలు మతలక్ష్యమేమి? ఇది లక్ష్యముకాదను విషయము మున్నాటికి నిశ్చయము. మనమిందు ఎందుకున్నాము? స్వతంత్రులమగుటకు, జ్ఞానము పొందుటకు మనమిచ్చట ఉన్నాము. స్వతంత్రులమగుటకు మనము జ్ఞానము పొందవలెను. మన జీవితమది; స్వాతంత్ర్యముకొఱకు విశ్వజనీనమైన ఆక్రందనమిది. విత్తనము మొలకెత్తుచున్నది. నేలను బ్రద్దలుచేసికొని మొక్క పైకివచ్చి ఆకాశముదెస పెరుగుచున్నది.

దీనికి కారణమేమి? సూర్యమండలమునుండి పృథివికి జరుగుచున్న ఆ యర్చనయేమి? మీా జీవితమున కర్థమేమి? స్వాతంత్ర్యము కొఱకు పోరాటమే అదియంతయును. అన్నిప్రక్కలనుండి మనల నణగద్రొక్కుటకు ప్రకృతి ప్రయత్నించుచున్నది. ఆత్మ తన్ను తాను ప్రదర్శించుకొనుటకు ఆరాటపడుచున్నది. ప్రకృతితో పోరాటము సాగుచున్నది. ఈ స్వాతంత్ర్యసమరములో ఎన్నెన్నో చితికి, నాశనమై పోవుచున్నవి. అందుకే దుఃఖము కలుగుచున్నది. రణరంగమున ఎంతెంతగానో దుమ్ము రేగవలసియున్నది. "నేను జయించెదను" అని ప్రకృతి చెప్పుచున్నది. "నేను విజేతను కావలెను" అని ఆత్మ ఘోషించుచున్నది. ప్రకృతి మరల "ఉండుము, నేను నీకు కొంతభోగ మిచ్చి నిన్ను ఊరుకొనబెట్టెదను" అనుచున్నది. ఆత్మ కొంతభోగముననుభవించి, క్షణకాలము భ్రాంతిలోబడుచున్నది. మఱుక్షణమే అది స్వాతంత్ర్యముకొఱకు కేకపెట్టుచున్నది. నిరంతరము ప్రతిహృదయమునుండి వినవచ్చుచున్న ఆక్రందనమునకు మీా రెన్నడయిన చెవియొగ్గితిరా? కలిమిచే మనము వంచితులమగుచున్నాము. మనము ధనికులమై ఐశ్వర్యముచే వంచితుల మగుచున్నాము. మన కేమియు పాలుపోవుటలేదు. మనము విద్యాధికులమై, చాల నేర్చుకొందుము. జ్ఞానముచేత మనము వంచితుల మగుచున్నాము. ఎవ్వరికిని, ఎప్పుడును తృప్తియేలేదు. అదే మన దుఃఖమునకు కారణము; అదే మనకు శ్రేయస్కరముకూడ. అదే మనకు స్పష్టమైన శుభసూచన. ఈ ప్రపంచముతో మనమెట్లు తృప్తిపడగలము?... రేపు ఈ ప్రపంచము స్వర్గముగా మాఱిపోయినయెడల, "దీనిని తీసికొని మఱొకటి ప్రసాదింపుము" అని ఈశ్వరునర్థింతుము.

అనంతమైన మానవాత్మ అనంతమైనదానిచేతగాని తృప్తి పొందదు... అనంతమైన కోర్కె అనంతమైనజ్ఞానముచేతనే తృప్తి పడగలదు—అంతకు తక్కువయిన నేమియు జరుగదు. లోకములు పుట్టును, గిట్టును. అంతమాత్రమున నష్టమేమి? ఆత్మ ఉండును. సర్వదా

వ్యాప్తి చెందుచుండును. లోకములు ఆత్మలోనికి వచ్చి చేరవలెను. సముద్రములో బిందువులు కలసిపోవునట్లు లోకములు ఆత్మలో లీనమై పోవలెను. ఇక నీ ప్రపంచమా, ఆత్మకు లక్ష్యము కావలసినది! యుగయుగములుగా కవులు మనలను తృప్తిపడవలసినదని ప్రబోధము చేయుచునేయున్నారు. మన కింగితజ్ఞానమేమైన నున్న యెడల మనము తృప్తిపడజాలము. నిజమున కింతవఱకు ఎవరును తృప్తిపడలేదు. "మీ పరిస్థితితో తృప్తిపడుడు." అని మనకు లక్షలకొలది మహా పురుషు లుపదేశించియున్నారు. ఈ విషయమే కవులు గానముచేసిరి. తృప్తిపడి నిశ్శబ్దముగా నుండుమని మనకు మన మెన్నో పర్యాయములు చెప్పుకొనియున్నాము. కాని, తృప్తిపడలేదు. నా ఆత్మను సంతృప్తి పఱచగలిగిన దేదియు నుండరాదని అనంతుని సంకల్పము. పైన స్వర్లోకములలో గాని క్రింద అధోలోకములలోగాని తృప్తిపఱచ గలిగిన దేదియు లేదు. నా ఆత్మ అభీష్టము ముందు నక్షత్రకోటులు, అధోలోకములు, సమస్త విశ్వము అసహ్యమైన వ్యాధితో సమానము; అదిసత్యము. అది అసలు రహస్యము. అర్థము కానియెడల ప్రతివిషయము అనర్థమే. ప్రాధాన్యమును, లక్ష్యమును సవ్యముగా నర్థముచేసికొనని పక్షమున ప్రతికోర్కె అనర్థదాయకమే యగును. ఒక్క విషయము కొఱకు సమస్త ప్రకృతి ప్రత్యణువున ఆక్రందనమొనరించుచున్నది. ఎందుకొఱకు? సంపూర్ణ స్వాతంత్ర్యముకొఱకు.

దీనినిబట్టి అనుష్ఠానమతమనగా ఏమి? అట్టిస్థితి పొందుటే— స్వాతంత్ర్యము, స్వాతంత్ర్యసిద్ధి. ఈ లోకము మన మాస్థితి పొందుటకు సహాయపడునేని మంచిదే. అట్లుగాక, యింతకుముందుండిన వేలకొలది సంకెళ్లుగాక మనకు మఱొకటి చేర్పదలచినపక్షమున అనర్థదాయకమగును. మన లక్ష్యమును పొందుటకు సహాయపడునేని ఆస్తిపాస్తులు, విద్య, సౌందర్యము, సర్వము అనుష్ఠాన ప్రయోజనము గలవియే. స్వాతంత్ర్యసంసిద్ధికి ఉపయోగపడని యెడల అవన్నియు

మనకపకారము కలిగించునవే! అయితే అనుష్ఠాన మతమనగా నేమి యర్థము? ఇహలోకములోని వస్తువులను, పరలోకములోని వస్తువులను స్వాతంత్ర్యప్రాప్తి అనెడి లక్ష్యమును పొందుట కుపయోగింపుడు. ప్రతిభోగమును లేక ప్రతిస్వల్పసౌఖ్యమును—అనంతమైన హృదయమునకు, మనస్సునకు బదులుగా పొందవలసి యున్నది.

లోకములోని మంచిచెడ్డల మొత్తమును గమనింపుడు. మొత్తములో మార్పుకలిగినదా? యుగములు కడచిపోయినవి. అనుష్ఠానమతము యుగములతరబడి అమలులో నున్నది. సమస్య పరిష్కారమగునని ఎప్పటికప్పుడు లోకమాశించుచు వచ్చినది. కాని, సమస్య ఎప్పటివలెనేయున్నది. సమస్యయొక్క స్వరూపము మారిన మారుగాక...వ్యాధిప్రకోపము వలె అది విజృంభించుచున్నది. అది కీళ్లవ్యాధివంటిది. ఒకచోటునుండి తఱిమివేసిన మఱొకచోటికి పోవును. శతాబ్దము క్రితము మానవుడు కాలినడకను ప్రయాణము చేసెడివాడు. లేదా గుఱ్ఱముల నుపయోగించుకొనెడివాడు. ఇప్పుడతడు రైలులో ప్రయాణము చేయగలుగుచున్నాడు. కనుక ఎక్కువ సుఖపడుచున్నాడు. కాని, యిప్పుడతడెక్కువ శ్రమపడి పనిచేసి, ఎక్కువ సంపాదించుకొనవలసినవాడగుచున్నాడు. అందుచేత కష్టపడుచున్నాడు. మానవుని శ్రమను తగ్గించెడి ప్రతియంత్రము మఱొకవిధముగా మానవుని శ్రమనెక్కువచేయుచున్నది.

ఈ జగత్తును, ప్రకృతిని, ఏపేరుతోనయినను వ్యవహరింపుడు; అది పరిమితమైనదేగాని అపరిమితమైనదిగాదు; కానేరదు. పరమము, సర్వాతీతము అయినది ప్రకృతియగుటకు స్థలకాలములచేత, కార్యకారణ సంబంధముచేత బద్ధముకావలెను. మన యధీనమందున్నశక్తి పరిమితము. దాని నొకచోటున వినియోగించి, మఱొకచోట గోల్పోవచ్చును. మొత్తముమీద అదెప్పుడు నొక్కటే. కెరటములేచినపుడు వెనువెంటనే పల్లమేర్పడకతప్పదు. ఒకజాతి

మైశ్వర్యము పెఱిగిన ఇతరజాతులు పేదవికాగలవు. మంచిచెడ్డలు సరిసమానముగ నుండును. ఉచ్చస్థితియందున్నవాడు అది సర్వము మంగళప్రద మనుకొనుచుండును ; అధోగతియందున్నవాడు ప్రపంచ మంతయు దుష్టమని భావించుచుండును. కాని, ఈ రెంటికి తటస్థుడుగా నున్నవాడు భగవల్లీలా విలాసమును తిలకించుచుండును. కొందఱేడ్చుదురు. మఱికొందఱు నవ్వుదురు. ఇప్పుడు నవ్వువారు తరువాత తమవంతువచ్చినప్పు డేడ్చుదురు. ఇప్పుడేడ్చువారు తరువాత నవ్వుదురు. మనము చేయగలిగిన దేమి? మన మేమియు చేయజాలమని మనకు తెలియును.

కేవలము మేలుచేయవలెననెడి సంకల్పముతో, ఏపనిగాని మనలో చేయువారెవరు? ఎంతకొలదిమంది! వారిని వ్రేళ్లపై లెక్కింపవచ్చును. మేలుచేసెడివారింకను గలరు. అయితే గత్యంతరములేక, నిర్బంధముచేత మంచిపనులు చేయుదుము....మనము మంచిపని చేయకుండ ఉండలేము. ఇటు అటు కష్టనష్టము లనుభవించి, మనము ముందుకు పోవుచుందుము. మనము చేయగలిగిన దేమి? ప్రపంచము మునుపటి ప్రపంచమే. పృథివి ఎప్పటివలెనేయున్నది. అది నీలము నుండి గోధుమవర్ణమునకు, గోధుమవర్ణమునుండి నీలమునకు మాఱుచుండును. ఒకభాషనుండి మఱొకభాషకు అనువాదము జరుగును. ఒకవిధమైన తప్పులు మఱొకవిధమైన తప్పులుగా మాఱుచుండును. జరుగుచున్నదంతయు నింతే. ఒక విధమైనవి ఆఱు అయితే, మఱొక విధమైనవి అరడజను. అడవులలో నివసించుచున్న అమెరికన్ ఇండియన్ మీవలె తత్త్వశాస్త్రమును గుఱించిన ఉపన్యాసమును వినలేడు. తాను తినిన ఆహారము నతడు జీర్ణముచేసికొనగలడు. వానిని ముక్కలుముక్కలుగాకోయుము. మఱుక్షణమే స్వస్థత చెందగలడు. మీరుగాని నేనుగాని యింత గీచుకుపోయినయెడల ఆఱు నెలలు వైద్యశాలలో చికిత్సబొందవలసినవార మగుదుము...

ఉపకరణము తక్కువస్థాయియం దున్నయెడల, ఇంద్రియ సుఖానుభవ మెక్కువగానుండును. మిక్కిలి తక్కువరకపు జంతువుల

సంగతి చూడుడు ; స్పర్శకుగల శక్తిని గమనింపుడు. అంతయు స్పర్శమయమే. . . మానవుని దగ్గఱకు వచ్చుసరికి నాగరకత ఎక్కువగానున్న కొలది ఇంద్రియముల బలము తక్కువగును. . . ఉపకరణ ముత్తమమైన కొలది ఇంద్రియముల సుఖము తక్కువగానుండును. కుక్క ఆహారము చక్కగా తినగలదు ; కాని, తత్త్వవిషయములనుగుఱించి ఆలోచన చేయుటలోగల మహదానందము నర్థము చేసికొనజాలదు. బుద్ధి ద్వారమున మీరు పొందుచున్న అద్భుతమైన సౌఖ్యము నది గ్రహింపజాలదు. ఇంద్రియసుఖములు గొప్పవే. అంతకంటె బుద్ధి వలన కలిగెడి సౌఖ్యము గొప్పది. పారిస్ నగరములో జరిగెడి గొప్ప విందు (ఫిఫ్టీ క్రోర్స్ డిన్నర్) లో మీరు పాల్గొందురు. అది నిజముగా సుఖదాయకమే. కాని, నక్షత్ర పరిశోధనశాలలో నక్షత్రముల పరిశీలన, గోళములు, లోకములు వచ్చుట, వృద్ధిపొందుట—ఆ విషయమాలోచింపుడు. అది నిస్సందేహముగా గొప్ప సంతోషము. ఆ సమయమున మీరు భోజనము విషయము పూర్తిగా మఱచిపోవుదురు. ఆ సుఖము ప్రాపంచిక సుఖముకంటె గొప్పది. భార్య, భర్త బిడ్డలు మొదలయిన వారందఱను మఱచిపోవుదురు. ఇంద్రియముల స్థాయికి సంబంధించినదాని నంతటిని మఱచిపోవుదురు. అది బుద్ధిగతమైన సౌఖ్యము. అధికసుఖమునకయి మనమెప్పుడును అల్పసుఖమును విసర్జింతుము. ఇది అనుష్ఠానమతము—స్వాతంత్ర్యము, వైరాగ్యము, త్యాగము దీని ముఖ్యాశయములు.

ఉత్కృష్టమైన దానిని పొందుటకై నికృష్టమైనదానిని పరిత్యజింపుడు. సంఘజీవితమునకు పునాది యేది ? నీతి, ధర్మము, శాసన సముదాయము. త్యాగముచేయుడు. మీ పొరుగువాని ఆస్తి నపహరింపవలెనను ప్రవృత్తిని, వానిని బాధింపవలెనను ప్రలోభమును, దుర్బలులను పీడించుటలోగల కులుకును, అసత్యములు పలికి పరులను వంచించుటలోగల మోదమును పరిత్యజింపుడు. సంఘజీవనమునకు పునాది నీతికాదా ? వివాహమనగా అపరిశుద్ధ

జీవితమును పరిత్యజించుటగాక మఱేమి! మృగప్రాయుడు పరిణయమాడడు. మానవుడు త్యాగశీలుడయి వివాహమాడును. త్యాగముపై చూపుంచి ఇట్లే ముందంజవేయును. విరాగివికమ్ము! విరాగివికమ్ము! త్యాగముచేయుము! త్యజింపుము! శూన్యముకొఱకు కాదు; నిరర్థకముగా కాదు; ఉత్కృష్టమైనదానిని పొందుటకు. ఎవరీపనిచేయగలరు? ఉత్కృష్టమైనది లభ్యమగువఱకు సాధ్యముకాదీపని. మాట్లాడవచ్చును, ప్రయత్నింపవచ్చును. పెక్కుపనులు ప్రయత్నింపవచ్చును. కాని, ఉత్కృష్టమైనది లభ్యమైనప్పుడు వైరాగ్యము దానంతట అదే కలుగును. అంతట అల్పమైనది దానంతట అదే రాలిపోవును.

ఇది అనుష్ఠానమతము. ఇంతకంటె మఱేమికలదు? వీధులూడ్చుట, వైద్యశాలలు నిర్మించుటయునా? వానిలోగల వైరాగ్యముమేరకే వాని విలువ. వైరాగ్యమున కంతులేదు. చిక్కంతయును వైరాగ్యమునకు హద్దు విధించుటలోనే ఉన్నది. ఇంతవఱకే వైరాగ్యమననేల? చిక్కంతయు ఇంతకుపైన వలదు అను పరిమితిలోనే కలదు; వైరాగ్యమునకు అవధిలేదు.

భగవంతుడున్నచోట మఱొకటిలేదు. ప్రపంచమున్నతావున భగవంతుడు లేడు. ఈ రెండు ఎన్నడును కలియవు. అవి వెలుగుచీకట్లవంటివి. క్రైస్తవమతమునుండి, తన్మతప్రవక్త జీవితమునుండి నేను గ్రహించినదది. అది బౌద్ధమతముకాదా? హిందూ మతమది కాదా? మహమ్మదీయమతము మాత్రమదికాదా? సకల ఋషులు, ఆచార్యులు చేసినబోధ అదేకదా! మనము పరిత్యజింపవలసిన ప్రపంచమేది? అది యిది. దానిని నాతోగూడ సదా తీసికొని పోవుచున్నాను. నా దేహమే అది. ఈ దేహముకొఱకే నేను ఐచ్ఛికముగా నాతోడి మానవుని హింసించుచున్నాను. ఈ దేహమున కలంకారముచేసి, దీనికి సౌఖ్యము కలిగించుటకే ఆపని చేయుచున్నాను. నేనితరుల కపకారము చేయుచున్నది, తప్పుడుపనులు చేయుచున్నది కేవల మీ దేహముకొఱకే...

మహాపురుషులు మరణించిరి, దుర్బలులు మరణించిరి. దేవతా స్వరూపులు సహితము మరణించిరి. మృత్యువు—ఎందుజూచినను అది కలదు. అంతులేని గతమునకు ఈ ప్రపంచము స్మశాన భూమి. అయినను మన మీ దేహము నంటిపెట్టుకొని యున్నాము. ''నే నెన్నడును చనిపోవుటలేదు''. ఈ దేహము నశింపక తప్ప దని స్పష్టముగా తెలిసియు, దీనిని పట్టుకొని ప్రాకులాడుచున్నాము. ఇందులో అర్థము లేకపోలేదు. ఒక అర్థములో మనము మరణింపము. నాశనము లేనిది ఆత్మ. అయితే మన మంటిపెట్టుకొనియుండునది దేహమును. అది మన పొరపాటు.

మీ రందఱు భౌతికవాదులే. ఏలయనగా, దేహమే మీరని మీరు నమ్ముచున్నారు. నన్నెవరుగాని గాయపఱచిన, నేను గాయపడితినని చెప్పుదును. నన్నతడు కొట్టినచో, నాకు దెబ్బ తగిలినదని చెప్పుదును. నేను దేహమును కానప్పుడు నే నట్లేల చెప్ప వలెను? నే నాత్మనని చెప్పుటవలన కలిగెడి భేదమేమియు లేదు. నే నీ ముహూర్తమున దేహమునే. నన్ను నేను భౌతికపదార్థముగా మార్చుకొంటిని. అందుచే నే నీ దేహమును త్యజించి, మొదట నేనేమిగానుంటినో ఆ యథాస్థితికి మాఱిపోవలెను. నే నాత్మను.— ఏ ఆయుధము చీల్పజాలని, ఏ ఖడ్గము ఖండింపజాలని, ఏ అగ్ని దహింప జాలని, ఏ వాయువు శుష్కింపజేయజాలని ఆత్మను నేను. దీనికి పుట్టుక లేదు, చావులేదు; ఆదిలేదు తుదిలేదు, సృష్టి అయినది కాదిది; ఇది సర్వవ్యాపకమైనది—ఇది నేను. ఈ చిన్న మట్టిముద్ద నేనని అనుకొనుటచేతనే సమస్తదుఃఖము సంప్రాప్తమగుచున్నది. నేను భౌతికపదార్థము ననుకొనుచున్నాను. ఇందువలన కలుగగల సమస్త ఫలితముల ననుభవించుచున్నాను.

నే నాత్మననెడి జ్ఞానమునందు స్థిరపడుటే అనుష్ఠానమతము. దేహాత్మభ్రాంతిని విడనాడుము! ఈ విషయమున మీ రెంతవఱకు పురోగమించితిరి? మీరు రెండువేల వైద్యశాలలు, ఏబదివేల రోడ్లు

నిర్మించియుండవచ్చునుగాక! మీ కాత్మజ్ఞానము కలుగనినాడు ఆ పనులవలన మీ కొఱగునదేమి? కుక్క చచ్చిపోవునట్లే మీరును చనిపోవుదురు. కుక్క ఏభావములతో చచ్చునో మీరును అట్లే మరణింతురు. తాను మట్టిముద్దనని కుక్క భావించి, మట్టిలో కలసిపోవుచున్న సంగతి గ్రహించి ఏడ్చును, అఱచును, మొఱుగును.

సర్వత్ర మృత్యువుకలదను విషయము మీకు తెలియును. జలములో, గాలిలో, రాజప్రాసాదములో, చెరసాలలో మృత్యువున్నది. మిమ్ము నిర్భయముగా చేయగలుగునదేది? ఎపుడు మీరు భయరహితులయ్యెదరు? మీ స్వస్వరూపము తెలిసికొనినప్పుడే—మీరు చావుపుట్టుకలులేని అనంతాత్మయని తెలిసికొన్నప్పుడే—నిర్భయము కలుగును. ఆత్మను అగ్ని దహింపలేదు. ఏ ఆయుధము చంపలేదు, ఏ విషము దానికి హానికలిగింపలేదు ఇదియంతయు వట్టి సిద్ధాంతముకాదు. ఈ విషయము జ్ఞాపకముంచుకొనుడు. గ్రంథ పఠనము చాలదు. చిలుకలవలె పలుకుటతో కాగల పనికాదిది. నా గురు విట్లు చెప్పుచుండెడివారు: "ప్రభూ! ప్రభూ! ప్రభూ!, అని చిలుకకు నేర్పుట ముచ్చటగానే ఉండును. కాని, పిల్లి వచ్చి దాని మెడ పట్టుకొననిమ్ము. అదియంతయు అపుడు మఱపునబడిపోవును." మీరు సర్వదాప్రార్థన చేయుచుండవచ్చును. ప్రపంచములోని ధర్మ గ్రంథములన్నిటిని అధ్యయనము చేయవచ్చును. ఎందరు దేవుళ్లు గలరో అందఱిని పూజింపవచ్చును. కాని, మీరాత్మ అను జ్ఞానము లేని వారగుచో, స్వతంత్రులు కాజాలరు. కావలసినవి ప్రసంగము, సిద్ధాంతప్రతిపాదన, వాదప్రతివాదములు కావు. కావలసినదెల్ల సాక్షాత్కారము. అదియే అనుష్ఠాన మతమని నేను వచింతును.

ఆత్మతత్త్వమును గుఱించి మొదట వినవలెను; మీరు విని యున్నయెడల దానిని మననము చేయవలెను. తరువాత దానిని ధ్యానము చేయవలెను. అర్థములేని వాద ప్రతివాదములు అనవసరములు. మీరనంతాత్మయను జ్ఞానమునందు స్థిరపడుడు. అది సత్య

వగుచో మీరు దేహమగుట అర్థములేనిమాట. మీ రాత్మనస్సువు. దానిని మీరు సాక్షాత్కారము చేసికొనవలెను. ఆత్మను ఆత్మ దర్శింపవలెను. ఇప్పుడాత్మ తన్ను దేహముగా చూచుచున్నది. ఈ వైఖరికిక స్వస్తిచెప్పవలెను. ఆత్మసాక్షాత్కారము ప్రారంభమైనతోడనే మీరు ముక్తులయ్యెదరు.

మీరీ గాజుపాత్రను చూచుచున్నారు. ఇది కేవలము భ్రమయేయని మీకు తెలియును. ఇది కేవలము వెలుతురనియు, స్పందనమనియు కొందఱు వైజ్ఞానికులు చెప్పుదురు......ఇంతకంటె ఆత్మదర్శన మనంతముగా సత్యము. అదే నిజమైనస్థితి, నిజమైన భావగ్రహణము, నిజమైన దర్శనము. మీరు చూచుచున్న ఈ సమస్త వస్తువులు స్వప్నములే. ఈ విషయము మీకిప్పుడు తెలిసినదికదా! పూర్వకాలపు ఆత్మవాదులేగాక ఆధునిక పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు కూడ మీ కక్కడ జ్యోతికలదని చెప్పుదురు. ఇంచుక అధికమైన స్పందనముండుటందే వ్యత్యాసము కలదు......

మీరు భగవంతుని దర్శింపవలెను. ఆత్మసాక్షాత్కారము బొందవలెను. ఇది అనుష్ఠానమతము. అనుష్ఠానమతమని మీ రనుకొనుచున్నదికాదు, ఏసునాథుడు బోధించినది "నమ్రమనస్కులు ధన్యులు, స్వర్గరాజ్యము వారిది." ఈ ప్రవచనము చమత్కారము కొఱకు చెప్పబడినదా ? మీరనుకొనుచున్న అనుష్ఠానమతమనగా నేమి ? "ప్రభూ! మాకు తోడ్పడుడు." అనియేనా ? "నిర్మల హృదయులు ధన్యులు, వా రీశ్వరుని దర్శింతురు." దీనికర్థము వీథులూడ్చుట, వైద్యశాలలు నిర్మించుట మొదలయిన పనులు చేయుటయా ? విశుద్ధమనస్సుతో పనులు చేసినప్పుడే అవి సత్కార్యములగును. ఇరువది డాలర్లిచ్చి, శాన్ ఫ్రాన్సిస్కోలోని పత్రికలన్నిటిలో మీపేర్లు ప్రకటింపబడినవేమోయని ఆతురపాటుతో చూడకుడు. మఱొకరెవ్వరు మీకు తోడ్పడరని మీరు మీ గ్రంథములలో చదువుటలేదా ? దరిద్రులలో, దుఃఖభాజనులలో, దుర్బలులలోగల

భగవంతుని ఉపాసించుచున్నామను భావముతో సేవ చేయుడు. అది ప్రధానమైన పని. ఫలితము అప్రధానము. ప్రతిఫలాపేక్ష లేకుండ ఆవిధముగా కృషి చేసిన ఆత్మకు మేలు కలుగును. స్వర్గరాజ్యమట్టిదే!

స్వర్గరాజ్యము మనలో నున్నది. అత డిక్కడ ఉన్నాడు. అతడు సమస్త ఆత్మలకు ఆత్మ. అతనిని మీ ఆత్మయందు దర్శింపుడు. అనుష్ఠానమతమనగా నిది. స్వాతంత్ర్య మందే కలదు. ఈ విషయములో మన మెంతగా పురోగమించితిమో పరస్పర మడిగి తెలిసికొందము. మన మెంతగా దేహమును పూజించుచున్నామో, ఆత్మను, భగవంతుని ఎంతవఱకు నిజముగా విశ్వసించుచున్నామో, ఎంతవఱకు మన మాత్మయని నమ్ముచున్నామో కనుగొందము. అదే స్వార్థత్యాగము, అదే విమోచన, అదే నిజమైన ఉపాసన. ఆత్మసాక్షాత్కారము పొందుడు. మీ రెవరో తెలిసికొనుడు. ఇదే జరగవలసినదంతయు, చేయవలసినదంతయును. మీరు స్వతస్సిద్ధమైన అనంతాత్మయని తెలిసికొనుడు. అనుష్ఠానమతమనగా అది. తక్కిన దంతయు అనుష్ఠానమునకు భిన్నమే. ఏలయనగా తక్కినదంతయు అదృశ్యమైపోవును. ఏ నాటికిని అదృశ్యముకాని దదే. అది శాశ్వతమైనది. వైద్యశాలలు కూలిపోగలవు. రైలు మార్గములు వేసినవారు మరణించెడివారే. ఈ పృథివి ఖండ ఖండములు కాగలదు. సూర్యులు తుడిచివేయబడుదురు. ఆత్మ మాత్రమే నిత్యమైనది, నిర్వికారమైనది.

నశ్వరమగువాని వెంటబడుట; నిర్వికారము, శాశ్వతము అయినదానిని ఉపాసించుట—ఈ రెంటిలో ఏది గొప్పపని? శక్తియుక్తులెల్ల వానికొఱకు వీనికొఱకు వినియోగించుట, అవి లభ్యము కాకమునుపే మృత్యుదేవత వాతబడి వాని నన్నిటిని విడిచిపెట్టి పోవుట—ఏది ఉత్కృష్టమైనపని? పూర్వ మొకరాజు అనేక విజయములు పొంది, అవసానదశ సమీపింపగానే "నేను సంపాదించిన వెలగల వస్తువు లన్నిటిని నా ముందు పెట్టుడు." అని కోరెను. "ఆ

పెద్ద వజ్రమిటు తెమ్ము." అని అడిగెను. దానిని తన వక్షముపై పెట్టుకొని వెక్కి వెక్కి యేడ్చెను. ఏడ్చుచు ప్రాణములు విడిచెను. కుక్కవలె ఏడ్చుచు అసువులు వాసెను.

"నేను జీవించవలెను" అని మానవుడనును. మృత్యుభయముచేతనే బానిసగా తాను జీవితము పట్టుకొని ప్రాకులాడుచున్న సంగతి అతనికి తెలియదు. "నేనను భవింతును" అని అతడు పలుకును. ప్రకృతి తన్ను బానిసను చేసివేసినదని అతనికి తెలియదు.

ప్రకృతి మనల నందఱను పిండి చేసి వేయుచున్నది. మీరు పొందెడి ఇంచుకంత సుఖమును లెక్కచూచుకొనుడు. నిదానముగా ప్రకృతి తన కార్యము మీ ద్వారా నెఱవేర్చుచున్నది. మీరు గతించిపోయిన తరువాత మీ దేహములు మొక్కలు పెఱుగుట కుపయోగపడును. ఈ విధముగా చక్రము సాగిపోవుచున్నది.

కాబట్టి ఆత్మను ఆత్మగా సాక్షాత్కారము పొందుటే అనుష్ఠానమతము. తక్కిన దేదిగాని ఈ లక్ష్యమునకు సహాయపడునంతవఱకే శ్రేయస్కరమైనది. అట్టి సాక్షాత్కారము వైరాగ్యమువలన, ధ్యానమువలన మాత్రమే సాధ్యము. ఇంద్రియసుఖములన్నిటిని త్యజించవలెను. మనలను భౌతికపదార్థమునకు బంధించు సకల శృంఖలములను, ముడులను త్రెంచివేయవలెను. "నాకు భౌతిక జీవితము, ఇంద్రియజీవితము అక్కఱలేదు. నాకింతకంటె ఉత్కృష్ట జీవితము కావలెను"—ఇదివైరాగ్యము. తరువాత ధ్యానబలముతో నింతవఱకు జరిగిన కుఫలమును బాపుకొనవలసియున్నది.

మనము ప్రకృతి చెప్పుచేతలలో నున్నాము. బయట శబ్దమేదయిన కలిగిన నేను వినవలసినదే. ఏదయిన జరుగుచున్నచో నేను చూచితీఱవలసినదే. కోతుల తంతు : మన మొక్కొక్కరము రెండువేల కోతులకు సమానము. కోతులకు కుతూహల మెక్కువ.

మనము అసహాయస్థితిలోపడి యిదంతయు ''భోగ'' మనుకొనుచున్నాము. అద్భుతమైనభాష! మన మీ ప్రపంచము ననుభవించుచున్నాము! ప్రకృతి మనల నీవిధముగా కోరుచున్నది. ఎంతటి శ్రావ్యమైన శబ్దమును వినుచున్నాను! నిజమునకు వినుట, వినకపోవుట నా యధీనములో నున్నదా? ''పోయి దుఃఖసంకులస్థితిలో పడుము!'' అని ప్రకృతి ఆదేశించును. క్షణములో నేను దుఃఖముతో క్రుంగిపోదును...మన మింద్రియ భోగములనుగుఱించి, వస్తువులమీద యాజమాన్యమును గుఱించి మాట్లాడుచుందుము. ఒకడు నన్ను గుఱించి బాగుగా చదువుకొనినవాడనని చెప్పును. మఱొకడు వట్టి మూర్ఖుడనని భావించును. ఏమి పతనము! ఏమి బానిసతనమిది! కటిక చీకటిగదిలో మన మొండొరుల శిరములను పరస్పరాఘాతములకు గుఱిచేయుచున్నాము...

ధ్యానమనగా నేమి? దీనినంతను ప్రతిఘటించగల శక్తి నివ్వగలిగినది ధ్యానము. ''చూడుము. అక్కడెంత అందమైన వస్తువు కలదో!'' అని ప్రకృతి మనతో అనును. నేను చూడను. ''అదెంతటి పరిమళమో! ఆఘ్రాణింపుము'' అని మరల ప్రకృతి మనలను ప్రేరేపించును. ''వలదు; వాసనచూడవలదు'' అని నాఘ్రాణేంద్రియమును శాసింతును. ఇక అది ఆఘ్రాణించదు. నేత్రములకు చూడవద్దని ఆదేశమిత్తును. ప్రకృతి యెంతటి ఘోరకార్యములనయిన జేయును. నా బిడ్డలలో నొకరిని చంపివేసి, ''మూర్ఖుడా! ఇప్పుడు కూర్చొని ఏడ్వుము! అధోగతి పాలగుము'' అనును. ''ఏడ్వవలసినపని నాకులేదు'' అని నేనందును. నే నెగిరి గంతు వేయుదును. నేను ముక్తుడను కావలెను. మీరు ధ్యానసాధన చేయుడు. ఒక్కొక్కప్పుడు ధ్యానబలముతో క్షణకాలము ప్రకృతిని మార్చివేయగలరు. అంతటిశక్తి మీకున్నచో అది స్వర్గము కాదా? ముక్తికాదా అది? ధ్యానమున కంతటి శక్తిగలదు.

అదెట్లు సాధ్యమగును? బహువిధముల సాధ్యమగును. ఒక్కొక్క స్వభావముగలవారి కొక్కొక్క మార్గము కలదు. కాని,

సామాన్య సూత్రమిది. మనస్సును స్వాధీనపఱచుకొనవలెను. మనస్సు సరస్సువంటిది. దానిలోబడిన ఒక్కొక్క రాయివలన కెరటములు లేచును. ఈ తరంగ సంచలనమువలన మన యథార్థ తత్త్వమును మనము గ్రహింపలేకున్నాము. పౌర్ణమినాటి చంద్రబింబము నీటిలో ప్రతిఫలించును. కాని, సరస్సులోని నీరు కదలుచుండుటవలన బింబమును మనము సరిగా చూడలేము. అలలు నిలిచిపోవలెను. ప్రకృతిని నీమనస్సులో తరంగములను కల్పింపనీయకుము. మనస్సును నిశ్చలముగ నుంచుము. కొంతసేపటికి ప్రకృతి నీజోలికిరాదు. అంతట మన యథార్థతత్త్వము మనకు ప్రత్యక్షమగును. భగవంతు డక్కడ ఉండనే ఉన్నాడు. అయితే, మనస్సు భావసంచలనమునకు వశమై యింద్రియములవెంట పరుగిడుచున్నది. ఇంద్రియములను మూసివేయుము. అప్పటికిని మనస్సు అటు నిటు తిరుగుచునే ఉండును; సరిగా ఈ క్షణమున నేను తిన్నగానే ఉన్నానని అనుకొందును. దేవుని ధ్యానముచేయుదును. నిమిషములో నా మనస్సు లండన్ నగరమునకు పోవును. అక్కడనుండి మనస్సును మరలించితినా, అది న్యూయార్కుకుపోయి, యిదివరలో నే నక్కడచేసిన పనులను గుఱించి యోచనచేయుట కారంభించును. ధ్యానబలముతో నీ చాంచల్యము నరికట్టవలెను.

క్రమక్రమముగా, నిదానముగా మనలను మనము సుశిక్షితులను చేసికొనవలెను. ఇది సులభమైనపనికాదు. ఒక దినములో కాగలపనికాదు. సంవత్సరములు పట్టవచ్చును. కొన్ని జన్మలు పట్టినను పట్టవచ్చును. అయిన నేమి? సందేహింపకుడు. సాధన సాగిపోవలసినదే. ఎఱుకతో, ఇచ్ఛికముగా ప్రయత్నము జరిగి తీఱవలెను. కొంచెము కొంచెముగా మనము పురోగమింతుము. నిజమైన సంపదయేదో అది మనవశమగుచున్నట్లు మనము గుర్తింపగలుగుదుము.—మనదగ్గఱ నుండి యితరులెవ్వరు అపహరింపలేని ఆస్తి యది; ఎవ్వరును నాశనముచేయజాలనిదది; ఎంతటి దుఃస్థితియు మనలను కష్టపెట్టజాలని ఆనందమది......

ఇంతకాలము మన మితరులపై ఆధారపడితిమి. నాకు గొంత సౌఖ్యమున్నచో, ఆవ్యక్తి వెళ్లిపోవుటతో నా సౌఖ్యముకూడ పోవును...మానవుని అవివేకమును గమనింపుడు: అతడు తన సౌఖ్యమున కితరులపై ఆధారపడును! వియోగములెల్ల దుఃఖ కారకములే, అట్లుండుట సహజమే. సుఖముకొఱకు ధనముపై ఆధార పడుటయా? ధనమునకు రాకపోకలున్నవి. ఆరోగ్యముపైగాని, నిర్వికారము శాశ్వతమునయిన ఆత్మవస్తువుతక్క మఱిదేనిపైగాని ఆధారపడినచో నేడుగాకున్న రేపైనను దుఃఖము తప్పదు.

అనంతమైన ఆత్మవస్తువుతప్ప ప్రతివస్తువు మార్పు చెందు చున్నది. సుడిగాడ్పు వేగముతో సర్వము మాఱిపోవుచున్నది. నిత్యమైనది నీలోదక్క మఱెందును లేదు. మార్పులేని ఆనంద మనంతముగానున్నది. దానిని చేరుటకు ధ్యానద్వారమున పోవలెను. ప్రార్థనలు, మతకర్మ కలాపములు, ఇతర పూజావిధానములు ధ్యానమును గుఱించి శిశువులకు శిక్షణనిచ్చు పాఠములు. మీరు ప్రార్థన చేయుదురు. ఏదో నివేదింతురు. ప్రతివిషయము మన ఆధ్యాత్మిక శక్తిని పెంపుచేయునను సిద్ధాంత మొకటికలదు. కొన్ని శబ్దముల ఉచ్చారణ, పూలు, ప్రతిమలు, దేవాలయములు, హారతులు మున్నగునవి మనస్సుకు ఆ స్థితి కలిగించును. అయితే, ఆ స్థితి సర్వదా మానవాత్మయందే కలదు; మఱెందును లేదు. జను లందుకు ప్రయత్నము చేయుచునే ఉన్నారు. వారు తెలియకుండ చేయుచున్నది మీరు ఎఱుకతో చేయుడు. ధ్యానమువలన కలుగు శక్తియనగా అది. సమస్తజ్ఞానము మీ యందేకలదు. అదెట్లు కలుగుచున్నది? ధ్యానమువలన కలుగుచున్నది. ఆత్మ తనలోపల నుండియే మథించి జ్ఞానమును పైకి తెచ్చినది. ఆత్మకు వెలుపలనున్న జ్ఞానమేమి? సాధనచేయగా చేయగా ధ్యానశక్తి మనలను మన దేహములనుండి వేఱుచేయును. అప్పుడు ఆత్మ తన్నుతాను జనన మరణములు లేనిదిగా గుర్తించును. ఇక ఎట్టి దుఃఖమును కలుగదు; ఈ పృథివిమీద జన్మలు కలుగబోవు; పరిణామము పొందబోదు. తానెప్పుడును ముక్తము, పరిపూర్ణము నని ఆత్మ గుర్తించును.

# హేతుజ్ఞానము : మతము

## (ఇంగ్లాండులో చేసిన ఉపన్యాసము)

నారదముని పరమసత్యమును గుఱించి తెలిసికొనుటకు సనత్కుమారుని కడకుపోయెను. "ఇంతవఱకు నీ వేమి చదివితి" వని యతనిని సనత్కుమారు డడిగెను. "వేదములను, ఖగోళశాస్త్రములను, తదితర శాస్త్రములను అధ్యయనము చేసితి" ననియు "వాని వలన తనకు సంతృప్తికలుగ లే" దనియు నారదుడు బదులు చెప్పెను. అంతట వా రిరువురకు సంవాదము జరిగెను. వేద విజ్ఞానము, ఖగోళశాస్త్రజ్ఞానము, తత్త్వశాస్త్రజ్ఞానము, అపరా విద్యలని మాటల సందర్భమున సనత్కుమారుడు చెప్పెను. విజ్ఞానశాస్త్రములపరావిద్యలు. బ్రహ్మసాక్షాత్కారమునకు సహాయపడు విద్యయే పరమోత్కృష్టమైన విద్య, పరావిద్య. ఈ యభిప్రాయము ప్రతిమతమునందు గలదు. కనుకనే ఉత్కృష్టజ్ఞానము మతము వలననే తెలియగలదను భావము గలిగినది. విజ్ఞానశాస్త్రములు మన జీవితములలోని కొన్ని విషయములను గుఱించియే తెలియ జేయును. మతము మనకు తెలియజేసెడి జ్ఞానము శాశ్వతమైనది. అది, తాను బోధించెడి సత్యమువలెనే అనంతమైనది. ఈ యాధిక్యమును పురస్కరించుకొని, మతములు పలుపర్యాయములు అపరావిద్యలన్నిటిని కొద్దిచూపుతో చూచినవి. అంతేకాదు, అపరా విద్యలచేత సమర్థింపబడుటకు సయితము మతవిజ్ఞానము నిరాకరించినది. ఇది దురదృష్టము. దీని ఫలితముగా ప్రపంచమంతటను పరావిద్యకు అపరావిద్యకు సంఘర్షణ జరగుచువచ్చినది. వీనిలో ఒకటి, తన్ను నడిపింపగల నిర్దుష్టమైన ప్రమాణ మొకటి కలదని భావించును. తనకు సంబంధించిన విషయమును గుఱించి అపరా విద్య యేమిచెప్పినను లక్ష్యపెట్టదు. మఱొకటి, ధగధగ మెఱసెడి హేతు జ్ఞానముతో మతము ప్రతిపాదించెడి ప్రతివిషయమును

ఖండించివేయుట కుత్సాహపడును. నేటికిని ఈ విధమైన సంఘర్షణ ప్రతి దేశములోను కలదు. మతములు పునః పునః పరాజయము పొందినవి. అవి దాదాపుగా నిర్మూలింపబడినవి. ఫ్రెంచి విప్లవములో హేతువాదమును దేవతగా ఆరాధించుట మొత్తము మానవకోటి చరిత్రలో తొలిసారి కాదు. అట్టి సంఘటన పూర్వ కాలమున ఎన్నో పర్యాయములు జరిగినది. ఆధునిక యుగమున అది ప్రచండరూపము దాల్చినది. నేడు భౌతిక విజ్ఞానశాస్త్రములు మునుపటికంటె అధిక బలసంపన్నములైనవి. మతములకు బలము మునుపటికంటె తగ్గుచున్నది. వాని పునాదులు సహితము చలించినవి. నేటి మానవుడు బహిరంగముగా ఏమి చెప్పినను, తానిక ''నమ్మజాల'' నని వాని మనస్సునకు తెలియును. పురోహితవర్గము ఒకటి నమ్మవలసినదని చెప్పుచున్నందున నమ్ముట, కొన్ని గ్రంథములలో రచింపబడినందున నమ్ముట, తనవారు చెప్పుచున్నందున నమ్ముట యిక ఎంతమాత్రము సాధ్యము కానిపనియని యతడు గ్రహించినాడు. బహుజనాంగీకారము పొందిన మతాభిప్రాయములతో ఏకీభవించు వారు చాలమందిగలరు. కాని, వారాపని ఆలోచనతో చేయుట లేదని మనకు తెలియును. వారి నమ్మకమునకు ''ఆలోచింపకుండుట, ఔదాసీన్యము'' అని అర్థము చెప్పవచ్చును. ఈ పోరు ఇక ఎంతోకాలము సాగదు. త్వరలోనే మతసౌధములు ధూళిలో కూలి పోగలవు.

'దీనికి ఉపాయాంతర మేమయినగలదా' అనునదే ప్రశ్న: ఇంకను స్పష్టముగా చెప్పవలెననినచో, ప్రశ్నస్వరూప మిట్లుండును. విజ్ఞాన శాస్త్రములను, అవ్వలిజ్ఞానమును పరిశీలించుటకై ప్రయోగింపబడు సమీక్షా విధానములే మతశాస్త్ర విమర్శకై వినియోగములు కావలెనా? అట్లు కావలెననియే నేనభిప్రాయ పడుచుందును. ఏ హేతుపరిశీలన వలన కనుగొనిన విషయములు ప్రతివిజ్ఞానశాస్త్రమును ఋజువుచేయుటకు సాధనభూతములగుచున్నవో, వాని సహాయముతోనే మతమునుకూడ నిరూపింపవలెనా? ఈ పని యెంత

శీఘ్రముగాజరిగిన అంతమేలు. అట్టి పరిశోధనవలన మతము నశించెడుపక్షమున, ఇంతకాల మది నిష్ప్రయోజనమైన దన్నమాటే. అనుచితమైన అంధవిశ్వాసమే యది; అటువంటిదెంత త్వరగా నశించిన అంతమంచిది. అది పోవుటకంటె మేలయినపని మఱొకటి ఉండబోదని నా నిశ్చితాభిప్రాయము. పనికిమాలినదంతయు బోవుననుట నిస్సందేహము. కాని, ఈ పరిశోధనవలన మతమునకు ప్రాణప్రదమైన ప్రధాన విషయములు తిరుగులేని సత్యములుగా నిరూపితములు కాగలవు. అవి శాస్త్రీయములగును—కనీసము ఫిజిక్సు, కెమిస్ట్రీ (పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము) చేసెడి నిర్ణయములంతటిశాస్త్రీయమగును. అంతేకాదు. వానికంటె ఎక్కువ బలము కలిగినవగును. ఎందుకనగా, ఫిజిక్సుగాని కెమిస్ట్రీగాని చేయు ప్రతిపాదన నిజమని నిర్ధరించుటకు అంతరాత్మయొక్క ఆమోదముద్ర లేదు; మతమున కట్టిదికలదు.

మతమును గుఱించి హేతువిమర్శ చేయరాదనెడివారు స్వవచన వ్యాఘాతము చేయుచున్నారని నాకు తోచుచున్నది. ఇందుకు ఉదాహరణ తీసికొందము: క్రైస్తవులు తమ మతమే సత్యమని చెప్పుదురు. ఏలయనగా, అది ఒకానొకనికి సాక్షాత్కారమైనది. మహమ్మదీయుడు గూడ తన మతమును అదేవిధమున పలుకును; తన మతమే సరియైనదనును. ఎందుకనగా అది ఒకానొకనికి సాక్షాత్కరించినది. అంతట క్రైస్తవుడు మహమ్మదీయునితో నిట్లనును: ''మీ నీతిశాస్త్రములో కొన్ని భాగములు తిన్నగా లేనట్లు తోచుచున్నది. ఉదాహరణము: అవిశ్వాసిని బలప్రయోగము చేతనయినను మహమ్మదుప్రవక్త స్థాపించిన మతములో జేర్పవచ్చుననియు, అప్పటికిని మహమ్మదీయ మతములో నాతడు కలియుట కంగీకరింపనిచో అతనిని చంపివేయవచ్చుననియు మీ గ్రంథములలో నున్నది కదా! అటువంటి యవిశ్వాసిని చంపిన మహమ్మదీయునకు స్వర్గము లభించుట తథ్యము; అతడెంతటి పాప

ములు చేసియున్నను సరే.'' ఇందుకు వెంటనే మహమ్మదీయు డిట్లు బదులు చెప్పెను : ''ఔను నా గ్రంథ మట్లు ఆదేశించుచున్నది కనుక అది నాకు పరమకర్తవ్యము. అట్లు చేయకపోవుట తప్పిదమగును. క్రైస్తవుడు, ''నా మతగ్రంథ మామాట చెప్పుటలేదే!'' అనును. దానికి మహమ్మదీయు డీవిధముగా పలుకును: ''అది నాకు తెలియదు; నీ గ్రంథమును ప్రమాణముగా స్వీకరించవలసినపని నాకు లేదు. ''అవిశ్వాసుల నందఱను సంహరింపు''డని నా గ్రంథ మాదేశించు చున్నది. ఏది ధర్మమో ఏది అధర్మమో నీకెట్లు తెలియును? నా గ్రంథములో వ్రాసి యున్నదే ధర్మము. ఇది నిశ్చయము. చంప దగదనినీ పుస్తకములోనున్న మాట తప్పు. క్రైస్తవమిత్రుడా! నీవు కూడ ఆదేమాట చెప్పుము. జిహోవా యూదులకేమి ఆదేశించెనో అదేధర్మము. వారు చేయరాదని చెప్పిన పనులు త్యాజ్యములు. నేనును ఆవిధముగానే చెప్పుదును : కొన్నిపనులు చేయవలెనని, మఱికొన్ని పనులు చేయరాదని అల్లా నా గ్రంథములో చెప్పియున్నాడు. ధర్మా ధర్మముల నిర్ణయమున కదే కొలతబద్ద.'' ఇంతగా చెప్పినను క్రైస్త వునికి సంతృప్తి కలుగలేదు ; పర్వతముమీద ఏసునాథుడు చేసిన ధర్మబోధను కొరాన్‌లోని ధర్మములతో పోల్చి తారతమ్య పరిశీలన చేయవలెనని అతడు పట్టుపట్టును. ఈ విషయమెట్లు తేలగలదు? ఇది గ్రంథపరిశీలనవలన నిర్ణయించుటకు వీలుకాదనుట నిశ్చయము. గ్రంథములే పరస్పరము భిన్నముగా నున్నప్పు డెట్లు తీర్పుచెప్పగలవు? దీనినిబట్టి ఈ గ్రంథములకంటె సర్వజనీనమైనది, ప్రపంచములోని ధర్మశాస్త్రములన్నిటికంటె ఉత్కృష్టమైనది, వివిధజాతులకు కలి గించిన ఉత్తేజముల బలాబలములను వివేకించగలిగినది మఱొకటేదో కలదని మనమంగీకరింపకతప్పదు. ధైర్యముతో, స్పష్టముగా మనము ప్రకటించినను, ప్రకటింపకున్నను, అది, హేతువాదమనుమాట నిజము. దానినే మన మాశ్రయింతుము.

ఇచ్చట ఒక ప్రశ్న ఉత్పన్నమగును. అది యిది: ఒక సాక్షాత్కారమును మఱొకసాక్షాత్కారముతో పోల్చుటకు, ఒక

ప్రవక్తకు మఱొకప్రవక్తకు గల అభిప్రాయభేదములలో తన ప్రమాణమును నిరూపించుటకు, మతవిషయముల నే మాత్రము గాని అవగాహ మొనరించుకొనుటకు హేతువాదము సమర్థమైన దేనా? దాని కంతటి సామర్థ్యము లేనియెడల యుగయుగములుగా గ్రంథముల మధ్య, ప్రవక్తలమధ్య జరుగుచున్న వివాదములను పరిష్కరింపగలిగిన దేదియు లేదు; దానినిబట్టి మతములన్నియు అసత్యములపుట్టలనియు, ధర్మమును గుఱించి స్థిరమైన భావ మేమియు లేని పరస్పరవ్యాఘాతము లనియు అర్థమగును. మతమునకు నిరూపణ గ్రంథములమీఁద కాక, మానవప్రకృతిలోని సత్యముమీఁద ఆధార పడియుండును. ఈ గ్రంథములు మానవస్వభావమునకు బాహ్య ప్రకాశకములు; ఈ గ్రంథములు రచించినవాఁడు మానవుఁడు. మానవుఁడు సృజించిన గ్రంథములను మనము పరిశీలింపవలసియున్నది. సర్వమానవ సామాన్యమైన ఆ హేతువునుండియే, మానవప్రకృతి నుండియే హేతుజ్ఞానముకూడ ఉద్భూతమైనది. దానినే మన మాశ్రయించవలెను. మానవప్రకృతితో, ప్రత్యక్షముగా సంబంధము గలిగినది హేతుజ్ఞానమే కనుక అది ఆ ప్రకృతిననుసరించియుండు నంతవఱకు మనము దానినుపయోగించుకొనవలసినదే. నేను దేనిని హేతుజ్ఞానమనుచున్నాను? ఈ దినములలో చదువుకొనిన ప్రతి పురుషుఁడు, ప్రతి స్త్రీ కోరుచున్న దేదియో అది; అపరావిద్యలు కని పెట్టిన సత్యములను మతమున కన్వయించుట. హేతువాదములోని మొదటి సూత్రము ప్రత్యేకమైనదానిని సాధారణమైనదాని సహాయముతో, సాధారణమైన దానిని అంతకంటె ఎక్కువ విస్తృతమైనదాని సహాయముతో అన్వయించి, అర్థము చెప్పుకొనుచు సర్వజనీనమైనదానిని చేరుట. ఉదాహరణము: శాసనమును గుఱించి మనకొక భావమున్నది. ఏదయిన సంఘటన జరిగినప్పుడు అది ఒకానొక శాసనము ననుసరించి జరిగియుండునని మనము నమ్ముదుము. అప్పుడు మనకు సంతృప్తికలుగును. అది మనము కోరెడి వివరణ. మొదట కారణమేమియను ప్రశ్న కలిగించిన కార్యము

"శాసనము" అని మనమనెడి సాధారణకార్యముల సంపుటికి చెందిన ఒకానొక సంఘటన మాత్రమే అని ఆ వివరణ కుదాహరణము, 'ఒక యాపిల్ పండు నేలమీద పడినప్పుడు న్యూటన్ చకితుడయినాడు. యాపిల్ పండ్లన్నియు పడునని అతడు గ్రహించినప్పుడు సంతృప్తి పొందినాడు' అని తెలుపుదుము. మానవుని విషయపరిజ్ఞానము నందిది యొక సూత్రము. నేను వీథిలో ఒకానొకవ్యక్తిని, మానవుని చూతును. మానవుని గుఱించి నాకుగల విస్తృతభావముతో పోల్చుకొందును. అంతట నాకు సంతృప్తి కలుగును. సాధారణభావముతో పోల్చుటవలన అతడు మానవుడను జ్ఞానము కలిగినది. కనుక ప్రత్యేకభావములను సాధారణమైనదానితో, సాధారణమైనవానిని అంతకంటె విస్తృతమైన వానితో, అన్నిటిని చివరకు విశ్వజనీనమైనదానితో పోల్చవలెను. కట్టకడపటి భావము విశ్వజనీనమైనది. అది అసలు అస్తిత్వమును గుఱించినది. అన్నిటికంటె మిక్కిలి విశ్వజనీనమైనది అస్తిత్వము.

మనమందఱము మానవులము; మనలోని ప్రతి యొకరము మానవకోటి యనెడి సాధారణ భావములోని ఒక భాగము. మానవుడు, పిల్లి, కుక్క జంతువులే. వీనిలోని ప్రతియొక జంతువు విస్తృతమైన సాధారణ భావములోని భాగములే. మానవుడు, పిల్లి, కుక్క, మొక్క, చెట్టు-ఇవి ప్రాణికోటిని గుఱించిన మఱింత విస్తృతమైన సాధారణ భావములోని భాగములు. సకల ప్రాణులు, సమస్తవస్తువులు అస్తిత్వమును గుఱించిన భావములోని భాగములు. మనమందఱ మందులోనివారమే. ప్రత్యేకమైనదానిని విశాలమైనదానితో పోల్చి ఆ తరగతికిచెందిన మఱికొన్నిటిని కనుగొనుటే ఈ వివరణకర్థము. పెక్కు తరగతులకుచెందిన అట్టి సాధారణ భావము లనేకము మనస్సులో నిల్వ ఉన్నవి. అరలవంటివనేకము దానిలోగలవు. వానిలో వివిధభావములు వర్గీకృతమగుచుండును. మనము క్రొత్తవస్తువును చూచినప్పుడు వెంటనే దాని తరగతి భావములుగల అర ఏదో మనస్సు వెదకును. దానిని గుర్తిం

చినపిదప క్రొత్తవస్తువునందు చేర్చుదుము. అప్పుడు మనకు సంతృప్తి కలుగును; మనకా క్రొత్తవస్తువు తెలిసినదగును. జ్ఞానముకలుగుట యనగా నిదియేగాని మఱేమియుగాదు. క్రొత్తవస్తువును చేర్చదగు తరగతిగల అర కనబడనియెడల మనకసంతృప్తి కలుగును. మఱొకవిధముగా వర్గవిభాగముచేసి, దానినేదో అరలో చేర్చువఱకు మనము వేచియుండవలెను. ఆ వర్గముకూడ అంతకుముందు మనస్సులో నున్నదే. కాబట్టి నే నింతకుముందు సూచించినట్లు జ్ఞానమనునది కొంచెమించుగా వర్గీకరణమే. మఱొకవిషయము: జ్ఞానమును గుఱించిన మఱొకవాదము ప్రకారము ఒక వస్తువునుగుఱించిన జ్ఞానము దానిలోపలనుండి వెలుపలకు రావలసినదేగాని, వెలుపల నుండి లోపలకు చొరవలసినదికాదు. ఒకడు విసరిన రాయి క్రిందపడినచో దానినేదో భూతము దిగువకు ఈడ్చుకొనివచ్చెనను నమ్మక మొకప్పుడుండెను. జనులు స్వాభావిక సంఘటనలెన్నిటినో అప్రాకృతికజీవుల కారోపించిరి. భూతము రాతిని నేలమీదికీడ్చెననుట వస్తుతత్త్వమును పురస్కరించుకొని చేసిన వివరణకాదు: బయట నుండివచ్చినదే; గురుత్వాకర్షణశక్తినిగుఱించి చెప్పిన రెండవ వ్యాఖ్యానము రాతి తత్త్వమునకు సంబంధించినది. ఇది లోపలనుండి వచ్చుచున్న వివరణ. ఈ పద్ధతి ఆధునిక భావవైఖరియందంతటను కాననగును; ఒక్క మాటలో చెప్పవలెనన్నచో, వస్తు పరిజ్ఞానము ఆ వస్తువుల తత్త్వమునుండియే పొందుటే విజ్ఞానము (సైన్సు). విశ్వములో జరుగుచున్న కార్యకలాపముల కర్థము చెప్పుటకు వాని వెలుపల ఎక్కడనో ఏవో జీవులతో ముడిపెట్ట నవసరములేదు. రసాయనశాస్త్రజ్ఞుడు వస్తు ధర్మములనుగుఱించి చెప్పుటకు రాక్షసులు, భూతములు అక్కఱలేదు. పదార్థ విజ్ఞానవేత్తకుగాని, మఱే విజ్ఞానికిగాని తనకు తెలిసిన విషయములను తెలియజేయుటలో అట్టి జీవుల ప్రసక్తి యుండదు. విజ్ఞాన (సైన్సు) లక్షణములలో నొకటియైన దీనిని నేను మతమున కన్వయింతును. ఈ యన్వయమునకు మతములు సరిపడక ముక్కలయిపోవుచున్నవి. ప్రతి విజ్ఞాన

శాస్త్రము వస్తుతత్త్వమును పురస్కరించుకొనియే అర్థము చెప్పగోరు చున్నది. మతము లీ పద్ధతిని మన్నింపలేకున్నవి. దేవుడు ఈ ప్రపంచమునకు పూర్తిగా వేఱుపడిన ఒకానొకవ్యక్తియని భావించెడి బహుప్రాచీనసిద్ధాంతమొకటి కలదు. ఈ వాదమున కనుకూలముగా యుక్తులపై యుక్తులు పలుమాఱు పునరుక్తమైనవి. సృష్టికి సంపూర్ణముగా వేఱయి, విశ్వాతీతుడయిన దేవుడొకడుండుట ఎట్లవసరమో, అతడు తన సంకల్పమునుండి జగత్తునెట్లు సృష్టించెనో, అతనిని లోకపాలకునిగా మతమేవిధముగా గుర్తించెనో చెప్పుదురు. ఈ యుక్తులుగాక, సర్వశక్తుడైన భగవంతుని సర్వజీవ దయాపరునిగా వర్ణించుటయు మనము వినుచున్నాము. అయినను జగత్తులో హెచ్చుతగ్గులు కలవు. ఈ విషయము లేవియు తత్త్వవేత్తకు సరిపడవు. ప్రధానవిషయము తప్పు అని యతడనును; బయటనుండి చేసిన వాదమది. వస్తుతత్త్వమును పురస్కరించుకొని ప్రతిపాదించిన సిద్ధాంతము కాదు. సృష్టికి హేతువేమి? దీనికి ఆవలనున్న దేదో, ఎవరో వ్యక్తి దీనిని నడుపుచున్నాడట! రాయి నేలమీద పడుటకు చెప్పిన యిట్టి సమాధానము చాలనట్లే, మతమునుగుఱించి చెప్పుటకుకూడ చాలదు. మతములన్నియు కూలిపోవుచున్నవి. అంతకంటె బలమైనవాదమును ప్రతిపాదించలేకపోవుటే అందుకు కారణము.

ప్రతిసంఘటనకు అర్థము దానితత్త్వము నాధారముచేసికొనియే చెప్పవలెననెడి భావముతో సంబంధము గలిగినది. ఈ సూత్రమునకు రూపాంతరమైనదియు మఱొకటికలదు. అది ఆధునిక క్రమవికాస సూత్రము. ఒక వస్తువుస్వభావము పునరుత్పన్నమైనదేయని కార్యము కారణమునకు రూపాంతరముదక్క మఱేమియుకాదని, కార్యములో గల సకల శక్తులు, అవకాశములు కారణములోగలవని, సమస్త జగత్తు క్రమవికాసమేగాని సృష్టికాదని మాత్రమే క్రమవికాస సూత్రమునకుగల యర్థమంతయును. అనగా, ప్రతికార్యముదానికి ముందున్న కారణమునకు క్రమపరిణామమే; ఈ పరిణామము పరి

స్థితులవలన కలిగినది. సృష్టియంతటనుగల క్రమమిదియే. మార్పులకు కారణములను తెలిసికొనుటకు ప్రపంచమునుదాటి ఎక్కడికో పోనక్కఱలేదు; అవి ప్రపంచములోనే కలవు. బయట ఎక్కడనో కారణమును కనుగొన నవసరములేదు. ఈ సిద్ధాంతముకూడ మతమును తుత్తునియలు చేయుచున్నది. మతము తుత్తునియలగుచున్న దనుటలో నాయభిప్రాయమిది: దేవుడు సృష్టికి ఆవల ఎక్కడనో కలడనియు, అతడు స్థూలమైన వ్యక్తియనియు భావించెడి మతములిక నిలబడజాలవు; అవి యించుమించుగా నేల గూల్చబడినవి.

ఈ రెండు సూత్రములను ఆమోదించెడి మతమే దేనికలదా? సంభవమనియే నా యభిప్రాయము. సామాన్యధర్మమును మన్నించవలెననుట మొదటి విషయము. దీనితోపాటు క్రమవికాసధర్మమును మన్నించవలెను. సాధారణధర్మముల కెల్ల సాధారణమైన విశ్వజనీనధర్మమును గుర్తించవలెను. దానినుండియే ప్రతిధర్మము ఉద్భూతము కావలెను. దీని లక్షణము కనిష్ఠఫలితమునకుగల లక్షణమువంటిది. కారణమత్యున్నతమైనది, పరమమైనది, ఆది కారణము, దాని కట్టకడపటి ఫలితము, దూరాతిదూరమందున్న ఫలితము, క్రమపరిణామముల పరంపర ఒక్కటియే అయితీఱవలెను. ఈ పరీక్షకు వేదాంతము ప్రతిపాదించు బ్రహ్మము నిలబడగలదు. మనము చేరగల కట్టకడపటి సాధారణసూత్రము బ్రహ్మము. దానికి గుణములులేవు. అయ్యది సత్, చిత్, ఆనందం—పరమము. అస్తిత్వము అనునది మానవుని మనస్సు అందుకొనగల పరమ విస్తృతమైన సాధారణసూత్రమని మనమింతకుముందు గ్రహించియున్నాము. జ్ఞానమనగా మనము పొందినజ్ఞానముకాదు; దాని సారము; క్రమపరిణామధర్మము ననుసరించి మానవులలోను జంతువులలోను ఏది తన్నుతాను జ్ఞానరూపమున అభివ్యక్తము చేసికొనుచున్నదో అది. ఈ జ్ఞానమునకు పర్యవసానము పరమవస్తువే. ఆక్షేపణలేనియెడల అది చైతన్యమేయని చెప్పవచ్చును. అదే జ్ఞానమునకర్థము. వస్తువులలో ప్రధానమైన ఐక్యసూత్రముగా జగత్తులో

మనము కనుచున్నదదియే. ఆధునికవిజ్ఞానము పునఃపునః ఋజువు చేయుచున్న దేదేనికలదేని అది 'మానసికముగా, ఆధ్యాత్మిక ముగా, భౌతికముగా మనము ఒక్కటియే'యని నా మనస్సునకు తోచు చున్నది. భౌతికముగాకూడ మనము వేర్వేరనుట తప్పు. వాదము కొఱకు మనము భౌతికవాదులమే అనుకొనినను అఖిలవిశ్వము భౌతిక తత్త్వసాగరమను నిర్ణయమునకు రావలసియుండును. దానిలో మీరు, నేను సుడిగుండములవంటివారము. పదార్థము ముద్దలు ముద్దలుగా ఒక్కొక్క సుడిగుండములో వచ్చిపడి, సుడిగుండము ఆకృతిదాల్చి, దానిలోనుండి పదార్థముగా బహిర్గతమగుచున్నది. నా దేహములోనిపదార్థము కొలది సంవత్సరముల క్రితము మీ దేహము లోనో, సూర్యునిలోనో ఉండి యుండవచ్చును. లేదా, ప్రవాహములో పడి మొక్కలోని పదార్థముగా మాఱి యుండవచ్చును; మఱేదయిన కావచ్చును. నీ దేహము, నా దేహము అనుమాటల కర్థమేమి? దైహికమైన ఏకత్వమది. ఆలోచన విషయమైగూడ నంతే. అది భావసాగరము. అది అఖండము, అనంతము. దానిలో నీ మనస్సు నామనస్సు సుడిగుండములవంటివి. ఫలితము నీవు చూచుటలేదా? నీ ఆలోచనలు నీలోనికి నీ ఆలోచనలు నాలోనికి ఎట్లు ప్రవేశించు చున్నవో! మన జీవితములన్నియు ఒకటే; భావముచేతగూడ మన మొక్కరమే. మఱికొంత విస్తృతమైన సాధారణధర్మమునకు వచ్చి నచో పదార్థమునకు, భావమునకు ప్రాణప్రదమైనది ఆత్మవస్తువు. ఈ ఏకత్వమునుండియే సమస్తము వచ్చినది; అది అనివార్యముగా ఒక్కటియేయయి యుండవలెను. మనము నిక్కముగా ఒక్కరమే. భౌతికముగా మనమొక్కరమే. మానసికముగా మనమొక్కరమే. ఆత్మయందు మనకు నమ్మకమున్నయెడల—ఆత్మగా మనమొక్క రమే అని ప్రత్యేకించి చెప్పనవసరము లేదు. అనుదినము ఆధునిక విజ్ఞానము ఋజువుచేయుచున్నది ఈ యేకత్వమునే. దురహంకారున కది, "నీవును అక్కడనున్న ఆ క్రిమియును ఒక్కటే; నీ వేదో

దానికి చాల వేఱైనట్లు భావింపకుము. అదియును నీవును ఒక్కటే. ఒకానొక పూర్వజన్మలో నీవదియే. అదే క్రమక్రమముగా నీవు గర్వించుచున్న ఈ మానవస్థాయికి ప్రాకినది. మహోత్కృష్టమైన ఈ బోధ చేయుచున్నది.—"సృష్టిలో ఏదేది కలదో దానితో ఏకాత్మీయతనుకూర్చు ఈ బోధ మనము నేర్చుకొని తీఱవలసినది. మనకంటె ఉత్కృష్టమైన జీవులలో ఒక్కటియగుటకు మనలో చాల మంది కిష్టమే. తక్కువస్థాయి జీవులతో నైక్యము పొందుట కిష్టముగాదు. మానవుని అజ్ఞాన మటువంటిది. ఎవరి పూర్వులయినను సంఘముచేత పూజింపబడినచో, వారు మృగములుగా, దోపిడీ గాండ్రుగా ప్రవర్తించి యున్నను, ప్రతివారు తాము వారివంశీయుల మనిచెప్పుకొనుటకు ప్రయత్నింతురు; మన పూర్వీకులలో ఎవరుగాని ఋజువర్తనము గలిగిన పేదలుండినయెడల ఎవ్వరును తాము అట్టి వారి వంశీయులమనుకొనుట కిష్టపడరు. ఇప్పుడిప్పుడు భావపరివర్తనము కలుగుచున్నది. యథార్థము అధికాధికముగా బయల్పడుచున్నది. అందువలన మతమునకు మహోపకారము కలుగుచున్నది. అద్వైతము చేయుబోధ సరిగానిదియే. దీనినిగుఱించియే నేను మీకు ఉపన్యసించుచున్నాను. ఆత్మ ఈ సకలవిశ్వమునకు సారవస్తువు; సకల జీవులలోని సారవస్తువు. నీ జీవితములోని సారవస్తువదే. అంతే కాదు. "నీవదే." నీవును ఈ సమస్త ప్రపంచమును ఒక్కటే. ఎవడు తమకు నితరులకు తలవెంట్రుక వాసి భేదముకలదని భావించునో అతడు వెంటనే దుఃఖమునకు గుఱియగును. ఎవడు ఈ యేకాత్మతను తెలిసికొనునో, అఖిలవిశ్వములో తానొక్కటియని అనుభవము చేత గ్రహించునో అతనికే సుఖము చేకూఱును.

పరమవిస్తృతమైన సాధారణ సూత్రమును, క్రమపరిణామ సూత్రమును మన్నించుటచేత వేదాంతమతము వైజ్ఞానిక ప్రపంచము విధించు నియమముల కనుగుణముగా నున్నది. ఒక వస్తువును గుఱించిన జ్ఞానము దాని తత్త్వమునుండియే గ్రహింపదగు నను సూత్రమును వేదాంతము మఱింత సంపూర్ణముగా పాటించు

చున్నది. వేదాంతము ప్రతిపాదించు దేవుడయిన బ్రహ్మము నకావల నేమియు లేదు ; బొత్తుగా నేమియు లేదు. ఇదంతయు నిజమునకతడే. అతడు జగత్తులో కలడు ; అతడు జగత్తే. "నీవే పురుషుడవు. నీవే స్త్రీవి. నీవే యౌవనగర్వముతో నడచుచున్న చిన్నవాడవు. నీవే తడబడుచు అడుగులు వేయుచున్న వృద్ధుడవు." అతడిక్కడున్నాడు. మన మతనిని చూచుచున్నాము, గ్రహించుచున్నాము. అతనియందే మన ఉనికి, నివాసము, విహారము. ఇట్టి భావము బైబిలులోని మీ క్రొత్త నిబంధనమున కలదుకదా! దేవుడు జగదంతర్గతుడు, జగత్తుకు సారవస్తువు, జగత్తుకు హృదయము. వస్తువులకాత్మయను భావమది. అతడు తన్ను తాను విశ్వములో అభివ్యక్తము చేసికొనుచున్నాడు. మీరు నేను అనంతమైన ఆ సచ్చిదానందసాగరములో నున్నాము. మనము దాని ఖండములము. చిన్న బిందువులము. చిన్న కాల్వలము. మానవునకు మానవునకు, దేవతలకు మానవులకు, మానవులకు జంతువులకు, జంతువులకు మొక్కలకు, మొక్కలకు రాతి ముక్కలకు తత్త్వతః భేదము లేదు. ఎందుచేతననగా మహోత్కృష్టమైన దేవత మొదలు సూక్ష్మాణువు వఱకు ఆ యనంతసాగరము నభివ్యక్తము చేయుచున్న రూపమే. వ్యత్యాసమంతయు తరతమభేదమే. నేను తక్కువస్థాయిలోని వికాసము ; మీరున్నతస్థాయిలోని వికాసమునయి యుండవచ్చును. ఉభయులలోని వస్తువొకటే. దేవుడనెడి వాహిని ప్రవహించుటకు మీరు, నేను ద్వారములవంటివారము. కనుక మీ ప్రకృతి దివ్యత్వముగలది, నా ప్రకృతికూడ అట్టిదే. జన్మాధికారము చేతనే మీ తత్త్వము దివ్యత్వము; నా తత్త్వముసహితమంతే. మీరు పరిశుద్ధులయిన దేవతలు కావచ్చును. నేను నికృష్టమైన పిశాచమునయి యుండవచ్చును. అయినను అనంత సచ్చిదానందసాగరము నా జన్మహక్కు. మీ జన్మహక్కుకూడ నదియే. మీరు నేడధికవికాసము పొందితిరి. ఆగుడు ; ఇంకను నేను వికాసము పొందుదును. ఏలయన అది యంతయు నాలోనున్నది. బయట దేనితోనో ముడిపెట్టి యర్థము

చెప్పవలసిన పని లేదు. ఎవరికొఱకు పోనక్కఱలేదు. అఖిల విశ్వములోని వస్తువుల మొత్తము భగవంతుడే. అయితే దేవుడు భౌతికపదార్థమా? కాదు, ఎంతమాత్రము కాదు. భౌతిక పదార్థము పంచేంద్రియగ్రాహ్యము. బుద్ధిగ్రాహ్యమైన దేవుడు మనస్సు; ఆత్మదర్శించునప్పు డతడాత్మగా సాక్షాత్కారమగును. భౌతికపదార్థము దేవుడుకాడు. కాని, భౌతిక పదార్థములోగల సత్యమేదో అది దేవుడు. ఈ కుర్చీలోగల సత్యమేదో అది యతడు. ఇది కుర్చీయగుటకు రెండువిషయములు కావలెను. వెలుపల ఏదో కలదు. దానిని నా యింద్రియములు నా కడకు గొని తెచ్చినవి. దానికి నా మనస్సు కొంత జతపఱచినది. ఈ రెంటి కలయిక కుర్చీ అయినది. పంచేంద్రియములకు, బుద్ధికి అధీనమై లేక సర్వతంత్ర స్వతంత్రమై, శాశ్వతముగా నున్నది జగత్ప్రభువు. అతనిపైన ఇంద్రియములు కుర్చీలను, బల్లలను, గదులను, గృహములను, లోకములను, చంద్రులను, సూర్యులను, నక్షత్రములను, సమస్తమును చిత్రించుచున్నవి. మనమందఱము ఒకే కుర్చీని చూచుచున్నామే! సర్వేశ్వరునిమీద, సచ్చిదానందముల మీద మనమందఱము ఒకేవిధముగా వివిధ వస్తువులను చిత్రించుచున్నామే! ఎందుచేత? అందఱు ఒకేవిధముగా చిత్తరువులు రచించుచున్నారనుటకు వీలులేదు. ఒకేతీరున చిత్తరువులు రచించుచున్నవారొక్కస్థాయిలో నున్నారని గ్రహింపనగును. వారు ఒకరి చిత్తరువుల నొకరు చూడగలరు; ఒకరి నొకరు చూడ గలరు కూడ. భగవంతుని ఒకేతీరుగా చిత్రించని జీవులు మీకు నాకు మధ్య లక్షలకొలది యుండవచ్చును. వారినిగాని, వారి చిత్తరువులను గాని మనము చూచుటలేదు.

ఇంతేకాక, ఆధునికభౌతికవైజ్ఞానికపరిశోధన లన్నియు సత్యము. సూక్ష్మరూపమున నుండునని నిరూపించుటకు ఉన్ముఖముగా నున్నవిషయము మీకు తెలిసినదే; స్థూలముగానున్నది బాహ్య రూపముమాత్రమే. ఆవిషయమేమైనను, ఆధునికతార్కికక్రమమునకు నిలబడగల మతసిద్ధాంత మేదేనికలదేని అది అద్వైతమే అని

మము పరిశీలించితిమి. ఎందుకనగా అది ప్రధానసూత్రములు రెంటికి అనుగుణమైనది. అది వ్యక్తిత్వమునకుకూడ అతీతమైన విశ్వజనీనసూత్రము. ప్రతిజీవికి సమానముగా అన్వయము కాగల సాధారణ సూత్రమది. ఈశ్వరుడు సగుణుడను భావముతో పరిసమాప్తమగు సూత్రము విశ్వజనీనము కాజాలదు. ఈశ్వరుడు సగుణుడనుటకు అతడు సర్వదయాపరుడు, సర్వమంగళస్వరూపుడు అని చెప్పవలెను. అయితే ఈ జగత్తు మిశ్రమము. ఇందు మంచిచెడ్డలు రెండును గలవు. మనకిష్టమైనది మాత్రము తీసికొని, దాని నందఱకు సంబంధించిన సగుణదేవునిగా ప్రతిపాదింతుము! సగుణుడయిన దేవు డిట్టివాడు, అట్టివాడు అని మీరు చెప్పుచున్నట్లే అత డట్టివాడుకాడు, ఇట్టివాడునుకాడు అనిగూడ చెప్పవలసియుండును. దేవుడు సగుణుడేయను భావమును సర్వదా దుర్గుణమైన పిశాచము కలదన్న భావము వెన్నంటియే యుండును. అందుచేతనే దేవుడు సగుణుడను భావముతో పరిసమాప్తమగు సాధారణసూత్రము కట్టకడపటిది కాజాలదు. సగుణమును దాటి నిర్గుణమును చేరవలెను. సుఖదుఃఖములతో కూడిన విశ్వము నిర్గుణమందే కలదు. ఏదేదికలదో అదంతయు నిర్గుణము నుండియే వచ్చినది. చెడుగు, తదితర లక్షణములను ఏ దేవున కాపాదింతుమో ఆదేవు డేపాటి దేవుడు? దీని భావమిది! మంచి చెడ్డలను నవి ఒకేవస్తువున కిరుపార్శ్వములవంటివి. అవి ఒకేవస్తువునకు గల ప్రకాశద్వయము. అవి వేర్వేరనెడి యభిప్రాయము తప్పు. మనప్రపంచములోని దుఃఖమున కాయభిప్రాయము చాలవఱకు కారణము—మంచి చెడ్డలు పరస్పర సంబంధములేని రెండు స్వతంత్ర వస్తువులని, అవి శాశ్వతముగా వేర్వేరుగా నుండునవని భావించుట అనర్థదాయకము. సర్వదా మంచి దనదగునది, సర్వదా చెడ్డదనదగునది ఎవరుగాని నాకుచూపిన యెడల మిక్కిలి సంతోషింతును. మనజీవితములోని సంఘటనలు కొన్నిటిని పేర్కొని యవి సమగ్రముగా మంచివే అని, మఱి కొన్నిటిని పేర్కొని యవి సంపూర్ణముగా చెడ్డవని ఎవరు నిర్వ

చింపగలరు? నేడు మంచి దయినది రేపు చెడ్డదికాగలదు. నేడు చెడ్డదయినది రేపు మంచిదికాగలదు. నాకు మేలయినది నీకు కీడుకావచ్చును. పర్యవసాన మేమనగా ప్రతి విషయమునకువలె మంచిచెడ్డ లనువానికికూడ క్రమవికాసము కలదు. క్రమవికాసము చెందుచున్న దేనినో ఒక దశలో మంచియని, మఱియొకదశలో చెడుగని యనుచుందుము. నా మిత్రుని ప్రాణముతీసిన తుఫాన్ చెడ్డదని నేనందును. కాని, ఆ తుఫాన్ గాలిలోని సూక్ష్మవిషక్రిములను నాశనముచేసి లక్షలకొలది జనులను కాపాడియుండవచ్చును. దానిని గుర్తించినవారు మంచిదందురు. నేను చెడ్డదందును. కనుక మంచి చెడ్డలు సాపేక్ష ప్రపంచమునకు సంబంధించినవే. మేము ప్రతిపాదించు నిర్గుణ దేవుడు సాపేక్ష దేవుడుకాడు; కాబట్టి అతడు మంచివాడని గాని, చెడ్డవాడనిగాని నిర్వచించుటకు వీలుకాదు. అతడు మంచి చెడ్డలకతీతుడు. అతడు మంచివాడు కాడు, చెడ్డవాడునుగాదు. కాని, చెడుగుకంటె మంచి ఎక్కువసన్నిహిత వికాసమను మాట నిజము.

ఇటువంటి నిర్గుణవ్యక్తిని, దేవుని నిర్గుణతత్త్వమును అంగీకరించుటవలన కలుగగల ఫలిత మేమి? మనకేమి ప్రయోజనము కలుగును? జీవితరంగములో మతము ప్రధానవిషయముగా, మన కూఱట కలిగించునదిగా, సహాయపడగల శక్తిగా నుండగలదా? సహాయమపేక్షించుచు ఏ దేవునినైన ప్రార్థించవలెననెడి మానవ హృదయావేదన యేమగును? అదెప్పటివలెనే ఉండును. సగుణ దైవముండును; మునుపటికంటె బలమైన ప్రాతిపదికమీాద నుండును. నిర్గుణముచేత అతడు శక్తిమంతుడైనాడు. నిర్గుణములేక గుణము నిలబడజాలదను విషయము మనము గ్రహించితిమి. దేవుడు జగత్తుకు పూర్తిగా వేఱుగానుండి కేవలము తన సంకల్పముచేతనే శూన్యమునుండి విశ్వమును సృజించెనను వాదమును ఋజువుచేయుటకు వీలుకాదు. అట్టిది యసంభవము. నిర్గుణములోని భావము మనము గ్రహించినయెడల సగుణమునకుకూడ అందు స్థానముకలదు. వైవిధ్యముతో కూడిన ఈ జగత్తు నిర్గుణమును గుఱించి మనకు

కలుగు వివిధభావనల సంపుటియే. మనము పంచేంద్రియములచేత గ్రహించి నప్పుడు దానిని భౌతిక ప్రపంచమందుము. మఱొక ఇంద్రియముగల జీవి యేదయిన నున్నయెడల ఈ ప్రపంచము మఱొక తీరుగా కనబడును. విద్యుత్తును గ్రహించగల యింద్రియము మనలో నెవరికయిన నున్నయెడల ఈ లోకమంతకంటె వేఱుగా తోచును. అభిన్నమైన ఏకత్వమునకు విభిన్నరూపములున్నవి; విశ్వమును గుఱించిన వివిధభావనలు దానిని గుఱించిన వివిధ దృశ్యములు. మానవబుద్ధి నిర్గుణమును గుఱించి చేయగల పరమోత్కృష్టమైన భావన సగుణ బ్రహ్మ. ఈ కుర్చీ, ఈ జగత్తు ఎంత నిజమో సగుణబ్రహ్మకూడ అంతే నిజము; అంతకు మించి కాదు. అది పరమసత్యముకాదు. సగుణబ్రహ్మ అసలు నిర్గుణ బ్రహ్మమే. కనుక, నేనెట్లు ఏకకాలమందే సత్యమును సత్యేతరమునో అదియును సత్యమును, సత్యేతరమునై యున్నది. మీరు నన్నేమిగా చూచుచున్నారో అది నా యథార్థ తత్త్వముగాదు. ఆ విషయమై మీకు సంతృప్తి కలుగగలదు. నన్ను గుఱించి మీకు కలుగుచున్న భావము నేను కాను. మీరు మీ హేతుప్రవృత్తిని ఆవిధముగా సంతృప్తిపఱచుకొనవచ్చును. ఎందుకనగా, వెలుతురు, వాతావరణములోని వివిధచలనములు, పరిస్థితులు, నాలో కలుగుచున్న చలనములు—ఇవన్నియు కలిసి నన్ను గుఱించి మీకు కలుగుచున్న భావమునకు తోడ్పడుచున్నవి. ఈ పరిస్థితులలో ఏది మాఱిపోయినను, నేను మాఱిపోదును. ఒకే మనుష్యునికి వివిధములయిన వెలుగు పరిస్థితులలో ఫొటోవులుతీసి, మీరు సంతృప్తి పొందవచ్చును. కాబట్టి మీ యింద్రియముల కేవిధముగా కనబడుచున్నానో అది మీ యింద్రియముల పరముగా నిజము. ఇవన్నియు నిజమే అయినను, మార్పుచెందని దొకటికలదు. దాని కివన్నియు వివిధ అవస్థా విశేషములు; నిర్గుణమైన "నేను"కు "నేను" అనెడి ఈ వేల కొలదియు విభిన్నవ్యక్తులు. నేనొకప్పుడు బాలుడను; మఱొకప్పుడు యువకుడను; ఇప్పుడు వృద్ధుడనగుచున్నాను. అనుక్షణము నా

దేహము, భావములు మాఱిపోవుచున్నవి. ఇన్నిమార్పులమధ్య వీని మొత్తమునకు కారణమైనవస్తువు మార్పులేక ఎప్పుడును ఒకటిగానే ఉన్నది. అదే నిర్గుణమైన నేను. ఈ సకల వికాసములు దానికి విభాగములవంటివి.

ఆవిధముగానే ఈ జగత్తు మొత్తమునకు చలనము లేదు. కాని, యిందులోని ప్రతివస్తువు చలనముకలదే. ప్రతివస్తువు ప్రవాహరూపమున నున్నది. ప్రతివస్తువు నిరంతరము కదలుచున్నది, మాఱిపోవుచున్నది. అట్లయ్యును జగత్తుమొత్తము చలనములేనిదే. చలనమనునది సాపేక్షపదము. కదలని కుర్చీతో పోల్చినప్పుడు నేను కదలుచున్నాను, చలనమునకు కనీసము రెండు వస్తువులయిన కావలెను. జగత్తుమొత్తము ఒక్కటిగా పరిగణించినచో కదలిక లేదు; దేనితో సంబంధముగలిగి అది కదలుచున్నది? కాబట్టి పరమవస్తువు మార్పు, చలనము లేనిది. సమస్త పరిణామములు, మార్పులు పరిమితమైన దృశ్యమాన ప్రపంచములోనివే. పూర్ణమైనది నిర్గుణమే. దానిలోనివే సూక్ష్మాతిసూక్ష్మమైన అణువు మొదలు దేవుని, సగుణబ్రహ్మము, సృష్టికర్త, సృష్టి పాలకుని వఱకు—ఎవరికి మనము ప్రణమిల్లి, ప్రార్థనచేయుదుమో అతని వఱకు అటువంటి సగుణదేవుని పుష్కలమైన హేతుబలముతో ప్రతిపాదించవచ్చును. అటువంటి సగుణబ్రహ్మము నిర్గుణ బ్రహ్మమునకు పరమోత్కృష్టమైన వికాసముగా అర్థము చెప్పవచ్చును. మీరు, నేను తక్కువస్థాయిలోని వికాసము. సగుణబ్రహ్మము మనము భావింపగల ఉన్నతోన్నతమైన వికాసము మీరుగాని నేనుగాని సగుణబ్రహ్మము కాగలమా? మీరు, నేను దేవుడేయని వేదాంతము చెప్పునప్పుడు సగుణబ్రహ్మమని దాని అంతర్యముకాదు. ఉదాహరణము చూడుడు: మట్టిముద్దతో పెద్ద ఏనుగు చేయబడినది. మట్టితో చేయబడిన చుంచు ఉన్నది. మట్టి చుంచు ఎప్పటికైన మట్టి ఏనుగు కాగలదా? అయితే ఆ రెంటిని నీటిలో వేయుడు; రెండును మట్టియే; రెండును మట్టివస్తువులు కనుక రెండును ఒక్కటియే.

చుంచు ఏనుగు అగునా? వానిభేదము శాశ్వతమైనది. అనంతమైన నిర్గుణము ఈ యుదాహరణలోని మట్టివంటిది. మనమును జగత్కర్తయును ఒక్కరమే కాని, వికాసములుగా మన మతనికి ఎల్లకాలము దాసులమే, ఉపాసకులమే. ఆవిధముగా దేవుడు సగుణుడే. అతని యునికి వాస్తవమే. ఈ సాపేక్ష జగత్తులోని ప్రతివస్తువు ఉండునదియే. ఆ పద్ధతిని మతము స్థిరమైనపునాదిమీద ప్రతిష్ఠితమైనది. అందుచేత సగుణము సర్థముచేసికొనుటకు మొదట నిర్గుణము సర్థము చేసికొనుట అవసరము.

ఇంతకుముందనుకొనినట్లు వ్యష్టి సమష్టివలననే తెలియగలదని తర్కసిద్ధాంతము చెప్పుచున్నది. కనుక మానవుని మొదలు దేవునివఱకు వ్యష్టిగానున్న సకలము పరమోత్కృష్టమైన సాధారణ సూత్రమగు నిర్గుణమువలననే బోధపడగలవు. ప్రార్థనల ఆవశ్యకత ఉండును. అవి మఱింత సార్థకమగును. ప్రార్థననుగుఱించిన అర్థవిహీనములయిన భావములు, మిక్కిలి స్థాయికిచెందిన ప్రార్థనలు, మన మనస్సులలో చెలరేగుచున్న క్షుద్రమైన వాంఛలు ధరించు ప్రార్థనశబ్దములు ప్రాయశః అంతరింపవలసి యుండునేమో! ఉత్కృష్టమతములలో సర్వేశ్వరునికి ప్రార్థనలుచేయుటను ఆమోదింపరు. దేవతలకు ప్రార్థనలు చేయుటనే ఆమోదింతురు. అది సహజము. రోమన్ క్యాథలిక్కులు సన్న్యాసులకు ప్రార్థనలు చేయుదురు; అది చాలమంచిదే. కాని, దేవాదిదేవునకు ప్రార్థనచేయుట అర్థవిహీనము. పీల్చుటకు గాలినిమ్మని, వాన కురిపింపుడని, నీ తోటలో పండ్లుపండింపుడని సర్వేశ్వరుని ప్రార్థించుట అస్వాభావికము. సాధువులు మనవంటి చిన్నవారే గనుక మనకు సహాయపడగలరు. మన బాల్యదశనుండియు మన అల్పవాంఛల నేకరువుపెట్టుచు, "ఓ! ప్రభూ! నా తలనొప్పిని తొలగింపుడు" అని జగదీశ్వరుని ప్రార్థించుట హాస్యాస్పదము. లక్షలకొలది జీవులు మరణించినవి. అవన్నియు నిక్కడేగలవు; వారు దేవులు, దేవతలు నయిరి. వారిని వచ్చి సహాయముచేయనిండు. కాని, పరా

త్పరుడేనా? తగదు. అతనిని మనము ఉత్కృష్టవిషయములకై ఆశ్రయింపవలెను. గంగానది గట్టుమీద నున్నవాడు మంచినీటికొఱకు ఒక చిన్న బావి త్రవ్వేనని వాడు నిశ్చయముగా అవివేకియే ; రత్న ఖనిజము కడ నివసించుచు, చిన్నచిన్న స్ఫటికపు ముక్కలకొఱకు గోయి త్రవ్వువాడు అవివేకియే.

అల్పమైన ఐహికవిషయములకు మనము సర్వదయాపరుడయిన జనకుని, పరమ ప్రేమమయుడయిన ఈశ్వరుని ఆశ్రయించినచో మనము అవివేకులమే అను విషయము ముమ్మాటికి నిజము. అందుచే మన మాతనిని వెలుగుకొఱకు, బలముకొఱకు, ప్రేమకొఱకు ఆశ్రయింతము. కాని, మనలో దౌర్బల్యము, దీనమైన పరాధీనతాభావము ఉన్నంతవఱకు ఇట్టి అల్పప్రార్థనలు, సగుణ బ్రహ్మోపాసనను గుఱించిన యభిప్రాయములు ఉండును. ఉన్నతస్థాయి నందుకొనిన వారు అట్టి సహాయము నాశింపరు. తమకొఱకు ప్రయోజనములు పొందవలెనను విషయమును మఱచిపోవుదురు. వారిలోని ప్రబలమైన కాంక్ష—"సహోదరా! నేను కాదు, నీవు" అనున దొక్కటే. వారే నిర్గుణబ్రహ్మము నుపాసించుట కధికారము గలవారు. నిర్గుణ బ్రహ్మోపాసన మెట్టిది? అందు బానిసభావము లేదు—"హే ప్రభూ! నేను బొత్తుగా పనికిమాలినవాడను. నన్ను కరుణింపుము." ఒకానొక ప్రాచీన పర్ష్యన్ పద్యములోని గంభీరార్థము మీకు తెలియును కదా! "నేను నా ప్రియుని దర్శించుటకు పోయితిని. తలుపులు వేసియున్నవి. తలుపు కొట్టితిని. "ఎవరు నీవు?" అని లోపలనుండి వాణి ప్రశ్నించెను. "నేను ఫలానా" అని చెప్పితిని. అది తలుపు తెఱువలేదు. మరల నొకపర్యాయమువచ్చి తలుపుతట్టితిని; వెనుకటి ప్రశ్నయే వినిపించెను; నేను వెనుకటి సమాధానమే చెప్పితిని. తలుపు తెఱువబడలేదు. మూడవ పర్యాయము వచ్చితిని. అదే ప్రశ్న వినిపించెను. "ప్రియుడా! నేను నీవాడనే" అని చెప్పితిని. వెంటనే తలుపు తెఱువబడెను. నిర్గుణ బ్రహ్మోపాసన సత్యముద్వారా జరుగవలెను. సత్యమేమి? నేను అతడే అనుట! నేను నీవు కాదనుట అసత్యము పలుకుట.

నేను నీవు వేఱను భావము అసత్యము, దారుణమైన అసత్యము. నేను, ఈ విశ్వము ఒక్కటి. జన్మచేతనే ఒక్కటి. నేను, జగత్తు ఒక్కటి యను నది నాయింద్రియములకును స్పష్టము. నేను, నన్నావరించియున్న వాయువు ఒక్కటి. నేను, వెలుతురు ఒక్కటి. నిఖిల విశ్వపురుషుడు, నేను శాశ్వతముగా ఒక్కటి. అతడు విశ్వమని వ్యవహరింపబడు చున్నాడు. అతడు విశ్వముగాక మఱెవరో అని అపోహపడు చున్నాము. అది యతడేగాని మఱెవరోకాదు హృదయపీఠమునందు స్థిరముగా నివాసమేర్పఱచుకొనినజ్ఞాత యతడు. ప్రతిహృదయమునం దతడు "నేనున్నాను" అని పలుకుచున్నాడు. అతనికి నిద్రలేదు, మృత్యువులేదు; నిరంతర నిర్నిద్రుడు, అమృతుడు. అతని మహిమకు నాశనములేదు. అతని శక్తులెన్నడు విఫలముకాలేదు. నేను, అతడు ఒక్కరమే.

ఇది యంతయు నిర్గుణోపాసన. దీని ఫలితమేమి? మానవుని జీవితస్వరూపమే మాఱిపోవును. బలమే మన జీవితమునకు కావలసినది. పాపము, దుఃఖము అని మన మనుకొనువానికి గల కారణమొక్కటే. అది దౌర్బల్యము. దౌర్బల్యముతో అజ్ఞానము, అజ్ఞానముతో దుఃఖము కలుగును. నిర్గుణోపాసన మనలను శక్తి సంభరితులను చేయును. అప్పుడు కష్టములనుచూచి నవ్వుదుము. దుష్టుల దౌర్జన్యమును చూచి మందహాసము చేయుదుము. క్రూర మైన బెబ్బులి దాని స్వభావము చాటుననున్న నా యాత్మను వ్యక్తముచేయును. ఇది నిర్గుణోపాసనవలని ఫలితము. ఏ యాత్మ పరమాత్మతో ఏకమగునో అది శక్తిమంతమైనది; మఱొకదాని కంతటిశక్తిలేదు. మీ బైబిలులో పేర్కొనబడిన నాజరెత్తు గ్రామ ములోని జీసస్సుకుగల బలమునకు కారణ మేమనుకొనుచున్నారు? ద్రోహులనుచూచి చిఱునవ్వునవ్వి, తన్ను హత్యచేయుటకు వచ్చిన వారిని దీవించగల బలములోని రహస్యమేమి? "నేను, నా జనకుడు ఒక్కటే" అను భావమే అది; "తండ్రీ! నేను, నీవు ఒక్కరమే అయి నట్లే, వారందఱిని నాతో ఒక్కటిచేయుము" అను ప్రార్థనే అది. అ

నిర్గుణోపాసన. విశ్వముతో ఏకముకండు. అతనితో ఏకముకండు. ఇట్టి నిర్గుణబ్రహ్మమునకు నిరూపణ, నిదర్శనము లవసరము లేదు. అతడు మనకు మన యింద్రియములకంటె, మన ఆలోచనలకంటె సమీపస్థుడు. అతనియందు, అతనిద్వారా మనము చూతుము, భావింతుము. దేనిని చూచుటకైనను ముందుగా నే నతనిని చూడవలెను. ఈ గోడను చూచుటకు మొదట నే నతనిని చూడవలెను, తరువాత గోడను చూతును. శాశ్వతమైన జ్ఞాత యతడే. ఎవ రెవరిని చూచుచున్నారు? అతడిక్కడే-మన హృదయాంతరాళములోనే ఉన్నాడు. దేహములు, మనస్సులు మాఱిపోవును. దుఃఖము, సౌఖ్యము, మంచి, చెడుగు వచ్చును, పోవును. దినములు, సంవత్సరములు గతించిపోవును. జీవితము వచ్చును, పోవును, కాని, అతడు నశింపడు. "నేనున్నాను. నేనున్నాను." అను వాణి శాశ్వతమైనది. దానికి మార్పు లేదు. అతనియందు, అతనిద్వారా మనము సకలము తెలిసికొనుచున్నాము. అతనియందు, అతనిద్వారా మనము సమస్తమును చూచుచున్నాము. అతనియందు, అతనిద్వారా మన మింద్రియముల చేత గ్రహించుచున్నాము; మన మాలోచించుచున్నాము, మనము నివసించుచున్నాము, మనమున్నాము. పరిమితమైన "నేను" అని మనము పొరపడుచున్న ఆ "నేను" నా "నేను" మాత్రమే కాదు, మీ "నేను" కూడ. అది ప్రతివ్యక్తిలోని "నేను"; జంతువుల, దేవతల, క్షుద్రాతిక్షుద్రమైన జీవుల "నేను" అదే. "నేనున్నాను" అనునది హంతకునియందు, సాధువునందు, ధనికులందు, పేదలందు, పురుషునియందు, స్త్రీయందు, మానవునియందు, జంతువులందు సమానముగా ఒక్కటే. అణువు మొదలు బ్రహ్మాండమువఱకు ప్రతి ఆత్మయందది వసించుచు "నేనతడే నేనతడే" అని శాశ్వతముగా ఘోషించుచున్నది. ఆ వాణి శాశ్వతముగా కలదని మనము గ్రహించినప్పుడు, మన మీవిషయము తెలిసికొనినప్పుడు

అఖిల జగత్తు తన రహస్యమును వెల్లడిచేసినట్లగును. ప్రకృతి మనకు తన మర్మము తెలియజేసినదగును. ఇక తెలిసికొనదగిన దేదియు లేదు. అంతట సమస్త మతములు దేనికొఱ కన్వేషణ చేయుచున్నవో ఆ సత్యమును మనము తెలిసికొనినవార మగుదుము; భౌతిక విజ్ఞానశాస్త్రములన్నియు అపరావిద్యలే అని తెలియగలదు. జగదీశ్వరుడయిన విశ్వాత్మతో మనకు తాదాత్మ్యము కలిగించు జ్ఞానమే యథార్థజ్ఞానము.



# సమైక్యసాధనమే మతలక్ష్యము

## (న్యూయార్క్‌లో 1896-వ సంవత్సరములో చేసిన ప్రసంగము)

మన జగత్తు—ఇంద్రియ గోచరమగు జగత్తు, హేతుజ్ఞాన గ్రాహ్యమగు జగత్తు, బుద్ధిగ్రాహ్యమగు జగత్తు ఇరుప్రక్కలను నిరవధికము, అజ్ఞాతము, అజ్ఞేయము నగుదానిచే బద్ధమైనది. అన్వేషణకు రంగమిది, జిజ్ఞాసకు రంగమిది, యథార్థ సంఘటనలు గల తావిది. ఇందుండియే లోకమునకు వెలుగు మతముపేరిట ప్రసరించుచున్నది. మతము ప్రధానముగా నతీంద్రియ భూమికకు చెందినది; ఇంద్రియబద్ధమగు భూమికకు చెందినదికాదు. అది తర్కమున కతీతమైనది; బుద్ధిగ్రాహ్యమగునది గాదు. అదియొక అనుభూతి; సాక్షాత్కారము. అజ్ఞేయమయి యానవలనున్నదానియందును, అంతరంగమందునుగలదు. అంతట దెలియరానిది తెలిసినదానికంటె నెక్కువగా దెలియుచుండును. నిజమునకది "తెలిసికొనుటకు సాధ్యముకానిది."

మానవుని మనస్సులో ఈ యన్వేషణ మానవజాతి పుట్టినప్పటినుండియు సాగుచున్నదనియే నా నమ్మకము. ఈ జిజ్ఞాసవినా, విశ్వమున కావలనున్న దానికొఱకీ యన్వేషణ వినా, ప్రపంచ చరిత్రలో నేదశలోగాని తార్కికశక్తి, బుద్ధివికాసము సాధ్యమై యుండవు. మనస్సనెడి మన చిన్న ప్రపంచములో భావతరంగమొకటి లేచును. అది యెందుండి ప్రభవించుచున్నదో, అదృశ్యమగునప్పుడది యెక్కడకు పోవుచున్నదో మనకు తెలియదు. బాహ్య ప్రపంచము, మానసప్రపంచము ఒకే చాలులో, ఒకే దశలో, ఒకే అంతస్తులో సాగిపోవుచున్నట్లనిపించుచుండును.

మతములు వెలుపలనుండిగాక మానవుని యంతరంగము నుండియే వచ్చినవను హిందూసిద్ధాంతమును మీకు తెలియజేయుటకు ప్రయత్నింతును. మతవిచారము మనుష్యప్రకృతియందు అంత

ర్నిహితమై యున్నదని నా నమ్మకము. మనస్సును, దేహమును విసర్జించినగాని—ఆలోచన, జీవితము ఆగిపోయినగాని మతదృష్టి విడనాడుట సాధ్యముగాదు. మానవునికి ఆలోచన యున్నంతవఱకు ఈ ప్రయత్నము సాగిపోవుచుండవలసినదే. అంతవఱకు ఏదోయొక రూపములో అతనికి మతముండితీఱవలసినదే. కనుకనే లోకమున మత స్వరూపము లనేకమేర్పడినవి. వాని పరిశీలన మన కయోమయము కలిగించును. కాని, పలువురు భావించునట్లు వాని పరిశీలన నిష్ప్రయోజనము మాత్రముగాదు. ఈ సంక్షోభమునందు సమన్వయమున్నది; అపశ్రుతులమధ్య సామరస్యము ధ్వనించుచున్నది. దానిని వినగలవారు స్వర్గము నందుకొనగలరు.

ఈ కాలమున మన మెదుర్కొనవలసిన ప్రశ్నలన్నిటిలో మిక్కిలి పెద్ద ప్రశ్న యిది: తెలిసినది, తెలియదగినది యిరుప్రక్కల అజ్ఞేయము, అనంతముగా నజ్ఞాతము నయినదానిచే బద్ధమైయున్నదని యంగీకరింతుము. మఱి, యీ అజ్ఞాతమైనదానికొఱ కన్వేషింపనేల? తెలిసినదానితో నేల సంతృప్తిపడరాదు? తినుటతో, త్రాగుటతో, సంఘమున కేదో కొంచెము మేలు చేయుటతో నేల సంతృప్తిపడగూడదు? నేడిప్పు డీ భావమే ప్రాబల్యము వహించుచున్నది. విద్వత్ప్రముఖుడయిన ఆచార్యుడు మొదలు అప్పుడే మాటలు నేర్చుకొనుచున్న శిశువువఱకు అందఱు "లోకమున కుపకారము చేయుడు. అదే మతము. సృష్టి రహస్యమునుగుఱించిన జిజ్ఞాసతో తల బ్రద్దలుకొట్టుకొనవలదు" అని చెప్పుట నేర్చుకొనినారు. తత్ఫలితముగా నేడీవాదము స్వతఃసిద్ధసత్యముగ పరిగణింపబడుచున్నది.

కాని, మన భాగ్యవశమున సృష్టిమర్మమును ఛేదింపవలసియే యున్నది. వ్యక్తమైన ఈ వర్తమానము, ఈ ప్రత్యక్షము అవ్యక్తముగా నున్నదానిలో నొక అంశమాత్రమే. అనంతమైన ఆత్మ ప్రపంచము ఇంద్రియ చేతనమగు భూమికపై ఈషణ్మాత్రము వ్యక్తమైనది. ఆవలనేమున్నదో తెలిసికొనక దీనికర్థము చెప్ప

ట్లు? దీని తత్త్వమిదియని నిర్ధరించుట ఏవిధముగా సాధ్యము? ఒకనాడు సోక్రటీసు ఏథెన్స్ నగరములో నుపన్యసించుచుండగా గ్రీసుదేశమునకు వెళ్లిన బ్రాహ్మణు నొకనిని కలసికొనుట సంభవించెను? సకల విద్యలలో మానవుని గుఱించి తెలిసికొను విద్యయే గొప్పదని సోక్రటీసు విప్రునితో ననెను. వెంటనే విప్రుడిట్లు ప్రశ్నించెను: "దేవుని తెలిసికొనక మానవునెట్లు తెలిసికొనగలవు?" ఈ 'దేవుడు' శాశ్వతముగా నజ్ఞేయమైనది, పరమమైనది.—లేదా, మీకిష్టమైన మఱే పేరుతో నయినను దీనిని వ్యవహరింపుడు. ఇదే, ఇదొక్కటే—మన ప్రస్తుత జీవితములో తెలిసినదానికిని, తెలియదగినదానికిని అర్థము, హేతువు చెప్పగలిగినది. మీరేదయిన, పరమభౌతికమైనదానిని తీసికొనుడు. రసాయనిక శాస్త్రమునో, పదార్థవిజ్ఞానశాస్త్రమునో, ఖగోళశాస్త్రమునో, జీవశాస్త్రమునో—అధ్యయనము చేయుడు. ఇంకను పరిశోధన చేయుడు. పరిశోధన నింకను సాగింపుడు. పరిశోధనలో ముందుకు పోగా, పోగా స్థూల రూపములన్నియు కరగి సూక్ష్మములగును. సూక్ష్మము సూక్ష్మతరమగును. చివరకొక దశలో భౌతికమునకుగల సరిహద్దుదాటి భౌతికముకాని సీమలో ప్రవేశింపవలసివచ్చును. ఏవిషయమును గుఱించిన జ్ఞానరంగమునగాని స్థూలము సూక్ష్మమగును; భౌతికము ఆత్మయగును.

ఈ విధముగా మానవు డనివార్యముగా పరతత్త్వమును గుఱించి తెలిసికొనవలసినవా డగుచున్నాడు. సృష్టిమర్మమును తెలిసికొనని పక్షమున మానవజీవితము నిరర్థకమగును. "ప్రస్తుతమున్నదానితో సంతృప్తిపడుడు" అని చెప్పుట వినుటకు సొంపుగానే యుండును. ఆవులు, కుక్కలు, ఆవిధముగానేయున్నవి. అట్లుండుట వలననే అవి పశువులయినవి. మానవులందఱు ఉన్నదానితోనే తృప్తిపడి, విశ్వమున కావలనున్నదానికొఱకై చేయు అన్వేషణ విరమించినయెడల మానవజాతి మరల పశుస్థాయికి దిగిపోవలసివచ్చును. మతమే—పరతత్త్వమును గుఱించిన జిజ్ఞాసయే మానవుని

జంతువులనుండి వేఱు చేయుచున్నది. 'స్వాభావికముగానే పైకి చూచు జంతువొక్క మానవుడే' అనుమాట యథార్థము. తక్కిన జంతువులన్నియు క్రిందికిచూచును. ఊర్ధ్వాభిముఖము, ఊర్ధ్వగమనము, పరిపూర్ణత్వము పొందుట మోక్షసాధనములు. మానవుడెంత శీఘ్రముగా పైకిపోవుట ప్రారంభించిన, సత్యమే మోక్షమను అభిప్రాయమున కనుగుణముగా అతడంత శీఘ్రగతిని ఉన్నతి బడయును. అది మీ జేబులో నున్న మొత్తము డబ్బెంత యనుదానిపైగాని, మీరు ధరించు దుస్తులపైగాని, మీరు నివసించు గృహముపైగాని కాక — మీ మెదడులోని ఆధ్యాత్మిక భావసంపదపై ఆధారపడి యుండును. మానవాభ్యుదయమున కదే గీటురాయి. భౌతికాభివృద్ధికి, జ్ఞానాభివృద్ధికి మూలమదే; వెనుకనుండి నడపుచున్న ప్రేరకశక్తి యదే; మానవకోటి పురోగతికి ప్రోత్సాహము కలిగించునది యదే.

మతము తిండిలోను, ఇంటిలోను లేదు. "మతమువలన ప్రయోజనమేమి?" అనుప్రశ్న మాటిమాటికి శ్రుతిగోచర మగుచున్నది. "అది పేదల దారిద్ర్యమును బాపి, వారికి కొన్ని దుస్తులీయ గలదా?" ఆ పని చేయజాలదనియే అనుకొందము. అంతట మతమసత్యమని ఋజువయినట్లేనా! ఖగోళశాస్త్రమునకు సంబంధించిన సిద్ధాంతము నొకదానిని మీరు నిరూపించునప్పుడు బాలుడొకడు లేచి, "అది నాకు అల్లంమొరబ్బా తెచ్చిపెట్టునా?" అని యడిగెననుకొందము. "అబ్బే, అది తెచ్చిపెట్టదు." అనికదా మీరు చెప్పుదురు! "అయితే అదంతయు నిరర్థకము" అని బాలుడనును. నిఖిల విశ్వమును బిడ్డలు తమ చూపుతోనే చూతురు; 'అల్లంమొరబ్బా తెచ్చిపెట్టుట'తోనే చూతురు. ప్రపంచములోని బిడ్డలందఱు అట్లే యోచింతురు. ఉత్తమ విషయములను మనము తక్కువచూపుతో నిర్ధరించరాదు. ప్రతివిషయమును దానికి సంబంధించిన కొలబద్దతోనే నిర్ణయించవలెను. అనంతము ననంత ప్రమాణముతోనే నిర్ణయించ

వలెను. మతము మానవజీవితపరివ్యాప్తము. అది జీవితములోని యన్ని ప్రకరణములలోను వ్యాపించును. ఈ యొక్క జీవితములోనే గాదు. పూర్వ వర్తమాన భవిష్యజ్జీవితములలో నది వ్యాప్తమగును. అది శాశ్వతమైన ఆత్మకు శాశ్వతమైన దేవునితోగల శాశ్వతమైన సంబంధము. అయిదు నిమిషములు మానవ జీవితముపై దాని ప్రభావముజూచి, దాని విలువను నిర్ణయించుట సహేతుకమేనా? ఎంతమాత్రమునుగాదు. ఈ చెప్పినవన్నియు ప్రతివాదమును ఖండించు యుక్తులు.

ఇప్పు డసలుప్రశ్ననుగుఱించి యోచింతము: మతమువలన నిజముగా నేమయిన ప్రయోజనము గలదా? కలదు. అది మానవున కమృత జీవనమును ప్రసాదించును. మానవుని ప్రస్తుతస్థితికి గొనివచ్చినదదియే; అది యింకను ఈ మానవపశువును దేవునిగా చేయును. మతమే చేయగలపనియది. మానవ సమాజమునుండి మతమును తీసివేయుడు. మిగులున దేమి? అడవిమృగములు మాత్రమే. మానవ జీవితలక్ష్య మింద్రియభోగముగాదు. జ్ఞానసాధనమే జీవితమంతకును గమ్యము. పశువనుభవించు ఇంద్రియ సౌఖ్యముకంటె మానవుడు మానసికసౌఖ్య మెక్కువగా ననుభవించును. అతడు మానసిక సౌఖ్యముకంటె కూడ ఆత్మానందము నధికముగా ననుభవించును. కనుక పరమోత్కృష్టజ్ఞాన మాత్మజ్ఞానమే. ఈ జ్ఞానము వలననే ఆనందము లభించును. ఈ ప్రాపంచిక విషయములన్నియు కేవలము ఛాయామాత్రములే; పరమప్రాప్యమైన యథార్థజ్ఞానమునకు, ఆనందమునకు మూడవ లేక నాల్గవ దిగువ అంతస్తుమీద వ్యక్తములైనవే!

మఱొకప్రశ్న: జీవిత లక్ష్యమేమి? మానవు డనంతముగా పురోగమించుచున్నాడనియు, అంత కంతకు ముందుకు పోవుచున్నాడనియు, అతడు పొందగల అభివృద్ధి యనున దేమియు లేదనియు ఈ దినములలో కొందఱు నొక్కి వక్కాణించుచున్నారు. అధికాధిక

ముగా సమీపించుచు, ఏనాటికిని చేరుకొనుటకు వీలులేనిదనెడి మాట కర్థమేమైనను, వినుట కదెంత యద్భుతముగానున్నను, అట్టిది బొత్తుగా అసంగతమని దాని నుదుటనే వ్రాసియున్నది. సరళరేఖ యందు చలనమేమైన గలదా? సరళరేఖ ననంతముగా పొడిగించిన వృత్తమేర్పడును. ప్రారంభమైనచోటుకు తిరిగివచ్చి చేరవలసినదే. మొదలిడిన తావున ముగించకతప్పదు. మీరు భగవంతునియందు ప్రారంభమైతిరి. తిరిగి భగవంతుని పొందవలసినదే. మిగులునదేమి? వివరణకు కృషి అవసరము. అనంతకాలమందు వివరములకు కృషి చేయవలసినదే.

ఇంకను మఱియొక ప్రశ్నగలదు: మనము ముందుకు పోవు కొలది క్రొత్త మతసత్యములను కనుగొనవలసియున్నదా? ఈ ప్రశ్నకు సమాధానము "ఔ" నని "కా"దని కూడ దెలుపజెల్లును; మతమును గుఱించి మనమెక్కువగా నేమియు తెలిసికొనజాలమను విషయమును ప్రప్రథమముగా గుర్తింపవలసియున్నది. ఆవిషయమై తెలిసికొనవలసినదంతయు తెలిసికొనబడినది. మనలో ఐక్యసూత్ర మున్నదని ప్రపంచములోని మతములన్నియు నుద్ఘోషించుచున్నవి. మనము భగవంతునితో నొక్కటి గనుక నింతకుమించిన ఐక్య సూత్ర మసంభవము. వైవిధ్యమునందు ఐక్యమును కనుగొనుటే జ్ఞానము. నేను మిమ్ము పురుషులుగాను, స్త్రీలుగాను జూచుచున్నాను. ఇది వైవిధ్యము. మిమ్మందఱను ఒకవర్గముగా పరిగణించి, మానవు లనుట శాస్త్రీయవిజ్ఞానము. ఉదాహరణము గమనింపుడు: రసాయనిక శాస్త్రము తీసికొనుడు. రసాయనికశాస్త్రజ్ఞులింతవఱకు దెలిసిన పదార్థములన్నింటికి మూలద్రవ్యమును కనుగొనుటకు ప్రయత్నించుచున్నారు. సాధ్యమగుచో అన్నిటికి మూలమైన ఒక ద్రవ్యమును కనుగొనగలకాలము రాగలదేమో! ఆయొక్కటి తక్కిన మూలద్రవ్యములన్నిటికి మూలము. ఆదశకువచ్చినతరువాత వారు మఱికొంత ముందుకుపోజాలరు; అప్పటికి రసాయనిక శాస్త్రము పరిపూర్ణత్వము పొందినదని గ్రహింపజెల్లును. మతవిషయముగూడ నంతే. ఈ యైక్య

సూత్రమును సంపూర్ణముగా సాక్షాత్కారము చేసికొనినచో— అటుపైనభివృద్ధి కవకాశము లేదు.

తరువాత ప్రశ్న యిది: అట్టి ఐక్యమును కనుగొనుట సాధ్యమా? మతశాస్త్రమును, తాత్త్విక విజ్ఞానశాస్త్రమును కనుగొనుటకు భారతదేశములో అనాదిగా ప్రయత్నము జరుగుచున్నది. మతమును, తత్త్వజ్ఞానమును వేఱుగా పరిగణించుట పాశ్చాత్య దేశములలో పరిపాటి. కాని, హిందువులు ఆ రెండింటిని వేఱుచేయరు. మతమును, తత్త్వజ్ఞానమును ఒకేవస్తువున కిరుముఖములుగా మేము భావింతుము. ఆ రెంటిని హేతుజ్ఞానమునందు, విజ్ఞానశాస్త్రీయ సత్యమునందు ప్రతిష్ఠింపవలెను.

భారతదేశములో—నిజమునకు ప్రపంచములోనే సాంఖ్యశాస్త్రము మిక్కిలి ప్రాచీన తత్త్వశాస్త్రములలో నొకటి. దానిని ప్రతిపాదించిన కపిలమహర్షి హైందవ మనస్తత్త్వశాస్త్రములకు జనకుడు; అతడు ప్రతిపాదించిన సిద్ధాంతములే నేటికిని భారతీయులామోదించు తత్త్వశాస్త్రములన్నిటికి (దర్శనములకు) ప్రాతిపదికలు. ఇతర విషయములయందలి మహిమలు ఎంతగా భేదించినను, ఎల్లరు ఆయన మన శ్శాస్త్రమును శిరసావహించుచున్నారు.

సాంఖ్యశాస్త్రమునుండి తార్కిక ఫలితముగా వెలసిన వేదాంతము మఱికొన్ని సిద్ధాంతములు చేసెను. ప్రకృతి తత్త్వవిషయమునందది కపిలుని సిద్ధాంతములో నేకీభవించును; కాని, వేదాంతము ద్వైతములో నాగిపోవుట కిష్టపడలేదు. విజ్ఞానమునకు, మతమునకు గూడ ఒకే లక్ష్యమైన తుదియైక్యమునకై తన యన్వేషణ సాగించుచున్నది.

---

# వైదికమతాశయములు

మన కత్యంత ముఖ్యమైనది మతవిషయము—ఆత్మ, దేవుడు, మతమునకు సంబంధించిన తదితర విషయములు, సంహితలు చింత్యములు. అవి దేవునిగుఱించిన స్తవముల సంపుటి. అవి ప్రాచీనతమమైన ఆర్యసాహిత్యము. ప్రపంచసాహిత్యములోనే అవి మిక్కిలి ప్రాచీనతమమైనవనికూడ చెప్పవచ్చును. వీనికంటెకూడ ప్రాచీనమైన రచనలేవో చెదురుగా నిక్కడొకటి, అక్కడొకటి యుండిన నుండవచ్చునుకాని, సాహిత్యస్వరూపముగల గ్రంథములని చెప్పదగినవి మాత్రము లేవు. సమీకరింపబడిన గ్రంథముగా సంహితలు ప్రపంచ సాహిత్యములో కెల్ల ప్రాచీనతమమైనవి. ఇందు ప్రాచీనార్యుల తొలి మనోభావములు, వారి యాశయములు, వారి విధానములు, పద్ధతులు మున్నగు విషయములు వర్ణింపబడినవి. ప్రారంభముననే మనకొక విచిత్ర విషయము స్ఫురించును. ఈ స్తవములు వేర్వేరు దేవతలనుగుఱించి గానము చేయబడినవి. కాంతితో ప్రకాశించు వారు గనుక వారికి దేవతలను పేరు కలిగినది. ఇట్టివారు చాలమంది కలరు. ఒకరు ఇంద్రుడు, మఱొకరు వరుణుడు, వేఱొకరు మిత్రుడు, ఇంకొకరు పర్జన్యుడు. ఇంకను నిటువంటివా రనేకమంది గలరు. పురాణ దేవతలు, ఆలంకారికముగా రూపకల్పనలు చేయబడిన దేవతలు ఒకరి తరువాత నొకరు వచ్చుచుందురు—ఈ యుదాహరణము నవలోకింపుడు: మానవాళికి వర్షములు కురియకుండ అడ్డగించిన సర్పమును పిడుగుల కధిపతియైన ఇంద్రుడు చంపివేయు కథ కలదు. ఇంద్రుడు పిడుగునొక దానిని ప్రయోగించును. అది యెగురుచుపోయి సర్పమును చంపును. అంతట వర్షము కురియును. జనులు సంతోషపరవశులయి బలులతో, నైవేద్యములతో ఇంద్రునికి పూజలు చేయుదురు. యజ్ఞగుండముచేసి, కొన్ని జంతువులనుచంపి, వాని మాంసమును వ్రేల్చి, దానిని ఇంద్రునికి నైవేద్యము పెట్టుదురు. వారి కిష్టమైన

సోమలత కలదు. అదేమి లతయో యిప్పుడెవరికిని తెలియదు; అది యిప్పుడెందును లేదు. దానిని పిండినచో పాలవంటి తెల్లనిరసము వచ్చుననియు, అది పులియబెట్టబడుననియు గ్రంథములవలన మనకు తెలియుచున్నది; పులియబెట్టిన సోమరసము మత్తు కలిగించునది యని తెలియుచున్నది. ఈ రసమునుకూడ ఇంద్రునకు తదితర దేవతలకు నివేదించెడివారు. పిదప వారుకూడ పుచ్చుకొనెడివారు ఒక్కొక్కప్పుడు, వారితోపాటు దేవతలు కొంచెమెక్కువగా పుచ్చుకొనుచుండెడివారు. ఇంద్రుడు కొన్నికొన్ని ప్రత్యేక సమయములలో పుచ్చుకొనుచుండెడివాడు. ఒక పర్యాయము ఇంద్రుడు మితముతప్పి త్రాగి పిచ్చిపిచ్చిగా అర్థములేని ప్రలాపము లాడినట్లు కొన్ని రచనలు తెలియజేయుచున్నవి. వరుణుడుకూడ అంతటివాడే. అతడు మఱొక దేవుడు; చాల బలవంతుడు. అతడు తన భక్తులను గాపాడుచుండును. వారును సోమరసము నైవేద్యముపెట్టుచు నతనిని స్తవముచేయుదురు. రణదేవుడు, తదితరులుకూడ నింతే. ఇతర పురాణ గాథలకు సంహితలలోని గాథలకుముఖ్య భేదమొకటి మన కాశ్చర్యము కలిగించును. సంహితలలోని ప్రతిదేవునితోపాటు అనంతత్వమునుగుఱించిన భావముకూడకలదు. అనంతము వేఱుచేయబడుచుండును. ఒక్కొక్కప్పుడది ఆదిత్యుడని వర్ణింపబడుచుండును. మఱొకప్పుడది యితర దేవత లందఱితో చేర్పబడుచుండును. ఉదాహరణకు ఇంద్రుని తీసికొందము: కొన్ని గ్రంథములలో ఇంద్రునికి దేహమున్నట్లు, అతడు మిక్కిలి బలిష్ఠుడయినట్లు, ఒక్కొక్కప్పుడు బంగారు కవచము ధరించినట్లు వర్ణింపబడినది. అతడు పృథివిమీదికి దిగివచ్చి తన యనుచరులతో కలిసిభుజించి, విహరించి పిశాచములతో, సర్పములతో పోరాడినట్లు వివరింపబడినది. ఒక స్తవములో ఇంద్రునకు మహోన్నతపదవి ఈయబడినది. అతడు సర్వవ్యాపి, సర్వశక్తుడు; అతడు ప్రతిజీవి హృదయమును పరిశీలించును. వరుణుడుగూడ అట్టిదేవుడే. వరుణుడు వాయుదేవుడు; ఒకప్పుడింద్రునివలె

అతడు జలముపై కూడ ఆధిపత్యము వహించును. తరువాత ఆకస్మికముగా ఇంద్రునిపదవి పెంపొందెను. అతడు సర్వవ్యాపకుడు, సర్వశక్తుడునయ్యెను; ఇంకను ఏమేమో అయ్యెను. మహోన్నతస్థితి యందున్న వరుణునిగుఱించిన ఒక స్తోత్రము చదివెదను. అప్పుడు నా భావము మీకు స్పష్టముకాగలదు. ఆ స్తోత్రమున కనువాదమిది.

"శక్తిసంభరితుడయిన ప్రభువు మహోచ్చదశయందుండి మన చర్యలను సమీపమందున్నట్లుగా గమనించుచున్నాడు. మానవులు తమ చేష్టలనెంత ప్రచ్ఛన్నముగా చేసినను, వానిని దేవతలు కనిపెట్టుచుందురు.

"ఎవరెవరు నిలబడుచుందురో, ఒకతావునుండి మఱొకతావుకు చరించుచుందురో, తస్కరించుచుందురో, లేక—రహస్యముగా దాగియుందురో వారివారి చర్యలను దేవతలు సత్వరమే పసికట్టుదురు. ఎక్కడెక్కడ ఇద్దఱుచేరి కుట్రపన్నుచుందురో, తాము రహస్యముగా నున్నామనుకొనుచుందురో—అక్కడ మూడవవ్యక్తి వరుణదేవుడున్నాడు అతనికి యీహాలన్నియు తెలియును. ఈ పృథివి యతనిది. దరిలేని ఈ యనంతాకాశ మతనిది. ఉభయ సముద్రము లతనియందే కలవు. అయినను అతడాచిన్నకొలనులో పరుండును.

"ఎవడు ఆకాశముదాటి దూరముగా పోవలెనని యోచించునో, అతడు వరుణరాజు పట్టునుండి తప్పించుకొనజాలడు. అతని చారులాకాశమునుండి యవరోహించి, ఈ ప్రపంచమందు అంతటను సవ్వడి కాకుండ చరించి, రహస్యములను కనిపెట్టుచుందురు. వారు సహస్ర జాగ్రన్నేత్రములతో పృథివిమీది సుదూర ప్రదేశములను పరిశీలింతురు."

ఈ విధముగా నితర దేవతలనుగుఱించి కూడ ఉదాహరణ లీయవచ్చును. వారొకరితరువాత నొకరు వత్తురు. ఇట్టి పూజ్యతే పొందుదురు. మొదట వారు దేవతలుగా ప్రారంభమగుదురు; తరువాత

మహోన్నతపదవి పొందుదురు. ఒక్కొక్కడు జగత్పాలకుడగు పరమ పురుషుడగును. అతనియందే సకలవిశ్వముకలదు; అతడు ప్రతిజీవి హృదయమును తఱచిచూచును. వరుణుని విషయములో మఱొక అంశముగలదు. ఒకభావము మొలకెత్తినది; కాని, ఆర్యప్రకృతి దానిని వెంటనే అడచివేసెను. అది భయమునుగుఱించిన భావము. మఱొక సందర్భములో, తాము పాపముచేసితిమని భయపడి వరుణుని క్షమింపుడని అప్పటివారు ప్రార్థించినట్లుగలదు; భారతసీమలో ఈ విధమైనభావముల నెన్నడును బలపడి, వృద్ధిచెందనీయలేదు. ఇందుకు కారణములను మీరు ముందుముందు గ్రహింపగలరు. కాని, పాపమునుగుఱించియు, భయమును గుఱించియు భావములు బీజరూపముననున్నవి. అవి మొలకెత్తుచున్నవి. ఇదంతయు నేకేశ్వరుడనబడు సృష్టికర్తనుగుఱించిన భావమే అని మీకందఱకు తెలిసినదే. ఈశ్వరుడు సృష్టికర్తయను నీ యేకేశ్వర భావము భారతదేశమునకు బహు పూర్వకాలముననే వచ్చియుండెను. సంహితలందంతటను— మొట్టమొదటి దానియందుగూడ నీయేకేశ్వరభావమే ప్రబలముగా నుండెను. అయితే అంతటితో ఆర్యులకు పూర్తి సంతృప్తికలుగ లేదు; దానిని మఱింత ప్రాతకాలపు ప్రాథమిక భావముగా పరిగణించి వారు ప్రక్కకుత్రోసియుంచిరి. వారు మఱింత పురోగమించిరని హిందువుల యభిప్రాయము. వేదములనుగుఱించి ఐరోపియనులు రచించిన వ్యాఖ్యలు చదువునప్పుడు, తరువాతగూడ మా రచయితల గ్రంథములలో పూర్వపుభావములే ప్రబలముగా కలవను వాక్యములనుచూచి— హిందువులు నవ్వుకొనుట తథ్యము. దేవుని గుఱించిన మహోత్కృష్ట భావము, అతడు సృష్టికర్తయే అని తల్లి పాలతోపాటు గ్రహించినవారు ప్రాచీన భారతీయతత్త్వవేత్తలు. సంహితలలో నిండుగానున్న యీ యేకేశ్వర భావమల్పమైనదిగాను, తత్త్వవేత్తలు, మేధావులు సంతృప్తిపడదగనిదిగాను ఆర్యులు భావించిరి. అందుచేత సంహితల యనంతరము వారతీతము, మఱింత శాస్త్రీయమునయిన తత్త్వము

గొనుటకు కఠోర జిజ్ఞాసచేసిరి. "అఖిలప్రపంచ మతనియందున్నది", "సకల హృదయములు నీయందేగలవు" అను వాక్యములతో కూడిన వర్ణనలున్నను, ఏకేశ్వరభావము మానవునికి మఱెంత సన్నిహితముగానున్నట్లు వారికి తోచినది. హిందువులు బహుశౌర్య సాహసోపేతులు. సకల భావములలోను వారు సాహసవంతులే. వారి భావములలో నొక మెఱపు పాశ్చాత్యదేశములలోని సాహసవంతులయిన మేధావులను భయభ్రాంతులను చేయును. ప్రొఫెసర్ మాక్సుముల్లర్ చెప్పినట్లు భారతీయ మేధావులారోహించిన మహోన్నతమైన అంతస్తులలో వారి ఊపిరితిత్తులు మాత్రమే శ్వాసక్రియ సాగించినవి. మఱెవరయిన నగుచో ప్రాణములు కోల్పోవలసిన వారే. ఈ శౌర్యసంపన్నులు హేతువెక్కడకు గొనిపోయిన నక్కడకెల్ల పోయిరి. అందు కెంత శ్రమపడవలసివచ్చినను వారు లెక్కచేయలేదు; ప్రశస్తమైన అంధవిశ్వాసము లన్నియు పటాపంచలయినను లెక్కచేయలేదు; తమ్ముగుఱించి సంఘమేమనుకొనునోయని ఏమివచించునో యని వారు గణింపలేదు. తాము ధర్మమని, సత్యమని భావించినదానిని వారు బోధించిరి; దానిని గుఱించియే వారు చెప్పిరి.

ప్రాచీనవైదికఋషుల భావనలను, ఊహలను పరిశీలించుటకుముందు వేదములలోని ఒకటి రెండు విషయములను ప్రస్తావింతము. వివిధ దేవతలలో ఒకరితరువాత నొకరిని తీసికొని, ఉన్నతోన్నతమైన అంతస్తుల కెక్కించి, ఒక్కొక్కరిని అనంతుడయిన జగదీశ్వరుని స్థాయికి జేర్చుటలోని విశేషమును గుఱించి చెప్పుటవసరము. ఇది హిందువుల వైచిత్ర్యమని ప్రొఫెసర్ మాక్సుముల్లర్ అభిప్రాయపడి యిందుకు "హెనోథీజం" అని పేరు పెట్టినాడు. ఈ వివరణకు మనమెక్కడకు పోనక్కఱలేదు. అది గ్రంథములోనే యున్నది. వివిధ దేవతలు ఏకేశ్వరుని స్థాయిని నిలుపబడినపుడు ఈ విషయవివరణము తెలుపబడినది. హిందూపురాణములు ప్రపంచములోని తదితర పురాణములకంటె భిన్నమై, విశిష్టత గలిగియుండుట కేమి హేతువని ప్రశ్న కలుగగలదు. బాబిలోనియన్ పురాణ

ములలోను గ్రీకు పురాణములలోను ఒక్క దేవుడే పైకి పోవుచు మహోన్నతమైన పదవినందుకొని అక్కడే యుండును. ఇతర దేవతలందఱు చనిపోవుదురు. మోలక్ లందఱిలో జిహోవామాత్రమే సర్వాధిపతియగును. ఇతర మోలక్ లందఱు అంతరింతురు. అతడే దేవాదిదేవుడు. గ్రీకు దేవుళ్ల విషయము గూడనంతే. జియుస్ అందఱికంటె ప్రాబల్యము వహించును; అతడే జగత్ప్రభువగును ఇతర దేవుళ్లందఱు అల్పదేవతలుగా తగ్గిపోవుదురు. ఈ భావమే తరువాత కాలములలో పునరావృతమైనది. బౌద్ధులు, జైనులు తమతమ ప్రవక్తలలో నొకరిని దేవుని స్థాయికి గొనిపోయిరి. తక్కిన దేవుళ్లందఱిని బుద్ధునికి, జినునకులోబఱచిరి. ప్రపంచమంతటను ఉన్న పద్ధతి యిది. ఇందుకు మినహాయింపు హిందూ గ్రంథములలోనే కలదు. ఒక దేవుడు స్తుతింపబడును. కొంతకాలము తక్కిన దేవుళ్లందఱు అతని ఆజ్ఞలను శిరసావహింతురు. మొదట వరుణునిచే సముద్ధరింపబడినవాడే తరువాత గ్రంథములో అత్యున్నత స్థానమలంకరించినట్లు చెప్పబడును. క్రమానుగతముగా వారు సగుణ బ్రహ్మపదవి నాక్రమింతురు. దీని భావము గ్రంథములోనే వివరింపబడినది. అది గొప్ప భావము. తరువాత భారతదేశములో వెలసిన భావపరంపరకంతకును అన్వయము చెప్పగలభావమది. సకలమత ప్రపంచమునకు లక్ష్యముకాగల ఉదాత్తభావమది. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"; సత్యమొక్కటే. దానిని ఋషులు వివిధనామములతో వ్యవహరింతురు. ఏయే దేవతలను, దేవుళ్లను ఉద్దేశించి స్తవములు చేయబడినవో వారందఱియందును దర్శింపబడిన దేవుడొక్కడే. అందఱియందున్నవాడు ఆతడొక్కడే; ద్రష్టయే భేదమును భావించినాడు. స్తవము రచించినవ్యక్తి, యోగి, కవి వివిధభాషలలో, వివిధ పదజాలముతో ఒకేఒక్క పురుషుని స్తోత్రము చేసిరి, గానము చేసిరి. ఉన్నవస్తువొక్కటే. ఋషులు దానిని పెక్కుపేర్లతో సంబోధించిరి, సంభావించిరి. ఈయొక్క మహావాక్యమువలన అత్యద్భుత

మైన ఫలితములు కలిగినవి. మతసంబంధమైన వైషమ్యములు, కలహములు లేని సీమ భారతదేశమొక్కటే అని గ్రహించి నప్పుడు మీలో కొందరు ఆశ్చర్యచకితులగుదురేమో! ఈ దేశములో ఎవరి మతవిశ్వాసమున కేనాడును భంగము కలుగలేదు. ఆస్తికులు, నాస్తికులు, అద్వైతులు, ద్వైతులు, ఏకేశ్వరవిశ్వాసులు అందు గలరు. వారిలో నెవ్వరు బాధింపబడలేదు. దేవాలయ సోపానములమీద నిలబడి భౌతికవాదులు దేవతలకు, దేవునికి వ్యతిరేకముగా ప్రచారము చేయుటకు సహిత మనుమతింపబడిరి; వారు దేశమంతటను సంచారముచేసి ఈశ్వరభావము కేవలము మూఢ విశ్వాసమనియు, దేవతలు, వేదములు, మతము స్వప్రయోజనార్థము పురోహితులు కల్పించిన మూఢభావములుమాత్రమే యనియు ప్రచారము గావించిరి. అయినను ఎవ్వరును వారిని బాధింపలేదు. వారావిధముగా ప్రచారము చేసికొనుట కనుమతింపబడిరి. బుద్ధు డెక్కడకు బోయినను, హిందువులకు పవిత్రమైన ప్రతిప్రాచీనభావమును ధూళిధూసరము చేయుటకు ప్రయత్నించెను. అతడు పండు ముసలిగా నిర్వాణము చెందెను. జైనులు అదేవిధముగా చేసిరి. ఈశ్వర భావమునుగుఱించి వారు పరిహసించిరి. "దేవుడుండుట ఎట్లు సంభవము?" అని వారు ప్రశ్నించిరి. "అది కేవలము మూఢవిశ్వాసమే" అనిరి. ఈ విధముగా నెన్నియుదాహరణల నయినను పేర్కొనవచ్చును. మహమ్మదీయ దండయాత్రలకుముందు భారతదేశములో మత కలహములు లేవు. విదేశీయులవలననే హిందువుల కా యనుభవము కలిగినది. నేటికిని హిందువులు క్రైస్తవుల చర్చిలు నిర్మించుట కెంతగా తోడ్పడినదియు, వారికి సహాయపడుట కెంతటి సంసిద్ధులుగా నున్నదియు తేటతెల్లమే! ఇదివఱకెన్నడు రక్తపాతము కలుగలేదు. భారత దేశములో ప్రాచీనమతములను వ్యతిరేకించుచు పుట్టిన మతములుకూడ ఆవిధముగానే మాఱినవి. ఉదాహరణము గమనింపుడు: కొన్ని విషయములలో బౌద్ధమతము గొప్పదే. కాని, బౌద్ధమతము, వేదాంతము ఒక్కటే అనుట అర్థములేనిమాట. క్రైస్తవమతమునకు,

శాల్వేషన్ ఆర్మీకిగల భేదము నెవరయినను గుర్తింపగలరు. బౌద్ధ మతములో గొప్ప సుగుణములున్నవి. కాని, యివి అయోగ్యుల అధీనమైనవి. అందుచే వానికి భద్రత లేకపోయినది. తత్త్వవేత్తల నుండి రాలిన మణులు సంస్కారములేని ప్రజలచేతిలో పడినవి. ఈ భావములను ప్రజలు గ్రహించిరి. వారికి ఉత్సాహముండెను. అభి ప్రాయము లద్భుతమైనవి, మానవాభ్యుదయ కాంక్షతో కూడినవి, మానవతతో కూడినవి. కావలసిన వింతమాత్రమే కాదు. మఱొకటి కూడ అవసరము—ఆలోచన, తార్కిక జ్ఞానము, సకలమును క్షేమముగానుంచుట యవసరము. మానవతను గుఱించిన భావము లెప్పుడుగాని జనబాహుళ్యమున కధీనమైనప్పుడు కలుగగల మొట్ట మొదటి దుష్ఫలము—పతనము. వాని రక్షణకు విద్య, తార్కిక శక్తి అవసరములు. బౌద్ధమతము మొట్టమొదటి ప్రచారమతముగా లోకరంగములో కృషి ప్రారంభించినది; నాటి నాగరక ప్రపంచ మంతటిలోను నది చొచ్చుకొనిపోయినది. ఆ మతముకొఱకు ఒక్క నెత్తురుచుక్క కూడ రాలలేదు. చీనాదేశములో బౌద్ధమత ప్రచారకు లేవిధముగా హింసింపబడినదియు—మనము చదివితిమి. ఇద్దఱు ముగ్గురు చక్రవర్తులు వరుసగా వేలకొలదిమందిని వధించిరి. తరు వాత బౌద్ధమతస్థుల కదృష్టము పట్టినది. ఒక చక్రవర్తి మునుపు హింసించినవారిపై కసిదీర్చుకొన జూచెను. కాని, ప్రచారకు లందు కంగీకరింపలేదు. దానికంతకు కారణము కొండొక ప్రధానశ్లోకార్థమే. అందుచేతనే దానిని జ్ఞాపకముంచుకొనుడని మిమ్ము గోరుచున్నాను. "ఎవరిని ఇంద్రుడని, మిత్రుడని, వరుణుడని వారు సంబోధించిరో ఆతడొక్కడేయని తెలిసికొని యున్నవస్తు వొక్కటేయని యెఱిగి ఋషులు దానినే వివిధనామములతో వ్యవహరించిరి".

ఈ శ్లోకము ఏనాడు రచింపబడినదో ఎవరికిని తెలియదు. ఆధునికపరిశోధకవిద్వాంసు లేమిచెప్పినను 8,000 లేక 9,000 సంవత్సరములయి యుండవచ్చును; ఈ మతభావములలో నేదియు

నిటీవలిది కాదు. కాని, అవి రచింపబడిననాడెంతటి క్రొత్తవిగా నుండినవో నేటికిని అవియంత క్రొత్తవిగానున్నవి; అలనాడు మానవుడీనాటివలె నాగరకుడు కాడు. అందుచే నాటికంటెకూడ నేడా భావములు మఱింత వినూత్నముగా నున్నవి. తన యభిప్రాయముల కంటె కొంచెము భిన్నమైన యభిప్రాయములు గలవాడయినందుకు తన సోదరుని గొంతుకోయుట అలనాడు మానవునికి తెలియలేదు; ప్రపంచము నతడు రక్తములో ముంచివేయలేదు. నిజసోదరునియెడ పైశాచికముగా ప్రవర్తింపలేదు. మానవతపేరిట జనబాహుళ్యమును చిత్రవధచేయలేదు. అందుచే ఆ పలుకు లిప్పుడు క్రొత్త జీవముతో వినబడుచున్నవి: "అసలున్న వస్తువొక్కటే; దానినే ఋషులు వివిధనామములతో వ్యవహరింతురు." సకల మతముల—ఏ పేరుతో అవి వ్యవహరింపబడినను సరే, హిందూ, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవమతము లన్నిటి—దేవుడొక్కడే. ఎవడు ఎవరి దేవుని దూషించినను తన దేవుని దూషించినట్లే—మనమింకను ఈ విషయము గ్రహింపవలసియున్నది.

వారు చేసిన పరిష్కారమది. నే నింతకుముందే చెప్పినట్లు దేవుడు సృష్టికర్తయను ప్రాచీన ఏకేశ్వరభావము హిందూ మనస్తత్త్వమునకు సంతృప్తి కలిగింపలేదు. అదెంతగానో ప్రయోజనకారి కాలేదు. దానివలన దృశ్యమాన ప్రపంచమున కర్థము బోధపడ లేదు: దేవుడు జగత్పరిపాలకుడను భావమువలన జగత్కారణము, జగత్తత్త్వము బోధపడవు. నిశ్చయముగా బోధపడవు. దేవుడు విశ్వమును పరిపాలించుచున్నాడను భావమువలన సృష్టి రహస్యము తెలియదు. ఆ పరిపాలకుడు విశ్వమునకు వేఱుగా, విశ్వమునకు దూరముగా నున్నవాడగుచో అసలే తెలియదు. అతడు మనకు నైతికముగా మార్గదర్శకుడే యగుగాక; సృష్టిలోని మహత్తరశక్తి సంపన్నుడేయగుగాక. అది సృష్టిమర్మమును భేదించుటకాదు: ఇప్పుడుత్పన్నమగుచు, అధికాధికముగా ప్రాముఖ్యము వహించు

చున్న ప్రశ్న విశ్వమునుగుఱించి. "ఎందుండి యిది వచ్చినది?" "ఏవిధముగా వచ్చినది?" ఈ ప్రశ్నను గుఱించి, విశ్వము ఆకృతి ధరించుటకు పడిన ప్రయాసనుగుఱించి వివిధ స్తవములు గలవు. ఈ విషయ మీదిగువ స్తవములో వర్ణింపబడినంత మనోహరముగా, ఆలంకారికముగా నెవ్వరు మఱెందును వివరింపలేదు :

"అది సత్ కాదు. అసత్ సయితము కాదు. అక్కడ వాయువు లేదు, ఆకాశము లేదు. మఱేదియును లేదు. సమస్తమును ఆచ్ఛాదించిన దేది? సర్వము నెందు విశ్రాంతిగొనుచుండెను? అప్పుడు మృత్యువు లేదు. అమృతత్వమును లేదు. దివారాత్రములు లేవు."— అను వాదములో కవిత్వలావణ్యము లుప్తమగుచున్నది.—"అప్పుడు మృత్యువు లేదు. అమృతత్వమును లేదు. దివారాత్రములు లేవు." ఈ భావమునకు సంస్కృత మూలములోని శబ్దములలో సంగీత మాధుర్యమున్నది. "అది పరాత్పరుని అస్తిత్వమును ఆవరించుచున్నదో యనునట్లుండెను; కాని, యది చలింప నారంభింపలేదు." అది చలనము లేనిదను విషయము జ్ఞాపకముంచుకొనుట మంచిది. ఈ భావము సృష్టివికాసశాస్త్రమునందు ప్రాధాన్యము వహించగలదు. హిందూ తత్త్వశాస్త్రముప్రకారము అఖిల విశ్వము తరంగసముదాయసంచలనమే; సంచలనరూపమే. ఈ సమస్త సంచలనము స్తంభించి సూక్ష్మాతి సూక్ష్మరూపముదాల్చు సమయములు గలవు; ఆస్థితి కొంతకాలముండును. ఆస్థితియే యింతకు ముందుజెప్పిన స్తవములో వర్ణింపబడినది. అది నిశ్చలముగా నుండెను. దానియందు స్పందనము లేదు. ఒక సమయమున నది చలింప నారంభించెను. అంతట సృష్టిప్రారంభమైనది. తన కతీతమైన స్వాయంభరితమైన ఆ ప్రశాంతతనుండి యొక్క శ్వాసతో నిఖిల విశ్వము బహిర్గతమైనది.

"మొదట అంధకారముండెను." భారత దేశములోగాని, మఱే యుష్ణదేశములోగాని మీలో నెవరయిన ఋతుపవనములు

ప్రారంభమగు తీరును గమనించియున్నయెడల ఈ మాటలలోని భావగాంభీర్యమును గ్రహింపగలరు. దీనిని చిత్రించుటకు ముప్వురు కవులు ప్రయత్నించిన సంగతి నాకు తెలియును. "వెలుగులేదు. మీదుమిక్కిలి చీకటియే గోచరించుచుండెను." అని మిల్టన్ అనెను. కాళిదాసు, "సూదిమాత్రమే చొచ్చుకొనిపోగల అంధకారమది." అని వర్ణించెను. కాని, వీరెవ్వరు, "తమస్సు తమసావృతమైనది" అని వేదమునందున్న వర్ణన సమీపమునకైనను రాలేదు. ఎండవేడిమికి ప్రతివస్తువు కాలి, ప్రేలిపోవుచుండెను. లోకమంతయు ఉడికిపోవుచున్నట్లుండెను. అనేకదినము లీవిధముగానే యుండెను. ఒకనాటి మధ్యాహ్నము దూరమునవెందో భూమ్యాకాశములు కలియుచోట పైన చిన్నమబ్బు ఏర్పడెను. అరగంట కాకమునుపే అది పృథివి వ్యాపించినంతమేర విస్తరించెను. మబ్బుపైమబ్బు చిక్కగా కప్పివేసెను. అంతటను మబ్బుకు మబ్బులు జోడయ్యెను. అంతట, నాకాశము చిల్లులుపడినట్లు కుంభవృష్టికురిసెను. సృష్టికి కారణము సంకల్పమని వర్ణింపబడెను. మొదటనున్నదేదో అది సంకల్పముగా మారెను. ఈ సంకల్పము కోర్కెగా వ్యక్తమయ్యెను. ఈ విషయము గూడ మనము జ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది. మనకుగల సమస్తమునకు కోర్కెయే కారణముగా చెప్పబడుచున్నది. ఈ సంకల్పమే బౌద్ధ, వేదాంత సిద్ధాంతములలో ప్రాధాన్యము వహించినది. అనంతర మది జర్మన్ తత్త్వ జిజ్ఞాసలో గూడ చొరబడుకొని పోయినది. స్కోఫెన్‌హోర్ ప్రతిపాదించిన తత్త్వ సిద్ధాంతమున కది ప్రాతిపదికమైనది. ఇందే మనము మొట్టమొదట దానినిగురించి వింటిమి.

"మొదట కోర్కె పుట్టినది; అది మనస్సనెడి యాది కారణమైన బీజము. యోగులు వివేకజ్యోతితో తమ హృదయములను సంశోధించుకొని, సత్ కు అసత్ కు గల సంబంధమును కనుగొనిరి."

అది బహువిచిత్రమైన ప్రయోగము; "ప్రాయశః కవికి సహితము అది తెలియదేమో" అనుమాటతో ముగియును. ఈ కీర్తనలోని కవిత్వలావణ్య మటుంచినను, సృష్టిమర్మమును గుఱించిన యన్వేషణ యిందు స్పష్టరూపము దాల్చినది. ఋషుల మనస్సు లప్పటికి అత్యున్నతస్థితి బొందినవి; సాధారణ సమాధానము లేవియు వారికి సంతృప్తి కలిగింపలేదు. పైనుండి యొకడు పరిపాలనచేయుచున్నాడనెడి సమాధానముకూడ వారికి సంతృప్తి నీయలేదు. ఇదంతయు నెట్లు వచ్చెనను భావముగల కీర్తన లనేకమున్నవి.

ఇదివరలో జగత్పరిపాలకుని, సగుణదైవమును వారు కనుగొనుటకు ప్రయత్నించినప్పుడు ఒక దేవత తరువాత నొక దేవతను తీసికొని, దానిని మహోన్నతపదవి కెక్కించినట్లు, ఇప్పుడు వారొక భావము తరువాత నొక భావమును గొని, దాని ననంతముగా పెంచి, దానిని జగత్తులోని ప్రతివస్తువుకు బాధ్యతగల దానినిగా జేసిన ట్లనేకస్తవములలోగలదు. ఒక్కొక్క పర్యాయ మొక్కొక్క విశిష్ట భావము నాధారముగా చేసిరి. దానియందు సర్వము కలదు; సర్వము దాని నాలంబముగా గొనును. సర్వమున కాధారమైనదే ఈ సర్వము నయ్యెను. తక్కిన భావములన్నిటితీరు నిదే. ఈ విధానమును వారు ప్రాణసూత్రమునకు ప్రయోగించిరి. ప్రాణధర్మమును వారు విశ్వజనీనము, ననంతమునగు స్థాయికి విస్తరింపజేసిరి. సమస్తమును ప్రాణశక్తియే భరించుచున్నది; మానవదేహమును మాత్రమేగాదు; సూర్యచంద్రుల కాంతియదియే. ప్రతివస్తువును చలింపజేయుచున్నదదియే; అది విశ్వమంతటికి ఇచ్ఛాశక్తి. ఇటువంటి ప్రయత్నములు కొన్ని మిక్కిలి మనోహరమైనవి. కవితావేశముతో గూడినవి. "అతడే మనోజ్ఞమైన సూర్యోదయమును ప్రవేశపెట్టును." ఇట్టి ప్రయోగములు కొన్ని విషయవివరణచేయు తీరు ననుసరించి, రసబంధురముగను, గానయోగ్యముగను నున్నవి. మన మితః పూర్వము ప్రస్తావించిన కోర్కెయే—సృష్టికి ఆదికారణముగా ప్రారంభ

మైన బీజమే విశ్వపురుషుడగు దేవుడుగా విస్తరింపబడెను. కాని ఈ భావములలో నేదియు సంతృప్తి కలిగింపలేదు.

ఇక్కడ ఈ భావము ఉదాత్తపఱుపబడి, కడకొక వ్యక్తిగా వేఱుచేయబడినది. "మొదట అతడొక్కడే యుండెను. సర్వ జగత్తుకు అతడొక్కడే అధినాథుడు; జగత్తును భరించున దతడే. ఆత్మలకు కారకుడు, శక్తికి కారకుడు నతడే. అతనినే సకలదేవతలు ఆరాధింతురు. అతని ఛాయయే జీవితము; మృత్యువుకూడ అతని ఛాయయే. అతనినిగాక మనము మఱెవరిని ఉపాసింతుము? అతని మహిమను హిమగిరిశిఖరములు ప్రకటించుచున్నవి. అతని కీర్తిని సాగరములు తమ తరంగము లన్నిటితో ఎలుగెత్తి చాటుచున్నవి." కాని, నే నింతకుముందే చెప్పినట్లు ఈ భావమువలన వారికి తృప్తికలుగలేదు.

చిట్టచివర కొక విచిత్రమైన పరిస్థితి మనకు గోచరించును. ఇంతవఱకు ప్రశ్నకు సమాధానము నిమిత్త మార్యులమనస్సు బయట ఎక్కడెక్కడనో వెదకుచుండెను. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలుగా కనబడిన ప్రతివస్తువును వారీ విధముగా ప్రశ్నించిరి. ప్రకృతియంతయు కలసినను జగత్పాలకుడయిన సగుణ దైవమునుగుఱించి మాత్రమే బోధింపగలదు; అంతకుమించి యది చెప్పగలిగిన దేదియులేదు. సూక్ష్మముగా చెప్పవలసినయెడల, బాహ్య ప్రపంచమునుండి మనము గ్రహింపగలిగినదంతయు శిల్పినిగుఱించిన భావము నిర్మాణముల నమోనా సిద్ధాంత మనబడునది. అది నిశితమైన తార్కికయుక్తి గాదనుసంగతి మనందఱకు తెలిసినదే; దానిలో బాల్యదశనాటి యమాయికభావము కొంత కలదు. ఏమైనను, విశ్వమందిర నిర్మాణమునకు శిల్పి యొకడుండుట అవసరమను భావము మాత్రమే మనము బాహ్యజగత్తునుండి గ్రహింపగలిగినదంతయును. సృష్టితత్త్వమును గుఱించిన జిజ్ఞాసకిది సమాధానము కాజాలదు. ప్రపంచమునకు కావలసిన వస్తుసామగ్రియంతయు నతనియెదుట

తృప్తిపడుట, వివిధసిద్ధాంతముల ప్రతిపాదన —యివన్నియు మనకు సత్యమునకు మధ్య యవనికను నిలిపినవి. ఇది మఱొక విశిష్టఘట్టము. ఈ లక్ష్యము చివరవఱకు మనము పరిశీలింపవలెను. ఇది తరువాత అద్భుతమైన మాయావాదముగా అభివృద్ధిపొందినది. వేదాంత సిద్ధాంత ప్రతిపాదనకు ఈ తెర సార్థకముగా తోడ్పడినది. ఇంత కాలము సత్యము ఉన్నచోటనే యున్నది. ఈ యవనికయే దానిని మఱుగుపఱచినది.

ఈ విధముగా ఆర్యులు క్రొత్తరీతిని యోచన ప్రారంభించిరి. బాహ్యప్రపంచములో నెంత వెదకినను తమప్రశ్నకు సమాధానము దొరకదని వారు గ్రహించిరి. బాహ్యప్రపంచములో యుగముల కొలది అన్వేషణ సాగించినను వారి ప్రశ్నల కందు సమాధానము లేదు. అంతట వారీ రెండవ పద్ధతి ననుసరించిరి; ఈ పద్ధతి ప్రకారము ఇంద్రియ వాంఛలు, కర్మకలాపములయందు ప్రీతి, బాహ్యావేష ధారణ తమకు, సత్యమునకు నడుమ తెర వేసినవనియు, ఈ తెర కర్మ కలాపములవలన తొలగిపోవునది కాదనియు వారు తెలిసికొనిరి. వా రంతర్ముఖులు కావలసినవా రయిరి; తమ మనస్సులను మనో వ్యాపారములను నిశితముగా సంశోధించి, సత్యమును తమలోనే కనుగొనవలసిన వా రయిరి. బాహ్య ప్రపంచపరిశీలన నిష్ప్రయో జనము కాగా వారు తమ యంతఃప్రపంచములోనికి ప్రవేశించిరి. అప్పు డది నిజమైన వేదాంత తత్త్వశాస్త్రమైనది; ఇక్కడ వేదాంత తత్త్వశాస్త్రమునకు ప్రారంభము. ఇది వేదాంతమునకు పునాది. మనము ముందుముందు పోవుకొలది సమస్త జిజ్ఞాసయు అంతరంగ ములోనే జరగినదని గ్రహింతుము. ప్రారంభముననే వా రీవిధముగా ప్రకటించినట్లు తోచుచున్నది: "ఇక్కడ, మానవాత్మలో, మహి మలలోకెల్ల మహిమయగు ఆత్మలో, సకల భాండారములో, ఉనికి గల దానికెల్ల ఖనియగు నిక్కడ—అన్వేషింపుడు" ఇందు లేనిది మఱెందును లేదు. క్రమక్రమముగా బాహ్యమైనదెల్ల అంతరమున నున్న దాని మందమైన ప్రకాశమే యనియు అంతకంటె మఱేమియు

కాదనియు వారు తెలిసికొనిరి. దేవుని గుఱించిన ప్రాచీన భావమును, జగత్తుకు వేఱుగానున్న జగత్పరిపాలకుడను భావమును వారెట్లు స్వీకరించి, జగత్తులో నుంచిరో మనము గమనింతము. అతడు విశ్వమునకు వేఱుగా నున్న దేవుడు కాదు; విశ్వము లోపలనే అతడు కలడు; అనంతరము వారతని నక్కడనుండి తమ హృదయముల లోనికి స్వీకరించిరి. అతడిక్కడ, మానవహృదయములో ఆత్మలో ఆత్మగా నున్నాడు. అతడు మనలోని సత్యము.

"వేదాంతతత్త్వశాస్త్రము పనిచేయుతీఱును" అని గ్రహించుట కనేక మహద్విషయములను తెలిసికొనవలసియున్నది. మొట్ట మొదటి విషయ మేమనగా అది కాంట్, హెగెల్ తత్త్వ సిద్ధాంతముల వంటిదికాదు. అది ఒక్క గ్రంథముకాదు; అది ఒక్కరి కృషి కాదు. వివిధకాలములలో విరచింపబడిన పెక్కు గ్రంథములకు వేదాంతమని పేరు. వీనిలోనే యొకదానిలో వివిధవిషయములను గుఱించిన యేబది యంశములుండును; అవన్నియు క్రమబద్ధముగా కూర్చినవిగావు; భావములు తోచినవి తోచినట్లుగా లిఖింపబడినవి. ఒక్కొక్కచోట ఎన్నియో యితరవిషయముల వివరణమధ్య అద్భుతమైన భావములు వ్యక్తము చేయబడియుండును. ముఖ్యముగా పేర్కొనదగిన విషయమొకటికలదు: ఉపనిషత్తులలోని భావములు సర్వదా అభివృద్ధిపొందుచునేయుండును. అపరిణత ప్రాచీన భాషలో ఈ ఋషులలో ఒక్కొక్కరి మనోభావములు యథాతథముగా చిత్రింపబడినట్లుండును. మొదట ఈ భావములు అపరిపక్వములుగా నుండెను. కాలక్రమమున అవి పరిణతి నందసాగినవి. చివర కవి వేదాంత గమ్యమును పొందెను. ఈ గమ్యమునకే తత్త్వశాస్త్రమనిపేరు కలిగినది. మొదట దేవతలకొఱకు ప్రకాశించువారికై అన్వేషణ జరిగినది. తరువాత సృష్టిమూలము కొఱకు జిజ్ఞాస సాగినది. ఈ యన్వేషణమునకు మఱింత తాత్త్వికము, సుస్పష్టమైన పేరు వచ్చుచున్నది. అదియిది: అఖిలవస్తువుల ఏకత్వము—"దేనిని తెలిసికొనిన యెడల సర్వము తెలియునో" అది.

# హిందూమతము

నేర్చుకొనుటే నా మతము. మీ బైబిలు దృక్పథముతో నా మతగ్రంథములను మఱింత చక్కగా అర్థముచేసికొనగలను. మీ ప్రవక్తలు దూరదృష్టితో పలికిన ప్రవచనములతో పోల్చి నప్పుడు నామతము చేసిన యుపదేశములు మఱింత స్పష్టముగా బోధపడుచున్నవి. సత్యమెప్పుడు సర్వజనీనమైనదే. మీ అందఱి చేతులకు అయిదు వ్రేళ్లుండి, నాకుమాత్రమే ఆఱు వ్రేళ్లున్న యెడల నాచేయి సహజముగా లేదని, అది ప్రకృతి వైపరీత్యమనియో, వ్యాధి లక్షణమనియో భావింతురు. మతవిషయము గూడ సరిగా అంతే. ఏదో ఒక మతసిద్ధాంతమే నిజమనియు, తక్కిన సిద్ధాంతము లన్నియు అసత్యములనియు చెప్పినచో ఆ మతము వ్యాధిగ్రస్తమైన దని చెప్పుటకు మీకు హక్కు కలదు; ఒక మతము సత్యమైన యట్లే అన్ని మతములు సత్యములే. అందుచేత హిందూమతము నాదే కాదు, మీదికూడ. భారతదేశములోని ఇరువదితొమ్మిది కోట్ల జనాభాలో క్రైస్తవులు ఇరువది లక్షలమంది; మహమ్మదీయులు ఆఱుకోట్లమంది. తక్కినవారందఱు హిందువులు.

హిందూమతమునకు మూలము వేదములు. 'విద్' (అనగా—తెలిసికొనుట) అను పదమునుండి వేదశబ్దము పుట్టినది. ఇవి అనేక గ్రంథములు. వీనిలో మతమును గుఱించిన సకలవిషయముల సారముకలదని మా యభిప్రాయము; సత్యములు వానిలోనే కలవని మా యభిప్రాయముకాదు. అవి మాకు ఆత్మయొక్క అమృతత్వమును గుఱించి బోధించును. మార్పుచెందని స్థాయి ఏదో కావలెనన్న ఆకాంక్ష ప్రతి దేశములోని ప్రతిమానవహృదయములోను కలదు. అటువంటిది ప్రకృతిలో దొరకదు. జగత్తు మార్పులతో కూడిన అనంత ప్రవాహము. దానినిబట్టి మార్పులేని దనుచు ఏదీలేదని నిర్ణయముచేయుట యనగా దక్షిణదేశములోని బౌద్ధులు, చార్వాకులు చేసిన పొరపాటు చేయుటే. ఉన్నదంతయు భౌతికపదార్థమే

యనియు, మనస్సు వేఱుగాదనియు, మతమంతయు వంచనగాని మతేమిగాదనియు, నీతి, సచ్ఛీలము నిష్ప్రయోజనమైన మూఢవిశ్వాసములనియు చార్వాకుల నమ్మకము. మానవుడు పంచేంద్రియములకు బద్ధుడుకాడని వేదాంతశాస్త్రము బోధించును. వానికి వర్తమానమే తెలియునుగాని భూతభవిష్యత్తులు తెలియవు; అయితే వర్తమానము భూత భవిష్యత్తులను స్ఫురింపజేయును. త్రికాలములు కాలములో మనమేర్పఱచుకొనిన విభాగములే. కనుక భూతవర్తమాన భవిష్యత్తుల ననుసంధించుచు కాలమునకు, ఇంద్రియములకు అతీతమైన దొకటి లేనియెడల కాలమునుండి వేఱై స్వతంత్రమైన దొకటి లేనియెడల భూతభవిష్యత్కాలములను వర్తమాన కాలముందు గలుపునదొకటి లేనియెడల వర్తమానముకూడ మనకు తెలియకపోయియే యుండును.

అయితే స్వతంత్రమైనదేది? మనదేహముకాదు. ఎందుకనగా, అది బాహ్యపరిస్థితులపై ఆధారపడినది; మన మనస్సుకూడ కాదు; దాని యాలోచనలు, భావములు కొన్ని కారణముల ఫలితములే. కనుక స్వతంత్రమైనది మన ఆత్మ. సకలవిశ్వము స్వాధీనత పరాధీనతల, స్వాతంత్ర్య పారతంత్ర్యముల మిశ్రమనియు, ఈ యన్నిటిలోను ఆత్మ ప్రకాశించుచున్నదనియు వేదములు ఘోషించుచున్నవి. అది స్వతంత్రము, నాశరహితము, శుద్ధము, లోపరహితము, పవిత్రము అయినది. ఏలయనగా, అది స్వతంత్రమైనదయినచో నశింపజాలదు. నాశనమనునది మార్పే. అది పరిస్థితులపైన, కారణములపైన ఆధారపడియున్నది; స్వతంత్రమైనదయినచో అదిలోపరహితమైనది కావలెను. లోపముగలది కారణమున కధీనమైనదే, కనుక పరాధీనమైనదే. నాశరహితము, పరిపూర్ణము అయిన ఈ ఆత్మవస్తువు మహాదేవునిలోను, నికృష్టమానవునిలోను ఒక్కటిగా నున్నది. వ్యత్యాసమంతయు ఆత్మ వ్యక్తమగుచున్న తీరులోని తరతమ భేదమే.

ఆత్మ అసలు దేహమునేల ధరింపవలెను ? నే నద్దముచూచు కొనుట ఎందుకో అందుకే — నన్ను నేను చూచుకొనుటకు. ఆవిధమున దేహమున ఆత్మ ప్రతిఫలించుచున్నది. ఆత్మయే దేవుడు. ప్రతి మానవునియందు పరిపూర్ణదివ్యత్వమున్నది. శీఘ్రముగానో, ఆలస్యముగానో ప్రతిమానవుడు తనలోని దివ్యత్వమును ప్రదర్శింపవలసి యున్నది. నేను చీకటిగదిలో నున్నయెడల, నేనెంతగా ప్రతిఘటించి నను వెలుతురు రాదు—నే నగ్గిపుల్ల వెలిగించవలెను. సరిగా అదే విధముగా ఎంతగొణిగినను, విలపించినను లోపములతో కూడిన దేహము లోపరహితము కాజాలదు. అందుచేత ఆత్మావబోధముతో మీ దివ్యత్వమును ప్రకాశింపజేయుడని వేందాత ముపదేశించుచున్నది. మీ బిడ్డలలో దివ్యత్వమున్నదని వారికి బోధింపుడు ; మతము ప్రయోజనము కలిగించెడిదేగాని, వ్యతిరేక రూపముగల అర్థరహితమైన ప్రలాపము కాదని యుపదేశింపుడు ; అది అణగ ద్రొక్కబడినప్పుడు అసహాయులమై రోదనము చేయుటకాదని, వ్యాప్తిచెందుట, అంతశ్శక్తిని ప్రదర్శించుటయని నచ్చజెప్పుడు.

ప్రతిమతమందును మానవుని వర్తమానము, అనాగతము గతముచేత మార్పునొందుచున్నవని చెప్పబడుచున్నది ; వర్తమానము గతమునకు ఫలితముగా పేర్కొనబడుచున్నది. అయితే ప్రతి శిశువు కొంత అనుభవముతో జన్మించుచున్నాడు. ఏల ? ఆ యనుభవము జననీ జనకులనుండి సంక్రమించినట్లు చెప్పుటకు వీలు లేకున్నది. ఒకడు సజ్జనులయిన తల్లిదండ్రులకు జన్మించుచున్నాడు; విద్యాధికుడగు చున్నాడు ; సత్పురుషుడగుచున్నాడు. మఱొకడు దుష్టుల కడుపునబుట్టి, తుదకు ఉరికంబము నెక్కుచున్నాడు. ఎందుచేత ? భగవంతుని ప్రసక్తిలేకుండ ఈ యసమత్వమునకెట్లు అర్థము చెప్పగలరు ? దయామయుడయిన తండ్రి తనబిడ్డను దుఃఖమునకు దారితీసెడు పరిస్థితులలో ఏల ఉంచవలెను ? దేవుడు తరువాత న్యాయముచేయునని, అతనికి పక్షపాతము లేదని చెప్పుట సరియైన

సమాధానము కానేరదు. ఇదే నాకు మొదటి జన్మ అయినయెడల నా స్వాతంత్ర్యము మాటేమి? అదేమయినట్లు? ఇతఃపూర్వము నాకు జీవితానుభవము లేనిచో నా స్వాతంత్ర్యము హరించిపోయినట్లే. ఎందుకనగా నితరుల అనుభవములను చూచియే నా జీవిత మార్గమును నిర్ణయించుకొనవలసియుండును. నా మంచిచెడ్డలకు నేను కర్తనుకానిపక్షమున నాకు స్వేచ్ఛలేనట్లే. ఈ జీవితములోని నా దైన్యమునకు బాధ్యత నా మీదనే వేసికొందును. నే జేసినపాపమును మఱొకజన్మలో నేనే పరిహరించుకొందునని చెప్పుదును. ఇది మా జన్మాంతరసిద్ధాంతము. పూర్వ జీవితానుభవముతో మన మీ జన్మనెత్తుదుము. ఈ జన్మలోని భాగ్యము, దౌర్భాగ్యము పూర్వ జన్మలోని మన కర్మలఫలితము. పరిపూర్ణత్వము సిద్ధించువఱకు జన్మ లొకదానితరువాత నొకటి ఉత్తమోత్తమముగా పరిణమించుచుండును.

జగత్పిత యయిన దేవునియందు మనకు విశ్వాసము కలదు. అత డనంతుడు, సర్వశక్తిసమన్వితుడు. మన ఆత్మకూడ చిట్టచివరకు పరిపూర్ణత పొందగలదేని, అదియును అనంతము కాక తప్పదు. అయితే అనంతము, నిరవధికము నయిన రెండు వస్తువులకు తావు లేదు. కనుక మనము దేవుని వ్యక్తిత్వమును నమ్ముదుము. మనమే అట్టి దేవుడు. ప్రతిమతమునందు ఈ మూడు దశలు కలవు. మొదట భగవంతుని దూరస్థునిగా భావింతుము; తరువాత మన మతని సమీపమునకు వచ్చి, సర్వవ్యాపకునిగా గ్రహించి అతని సాన్నిధ్యములో వసింతుము; పిదప మన మతడే అని గుర్తింతుము. దేవుడు మనకు భిన్నమైనవాడనెడు భావము అసత్యము కాదు— నిజమునకు దేవునిగుఱించిన ఏభావము అసత్యము కాదు. అందుచే ప్రతిమతము సత్యమే. యాత్రాపథములో ఒక్కొక్కమతము ఒక్కొక్క మజిలీ. అన్ని మతముల లక్ష్యము శ్రుతులు ప్రతిపాదించిన పరిపూర్ణభావమే. కనుక హిందువులమైన మేము ప్రతిమత

మును సహించుటే కాదు; ప్రతిమతమును అంగీకరింతుము. మహమ్మదీయుల మసీదులలో ప్రార్థించుట, జొరాష్ట్రుల అగ్నిహోత్రము మ్రోల ఉపాసించుట, క్రైస్తవుల శిలువకు ప్రణమిల్లుట మాకు సమ్మతమే. క్షుద్రమైన విగ్రహపూజ మొదలు జ్ఞాతకు జ్ఞేయమునకు అభేదమును ప్రతిపాదించు పరమోత్కృష్ట వాదమువఱకు సకల మతములు—అనంతత్వమును అవగాహన చేసికొని సాక్షాత్కరింప జేసికొనుటకు మానవాత్మ చేయుచున్న ప్రయత్నములే. ప్రతిమతము, అదిపుట్టిన పరిస్థితులు, పెరిగిన వాతావరణము, దానిపై పడిన ప్రభావముల ననుసరించి రూపొందినది. ఒక్కొక్కటి పురోగతిలో ఒక్కొక్క దశను సూచించును. ఈ కుసుమము లన్నిటిని మేము సేకరించి ప్రేమ సూత్రములో గ్రుచ్చి, పూజార్హమైన గుచ్ఛముగా చేయుదుము.

నేను దేవుడనయినచో, నా ఆత్మ పరాత్పరుని ఆలయమని గ్రహింపనగును. నా ప్రతిచర్య ఉపాసన కావలెను—నిస్వార్థ ప్రేమ విధ్యుక్తధర్మ మను నిర్వహణ లక్ష్యమొనరించుకొని లక్ష్యసిద్ధికై ముందంజ వేయవలెనను ఉత్సాహము, నిష్కామ కర్మ, అభయము నా యుపాసనలోని యంశములు. వ్యాకోచము పొందుడనియే నామతము బోధించును. వ్యాకోచము పొందుటనగా సాక్షాత్కరింప జేసికొనుట, దర్శించుట యని పరమార్థము— అవ్యక్త శబ్దోచ్చారణము, సాష్టాంగప్రణామములే మతవికాసాంశములు కావు. మానవుడు దేవుడుగా మాఱవలసిన దే—అనంత ప్రస్థానమున దినదినమునకు అధికాధికముగా దివ్యత్వము పొందుచుండవలసిన దే.*



---

* 1894 వ సంవత్సరము డిసెంబరు 30-వ తేదిని క్లింటన్ ఎవెన్యూలోని పాచ్ గ్యాలరీ యొద్ద బ్రూక్‌లిన్ ఎథికల్ సొసైటీ సభలోచేసిన ఉపన్యాస సంగ్రహము. "బ్రూక్‌లిన్ స్టాండర్డ్ యూనియన్" నుండి పునర్ముద్రితము.

# భారతీయ మతవిచారము

## (అమెరికాలోని బ్రూక్‌లిన్ దగ్గర క్లింటన్ ఎవిన్యూయందు పౌచ్ మాన్షన్ ఆర్ట్‌గ్యాలరీలో "బ్రూక్‌లిన్ ఎథికల్ సొసైటీ" ఆధ్వర్యమున చేసిన ఉపన్యాసము)

భారత దేశము విస్తీర్ణమునందు యునైటెడ్ స్టేట్స్‌లో సగమే ఉన్నను దాని జనాభామాత్రము ఇరువదితొమ్మిది కోట్లకుపైగా కలదు. అచ్చటి ప్రజలపై ప్రాబల్యము వహించు ప్రధానమతములు మూడు—మహమ్మదీయమతము, బౌద్ధమతము,* హిందూమతము. వీనిలో మహమ్మదీయమతమునకు చెందినవారు సుమారు ఆరుకోట్ల మంది. బౌద్ధమతస్థులు దాదాపు తొమ్మిది కోట్లు. కడపటి మతావలంబుల సంఖ్య రమారమి ఇరువదికోట్ల అరువదిలక్షలు. హిందూ మత ప్రధాన సిద్ధాంతములు ధ్యానమువలన, జిజ్ఞాసవలన దర్శింపబడిన తాత్త్విక సత్యములపైన, వేదచోదితమైన నైతిక ధర్మసూత్రములపైన ప్రతిష్ఠితమైనవి. విశ్వము శాశ్వతము, అనంతము అని వేదములు వక్కాణించినవి. దీనికి ఆది యనునదిలేదు, తుదియును లేదు. భౌతికరంగమున వ్యక్తమైన ఆత్మశక్తి లీలలు, పరిమిత సీమలో ప్రకాశించిన అనంతశక్తి విలాసములు అసంఖ్యాకములు; కాని, ఆ యనంత వస్తువు మాత్రము స్వప్రకాశము, నిత్యము, నిర్వికారము. శాశ్వతత్వముపై కాలగతుల ముద్రలు పడవు మానవ బుద్ధి కగ్రాహ్యమైన అతీంద్రియ భూమికయందు భూతభవిష్యత్తులు లేవు. మానవాత్మ అనశ్వరమని వేదము లుద్ఘోషించినవి. దేహము శాసన బద్ధము ; దానికి పెరుగుదల, నాశనము గలవు. పెరుగున దెల్ల విధిగా నశించవలసినదే. కాని, అంతరమందున్న ఆత్మకు అనంతమగు అమృత జీవనముతోనే సంబంధము ; దాని కెన్నడును ఆది లేదు ; దాని కేనాటికిని తుదియుండబోదు. హిందూమతమునకు

---

* జైనమతముతో కలసి.

క్రైస్తవమతమునకుగల ప్రధానభేదములలో నొకటి యిది: ప్రతి మానవాత్మ యీ లోకములో పుట్టుటతో ప్రారంభమగునని క్రైస్తవమతము బోధించును. మానవాత్మ నిత్యపురుషుని ప్రసరణ మని, ప్రారంభమనునది భగవంతున కేమాత్రముగలదో దీనికిని అంతే కలదని హిందూమత ముద్ఘాటించును. అది పరిపూర్ణత్వము పొందువఱకు మహత్తరమగు ఆధ్యాత్మిక క్రమపరిణామశాసనబద్ధమై, ఒక వ్యక్తిత్వమునుండి మఱొకవ్యక్తిత్వమునకు పయనించుటయం దసంఖ్యాక లీలలు ప్రదర్శించినది. అది యికముందును అసంఖ్యాకములగు లీలలను ప్రదర్శించును. పరిపూర్ణత్వము పొందిన పిమ్మట పరిణామము చెందబోదు.

'ఇదియే నిజమగుచో మన పూర్వజీవితములలోని యే విషయముగాని మనకు స్మృతిపథములలో నేల లేదు'? అని తఱచుగా ప్రశ్న వేయబడుచుండును. దీనికి మా సమాధాన మిది: మానసమని యెడి సాగరమునందలి యుపరిభాగమునకు మాత్రమే చేతన మని పేరు. గంభీరమైనదాని లోపలి పొరలయందే మన కష్టసుఖానుభవములన్నియును నిల్వయున్నవి. సుస్థిరమగు వస్తువు నన్వేషించుటయే మానవాత్మ యభీష్టము. మనస్సు, దేహము, నిజమునకు ప్రకృతికార్యకలాపము లన్నియును నిరంతము మార్పుచెందుచున్నవి. కాని, సుస్థిరమైన పరిపూర్ణత్వముపొంది, పరిణామ మొందని దేదో కనుగొనవలెనని మన ఆత్మ కాంక్షించును: అదియె మన యీప్సితములలోనికెల్ల ఉత్కృష్టమైనది. అనంతమైన దాని కొఱకు మానవాత్మకుగల కాంక్షయే అది! మన నైతికవికాసము, బుద్ధివికాసము నిశితమగుకొలదియు నిర్వికారమగు నిత్యవస్తువు కొఱకు మానవాత్మకుగల అభీష్టము బలపడుచుండును.

పంచేంద్రియగ్రాహ్యముకాని దంతయును లేనిదనియే ఆధునిక బౌద్ధవాదులు చెప్పుదురు. మానవుడు స్వతంత్రుడనుకొనుట భ్రమయని వారందురు. దీనికి భిన్నముగా ఆత్మవాదులు ప్రతి

వ్యక్తియు స్వతంత్రుడని వచింతురు. బాహ్య ప్రపంచము మానవుని మనోభావమునకు వేఱుగా లేదు. ప్రకృతి స్వాతంత్ర్య పారతంత్ర్యముల, వాస్తవికత ఆదర్శముల మిశ్రమముగ గ్రహించుటయే ఈ సమస్యకు సరియైన పరిష్కారము. మన దేహము, మనస్సు బాహ్య ప్రపంచముపై ఆధారపడియున్నవి. ఈ పరాధీనత వానికి ప్రపంచముతో గల సంబంధము ననుసరించి మాఱుచుండును; అంతరమందున్న ఆత్మ భగవంతునివలెనే ముక్తము; అది మనోవ్యాపారములను, దేహచలనములను—మనస్సు, దేహము పొందిన అభివృద్ధినిబట్టి—అల్పముగానో, అధికముగానో నడిపింపగలదు.

మరణ మొక అవస్థాభేదమే. మన మీ ప్రపంచములోనే యుందుము. మునుపటి శాసనములకే మన మధీనుల మగుదుము. జ్ఞానమునందు, సౌందర్యమునందు ఉన్నతభూమికల నందుకొని, మనలను దాటి బహుదూరము పురోగమించిన మహనీయులు తమవెంట వచ్చు విశ్వసైన్యమునకు మార్గదర్శకులగు నాయకులు. పరమోత్కృష్ట వస్తువులోని ఆత్మకు, పరమ నికృష్టవస్తువులోని ఆత్మకు సంబంధమున్నది. అనంతపరిపూర్ణత్వము బీజరూపమున సకల వస్తువులందును గలదు. మన మాశాభావము నలవఱచుకొని ప్రతి వస్తువునందునుగల శుభమును చూచుటకు ప్రయత్నింపవలెను. మన మొకమూల కూర్చొని మన దేహమనస్సులలో గల లోపములను గుఱించి దుఃఖించుటవలన కలిగెడి ప్రయోజనమేదియును లేదు; ప్రతికూలపరిస్థితుల నధిగమించెడి వీరోచితప్రయత్నమే మన ఆత్మల నున్నతస్థాయికి గొనిపోవును. ఆత్మాభివృద్ధినిగుఱించిన శాసనములను తెలిసికొనుటే జీవితలక్ష్యము. ఈ విషయములను క్రైస్తవులు హిందువుల దగ్గఱనుండి నేర్చుకొనవచ్చును; హిందువులు క్రైస్తవుల దగ్గఱనుండి తెలిసికొనవచ్చును. లోకములో జ్ఞానాభివృద్ధికి ఒక్కొక్కరు ఒక్కొక్కవిధముగా తోడ్పడిరి.

యథార్థమతము అన్వయపూర్వకమైనది, విధాయకరూపమైనదేగాని, వ్యతిరేకపూర్వకమైనది, నిషేధరూపమైనది కాదని

మీ బిడ్డలకు నచ్చచెప్పుడు. అది కేవలము దుష్కార్యములు చేయక పోవుటలోలేదు; సత్కార్యములు దీక్షతో చేయుచుండుటలో గలదు. నిజమైన మతము మానవుల బోధలవలనను, పుస్తకములు చదువుటవలనను లభింపదు. అది పరిశుద్ధమగు వీరోచితకార్య నిర్వహణఫలితమైన ఆత్మావబోధము. లోకములోనికి వచ్చిన ప్రతి శిశువు తన పూర్వజన్మలలో నిల్వచేసికొనియున్న అనుభవమును కూడ తెచ్చుకొనును; ఆ యనుభవముద్ర దేహమానస నిర్మాణము లందు కాననగును. మన అందఱియందును బలీయముగాగల స్వాతంత్ర్య భావమునుబట్టి మనలో దేహము, మనస్సు కాక మఱొ కటికూడ కలదని తెలియుచున్నది. అంతరమందున్న ఆత్మ స్వతంత్ర మైనది. అదియే మనయందు స్వాతంత్ర్యపిపాస కలిగించును. మనము స్వతంత్రులము కానిపక్షమున లోకమునెట్లు ఉద్ధరింప గలము? మానవాత్మ సాగించుచున్న కృషిఫలితమే మానవాభ్యు దయమని మనము విశ్వసింతుము. లోకమున్న తీరు, ఇప్పటి మన స్థితి—ఇవి ఆత్మస్వాతంత్ర్యమువలన కలిగిన ఫలములే.

మేమీశ్వరునియందు విశ్వాసము గలవారము. అతడు మన అందఱకు జనకుడు. అతడు సర్వవ్యాపి, సర్వశక్తుడు; అతడు తన బిడ్డల నపారప్రేమతో నడిపించి, కాపాడుచున్నాడు. క్రైస్త వులవలెనే మేమును ఈశ్వరుడు సగుణుడని నమ్ముదుము. మఱొక అడుగు ముందుకు పోవుదుముకూడ: మే మతడే అని విశ్వసింతుము! అతని వ్యక్తిత్వము మనయం దావిష్కారమగుచున్నది. దేవుడు మన యందున్నాడు. మనము దేవుని యందున్నాము. సకల మతములందును సత్యము బీజప్రాయముగా కలదని మేము నమ్ము దుము. వాని యన్నిటికిని హిందువు ప్రణమిల్లును; ఏలయన లోక ములో సత్యము సంకలనమందే కలదుగాని వ్యవకలనమందు లేదు. విభిన్నమతములనెడి బహు సుందర సుమములతో కూర్చిన గుచ్ఛ మును మేము దేవునకు సమర్పింప నభిలషింతుము. ఏదో ప్రతిఫలా

చెప్పుడు. అది కేవలము దుష్కార్యములు చేయక
సత్కార్యములు దీక్షతో చేయుచుండుటలో
మతము మానవుల బోధలవలనను, పుస్తకములు
లభింపదు. అది పరిశుద్ధమగు వీరోచితకార్య
ంన ఆత్మావబోధము. లోకములోనికి వచ్చిన ప్రతి
ర్వజన్మలలో నిల్వచేసికొనియున్న అనుభవమును
ను; ఆ యనుభవముద్ర దేహమానస నిర్మాణము
ను. మన అందఱియందును బలీయముగాగల
మునుబట్టి మనలో దేహము, మనస్సు కాక మఱొ
తెలియుచున్నది. అంతరమందున్న ఆత్మ స్వతంత్ర
మనయందు స్వాతంత్ర్యపిపాస కలిగించును.
త్రులము కానిపక్షమున లోకమునెట్లు ఉద్ధరింప
గాత్మ సాగించుచున్న కృషిఫలితమే మానవాభ్యు
ు విశ్వసింతుము. లోకమున్న తీరు, ఇప్పటి మన
స్వాతంత్ర్యమువలన కలిగిన ఫలములే.

శ్వరునియందు విశ్వాసము గలవారము. అతడు
నకుడు. అతడు సర్వవ్యాపి, సర్వశక్తుడు; అతడు
రప్రేమతో నడిపించి, కాపాడుచున్నాడు. క్రైస్త
ును ఈశ్వరుడు సగుణుడని నమ్ముదుము. మఱొక
పోవుదుముకూడ: మే మతడే అని విశ్వసింతుము!
ము మనయం దావిష్కారమగుచున్నది. దేవుడు
ుడు. మనము దేవుని యందున్నాము. సకల
సత్యము బీజప్రాయముగా కలదని మేము నమ్మ
న్నిటికిని హిందువు ప్రణమిల్లును; ఏలయన లోక
సంకలనమందే కలదుగాని వ్యవకలనమందు లేదు.
వెడి బహు సుందర సుమములతో కూర్చిన గుచ్ఛ
వునకు సమర్పింప నభిలషింతుము. ఏదో ప్రతిఫలా



పేక్షతో కాక, మనము దేవుని ప్రేమానుభవ కాంక్షతోనే ప్రేమింపవలెను. మన విధిని విధినిర్వహణాభిలాషతోనే చేయవలెను; ప్రతిఫలాపేక్షతో చేయరాదు. అందమైన వస్తువును సౌందర్యానుభవ కాంక్షతోనే ఆరాధింపవలెను; ప్రతిఫలాపేక్షతో ఆరాధింపరాదు. ఆవిధముగా మన నిర్మలహృదయములో భగవంతుని దర్శింతుము. యజ్ఞయాగములు, మోకరింపులు, సణుగుడులు, గొణగొణలు మతముకాదు. సాహసోపేతములయిన సుందరసత్కార్యములను నిర్వహించుటకు మనలో ప్రేరణ కలిగించి, భగవానుని పరిపూర్ణత్వమును గ్రహింప గలుగునట్లు మన భావముల నున్నత యాధ్యాత్మిక భూమికకు గొనిపోగలిగినచో అవి మంచివేయగును.

ప్రార్థనసమయములో దేవుడు మన జనకుడని గుర్తించుచు, నిత్యజీవితములో ప్రతిమానవుని సోదరునిగా పరిగణింపనిచో ప్రయోజనమేమి? ఉత్కృష్ట జీవితపథమును సూచించుటకే గ్రంథములు రచింపబడినవి; నిర్భీతితో అడుగులువేసి బాటలో నడవని యెడల ఫలితము కలుగదు! ప్రతి మానవుని ఒకగాజు గోళముతో పోల్చవచ్చును. ఉన్నదొక్కటే స్వచ్ఛమైన తెల్లని వెలుగు—భగవంతుని ప్రసరణము—ప్రతిజీవుని కేంద్రము. గాజుగోళమురంగు, దళసరితనము ఒక్కొక్కని యందొక్కొక్క విధముగానుండుటచేత కిరణములు ప్రసారమగుటలో భిన్న భిన్నలక్షణములను పొందును. అందఱియందును కేంద్రముగానున్న జ్యోతి ఒక్కటే. అది సర్వత్ర సమానమే; దాని సౌందర్య మొకేవిధమైనది. స్థూలదృష్టికి కనబడు అసమానత్వము, ఆ వెలుగును వ్యక్తముచేయు ఉపకరణములోని లోపమునం దేగలదు. ఉనికియందు మనము ఉన్నతోన్నతమగు అంతస్తుల నందుకొను కొలదియు ఉపకరణమునకు ప్రసరణశక్తి యధికాధికమగుచుండును.

—•—

# వ్యాకోచముకొఱకు ఆవేదన *

విత్తుముందా, చెట్టుముందా అను సమస్య అనాదిగానున్నది. ఇది మనకు జ్ఞానముకలుగుచున్న సకలమార్గములందును ప్రత్యక్షమగుచున్నది. మొట్టమొదటగా నున్నది బోధశక్తియా భౌతిక పదార్థమా; ప్రప్రథమముగా నున్నది ఆదర్శస్వరూపమా లేక బాహ్యావ్యక్తీకరణమా; మన నిజమైన తత్త్వము స్వాతంత్ర్యమా, శాసనబద్ధస్థితియా; భావమే భౌతికవిషయ వస్తువును సృష్టించునా, విషయవస్తువే భావమును సృష్టించునా; నిశ్చలస్థితినిగుఱించిన భావము ప్రకృతి పరిణామభావమునకు పూర్వమా పరమా—ఇవి యన్నియు ఏనాటికిని తెగని ఒకే క్లిష్టతత్త్వమునుగుఱించిన సమస్యలు. ఇవి నిరంతరము లేచి, పడుచుండు కెరటములవలె ఒకదాని నొకటి యనివార్యముగా ననుసరించుచుండును. జనులు తమ యభిరుచులకు, చదువులకు, విచిత్రస్వభావములకు తగినట్లు వీనిలో నేదో యొక పక్షమును గ్రహించుచుందురు.

ఉదాహరణ నొకటి తీసికొందము : ప్రకృతిలోని వివిధభాగము లొకదానితో నొకటి సర్దుబాటు చేసికొనుచుండు తీరునుబట్టి యిదంతయు ధీశక్తి ఫలితమేయని తేటతెల్లమగుచున్న ట్లొకప్రక్క చెప్పవచ్చును. అయితే ధీశక్తియే భౌతిక తత్త్వమువలన, శక్తివలన క్రమపరిణామములో సృష్టియైనదని కావున అది యీ జగత్తుకు పూర్వముండియుండుటకు వీలులేదని మఱొకప్రక్క వాదము చేయవచ్చును. సృష్టియగుచున్న ప్రతిరూపమునకును ముందు మనస్సునందు తదనుగుణమైన ఆశయ ముండితీఱవలెనన్నచో, ఆశయమనునది వివిధ బాహ్యానుభవములవలన సృష్టియైనదేయని కూడ సమానవాదబలముతో చెప్పవచ్చును. ఒకవంక నిత్యసిద్ధమైన

---

* స్వామిజీ తొలిసారిగా అమెరికా వెళ్లినప్పుడు ఆయన ఒకానొక పాశ్చాత్య శిష్యుడడిగిన ప్రశ్నలకు సమాధానముగా వ్రాసినది.

ముక్తస్థితినిగుఱించిన కాంక్షకలదు. మఱొకవంక జగత్తులో నేదియు నిర్హేతుకముకాదు గనుక భౌతికమైన సర్వము, మానసికమైన సర్వము కార్యకారణ సూత్రమున బద్ధమైనదనుభావము కలదు. ఇచ్ఛాశక్తివలన దేహములో మార్పులు కలుగుచుండుటనుబట్టి భావమే దేహమును సృష్టించినదనుచో దేహములోని మార్పులు భావములో మార్పులను ప్రేరేపించును గనుక దేహమే మనస్సును సృష్టించియుండవలెనని గూడ స్పష్టమగుచున్నది. జగత్పరిణామము అంతకుముందున్న నిశ్చలస్థితినుండి యుద్భవించెనని ప్రతిపాదించిన పక్షమున, నిశ్చలస్థితి యనునది భ్రాంతిజన్యమని, అది యొకానొక సాపేక్ష చలనమేయని, అందుకు కారణము చలనములోని భేదములే యని తర్కసమ్మతముగా వాదము చేయవచ్చును.

కనుక జ్ఞానమంతయు నిట్టి విషమచక్ర పరిభ్రమణమగుచున్నది: అనిర్వచనీయమైన కార్యకారణముల పరస్పరాశ్రయమది. తర్కసూత్రములనుబట్టి చూడగా నిది నిర్దుష్టమైన జ్ఞానము గాదు; ఇట్టిది నిర్దుష్టమైన జ్ఞానముకాదని యథార్థజ్ఞానముతో పోల్చికాక,—విషమచక్రముపైనే ఆధారపడిన సూత్రములచేతనే ఋజువుచేయబడుట వింతలకెల్ల వింత. మన సమస్తజ్ఞానము అసమగ్రమైనదని తన్నుతాను ఋజువు చేసికొనుచున్నదనుట సుస్పష్టము. మన జ్ఞానములోని వైచిత్ర్యమిది. ఇది యథార్థజ్ఞానము కాదనుటకు గూడ వీలుకాదు; సత్యమును గుఱించి మనము తెలిసికొనగలిగినదంతయు, భావింపగలిగిన దంతయు ఈ జ్ఞానపరిధిలోనిదే. వ్యావహారిక ప్రయోజన సాధనకిది చాలదనిగూడ చెప్పజాలము. బాహ్యాభ్యంతర ప్రపంచములను తన పరిధిలోకి తీసికొను నీ మానవజ్ఞానమునకు ''మాయ'' అనిపేరు. ఈ జ్ఞానము నిర్దుష్టముకాదని తన్నుతానే ఋజువుచేసికొనుచున్నందున నిది యథార్థమునుగాదు; మానవునిలోని పశుజీవితమునకు కావలసినదెల్ల సాధించగలదు గనుక నిది యథార్థమే.

బాహ్యప్రపంచములో "మాయ" ఆకర్షణ, నిరాకరణ రూపములలో వ్యక్తమగుచున్నది. లోపలి ప్రపంచములో నది ప్రవృత్తి నివృత్తి—కామము, నిష్కామము రూపములు దాల్చుచున్నది. అఖిలవిశ్వము శీఘ్రగతిని ముందుకు పరుగిడిపోవుచున్నది. ప్రతి అణువు తన కేంద్రమునుండి యెగిరిపోవుటకు ప్రయత్నించుచున్నది. మానసప్రపంచమున ప్రతిభావన స్వాధీనము తప్పిపోవుటకు యత్నించుచున్నది. బాహ్యజగత్తులో ప్రతియణువును కేంద్రగామియైన మఱియొకశక్తి వశముచేసికొని కేంద్రమునకు గొనివచ్చుచున్నది. అదేవిధముగా భావప్రపంచమున బహిర్ముఖమగుచున్న ఈ సకల కామనలను నిగ్రహశక్తి అదుపులో పెట్టుచున్నది.

భౌతికతత్త్వమునకు బద్ధులము కావలెనను కోర్కె, అనగా—యంత్రప్రాయముగా కార్య కలాపములు సాగించు స్థాయికి అధికాధికముగా నీడ్వబడు ప్రవృత్తి—మానవునిలోని జంతుప్రవృత్తికి సంబంధించినది. ఇంద్రియముల కధీనమగు బంధమును త్రెంచుకొనవలెనను కాంక్ష కలుగునప్పుడే మానవ హృదయములో మతము ప్రారంభమగును. మానవుడు ఇంద్రియబద్ధుడు కాకుండ నివారించుట, అతని స్వాతంత్ర్యస్థితిని నిరూపించుటయందతనికి సహాయపడుట; ఇవి మతమువలన కలుగగల ప్రయోజనములు. ఈ లక్ష్యసాధనకు నివృత్తిశక్తివలనకలుగు ప్రథమ ప్రయత్నమునకు "నీతి" యనిపేరు. ఈ పతనమును నివారించుట, ఈ బంధమును ఛేదించుట ఇవి "నీతి"కి లక్షణములు. సకల నీతిశాస్త్రమును విధినిషేధములుగా విభాగము చేయవచ్చును. "ఇదిచేయుడు" అనిగాని "అదిచేయకుడు" అనిగాని అది యాదేశించుచుండును. "చేయకుడు" అని యది చెప్పునదుప్పుడది మానవుని బానిసగాచేయు నొకానొక కోర్కె నదుపులోపెట్టుచున్నదని తేటతెల్లమగుచున్నది. "చేయుడు" అని యాదేశమిచ్చునప్పుడది స్వాతంత్ర్యమునకు దారి చూపుచు, మానవహృదయము నధీనము చేసికొనియున్న ఒకానొక దౌర్బల్యమును ధిక్కరించుచున్నది.

మానవుడు పొందదగు ముక్తస్థితియొకటి యున్నప్పుడే "నీతి" సాధ్యమగును. సర్వతంత్ర స్వతంత్రమైన పరిపూర్ణ ముక్తస్థితి పొందు విషయమటుంచినను, అఖిలవిశ్వము వ్యాకోచము చెందుటకు, ముక్తమగుటకు ప్రయాసపడుచున్నమాట నిస్సంశయము. ఈ యనంతాకాశ మొక్క అణువునకుకూడ చాలదు. పరిపూర్ణ ముక్తస్థితి పొందువఱకు వ్యాకోచమునకై నిరంతరము పోరాటము సాగుచుండవలసినదే. దుఃఖనివారణకు, సుఖసాధనకు స్వాతంత్ర్యసమరము సాగుచున్నదని చెప్పుటతగదు. అటువంటి జ్ఞానమేమియు లేని అధమాధమస్థితియందున్న జీవులుగూడ వ్యాకోచమునకై పోరాటము సాగించుచున్నవి; ఆ జీవుల వ్యాకోచఫలితమే మానవుడని పలువురి యభిప్రాయము.



# ఆత్మ, దేవుడు, మతము

పూర్వ మనేకశతాబ్దముల కాలము ఘోషించిన వాణి పరంపరగా శ్రుతిగోచరమగుచున్నది; హిమశైలములలోను, సాంద్రారణ్యములలోను వాసముచేసిన ఋషీశ్వరులు పలికిన వాణియది: సెమెటిక్ జాతులకు వినిపించిన వాణి; బుద్ధుడు, తదితర ఆధ్యాత్మిక ప్రతిభా సంపన్నులద్వారా ప్రసారమైనవాణి; ఆదిమానవునికి తోడ్పడిన వెలుగులో మానవు డెక్కడకు వెళ్లిన అక్కడ ప్రకాశించుచు ఎల్లకాల మతనితోనుండు వెలుగులో,—నివసించువారినుండి బహిర్గత మగుచుండు వాణి——నేటికిని మనకు వినబడుచున్నది. ఆ వాణి పర్వతములలోపుట్టు సెలయేరులవంటిది. అదృశ్యమైనట్లే తోచుచుండును. మరల ఉద్ధృతముగా ప్రవహించుచుండును. చివరకిట్టి వనేకముకలిసి గంభీరరూపము దాల్చును. సకలజాతులకు, తెగలకు చెందిన ప్రవక్తలనుండి, మహాపురుషులనుండి మనకు వచ్చుచున్న సందేశములు కలసిపోయి, పూర్వపు శృంగధ్వనిగా మనకు వినబడుచున్నవి. అది మన కందజేసెడి మొదటి సందేశమిది: "మీకు, సకలమతములకు మంగళమగుగాక". అది విరోధమును పురికొల్పు సందేశముగాదు; మత సమన్వయమును గుఱించిన సందేశమది; అది శాంతిసందేశము.

మన మీ సందేశమును తొలుత పరిశీలింతము. ఈ శతాబ్దారంభమున మతమున కంత్యకాలము సమీపించినదను భయము కలిగినది. సమ్మెట దెబ్బలకు పింగాణి సామగ్రి పొడిపొడియగునట్లు వైజ్ఞానిక పరిశోధనలకు ప్రాతకాలపు మూఢవిశ్వాసములు తుత్తునియలై పోవుచుండెను. మతమనగా సిద్ధాంతముల ప్రోవు, అర్థములేని కర్మకలాపములు మాత్రమే అని భావించినవారు నిస్పృహకు గుఱియైరి; ఏమిచేయుటకు వారికి పాలుపోలేదు. సమస్తము చేతినుండి జారిపోవుచుండెను. అజ్ఞేయవాదము, భౌతికవాదము సర్వమును తుడిచిపెట్టు

కొనిపోకతప్ప దనునట్లొకప్పుడు తోచెను. ఆ పరిస్థితులలో మనస్సు లోని మాట పైకి చెప్పుకొనుటకు సాహసించలేనివారుండిరి. మతము నిక పట్టుకొని (వేలాడుట నిష్ప్రయోజనమనియు, అది శాశ్వతముగా నశించినట్లే అనియు పలువురు భావించిరి. అయితే, త్వరలోనే కథ అడ్డము తిరిగినది. రక్షణసాధనము దొరకినది. ఆ సాధనమేమి? వివిధమతముల అధ్యయనము, వాని తారతమ్య పరిశీలన. వివిధమత ముల పరిశీలనవలన వానియన్నిటి ముఖ్యవిషయ మొక్కటే అని మనకు బోధపడినది. బాలుడనుగా నున్నప్పుడు ఈ సందేహము నాకును కలిగినది. మతమునుగుఱించి ఆశ పూర్తిగా వదలుకొనవల సినదే అని ఒకప్పుడు తోచినది. అదృష్టవశమున నేను క్రైస్తవ మతము, మహమ్మదీయమతము, బౌద్ధమతము, తదితర మతములను అధ్యయనము చేసితిని. నామతమే ప్రాతిపదిక సూత్రములను బోధిం చెనో వానినే సకలమతములు బోధించెనని గ్రహించినప్పుడు నా ఆశ్చర్యమేమని చెప్పను? నా కిట్లు తోచినది: 'ఏది నిజము?' అని నేనను కొంటిని. ఈ జగత్తు నిజమేనా? నిజమే. ఎందువలన? నేను చూచుచున్నాను కనుక. మనమిప్పుడు వినిన శ్రావ్యమైన శబ్దములు (గాత్ర, వాద్య సంగీతము) నిక్కములేనా? ఎందుచేత? మనము విని నాము గనుక. నరునకు దేహము, కన్నులు, చెవులు, మనకు కన బడని ఆత్మతత్త్వము గలవని మనకు తెలియును. అతడు ఆధ్యాత్మిక చింతతో విభిన్నమతముల నధ్యయనము చేయవచ్చును; భారత దేశములోని అడవులలో బోధించినను, క్రైస్తవదేశములో బోధించి నను ప్రధానవిషయములన్నిటిలో మతములన్నియు ఏకీభావము కలి గినవేయని తెలిసికొనవచ్చును. దీనినిబట్టి మతము మానవ మన స్తత్వ మునుబట్టి విధిగా అవసరమని రూఢియగుచున్నది. ఒక మతము నిజమా కాదా అను విషయ మితర మతములపై ఆధారపడియుండును. ఉదా హరణము గమనింపుడు: నాచేతికి ఆఱు(వేళ్లున్నయెడల మఱెవ్వారి కావిధముగా లేనిచో నిది విపరీతమని మీరనగలరు. ఈ యుక్తినే,

ఏదోఒక్క మతముమాత్రమే సత్యము, తక్కిన మతములన్నియు అసత్యములను వాదమునకు కూడ ప్రయోగించవచ్చును. ఒక్కరికి ఆఱువ్రేళ్లున్నట్లుగానే ప్రపంచములో ఒక్కమతమే ఉండదగుననుట అస్వాభావికము, కనుక ఒకమతము సత్యమేయగుచో అన్నిమతములు సత్యమేయగును. అప్రధాన విషయములలో భేదములున్నవి ; కాని, ప్రధానవిషయములలో అవన్నియు ఒక్కటే. నా అయిదువ్రేళ్లు స్వాభావికమే యగుచో మీా అయిదువ్రేళ్లుగూడ స్వాభావికమే. మానవు డెక్కడనున్నను విశ్వాసమును, ఆధ్యాత్మికస్వభావమును వృద్ధిచేసికొనవలెను.

లోకములోని వివిధమతముల పరిశీలనవలన నేను గ్రహించిన మఱొకవిషయ మిది : ఆత్మను గుఱించి, దేవునిగుఱించి మూడు దశలకుచెందిన యభిప్రాయములు గలవు. మొదట, నశ్వరమైన దేహమునకు భిన్నముగా అనశ్వరమైన భాగము మానవునియందు గలదని సమస్తమతము లంగీకరించుచున్నవి. అది శరీరముతోపాటు మార్పు చెందునదికాదు, నిత్యమైనది. కొంతకాలము కృతము స్థాపింపబడిన మతములుకొన్ని మానవునిలో అనశ్వరమైన వస్తువు కలదని యంగీకరించుచు, దానికి పుట్టుక కలదని బోధించుచున్నవి. పుట్టుక గలదానికెల్ల ముగింపు విధిగాకలదు. మనకు—మనలోని ప్రధానవస్తువుకు ఆదియనునది లేదు ; దానికి తుదియనునదిగూడ లేదు. ఎల్లరపై ఈ నిత్యవస్తువున కతీతముగా అంతములేని శాశ్వత పురుషుడున్నాడు — దేవునిగుఱించియు జగత్తు ప్రారంభమును గుఱించియు మానవుని ప్రారంభమును గుఱించియు జనులు చెప్పు చుందురు. ప్రారంభమనగా కల్పమునకు ప్రారంభమని యర్థము. అఖిల విశ్వమునందలి మూలతత్త్వమునకు ప్రారంభమను అర్థ మెచ్చటను లేదు : సృష్టికి ప్రారంభముండుట యసంభవము. కాలమునకు ప్రారంభమును మీాలో నెవ్వరును భావింపజాలరు. ఆది కలదానికెల్ల అంతము గలిగి తీఱవలసినదే. "నేనుగాని మీారు

గాని లేనికాల మెప్పుడును లేదు. మనలో నెవ్వరము ఉండబోని సమయము కూడ లేదు'' అని భగవద్గీత ప్రవచనము. సృష్టి ప్రారంభమని ఎక్కడ ప్రస్తావింపబడినను కల్పమునకు ప్రారంభ మనియే యర్థము; మీ దేహము నశించును; కాని మీ యాత్మ యేనాటికిని నశింపదు.

ఆత్మనుగుఱించిన ఈ యభిప్రాయముతో పాటు దానిపరిపూర్ణత్వమునుగుఱించిన యభిప్రాయములు కొన్ని కలవు. ఆత్మ స్వతస్సిద్ధముగా పరిపూర్ణమే. ప్రారంభమున మానవుడు పరిపూర్ణుడుగా నుండెనని హీబ్రూల క్రొత్త నిబంధన అంగీకరించుచున్నది. మానవుడు తన చేష్టలవలననే అపవిత్రు డయినాడు. అతడు తన పూర్వపు పవిత్రతను తిరిగి పొందవలసియున్నాడు. కొంద ఱీవిషయమును ఆలంకారికముగాను, కథలతోను, చిహ్నములతోను చెప్పుదురు. ఈ వాక్యములను మనము సహేతుక పూర్వకముగా పరిశీలించినప్పుడు, ఆత్మ స్వతస్సిద్ధముగా పవిత్రమైనదనియు, మానవుడు తిరిగి అట్టిస్థితి పొందవలసి యున్నాడనియు అవి బోధించుచున్నట్లు తెలియగలదు. అ దేవిధముగా సాధ్యము? దేవుని తెలిసికొనుటవలన. ''కుమారునిద్వారా కాక మఱొకవిధముగా దేవుని ఎవరును దర్శింపజాలరు'' అని హీబ్రూ బైబిల్ ప్రవచించుచున్నది. దాని యర్థమేమి? దేవుని దర్శించుటే మానవ జీవితమునకు పరమలక్ష్యము, చరమగమ్యము. జనకునిలో మనము ఐక్యమగుటకు ముందు పుత్త్రుని యర్హత పొందవలెను. మానవుడు తన పవిత్రతను తన చేతలవలననే కోల్పోయినాడను విషయమును విస్మరింపకుడు. మన బాధలకు కారణము మన చేతలే. అందుకు దేవుడు నింద్యుడు కాడు. ఈ భావములతో సన్నిహితసంబంధము గలిగినదే పునర్జన్మసిద్ధాంతము. ఐరోపియనులు విరుపులతో మార్పులు చేయకముందు ఈ సిద్ధాంతము సర్వజనీనమైనదే.

పునర్జన్మ సిద్ధాంతమునుగుఱించి మీలో కొందఱు విని, యుపేక్షించి యుండవచ్చును. ఇది ఆత్మ నిత్యత్వమునకు సన్నిహితముగా

సంబంధించినది. అంతముకలిగి ఆదిలేనిదిగాని, ఆదికలిగి యంతము లేనిదిగాని ఏదియు లేదు. మానవాత్మకు ప్రారంభము కలదనెడి విపరీత వాదమును మనము విశ్వసింపజాలము. పునర్జన్మ సిద్ధాంతము ఆత్మ స్వాతంత్ర్యమును రూఢిపఱచును. కారణ రహితమైన ప్రారంభము కలదనుకొందము. అంతట మానవునిలోని సమస్త అపరిశుద్ధతకు బాధ్యత పూర్తిగా దేవునిపై బడదా? సర్వ దయాపరుడయిన తండ్రి ప్రపంచములోని పాపములకు బాధ్యుడగును! పాప మీ విధముగా పుట్టుచో ఒకరు మఱొకరికంటె ఎక్కువగా బాధపడనేల? అఖిల జీవ దయాపరుడయిన భగవంతుని నుండియే యది వచ్చుచో నింతటి పక్షపాతమేల? లక్షలకొలది జనులు పాదములక్రింద నలిగిపోవు చున్నారెందుకు? దారిద్ర్యమున కేనాడును కారకులు కానివారు తిండిలేక పస్తులుండవలసివచ్చుట కేమి హేతువు? అందుకు బాధ్యత ఎవరిది? అందుకెవరు కారకులు కానియెడల దేవుడే బాధ్యుడని తలపవలెను. కనుక ఎవరి కష్టములకు, దుఃఖములకు వారే బాధ్యులని చెప్పుటే సమంజసము. నేను గాడిలో చక్రమును దొర్లించిన యెడల అందువలనకలుగు ఫలితములకు నేనే బాధ్యుడనగుదును. నేను దుఃఖముకలిగింప గలుగుదునేని, దానిని నివారింపగలశక్తి నాకుగలదు. దీనినిబట్టి మనము స్వతంత్రులమని స్పష్టమగుచున్నది. విధియనునది లేదు. మనలను నిర్బంధించునదేదియు లేదు. మనము నిర్మింపగలిగినది నిర్మూలింపగలముకూడ.

ఈ సిద్ధాంతమునకు సంబంధించిన హేతువొకటి కలదు. అది కొంచెము జటిలముగానుండును. కనుక సావధానులరయి వినగోరు చున్నాను. మనకు సమస్తజ్ఞానము అనుభవమువలన కలుగు చున్నది; జ్ఞానమునకు అదియొక్కటియే మార్గము. అనుభవములను నవి చైతన్యస్థాయిమీద కలుగుచుండును. ఇందుకుదాహరణమిది: ఒకడు పియానో వాయించుచుండును. సచేతనముగా నతడు ఒక్కొక్క వ్రేలు ఒక్కొక్క 'కీ' (మెట్టు) మీద పెట్టును. వ్రేళ్లకభ్యాసము కలుగువఱకు అతడీ సాధన చేయుచుండును. తరువాత

ప్రయత్నపూర్వకముగా, ఎఱుకతో ఒక్కొక్క వ్రేలు ఒక్కొక్క 'కీ' మీద పెట్టవలసిన యవసరముండదు. అదేవిధముగా మన యభిరుచులు, ప్రవృత్తులు మనము ఎఱుకతో చేసిన పూర్వకర్మలఫలితమని గ్రహింపగలము. శిశువు కొన్ని విశిష్ట ప్రవృత్తులతో జన్మించును. అవి ఎందుండి వచ్చినవి? ఎటువంటి భావముద్రలు లేక కేవలము తెల్లని కాగితమువంటి మనస్సుతో ఏశిశువు జన్మించుట లేదు. కాగితము మీద నిదివఱకే వ్రాయబడియున్నది. ఖాళీ మనస్సుతో ఏ శిశువు పుట్టుటలేదని ప్రాచీన గ్రీసు, ఈజిప్టు దేశముల తత్త్వవేత్తలు బోధించిరి. ఎఱుకతో ప్రయత్నపూర్వకముగా చేసిన పూర్వకర్మల ఫలితములయిన శతాధిక ప్రవృత్తులతో ప్రతిశిశువు జననమొందును. వానిని శిశువు ఈ జన్మలో అలవఱుచుకొనలేదు. అందువలన వానిని శిశువు గతజన్మలలో నలవఱుచుకొనినదని అనివార్యముగా నంగీకరింపవలసి యుండును. ఈ ప్రవృత్తులు గతకర్మల ఫలితములని కరడుగట్టిన భౌతికవాదిసహిత మంగీకరించును; అయితే అవి వంశరక్తముతో సంక్రమించినవని చెప్పును, ఈ ధర్మముప్రకారము మన తల్లిదండ్రులు, తాతముత్తాతలు, మనదగ్గఱకు వత్తురు. ఈ ఒక్కధర్మముచేతనే ఈ విషయమును క్షుణ్ణముగా వివరించి చెప్పవచ్చుననిన యెడల ఆత్మయందు నమ్మకముండవలసిన అవసరమే లేదు; శరీరము నాధారము చేసికొని సమస్తమునకు సమాధానము చెప్పవచ్చును. భౌతికవాదము, ఆత్మవాదములలోని వివిధయుక్తులలోనికి, చర్చలలోనికి పోవలసినపనిలేదు. వ్యష్ట్యాత్మయందు విశ్వాసముగలవారికి విషయ మిప్పటికి స్పష్టమైనది. సహేతుకమైన నిర్ణయమునకు వచ్చుటకుగాను మనకు పూర్వజన్మలు కలవని అంగీకరింపకతప్పదు పూర్వమందుగాని, వర్తమానమందుగాని ప్రముఖ తత్త్వవేత్తల విశ్వాసమిదే. యూదులకీ నమ్మకముకలదు. ఏసునాథునకీ నమ్మకముగలదు. అతడు బైబిలులో, "అబ్రహాం పుట్టకముందు నే నున్నాను" అనిచెప్పెను. మఱొక

సందర్భమున ఇచ్చటికి వచ్చినట్లు చెప్పబడిన ఎలియన్ ఈ వ్యక్తియే అనెను.

వివిధజాతులవారిలో విభిన్న పరిస్థితులలో, వేర్వేరు సందర్భములలో వర్ధిల్లిన మతములన్నియు ఆసియా ఖండములో పుట్టినవి. వానిని ఆసియావాసులు బాగుగా అర్థముచేసికొనగలరు. మాతృసీమనుండి వెడలి యితర ప్రాంతములకు పోవుటతో అవి దోషభూయిష్ఠములయినవి. క్రైస్తవమతములోని మహోత్కృష్టములయిన ధీరభావములను ఐరోపాలోని వారెన్నడును సవ్యముగా అర్థముచేసికొనలేదు. అందుకు కారణము బైబిలు రచయితలు తెలియజేసిన భావములు, ప్రయోగించిన అలంకారములు ఆ సీమకు క్రొత్త. ఉదాహరణకు మదోనా చిత్తరువులను తీసికొనుడు. ప్రతి చిత్రకారుడు మదోనాను తా నంతకుముందు సొంతముగా ఊహించుకొనిన భావముల కనుగుణముగా చిత్రించును. ఏసుక్రీస్తు కడపటి విందును గురించిన చిత్తరువులను నేను వందలకొలది చూచుచున్నాను. అతడు బల్ల ముందు కూర్చున్నట్లు చిత్రించబడుచుండును. క్రీస్తు ఎన్నడును బల్లముందు కూర్చొనలేదు; అతడందరితో కలసి నేలమీద కూర్చుండెను. గిన్నెలో వారు రొట్టెముంచుకొనిరి—మీరు ఈ దినములలో తినుచున్న రొట్టెవంటిది కాదది. ఏ జాతికిగాని యితర ప్రజల ఆచారముల నర్థముచేసికొనుట కష్టము. శతాబ్దముల తరువాత, ఎన్నో మార్పులు—గ్రీకు, రోమన్ తదితర ప్రభావముల వలన ఎన్నో క్రొత్త చేరికలు—కలిగిన తరువాత యూదుల ప్రాచీన సంప్రదాయములను ఐరోపియను లవగాహనచేసికొనుట మరెంత కష్టమైనపని! మనోహరమైన ఏసునాథుని మతమును, దాని చుట్టు నలముకొనియున్న కథలు, పౌరాణిక గాథలద్వారా జనులు ఈషణ్మాత్రమే గ్రహింపగలుగుటలోను, దాని నాధునిక వ్యాపారసరణికి మార్చివేయుటలోను ఆశ్చర్యము లేదు.

అసలు విషయమునకు వత్తము. మతము లన్నియు ఆత్మ నిత్యమైనదనియు, దాని స్వతస్సిద్ధమైన తేజస్సు తగ్గినదనియు, ఈశ్వరజ్ఞానముచేత దాని పూర్వపు పరిశుద్ధతను తిరిగి పొందవలసి యున్నదనియు బోధించుచున్నవి. ఈ విభిన్న మతములలోగల ఈశ్వరజ్ఞాన మేమి? ప్రారంభమున ఈశ్వరుని గురించిన భావ మస్పష్టముగా నుండెను. బహు ప్రాచీనజాతుల వివిధ దేవతలు గలరు—సూర్యుడు, పృథివి, అగ్ని, వరుణుడు. ప్రాచీనయూదులు దేవతలు పలువురు పరస్పరము భీకరముగా పోరాడుకొనుచున్నట్లు భావించిరి. యూదులు, బాబిలోనియనులు ఎలోహింను పూజించిరి. తరువాత ఒక్క దేవుడు ప్రాబల్యము వహించెను. ఈ భావము ఒక్కొక్క జాతికి ఒక్కొక్క తీరుగా నుండెను. ప్రతిజాతియు తన దేవుడే గొప్ప వాడని ప్రకటించుకొనెను. అంతట పోరాటములతో ఎవరి దేవు డధికుడో నిరూపించుకొనసాగిరి. ఎవరు పోరాటములో అగ్రేసరులో వారి దేవుడు గొప్పవాడు. ఇవియన్నియు దాదాపు ఆటవిక జాతులు. కాలక్రమమున అంతకంతకు మేలయిన భావములు కలుగుచు వచ్చినవి; ప్రాతభావములు పోసాగినవి. అవి యన్నియు పూర్తిగా పోయినవో లేక ప్రాతసామానుల గదులలో చేరినవో! ఆ మతము లన్నియు పెరుగుట కనేక శతాబ్దములు పట్టినవి; ఒక్కటియు ఆకాశమునుండి ఊడిపడలేదు. ఒక్కొక్క మతము ఎంతో కృషి వలన కొంచెము కొంచెముగా మార్పు చెందుచు వచ్చెను. అనంతరము ఏకేశ్వరభావము కలుగ నారంభించెను. దేవుడొక్కడను విశ్వాసము కలిగెను. అతడు సర్వశక్తుడు, సర్వజ్ఞుడు, జగదీశ్వరుడు. ఈ యొక్క దేవుడు జగదతీతుడు; అతడు స్వర్గములో నివసించును. అతనికి అతనిని భావించిన వారి మూఢాభిప్రాయము లారోపింపబడినవి; అతనికి దక్షిణపార్శ్వము, వామపార్శ్వము గలవు. అతని చేతిలో పక్షియున్నది. ఇంకను ఇట్టి భావములెన్నియో గలవు. ఒక్క విషయము స్పష్టమైనది. నాగరకత ఎరుగని తెగల దేవుళ్లు శాశ్వతముగా అదృశ్యులయినారు. వారి స్థానమును జగదీశ్వరు

డొక్క డాక్రమించినాడు: అతడు దేవాదిదేవుడు. అయితే అత డింకను జగదతీతుడే. అతడు దుర్లభుడు; అతని నేదియు సమీపింప జాలదు. క్రమముగా ఈ భావముగూడ మార్పుచెందుచున్నది. దీని తరువాతిదశ దేవుడు జగదంతర్గతుడను భావము.

బైబిలు క్రొత్తనిబంధనములో, "స్వర్గములో నున్న జనకుడు" అని చెప్పబడి యున్నది.—దేవుడు స్వర్గములో నివసించుచు మానవులనుండి వేఱుపడియున్నాడు. మనము పృథివిమీద నివసించుచున్నాము. అతడు స్వర్గములో నివసించుచున్నాడు. తరువాత బోధలో దేవుడు ప్రకృతియందంతర్గతుడుగా నున్నాడని యున్నది; అతడు స్వర్గములోని దేవుడుకాడు; పృథివిమీది దేవుడుకూడ. అతడు మనలోనున్నాడు. మనకు, దేవునికి సాన్నిహిత్యమును సూచించు నిట్టి భావము హిందూ తత్త్వశాస్త్రములో గలదు. అయితే మేము ఆ దశతో నిలిచిపోలేదు. అద్వైతమును ప్రతిపాదించు మఱొక దశకలదు. ఈ దశలో మానవుడు తా నుపాసించుచున్న దేవుడు స్వర్గములోను, పృథివిమీదనునుండు జనకుడుమాత్రమే కాడనియు, "నేను,నా జనకుడు ఒక్కరమే" అనియు తెలిసికొనును. అతడు తన ఆత్మయందు తాను దేవుడేయను సత్యమును సాక్షాత్కరింప జేసికొనును; తాను దేవునికె తక్కువస్థాయిలోని ప్రకాశమని గ్రహించును. నాలోని సత్యమేదో అది యతడే; అతనిలోని సత్యమంతయు నేనే. దేవునికి మానవునకు గల భేద మీవిధముగా తొలగింపబడినది. దేవుని తెలిసికొనుటవలన మనలోని స్వర్గరాజ్యము నీ విధముగా దర్శింపగలుగుదుము.

ద్వైతభావము ప్రాథమికదశ. ఆ దశలో మానవుడు తానొక చిన్న వ్యక్తిత్వముగల ఆత్మనని గ్రహించును. జాన్, లేక జేమ్సు లేక టాం అనుకొనును. "నే నెల్లకాలము జాన్ లేక జేమ్సు లేక టాంగా నుందునని పలుకును ; ఇంకేమియు కానని చెప్పును." హంతకుడుగూడ ఈ విధముగానే పలుకవచ్చును. "నేను శాశ్వతముగా

హంతకుడనుగానే ఉందును'' అనును. కాని, కాలము గడచినకొలదియు టాం అదృశ్యుడయి మొట్టమొదటి పరిశుద్ధమైన ఆదాములో చేరిపోవును.

''నిర్మలహృదయులు ధన్యులు: వారీశ్వరదర్శనము పొందుదురు.'' మన మీశ్వరుని దర్శింపగలమా? సందేహమెందుకు? దర్శింప లేము. మనము దేవుని తెలిసికొనగలమా? సంశయమేల? తెలిసికొన లేము. దేవుడు తెలిసికొనబడువాడగుచో అతడు దేవుడే కాడు. తెలిసికొనుట అవధికలదనుట. ''నేనును నా తండ్రియు ఒక్కరమే; సత్యమును నా యాత్మయందు కాననగును.'' ఈ భావములు కొన్నిమతములలో స్పష్టీకరింపబడినవి. మఱికొన్నిటిలో సూచింపబడినవి. కొన్నిటిలో అవి తీసివేయబడినవి. ఏసునాథుని బోధ లిప్పు డీదేశములో కించిన్మాత్రముగానే అవగాహము చేసికొనబడినవి. మీరు క్షమించెడి పక్షమున అవి యెన్నడును చక్కగా గ్రహింపబడలేదని చెప్పగలను.

పరిశుద్ధతను, పరిపూర్ణత్వమును పొందుటకు వికాసములోని వివిధదశలు అవసరములే. విభిన్నమత విధానములు అట్టడుగున ఒకే భావములు ప్రాతిపదికగాను ప్రతిష్ఠితమైనవి. ''స్వర్గరాజ్యము మీలో నున్న''దని జీసస్సు వక్కాణించినాడు. మరల, ''స్వర్గమందున్న నా జనకుడు'' అని యతడనినాడు. ఈ రెండువాక్యములకు సమన్వయ మెక్కడ? ఇక్కడ, ఈ విధముగా, కడపటివాక్యము పలుకునప్పు డతడు విద్యాగంధములేని జనబాహుళ్యముతో, మతవిజ్ఞానము లేనివారితో ముచ్చటించుచుండెను. వారి భాషలో సంభాషించుట అవసరమైనది. జనసామాన్యము స్పష్టమైన భావములు, ఇంద్రియగ్రాహ్యమైన విషయములు కోరును. ఒకడు లోకోత్తరుడయిన తత్త్వవేత్త అయియుండవచ్చును; కాని, మతవిషయమున బాలుడే కావచ్చును. ఆత్మాభివృద్ధి విశేషముగా పొందినవారు స్వర్గరాజ్యము తమలో గలదని గ్రహింపగలరు. అదే నిజమైన మానసరాజ్యము.

ప్రతిమతములోను స్థూలదృష్టికి గోచరించు పరస్పర వైరుధ్యములు, క్లిష్టమైన అన్వయములుగా తోచు భావములు ఆత్మవికాసమునందు వివిధదశలను సూచించును. కనుక ఎవరిమతమునుగాని దూషించుటకు మనకు హక్కులేదు. రూపకల్పనలు, చిహ్నములు అవసరమగు దశలుగలవు; ఆ దశలలో ఆత్మ నర్థము చేసికొనగల భాషలవి.

నేను మీకు మఱొక విషయము చెప్పదలచుకొన్నాను: మతము సిద్ధాంతములలోను, నమ్మకములలోను లేదు. మీ రేమి చదువుదురో, ఏ సిద్ధాంతములను నమ్ముదురో అది ముఖ్యముకాదు. మీ రేమి యగుదురో అది ముఖ్యము. "నిర్మలహృదయులు ధన్యులు; వా రీశ్వరదర్శనము పొందుదురు". ఔను. ఈ జీవితములోనే. అదే ముక్తి. మాటలప్పగించుటచేత నిట్టిది సాధ్యముకాగలదని చెప్పుచున్నవారున్నారు. కాని, ముక్తిపొందుటకు బాహ్యరూపము లవసరమని లోకోత్తరులయిన బోధకులెవ్వరు చెప్పలేదు. దానిని పొందగల శక్తి మనలోనేయున్నది. మనము దేవునియందే నివసించుచున్నాము, విహరించుచున్నాము. మతసిద్ధాంతములవలన మతశాఖలవలన ప్రయోజన ముండనేయున్నది. అవి బాలురకొఱకుకలవు. వాని ప్రయోజనము తాత్కాలికము. గ్రంథములవలన మతములు స్థాపనకావు. మతములు గ్రంథములకు కారణమగుచున్నవి. ఈ విషయము మనము విస్మరింపరాదు. ఏ గ్రంథము భగవంతుని సృష్టింపలేదు. భగవంతుడే అనేక ఉద్గ్రంథముల రచనకు త్తేజము కలిగించినాడు. ఆత్మవస్తువునుకూడ ఏ గ్రంథము సృష్టింపలేదు. ఇది మనము మఱచిపోరాని ముఖ్యాంశము. ఆత్మయందు దేవుని సాక్షాత్కారము పొందుటే సమస్తమతముల లక్ష్యము. అదొక్కటే సర్వజనీన మతము. సకలమతములలోను సర్వజనీన సత్యమేదేని కలదేని అది యిది— దేవుని సాక్షాత్కారము పొందుటే. ఆశయములు, విధానములు వేఱుకావచ్చును; కాని, అత్యంతప్రధాన విషయమదే. వ్యాసార్థములు (రేడియై) భేదముగా నుండవచ్చును; కేంద్రము మాత్ర

మొక్కటే. విభిన్నములయిన వ్యాసార్థములు వేయియుండవచ్చును ; అవన్నియు కేంద్రములో కలియవలసినదే. అదే, ఈశ్వర సాక్షాత్కారము : ఇంద్రియగోచరమగు జగత్తునకు వెనుక—సర్వదా తినుటతో, త్రాగుటతో, అవ్యక్తప్రలాపములతో, వంచనతో, స్వార్థపరత్వముతో కూడిన జగత్తునకు వెనుకనున్నది మతము. అది యన్ని గ్రంథములకు, సకలసిద్ధాంతములకు, లోకములోని భేషజమునకు అతీతముగా నున్నది. ఒకడు లోకములోని మతసంస్థలన్నిటిని నమ్మవచ్చును. ఇంతవఱకు రచింపబడిన సమస్త మతగ్రంథములన్నియు అతడు తన మస్తిష్కములో మోయుచుండవచ్చును. పృథివి మీద ప్రవహించుచున్న సర్వ నదీనదములలో అఘమర్షణస్నానము చేయవచ్చును. కాని, అతడీశ్వరదర్శనము పొందినవాడు కానిచో నేనతనిని కరుడుగట్టిన నాస్తికునిగానే భావింతును. ఒకడు చర్చికిగాని, మసీదునకుగాని ఏనాడును వెళ్లియుండకపోవచ్చును. మతకర్మకలాపములేవియు చేసియుండకపోవచ్చును. కాని, అతడు తన అంతరంగములో ఈశ్వరుని ఉనికిని సంభావించుచు, తన్మూలమున జగత్తులోని అసత్యమున కతీతుడగునేని, అతడు మహాత్ముడు, సన్న్యాసి. మీరతనికి ఏ పేరు పెట్టినను సరే. ఎవడుగాని తాను చెప్పునదే నిజము, తనమతమే నిజము, తక్కిన మతములన్నియు తప్పులకుప్పయని పలుకునేని అతడే తప్పులకుప్పయగును. ఇతరుల సత్యముపై తనసత్యమాధారపడియున్నదని అతనికి తెలియుటలేదు. అఖిల మానవకోటి యెడల ప్రేమ. కరుణ—ఇవియే నిజమైన మతమునకు లక్షణములు. మానవులందఱు సోదరులే అని క్షణిక భావావేశముతో చెప్పుటకాక, మానవకోటి జీవిత మఖండమని ప్రత్యక్షసత్యముగా గ్రహింపవలెను. ఎవ్వరిని నిషేధించనంతవఱకు అన్ని మతసిద్ధాంతములు, మతశాఖలు నావే ; అవన్నియు ఉత్కృష్టమైనవే. అవన్నియు మానవులకు నిజమైన మతానుభవము కలిగించుటకు సహాయపడుచున్నవి. మఱొక

మాట మనవిచేసెదను. మతజీవితము దేవస్థానమందు ప్రారంభమగుట మంచిదే. కాని అందే యాగిపోయి, అది పరిసమాప్తమగుట మంచిదికాదు. శిశువుగా జన్మించుట మంచిదే. ఎల్లకాలము శిశువుగా ఉండిపోవుట మంచిదికాదు. ఛర్చులు, మతకర్మలు, చిహ్నములు, బిడ్డలకొఱకు. శిశువు పెద్దగా పెరిగినతరువాత తాను ఛర్చిని పడగొట్టవలెను. లేదా, తాను బయటికి రావలెను. మనమెల్లకాలము పసిబిడ్డలముగా ఉండతగదు. ఆక్రియ ఒకేకోటును అన్నిదశలకు అన్నిసైజులకు సరిపుచ్చుటకు ప్రయత్నించుటవంటిది. మత సంప్రదాయములను నేను విమర్శించుటలేదు, అవిభగవానునికొఱకు మఱి రెండుకోట్లుఉన్ననుసరే. అవెక్కువగానున్న చో ఎవరికి వారు తమకు కావలసినదాని నేరుకొనుట కెక్కువ అవకాశముండును. అందఱకు ఒకేమతమును సరిపుచ్చుటమాత్రమే నా యభ్యంతరము. మతములన్నియు ప్రధానముగా ఒకటే అయినను, వివిధజాతులలో, విభిన్నపరిస్థితులలో పెరుగుటవలన కలిగిన స్వరూపభేదము లుండితీఱవలసినదే. బాహ్యలక్షణములకు సంబంధించినంతవఱకు మనలో ఒక్కొక్కరికి ఒక్కొక్క విశిష్టమతముండవలెను.

చాల సంవత్సరముల క్రితము మాదేశములోని ఒక మహర్షిని నేను దర్శించితిని; అతడు మహాత్ముడు. దైవదత్త గ్రంథములయిన మా వేదములను గుఱించి, మీ బైబిల్‌ను గుఱించి, కొరాన్‌ను గుఱించి మేము స్థూలముగా ముచ్చటించితిమి. సంభాషణ ముగిసిన పిదప ఆయన బల్లదగ్గరకు వెళ్లి, అక్కడి పుస్తకము తీయుమని నాతో పలికెను; దానిలో ఎన్నియో యితర విషయములతోపాటు, ఆ సంవత్సరములో వర్షపాతమెట్లుండునో పేర్కొనబడియున్నది. అందున్న విషయము చదువుమని ఆయన కోరెను. ఎంతవర్షము పడునని వ్రాసియుండెనో చదివితిని. ఆయన "ఇప్పుడు పుస్తకమును నలిపి, పిండివేయుము" అనెను. అట్లే చేసితిని. ఆయన "ఏమి అబ్బాయి! ఒక్క నీటిచుక్కయయినను రాలలేదే? నీరు రానంతవఱకు అది కేవలము

పుస్తకమే, మఱేమియుగాదు. ఆ తీరుననే భగవత్సాక్షాత్కారము కలుగనంతవఱకు నీమతము నిష్ప్రయోజనమే. ఎవరు ఆశయరహితగ్రంథపఠనము మాత్రము చేయుచుందురో వారు చక్కెర బస్తాలను మోసికొనిపోయిన గాడిదకథను జ్ఞాపకము చేయుదురు. మోయలేని చక్కెర బస్తాల బరువును మోసిన గాడిదకు చక్కెర రుచి కొంచెమయినను తెలియదు.'' అనెను.

మోకరించి, ''మేమెంతటి పాపులము!'' అని ఎలుగెత్తి కేకలు పెట్టుడని మానవకోటికి మనము సలహానిచ్చుట మంచిదా! వలదు. దానికి బదులు వారి దివ్యత్వమును జ్ఞాపకముచేయుదము. అది మేలు. ఒక కథ చెప్పెదను : ఆహారముకొఱకు వెదకుచున్న ఆడుసింగ మొకటి ఒకప్పుడు గొఱ్ఱెలమందపై బడెను. ఒకగొఱ్ఱెపై పడుట తోడనే సింహము కూననుకని వెంటనే చనిపోయినది. సింహపుపిల్ల గొఱ్ఱెలతో కలసిమెలసి, గడ్డి మేయుచు, గొఱ్ఱెవలె అఱచుచు పెరుగుచుండెను. ఒక నాడొకసింహము దారినిపోవుచుండగా గొఱ్ఱెల మందను చూచెను. మందలోని సింహము గడ్డి మేయుట, గొఱ్ఱెవలె అఱచుట గమనించి అది ఆశ్చర్యపడెను. దానిని చూడగనే గొఱ్ఱెలు, వానితోపాటు పెరిగిన సింహము భయపడి పాఱిపోయినవి. సింహము సమయముకొఱకు వేచియుండి ఒకనాడు గొఱ్ఱెలతో పెరిగిన సింహము నిద్ర పోవుచుండగా సమీపించి లేవగొట్టి ''నీవు సింహమవు' అనెను. నిద్రలేచి యది, ''కాను'' అని గొఱ్ఱెవలె అఱవసాగెను. అంతట సింహము దానినొక కొలనుదగ్గఱకు గొనిపోయి, ''నీటిలో నీరూపుచూచుకొనుము. నీరూపు నన్ను పోలిలేదా!'' అని యడిగెను. అది నీటిలో స్వరూపమును గుర్తించి ఔననెను. క్రొత్తగా వచ్చిన సింహము గర్జించి, తనవలె గర్జింపుమని గొఱ్ఱె వైఖరిగల సింగముతో ననెను. కొంతసేపు ప్రయత్నించి గొఱ్ఱెసింహము అది క్రొత్తగా వచ్చిన సింహముతో సమానముగా భీకరగర్జనలు చేయసాగెను. అదియాక్షణమునుండియు గొఱ్ఱె యలవాట్లను విడిచిపెట్టెను.

మిత్రులారా! మీరు సింహములని తెలుపుటే నా యభిమతము.

గది చీకటిగానున్న యెడల, "చీకటి, చీకటి" అని మీరు రొమ్ములు బాదుకొనుచు, రోదనముచేయుచు నిటునటు పరుగిడెదరా? దీపము వెలిగించుటే అప్పటి కర్తవ్యము. వెలుగురాగానే చీకటిపోవును. మీ కతీతముగానున్న పరంజ్యోతి కావలెననుచో మీలోని ఆత్మజ్యోతిని వెలిగింపుడు. అదే మార్గము. అంతట పాపము, అపవిత్రత పాఱిపోవును. మీలోని దివ్యత్వమును సంస్మరించుచుండుడు; క్షుద్రప్రవృత్తులను గాదు.

*  *  *  *

తరువాత కొన్ని ప్రశ్నలు వేయబడినవి; వానికి సమాధానములు చెప్పబడినవి.

సభాసదులలో ఒకరిట్లనిరి: "మతాచార్యులు నరకాగ్నిని గుఱించి చెప్పుట మానివేసినయెడల వారియందు ప్రజలకు లక్ష్యముండదు."

సమాధానము: అట్టి లక్ష్యము లేకపోవుటే మంచిది. భయముచేత మతానుష్ఠానమునకు గడంగువారికి మతమే లేదు. ప్రజలకు వారిలోని క్షుద్రప్రకృతిని గుఱించిగాక, వారిలోని దివ్యప్రకృతిని గుఱించి బోధించుట మంచిది.

ప్రశ్న: స్వర్గరాజ్యము ఈ ప్రపంచమునకు చెందినది కాదని చెప్పిన ప్రభువు పలుకులోని భావమేమి?

సమాధానము: స్వర్గరాజ్యము మనలో నున్నదని భావము. స్వర్గరాజ్యము పృథివిపై ఏర్పడునదని యూదుల భావము. జీసస్సు భావ మదికాదు.

ప్రశ్న: మనము జంతువులలోనుండి వచ్చితిమని మీరు నమ్మెదరా?

సమాధానము : క్రమపరిణామ ధర్మము ననుసరించి ఉత్తమజీవులు దిగువస్థాయినుండి వికసించినవని నేను నమ్ముదును.

ప్రశ్న : పూర్వజన్మ జ్ఞాపకమున్నవారెవరి నయిన మీరెఱుగుదురా?

సమాధానము : తమ పూర్వజన్మ స్మృతికలదని చెప్పిన కొందఱిని నేను కలిసికొంటిని. తమ పూర్వజన్మలను జ్ఞాపకమునకు తెచ్చుకొనగల స్థాయిని వారందుకొనిరి.

ప్రశ్న : క్రీస్తును సిలువమీాద చంపివేసిరని మీరు నమ్మెదరా?

సమాధానము : క్రీస్తు దేవునియవతారము; వారతనిని చంపలేక పోయిరి. వారు చంపినది క్రీస్తు ఆకృతిని, ఆభాసమును.

పశ్న : అట్టి యాభాసము నతడు కల్పించినచో, అది మహిమలలో కెల్ల మహిమ కాదా?

సమాధానము : మహిమలు సత్యపథమునకు పెద్ద ప్రతిబంధకములని నేను భావింతును. బుద్ధుని శిష్యులాయనతో ఒక మహిమ యనబడెడి క్రియను—గిన్నెను స్పృశింపక చాల ఎత్తునుండి చేపట్టుట యనుక్రియను—చేసిన వానిని గుఱించి చెప్పి, గిన్నెను చూపిరి. వెంటనే బుద్ధుడు దానిని కాలిక్రింద త్రొక్కి-వేసెను. మహిమలను పురస్కరించుకొని విశ్వాసము నల వఱచుకొనవలదనియు, శాశ్వత ధర్మసూత్రములలోని సత్యమును గ్రహింపవలసినదనియు బుద్ధుడు శిష్యులతో చెప్పెను. అతడు వారికి నిజమైన లోవెలుగును—ఆత్మజ్యోతిని గుఱించి బోధించెను. మనము సురక్షితముగా విశ్వసించి అనుసరింపదగు జ్యోతియదే. మహిమలు మనకవరోధములు. వానిని ప్రక్కకు త్రోసివేయుదము.

ప్రశ్న : జీసస్సు పర్వతముమీాద ధర్మోపదేశము చేసెనని మీరు నమ్ముదురా?

సమాధానము : పర్వతముమీదఆతడు ధర్మబోధ చేసెననియేనమ్ము దును. ఈ విషయములో నే నితరులవలెనే గ్రంథముల నాధారము చేసికొనవలసినదే. కేవలము పుస్తకప్రమాణము చాలదని నేనెఱుగుదును. పర్వతముమీది ధర్మబోధలోని విషయములను మార్గదర్శకముగా గ్రహించుట మనందఱకు క్షేమము. మన అంతరాత్మకు సంతృప్తి కలిగించు దానిని మనము స్వీకరింపవలెను. బుద్ధుడు ఏసునాథునకు అయిదు శతాబ్దములకు పూర్వము బోధచేసెను. ఆయన పలుకులు ప్రేమభరితాశీర్వాదములు ; ఒక్క దూషణకూడ ఆయన పెదవులనుండి గాని, ఆయన జీవితమునుండిగాని వెలువడ లేదు. అటులనే జొరాస్టర్ నుండియు, కన్ఫ్యూషియస్ నుండియు వెలువడలేదు.

# శిష్యత్వము

## (శాన్‌ఫ్రాన్సిస్కోలో 1900-వ సంవత్సరము మార్చి 29-వ తేదీని చేసిన ప్రసంగము)

నేటి నా ప్రసంగము శిష్యత్వమును గుఱించినది. ఈ విషయమై నామాటలు మీకెట్లుండునో తెలియదు. మీకవి బోధపడుట కొంచెము కష్టమగునేమో! గురుశిష్యుల ఆశయములలో మీ దేశమునకు మా దేశమునకు చాలభేదమున్నది. భారతదేశములో వెనుకటి సామెత యొకటికలదు: "గురువులు శతసహస్రాధికము గాగలరు. కాని, శిష్యుడొక్కడయినను దొరకుట కష్టము." ఈ మాట నిజమే అని యనిపించుచుండును. ఆధ్యాత్మికాభివృద్ధికి ముఖ్యముగా కావలసినది శిష్యుని మానసికస్థితి. ఈ స్థితి నిర్దుష్టమైయున్నచో సాక్షాత్కారము సులభముగా కలుగును.

సత్యగ్రహణమునకు శిష్యుని కుండవలసిన లక్షణములేవి? సత్య సాక్షాత్కారము కనురెప్పపాటు కాలములో కలుగునని ఋషీశ్వరులు చెప్పుదురు — విషయము తెలిసికొనుటయది. స్వప్నము తొలగిపోవుట కెంతకాలము పట్టును? క్షణములో స్వప్నము పోవును. భ్రాంతి తొలగిపోవుట కెంతసేపుపట్టును? కనురెప్పపాటు. నేను సత్యమును తెలిసికొనునప్పుడు జరుగుపనియేమి? అంతవఱకుగల అసత్యము తొలగిపోవును. అంతకంటె మఱేమియు జరగదు: నేను రజ్జువును చూచి సర్పమని భ్రమపడితిని. అది త్రాడేయని నేనిప్పుడు తెలిసికొంటిని. ఇందుకు అరక్షణముకంటె నధికసమయము పట్టలేదు. కావలసినపని అంతయునయినది. "తత్త్వమసి" "అది నీవు" ఈ విషయము తెలిసికొనుట కెంతసేపుపట్టును? మనము భగవంతుడే అయినచో, సర్వదా మనము భగవంతుడే అయియున్నచో, ఆ విషయము తెలియకపోవుట అత్యాశ్చర్యకరము. ఆ సంగతి తెలిసి

కొనుటే సహజమైనపని. మొదటినుండియు మనమెవరమో, ఇప్పుడును మన మెవరమో గ్రహించుటకు యుగములకాల మవసరము లేదు.

అయినను స్వప్రకాశమైన ఈ సత్యమును తెలిసికొనుట కష్టముగా కనబడుచున్నది. ఈ సత్యము నిమిషమాత్రము దర్శించుటకు ప్రారంభింపకపూర్వమే యుగములు గతించిపోవుచున్నవి. దేవుడే జీవము; దేవుడే సత్యము. ఈ విషయమునుగుఱించి మనము గ్రంథములు వ్రాయుదుము; అంతరాంతరములో నీ సత్యమును గ్రహింతుము. దేవుడుదక్క తక్కినదంతయు నసత్యమేయని భావింతుము. నేడిక్కడనున్నది రేపటికి అదృశ్యమైపోవును. అయినను మనలోచాల మంది జీవితములో నెదుగు బొదుగు లేక యెప్పటివలెనే యుందురు. అసత్యమునే అంటిపెట్టుకొని యుందురు. సత్యముదెస జూడనొల్లరు. సత్యమును పొందవలెనని కాంక్షింపరు. తమ స్వప్నము నెవరును పోగొట్టుటకు వారిష్టపడరు. కనుక వారికి గురువుల యావశ్యకత లేదు. ఇక నేర్చుకొనగోరువారెవరు? ఎవడైనను సత్యమును సాక్షాత్కరింప జేసికొనవలెనని, భ్రమను పోగొట్టుకొనవలెనని, గురుముఖతః సత్యమును గ్రహింపవలెనని కోరుకొనుచో అతడు నిజమైన శిష్యుడు కావలెను.

శిష్యుడగుట సులభమైన పనికాదు; విశేషమైన సన్నాహము కావలెను. అనేక నియమములను పాటింపవలెను. నాలుగు ముఖ్యమైన నియమములను వేదాంతులు విధించిరి.

సత్యమును దర్శింపగోరు విద్యార్థి ఇహలోకమునగాని, పరలోకమునగాని ప్రయోజనము పొందవలెనను కోర్కెను విడిచిపెట్టవలెను. ఇది మొదటివిషయము.

మనమిప్పుడు చూచునది సత్యముగాదు. ఏదయిన కోర్కె మన మనస్సులో నున్నంతవఱకు మనము చూచెడిది సత్యముగాదు. భగవంతుడే సత్యము. జగత్తు సత్యముగాదు. ఈ జగత్తుమీాద

వ్యామోహ మెక్కింత యయినను మన హృదయములో నున్నంత వఱకు సత్యము ద్యోతకముగాదు. మిన్ను విఱిగి మీదపడి నా చెవుల దగ్గఱనే ఈ జగత్తు శిథిలమైపోయిననుసరే, సేనావిజృంభణ ములను వినిపించుకొనరాదు. వానిదెస చూపు నిలుపరాదు. పరలోకము విషయమునుగూడ ఇట్లే భావింపనగును. అంతే. స్వర్గముపై మనకేమియు మక్కువతగదు. స్వర్గమనగానేమి? ఈ పార్థివ జీవనమును పొడిగించుటే. స్వర్గము లేనియెడల, హాస్యాస్పద మైన ఈ నిరర్థక జీవితమును పొడిగింపనియెడల మనకెంతో మేలు కలుగును; మన మిప్పుడు కనుచున్న పిచ్చికలలు త్వరగా తొలగి పోవును. స్వర్గమునకు పోవుటవలన దుఃఖహేతువులగు మనభ్రమలను పొడిగించుచుందుము.

స్వర్గలోకమున మీకు చేకూరునదేమి? మీరు దేవతలగుదురు, సురాపానము చేయుదురు, కీళ్లవ్యాధి తెచ్చిపెట్టుకొందురు. పృథివి మీదకంటె అక్కడ దుఃఖము తక్కువనుమాట నిజమే: సత్యము కూడ తక్కువే. యథార్థమును పేదలు గ్రహింపగలిగినంతగా ధని కులు గ్రహింపజాలరు. "ఈశ్వరరాజ్యములో ధనికుడు ప్రవేశింప గలుగుటకంటె, సూదిబెజ్జములో ఒంటె దూరిపోవుట సులభము". తన మైశ్వర్యము, అధికారము, సుఖములు, భోగములను మించి మఱొకవిషయము నాలోచించుటకు ధనికునకు తీరికయుండదు. మత దృష్టిగల ధనికులెక్కడో గాని లేరు. ఎందువలన? మతానుపాన పరులయినయెడల జీవితములో విలాసముండదని వారిభయము. అదే విధముగా స్వర్గములో ఆత్మోన్నతి బడయుటకవకాశములు మిక్కిలి తక్కువ; అక్కడ మితిమీఱిన సౌఖ్యము, భోగములుగలవు. స్వర్గ వాసులు తమ విలాసములను విడిచిపెట్టుట కిష్టపడరు. స్వర్గములో దుఃఖమనునదే ఉండదని చెప్పుదురు; ఏనాడును దుఃఖింపని వాని యందు నాకు నమ్మకము లేదు; అట్టివానికి హృదయముండవలసిన తావున పెద్ద నల్లరాతిబండయున్నదని గ్రహింపజెల్లును. స్వర్గ వాసులకు సానుభూతి తక్కువయను విషయము సుస్పష్టము. అట్టి

వారక్కడ అశేషముగాగలరు. మన మీ భయంకర ప్రదేశములో బాధలుపడుచున్న దురదృష్టజీవులము. వారు మనకు సహాయ పడగలరు; కాని, సహాయపడరు. వారికి దుఃఖము లేదు. అక్కడ దుఃఖము, దైన్యము లేవు; కనుకనే వారితరుల దుఃఖమును లెక్కచేయరు. వారు సురాపానము చేయుదురు, నృత్యము చేయుదురు; వారికందమైన భార్యలుగలరు. ఇంకను ఏవేవియోగలవు.

శిష్యుడు కాగోరువాడు వీనిని సమగ్రముగా అతిక్రమించి, "ఈ జీవితములో నేను దేనిని లెక్కచేయను. స్వర్గము లెన్నిగలవో అన్నిటిని తృణీకరింతును. వానిలో దేనియందును నేను నివసింపగోరను. ఏరూపములోను నే నీ యింద్రియజీవితము నపేక్షింపను—దేహాత్మ భావమును నేను మన్నింపను. ఈ దేహమే—ఈ మాంసపు ముద్దయే—నేనని నా ప్రస్తుతభావము. నే నీ భావమును విశ్వసింపను" అని సంకల్పించుకొనవలెను.

ఈ ప్రపంచము, సకలస్వర్గములు ఇంద్రియబద్ధమైనవే. మన కింద్రియములు లేకున్నచో ఈ ప్రపంచమును మనము లక్ష్యపెట్టము. స్వర్గముగూడ ప్రపంచమే. పృథివి, స్వర్గము, ఈ రెంటికిని మధ్య గల సీమ—ఇదియును పృథివియే.

కనుక శిష్యుడు గతమును, ప్రస్తుతమును, అనాగతమును అర్థముచేసికొని, ఐశ్వర్యమననేమో, సౌఖ్యమననేమో తెలిసికొని అన్నిటిని విసర్జించి, సత్యమును—సత్యమునే కాంక్షించును. ఇది మొదటి నియమము.

అనంతరము శిష్యుడు అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము నలవఱుచుకొనవలెను. ఇంకను అనేక ఆత్మగుణములయందును సుప్రతిష్ఠుడుగావలెను. ఇది రెండవ నియమము.

బహిరింద్రియములు దేహమున వివిధస్థానములలో గలవు. అవి మనకు కనబడుచుండును. అంతరింద్రియములు మనకు కనబడు

నవిగావు. కన్నులు, చెవులు, ముక్కు మొదలయిన బహిరింద్రియములు మనకున్నవి; వీనికి సంబంధించిన అంతరింద్రియములున్నవి. మనము సదా ఈ యుభయవర్గముల ఇంద్రియముల పిలుపులను వినిపించుకొనుచు, ఇవి యాడించినట్లెల్ల ఆడుచుందుము. ఈ యింద్రియములకు సంబంధించిన వస్తువులు బాహ్యప్రపంచమునందంతటను గలవు. సమీపమునకు తేలేవస్తువు లున్నయెడల వానిని తిలకించవలసినదని ఇంద్రియములు మనలను నిర్బంధించును; తిలకించుట, తిలకింపక పోవుట మనకు సుసాధ్యములైన పనులుకావు; మనకు స్వాతంత్ర్యము లేదు. "ఇందు ఇంత పెద్ద ఘ్రాణేంద్రియమున్నది. కొంచెము పరిమళము వలసినదే! నేనాఘ్రాణింపవలసినదే. దుర్వాసన యయినచో, వాసనచూడకుము" అని నాకు నేను చెప్పుకొందును. కాని, ప్రకృతి "చూడుము, వాసనచూడుము!". అని గద్దించును. వెంటనే నేను వాసనచూతును.

మన మేవిధముగా నైతిమో కొంచెము యోచింపుడు! మనలను మనమే బంధించుకొంటిమి. నాకు కన్నులున్నవి. ఎదుటనున్నది—ఎట్టిదయినను సరే—చూచితీఱవలసినదే. శ్రవణేంద్రియము గుఱించిగూడ నిట్లేయోచింపదగును. ఎవరయిననాతో నప్రియముగా మాట్లాడినను నేను వినితీఱవలసినదే. నా శ్రవణేంద్రియము నన్నావిధముగా నిర్బంధించును. అది నాకెంత బాధగా నుండును! పొగడినను, తెగడినను—మానవుడు వినియేతీఱవలెను. నేననేకమంది బధిరులను చూచితిని. సాధారణముగా వారేదియు వినరు. కాని, తమ్ముగుఱించిన మాటలు ఉచ్చరింపబడుచో వానిని శ్రద్ధగా ఆలకింతురు!

ఈ యింద్రియములన్నియు — బహిరింద్రియములు, అంతరింద్రియములు శిష్యుని యధీనముకావలెను. శ్రమపడి అభ్యాసము చేసిచేసి ఆతడాస్థితినందవలెను. ఇంద్రియముల ప్రేరణలకు, ప్రకృతి యాజ్ఞలకు వ్యతిరేకముగా తన మనస్సును బలముతో నాతడు

పూరించవలెను "నీవు నాదానవు; నిన్నాజ్ఞాపింపవలసినది నేను. నీవేదియు కనవలదు, వినవలదు" అని మీరు మనస్సు నాదేశింప వలెను. మనస్సు ఆయాజ్ఞను శిరసావహించును. అది దేనినీ కనదు, వినదు—ఏరూపముగాని, శబ్దముగాని మనస్సును చలింపజేయ జాలదు. ఇంద్రియముల యాధిపత్యమునుండి మనస్సు విడివడినస్థితి యది; వానినుండి మనస్సు వేఱుపడినది. అది యిక నింద్రియములను గాని, దేహమునుగాని అంటిపెట్టుకొనలేదు. ఇప్పుడు బాహ్యవస్తువులు మనస్సు నాజ్ఞాపింపజాలవు; వాని నంటియుండుటకు మనస్సిప్పుడు నిరాకరించును. మైమఱపు చెందించు సౌరభ మిక్కడనే యుండుగాక. "ఆఘ్రాణింపకుము" అని శిష్యుడు మనస్సును ఉత్తరువు చేయును. మీరీదశను సమీపించునప్పటికి శిష్యులగుస్థితి ప్రారంభమైనదని గ్రహింపనగును. ఇందుచేతనే "నాకు సత్యము తెలిసినది." ప్రతివారును చెప్పునప్పుడు, "మీకు సత్యము తెలిసినయెడల మీ కింద్రియనిగ్రహము సుసాధ్యమైయుండవలెను. మీకు సంయమశక్తికలదందురేని ఈ యింద్రియములను అదుపులోపెట్టిచూపుడు" అని నేననుచుందును.

పిమ్మట, మనస్సును శాంతింపజేయవలెను. మనస్సిప్పుడును బహిర్ముఖమై పరుగిడుచుండును. నేను ధ్యానముచేయుట కుపక్రమింపగానే లోకములోని క్షుద్ర విషయములన్నియు నొక్కమాఱు మనస్సులోనికి వచ్చును. అప్పుడంతయు అసహ్యముగా నుండును. నాకక్కఱలేని విషయములను గుఱించి మనస్సేల ఆలోచింపవలెను? నేనొకవిధముగా మనస్సుకు బానిసనైపోయితిని. మనస్సు స్వాధీనము తప్పి, అశాంతిగా నున్నంతవఱకు ఆత్మజ్ఞానము సాధ్యముగాదు. మనోనిగ్రహమును శిష్యుడు సాధనచేయవలెను! యోజించుట మనోధర్మమేగదా! నిజమే. కాని, శిష్యుడు వలదనినపుడు మనస్సు "ఆలోచన విరమింపవలెను. ఆలోచన యిక చాలింపుము" అనియత డుత్తరువుచేసినప్పుడు చాలింపవలసినదే. శిష్యాధికార చరితార్థతకై ఈదృశ మానసికస్థితి మిగుల నావశ్యకమైనది.

శిష్యునకు సహనశక్తి యపారముగా నుండవలెను. జీవితము సుఖదాయకముగా నున్నట్లు కనుపించును; అన్నియు ననుకూలముగా నున్నప్పుడు మీతో మనస్సు సరసముగా వ్యవహరించుచుండును. కాని, ఏదయిన ప్రతికూలమైనప్పుడు మనస్సుకు స్వాస్థ్యము తప్పిపోవును. అది మంచిపనికాదు. సమస్త పాపమును, దుఃఖమును సణుగుడు, గొణుగుడు లేకుండ భరింపుము. నీకప కారము జరిగినట్లు భావింపకుము. నీవేదో బాధపడుచున్న భావము, ప్రతిఘటనగురించిన తలంపు, ప్రతీకారచింత ప్రతిక్రియను గురించిన యాలోచన యేమాత్రములేకుండ భరింపుము. ఇది నిజమైన సహనము; దీనిని నీ వలవఱుచుకొనవలెను.

మంచిచెడుగులు లోకములో నెప్పుడును ఉండును. లోకములో దుఃఖమున్నవిషయమే పలువురు మఱచిపోవుదురు—కనీసము మఱచి పోవుటకు ప్రయత్నింతురు. దుఃఖము దాపురించినప్పుడు వారు క్రుంగి కృశించి పోవుదురు. మఱికొందఱు చెడుగనునది లేనే లేదని తలంతురు. సర్వము శుభప్రదమేయని భావింతురు. అదియును దౌర్బల్యమే; కష్టమునుగురించిన భయమే అందుకు కారణము. ఏదయినను అనర్థముగా వాసనగొట్టుచుండ దానిపై పన్నీరు చల్లి, అది సౌరభమును విరజిమ్ముచున్నదని ఊహించుటేల? ప్రపంచములో మంచిచెడ్డలు రెండునుగలవు—ఔను. భగవానుడు లోకములో మంచిని, చెడుగును ఉంచినాడు. అతడు చేసినపనిని మనము కప్పిపుచ్చుటేల? చెడుగు ఎందుకుకలదో చెప్పుటమనపనికాదు. విశ్వసింపుము, శాంతింపుము.

నా గురువు, శ్రీరామకృష్ణుడు జబ్బుపడినప్పుడు, ఆయన మనోబలముతో చికిత్సచేసికొనవలసినదని యొక బ్రాహ్మణుడు సూచించెను; దేహములో రోగగ్రస్తమైన భాగమున మనస్సు నేకాగ్రముగా కేంద్రీకరించిన, అది స్వస్థతచెందును. శ్రీరామకృష్ణుడిట్లు చెప్పెను: "ఏమేమి? ఈశ్వరార్పితమైన నా మనస్సును ఈయల్ప

దేహమునకు వినియోగింపనా?'' అతని మనస్సు నిరంతరము ఈశ్వరుని సంయోగ మనుభవించుచుండెను; అతడు దానిని సంపూర్ణముగా నీశ్వరుని కంకితముచేసెను. దాని నతడు మఱొకచేతకు వినియోగింపడు.

ఆరోగ్యముకొఱకు, ఐశ్వర్యముకొఱకు, ఆయుర్దాయముకొఱకు, ఈరీతి ప్రాకృతవిషయవస్తువులకొఱకు ఆరాటపడుట— భ్రమతప్ప మఱేమియుగాదు. వాని సమృద్ధికి, పరిపోషణకు, రక్షణకు మనస్సును వినియోగించుటవలన భ్రమ వృద్ధిచెందును. జీవితములో మనకిట్టి స్వప్నములు, భ్రమలు గలవు. ఇవి ఈ జీవితము తరువాత స్వర్గములో మఱింతకావలెనని గ్రుక్కిళ్లు మ్రింగుదుము. అనగా, వీనికై అధికాధికముగా భ్రమలో తగుల్కొనుచుందుము అని నమ్ముడు. పాపమును పైబడనీయకుడు. ఎదిరింపుడు. అరిష్టముకంటె మీరధికులు.

లోకములో నింతగా దుఃఖముగలదు—ఎవరో ఒకరు దానిని భరింపవలెను. ఎవ్వరికిని అపకారము కలుగకుండ నీవేపనియుచేయలేవు. లోకమునకు నీవు మేలు చేయగోరుదువేని, ఎవరో అనుభవింపవలసి యున్న కీడును తొలగించుచున్నావని గ్రహింపుము. ప్రతివారు దానిని మఱొకరి మీదికి త్రోసివేయుచున్నారు. ''లోకములోని దుఃఖము లన్నిటిని నాకు రానిమ్ము: వానిని నేను భరింతును. ఇతరులెల్లరు నిశ్చింతగానుందురుగాక.'' అని శిష్యుడు తెలుపవలెను.

శిలువమీది మహాత్ముని స్మరించుకొనుడు. విజయసాధనకై దేవతల దళములనే రావింపగలిగిన శక్తిమంతుడతడు; కాని, అతడు ప్రతిఘటనను సంకల్పింపలేదు. తన్ను వధించినవారికొఱకు జాలిపడినాడు. సర్వవిధములయిన హింసను, పరాభవమును అతడు భరించినాడు. సమస్తభారమును తనపై వేసికొనినాడు. ''శ్రామికులారా, బాధితులారా, రండు; నాదగ్గఱకు రండు. నేను మీకు విశ్రాంతినిత్తును.'' అది నిజమైన సహనము. అతడీ యైహిక జీవిత

మున కతీతముగా ఎంతటి ఉన్నతస్థాయియందున్నాడో! అతడున్న అంతస్తు, భానిసలమైన మనకేమి బోధపడును? నాచెంపమీద ఎవరయిన దెబ్బకొట్టినయెడల వెంటనే నాచేయి యతనిని తిరిగి కొట్టును: ఫెళ్లుమని వ్రేళ్లంటునట్లు కొట్టును! ఇక ఆ మహిమాన్వితుని మాహాత్మ్యమును, పవిత్రతను నేనెట్లర్థముచేసికొనగలను? వాని మహిమను నేనెట్లు దర్శింపగలను?

అయినను, నేను నాయాశయమును క్రిందికిలాగను. చెడుగుతో పోరాడుచు, నేను దేహమననియే భావింతును. తలనొప్పివచ్చిన యెడల లోకమంతటను తిరిగి తిరిగి చికిత్సపొందుట కావేదనపడుదును; రెండువేల సీసాల మందు పుచ్చుకొందును. ఇక నేనీలోకోత్తర పురుషుల నేమి యర్థముచేసికొనగలను? ఆశయమును చూడగలుగు చున్నాను. ఎంతమాత్రము చూడగలుగుచున్నాను? దేహస్థితి, సంకుచితమైన ఆత్మభావము, కష్టములు, సుఖములు, అపకారములు, భోగములు—వీనినిగుఱించిన ఆలోచనలు గలవారు ఆ యుత్కృష్ట వాతావరణమును సమీపింపజాలరు. భౌతికతత్త్వమునుండి మనస్సును వేఱుచేసి, ఆత్మధ్యానీనిష్ఠుడనయినగాని ఆ యాశయము నొక్కింత గ్రహింపలేను. భౌతికభావములు, రూపములు, ఇంద్రియబద్ధమైన ప్రపంచము ఆ యాశయములో లేవు. వీనినన్నిటిని త్రోసి పుచ్చుము. మనస్సు నాత్మయందు లగ్నముచేయుము. నీ జీవితమును, మృత్యువును, నీబాధలను, సుఖములను, నీపేరును, ప్రతిష్ఠను మఱచిపొమ్ము, నీవు దేహముకాదని, మనస్సుకాదని, నిర్మలమైన ఆత్మయే యను సత్యము ననుభవమునకు తెచ్చుకొనుము.

"నేను" అని నేననినప్పుడు "ఆత్మ" అని నా భావము. కన్నులుమూసికొని, "నేను" అని మీరనుకొనినప్పుడు మీకేమి స్ఫురించునో యోచింపుడు. మీకు కనబడునది మీ దేహమా, మీ మానసిక స్వభావమా? అగుచో మీ నిజమైన "నేను" సాక్షాత్కరించలేదని గ్రహింపనగును. "నేను" అని యనగానే యావత్ప్రపం

చము అనంతమైన అస్తిత్వము మీకు ప్రత్యక్షమగుస్థితి ఒకానొక నాటికి రాగలదు. అప్పుడు మీ కాత్మ సాక్షాత్కారము కలిగినదని యర్థము. మీరనంతులన్న సంగతి మీకు తేట తెల్లముకాగలదు. యథార్థమది; మీరు ఆత్మ. భౌతికతత్త్వముగాదు.? భ్రాంతియనున దొకటి కలదు—దానివలన ఒకవస్తువును మఱొకవస్తువుగా పొర పడుట కలదు. భౌతికతత్త్వము నాధ్యాత్మిక తత్త్వముగా, దేహము నాత్మగా భావింతుము. ఇది యద్భుతశక్తిగల భ్రాంతి. ఇది పోయియే తీఱవలెను.

శిష్యుడలవఱుచుకొనవలసిన మఱొక లక్షణము గురువునందు విశ్వాసము. పాశ్చాత్య సీమలో గురువులు బుద్ధిగతమైన జ్ఞానమే కలిగింతురు; అంతే. గురువుతో సంబంధము జీవితానుబంధములలో కెల్ల మిక్కిలి యుత్కృష్టమైనది; తరువాత తల్లి, పిమ్మట తండ్రి ముఖ్యులు. ప్రప్రథమముగా నాభక్తి గురువుపై నుండవలెను. ''ఈపనిచేయుము'' అని నాతండ్రి, ''ఆపని చేయకుము'' అని నా గురువు చెప్పినపక్షమున నే నాపనిచేయను. గురువు నా కాత్మవిమో చనము కలిగించును. నాతల్లి దండ్రులు నాకు దేహము నిచ్చిరి. గురువు నాకు జీవన్ముక్తిని ప్రసాదించును.

మాకు కొన్ని విచిత్రమైన నమ్మకములున్నవి. వానిలో ఒకటి యిది: అసాధారణ ప్రతిభాశాలురయిన మహాత్ములు కొందఱు కలరు. వారు ముక్తపురుషులు. కాని, వారు జగత్కళ్యాణము కొఱకు, లోకసంగ్రహార్థము అవతరించుచుందురు. వారింతకుమున్నే ముక్తులయినారు. వారు తమ మోక్షమును లెక్కచేయరు— ఇతరులకు సహాయపడుటే వారి లక్ష్యము. వారికేమియు బోధింప నవసరములేదు. శైశవదశలోనే వారికి సర్వము తెలియును; ఆఱు నెలలప్రాయమప్పటినుండి వారు పరమసత్యమునుగుఱించి ముచ్చ టించుచుందురు.

ఇట్టి ముక్తపురుషులమీదనే మానవకోటి ఆధ్యాత్మికాభివృద్ధి యాధారపడి యుండును. వారు జ్యోతులవంటివారు. ఆ జ్యోతుల నుండియే యితర జ్యోతులు వెలిసినవి. జ్యోతి ప్రతిజీవుని యందున్నమాట నిజమే. కాని, అనేకమందిలో అది మఱుగుపడి యున్నది. మహాత్ములు మొదటినుండియు ప్రకాశించు జ్యోతులు. వారి మహిమవలన వారితో సాంగత్యము చేయువారియందున్న జ్యోతులు వెలుగును. అంతమాత్రమున మొదటిజ్యోతి కాంతి ఏమాత్రము తగ్గదు; అయినను తనకాంతి యితర దీపముల కిచ్చును. లక్షలకొలది దీపములు వెలిగింపబడును; మొదటిజ్యోతి యథాప్రకారము, కాంతి తగ్గక ప్రకాశించుచునే యుండును. మొదటిజ్యోతియే గురువు. ఆ జ్యోతినుండి వెలిగింపబడిన జ్యోతియే శిష్యుడు. శిష్యుడు తనవంతువచ్చినప్పుడు గురువగును. ఈశ్వరావతారములని మీరు చెప్పెడి మహాత్ములు శక్తిసంభరితులయిన ఆధ్యాత్మిక ప్రతిభాసంపన్నులు. వారవతరించి తమ్మాశ్రయించిన సన్నిహిత శిష్యులపై అద్భుతమైన తమ ఆధ్యాత్మికశక్తిని ప్రసారము చేయుదురు. ఆ శక్తి శిష్యులద్వారా తరతరములకు ప్రసారమగుచుండును.

క్రైస్తవుల ఛర్చిలోని బిషప్ (మతాచార్యుడు) తలపై చేయి వేసి, తన పూర్వబిషప్‌లనుండి తనకు సంక్రమించినట్లు భావించెడి శక్తిని తాను ప్రసారము చేయునట్లు చెప్పును. ఏసునాథుడు తన శక్తిని తన సన్నిహిత శిష్యులకు ప్రసారము చేసినట్లు, వారు తమ శిష్యులకు, ఆ శిష్యులు తమ శిష్యులకు ప్రసారము చేసినట్లు తన కావిధముగా ఏసునాథునిశక్తి లభించునట్లు బిషప్ చెప్పును. ఒక్క బిషప్‌లకు మాత్రమేగాక ప్రతిజీవునికి అట్టి శక్తి కలుగవలెనని మా ఆశయము. మీలో ప్రతియొక్కరు నీ యాధ్యాత్మికధారను ప్రసారముచేయగల సాధనము కాజాలరనుటకు కారణమేదియు లేదు.

అందుకు మొట్టమొదట మీరు గురువును, సరియైన గురువును కనుగొనవలెను. అతడొక సామాన్య మానవమాత్రుడగుచో చాల దనుసంగతి మీరు జ్ఞాపకముంచుకొనవలెను. మీరు దేహధారియైన గురువును పొందవచ్చును. కాని, నిజమైన గురువు దేహములో లేడు; అతడు భౌతికమైన వ్యక్తికాడు—అతడు మీ కన్నులకు కనబడునట్టి వాడు కాడు. అతడు మానవరూపము ధరించియే రావచ్చును. అతనినుండి మీరు శక్తిపొందవచ్చును. ఒక్కొక్కప్పు డతడు స్వప్న ములో కనబడి శక్తిని లోకమునకు ప్రసారము చేయవచ్చును. గురు శక్తి మన కనేకమార్గముల లభింపగలదు. మనవంటి సామాన్య మానవులకు గురువనివార్యము. అతడు లభించువఱకు మన సాధన సన్నాహము సాగుచుండవలసినదే.

దేవుడు, జీవుడు, మతము, మోక్షము—వీనినిగుఱించిన ఉపన్యాసములు విందుము; గ్రంథములు పఠింతుము; వాదింతుము; తర్కింతుము. ఇది ఆధ్యాత్మికత కాదు. ఆధ్యాత్మికత గ్రంథములలో, సిద్ధాంతములలో, తత్త్వశాస్త్రములలో ఉండునది కాదు. అది పాండి త్యములోను, తర్కములోను లేదు. అది ఆత్మవికాసములో నున్నది. చిలుకలుకూడ వివిధవిషయములు కంఠస్థముచేసి తిరిగి అప్పగించ గలవు. నీవు విద్వాంసుడవైననేమి? అంతమాత్రమున జరిగినదేమి? గాడిదలు పుస్తకభాండాగారములనే మోయగలవు. నిజమైన వెలుగు లభించినప్పుడు—ఇక పుస్తకములను చదువ నవసరము లేదు. తన పేరు వ్రాసికొనుట చేతగానివ్యక్తికూడ సంపూర్ణమైన మతానుభూతి పొందగలడు. లోకములోని గ్రంథాలయము లన్నిటిని తనచేతి యం దుంచికొనియు ఒకడు మతానుభవము పొందలేకపోవచ్చును. ఆత్మోన్నతికి పాండిత్యమనివార్యముగాదు; వైదుష్యము ఆత్మాభి వృద్ధికొక నియమముగాదు. గురుసంస్పర్శ, అతని ఆధ్యాత్మికశక్తి ప్రసారము మీ హృదయముల నుత్తేజింపజేయును. అప్పుడభివృద్ధి ప్రారంభమగును. అది నిజమైన అగ్నిమంత్రదీక్ష. ఇక నిలువకుము. ముందంజవేయుచు సాగిపొమ్ము.

కొన్ని సంవత్సరముల క్రితము క్రైస్తవమతబోధకు లొకరు నన్ను, "నీవు ఏసుక్రీస్తును నమ్ముదువా ?" అని యడిగెను. "నమ్ముదును. బహుశః మీకంటె ఎక్కువ భక్తిపూర్వకముగా నమ్ముదును." అంటిని. "అయిన నీవు క్రైస్తవ సంప్రదాయము ననుసరించి, ఆచారమునుబట్టి మతస్వీకారము నేల చేయరాదు ?" అని యతడనెను. "మతస్వీకారము నే నెట్లుచేయుదును ? ఎవరివలన ? నాచేత మతస్వీకారము చేయించగలవారెవరు ! మతదీక్షయనగా నేమి ? కొన్ని సూత్రము లేకరువుపెట్టుచు శిరస్సుపై ఉదకము చల్లుటా ? నీటిలో మునుకలు వేయించుటా ?

మతదీక్ష స్వీకరించుట యనగా ఆధ్యాత్మిక జీవితపథములో తిన్నగా ప్రవేశించుట. నిజమైన మతదీక్ష స్వీకరించినయెడల మీరు దేహముకాదని, మీ రాత్మస్వరూపులని గ్రహింతురు. మీకుచేతనగునేని, నాకు మతదీక్షనిండు. లేనిచో మీరు క్రైస్తవులేకారు. మతస్వీకారము చేసినతరువాతగూడ మీరెప్పటివలెనే యున్నారు. ఏసుక్రీస్తుపేరిట మీరు మతదీక్ష స్వీకరించినట్లు చెప్పుటలో అర్థమేమి ? వట్టిమాటలతో, మాటల ప్రోవుతో—మీ యవివేకముతో లోకమునకు చీకాకు కలిగించుటే ! చూపులేనివాని నూతగొని చూపులేని మఱియొకడు అనుసరించునట్లు అవిద్యాంధకారములో మునిగిపోయి, తాము విద్వాంసులమని, వివేకసంపన్నులమని ఆత్మవంచన చేసికొనుచు మూఢులు లోకసంచారమునకు బయలుదేరి అడుగడుగున తొట్రుపడుచుందురు*. కనుక క్రైస్తవులమని మీరు చెప్పుకొనకుడు. మత దీక్ష అని, పెద్ద కబురులు చెప్పకుడు—

నిజమైన మతస్వీకారమనునది కలదు—ఏసుక్రీస్తు అవతరించినప్పుడు, ధర్మబోధ చేసినప్పుడు జరిగినది మతదీక్షాస్వీకారమే.

* కఠోపనిషత్తు.

ఆత్మసాక్షాత్కారము పొందిన మహాపురుషులు, పృథివిమీది కప్పు డప్పు డవతరించుచుండు మహాత్ములు. ఉత్తమములైన, దైవశక్తిసందీపితములైన దృశ్యములను చూపజాలుదురు. సత్యప్రదీప్తమైన మతస్వీకారమిందుగలదు. ప్రతి మతములోని నియమములకు, కర్మకలాపములకు వెనుక సర్వజనీనమైన సత్యము బీజప్రాయముగా నున్నది. కాలక్రమమున నీ సత్యము విస్మరింపబడుచుండును; అది నియమములలో, కర్మకలాపములలోపడి నలిగిపోవునట్లగుచుండును. ఆకారములు మాత్రము మిగులును — పేటిక ఉండును. అసలు వస్తువదృశ్యమగును. మతదీక్షా స్వీకార రూపముమాత్రము మీకుగలదు. మీ రెఱిగినది స్వీకారపు తంతుమాత్రమే. ఒరులకు మతానుభూతిని కలిగించి వారి నాధ్యాత్మికముగ నుత్తేజితుల జేయగలశక్తి కొలది మంది కేగలదు. రూపముమాత్రము చాలదు. సజీవ సత్యమును గుఱించిన సజీవజ్ఞానము పొందుటకు మనము దీక్షగైకొనవలెను. అది యాదర్శము.

గురువు ఉపదేశముచేసి నన్ను వెలుగుబాటలో నడిపింపవలెను. ఏ స్వర్ణసూత్రమున తాను మణిపూసగా నున్నాడో నేగూడ ఆ సూత్రమున నట్లుండునట్లాతడు నన్ను సుశిక్షితుని జేయవలెను. దాని ననుసరించి పోజాలని వ్యక్తి తాను గురువునని రాయిగ్రుద్ది తెలుపరాదు. దివ్యసత్యము ననుభవమువలన గ్రహించి, తన్ను దా నాత్మస్వరూపిగా దర్శించినవాడే గురువు. కేవలము మాటలుచర్చించువాడే గురువు కాడు. నావంటి వదరుబోతు గురువు కాజాలడు. నిజమైన గురువు శిష్యునకు, "పొమ్ము. ఇక పాపము చేయకుము." అని చెప్పును. అంతట శిష్యుడు పాపముచేయడు. పాపముచేయు ప్రవృత్తి యతనికి ఉండదు.

నేనట్టి మహాపురుషులను చూచితిని. నేను బైబిలు, తదితర గ్రంథములు చదివితిని; అవన్నియు ఉత్కృష్టమైనవే. కాని, జీవశక్తి మీకు గ్రంథములలో దొరకదు. క్షణకాలములో జీవితమును

మార్చివేయగలశక్తి సాక్షాత్కారము పొందిన మహాత్ములకు, అప్పుడప్పు డవతరించుచుండు జ్యోతిర్మయపురుషులకు మాత్రమే గలదు. అటువంటివారే గురుపీఠములమీద ఆసీనులు కాదగినవారు. మీరు, నేను వట్టిమాటల ప్రోవులమే, గురువులముకాము. మన వాచాలత్వమువలన చెఱుపును ప్రసారముచేయుచు మనము లోకమున గగ్గోలు పుట్టించుచున్నాము. సదాశతో ప్రార్థనాపూర్వకముగ, మనము సాధనచేయుదము. ఒకానొకనాటికి మనకు సత్యసాక్షాత్కారము చేకుఱును. అప్పుడు మనము మాట్లాడవలసిన యవసరముండదు.

"ఉపాధ్యాయుడు పదునాఱేళ్ల బాలుడు; అతడెనుబది వర్షములవాని కుపదేశముచేసెను. మౌనమే ఉపాధ్యాయునిబోధనావిధానము; శిష్యుని సందేహములు పటాపంచలయినవి."* గురు వనగా నతడు. అట్టిపురుషుడు మీకు లభించినచో, అతనియం దెంతటి ప్రేమ విశ్వాసములు మీకుండవలెనో యించుక యోచింపుడు. కావుననే క్రీస్తుశిష్యు లతనిని దేవునిగా పూజించిరి. శిష్యుడు గురువును దేవునిగానే పూజింపవలెను. భగవత్సాక్షాత్కారము గలుగువఱకు సజీవదేవునే, మానవరూపము ధరించిన దేవునే మానవు డర్థముచేసికొనగలడు. మఱొకవిధముగా నతడు దేవునెట్లు గ్రహింపగలడు?

క్రీస్తు అనంతరము పందొమ్మిది వందల సంవత్సరముల కిచట అమెరికాలో ఒకవ్యక్తి జన్మించెను. అతడు జీసస్ పుట్టిన యూదు జాతికి చెందినవాడయినను కాడు. అతడు జీసస్‌నుగాని, అతని కుటుంబమునుగాని చూడలేదు. "జీసస్ దేవుడు. మీ రీమాట నమ్మనిచో నరకమునకు పోవుదురు". అని యతడు చెప్పెను. జీసస్ దేవుడని అతని శిష్యులెట్లు విశ్వసించిరో, ఆ మహనీయుడెట్లు గురువయ్యెనో మనము గ్రహింపగలము. కాని, పందొమ్మిది శతాబ్దములకు పూర్వ

---

* దక్షిణామూర్తి స్తోత్రము.

మవతరించినవానితో ఈ అమెరికన్ కేమి సంబంధము ? ఈ యువకుడు నాకు జీససునందు విశ్వాసములేదని, ఆకారణమున నేను నరకము నకు పోకతప్పదని చెప్పుచున్నాడు. జీసస్‌నుగుఱించి యితని కేమి తెలియును? ఇతడు ఉన్మత్త చికిత్సాలయములో చేర్చదగినవాడు. ఇటువంటి నమ్మకములవలన ప్రయోజనములేదు. ఇతడు తన గురువు కొఱకన్వేషణ చేయవలసినదే.

జీసస్ మరల జన్మింపవచ్చును. మీదగ్గఱకు రావచ్చును. అప్పుడు మీరతనిని దేవునిగా ఉపాసింతురా, మంచిదే. గురువు వచ్చువఱకు మనమందఱము వేచియుండవలెను. గురువును దేవునిగా ఉపాసింపవలెను. అతడు దేవుడే. అంతకు తక్కువవాడుగాడు. అతని దెస తదేకదృష్టితో చూచినకొలది గురు వదృశ్యుడగును. మరి, మిగులునదేమి? గురువుస్థానమును దేవుడాక్రమించును. మనదగ్గఱకు వచ్చుటకుగాను దేవుడు కాంతిమయమైన గురువువేషము ధరించును. మనచూపు చలింపనిపక్షమున వేషము తొలగిపోవును. భగవంతుడు ప్రత్యక్షమగును.

"దివ్యానంద రసామృత పూరితుడై, మూర్తీభవించిన పరమ జ్ఞానమై, పరమోత్కృష్టమైన ఆనందప్రదాతయై, నిర్మలుడై, పరిపూర్ణుడై, ఏకమేవా ద్వితీయుడై, నిత్యుడై, సుఖదుఃఖాతీతుడై, భావాతీతుడై, గుణాతీతుడై, సర్వాతీతుడైన గురువునకు నేను ప్రణమిల్లుచున్నాను", యథార్థమునకు గురువిట్టివాడే. కనుక శిష్యుడు గురువును దేవునిగా భావించుటలోను, అతనిని విశ్వసించుటలోను, పూజించుటలోను, సందేహములేకుండ విధేయుడగుటలోను, అనుసరించుటలోను ఆశ్చర్యములేదు. ఇది గురుశిష్య సంబంధము.

శిష్యుడు మన్నించవలసిన తరువాతినియమము ముముక్షుత్వము. బంధనిర్ముక్తస్థితి పొందవలెనను తీవ్రమైన అభీష్టము.

మన మగ్నిలో దుముకు శలభములవంటివారము. అది దహించునని, ఇంద్రియములు మనకు ఎగ్గు చేయునని, అవి మన

కామములను వృద్ధిచేయునని తెలిసియు, ప్రళయాగ్నిగుండములో పడిపోవుచున్నాము. "కోరికలెన్నడును భోగముచేత తీరవు. ఆజ్యము అగ్నిని మఱింతగా జ్వలింపజేయునట్లు భోగము కోర్కెలను పెంపొందించును."* కోర్కెచేత కోర్కె వృద్ధియగును. ఈ విషయము తెలిసికూడ ప్రజలింతకాలము దానిలో పడుచునే యున్నారు. జీవితపరంపరగా విషయవాంఛలను తీర్చుకొనుటకు ఆ వస్తువువెంట ఈ వస్తువువెంట పర్విడుచున్నారు. తత్ఫలితముగా వారు దుఃఖముపాలగుచున్నారు. అయినను వారు కోర్కెలను విడిచిపెట్టలేక పోవుచున్నారు. భయంకరమైన కోర్కెల పీడనుండి విముక్తి కలిగించవలసిన మతమును గూడ వారు కోర్కెలను తీర్చుకొనుటకు సాధనముగా చేసికొన్నారు. దేహబంధమునుండి, ఇంద్రియముల బంధమునుండి, కోర్కెల ఆధిపత్యమునుండి ఉద్ధరింపుడని సర్వేశ్వరుని ఎప్పుడోగాని మొఱపెట్టుకొనరు. దానికి బదులు వారారోగ్యముకొఱకు, ఐశ్వర్యముకొఱకు, చిరాయువుకొఱకు ప్రార్థనలుచేయుదురు. "హే! భగవాన్! మా తలనొప్పి బాపుము. మాకుకొంత ధనమిమ్ము. మరేదయిన నిమ్ము." అని వేడుదురు.

మనచూపు పరిమితి ఎంత చిన్నదయినది! ఎంత క్షుద్రమయినది! ఎంతగా పశుసులభమయినది! ఈ దేహమును మించిన కోర్కెనెవరును కోరుటలేదు. ఎంతటి భీకరమయిన పతనమిది! ఎంతటి దుస్సహమయిన దుఃఖమిది! ఈ కొంచెముమాంసము! ఈ మైదింద్రియములు! ఈ పొట్ట! ఈ ప్రపంచము, కడుపు, కామము కలయిక కాక మఱేమి? లక్షలకొలది స్త్రీ పురుషులను చూడుడు—వారు కోరుచున్నదంతయు నిదే. ఇందుకే వారు జీవించుచున్నారు. ఈ రెంటిని తీసివేయుడు. జీవితము శూన్యముగా, నిరర్థకముగా, దుస్సహముగా వారికి తోచును. మనమిట్టివారమే! మన మనస్తత్త్వమిదే; క్షుద్బాధను, కామవాంఛను తీర్చుకొనుటకు మనస్సు నిరంతర మనేక

* భాగవతము.

యుపాయములను వెదకుచున్నది. అనాదిగా జరుగుచున్నదిదియే. ఇందు ఏనాటికిని ముగింపులేని దుఃఖముకూడ నున్నది ; ఈ శారీరిక వాంఛలు క్షణికమైన సుఖమును, దురంతసంతాపమును తెచ్చిపెట్టును. మీఁదిపొర అమృతబంధురమై దిగువ గరళముగల పాత్ర వంటిదిది! అయినను మనము వీటికొఱకు ఆరాటపడుచున్నాము.

కింకర్తవ్యం? ఈ దారుణ దుఃస్థితిని వదల్చుకొనుటకు ఇంద్రియములను, కోర్కెలను పరిత్యజించుటొక్కటేమార్గము. మీరు ఆత్మోన్నతి కోరెడిపక్షమున వైరాగ్య మనివార్యము. ఇదే సరియైన పరీక్ష. ఈ లోకమును — ఇంద్రియముల అసంగతప్రేరణలను త్యజింపుడు. అయితే ఒక్క కాంక్ష కలదు : ఒకేఒక్క కాంక్ష. సత్యమేమో తెలిసికొనవలెనను ప్రగాఢాభీష్టమది. ఆత్మోన్నతి బడయవలెనను ఆకాంక్ష యది. ఇక భౌతిక జీవితమువలదు ; అహంకారమువలదు. నే నాత్మతత్త్వమును దర్శింపవలెను. ఈ యాకాంక్ష బలపడవలెను ; తీవ్రరూపము దాల్చవలెను. ఒకనిని కాలుసేతులు గట్టిగాకట్టి పడవేసినప్పు డతని నెత్తిమీద కణకణలాడు నిప్పు కణిక పడినదనుకొనుడు. అతడు తన యావచ్ఛక్తితో దానిని తీసివేసికొనుట కెంతగా గిలగిలలాడును. దహించివేయుచున్న ఈ ప్రపంచమును త్రోసివేయుటకు నే నంతటి తపనపడినప్పుడు, అంతటి యావేదనతో గిలగిలలాడినప్పుడు దివ్యసత్యము రేఖామాత్రముగా గోచరించు సమయమాసన్నమగును.

నా వైపు చూడుడు. నా చిన్న నోటుపుస్తకము, దానిలోని రెండు మూడు డాలర్లు ఎక్కడయిన అగపడక పోయినచో, దానిని వెదకుటకయి నే నింటిలోనికి ఇరువది పర్యాయములు పోవుదును. ఏమి యాందోళన! ఏమి యావేదన! ఏమి సంక్షోభము! మీలో ఒకరు నన్ను కొట్టినయెడల నే నది యిరువది సంవత్సరములు జ్ఞాపక ముంచుకొందును. నేను క్షమింపలేను, మఱచిపోలేను.

ఇంద్రియములకు సంబంధించిన యల్పవిషయములకై నేనంతగా పోరాడుదును. భగవంతుని కొఱకంతగా పోరాటము సాగించు వా రెవరు? "పిల్లలు ఆటలలో ఇతరవిషయములన్నియు మఱచిపోవుదురు. యువకులు ఇంద్రియ భోగములకై ఆరాటపడుదురు. వారు మఱి దేనిమీదను లక్ష్యముంచరు. వృద్ధులు మున్ను తాము చేసిన దోసగులను గుఱించి తలపోయుచుందురు." అని శ్రీ శంకరా చార్యులనిరి. ఇక సుఖమున కవకాశములేని వృద్ధులు ఇదివఱలో తామనుభవించిన భోగములను స్మరించుకొనుచుందురు. నెమరు వేయుటే వారు చేయగలిగినపని. అంతేకాని, ఇంద్రియ భోగములకై ప్రాకులాడుచున్నంత తీవ్రముగా భగవంతుని పొందవలెనని కాంక్షించువారు లేరు.

దేవుడు సత్యస్వరూపుడని, దేవుడే సత్యమని, దేవుడు దక్క మఱొక్కటిలేదని అందఱు చెప్పుదురు; ఉన్నది ఆత్మవస్తువేగాని భౌతికతత్త్వముగాదు. కాని, వారు సర్వదా భగవంతుని కోరునది భౌతికవిషయములే. ఆత్మవిషయము లెప్పుడోగాని కోరరు. వారి ప్రార్థనలలో ఆత్మను భౌతికతత్త్వమునుండి వేఱుచేయరు. ఎంతటి పతనము!—మత మీ స్థితికి దిగజారినది! అంతయు బూటకముగా, వంచనగా పరిణమించినది. ఏండ్లు పూండ్లు గతించిపోవుచున్నవి. ఆత్మోన్నతి పొందుట లేదు. కాని, ఉన్నది ఆత్మవస్తువే గనుక మానవు డాత్మోన్నతికొఱకే తపనపడవలెను. అదియే ఆదర్శము. ఇప్పుడే, మీరు దానిని సాధించలేని యెడల, "మేమట్లు చేయజాలము అదే యాదర్శమని మాకు తెలియును. కాని, యింకను మేము దానిని సాధింపలేము" అని మీరనవచ్చును. కాని, మీ రట్లనుట లేదు. మీరు మతమును మీ స్థితికి దిగలాగి ఆత్మపేరిట భౌతికవిషయము లను కోరుచున్నారు. కనుక మీరందఱు నాస్తికులు. ఇంద్రియము లందు తప్ప మీకు మరిదేనియందును నమ్మకము లేదు. "ఫలాని వారు ఫలానవిషయము చెప్పిరి.—అందులో ఏదో కొంత నిజముండ

వచ్చును. ప్రయత్నించిచూతము. దాని తమాషా యేమో తెలిసి కొందము. ఏదోకొంత ప్రయోజనముండకపోదు. బహుశః నా కంటకాలు సరియగునేమో". ఇది మనవైఖరి.

వ్యాధిగ్రస్తులస్థితి కడు దీనము; వారు సర్వేశ్వరు నెక్కువగా పూజింతురు. దేవుని పూజించినయెడల వ్యాధి కుదురునని వారియాశ. అట్టి ప్రార్థనలు మతముకాదని గ్రహించి, చిత్తశుద్ధితో చేసిన అవి కేవలము తప్పుకాదు. "నన్ను పూజించువారు నాలుగు తరగతులకు చెందినవారు: కష్టములోనున్నవారు, ఐహికవిషయములు గోరువారు, జిజ్ఞాసువులు, జ్ఞానులు" అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పియున్నాడు. కష్టములోనున్నవారు బాధానివారణకు దేవుని సమీపింతురు. వ్యాధివచ్చినప్పుడు స్వస్థతపొందగోరి దేవుని పూజింతురు; ధనము పోగొట్టుకొనినవారు పోయిన ధనమును తిరిగి పొందుట కతనిని ప్రార్థింతురు. మఱికొందరు నానావిధములయిన సౌఖ్యములకొఱకు ఈశ్వరుని ఆరాధింతురు. పేరు, ప్రతిష్ఠ, ఐశ్వర్యము, పదవి—ఇటువంటివి కావలెనను కోర్కెలు వారి కెన్నో ఉండును. వారు, "ఓ మరియమ్మకుమారీ! నే నడిగినది ప్రసాదించితివా, నీకు నేను నైవేద్యముపెట్టుదును. నా ప్రార్థనను ఫలింపజేయుటయందు నీవు కృతార్థురాలవగుదువేని నేను దేవుని ఉపాసించి, నాకుగల ప్రతి వస్తువులో నీకు కొంత యిచ్చెదను." అని యర్థింతురు. విషయవాంఛలింత ప్రబలముగా లేనివారు కొందఱు గలరు. వారికి దేవుని తెలిసికొనవలెననెడి తహతహ కలదు. అటువంటివారు తత్త్వశాస్త్రములు, మతగ్రంథములు చదువుదురు. తత్సంబంధమైన ఉపన్యాసములు వినుదురు. ఇంకను అనేకవిధముల వ్యాసంగము చేయుదురు. వారు జిజ్ఞాసువులు. వీరుగాక మఱొక తరగతివారు గలరు. వారు పరాత్పరుని ధ్యానముచేయుదురు, అతనిని తెలిసికొందురు. వారు జ్ఞానులు. ఈ నాలుగుతరగతుల భక్తులు సజ్జనులే. వీరిలో నెవరును చెడ్డవారుకారు. వీరందఱాతనినే యుపాసింతురు.

అయితే, మనమిప్పుడు శిష్యులము కాగోరుచున్నాముగదా. పరమసత్యమును తెలిసికొనుటే మనలక్ష్యము. అది యొక్కటియే మనలక్ష్యము. మనలక్ష్యము పరమోత్కృష్టమైనది. మనకు మనము చాల పెద్దమాటలు చెప్పుకొనియున్నాము — పరిపూర్ణ సాక్షాత్కార మంటిమి. ఇంకను చాల అనుకొంటిమి. ఈమాటల కనుగుణముగా సాధనచేయుదము. ఆత్మయందు సుప్రతిష్ఠితులమై, ఆత్మను, ఆత్మచే ఉపాసింతము. ఆత్మనే ప్రాతిపదికగా గైకొందము; ఆత్మనే మధ్య ఉంచుదము; ఆత్మనే సాక్షాత్కారము చేసికొందము. ఎందును ప్రపంచమును రానీయవలదు. అది పోయి, పోయి సుక్షులుతిరిగి యాకాశములోకలసి మాయమై పోయినపోవుగాక! దానిని లక్షించు వారెవరు? ఆత్మయందే స్థితప్రజ్ఞులుకండు! అదియే మనలక్ష్యము. అంతటిస్థితి యిప్పుడే పొందజాలమని మనకు తెలియును. అంత మాత్రముచేత నిరుత్సాహపడకుడు; ఆదర్శమును క్రిందికి లాగి వేయకుడు. మీ దేహము కేవలము భౌతికతత్త్వమని, నిర్జీవము, తమఃప్రధానము, నిశ్చేతనమునయిన భౌతికపదార్థమని ఎంతగా తలంతురాయనునదే ముఖ్యాంశము; మీరు తేజోమయమైన అమృత పురుషులను, సత్యమును ఎంతఎక్కువగా స్మరింతురనునదే ప్రధానము. తేజోమయమైన అమృతపురుషులే మీరని స్మరించుకొనుచుండు కొలది ముక్తస్థితి పొందవలెనను తృష్ణ వృద్ధిచెందుచుండును; భౌతికతత్త్వమునుండి, దేహమునుండి, ఇంద్రియములనుండి వేఱుపడ వలెనని అధికాధికముగా కాంక్షింతురు.

శిష్యుడలవఱుచుకొనవలసిన నాల్గవ లక్షణము, కడపటి లక్షణము సదసద్వివేకము. సద్వస్తువొక్కటే — భగవంతుడు. మనస్సు నతనిదెస మఱలింపవలెను. దానినతని కర్పించివేయ వలెను. దేవుడే ఉన్నది. మఱేదియులేదు. తక్కినదంతయు వచ్చుచు పోవుచుండును. ప్రపంచమునుగుఱించి ప్రతివాంఛ భ్రాంతి మాత్రమే. జగత్తు సత్యము కాదుగదా. అంతకంతకు మనస్సును

ఈశ్వరభావముతో పూరించుకొనవలెను. ప్రతి యితరవస్తువు యథార్థరూపమున—అసత్యముగా కనబడువఱకు మన ఈశ్వర భావమునందు లగ్నమైపోవలెను.

శిష్యుడు కాగోరు వ్యక్తి సాధించవలసిన నాలుగు లక్షణము లివి; వీటిని సాధనచేయక సద్గురువుతో ప్రత్యక్షసాంగత్యము కలుగదు. ఒకవేళ అట్టిగురువు లభించునంతటి యదృష్టము కలిగినను, గురువు ప్రసారముచేయు శక్తివలన అతడు త్తేజితుడు కాజాలడు. ఈ నియమములను సడలించుటకును ఒక విధమైన రాజీ పద్ధతిని సమాధానము కుదుర్చుటకును సాధ్యముకాదు. ఈ నియమ పాలనమునం దాత డుత్తీర్ణుడగుచో— ఈ సంసిద్ధతతో—శిష్యుని హృత్పుండరీకము వికసించును; భ్రమరమువచ్చి దానిపై వ్రాలును. అప్పుడు గురువు తనయందే ఉన్నాడని, తనదేహములోనే అతడు కలడని శిష్యుడు గ్రహించును. శిష్యుడు గురువును దర్శించును; సాక్షాత్కారము పొందును. జీవిత సాగరమునుదాటి, యావలకు బోవును. భీకరమైన సముద్రమును దాటును; అతడిక తనవంతు ప్రకారము లాభమునుగుఱించిగాని, స్తుతినిగుఱించిగాని తలంపులేక కేవలము కృపారసభరితుడై యితరులకు జీవితసారగమును దాటుటలో సహాయపడును.

# జగద్గురువులు

(కాలిఫోర్నియా, పసదెనాలోని షేక్స్పియర్ క్లబ్‌లో 1900 వ సంవత్సరము ఫిబ్రవరి 3 వ తేదీని స్వామిజీచేసిన ఉపన్యాసము)

హిందువుల సిద్ధాంతము ప్రకారము విశ్వముతరంగరూపములలో వృత్తములుగా సాగిపోవుచున్నది. అది ప్రభవించి, పరాకాష్ఠ చెంది, పతనమై పిమ్మట కొంతకాలము పల్లములోనుండును. మరల పుట్టి, పెంపుచెంది క్షీణించును. ఈతీరున తరంగము వెంట తరంగము లేచుచుండును. పతనము వెంట పతనము కలుగుచుండును. విశ్వమును గురించి నిజమైనది విశ్వమునందలి ప్రతిభాగమును గురించి కూడ నిజమే. మానవకోటి వ్యవహారముగూడ అంతే. జాతుల చరిత్ర విషయమునంతే; అవి వృద్ధిచెందును, క్షీణించును. అభ్యుదయానంతరము పతనము సంభవించును. పతనమునుండి మహత్తరశక్తితో అవి మరల ఉజ్జీవనము పొందును. ఈ పరిభ్రమణము నిరంతరము జరుగుచునే యున్నది. మత ప్రపంచమునగూడ గతి ఈ విధముగనే యున్నది. ప్రతిజాతి ఆధ్యాత్మికజీవితములో పతనాభ్యుదయములున్నవి. జాతి క్షీణించును. దానితో సర్వము నాశనమై పోవుచున్నట్లు తోచును; తరువాత బలమును చేకూర్చుకొని విజృంభించును; ఉత్తుంగ తరంగమొకటి లేచును; ఒక్కొక్కప్పుడది కడలిపోటువంటి పెద్దతరంగముగానుండును. అటువంటి కెరటముపై సర్వదా ఆత్మయొకటి ప్రకాశించుచుండును—దేవుని దూతయే అది. ఆ పురుషుని యుక్తే జనశక్తివలననే కెరటము లేచినది; జాతికి ఉజ్జీవనము కలిగినది. ఏ శక్తులు కెరటమునకు కారణమైనవో ఆశక్తులే అతనిని సృష్టించినవి. కనుక అతడు నిర్మాత, నిర్మితుడు కూడ. ఆ శక్తుల ప్రభావమొండొంటిపై ప్రసరించుచుండును. అతడు మహత్తరమైన తనశక్తిని సంఘముపై ప్రసరింపజేయును. సంఘ

మతని నంతటివానినిగా చేయును. అట్టి వ్యక్తు లతిలోకప్రతిభా శాలురు. వారు ప్రపంచప్రవక్తలు, జీవితసందేశమును గొని వచ్చిన దూతలు, ఈశ్వరావతారములు.

ఒక్కమతము, ఒక్కప్రవక్త, ఒక్క అవతారము మాత్రమే ఉండుట సాధ్యమను అభిప్రాయము మానవునకు గలదు; కాని, అది సరికాదు. దేవుని దూతలందఱి జీవితములను తఱచిచూడగా, వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్కపాత్ర—ఒక్కొక్క పాత్రమాత్రమే నిర్వహింపవలసియుండుట విధినిర్ణయమని తెలియగలదు; ఏదో ఒక్క స్వరములో గాక, వివిధస్వరముల సమ్మేళనములోనే సామరస్యమున్నది. వివిధజాతుల జీవితములోగూడ నింతే—ఏ జాతియు నీ ప్రపంచములో తానొక్కతే సుఖపడుటకు పుట్టలేదు. ఆమాట చెప్పుటకెవ్వరు సాహసింపగలరు? ఈశ్వరుని సంకల్పానుగుణముగా వివిధజాతుల సామరస్యము కొఱకై ప్రతిజాతియు నిర్వహింపవలసిన పాత్రయొకటిగలదు. ప్రతిజాతికి, అది కొనసాగింపవలసిన ధర్మము, నిర్వహింపవలసిన విధిగలదు. వీనిమొత్తము మహత్తరమైన సామరస్యమగును.

కనుక ఈ ప్రవక్తలలో ఏ యొక్కరుగాని ప్రపంచము నెల్ల కాలము శాసించుటకు జన్మింపలేదు. అట్టి ప్రయత్నమున నింతవఱ కెవ్వరును కృతకృత్యులు కాలేదు; ఏ యొక్కరును ఎల్లకాలము ఆధిపత్యము వహింపబోరు. ఒక్కొక్కరు కొంతప్రయోజనమే సాధింతురు; ఆ ప్రత్యేకప్రయోజనము విషయమున కాలక్రమమున ప్రతిప్రవక్త ప్రపంచమును శాసించుచు, ప్రపంచవికాసమునకు తోడ్పడుచుండును. ఇంతవఱకు నిజమే.

మనలో చాలమందికి పురుషునిద్వారా వ్యక్తమైన మతము నందే నమ్మకము. మనకీ నమ్మకము పుట్టుకతోనే కలిగినది. సూత్రములను గుఱించి సిద్ధాంతములను గుఱించి మనము మాట్లాడుదుము.

అదియంతయు మంచిదే; కాని, ఒకవ్యక్తి ముఖతః వ్యక్తమైనప్పుడే ఒక సూత్రము నవగాహ మొనరించుకొనగలమని మన ఆలోచనలు, ఉద్యమములు, పనులు తెలియజేయుచున్నవి. దేహధారియైన ఆదర్శవ్యక్తిద్వారా ప్రకటితమైనప్పుడే మనమొక భావమును గ్రహింపగలము. దృష్టాంతముతో కలిసినప్పుడే బోధ నర్థముచేసికొనగలము. ఉదాహరణలును ఆదర్శపురుషులును అవసరములేని స్థితికి మనమందఱ మభివృద్ధిచెందియుండిన, దేవుడెంతగా సంతోషించును! కాని, మన మాస్థితియందు లేము; కనుక జనబాహుళ్యము తమ యాత్మలను ఈ ప్రవక్తల సన్నిధిని ఈ లోకోత్తరపురుషుల సన్నిధిని దేవుని అవతారముల సన్నిధినుంచిరి. ఈ యవతారములను క్రైస్తవులు, బౌద్ధులు, హిందువులు పూజించిరి. మహమ్మదీయులు మొదటనుండియు నట్టిపూజకు ప్రతికూలురుగా నుండిరి. వారికి ప్రవక్తలను, ఈశ్వరదూతలను పూజించుటతో గాని, వారికి విధేయత ప్రకటించుటతోగాని ఏమియు సంబంధము లేదు; కాని, యాచరణలో ఒక్క ప్రవక్తకు బదులు వేలకొలది సాధువులు పూజింపబడుచున్నారు. మనము వాస్తవిక సంఘటనలకు వ్యతిరేకముగా బోలేముకదా! వ్యక్తులను పూజింపకుండ ఉండలేము. పూజించుట మంచిదే. "ప్రభూ, నా తండ్రిని చూపుము." అని కోరినప్పుడు మీ ప్రవక్త చెప్పినమాట స్మరించుకొనుడు. "నన్ను చూచిన నా తండ్రిని చూచినట్లే." అని యా మహాప్రవక్త పలికెను. అతడు మానవుడనిగాక మఱొకవిధముగా నెట్లు భావింపగలము? అతనిని మానవతద్వారా మాత్రమే కనుగొనగలము. కాంతిప్రసార మీగది యంతటను గలదు. అయినప్పుడు సర్వత్ర మన మెందుకు కనలేక పోవుచున్నాము. మీరా దీపమునే చూడగలుగుచున్నారు. భగవంతుడు—సర్వవ్యాపకసూత్రము ననుసరించి — అంతటను గలడు. కాని, మన మతనిని మానవుడయిన దేవునిద్వారా, మానవుడయిన దేవుని యందు మాత్రమే చూడగలము, గ్రహింపగలము. మన ప్రస్తుత

తత్త్వ మటువంటిది. ఈ దివ్యజ్యోతులు వచ్చినప్పుడు మానవు డీశ్వరానుభవము పొందును. వారు మనవలెగాక మఱొకవిధముగా వత్తురు. మనము యాచకులవలె వత్తుము; వారు చక్రవర్తులవలె వత్తురు. మనము దిక్కులేనివారివలె, దారితప్పి దిక్కుతోచని వారివలె వత్తుము. మన కర్తవ్యమేమి? మన జీవితముల అంతర్య మేమో మనకు తెలియదు. ఆ రహస్యమును గ్రహింపలేకున్నాము. మనము నేడొక పనిచేయుదుము; రేపు మఱొకపనిచేయుదుము. మనము నీటిలో ముందుకు వెనుకకు ఊగులాడెడి గడ్డిపోచలవలె, ఝంఝామారుతములో నెగిరిపోవు దూదిపింజెలవలెనున్నాము.

మానవజాతి చరిత్రలో దేవునిదూతలు వచ్చుచుండుట మనము కనుచున్నాము. పుట్టుకతోనే వారు వచ్చినకార్యమేమో స్పష్టమై, ఏర్పాటగుచుండును. వారి కార్యప్రణాళిక సమగ్రముగా నిర్ణీతమై యుండును; వారు తమ కర్తవ్యమునుండి అంగుళమైనను చలింపరు. వారొకపనికొఱకు వత్తురు; కనుక నొక సందేశము వివరింతురు. వారికిక తర్కవితర్కములతో పనిలేదు. ఈ జగద్గురువులు, ఈ ప్రవక్తలు తాము బోధించువిషయములను గుఱించి హేతుక్రమ బద్ధముచేయుట మీ రెన్నడయిన గమనించితిరా? వారిలో నెవ్వరు నాపని చేయలేదు. వారు సూటిగా ప్రసంగింతురు. వారు హేతు విమర్శచేయుటెందుకు? సత్యమును వారు చూతురు. చూచుటే కాదు, చూపుదురుకూడ! "దేవుడున్నాడా?" అని మీరు నన్నడిగిన ఉన్నాడని నేను చెప్పుదును. వెంటనే మీరు నన్ను హేతువులు చెప్పుడని కోరుదురు. మీకు తగిన కారణములను చూపుటకు నేను చాలశ్రమ పడుదును. మీరు క్రీస్తుదగ్గరకుబోయి, "దేవుడున్నాడా?" అని యడిగినయెడల ఉన్నాడని యతడుపలుకును. "అందు కేమయిన నిదర్శనముగలదా" అని మీరు ప్రశ్నించినచో "అడుగో ప్రభువు. ఆజగదీశ్వరుని దర్శింపుడు!" అని యతడు చెప్పును. అది ప్రత్యక్షదర్శనము, తార్కిక ప్రతిపాదనగాదు. అది ప్రత్యక్షదర్శన బలమేగాని

చీకటిలో తడుములాడుకొనుటగాదు. నేనీ బల్లను చూచుచున్నాను; ఎంతటి వాదమైనను నా విశ్వాసమును పోగొట్టజాలదు. అది ప్రత్యక్ష దర్శనము. వారి విశ్వాసమటువంటిది—అది వారి ఆశయములందు విశ్వాసము, వారి కర్తవ్యమునందు విశ్వాసము, అన్నిటికంటె వారి ఆత్మ విశ్వాసము. ప్రభాకలితులైన మహాత్ములకుగల ఆత్మవిశ్వాసము మఱెవ్వరికిని లేదు.

"మీకు దేవునియందు నమ్మకము గలదా? మరణానంతర జీవితమునందు నమ్మకముగలదా? ఈ సిద్ధాంతమునందో ఆ సిద్ధాంతమునందో నమ్మకముగలదా?" అని జను లడుగుచుందురు. ఇక్కడ పునాదియే కొఱతగానున్నది; ఆత్మవిశ్వాసమది. ఔను! తన్నుతాను నమ్మలేనివాడు మఱొకదానినెట్లు నమ్మగలడు? నా యునికియందే నాకు నమ్మకము లేదు. ఒక క్షణములో, "నేనున్నాను, నన్ను నాశనము చేయగలిగిన దేమియు లేదు" అనిపించును; మఱు క్షణములోనే మృత్యుభయముతో గడగడ వడకిపోవుదును. ఒక నిమిషములో నే నమృతుడనని భావింతును; మరు నిమిషములో ఏదో దయ్యము కనబడును. అప్పుడు నే నెవరినో, ఎక్కడనున్నానో నాకు తెలియనిస్థితిలో నుందును. నేను జీవించియున్నదియు, మరణించినదియుగూడ నాకు తెలియదు. ఒక ముహూర్తమున నేను ఆత్మస్వరూపుడనని, నీతిమంతుడనని తలంతును; తరువాత ముహూర్తములో ఏదో విపత్తు కలుగును; నేను చిత్తు అయిపోదును. ఎందుచేత?—నాయందు నాకు విశ్వాసముపోయినది; నైతికమైన నా వెన్నెముక విఱిగిపోయినది.

మహాత్ములందఱిలో ఈ లక్షణము సర్వదా కనుపించును: వారికిగల ఆత్మవిశ్వాస మచంచలము. అది యసాధారణము; అది మనకవగాహముగాదు. అందుచేత వారు తమ్ముగుఱించి చెప్పెడి విషయములను గ్రహింపనేరక వానిని విప్పిచెప్పుటకై వివిధరీతుల శాఖాచంక్రమణ మొనరింతురు; వారు తమ ఆత్మానుభూతినిగుఱించి

చెప్పువిషయములకు జనులిరువదివేల సిద్ధాంతములు కల్పింతురు. మనలనుగుఱించి మన మీరీతిగానూహింపము. కనుక వారి నర్థము చేసి కొనజాలకపోవుట విడ్డూరముకాదు.

వారు ప్రసంగించునప్పుడు లోకమనివార్యముగా వినితీఱును. వారు మాటాడునప్పుడు ప్రతిశబ్దము సూటిగా వెలువడును; అది బాంబుప్రేలుడుగా బహిర్గతమగును. శబ్దము శక్తిసంభరితము. పట్టి మాటలలో నేమున్నది? ఏభాషలో మాట్లాడిననేమి? మాటల నేవిధముగా కూర్చిననేమి? వ్యాకరణయుక్తముగా ప్రసంగించిననేమి? చతురతతో ప్రసంగించిననేమి? ఆలంకారికకౌశములతో ముచ్చటించిననేమి? ముచ్చటింపకపోయిననేమి? బోధింపదగు విషయమేమైన మీకుకలదా? లేదా? అదియంతయు నిచ్చుటకు పుచ్చుకొనుటకు సంబంధించిన విషయము; వినుటకు సంబంధించినదిగాదు. ఇవ్వదగినది మీదగ్గఱ ఏమైనగలదా? ఇది ప్రధానవిషయము, ఉన్నచో నీయుడు. మాటలవలనగలుగు ప్రయోజనమంతయును: ఈయదలచినదానిని తెలియజేయుటే! అది యనేకతీరులలో నొకటి. ఒక్కొక్కప్పుడు మనము మాట్లాడము. ఒక శ్లోకమునందీవిధముగా చెప్పబడియున్నది. "చెట్టుక్రింద కూర్చొనియున్న గురువును నేను చూచితిని. ఆయన పదునాఱు వర్షముల ప్రాయముగలవాడు. ఆయన శిష్యుడు ఎనుబది సంవత్సరముల వృద్ధుడు. గురువు చేయుచున్న ఉపదేశము మౌనము. అంతటితో శిష్యుని సందేహములన్నియు నివారణమైనవి."

ఒక్కొక్కప్పుడు వారు మాట్లాడనే మాట్లాడరు. మాట్లాడకయే వారు తమయభిప్రాయములనుతమ మనస్సునుండి మఱొకరి మనస్సుకు ప్రసారముచేయుచుందురు. ప్రసాదించుటకు వారువత్తురు. వారాదేశింతురు; వారు దేవునిదూతలు. వారి యాదేశమును మీరు శిరసావహింపవలసినదే. జీసస్ అధికారముతో మాట్లాడినట్లు మీగ్రంథములలో నున్నవిషయము మీకు జ్ఞాపకములేదా? "ఇక

మీరు వెళ్లి అన్నిజాతులవారికి బోధింపుడు......నేను మిమ్మాదేశించినవన్నియు తు. చ. తప్పక పాటింపవలసినదని వారికి ఉపదేశింపుడు.'' అని జీసస్ అనలేదా ? తన సందేశమునందు తనకుగల విశ్వాస మ్తతని ప్రవచనములోను ప్రస్ఫుట మగుచుండును. ప్రవక్తలుగా లోక మారాధించు లోకోత్తర పురుషులందఱి జీవితములలో నట్టి విశ్వాసబలము కానవగును.

ఈ జగద్గురువులు పృథివిమీద అవతరించిన ప్రత్యక్ష ఈశ్వర స్వరూపులు. వీరిసిగాక మఱెవ్వరిని మన ముపాసింపగలము? భగవంతుని గుఱించి భావించుటకు ప్రయత్నింతును. ఎంతటి అల్పమైన అసత్యవిషయము నామనస్సులోనికి వచ్చును? అట్టి దేవుని పూజించుట పాపము. కన్నులు తెఱచి, పృథివిమీదికి వచ్చిన ఈ మహాపురుషుల జీవితములను చూతును. భగవంతునిగుఱించి నాకు సాధ్యమైన ఉత్కృష్ట భావనకంటె ఈ మహాత్ములు మిక్కిలి గొప్పవారు. నా వస్తువు నపహరించెడివానిని వెన్నంటి చెరసాలకు పంపెడి ప్రవృత్తి గల నావంటివారు కరుణ నేవిధముగా భావింపగలరు? క్షమాగుణమునుగుఱించిన మహోత్కృష్టభావ మేపాటిదిగానుండును? నా కతీతమైనదిగా నుండజాలదు. మీలో, మీ దేహమునుండి ఆవలకు దూకగలవారెవ్వరు? మీ మనస్సులనుండి దూరముగా లంఘింపగలవారు మీలో నెవరుగలరు? అట్టివారు మీలో నెవ్వరునులేరు. మీ జీవితముల కతీతముగా దివ్యప్రేమనుగుఱించి మీ రేమి భావన చేయగలరు? మన అనుభవములో లేనిదానిని మనమెన్నడును భావనచేయ జాలము. కనుక భగవంతుని భావించుటకు నే జేసెడి సకల ప్రయత్నములు విఫలములగుచున్నవి. ఇచ్చట స్పష్టముగా సంఘటనలు కనబడుచున్నవి. కేవలము ఆశయములుకావు—ప్రేమ, కరుణ, పరిశుద్ధత — వీనిని గుఱించిన వాస్తవికవిషయములు. నాభావనకు అందవు. అట్టి సందర్భమున నే నీ మహాత్ముల చరణములకు ప్రణమిల్లి, వీరిని భగవంతునిగా పూజించుటలో

నాశ్చర్యమేమి? ఎవరుమాత్ర మింతకంటె నేమిచేయగలరు? మాటలనెంతగానయిన జెప్పవచ్చును కాని, ఇంతకంటె నధికముగా జేయగలవా రెవరయిన నున్నచో నాకు వారిని చూడవలెనని యున్నది. మాటలనుభవము కాదుగదా. దేవునిగుఱించి, నిర్గుణ తత్త్వమునుగురించి, ఈవిషయమును గుఱించి, ఆవిషయమును గుఱించి ముచ్చటించుట చాలమంచిదే; కాని, మానవరూపమున నున్న ఈ దేవుళ్లు అన్నిజాతులకుచెందిన నిజమైనదేవుళ్లు. ఈ దివ్య పురుషు లుపాసింపబడిరి. మానవుడు మానవుడుగా నున్నంత కాలము వీరుపాసింపబడుదురు. సత్యమునుగుఱించి మన విశ్వాస మందులోనేయున్నది; మన ఆశ అందులోనేయున్నది. కేవలము నిగూఢమైన సిద్ధాంతమువలన కలుగగల ప్రయోజనమేమి?

ప్రవక్తలందఱను ఉపాసించుట నా జీవితములో నాకు సాధ్యమైనది. అంతేకాదు. ఇకముందవతరింపగల వా రందఱనుకూడ ఉపాసించుటకు నేను సంసిద్ధుడనై యున్నాను. ఇదే నేను మీకు చెప్పదలచిన ముఖ్యవిషయము. బిడ్డ యేదుస్తులు ధరించినను తల్లి గుర్తింపగలదు; ఎవరయిన గుర్తింపజాలనియెడల, నిశ్చయముగా ఆమె ఆబిడ్డ తల్లికాదని గ్రహింపనగును. ఎవరో ఒకానొక ప్రవక్త యందే సత్యమును, దివ్యత్వమును, భగవంతుని గ్రహింపగల మని మీలోనెవరయినను చెప్పుచో, నిజముగా వీరియందును మీరు దివ్యత్వమును గ్రహించుటలేదని నే నర్థముచేసికొనవలసి యున్నది; ఏవోకొన్నిమాటలు మ్రింగి ఏదో ఒకానొక మతశాఖ నంటిపెట్టుకొనియున్నారని గ్రహింతును. రాజకీయ విషయములలో ఒకానొక యభిప్రాయముతో నేకీభవించుటవంటిదది; అయితే అటువంటిది మతమేగాదు. సమీపములో తియ్యని మంచినీరున్నప్పటి కిని దానిని విడిచిపెట్టి ఉప్పునీటిని వాడునట్టి అవివేకులీలోకమున కొందఱుగలరు. ఈ కర్జమునకు హేతువేమని యడిగినప్పుడు ఉప్పునీటి బావి తమ తండ్రి త్రవ్వించినదని వారు సమాధానము చెప్పుదురు.

నా స్వల్పజీవితములో నేను గ్రహించిన జ్ఞానమిది — మతమున కారోపించు అపార్థమునకు మత ముత్తరవాది కాదు. దాని తప్పేమియు లేదు. ఏ మతమును మానవులను హింసింపలేదు. ఏ మతమును మాంత్రికులను నిండుప్రాణములతో కాల్చి చంపివేయలేదు. ఏ మతమును ఎన్నడు నిట్టిపని చేయలేదు. అయితే ప్రజల నిట్టిచర్యలకు ప్రోత్సహించినదేది? రాజకీయములేగాని మతముకాదు. అటువంటి రాజకీయములు మతముపేరు పెట్టుకొనినచో ఆ దోషమెవరిది?

కాబట్టి ఏ వ్యక్తిగాని, "నాప్రవక్త మాత్రమే నిజమైన ప్రవక్త" అని చెప్పినయెడల ఆమాట నిజముగాదు. ఆతనికి మతముయొక్క తూర్పుపడమరలే తెలియలేదని గ్రహింపనగును. మతమనగా ప్రసంగముకాదు, సిద్ధాంతముకాదు, బుద్ధిగతమైన ఆమోదముగాదు. అది హృదయాంతరాళములో పొందెడి యనుభూతి; అది భగవంతుని స్పృశించుట; అనుభవించుట; నే నాత్మనని, విశ్వాత్మతోను, దాని యుత్కృష్ట విభూతులతోను నాకు సన్నిహిత సంబంధముగల ఆత్మనని యనుభూతి పొందుట. నీవు భువనములకు జనకుడైన భగవంతుని గృహమున ప్రవేశించితివేని ఆయనబిడ్డలను చూచి గుర్తింపకపోవుటెట్లు సంభవించును? నీవు వారిని గుర్తింపలేనిపక్షమున ఆ తండ్రిగృహమున నీవు ప్రవేశింపలేదని గ్రహింపనగును. తల్లి తనబిడ్డను—ఏదుస్తులు ధరించినను, ఎట్టి మారువేషము వేసికొనినను గుర్తింపగలదు. ప్రతిదేశములోను, ప్రతియుగములోనుగల ఆధ్యాత్మిక ప్రతిభాసంపన్నులయిన స్త్రీ పురుషు లందఱను గుర్తింపుడు. వారిలోవారికి వైరుధ్యము లేదు. నిజమైన మతము—దివ్యస్పర్శ, ఆత్మకు ఈశ్వరసందర్శనము ఎందెందు కలదో అందు మనస్సు వికసించి, విస్తరించి సర్వత్ర జ్యోతిని దర్శింపజేయగలుగును. ఈ విషయములో మహమ్మదీయులు మిక్కిలి యనాగరికులు, స్వమతదురభిమానపూరితులు.

వారి నినాదమిది: "ఒక్క దేవుడే ఉన్నాడు. మహామ్మద్ అతడు పంపినదూత." ఇంతకు భిన్నమైనదంతయు చెడుగు మాత్రమే కాదు; వెంటనే నిర్మూలింపదగినదికూడ; ఉత్తరువందిన క్షణములో, సరిగా ఆవిధముగా నమ్మని ప్రతిపురుషుని, ప్రతిస్త్రీని చంపివేయవలసినదే; ఈవిధమైన పూజకు సంబంధములేని దానిని వెంటనే విధ్వంసము చేయవలసినదే; మతేమైన బోధించు ప్రతి గ్రంథమును తగులబెట్టవలసినదే. అయిదువందల సంవత్సరముల కాలము పసిఫిక్ మహాసముద్రమునుండి అట్లాంటిక్ మహాసముద్రము వఱకు రక్తస్రవంతులు ప్రవహించినవి. అది మహామ్మదీయమతము! అయినను మహామ్మదీయులలో తత్త్వచింతగల వ్యక్తి ఎక్కడయిన ఉన్నయెడల అతడిట్టి హింసాకాండను నివారించుటకు ప్రయత్నించుచు వచ్చెను. అట్టి ప్రయత్నములందే అతడు దివ్యస్పర్శనుచూపి కొంత సత్యమును గుర్తించెను. అతడు మతముతో చెలగాట మాడుటలేదు. ఏలయనగా అతడు మానవుడుగా సత్యమును సూటిగా పలుకుచుండెనేగాని, తనతండ్రి మతమునుగుఱించి ప్రసంగించుటలేదు.

ఒకవంక ఆధునిక క్రమపరిణామసిద్ధాంతముతోపాటు మఱొకవంక పూర్వపద్ధతి యనుకరణాభిలాషగలదు. మతమును గుఱించి ప్రాతభావములను పున్నించెడి ప్రవృత్తియొకటి మనలో కలదు. మనము క్రొత్తవిషయ మాలోచింతము. అందులో పొర పాట్లున్నను సరే. అదే మంచిపని. లక్ష్యసాధనకెందుకు యత్నించ గూడదు? తప్పులుచేసి సరిదిద్దుకొనుటవలన మనము వివేకవంతుల మగుదుము. కాలమనంతము. ఆగోడదిక్కుగా చూడుడు. గోడ యెన్నడైన సత్యము పలికెనా? గోడ యెప్పుడును గోడయే. మానవు డసత్యము పలుకును—అతడు దేవుడుకూడ కాగలడు. ఏదోయొకటి చేయుటెమంచిది; అది తప్పని ఋజువయిన కానిమ్ము; అది నిష్క్రి యత్వముకంటెమేలు. ఆవెన్నడును అబద్ధము చెప్పదుకదా. అయిన నేమి? అదెల్లకాలము ఆవే. ఏదయిన జేయుడు! దేనినైన జిజ్ఞాసతో

పరిశీలింపుడు; మీయాలోచన తప్పుగానిండు. ఒప్పుగానిండు. ఏదో యోచింపుడు. నా పూర్వులీవిధముగా ఆలోచింపలేదు కనుక నేను నిష్క్రియుడనై కూర్చొని క్రమముగా అనుభవించెడి గుణమును, ధీశక్తిని క్షీణింపజేయుదునా? ఇంతకంటె చనిపోవుటమేలు! సజీవమైన అభిప్రాయములు, మతమునుగుఱించిన స్వంతవిశ్వాసములులేని జీవితము వ్యర్థము. నాస్తికులే కొంత మేలు. వారితరులతో నేకీభవింపక పోయినను, వారు స్వతంత్రముగా నాలోచింతురు. తమకు తాము స్వతంత్రముగా ఆలోచింపనివారు మతప్రపంచములో నింకను జన్మింప లేదని యర్థము. వారిబ్రతుకు రొయ్యచేప బ్రతుకువంటిది. వారు యోచింపరు; వారికి మతమందు శ్రద్ధలేదు. అవిశ్వాసికి, నాస్తికునకు శ్రద్ధయున్నది. అతడు శ్రమపడి ప్రయత్నించును. కనుక జిజ్ఞాసతో పరిశ్రమచేయును. దివ్యత్వముదెస పురోగమించుటకు కృషి చేయుడు. ప్రయత్నము విఫలమైనను నష్టములేదు. జిజ్ఞాసఫలితముగా విపరీతసిద్ధాంతమునకు వచ్చినను హానిలేదు. విచిత్రముగా నున్నదని అనిపించుకొనుటకు మీరు భయపడుదురేని, ఆ సిద్ధాంతమును మీ మనస్సులోనే యుంచుకొనుడు — ఇతరులకు ప్రచారము చేయ నవసరములేదు. కాని, ఏదయిన చేయుడు! దివ్యత్వముదెస అడుగు వేయుడు. వెలుగు ప్రసరింపవలెను. అనుదినము నా కెవరయిన అన్నము తినిపించుచుందురేని, కాలక్రమమున నా చేతులు నా కుపయోగపడవు. గొఱ్ఱెలమందవలె ఒకరి నొకరు అనుకరించుట ఆత్మవినాశహేతువు. మృత్యువు నిష్క్రియత్వమునకు ఫలితము. చుఱుకుతనము వహించి కృషిచేయుడు. కృషియున్నచోట అభిప్రాయభేదములు తప్పవు. భేదము జీవితమునకు రుచివంటివి; అది సౌందర్యము. ప్రతివిషయములోని కళయది. భేదము సర్వమును కళాత్మకముచేయును. జీవితమునకు మూలము. లక్షణము నానాత్వమే. నానాత్వమునుచూచి భయపడనేల?

మన మిప్పుడు ప్రవక్తల నవగాహముచేసికొనగల స్థితికి వచ్చితిమి. మత విషయమున రొయ్యచేపవంటి ఉనికివిషయ మటుం

చినను—చారిత్రక నిదర్శనము ప్రకారము, నిజమైనజిజ్ఞాస, నిజమైన ఈశ్వర ప్రేమయున్న తావున ఆత్మ ఈశ్వరాభిముఖముగా పురోగమించినది. అప్పుడప్పుడు కాంతికిరణముల ప్రసారము ద్యోతకమైనది. జీవితములో నొక్క-పర్యాయమైనను—క్షణమాత్రమైనను ఈశ్వరుని ప్రత్యక్షదర్శనము కలిగినది. వెంటనే, "సర్వసందేహములు శాశ్వతముగా పటాపంచలగును. హృదయములోని వక్రత తిన్ననగును. సకలబంధములు విడిపోవును. కర్మఫలములు, కర్మ అంతమొందును. ఏలయనగా సమీపమునందున్నవానిలోకెల్ల మిక్కిలి సమీపముననున్నవాడు, దూరాతిదూరమందున్న వానిలోకెల్ల దూరమందున్నవాడునగు భగవంతుని దర్శనమైనది" అనివచింతుము. మతమనగా అది. మతమంతయు అదే; తక్కినదంతయు వట్టి సిద్ధాంతము, చలింపని సంప్రదాయము. ప్రత్యక్షదర్శనమునకు తోడ్పడు వివిధ మార్గములు కలవు. మన మిప్పుడు గంపకొఱకు పోరుసలుపుచున్నాము; గంపలోని పండ్లు గోతిలోపడిపోయినవి.

మతవిషయమై యిరువురు తగవులాడుకొనుచున్నచో వారి యొద్దకు పోయి, ఈ ప్రశ్న వేయుడు. "మీరు దేవుని చూచితిరా? ఈ వస్తువులను చూచితిరా?" క్రీస్తు ఒక్కడే ప్రవక్తయని ఒకడనును. అతడు క్రీస్తును దర్శించినాడా? "మీ తండ్రి క్రీస్తును చూచినాడా?" "లేదండీ". "నీవు చూచితివా?" "లేదండీ" "అయితే, దేనికొఱకు మీ వివాదము? పండ్లు గోతిలో పడిపోయినవి. మీరు గంపకొఱకు తగవులాడుకొనుచున్నారా?" ఇంగితజ్ఞానము గల స్త్రీలు, పురుషులు ఈ విధముగా తగవులాడుకొనుటకు సిగ్గుపడుదురు!

దివ్యదూతలు, ప్రవక్తలు నిజమైన మహాత్ములే. ఎందువలన? వారిలో ఒక్కొక్కరు ఒక్కొక్క మహద్విషయమును బోధించుటకు వచ్చిరి. ఉదాహరణకు భారతదేశములోని ప్రవక్తలను తీసికొనుడు.

మతస్థాపకులలో వారు మిక్కిలి ప్రాచీనులు. మొదట కృష్ణుని గుఱించి పరిశీలింతము. మీలో భగవద్గీత నధ్యయనము చేసినవారు గ్రంథమునందంతటను నిర్మమతను గుఱించిన భావమొక్కటే గమనించియుందురు. మమతాగంధ వివర్జితులు కండు. హృదయ మందున్న అనురాగ మొక్కనికే సమర్పింపవలెను. ఎవరికి? ఎవరు నిర్వికారుడో అతనికి. ఎవరా యొక్కరు? అతడు భగవంతుడు. పరివర్తనాశీలము గల దేనికిగాని హృదయమధీన మొనర్చెడి పొరపాటు చేయకుడు. ఏలయనగా అది దుఃఖహేతువు. మీరు మానవుని యధీనమైతిరా. అతడు మరణించిన, దుఃఖము సంప్రాప్త మగును. మీరు మిత్రునకు మనసిత్తురేని రేపతడు మీకు శత్రువుగా మాఱవచ్చును. భర్తకు హృదయమిచ్చినయెడల అతడొకనాడు కలహింపగలడు. మనసును భార్యయధీనము చేసితిరా, ఎల్లుండి ఆమె చనిపోవచ్చును. ప్రపంచపు పోకడ ఈతీరునేయున్నది. కనుక కృష్ణుడు గీతలో నిట్లుపదేశము జేసెను : జగత్ప్రభువే ఏనాటికిని మార్పుచెందనివాడు. అతని ప్రేమ ఎన్నటికిని వ్యర్థముగాదు. మన మెక్కడఉన్నను, మనమేమిచేసినను అతడు సర్వదాకరుణామయుడే. అతని దెల్లప్పుడు ప్రేమపూరిత హృదయమే. అత డేనాటికిని మాఱడు. మనమేమి చేసినను ఆతడాగ్రహింపడు. భగవానుడెట్లు మనపై కినుకవహింపగలడు? మీ పసిబిడ్డ పెక్కు అల్లరిపనులు చేయును. మీరు శిశువుమీద కోపపడుచున్నారా? మనమేమి కానున్నామో దేవునికి తెలియదా? శీఘ్రముగానో, ఆలస్యము గానో మనము పరిపూర్ణత్వము పొందనున్నామని అతనికి తెలి యును. అతనికి ఓర్పుగలదు. అంతులేని క్షమాగుణమది. మన మతనిని ప్రేమింపవలెను; ప్రతిజీవిని అతనియందు, అతనిద్వారా ప్రేమింపవలెను. ఇది ప్రధానసూత్రము. భార్యను ప్రేమింపవలెను; భార్యకొఱకుగాదు. "ఓప్రేయసీ! భర్త ఎన్నడును భర్తకొఱకు ప్రేమింపబడలేదు. భర్తయందీశ్వరుడున్నాడు గనుక అతడు ప్రేమింపబడును." భార్యాభర్తలప్రేమలో గూడ భార్య తాను

భర్తనే ప్రేమించుచున్నానని భావించుచుండవచ్చును. కాని, భర్త యందున్న భగవంతుడే నిజమైన ఆకర్షణయని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. అతడొక్కడే ఆకర్షించువాడు. మఱొక ఆకర్షణే లేదు; సాధారణముగా భార్యకీవిషయము తెలియదు. తెలియకయే ఆమె మంచిపనిచేయుచున్నది. ఈశ్వరుని ప్రేమించుటే ఆ మంచిపని. తెలియకచేసినప్పుడే దుఃఖముకలుగును. తెలిసి చేసినచో అది ముక్తి. మా ధర్మగ్రంథములుచెప్పు విషయమిది. ఎక్కడెక్కడ ప్రేమకలదో, ఎక్కడెక్కడ ఆనందకిరణము కలదో అది ఈశ్వరుని దని గ్రహింపుము. ఆనంద స్వరూపమే, ప్రేమస్వరూపమే అతడు. అతడులేనిదే ఏవిధమైన ప్రేమ సాధ్యముకాదు.

శ్రీకృష్ణుని యుపదేశమంతయు నీతీరుననేయున్నది. ఈ భావ మతనిజాతియందు మొలకెత్తినది. తత్ఫలితముగా హిందువేమిచేసి నను, నీరుత్రాగినను. "ఇందేమైన సుగుణమున్నయెడల అది ఈశ్వ రార్పితమగుగాక!" అని పలుకును. "అతడేమైన సత్కార్యము చేయునెడల దానిఫలితము ప్రపంచమునకు చెందునుగాక. నేను చేయుపనులలో మంచిదేమైననున్నయెడల అది లోకమునకే చెందును గాక. లోకములోని చెడుగు నాకు చెందునుగాక." అని బౌద్ధుడనును. హిందువు తన కీశ్వరునియందు ప్రగాఢవిశ్వాసము కలదనును; ఈశ్వరుడు సర్వశక్తిసమన్వితుడని సర్వత్ర ప్రతి ఆత్మకది ఆత్మ యనును. "నా సకల సుగుణము లతని కర్పణచేయుదునేని, అది మహోత్కృష్టమైన త్యాగమగును. దాని ఫలితము సమస్త విశ్వ మునకు చెందును." అని హిందువు భావించును.

ఇదియొక దశ; శ్రీకృష్ణు డుపదేశించిన మఱియొక విషయ మేమి? "ఎవడు లోకరంగమున జీవించుచు, కర్మచేయుచు, తన కర్మఫలితము నంతను ఈశ్వరుని కర్పించునో అతనికి లోకములోని చెడుగు అంటదు. తామరపువ్వు నీటిలోపుట్టినప్పటికి నీటిపైకి లేచి వికసించును. కర్మఫలములన్నిటిని ఈశ్వరార్పితము చేయుచు లోక వ్యవహారములలో పాల్గొనువాని విషయముగూడ నదే విధము."

కృష్ణుడు బోధించు మతోకవిషయము నిరంతర కర్మపరాయణత్వము. కృషి, కృషి, అహోరాత్రములు కృషి అని గీత ఘోషించుచున్నది. "అయితే శాంతి ఎక్కడ?" అని మీరు ప్రశ్నించగలరు. జీవితకాలమంతయు నేను బండిలాగు గుఱ్ఱమువలె శ్రమపడి, చావవలసినచో నే నిక్కడుండుటెందుకు? అనగలరు. మీకు తప్పక శాంతి లభించగలదని కృష్ణుడభయమిచ్చుచున్నాడు. అయితే కార్యరంగమునుండి పలాయన మగుటవలన శాంతి కలుగదు. శక్యమగుచో మీ బాధ్యతలన్నిటిని విసర్జించి పర్వతాగ్రము మీదికిపొండు; అక్కడగూడ మనస్సు పరిభ్రమించుచునే యుండును. ఒకరొక సన్న్యాసి నడిగిరట. "స్వామీ, మీకు చక్కని స్థలము దొరికినదా? ఎంతకాలముగా మీరు హిమాలయ పర్వతములలో నివసించుచున్నారు?" "నలుబదేండ్లుగా" అని సమాధానము వచ్చినది. "అనేక సుందర ప్రదేశములున్నవి గదా! మీ రేదో ఒకచోటు నిర్ణయించుకొని స్థిరనివాస మేర్పఱచుకొనవచ్చుగదా! ఆపని ఎందుకు చేయలేదు?" "ఎందుకనగా ఈ నలుబది వర్షములుగా నా మనస్సు భ్రమ్మరుచునే యున్నది. అది నాకు స్థిమితము కలుగనీయలేదు." అని స్వామి బదులుచెప్పెను. "మనము శాంతి పొందవలెను." అని మనమందఱ మనుచుందుము. కాని, మనస్సు ఆపని సాధ్యపడనీయదు.

ఒక సైనికుడు తానొక తార్తారుజాతివానిని పట్టుకొంటినని ఊరివెలుపల బిగ్గఱగా కేకపెట్టెను. సైనికుల స్థావరములో నుండి, "వానిని లోపలికి తీసికొని రమ్ము" అనుమాటలు వినవచ్చినవి. "అతడు లోపలకు రాలేదంటి" అని సైనికుడు చెప్పెను. "అయితే, నీవే లోపలికిరా" అని మరల మాటలు వినబడినవి. "వాడు నన్ను లోపలికి రానీయుటలేదు." అని సైనికుడనెను. అదే తీఱున మనమనస్సులో తార్తారుడొకడున్నాడు. వానిని మనము శాంతింపజేయలేము. అతడు మనలను శాంతిపొందనీయడు. మన

మందఱము తార్తారులను పట్టుకొనియున్నాము. "స్థిమితపడుము, శాంతిపొందుము." అని ఏమేమో చెప్పుచుందుము. ఈమాటలు ప్రతి శిశువు చెప్పగలదు; తానీపని సాధించగలనని యనుకొనును. కాని, అది కష్టతరమైన పనియన్నమాట నిజము. నేను ప్రయత్నించితిని. నా విధులన్నిటిని విసర్జించితిని. కొండలపైకి వెడలితిని; గుహాల లోను, కారడవులలోను నివాసముచేసితిని. అయిననేమి? నేనింత కాలము తార్తారుని పట్టుకొనియేయుంటిని. ఇంతకాలము నా ప్రపంచము నాతోనేయుండెను. తార్తారుడు మనస్సులోనేయున్నాడు. కనుక మనము బయటిజనులను నిందింపరాదు. తార్తారుడు మన మనస్సులోనుండగా, "ఈ పరిస్థితు లనుకూలమైనవి, ఆ పరిస్థితులు ప్రతికూలమైనవి." అని మన మనుచుందుము. వానిని మనము శాంతింపజేసినయెడల మనము చక్కబడుదుము.

అందువలన మన ధర్మములను నిర్లక్ష్యముచేయరాదని కృష్ణుడు హితోపదేశము చేయుచున్నాడు. వానిని పౌరుషముతో నెదుర్కొనవలసినదని, ఫలితముల విషయమే ఆలోచింపవలదని ఆతడు పలుకుచున్నాడు. ప్రశ్నింపగలహక్కు సేవకునకులేదు. తర్కించగల అధికారము సైనికునకులేదు. ముందుకు సాగిపోవలసినదే. మీరు చేయవలసిన క్రియలోని తత్త్వమునుగుఱించి మితిమీఱి యోచింపవలదు. మీరు నిస్స్వార్థముగా నున్నదియు లేనిదియు మీ మనస్సునడుగుడు. మీరు నిస్స్వార్థముగా నున్నచో మీరు దేనినిగుఱించియైన ఆందోళన పడవలదు. మిమ్మేదియు నడ్డగింపజాలదు! ముందుకు లంఘింపుడు. అందుపాటులోనున్న విధి నిర్వహింపుడు. అది చేసినపిదప క్రమ క్రమముగా మీరు సత్యమును సాక్షాత్కరింప జేసికొందురు. "ఎవడు ప్రచండమైన కర్మయందు గంభీరమైన ప్రశాంతతను, గంభీరమైన ప్రశాంతతయందు ప్రచండమైన కర్మను కనుగొనునో అతడే యోగి, అతడే మహాత్ముడు. అతడే పూర్ణత్వము పొందినవాడు."

ఈ యుపదేశఫలితముగా లోకములోని కర్మలన్నియు పవిత్రీకృతములైనవి. ఏ క్రియనుగాని నీచమైనదనుటకు మన కధికారము

లేదు : సింహాసనారూఢుడయిన చక్రవర్తి ధర్మమెంతటి యుత్కృష్ట మైనదో, ప్రతివానిధర్మము అంత యుత్కృష్టమైనదే.

బుద్ధభగవానుని సందేశము నాలకింపుడు—అద్భుతసందేశ మది. మన హృదయములో దానికి స్థానము గలదు. "స్వార్థచింతను, నీలో స్వార్థచింతను పురికొల్పు సర్వమును సమూలముగా తొలగింపుము. భార్య, బిడ్డ, సంసారము వలదు. ప్రాపంచికవాసనలకు వశుడవు కాకుము; సంపూర్ణముగా నిస్స్వార్థము నలవఱచుకొనుము." అని బుద్ధుని ప్రబోధము. ప్రాపంచికవాసనలకు వశుడగువాడు, తాను స్వార్థచింత లేనివాడనని యనుకొనును. కాని, పత్నీముఖము చూడగానే, అతడు స్వార్థపరుడగును. తల్లి, తాను సంపూర్ణముగా స్వార్థము నతిక్రమించిన దాననని యనును. శిశువును చూడగానే ఆమెలో స్వార్థచింత ప్రవేశించును. ప్రతివిషయమున నిదేవిధము. స్వార్థచింతలు మొలకెత్తగానే, స్వార్థపరత్వముతో కూడిన కార్యము నిర్వహింపగానే మానవుడు పూర్తిగా భ్రష్టుడగును; అతడు పశు వగును; బానిసయగును ; తోడిమానవులను మఱచిపోవును. "మొదట నీవు, తరువాత నేను." అని యిక అనడు. "ముందు నేను. తక్కిన వారందఱు తరువాత. ఎవరి తిప్పలు వారిని పడనిండు." అని పలుకును.

మనలో శ్రీకృష్ణుని సందేశమునకు తావున్నది. అతని సందేశ మును మన్నింపక ముందుకు అడుగు వేయజాలము. కృష్ణుని యుప దేశమును పాటింపకుండ మన మే బాధ్యతను శాంతితో, ఆనంద ముతో, సుఖముగా, మనలోని ధర్మప్రవృత్తి కనుగుణముగా నిర్వ హింపజాలము. "మీరు చేసెడి పనిలో లోపమేదయిన నున్నను భయ పడకుడు. దోషకలుషితముకాని పని యేదియును లేదు." "దాని నీశ్వరునికి విడిచిపెట్టుడు. ఫలితముల కెదురుచూడకుడు."

మఱియొక సందేశమునకు గూడ మన హృదయములో చోటున్నది; కాలమెగిరిపోవుచున్నది; ఈ ప్రపంచము పరిమితము. సర్వము దుఃఖమయము. నిద్రావస్థయందున్న స్త్రీపురుషులారా, సుఖభోజనము, చక్కని దుస్తులతో, భోగములతో కూడిన గృహముగల మీరెన్నడయిన క్షుద్బాధతో చనిపోవుచున్న లక్షల కొలది ప్రజలవిషయ మాలోచించుచున్నారా? ఇదియంతయు దుఃఖము, దుఃఖము, దుఃఖమను యథార్థమును గుర్తింపుడు. శిశువు ఉచ్చరించు తొలిపలుకును గమనింపుడు: జన్మింపగానే ఏడ్చును. అది యథార్థము—శిశువు ఏడ్చును. ఏడ్చుటకు తగినస్థలమే యిది! దివ్యదూత సందేశమును శిరసావహింప దలచిన మనము స్వప్రయోజనపరులము కాగూడదు.

మరొకదూత, నాజరెత్ ప్రవక్త యేమి చెప్పెనో కనుడు. "సంసిద్ధులుకండు. స్వర్గరాజ్యము చెంతనేయున్నది" కృష్ణుని సందేశమును చింతనముచేసితిని. మమతలేకుండ ధర్మమును నిర్వహించుటకు ప్రయత్నించుచుంటిని. కాని, ఒక్కొక్కప్పుడు మఱపున పడుచున్నాను. వెంటనే నాకు బుద్ధునిసందేశము జ్ఞప్తికివచ్చుచున్నది: "జాగ్రత్తసుమా! ఈ జగత్తులోని సర్వము మాఱిపోవుచున్నది. ఈ జీవితములో సర్వదా దుఃఖము తప్పదు." ఈ సందేశమును విందును. దేనిని స్వీకరింపవలసిదియు నాకు పాలుపోవుట లేదు. అంతట పిడుగువలె ఈ సందేశము వినబడును: "సంసిద్ధులుకండు. స్వర్గరాజ్యము చెంతనేయున్నది. క్షణమైన ఆలస్యముచేయకుడు. రేపటికి దేనిని వాయిదా వేయవలదు. తుది సంఘటనకు సంసిద్ధులుకండు. అది వెంటనే జరిగినను జరగవచ్చును. ఈ క్షణములో జరిగినను జరగ

వచ్చును.'' ఈ సందేశమునకు కూడ తావున్నది. మనము దీనిని శిరసావహింతము. దివ్యదూతకు, ఈశ్వరునకు వందనము చేయుదము.

తరువాత సమానత్వమును ప్రబోధించు దూత, మహమ్మద్ పైగంబరు వచ్చును. ''అతని మతములో మంచివిషయమే మున్నది?'' అని మీరడుగుదురు. దానిలో మంచి లక్షణము లేవియు లేనియెడల నది యింతకాలమెట్లు మనగలిగినది ? ధర్మమే జీవించును. ధర్మమే కాలముయొక్క తాకిడికి నిలుచును. ధర్మమే బలముగలిగినది. కనుకనే మనగలదు. ఈ జీవితములో సహితము పాపి బ్రదుకెంత దీర్ఘమైనది!

అంతకంటె పుణ్యాత్ముని జీవితము దీర్ఘతరముకాదా? నిస్సందేహముగా పరిశుద్ధతయే బలము, ధర్మమే బలము. మహమ్మదీయ మతబోధలలో సుగుణమేమియు లేనియెడల ఇంతకాలమదెట్లు మనగలదు? దానిలో విశేష సుగుణమున్నది. మహమ్మదు సమానత్వమును, మానవసౌభ్రాత్రమును, అఖిల ముసల్మానుల సౌభ్రాత్రమును ప్రతిపాదించిన ప్రవక్త.

కావున ఒక్కొక్క ప్రవక్తకు, ఒక్కొక్క దూతకు ఒక్కొక్క విశిష్టసందేశము కలదు. సందేశమును మొదటవిని, తరువాత ప్రవక్త జీవితమును చూచినయెడల, జీవిత రహస్యమంతయు తేటతెల్లమగును. స్వప్రకాశమగును.

అవివేకు లిరువదివేల సిద్ధాంతములను ప్రారంభింతురు. అవి వారి మనోవికాసమున కనుగుణముగాను, మత భావముల కనుకూలమైన వివరణగాను ఉండును. వానిని ప్రవక్తల కారోపింతురు. ప్రవక్తల యుపదేశములను గొని వానికి తమ భావములు తొడుగుదురు.

ప్రతిప్రవక్త సందేశమున కతని జీవితమే భాష్యము. అతని జీవితము వైపు చూడుడు. అతడు చేసినది అతని బోధల కనుగుణముగా నుండును. భగవద్గీతను పఠింపుడు. అది గీతాబోధకుని జీవితమునకు సరిగా అన్వయమగును.

మహమ్మదీయులలో నిర్దుష్టమైన సమానత్వ ముండవలెనని మహమ్మదు నిజ జీవితముద్వారా నిరూపించినాడు. జాతి, కుల, వర్ణ, లింగభేదములేవియు పనికిరావు. టర్కీ దేశపు సుల్తాను ఆఫ్రికాలోని సంతలో నొక నీగ్రోనుకొని, సంకెలలతో అతనిని టర్కీకి తీసికొని రావచ్చును. కాని, మహమ్మదీయుడయి, తగిన యోగ్యత, శక్తులు గలిగినపక్షమున అతడు సుల్తాను కొమార్తెను వివాహము చేసికొనవచ్చును. ఈ ధర్మమును ఈ దేశములో నీగ్రోలు, అమెరికన్ ఇండియన్‌లు చూడబడుచున్న తీరుతో పోల్చి పరిశీలింపుడు! హిందువు లేమి చేయుదురో తెలియునా? మీ ప్రచారకులలో నెవరయిన సనాతనుని యాహారమును స్పృశించుట సంభవించినచో, దాని నతడు పాఱవేయును. మహోత్కృష్టమైన తత్త్వసిద్ధాంతములతోపాటు ఆచరణలోగల మా లోపములను గుర్తింపుడు; జాతి, రంగు విభేదములను పాటింపక సమానత్వమును—నిర్దుష్టమైన మానవత్వమును మన్నించుటలో ఇతరజాతులకంటె మహమ్మదీయుని ఆధిక్యమును గమనింపుడు.

ఇతర ప్రవక్తలు, ఇంకను గొప్పప్రవక్తలు రాగలరా? తప్పక వత్తురు. అయితే వారి కొఱకెదురుచూడకుడు. అంతకంటె మీలో ప్రతి ఒక్కరు క్రైస్తవ ప్రబోధమునకు సంబంధించిన ప్రాత నిబంధన లన్నిటి సంపుటియగు నిజమైన క్రొత్త నిబంధనకు ప్రవక్త యగుట నాకెక్కువ సమ్మతము. పూర్వ సందేశములన్నిటిని గ్రహిం

పుడు. వానిని మీ యనుభూతులతో సమగ్రము చేయుడు. అంతట మీ రితరులకు మార్గదర్శకులగు ప్రవక్తలగుడు. వెనుకటి ప్రవక్త లొక్కొక్కరు మహనీయగుణగరిష్ఠులు; ఒక్కొక్కరు మనకొక మహద్విషయ ముందజేసినారు. వారు మన దేవుళ్లు. మనము వారిని పూజింతుము; మనము వారి సేవకులము; మనలనుకూడ మనము పూజించుకొందము. వా రీశ్వరుని దూతలు, బిడ్డలు. మనముగూడ ఈశ్వరుని దూతలము, బిడ్డలము. వారు పరిపూర్ణత్వము పొందిరి; మనమును పొందబోవుచున్నాము. ఏసునాథుని మాటలు స్మరించు కొనుడు: "స్వర్గరాజ్యము చెంతనేయున్నది!" ఈ క్షణమే మనలో ప్రతియొకరము ఇట్లు దృఢసంకల్పము చేసికొందము: "నేను ప్రవక్త నగుదునుగాక! నేను జ్యోతిర్మయుని దూతనగుదునుగాక! నే నమృత పుత్రుడనగుదును గాక! ఈశ్వర తనూభవుడనగుదును గాక! నేను భగవంతుడనగుదును గాక!"



# శ్రీకృష్ణుడు

## (కాలిఫోర్నియాలో 1900 వ సంవత్సరము ఏప్రిల్ 1 వ తేదీని చేసిన ప్రసంగము)

భారతదేశములో బౌద్ధమత మవతరించుటకు ఏపరిస్థితులు కారణమైనవో, దాదాపు అవే పరిస్థితులు శ్రీకృష్ణుడవతరించినప్పు డేర్పడినవి. అంతేకాదు. ఆనాటి పరిస్థితులే నేడు మనయెదుట సంభవించుచున్నవి.

ఆదర్శమొకానొకటి యుండును. దానితోపాటు దాని నందు కొనలేని — బుద్ధిచేత గ్రహించుటకు సహితము శక్తిచాలనివా రసంఖ్యాకముగ నుందురు...శక్తిమంతులు ఆదర్శమును సాధింతురు. తఱచుగా అట్టివారికి దుర్బలులయందు సానుభూతియుండదు. శక్తిమంతులకు దుర్బలులు యాచకులవలె కనబడుదురు. బలవంతులు ముందుకు సాగిపోవుదురు...అయిన నేమి? దుర్బలులను కనికరించి, వారికి సహాయపడుచుండుటే పరమోత్కృష్ట ధర్మమని మనకు దెలియునుకదా! అనేక సందర్భములలో బలహీనులయందు కనికరము చూపనీయకుండ తత్త్వవేత్త లభ్యంతరము చెప్పుచుందురు. అనంతజీవితమును పూర్తిగా యిక్కడే, యిప్పుడే ఈ కొలది సంవత్సరముల కొలమానముతోనే నిర్దేశించవలసియున్నదను వాద మంగీకరించెడి పక్షమున...బలహీనులనుగుఱించి యోచించుటకు మన కవకాశములేదు. అట్టి నిబంధనలేవియు లేనియెడల, మనము ప్రవేశించవలసిన అనేక పాఠశాలలలో ఈ ప్రపంచ మొకానొకటియైనచో, శాశ్వతజీవితమును శాశ్వతధర్మముచేతనే శాసించవలసి యున్నచో, శాశ్వతధర్మము, శాశ్వతమైన అవకాశములు ప్రతివ్యక్తికి లభించుచో—మన మాతురపడవలసిన పనిలేదు.

చుట్టుపట్ల చూచుటకు, సానుభూతి చూపుటకు, దుర్బలులకు చేయూతనిచ్చి వారిని సముద్ధరించుటకు మనకు వ్యవధి యున్నది.

బౌద్ధమతముతో సంస్కృతములోనికి రెండుపదములు వచ్చినవి: ఒకటి రూపాంతరము పొందినమతము; మఱొకటి మతశాఖ. శ్రీకృష్ణుని శిష్యులు, అతని సంతతివారు అనుసరించెడి మతమునకు హిందూమతమని, బ్రాహ్మణమతమని విదేశీయులు పేర్లుపెట్టినను, నిజముగా వారి మతమునకు పేరులేదు. ఉన్నమత మొక్కటే. దానికి శాఖ లనేకములున్నవి. మతమునకు పేరు పెట్టుటతోడనే దానికి ప్రత్యేకత కలిగించి యితర శాఖలనుండి వేఱుచేయుటతోడనే అది తెగయగును; ఇక మతము కానేరదు. తెగ తన సత్యమునే చాటును. తాను చెప్పెడిదికాక, మఱెక్కడను సత్యము లేదని వక్కాణించును. లోకమున ఒక్కమతమే యిదివఱకుగలదని, యిప్పుడును ఒక్క మతమే ఉన్నదని మతము విశ్వసించును. ఏనాడును రెండు మతములు లేవు. ఒకేమతము విభిన్నసీమలలో విభిన్న కళలతో వ్యక్తమగుచున్నది. మానవకోటి పరమగమ్యము, అందుకుగల అవకాశములను తెలిసికొనుటే కర్తవ్యము.

శ్రీకృష్ణుడు సాధించిన ఘనకార్యమిది: మన కన్నులకు క్రమ్మిన మసకను తుడిచి, విశాల దృష్టితో మానవకోటి అభ్యుదయ గతిని పరిశీలింపజేయుట. అన్నిటియందు సత్యమును దర్శించిన మొట్ట మొదటి విశాలహృదయు డతడే. అందఱకు, ప్రతి ఒకరికి మొట్ట మొదట మంగళవచనములు మనోహరముగా పలికిన పెదవులతనివే.

శ్రీకృష్ణుడు బుద్ధునకు కొన్నివేలేండ్లకు పూర్వమం దున్నాడు......అతడు నిజముగా కలడనెడు నమ్మకము లేని వారెందరో కలరు. కృష్ణుని పూజ సూర్యోపాసననుండి పుట్టినదని కొందఱి నమ్మకము. కృష్ణులు పలువురున్నట్లు కనబడుచున్నది. ఒకరిని గుఱించిన ప్రస్తావన ఉపనిషత్తులలో కలదు. మఱొకరు రాజుగా నుండెను. వేఱొకరు సేనాపతి. అందఱు ఒక్క కృష్ణునిలో కలిపివేయ

బడిరి. ఇందువలన నష్టమేమియు లేదు. ఆత్మప్రతిభను ప్రదర్శించిన వ్యక్తి ఒకడవతరించును. అంతట అతనినిగుఱించి ఎన్నెన్నో గాథలు కల్పింపబడును. వానినన్నిటిని అతని శీలమున కనుగుణముగా మరల రచింపవలసియుండును. బైబిలులోని క్రొత్తనిబంధనలోని కథలన్నిటిని, అంగీకరింపబడిన క్రీస్తు జీవితమునకు, శీలమునకు అనుగుణముగా తిరిగి వ్రాయవలెను. బుద్ధునిగుఱించి భారతదేశములో రచింపబడిన కథలన్నిటిలో ఆ మహత్తర జీవితములోని ప్రధానవిషయము — ఇతరులకొఱకు త్యాగము—పదిలముగాగలదు......

కృష్ణునిలో—అతని సందేశములో రెండు విషయములు ప్రధానముగా గలవు : విభిన్నాభిప్రాయముల సామరస్యము ; నిర్మమత. ఒకడు సింహాసనముమీద ఆసీనుడయి, సేనలకు ఉత్తరువులు చేయుచు, జాతుల సముద్ధరణకు బృహత్తరప్రణాళికల నను లు పఱచుచు తోడ్తోడనే జీవితపరమార్థమును సాధింపవచ్చును. పరిపూర్ణత్వము పొందవచ్చును. నిజమునకు కృష్ణుని ధర్మోపదేశము రణరంగములో చేయబడినది.

ప్రాతకాలపు పురోహితుల భేషజమును, కర్మకలాపముల లోని శుష్క హాస్యాస్పద లక్షణములను కృష్ణుడు స్పష్టముగా గమనించెను ; వానిలోని కొన్ని సుగుణములను కూడ నతడు గుర్తించెను.

మీరు బలాఢ్యులైనచో, చాల సంతోషము. కాని, మీ యంతటివారు కానివారిని నిందింపకుడు. ప్రతివారు, "ఓ ప్రజలారా! మీకు కీడుకలుగును" అని చెప్పుచుందురు. "మీకు సహాయపడ లేక పోయినందుకుగాను నాకు కీడు కలుగుగాక!" అని ఎవరందురు? జనులు తమశక్తికి, జ్ఞానమునకు, అవకాశములకు తగినట్లుగానే చేయుచున్నారు. నేనున్నస్థితికి వారిని తీసికొనిరాలేకపోవుచున్నందులకు నాకు కీడుకలుగుగాక !

కనుక కర్మకలాపములు, బహుదేవతారాధన, అభూతకల్పనలు మంచివే అని కృష్ణుడనినాడు...ఎందుచేత? అవన్నియు మానవుని ఒకే లక్ష్యమునకు గొనిపోవును. కర్మలు, గ్రంథములు, రూపకల్పనలు—ఒకగొలుసులోని పూసలను కలుపు అతుకులవంటివి. వానిని పట్టుకొనుడు. అది ముఖ్యమైనపని. శ్రద్ధతో మీరు ఒక అతుకును పట్టుకొంటిరేని దానిని విడిచిపెట్టకుడు; తక్కినదంతయు మీకు వచ్చి తీఱును. కాని, జనులు శ్రద్ధతో గట్టిగా పట్టుకొనరు. దేనిని పట్టుకొనవలెనా యని వాదులాడుచుందురు. దేనిని పట్టుకొనరు...సత్యమే మనకు కావలసినదని ఎప్పుడును చెప్పుచుందుము. కాని, దానిని చేరుట కష్టపడము. ఇక్కడికి, అక్కడికి వెళ్లి అడుగుటలోగల సౌఖ్యమే మనకు కావలసినది. మనకు కావలసినంత శక్తికలదు. దాని నావిధముగా వినియోగించుచుందుము. అందుచేతనే, ఒకే కేంద్రమునుండి పొడిగింపబడిన ఈ గొలుసులో ఏదో ఒకదానిని గట్టిగా పట్టుకొనుడని శ్రీకృష్ణుడు ప్రబోధించినాడు. ఏ ఒక అడుగు మఱొక అడుగుకంటె గొప్పదికాదు...చిత్తశుద్ధి, శ్రద్ధ ఉన్నంతవఱకు ఏమతాభిప్రాయమును దూషింపకుము. గొలుసులోని ఈ యతుకులలో దేనినో ఒకదానిని గట్టిగా పట్టుకొనుడు. అది మిమ్ము కేంద్రమునకు లాగగలదు. మీ హృదయమే తక్కినదంతయు మీకు బోధించగలదు. మనలోగల ఆచార్యుడే సకల సిద్ధాంతములను, సకల తత్త్వశాస్త్రములను ఉపదేశింపగలడు!......

కృష్ణుడు క్రీస్తువలె తాను దేవుడనని వచించెను. తాను భగవంతుడనని ముక్తకంఠముతో పెక్కుసారు లాతడు పలికెను. "నా మార్గమును విడిచి ఎవరును తప్పిపోజాలరు. అందఱు నాదగ్గఱకు రావలసినవారే. ఎవరెవరు ఏయేరూపములలో ఉపాసింతురో, వారి వారికి ఆయా రూపములలోనే విశ్వాసము గలిగింతును. ఆ దృక్పథము ననుసరించి నేను వారికి దర్శనమిత్తును*...అని అతడు ప్రవచించుచున్నాడు. జనులందఱియందు అతనికి దయకలదు.

* భగవద్గీత అధ్యా 4—12.

సర్వతంత్ర స్వతంత్రుడుగా కృష్ణుని విశిష్టత మనకు గోచరింప గలదు. మనము ప్రతివస్తువుపై ఆధారపడుచుందుము—కొన్ని మంచిమాటలపై, పరిస్థితులపై ఆధారపడుదుము. దేనిమీదను, జీవితముమీద సహితము, ఆత్మ ఆధారపడకుండుట పరమోత్కృష్టమైన వేదాంతము— మానవుని పరిపూర్ణవికాసము. ఉపాసన మనల నట్టిస్థితికి గొనిపోగలదు. కృష్ణుడు ఉపాసన కత్యంత ప్రాధాన్య మిచ్చెను. భగవంతుని ఉపాసింపుడు.

లోకమున పలువిధములయిన ఉపాసనలను మనము చూచు చున్నాము. రోగి దైవమునందు భక్తిభావముతో నుండును... భాగ్యమును పోగొట్టుకొనినవారు కలరు. వారుకూడ ధనముకొఱకు విశేషముగ ప్రార్థన చేయుదురు. దేవునికొఱకే దేవుని ప్రేమించుటే సర్వోత్కృష్టమైన ఉపాసన. దేవుడనెడి వాడొకడున్నచో ప్రపంచ మున నింతదుఃఖమేల ఉండవలెనను ప్రశ్నతోచుచుండును. భక్తు డిట్లు సమాధానము చెప్పును... "లోకములో దుఃఖమున్నది. అంత మాత్రముచేత దేవుని ప్రేమించుట నేను మానను. నా కష్టము తొలగింపుడని నేను దేవుని ప్రార్థించను. అతడు ప్రేమస్వరూపుడు గనుక నేనతనిని ప్రేమింతును." ఇతరవిధములయిన ఉపాసనలు తక్కువస్థాయికి చెందినవి; కాని, కృష్ణుడు దేనిని ఖండించడు. నిశ్చేష్టుడయి ఉండుటకంటె ఏదో ఒకటి చేయుట మేలు. భగవంతుని ఉపాసించుటకు ప్రారంభించినవారు క్రమక్రమముగా పెఱిగి నిస్వార్థ ప్రీతితో దేవుని ఆరాధింతురు.

ఈ జీవితములో పవిత్రాత్ములమగుటెట్లు? మనమందఱ మడవులకో, పర్వతగుహలకో పోవుదమా? దానివలన మనకేమి ప్రయోజనము? మనస్సు మన యధీనములో లేకపోయినతరువాత గిరిగుహలో నివసించినమాత్రమేమి యుపయోగము? ఏలయనగా ఈ మనస్సే అక్కడ మన కవరోధములు కల్పించును. గుహలో మన కిరువది భూతములు ప్రత్యక్షమగును. ఏలయనగా అవన్నియు మన

మనస్సులో నున్నవే. మనస్సు మన యధీనమైనయెడల ఎందు గావలసిన నందే, మనమెందున్న నందే గుహ ఏర్పడగలదు.

మనకు ప్రపంచము అగపడువిధము మన మానసికస్థితిపై ఆధారపడియుండును. మన మనోభావముల ననుసరించి వస్తువులు సుందరముగానో, వికృతముగానో కనబడుచుండును. ప్రపంచ మంతయు మన మనస్సులో గలదు. సమ్యగ్ దృక్పథముతో వస్తువ్రులను చూచుట నేర్చుకొనుడు. మొదట ప్రపంచమును విశ్వసింపుడు-- ప్రతిదానికి అర్థము కలదని నమ్ముడు. జగత్తులోని ప్రతివస్తువు మంగళకరమైనది, పవిత్రమైనది, సుందరమైనది. మీ కేదేని చెడుగు కనబడిన యెడల దానిని సరిగా అర్థముచేసికొనుట లేదని మీరు గ్రహింపుడు. భారము మీపైనే వేసికొనుడు!...లోకము భ్రష్టమైపోవుచున్నట్లు మనకు తోచినప్పుడెల్ల మనలను మనము పరిశీలించి చూచుకొనవలెను. అటుపిమ్మట వస్తువుల యథార్థస్వరూపమును చూడగల శక్తి మనలో లుప్తమైనదని తెలియగలదు.

రేయింబవళ్లు కృషిచేయుడు! ''చూడుడు. నేను జగత్తుకు ప్రభువును. నాకు విధ్యుక్త ధర్మమనునది లేదు. ప్రతికర్మయు బంధమే. నేను నిష్కామముగా కృషిచేయుదును. నిమిషమాత్రమైనను నేను పనిచేయుట మానివేసినయెడల అరాజకము, సంక్షోభము కలుగును. కనుక మీరును నిష్కామముగ కృషిచేయుడు.''*...

జగత్తు ఒక క్రీడ. క్రీడలో మీ రతని సహచరులు. ఏ విధమయిన దుఃఖమునకు దైన్యమునకు తావీయక కర్తవ్యమును నిర్వహింపుడు. మురికిపేటలలో, బహిరంగప్రదేశములలో అతని క్రీడను గమనింపుడు! ప్రజోద్ధరణకు కృషిచేయుడు! వారు దుష్టులు, పతితులు అనుభావముతో ఆతడట్టి భావమును వ్యక్తీకరింప లేదు. శ్రీకృష్ణుడామాట చెప్పడు.

సత్కార్య మింత తక్కువగా జరుగుటకు కారణమేమో మీకు తెలియునా? నా భార్య మురికిపేటలకు పోవును...కొన్ని నాణెములు

* భగవద్గీత అధ్యా, 3. 22-23.

విసరివేసి, "దీనులారా! వీనిని తీసికొని సుఖపడుడు." అని ఆమె పలుకును... లేదా, ఆ సుందరి వీథిలో నడచుచు, ఒక నిరుపేదను చూచి అయిదు చిన్న నాణెము లాతని ముందు పాఱవేయును. ఈ వైఖరి ఎంత క్షుద్రమైనదో యోచింపుడు! ఇది ఈశ్వరుని నిందించుటవంటిది. ప్రభువు తనబోధను మీ మతనిబంధనలోకూడ తెలియజేసినందుకు మనము ధన్యులము. "నా సహోదరులలో హీనాతిహీనస్థితిలో నున్నవారికి నీవు చేసెడిసేవ నాకు చేసినట్లే" అని ఏసునాథుడు చెప్పియున్నాడు. ఎవరికిగాని మీరు సహాయము చేయగలరనుకొనుట అపచారము. ఇది ఈశ్వర నిందకెనయైనది. సహాయపడుట అనెడి భావమును పరిత్యజింపుడు. పిమ్మట ఉపాసింపుడు. దేవుని బిడ్డలు మీ ప్రభువుబిడ్డలు. బిడ్డలు జనకునికి వివిధరూపములు. మీ రతని సేవకులు... జీవముతోనున్న దేవుని సేవింపుడు! దేవుడు అంధుడుగా, కుంటివాడుగా, దరిద్రుడుగా, బలహీనుడుగా, క్రూరుడుగా మీదగ్గఱకు వచ్చుచున్నాడు. ఉపాసించుటకు మీకెంతటి ఉత్కృష్టమైన అవకాశము కలిగినది! "సహాయము" చేయుచున్నామను తలంపు మీకుకలుగగానే, సర్వము తారుమారగును; మీరు పతనము చెందుదురు. ఈ తత్త్వమును గ్రహించి కృషి చేయుడు. "దీనిఫలితమేమి?" అని మీరడుగుదురు. హృదయ విదారకమైన దుఃఖము మీకు కలుగదు... అంతట కృషి బానిసతనము కానేరదు. అది క్రీడయగును; ఆనంద ఖేలనమగును... కృషి చేయుడు. కాని, మమతవలదు! రహస్యమంతయు అందేకలదు. మమతవలన బంధితులైతిరా, దుఃఖమునకు గుఱియగుదురు......

జీవితములో మనము చేయు ప్రతిక్రియతోను మనము తాదాత్మ్యము పొందుదుము. నాతో దుర్భాషలాడెడి వ్యక్తి యిక్కడ కలడు. నాకు కోపమువచ్చుచున్నట్లు గ్రహింతును. కొలది క్షణములలో నేనును ఆగ్రహమును ఒక్కటి అయిపోవుదుము. పిమ్మట నాకు దుఃఖమువచ్చును. భగవంతునితోదక్క మఱి దేనితోను అను

బంధము పెట్టుకొనకుడు. తక్కినదంతయు అసత్యమే. అసత్యమైన దానితో మమత దుఃఖహేతువు. సత్యమైన దొక్కటే; ఒక జీవితమే. దానిలో జ్ఞేయము లేదు, జ్ఞాత లేదు.

మమతలేని ప్రేమ మీకు బాధకలిగింపదు. మీరేమి చేసిననుసరే—వివాహము చేసికొనుడు, బిడ్డలను కనుడు...మీ యిష్టము. ఏమి చేసిననుసరే—మిమ్మేదియు బాధింపదు. "నాది" యనెడి భావముతో ఏదియు చేయకుడు. ధర్మముకొఱకే ధర్మము; కృషికొఱకే కృషి. దానివలన మీకేమిబాధ? మీరు తటస్థులుగా ఉండుడు.

నిస్సంగత్వ మలవడినతరువాత అద్భుతమైన ఈ సృష్టి రహస్యము బోధపడగలదు; అది ఎట్లు? ఏకకాలమందే ప్రచండ కార్యరూపము, ప్రశాంతస్థైర్యము అగునో; అనుక్షణము ఎట్లు క్రియ, నిష్క్రియత్వము కలవో అవగాహముకాగలదు. ఇదే సృష్టి మర్మము—వ్యక్తిత్వము, వ్యక్తిత్వ రాహిత్యము; సాంతము, అనంతము కలిసియే ఉన్నవి. అప్పుడు రహస్యము తెలియగలదు. "ఎవడు తీవ్రమైన కర్మలో అకర్మను, నిశ్చలమైన అకర్మలో కర్మను దర్శించగలడో అతడు యోగి." (గీత. అధ్యా 4—18). అతడే నిజమైన కర్మపరాయణుడు, తదితరులుకారు. మనము కొంచెము పని చేసి ఆయాసపడుచుందుము. ఎందువలన? పనియందు మమత కలియుటవలన. మనము మమతను విడిచిపెట్టగలిగినచో కృషితో పాటు అనంతమైన విశ్రాంతికూడ పొందగలుగుదుము...

మమతాగంధవివర్జితమైనస్థితి పొందుట ఎంతకష్టము! అందుచే మనకు శ్రీకృష్ణుడు తక్కువస్థాయికి చెందినపద్ధతులు, విధానములు చూపుచున్నాడు. స్త్రీకిగాని, పురుషునకుగాని, ప్రతి వానికి మిక్కిలి సులభమైన ఉపాయము తనపని తానుచేయుచు ఫలితమును తీసికొనకుండుట. మనలను బంధించునది మనకోర్కెయే. మనము చేసెడిపనుల ఫలితములను పొందదలచినయెడల—అవి సత్ఫ

లితములు కావచ్చును, దుష్ఫలితములు కావచ్చును—వానిని మన మనుభవించవలసినదే. కాని, మనకొఱకుగాక, మన ప్రభువైన ఈశ్వరుని ప్రస్తుతించుటకై మనము కర్తవ్యమును నిర్వహించితిమేని మనల నంటని ఫలితము లే పొడసూపును. "పనిచేయుటకే నీ కధికారముకలదు. దాని ఫలితము నపేక్షించుటకుగాదు." (గీత 2—47). సైనికుడు ఫలితమాశించి పనిచేయడు. అతడు తనవిధిని నిర్వర్తించును. పరాజయము సంభవించినయెడల అది తన నాయకునిది, తనదికాదు. ప్రేమను దృష్టిలోనిడికొని మనధర్మమును నెఱపవలెను. సేనాధిపతి మీది ప్రేమ, ప్రభువుమీదిప్రేమ ననుసరించి ధర్మమును నిర్వహింపవలెను...

మీరు శక్తిమంతులయినయెడల, వేదాంత సందేశమును స్వీకరించి స్వతంత్రులు కండు. అది మీకు సాధ్యముకాని పక్షమున, ఈశ్వరుని ఉపాసింపుడు; లేదా, ఏదోఒక ప్రతిమను పూజింపుడు. దానికి కావలసిన దార్ఢ్యముకూడ మీకు లేనిచో ఫలితమాశింపక సత్కార్యములు చేయుడు. మీకుగల సర్వస్వము ప్రభువును సేవించుటకు వినియోగింపుడు. పోరు సాగింపుడు! "పత్రమో, పుష్పమో, తోయమో ఎవరు నా కర్పింతురో దానిని నేను వారి భక్తికి సమానమైన ఆనందముతో స్వీకరించెదను." (గీత : అధ్యా 9—26). ఒక్క మంచిపని అయినను మీరు చేయలేనిచో భగవంతు నాశ్రయించి శరణువేడుడు. "ఈశ్వరుడు సకల జీవుల హృదంతరమందు వసించుచున్నాడు. వానినతడు తన యంత్రముమీద త్రిప్పుచున్నాడు. నీవు నిండు హృదయముతో, బలముతో అతని శరణువేడుము......" (గీత 18-61).

ఇవి శ్రీకృష్ణభగవానుడు తనగీతలో ప్రేమతత్త్వమును గుఱించి చెప్పిన కొన్నియభిప్రాయములు. ఇతర ఉద్గ్రంథములలో బుద్ధుడు, క్రీస్తు ప్రభృతులు ప్రేమతత్త్వమును గుఱించి చేసిన ధర్మోపదేశములుకలవు....

శ్రీకృష్ణుని జీవితమును గురించి కొలది మాటలుగమనింపుడు. జీసెసు జీవితమునకు కృష్ణుని జీవితమునకు చాలపోలిక కలదు. ఎవ రెవరి యొద్దనుండి విషయము గ్రహించిరను అంశముపై చర్చజరుగు చున్నది. ఉభయుల దేశములందు నిరంకుశు డయిన రాజుకలడు. ఇద్దరు గడ్డివాములో పుట్టిరి. ఉభయుల తల్లిదండ్రులు కారాగార బద్ధులైరి. ఉభయులు దేవతలచేత రక్షింపబడిరి. ఉభయుల జీవిత కథలలోను వారు పుట్టిన సంవత్సరమున జన్మించిన శిశువులందఱు చంపివేయబడిరి. బాల్యదశ ఒకటే......చివరకు ఇద్దఱు హత్య చేయబడిరి. కృష్ణుడు ప్రమాదవశమున చనిపోయెను; అతడు తన్ను చంపినవానిని వైకుంఠమునకు గొనిపోయెను. జీసెసు తన్ను హత్యచేసినవారిని ఆశీర్వదించి వారి స్వర్గప్రాప్తికి తోడ్పడెను.

గీతలోని ఉపదేశములకును బైబిలులోని క్రొత్త నిబంధనల బోధలకును పోలికలనేకములు కలవు. మానవుని ఆలోచన ఒకే తీరున సాగినది......కృష్ణుడు చెప్పిన మాటలలోనే మీకు సమాధానము చూపెదను: "ఎప్పుడెప్పుడు ధర్మము క్రుంగి అధర్మము పెచ్చు పెరుగునో అప్పుడప్పుడు నే నవతరింతును. పునః పునః నే నవత రింతును. కనుక, ఎప్పుడుగాని ఎవరయిన మహాపురుషుడు మానవ కోటి సముద్ధరణకు పాటుపడుచున్నట్లు నీవు చూచెదవేని, అతడు నేనే అని గ్రహించి, ఆరాధింపుము". (గీత అధ్యా. 4-8; 10-41)

అతడు జీసెసుగానో, బుద్ధుడుగానో అవతరించిన యెడల వివాదమేల? మన మనుసరించవలసినది బోధలను! భగవానుడే క్రీస్తుగా, కృష్ణుడుగా, బుద్ధుడుగా, మహాపురుషుడుగా అవత రించునని హిందువుభావించును. "వారు మహాత్ములు. ముక్త పురుషులు. బంధవిముక్తులయినను, లోకమంతయు దుఃఖపడు చుండగా మోక్షము ననుభవించుట కిష్టములేనివారయి, వారు మోక్షమును నిరాకరించి"రని హిందూతత్త్వవేత్త పలుకును మఱల వారు మానవులుగా అవతరించి మానవకోటికి సహాయపడుచుందురు.

తామెవరో ఎందుకొఱకు వచ్చిరో వారికి బాల్యదశనుండియు తెలియును...వారు మనవలె బందీలుగారారు...స్వచ్ఛంద విహారులయి, అద్భుతమైన ఆధ్యాత్మికశక్తితో వారు వత్తురు. ఆ శక్తిని మనము ప్రతిఘటింప లేము. సుడిగుండములోని కీడ్చినట్లు ఆ శక్తి మానవ కోటిని ఆధ్యాత్మికపథమున జేర్చును. ఒక మహాపురుషుడు కలిగించెడి యొత్తిడివలన ఆధ్యాత్మికశక్తితరంగసంచారము సాగుచునే యుండును. యావన్మానవకోటికి విమోచనము గలిగి, పృథ్వీ మండలముమీద లీల పరిసమాప్తమగువఱకు అది సాగుచునే యుండును.

ఏ మహాత్ముల జీవితకథలను మనము పఠించుచున్నామో, వారు మహిమాన్వితులు! వారు లోకమున అవతరించిన ప్రాణ సందీపిత దేవతలు. మన ముపాసించవలసినది వారినే. మానవరూపములో నాయొద్దకు వచ్చినంతనే వారిని గుర్తింపగలను. ఈశ్వరుడు డంతటను కలడు. అయితే మనము చూచుచున్నామా? మానవ పరిమితి నతడు ధరించినప్పుడే మన మతనిని గుర్తింపగలము... మానవులు,...పశువులు భగవంతుని వికాసమే అయినయెడల, మానవకోటి పురోగతి సూచించెడి ఈ బోధకులు మార్గదర్శకులు, గురువులు. "కాబట్టి ఈశ్వరా! దేవతలు ఉపాసించెడి నీ పాదపీఠమునకు ప్రణామములు! మానవజాతికి మార్గదర్శకుడవైన నీకు ప్రణామములు! జగద్గురువైన నీకు ప్రణామములు! నాయకుడవైన నీకు సర్వదా మాప్రణామములు సమర్పించుచున్నాము."

# బుద్ధభగవానుడు

## (డెట్రాయిట్‌లో స్వామిజీచేసిన ప్రసంగము)

ఆత్మనిష్ఠకు ఒక్కొక్క మతములో ఒక్కొక్క విధానము వృద్ధిపొందినది. కోర్కెలేకుండ కృషిచేయు విధానము బౌద్ధమతమున విశేషముగా అభివృద్ధిపొందినది. బౌద్ధమతము, బ్రాహ్మణమతము ఒక్కటే యని భ్రమింపకుడు. ఈ దేశములోనివారట్టి పొరపాటుపడగల అవకాశమున్నది. మా మతశాఖలనేకములో బౌద్ధమతమొకానొకటి. గౌతముడను మహాపురుషుడు బౌద్ధమతమును స్థాపించినాడు. పరతత్త్వమునుగుఱించిన చర్చ నాడు ప్రబలముగా జరుగుచుండెను. ఎంతకును తెగని సమస్య అది. అట్టి తత్త్వమీమాంసతోను, నాడు విపరీతముగా పెరిగిపోయిన కర్మకలాపములతోను, కులభేదములతోను అతడు విసువుచెందెను. మనమొకానొక స్థితియందు జన్మించితిమి. కావున, ఆ స్థితియందు పుట్టనివారికంటె అధికులమని కొందఱు చెప్పుదురు. పురోహితవర్గ ప్రాబల్యమునకు కూడ బుద్ధుడు ప్రతికూలుడే. కోర్కెల ప్రేరణలేని మతము నతడు బోధించెను. పరతత్త్వము, దేవుడు—వీనినిగుఱించిన సిద్ధాంతముల విషయమై అతడు పూర్తిగా ఉపేక్ష వహించెను. దేవుడున్నాడా? అని అతనిని పలుమాఱు ప్రశ్నించిరి. తనకు తెలియదని అతడు చెప్పుచు వచ్చెను. సద్వర్తనమునుగుఱించి అడిగినప్పుడు, "పుణ్యకార్యములే చేయుచుండుడు. సద్భావముతోనే ఉండుడు." అని అతడు చెప్పువాడు. ఒకనాడతని దగ్గఱకు అయిదుగురు బ్రాహ్మణులువచ్చి తమ వివాదమును పరిష్కరింపుడని కోరిరి. వారిలో ఒకడు, "దేవుడిటువంటివాడు. అటువంటివాడు. అతనిని పొందుటకు మార్గమిది." అని నా గ్రంథము చెప్పుచున్నది." అనెను. మఱొకడు లేచి, "ఆర్యా! అది బొత్తుగా తప్పు. నా గ్రంథ మీవిధముగా చెప్పుచున్నది. భగవంతుడు ఫలానాలక్షణములు గలవాడు. అతనిని పొందుటకు మార్గ

మది'' అనెను. అదేవిధముగా తక్కినవారుకూడ చెప్పిరి. వారందఱు చెప్పినది బుద్ధుడు సావధానముగా విని, ఒక్కొక్కరిని ఈ విధముగా ప్రశ్నించెను: ''దేవుడాగ్రహించునని, ఎవరినిగాని ఎప్పుడయిన హింసించుననిగాని, అతడపవిత్రుడనిగాని మీగ్రంథములలో నేది గాని చెప్పుచున్నదా?'' ''లేదు స్వామీ! అతడు పవిత్రుడని, మంగళస్వరూపుడని గ్రంథములెల్ల వక్కాణించుచున్నవి'' అని వారు పలికిరి. ''అగుచో మీరు పరిశుద్ధులు, సాధుశీలురు కారాదా? అప్పుడే భగవంతు డెటువంటివాడో తెలిసికొన గలుగుదురు'' అని బుద్ధుడు హితవుపలికెను.

అయితే, బుద్ధుడు ప్రతిపాదించిన తత్త్వవాదమునంతను నే నామోదింపజాలను. నా అంతకు నాకు తత్త్వమీమాంస చాల కానలెను. అనేకవిషయములలో నా యభిప్రాయములు భిన్నములు. అభిప్రాయ భేదమున్నందున మానవుని సౌందర్యమును నేను గుర్తింపకూడదా? కోర్కెలప్రేరణ ఏకోశమున లేని మానవుడత డొక్కడే! తాము కేవలము భగవంతుని అవతారమే యని చెప్పిన మహానుభావులున్నారు. తమ్ము నమ్మినవారు స్వర్గము పొందుదురనికూడ వారు పలికిరి. బుద్ధుడు కొన ఊపిరితోకూడ చెప్పినదేమి? ''నీకెవ్వరు సహాయపడజాలరు; నీకు నీవే తోడ్పడ వలెను. నీ మోక్షమును నీవే సంపాదించుకొనవలెను.'' తన్ను గుఱించి ఆతడనినమాటలివి: ''బుద్ధుడను పదము అనంతమైన జ్ఞానమునకు పేరు. అది ఆకాశమువలె ననంతము. గౌతముడను నే నాస్థితి పొందితిని; మీరును సాధనచేసినచో ఆస్థితి పొందగలరు.'' కోర్కెలను పూర్తిగా పరిత్యజింపుడు. అతడు స్వర్గమునకు పోవలె నని అపేక్షింపలేదు; ధనమాశింపలేదు; రాజ్యమును, సర్వమును పరిత్యజించెను. అతడార్యావర్తపు వీధులలో భిక్షాటనము చేయుచు, సాగరమంతటి విశాలహృదయముతో మానవ కోటి మేలుకొఱకు, జంతుకోటి మేలుకొఱకు బోధచేసెను. యజ్ఞ

ముగ్గో పశుబలిని నివారించుటకు, జంతువును రక్షించుటకు తన ప్రాణము నిచ్చుటకు సదా సంసిద్ధుడయిన మహాపురుషు డతడొక్కడే! అతడొకపర్యాయము రాజుతో నిట్లనెను: "గొఱ్ఱెపిల్లను బలియిచ్చుటవలన నీకు స్వర్గము లభించునేని, మానవుని బలియిచ్చినచో అంతకంటె ఎక్కువమేలు కలుగునుకదా! కనుక నన్ను బలి యిమ్ము" రాజు నిర్ఘాంతపోయెను. బుద్ధునికి దేనియందును ఆసక్తి లేదు. నిర్దుష్టము, పరిపూర్ణము అయిన క్రియాశీలమునకు నిదర్శనము బుద్ధుడు. అతడు పొందిన మహోన్నత స్థాయినిబట్టి మనము కూడ కర్మమార్గమున ఆధ్యాత్మికపరిపూర్ణత్వము పొందగలమని స్పష్టమగుచున్నది.

ఈశ్వరునియందు విశ్వాసమున్నచో, ఈ మార్గమనేకమందికి సులభమగును. దేవునియందు నమ్మకము లేకపోయినను, తత్త్వసిద్ధాంతము లేకపోయినను, ఏమతశాఖకును చెందకపోయినను, చర్చికిగాని, దేవళమునకుగాని వెళ్లకపోయినను, భౌతికవాదిని నేనని చెప్పుకొనినను పరమపదవిని పొందుట ఎవనికైన సాధ్యమని బుద్ధుని జీవితమునుబట్టి తేటతెల్లమగుచున్నది. అతనిని విమర్శించుటకు మన కధికారము లేదు. బుద్ధుని హృదయములో లవలేశమైనను నాకున్నచో ఎంత బాగుండునా యని అనిపించుచుండును. బుద్ధుడు దేవుని నమ్మి యుండవచ్చు. నమ్మియుండకపోవచ్చు. ఆవిషయము నా కనవసరము. ఇతరులు దేవుని ప్రేమించుటవలన—భక్తిమార్గమున—యోగమార్గమున, జ్ఞానమార్గమున ఏపరమోన్నతస్థితిని పొందిరో, బుద్ధుడును ఆస్థితిపొందెను. పరిపూర్ణత్వము కేవలము విశ్వాసము వలన కలుగదు. ప్రసంగమువలన చేకుఱున దేమియు లేదు. చిలుకలు కూడ పలుకగలవు. పరిపూర్ణత్వము నిష్కామ కర్మవలన కలుగును.

# బుద్ధదేవుని సందేశము

## (శాన్‌ఫ్రాన్సిస్కోలో 1900 వ సంవత్సరము మార్చి 18 వ తేదీని స్వామిజీచేసిన ఉపన్యాసము)

చారిత్రకముగా బౌద్ధమత మత్యంత ముఖ్యమైనది-తాత్త్వికము కాదు. చారిత్రకముగానే - ప్రపంచములో నది మహత్తరమైన మతోద్యమము : మానవసంఘముపై పొంగి ప్రవహించిన బృహత్తరమైన ఆధ్యాత్మిక ధార. ఏదోయొక విధముగా దాని ప్రభావమునకు గుఱికాని నాగరికత లేనేలేదు.

బుద్ధుని యనుచరులు మిక్కిలి యుత్సాహశీలురు, ధర్మప్రచార దీక్షగలవారు. స్వస్థలములోని పరిమితమాత్రమతసంస్థతో తృప్తి చెందని వివిధ మతావలంబులలో బౌద్ధులు మొట్టమొదటివారు. వారు దూరదేశములకు వ్యాపించిరి; నలుదిశలకు ప్రయాణము చేసిరి; టిబెట్టులోని దుర్గమప్రాంతములకు బోయిరి; పర్షియాకు, ఆసియామైనర్‌కు వెళ్లిరి; పాశ్చాత్య ప్రపంచములోని రష్యా, పోలెండు వంటి పెక్కు దేశముల కేగిరి; చైనా, కొరియా, జపాన్ దేశములకును నడచివెళ్లిరి; బర్మా, సయాం, తూర్పుఇండియా దీవులు దాటి ప్రయాణము చేసిరి. అలెగ్జాండర్ చక్రవర్తి దండయాత్రల ఫలితముగా మధ్యధరా ప్రపంచమునకు ఇండియాతో సంబంధము కలిగినప్పుడు, ఆసియా, ఐరోపా ఖండములలోని పెక్కు దేశములకు భారతీయ విజ్ఞానమును ప్రసారము చేయుటకు అవకాశములు కలిగెను. బౌద్ధమతగురువులు వివిధ దేశములలో ధర్మబోధ చేయుటకు పయనమైరి. వారి బోధలవలన మూఢవిశ్వాసములు, పురోహితవర్గముల వంచన సూర్యరశ్మిసంస్పర్శవలన మంచు మటుమాయమై పోవునట్లు మాయమాయెను.

క్రైస్తవమతము నర్థముచేసికొనుటకు, ఏసుక్రీస్తు పుట్టినప్పటి యూదుల సాంఘికపరిస్థితులు తెలిసికొనుట అవసరము. అదేవిధ

ముగా బౌద్ధమతోద్యమమును సవ్యముగా నర్థముచేసికొనుటకు బుద్ధుడవతరించినప్పుడు భారతదేశములో ప్రబలిన పరిస్థితులేవో గ్రహించుట అవసరము. ఏసుక్రీస్తు పుట్టుట కాఱుశతాబ్దములకు పూర్వము భారతదేశములోని సాంఘిక పరిస్థితులనుగుఱించి మీరు తెలిసికొనవలెను. నాటికి భారతీయ నాగరకత పరిపూర్ణవికాసము పొందెను.

భారతీయ నాగరకతను పరిశీలించినచో అది పలుమాఱు నశించి, పునరుజ్జీవనము పొందిన విషయము బోధపడగలదు; ఇదిదాని వైచిత్ర్యము. అనేక జాతులొకసారి యవతరించి తరువాత శాశ్వతముగా నశించిపోవును. రెండు విధములయిన జాతులున్నవి. కొన్ని నిరంతరాభివృద్ధి పొందుచుండును; మఱికొన్నిటి యభివృద్ధి యొకానొక దశతో ఆగిపోవును. శాంతిప్రీతి గల ఇండియా, చైనాల వంటి జాతులు పతనము చెందినను మరల అభ్యుదయము పొందుచుండును; మఱి కొన్ని జాతులొకపర్యాయము క్షీణించినచో పునరుద్ధరణము నందలేవు. అవి నశించిపోవును. శాంతిప్రియులు ధన్యులు; వారు పృథ్విలో సుఖానుభూతి నందెదరు.

బుద్ధుడు ప్రభవించునప్పటికి భారతదేశమున ఆధ్యాత్మిక రంగములో నాయకత్వము వహింపగల మహాప్రవక్త యొకడు కావలసివచ్చెను. అప్పటికే బలమైన పురోహితవర్గము గలదు. ఆ పరిస్థితిని యూదులచరిత్రను మీరు పరిశీలించినచో, చక్కగా గ్రహింపగలరు—యూదులకు రెండు తరగతుల మత నాయకులుండిరి—పురోహితులు, ప్రవక్తలు. పురోహితులు ప్రజల నజ్ఞానమునందుంచి, మూఢవిశ్వాసములను వారి మనసులందు నూఱిపోయుచుండిరి. ప్రజలపై తమ యాధిపత్యమును సుస్థిరము చేసికొనుటకు వీలయిన పూజావిధానములను సూచించుచుండిరి. పురోహితవర్గముల మూఢవిశ్వాసములను ప్రవక్తలు తీవ్రముగా ఖండించిన ఉదంతములు బైబిలులోని ప్రాతనిబంధనము నందంత

టను గలవు. ఉభయులకు జరిగిన ఈ సంఘర్షణ ఫలితముగా ప్రవక్తలు విజయము పొందిరి, పురోహితులు పరాజయము పొందిరి.

దేవుడు కలడని పురోహితులు నమ్మెదరు. కాని, తమ ద్వారామాత్రమే దేవుని సమీపించుట సాధ్యమని వారు చెప్పు దురు. తమ యనుమతితోనే ప్రజలు గర్భాలయములలో ప్రవేశింపవచ్చునని వారి ప్రచారము. మీరు పురోహితులకు రుసుము చెల్లింపవలెను ; పూజింపవలెను ; మీ సర్వస్వము వారి యధీనము చేయవలెను. ప్రపంచమందంతటను పురోహితవర్గప్రాబల్యము పునః పునః పొడచూపినట్లు చరిత్రలో నిదర్శనములు గలవు— అధికారవాంఛ, బెబ్బులి దాహమువంటి తృష్ణ మానవప్రకృతి లోనే యున్నదేమో యనిపించుచున్నది. మీపై పురోహితులు పెత్తనము చేయుదురు ; వేయి విధినిషేధములతో మిమ్ము ఉక్కిరి బిక్కిరి చేయుదురు. సులువయిన చిన్న విషయములను వారు జటిలముచేసి, డొంకతిరుగుడుగా చెప్పుదురు. తమ యాధిక్యమును నిరూపించుకొనుటకై వారేవేవో కథలు, గాథలు చెప్పుదురు. మీరు ఇహలోకములో వర్ధిల్లవలెననినను, మరణానంతరము స్వర్గమునకు పోవలెననినను ఆపని వారి చేతులమీదుగా జరుగవలసినదే. అన్ని విధములయిన కర్మకలాపములు చేసితీరవలసినదే. దీనిఫలితముగా జీవితము జటిలము, క్లిష్టమునయినది ; భావసంక్షోభము కలిగినది. అందుచేత నేను సూటిగా ఉన్నది ఉన్నట్లు విషయము సుస్పష్టము చేసినయెడల మీకు సంతృప్తి కలుగదు. మీరు పూర్తిగా వెర్రి వారయినారు. ఎంత తక్కువగా అర్థమయిన, అంత ఎక్కువగా సంతృప్తి పొందుదురు ! ప్రవక్తలు పురోహితుల విషయమై, వారుబోధించు మూఢవిశ్వాసముల విషయమై, వారి కుతంత్రముల విషయమై తఱచుగా హెచ్చరికలు చేయుచునే యున్నారు; కాని, వారి హెచ్చరికలను

జనబాహుళ్యమింకను వినిపించుకోనలేదు—ప్రబోధము, సంస్కారము వారికింకను కలుగవలసియున్నవి.

జనులు చదువుకొనితీఱవలెను. ఈ దినములలో ప్రజాస్వామ్యమని, సమానత్వమని చెప్పుచున్నారు. అందఱితో తాను సమానుడే యని సామాన్య మానవుడెట్లు గ్రహింపగలడు? అతని మెదడు బలమైనదిగా నుండవలెను. అసంగతములయిన భావము లేవియు లేకుండ స్పష్టముగా యోచింపగల మనస్సు కావలెను; తన మనస్సుపై తామరతంపరగా పెఱిగిపోయిన మూఢ విశ్వాసములను తొలగించుకొనుచు, తన యంతరంగములోనున్న సత్యమును ఆతడు దర్శింపగలుగవలెను. అప్పుడతడు సమస్త పరిపూర్ణత్వము, సకల శక్తులు తనయందేగలవని, ఇవి తన కితరులీయవలసినవి గావని తెలిసికొనును. ఈ విషయ మతనికి రూఢియైనతరువాత అతడు స్వతంత్రుడగును, సమానత్వమును పొందును. తనవలెనే ప్రతివ్యక్తి తనతో సమానముగా పరిపూర్ణత్వముగలవాడేయని, అందువలన తన సోదరులపై తాను శారీరకముగాగాని, మానసికముగాగాని, నైతికముగాగాని ఆధిక్యమును చూపరాదనిగూడ అతడు గ్రహించును. తనకంటె తక్కువ వ్యక్తి యెప్పుడుగాని కలడను భావమునే యతడు విడనాడును. అప్పుడతడు సమానత్వమును గుఱించి మాట్లాడవచ్చును. అంతవఱకు కాదు.

యూదులలో ప్రవక్తలకు, పురోహితులకు నిరంతరము సంఘర్షణ జరిగినదని చెప్పుచుంటిని; పురోహితులు అధికారమును, జ్ఞానమును తమ యధీనమందుంచుకొనిరి. చివరకు వారే యధికారమును, జ్ఞానమును కోల్పోవసాగిరి. జనుల కాళ్లకు వారు తగిలించిన గొలుసులు వారి కాళ్లకే తగుల్కొనెను. యజమానులచిరకాలములోనే బానిసలగుదురు. ఈ సంఘర్షణ నాజరెత్ ప్రవక్త జీసస్ దిగ్విజయముతో పరిసమాప్తమైనది. ఆ విజయమే క్రైస్తవమతచరిత్ర. డాకినీవిద్య నెదిరించి, దాని ననుష్ఠించువారిని కూలద్రోయుటలో

జీసస్ విజయము పొందెను. ఆ దివ్యప్రవక్త పురోహితవర్గ స్వార్థ పరత్వమనియెడి కాలసర్పమును చంపివేసి దానినోటినుండి సత్యమనియెడి మణిని రక్షించి, లోకమున కందించెను. కావలసినవారెల్లరకును దానిని పొందుటకు సంపూర్ణ స్వేచ్ఛగలదు; ఏ పురోహితుని దయాదాక్షిణ్యములపై ఎవ్వరును ఆధారపడనక్కఱలేదు.

యూదులు తత్త్వజిజ్ఞాసువులు కారు; వారికి భారతీయుల బుద్ధి సూక్ష్మతగాని, వారి యాత్మశక్తిగాని లేదు. భారతదేశములోని బ్రాహ్మణులు, పురోహితులు గొప్ప ధీశక్తి, ఆత్మశక్తిగలవారు. భారతదేశములో ఆధ్యాత్మికాభివృద్ధి ప్రారంభించినవారు వారే. వారద్భుతకార్యములు సాధించిరి. తొలుత అభ్యుదయదాయకమైన ఏ భావస్వాతంత్ర్యము బ్రాహ్మణులను ప్రేరేపించినదో అది తరువాత అంతరించినది. అధికారము, గౌరవము వారు గుత్తగొనిరి. బ్రాహ్మణు డెవరినయినను హత్యచేసినచో, అతనికి శిక్ష లేదు. జన్మమాత్రముచేతనే బ్రాహ్మణుడు జగత్తుకే అధిపతి. పరమ దుష్టుడయినను సరే, బ్రాహ్మణుని పూజింపవలసినదే.

పురోహితవర్గ మొకవంక ప్రబలముగానుండగా, సన్న్యాసులును కవులును ప్రవక్తలును మఱొకవంకగలరు. ఎవరేకులము వారయినను సరే, హిందువులెల్లరు మోక్షప్రాప్తికి కర్మలను త్యజించి మృత్యుముఖమున పడుటకు సంసిద్ధులు కావలెను. ఈ లోకముమీద వారికెట్టి మమతయు నుండగూడదు. గృహమునుండి బయల్వెడలి వారు సన్న్యాసము స్వీకరించవలసినదే. పురోహితవర్గము కల్పించిన రెండువేల కర్మలతో సన్న్యాసులకేమియు పని లేదు: కొన్ని శబ్దములు (పదియనుడు ఇరువదియనుడు) ఉచ్చరించుటే వారిపని. అంతయు కేవలము మిథ్యాచరణము.

ప్రాచీన భారతదేశములో కవులైన ప్రవక్తలు పురోహితుల పద్ధతులను నిశితముగా విమర్శించి, స్వచ్ఛమైన సత్యమును ప్రకటించెడివారు. వారు కొంతవఱకే కృతకృత్యులయినారు. రెండు

తరములలో, వారిశిష్యులు మూఢవిశ్వాసములలో, పురోహితుల డొంకతిరుగుడు తెన్నులలో దిగజారిపోయి తామే పురోహితులుగా మారిపోయిరి : "మీకు సత్యము మా ద్వారానే లభింపగలదు!" అని వచింపసాగిరి. మరల సత్యము ఘనీభవించెను. మరల ప్రవక్త లుదయించి సత్యముపై ఘనీభవించిన బెరడును తొలగించి సంకెళ్లలో నుంచి సత్యమును విడిపింపసాగిరి. పునఃపునః ఈ విధముగానే జరుగుచు వచ్చెను. సర్వదా ప్రవక్త ఉండవలెను. లేనిచో మానవ జాతియే నశించును.

పురోహితులు డొంకతిరుగుడు తెరువుల నేల అనుసరింపవలసి వచ్చినదాయని మీ రాశ్చర్యపడుదురు. సూటిగా సత్యము నేల సమీపింపరాదు? దేవునిగుఱించిన సత్యమునుగుర్తించినట్లు సిగ్గుపడవలసిన దేమున్నది? దానిని జటిలమైన కర్మలలో, మెలికలుగల సూత్రములలో మఱుగుపఱచవలసిన అవసరమేమి కలదు? దేవునిగుఱించి లజ్జపడవలెనా? అందువలన అతని సత్యమును లోకమునకు చాటలేకున్నారా? అట్టివానిని మతావలంబియని, ఆత్మజ్ఞానియని యనగలరా? సత్యము నెఱుగుటకధికారముగలవారు పురోహితులేయట! సామాన్యజనుల కందు నధికారము లేదట! కావున దానిని కొంత 'పలుచపఱచవలెనట'! కొంచెము నీరు కలిపినట్లు చేయవలెనట!

జీసస్ పర్వతముమీద చేసిన ధర్మోపన్యాసమును, గీతోపదేశమును తీసికొనుడు. స్పష్టవివరణమునకు, తేటదనమునకు అవి నిదర్శనములు. వీధిని పోవువారుగూడ వాని నర్థముచేసికొనగలరు. ఎంత మనోహరముగా నున్నవవి! వానిలో సత్యము సూటిగా, స్పష్టముగా వెల్లడింపబడినది. కాని, సత్యమునంత సూటిగా తెలిసికొనదగునని పురోహితు లంగీకరింపరు. వారు రెండువేల స్వర్గములను గుఱించి, రెండువేల నరకములనుగుఱించి చెప్పుదురు. వారు చెప్పినట్లు వినిన పక్షముననే జనులు స్వర్గమునకు పోవుదురు! వారు విధించు నియమములను పాటింపనిచో నరకముననే పోవుదురు!

కాని, జనులు సత్యము తెలిసికొనియే తీఱుదురు. సత్యము నందఱకు పూర్తిగా చెప్పివేసినచో కీడు మూడునని కొందఱి భయము. ఏదో కొంత సవరణ, మార్పు లేకుండ సత్యమును యథాతథముగా చెప్పగూడదట! కాని, సత్యము నీ విధముగా సమన్వయ పఱచుటవలన లోకమునకు కొంచెమైనను మేలు కలిగినట్లు లేదు. ఇప్పుడున్నస్థితి కంటె మఱేమి హాని కలుగగలదు? సత్యమును వ్యక్తముచేయుడు! అది సత్యమే యగుచో దానివలన మేలే కలుగును. దీనికి కొందఱత్యంతము చెప్పి మఱికొన్ని పద్ధతులు సూచింతురు. అట్టి ప్రయత్నములు మాంత్రికుల తంత్రములకు ప్రత్యామ్నాయములే. ప్రచ్ఛన్నరూపములో మాంత్రికుల యుపాయములే!

అట్టివి బుద్ధదేవు డవతరించిన కాలమున ప్రబలముగా నుండెను. సామాన్యప్రజలు జ్ఞానమున కనర్హులని తెలుపబడినది. వేదములోని ఒక్క శబ్దమైనను వారి చెవినిపడినచో వారు క్రూరమైన శిక్షకు గుఱికావలసినవారయిరి. పురోహితులు వేదములను రహస్యముగా నుంచిరి! వేదములలో నున్నవి ప్రాచీన హిందువులు కనుగొనిన ఆధ్యాత్మికసత్యములే!

చివరకు ఈ దారుణదుఃస్థితిని భరింపలేని వ్యక్తి యొకడు పుట్టెను. అతనికి ప్రజ్ఞ, శక్తి, హృదయము గలవు—అతని హృదయ మాకాశమంత విశాలమైనది. జనులెట్లు పురోహితుల ననుసరించుచున్నారో, పురోహితులు జనులనెట్లు నడిపించుచున్నారో, వారు తమ యధికారముతో కీర్తిప్రతిష్ఠల నెట్లు పెంపుచేసికొనుచున్నారో అతడు గ్రహించెను. ఈ పరిస్థితిని చక్కదిద్దుట కతడు సంకల్పించెను. అతడెవరిమీఁదను అధికారము చేయగోరలేదు. జనులకు గల మానసిక, ఆధ్యాత్మిక బంధనముల నతడు త్రెంచివేయుటకై సంకల్పించెను. అతనిది గంభీరహృదయము. మన చుట్టుప్రక్కల నున్న ప్రజలలో పలువురకు హృదయముండ

వచ్చును. ఇతరులకు సహాయపడవలెనను భావము మనకును ఉండవచ్చును. కాని, మనకు ధీశక్తిలేదు; సహాయము చేయదగు వివిధమార్గములు, విధానములు మనకు తెలియవు. జీవుల బంధములను త్రెంపగల విధానములను కనుగొనగల ప్రజ్ఞ యతనికుండెను. జనులేల దుఃఖము పాలగుచున్నారో అతడు తెలిసికొనెను; దుఃఖనివారణోపాయము నతడు కనుగొనెను అన్ని విధములయిన అర్హతలు గలవాడతడు. అతడందుకు విశేషకృషి చేసెను; భేదభావము లేక అతడందఱకు బోధచేసెను; ఉత్కృష్ట జ్ఞానజన్యమైన శాంతినిపొందు మార్గముచూపెను. బుద్ధుడిట్టి మహనీయుడు.

ఆర్నాల్డు రచించిన "ఆసియా జ్యోతి"లో బుద్ధుడు రాజవంశమున జన్మించెనని, లోకములోని దుఃఖమతని హృదయమును కలచివైచినదని, భోగములతో పెఱిగినను, భోగముల మధ్యనున్నను స్వసౌఖ్యమునందు, రక్షణయందు అతనికి మనశ్శాంతి లేకుండెనని, తనభార్యను, పసిబిడ్డను విడనాడి యతడు విరాగియయ్యెనని సత్యము నన్వేషించుచు నతడనేకమంది గురువుల నాశ్రయించెనని మీరు చదివియేయుందురు. అతనికెట్లు జ్ఞానోదయమైనదియు మీకు తెలియును. దీర్ఘకాల మతడు కావించిన ధర్మప్రచారమును గుఱించి, అతని శిష్యులనుగుఱించి, సంస్థలనుగుఱించి మీకు తెలియును. ఈ సకలవిషయములు మీరు తెలిసికొనియున్నారు.

భారతదేశములో పురోహితులకు ప్రవక్తలకు సాగుచుండిన సంఘర్షణలో కలిగిన విజయమే బుద్ధునియందు మూర్తీభవించినది. భారతదేశములోని పురోహితుల విషయమై ఒక్కమాట చెప్పవచ్చును:—వారికెన్నడును మతవిషయమై అసహనము లేదు; అన్యమతములవారి నెన్నడును వారు హింసింపలేదు. తమకు వ్యతిరేకముగా ఎవరయినను మతబోధచేయుట కనుమతించెడివారు. వారి మతమే అట్టువంటిది; మతాభిప్రాయములవలన ఎవరినిగాని వారెన్నడు బాధింపలేదు. అయితే వారును పురోహితులందఱకుగల

విచిత్రలోపములవలన బాధపడిరి : వారుగూడ అధికారమును కాంక్షించిరి ; వారుగూడ నియమములు, నిబంధనలు కల్పించి మతము ననవసరముగా క్లిష్టముచేసిరి ; తత్ఫలితముగా తమమతము ననుసరించెడి వారిని నిర్వీర్యులను చేసివేసిరి.

ఈ కలుపుమొక్కలన్నిటిని బుద్ధుడు తొలగించివేసెను. అత్యద్భుతసత్యముల నతడు బోధించెను. వేదములలోని తత్త్వజ్ఞానసారమునే బుద్ధుడు బోధించెను ; విచక్షణలేక అందఱకు బోధించెను. అతని మహత్తర సందేశములలో నొకటి మానవసమానత్వము. కనుక యావత్ప్రపంచమునకతడు తనమతమును బోధించెను. మానవులెల్లరు సమానులే. ఎవరికిని ప్రత్యేకాధిక్యము కనికరించిచూప నవసరము లేదు! సమత్వము బోధించిన మహాత్ముడు బుద్ధుడు. పురోహిత వర్గమునకు తదితర కులములకుగల భేదమును బుద్ధుడు నిర్మూలించెను. ఎంతటి నికృష్టస్థితిలో నున్నవారయినను పరమోత్కృష్ట ప్రయోజనముల కర్హులే; నిర్వాణప్రాప్తి కతడు ద్వారము నందఱకు తెఱచి యుంచెను. భారతదేశములో సహిత మతనిసందేశము సాహసోపేతమైనది. ఎంతటి ప్రచారమున కయిననుసరే, భారతీయులు బెదరువారు కారు. కాని, బుద్ధుని సిద్ధాంతము భారతీయులకు సుబోధకమగుట కష్టమయ్యెను. మీకు మఱెంతగానో కష్టమగునుకదా!

అతని సిద్ధాంతమిది: ''మన జీవితములో దుఃఖమెందుకున్నది? మనసౌఖ్యముకొఱకే మనము కోర్కెలు కోరుకొనుచుందుము-అందువలననే దుఃఖమున్నది. దుఃఖ నివారణోపాయమేమి? వ్యక్తిత్వమును విడనాడుటే. ఈ ప్రపంచమున, మనముచూచుచున్న సర్వము గలదు. ఉన్నదెల్ల నిదియే. జననమరణముల కడుగున ఆత్మయనున దేమియులేదు. ప్రవాహరూపమున భావపరంపర యున్నది. ఒక భావమును మఱొకభావము, దానినింకొక భావము వెన్నంటియుండును. ఒక్కొక్క భావము వచ్చును, వెంటనే పోవును. అంతే; భావము

నాలోచించువ్యక్తి యెవ్వరును లేరు. ఆత్మ లేదు. ఈ దేహ మను క్షణము మాఱిపోవుచున్నది; అట్లే మనస్సు, చేతనయును. ఆత్మ యనునది భ్రాంతి. ఆత్మనంటిపెట్టుకొనుటే—లేని ఆత్మను అంటిపెట్టుకొనియుండుటే స్వార్థపరత్వమున కంతకు కారణము. ఆత్మ యనునది లేదను సత్యమును మనము గ్రహించినంతనే మనము సుఖపడుదుము, ఇతరులను సుఖపెట్టుదుము.''

ఇదియే బుద్ధుడు బోధించినది. అతడు కేవలము మాటలు చెప్పి యూరకొనలేదు; లోకముకొఱకు తన జీవితము నిచ్చివేయుటకు సంసిద్ధుడయినాడు. ''జంతువును బలియిచ్చుట మంచిపని అయినపక్షమున, మనుష్యుని బలియిచ్చుట అంతకంటె మంచి పని కదా.'' అని యతడనెను. బలియగుట కతడు సిద్ధపడెను. ''జంతుబలి మఱొక మూఢవిశ్వాసము. దేవుడు, ఆత్మ—ఈ రెండును దారుణమైన గ్రుడ్డినమ్మకములు. పురోహితులు కల్పించిన గ్రుడ్డినమ్మకమే దేవుడు. బ్రాహ్మణులు చెప్పునట్లు దేవుడున్నచో లోకములో నింతదుఃఖమేల? అతడు నావంటివాడే, కారణకార్య సూత్రమునకు బానిసయే. కారణకార్య సూత్రమునకు బద్ధుడుకానియెడల, అతడేల సృష్టిచేసెను? అట్టి భగవంతునివలన సంతృప్తికలుగదు. ఈశ్వరుడొకడు స్వర్గములోనుండి జగత్తును తనకిష్టమైన విధముగా పరిపాలించుచుండును. మనము దుఃఖములో మునిగి చావవలసినదే యని మనలనిందు వదలివేసినాడు. ఏనాడును క్షణమయినను మనదెస చూడవలెనను సద్భావమయిన నతనికి లేదు. మన జీవితమంతయు దుఃఖమయమే; మనకీశిక్ష చాలదోయనునట్లు మరణానంతరమున మన మనుభవించవలసిన మఱికొన్ని శిక్షలున్నవి. అయినను జగత్పరిపాలకుని సంతోషపెట్టుటకు మనము నానావిధములయిన కర్మలు చేయుచుందుము!'' అని బుద్ధుడు చెప్పెను.

బుద్ధుడింకను ఇట్లు ప్రవచించెను: ''ఈ కర్మకాండలన్నియు నిరర్థకములు. జగత్తులోకెల్ల పరమోత్కృష్టమైన ఆశయమొక్కటే.

సకలభ్రమలను, భ్రాంతులను పటాపంచలు చేయుడు ; ఏది సత్యమో అదే మిగులును. మబ్బులెక్కడి వక్కడ చెల్లాచెదరయిపోయిన తరువాత సూర్యుడు ప్రకాశించును. వ్యక్తిత్వమును నశింపజేయుటెట్లు? సంపూర్ణముగా నిస్స్వార్థుడవుకమ్ము. చీమకొఱకయినను సరే, నీ జీవితము నాహుతిచేయుటకు సంసిద్ధుడవుకమ్ము. మూఢభావముల కొఱకు, ఏదేవునిగాని సంతోషపెట్టుటకు, ఏప్రతిఫలము పొందుటకు పనిచేయకుము. నీ వ్యక్తిత్వమును నశింపజేసికొని బంధవిముక్తుడవు కాగోరు తలంపుతోనే ఏపనినయినను చేయుము. పూజ, ప్రార్థన మొదలయినవన్నియు అర్థములేనిపనులు. 'నేను భగవానునికి వందనము సమర్పించుచున్నాను.' అని మీరందఱు వచింతురు. అయితే అతడు నివసించునదెక్కడ? మీకు తెలియదు. తెలియకపోయినను మీరందఱు దేవుడు, దేవుడని ఘుతి పోగొట్టుకొనుచున్నారు.''

హిందువులు దేనినయినను విసర్జింపగలరు. కాని, దేవుని మాత్రము విసర్జింపలేరు. దేవుడు లేడనుట భక్తికి ఆధారముగానున్న పునాదిని తీసివేయుటే. దేవుని, భక్తిని హిందువు లంటిపెట్టుకొనియుండక తప్పదు. ఏపరిస్థితులలోగాని వీనిని హిందువులు విడనాడరు. బుద్ధుని సందేశములో దేవుడులేడు, ఆత్మలేదు — కేవలము కృషి. కృషి యెందుకొఱకు? స్వార్థముకొఱకుగాదు ; 'అహం' భ్రాంతియే. ఈ భ్రాంతి తొలగినపిమ్మట మన యథార్థతత్త్వమేదో అదియే మనమగుదుము. ఈ స్థాయినందుకొని కేవలము కృషికొఱకే కృషిచేయువారు, ఉదారలక్ష్యసిద్ధికై నడుముగట్టువారు ప్రపంచములో మిక్కిలి కొలదిమందిమాత్రమే యుందురు.

అయినను, బుద్ధుని మతము శీఘ్రగతిని వ్యాప్తిచెందినది. మానవ చరిత్రలోనే తొలిసారిగా విశాలహృదయమునుండి దివ్యప్రేమ పొంగిపొరలినది ; అది నిఖిలమానవకోటి సేవకే కాక, అఖిల జీవకోటి సముద్ధరణకు అర్పితమైనది.—సకలజీవులకు బాధలనుండి విముక్తి కలిగించుటకు మార్గము కనిపెట్టుచింతతక్క ఆ ప్రేమకు

వేఱొక్క తలంపు లేదు. ఈ కారణముచేతనే బౌద్ధమతమంత వేగముగా వ్యాపించినది.

మానవుడు దేవుని ప్రేమించుచుండెను. కాని, సోదరుడగు మానవుని మఱచిపోయెను. దేవునిపేరిట తన ప్రాణమునే త్యాగము చేయగలవాడు, ప్రక్కకు తిరిగి సోదరుడగు మానవునిగూడ దేవుని పేరిట చంపివేయగలడు. ఇదియే నాటి పరిస్థితి. భగవంతుని తృప్తిపఱచుటకు కన్నకుమారుని బలిచేయగలరు; దేశములను దోచుకొనగలరు; వేలకొలది ప్రాణులను వధింపగలరు; పృథివిని రక్తసిక్తముచేయగలరు. మానవుడు మఱొక దేవుడయిన తోడి మానవుని మన్నించుట నేర్చుకొనుటకిదియే ప్రారంభము. ప్రేమింపవలసినది మానవుని. సర్వమానవులందు నుండవలయు ప్రథమప్రగాఢప్రణయ తరంగమది—విశుద్ధమగు యథార్థజ్ఞాన వీచికయది. భారతదేశమున ప్రారంభమై, క్రమక్రమముగా నొకదేశముతరువాత నొకదేశమున ప్లావితమగుచు, పూర్వ పశ్చిమదిశలకు, ఉత్తర దక్షిణదిశలకు అది వ్యాపించినది.

ఈజగద్గురువు సత్యము సత్యముగా భాసింపవలెనని యాశించెను. మెతకదనముగాని, రాజీగాని, పురోహితులను, బలవంతులను, రాజులను మెప్పించుటగాని పనికిరాదు. అంధవిశ్వాసములతోగూడిన సంప్రదాయములకు—అవెంతటి ప్రాచీనమైనవయినను సరే—శిర మొగ్గుట, పరంపరాగతమైనవను కారణమున ఆచారములను, గ్రంథములను మన్నించుట తగదు. అతడు సకల ధర్మగ్రంథములను, సకలమతవిధానములను నిరాకరించెను. సంప్రదాయమున ననుసరించి మతప్రబోధమునకు నిమిత్తమార్గమైన సంస్కృత భాషను సహిత మతడు తిరస్కరించెను. సంస్కృతభాషా సంపర్కమువలన తనశిష్యులు మూఢవిశ్వాసములను అవలంబింతురని ఆ సంప్రదాయమున కతడు త్రోసిరాజనెను.

మనమింతవఱకును చర్చించుచున్న సత్యమును మఱొక విధముగాకూడ చూడవచ్చును: అది హైందవ దృక్పథము. బుద్ధుడు బోధించిన మహోత్కృష్టమగు నిస్వార్థ ధర్మమును మా చూపుతో చూచినయెడల మఱింత చక్కగా నది బోధపడగలదని మా యభిప్రాయము. ఈవఱకే ఉపనిషత్తులలో బ్రహ్మమును గుఱించి, ఆత్మను గుఱించి చెప్పబడియున్నది. ఆత్మ, బ్రహ్మము, సర్వేశ్వరుడు-ఒక్కటే. ఉన్నదంతయు ఈ యాత్మయే. అదొక్కటే సత్యము. మాయ, భ్రమ-మనకది వేఱుగా కనబడునట్లు చేయుచున్నది. ఉన్న దొక్కటే ఆత్మ. అనేకాత్మలు లేవు. ఆయొక్క ఆత్మయే నానారూపములుగా ప్రకాశించుచున్నది. ''మానవులందఱు ఒకేవ్యక్తి కావున మానవునకు మానవుడు సహోదరుడు. మానవుడు నా సహోదరుడే కాడు; అతడు నేనే. నేనే అతడు'' అని వేదములు ఘోషించుచున్నవి. విశ్వములో నే ప్రాంతమునకు హానికలిగించినను, నాకు నేను హానికలిగించుకొనుటే. నేను విశ్వమునే. నేను ఫలానావ్యక్తిని; మహారాజ రాజశ్రీ...ఫలానా అని భావించుట భ్రమయే.

స్వతస్సిద్ధమైన ఆత్మతత్త్వమును అధికాధికముగా సమీపించుకొలది భ్రమ అధికాధికముగా తొలగిపోవును. విభేదములు, విభాగములు ఎంతెంతగా తొలగిపోవునో, సర్వము ఒకే ఒక దివ్యతత్త్వమను సత్యమంతంతగా సాక్షాత్కారమగును. దేవుడుకలడు; అయితే, అతడెక్కడనో మేఘములలో కూర్చునియున్న మానవుడుకాడు. అతడు నిర్మలమయిన ఆత్మస్వరూపుడు. అతని నివాసస్థానమేది? నీవు నీకెంత సమీపస్థుడవో అతడు నీకంతకంటె ఎక్కువ సమీపస్థుడు. అతడాత్మయే! దేవుని భిన్నమైనవానిగా, నీకు వేఱుగా నెట్లు దర్శింపగలవు? అతడు నీకు వేఱని భావించినచో అతనిని తెలిసికొనలేవు. అతడు నీవే. ఈ ప్రబోధమే భారతీయ ప్రవక్తలు ప్రతిపాదించిన సిద్ధాంతము.

నీవు ఫలానావ్యక్తిని—మహారాజరాజశ్రీ)...గారిని చూచుచున్నట్లు, ప్రపంచమంతయు నీకు వేఱుగానున్నట్లు భావించుట స్వార్థపరత్వము. నీవు నాకు వేఱని నీవు నమ్మెదువు. నీకు నన్నుగుఱించిన చింతయే లేదు. నీ వింటికిపోయి విందు నారగింతువు, నిశ్చింతగా నిద్రింతువు. నేను చచ్చినను నీవెప్పటియట్లు తిందువు, త్రాగుదువు, విలాసముల ననుభవింతువు. కాని, తక్కిన ప్రపంచము శోకనిమగ్నమైయుండగా నీవు నిజమైన సుఖము ననుభవింపజాలవు. మన మందఱమొక్కఱమే. వేఱుభావము కలిగించుభ్రమయే సమస్తదుఃఖమునకు మూలకారణము. ఆత్మతక్క మఱొకవస్తువులేదు; మఱేదియు లేనేలేదు.

దేవుడనువాడు లేడని బుద్ధుని యభిప్రాయము; ఉన్నది మానవుడే. దేవుని గుఱించి నాడు ప్రబలముగా నున్న భావములకు మూలమైన మనస్తత్త్వము నతడు ఖండించెను. అట్టి మనస్తత్త్వము జనులను దుర్బలులను, మూఢులను చేసినదని యతడు గ్రహించెను. కావలసినదెల్ల నీ కిమ్మని దేవుని ప్రార్థించు పక్షమున, శ్రమపడి పనిచేయుటకెవడు నడుముకట్టును? ఎవరు శ్రమించి, కృషిచేయుదురో వారియొద్దకే దేవుడు వచ్చును. తమకు తాము సహాయపడు వారికే దేవుడు తోడ్పడును. దేవునిగుఱించి యిందుకు విరుద్ధమైన భావము మన నరములను దుర్బలపఱచును; కండరములను మార్దవపఱచును; మనలను పరాధీనులను చేయును. స్వతంత్రమైనదెల్ల సుఖముగానున్నది; పరతంత్రమైనదెల్ల దుఃఖపడక తప్పదు. మానవునకు అనంత శక్తికలదు. అది యతనియందేకలదు. దాని నతడు పొందగలడు—అతడు తా ననంతాత్మయను సత్యమును సాక్షాత్కరింప జేసికొనగలడు. అది సాధ్యమే; అయిన ఆ విషయమై మీకు నమ్మకములేదు. మీరు దేవుని ప్రార్థింతురు; మీ శక్తిని నిరుపయోగముగా నుంచుదురు.

దీనికి విరుద్ధమైన విషయమును బుద్ధుడుపదేశించెను. మానవులెవరును దుఃఖపడవలదు. ఈ పూజలు, ప్రార్థనలు వలదు.

దేవుడు దుకాణము పెట్టుకొని కూర్చొని యుండలేదు. ప్రతి శ్వాసయందును మీరు దేవుని ప్రార్థించుచునేయున్నారు. నేను మాటలాడుచున్నాను; అది ప్రార్థనయే. అనంతమైన దివ్యశక్తి యందు పాల్గొనని క్రియ—శారీరక, మానసిక చలనమేదేని కలదా? అదంతయు నిరంతరప్రార్థనయే. ఏవో కొన్ని నిర్దిష్టమైన మాటలే ప్రార్థనయగుచో, ప్రార్థన లాంఛనమాత్రమే యగును. అట్టి ప్రార్థనలంతగా మంచివికావు; వానివలన కలుగగల పెద్దమేలేదియు లేదు.

కష్టపడి పనిచేయకుండ, ప్రార్థనవలన అద్భుతమైన ఫలితము కలుగునా? ప్రార్థన మహిమాన్వితమైన గారడీ సూత్రమా? దానిని పలుమాఱులుచ్చరించుటచేతనే ఫలితము కలుగునా? ఎంత మాత్రముకాదు. అందఱును శ్రమపడి కృషిచేయవలసినదే; ఆ యనంతశక్తి గభీరతనందఱు నందుకొనవలసినదే. నిరుపేదలందు, ధనికులందు నున్నదాశక్తియే. ఫలితములు కలుగుటకొకరు శ్రమించి పని చేయవలెను; కాని, మఱొకరు కొన్నిమాటలు వల్లించిననే చాలు ననుట సరికాదు. నిఖిలజగత్తు నిరంతరము ప్రార్థనచేయుచునే యున్నది. ఇదియే ప్రార్థనభావమయినచో నేను మీతో నేకీభవింతును. ప్రార్థనకు మాటలవసరములేదు; మౌనప్రార్థన శ్రేష్ఠము.

ఈ సిద్ధాంతము నత్యధిక సంఖ్యాకులైన ప్రజలు అర్థము చేసికొనజాలరు. భారతదేశములో ఆత్మవాదముతో నేమాత్రము సమాధానపడినను, పురోహితవర్గము చేతి కధికారమప్పగించితిమని గ్రహింపనగును. ప్రవక్తల బోధలను విస్మరించితిమనియు గ్రహింపనగును. బుద్ధు డీవిషయము నెఱిగెను; అందువలన అతడు పురోహిత వర్గము చెప్పెడి సిద్ధాంతములను, ఆచారములను త్రోసిపుచ్చి, మానవుని స్వశక్తిపై నిలబడునట్లు చేసెను. జనులలవాటుపడి యున్న పద్ధతులను వ్యతిరేకించుట అతని కవసరమయ్యెను; విప్లవాత్మకమైన మార్పులను ప్రవేశపెట్టవలసివచ్చెను. దీని ఫలితముగా

యజ్ఞభూయిష్ఠమైన మతాచారము భారతభూమిలో సడలిపోయెను. అది మరల తలయెత్తలేదు.

బౌద్ధమతము భారతభూమినుండి వెడలిపోయినట్లు స్థూల దృష్టికి అగపడును; నిజమునకది పోలేదు. బుద్ధుని యుపదేశములలో ఒక ముప్పుగలదు—అది సంస్కారమతము. తీవ్రమైన యాధ్యాత్మిక పరివర్తనమును సాధించుటకై అతడనేక వ్యతిరేక బోధలు చేసెను. ఏమతమయినను నిర్మూలనకే విశేషప్రాధాన్య మిచ్చిన పక్షమున అది నశించిపోగల అపాయమున్నది. ఏ సంస్కరణ మతము గాని, (సంస్కరణయే దాని పనియైనయెడల) ఎక్కువకాల ముండజాలదు; అన్వయపూర్వకమైన లక్షణములే—యథార్థప్రేరణయే, సిద్ధాంతములే జీవముతో వర్ధిల్లగలవు. ఒక సంస్కరణ సఫలమయిన తరువాత, అన్వయధర్మమునకే ప్రాధాన్య మీయవలెను. భవనము నిర్మాణమయిన తరువాత బోటుగానుండిన ఉన్నతమంచను తీసివేయవలెను.

భారతదేశములో కొంతకాలము బుద్ధుని యనుచరులు బుద్ధుని బోధలలో వ్యతిరేకమయినవానికే విశేష ప్రాధాన్యమిచ్చిరి. తత్ఫలితముగా వారు తమ మతము క్షీణించుటకు కారకులయిరి. అన్వయధర్మములు వ్యతిరేకశక్తుల యొత్తిడికి ఉక్కిరిబిక్కిరియైనవి. బౌద్ధమతము పేరిట వర్ధిల్లిన నిర్మూలన ప్రవృత్తులను భారతదేశము ప్రతిఘటించెను. భారతజాతీయ ధర్మప్రవృత్తి చెప్పినతీర్పు అది.

దేవుడులేడు, ఆత్మలేదు – బౌద్ధమతములోని ఈ వ్యతిరేక సిద్ధాంతములు జీవమును కోల్పోయినవి: ఉన్న దొక్కడేదేవుడే యని నేను చెప్పగలను; ఇది వాస్తవిక సిద్ధాంతము. అతడొక్కడే సత్యము. ఆత్మలేదని బుద్ధుడు వచించెను. నేను, "మానవుడా, నీవు విశ్వముతో ఒక్కటిగా నున్నావు; నీవు, సకలవస్తువులు నొక్కటే." అని చెప్పుదును. ఇదెంత సత్యప్రదీప్తమైనది! సంస్కరణ భావము పోయినది. వాస్తవిక సిద్ధాంత మింతకాలమునకును నిలిచియున్నది. జంతువులయెడ కారుణ్యాము చూపవలసినదని

బుద్ధుడు బోధించెను; నాటినుండియు భారతదేశములో సకలజీవుల యెడల, జంతువులయెడల సహితము సేవాభావమును బోధింపని మతశాఖయొక్కటియును లేదు. సకల సిద్ధాంతములకంటె ఉత్కృష్ట మయిన ఈ కారుణ్యమే, ఈ దయాగుణమే, ఈ దానశీలమే - బౌద్ధ మతము మాకు పెట్టిన భిక్ష.

బుద్ధుని జీవితమునం దొక విశిష్టమయిన ఆకర్షణ కలదు. మొదటినుండియు నాకు బుద్ధునియందు గొప్పపూజ్యభావము గలదు. అతని సిద్ధాంతములకు గాదు, అతని శీలమునకు—అందఱికంటె అతని యందే నా కెక్కువ గౌరవము కలదు-ఏమి సాహసము! ఏమి నిర్భయ త్వము! ఏమి దివ్యప్రేమ! అతడు మానవకోటి సంక్షేమముకొఱ కవతరించెను. ఇతరులు దేవుని అపేక్షింపవచ్చును. కొందఱు తమకు తాము సత్యమును సాక్షాత్కరింప జేసికొనవచ్చును. అతడు తనకై సత్య సాక్షాత్కారము పొందుటకయినను లక్ష్యపెట్టలేదు. లోకులు దుఃఖపడుచున్నందున వారి దుఃఖమును బాపుటకతడు సత్యమును తెలిసికొనవలసి వచ్చెను.

వారికి సహాయపడుట యెట్లు అనునదే యతని యావేదన. అంతటి దీర్ఘజీవితములో అతడు తన్నుగుఱించి క్షణమయిన ఆలో చింపలేదు. అజ్ఞానులము, స్వార్థపరులము, సంకుచితమనస్కులము- మన మతని మహాత్మ్యము నెట్లు గ్రహింపగలము?

అతని యద్భుతమేధస్సునుగుఱించి యోచింపుడు! ఆవేశ మేమాత్రమును లేదు. అవిమర్శగా దేనిని గ్రహింపనొల్లని అతిలోక ప్రతిభ యతనిది. ప్రాచీనలిఖిత పుస్తకములలో నున్నదనిగాని, మీ తాతముత్తాతలనుండి సంక్రమించినదనిగాని, మీ స్నేహితులు కోరుచున్నారనిగాని చెప్పి యీ కారణములచేత మీరు దేనిని నమ్మ వలదు-మీయంతకు మీరు ఆలోచించుకొనుడు. మీరే సత్యమును స్వయముగా అన్వేషింపుడు; మీరే సాక్షాత్కారము పొందుడు. అప్పుడది యందఱకును శ్రేయస్కరమని మీరు తెలిసికొనిన పక్షమున

జనులకు బోధింపుడు. అల్పబుద్ధులు, దుర్బలులు, సంకుచిత హృదయులు సత్యమును దర్శింపజాలరు. ముక్తులము కావలెను. ఆకాశ సంకాశ విశాలహృదయములను కలిగియుండవలెను. మన మనస్సు స్ఫటికమువలె నిర్మలముగా నుండవలెను. అప్పుడే అందు సత్యము ప్రకాశించును. మనమో, మూఢభావముల పుట్టకదా! విద్యాధికుల మనుకొనియెడి మీ దేశ ప్రజలలో సహిత మెట్టి మూఢభావములు, సంకుచితభావములు లేవు! ఈ విషయము కొంచెము యోచింపుడు! మీరు నాగరికాగ్రేసరుల మనుకొందురు. ఒక సందర్భమున కుర్చీమీద కూర్చొనుటకు నా కనుమతి నిరాకరింపబడినది. నేను హిందువునగుటయే అందుకు కారణము!

క్రీస్తుజననమున కాఱు శతాబ్దములకు పూర్వము, బుద్ధుని కాలమున భారతదేశములో గొప్ప విద్యావిధానము వ్యాప్తిలో నుండెను. అపుడు భావస్వాతంత్ర్యము సంపూర్ణముగా ఉండియుండవలెను. అసంఖ్యాకులైన ప్రజలు బుద్ధుని అనుసరించిరి. రాజులు, రాణులు తమ తమ సింహాసనములను పరిత్యజించిరి. అతని సందేశము ఎంతటి విప్లవాత్మకములయినను, యుగయుగములుగా పురోహితులు చేయు ఉపదేశముల కెంతయో భిన్నముగా నున్నను వానిని ప్రజలు గ్రహించి, శిరసావహింపగలిగిరి! వారి మనస్సు లసాధారణముగా స్వేచ్ఛాపూరితములు, సువిశాలములునయి యుండెను.

బుద్ధుని నిర్యాణమును గుఱించి యోచింపుడు. అతని జీవితము మహోత్కృష్టమయినది. అతని నిర్యాణము గూడ మహోత్కృష్టమే! అమెరికన్ ఇండియన్‌లను పోలిన జాతివాడు పెట్టిన అన్నము నతడు తినెను. ఆ జాతివారు విచక్షణరహితముగా నేదిపట్టిన అది తిందురని వారిని హిందువులు స్పృశింపరు. అతడు శిష్యులతో నిట్లనెను. "మీరు దీనిని భుజింపకుడు. నేను దీనిని నిరాకరింపలేను. ఈ యన్నముపెట్టినవానిదగ్గఱకు మీరు పోయి, అతడు నాకు మహోపకారము చేసెనని చెప్పుడు. ఏలయన అతడు నన్నీ దేహ

బంధమునుండి విముక్తుని చేయును.'' ఒకవృద్ధుడు వచ్చి యతనిచెంత కూర్చుండెను—అతడు బుద్ధుని దర్శనము చేసికొనగోరి మైళ్ళకొలది దూరము నడచివచ్చెను—అతనికిని బుద్ధుడుపదేశము చేసెను. ఒక శిష్యుడు దుఃఖించుచుండగా చూచి యతనిని బుద్ధుడు మందలించుచు నిట్లనెను: ''ఏమి యిది? నేను చేసిన యుపదేశమున కంతకు ఫలిత మిదియేనా? అసత్యము నిన్ను బంధింపకుండుగాక! నీవు నాపై యాధారపడరాదు. బుద్ధ్యదప్రాయమైన ఈ వ్యక్తిత్వమును కీర్తింప దగదు. బుద్ధుడు వ్యక్తికాడు; అతడు సత్యసాక్షాత్కారము. నీ మోక్షము నీవే సాధించుకొనవలెను.''

తుది క్షణములో సహితము బుద్ధుడు తనకు విశిష్టతగలదని భావింపలేదు. అందుకు నేనతనిని పూజింతును. బుద్ధులని, క్రీస్తులని మీరు చెప్పినవి కొన్ని యనుభూతులకు పేర్లు. జగద్గురువు లందఱిలో మన కాత్మవిశ్వాసము నెక్కువగా బోధించినది బుద్ధుడు. మన అసత్య వ్యక్తిత్వముల బంధముల నుండియే గాక, అగోచరమగు దేవుడు, దేవతలపై నాధారపడు పరాధీనతనుండి గూడ అతడు మనకు విమోచనము కలిగించెను. నిర్వాణమని యతడు చెప్పిన ముక్తస్థితిని పొందుట కతడెల్లరను ఆహ్వానించెను. ఒకానొక నాటికి అందఱు ఆస్థితి పొందక తప్పదు; ఆ స్థితి పొందుటతో మానవజీవిత మునకు పరిపూర్ణత్వము లభింపగలదు.

# క్రీస్తు దూత

## (కాలిఫోర్నియా లాస్ ఏంజెలెస్ దగ్గఱ 1900 వ సంవత్సరములో స్వామిజీయొసగిన ఉపన్యాసము)

సముద్రమున కెరటము లేచుచున్నది. దాని వెంట పల్లమొకటి యేర్పడుచున్నది. మరల కెరటము లేచుచున్నది. బహుశః యిది మునుపటిదానికంటె పెద్దదేమో! ఇదియును క్రమ్మర పడిపోవలసినదే! అదేతీరున మఱొకటి లేచును, ముందుకు సాగిపోవును. ఈ తీరున సంఘటనల పరంపరలో పతనమును అభ్యుత్థానమును గలవు. సాధారణముగా మనము పతనము విషయము మఱచిపోవుచు అభ్యుత్థానముకొఱకెదురుచూచుచుందుము. నిజమునకు పతనాభ్యుత్థానములు రెండును అవసరములే; రెండును గొప్ప సంఘటనములే. ప్రపంచపు పోకడయే యిది. భావప్రపంచమున గాని, సమాజ జీవితములో మన పరస్పర సంబంధములలో గాని మన ఆధ్యాత్మిక వ్యవహారములలోనిగాని పతనాభ్యుత్థానముల క్రమ మీప్రకారముననే సాగిపోవుచున్నది. మహత్తర సంఘటనలు, ఉదారాశయములు ముందుగా ప్రభవించి మార్గము చూపుచుండును అవి తరువాత అదృశ్యమై పోవును. అవి జీర్ణమగుచున్నట్లనిపించును. గతమును స్మరించుకొనుటకవి యవకాశము కలిగించును. అవి స్థిరపడి బలమును సేకరించుకొని మఱొకమాఱు ప్రాయశః మునుపటికంటె తీవ్రముగా విజృంభించును.

జాతులచరిత్రగతి కూడ ఈవిధముగానే యున్నది. మన మీ అపరాహ్ణము ఏ మహాత్ముని, ఏ దివ్యదూతను గుఱించి సంస్మరింపబోవుచున్నామో అత డవతరించినకాలమున వాని జాతి మిక్కిలి పతనావస్థయందున్నదని చెప్పవచ్చును. అతని బోధలను గుఱించియు, చేతలను గుఱించియు అక్కడక్కడ మనకు లభ్యమైన పుస్తకముల వలన కొలది యంశములు మాత్రమే మనకు తెలియు

చున్నవి; ఆ మహాత్ముఁడు పలికిన పలుకులు, చేసిన పను లన్నిటిని గురించి ఎవరైన వ్రాసియుంచినచో ఆవ్రాతలతో లోకము నిండిపోయి యుండు నన్నమాట నిజమే. అతడు ధర్మబోధ కావించిన మూఁడు సంవత్సరములు అసంఖ్యాక సంఘటనలతో క్రిక్కిరిసి క్రిక్కిరిసి పోయినకాలమన జెల్లును. ఆ కాలములో నతడు నిర్వహించిన కృషిని అర్థము చేసికొనుటకు పందొమ్మిదివందల సంవత్సరములు పట్టినది; ఇంకను ఎంతకాలము పట్టునో ఎవరు చెప్పగలరు? మీవంటి, నావంటి చిన్నవారియందున్న శక్తి బహు స్వల్పము. అది పూర్తిగా వ్యక్తమై, హరించిపోవుటకు కొలది నిమిషములు, కొలది గంటలు, లేదా, కొలది సంవత్సరములు చాలు. అంతటితో మనము సరి, సమాప్తము. ఈలోకోత్తురుని గనుడు; శతాబ్దములు, సహస్రాబ్దములు గడచిపోయినను, అతడు ప్రపంచముపై సారించిన శక్తి యింకను సంపూర్ణముగా వ్యక్తము కాలేదు; హరించిపోలేదు. కాలము కడచినకొలది క్రొత్తశక్తి వచ్చి దానితో కలియుచుండును.

ఏసునాథుని జీవితములో మనము కనునది అతనికి పూర్వపు జీవితమంతటిని. ఒక విధముగా, ప్రతి మానవుని జీవితము అతనికి పూర్వపు జీవితమే. వంశక్రమానుగత ధర్మముగా, పరిసరముల ప్రభావముగా, విద్యాఫలితముగా, స్వీయకర్మానుసారముగా——తన జాతిగతమంతయు నతనిలో వ్యక్తమగును. అదేవిధముగా పృథ్వీగత చరిత్ర, గత ప్రపంచానుభవము ప్రతి ఆత్మయందు ముద్రితమై యున్నది. మన మనంతమైన గతమునకు ఫలితముగాక మఱేమి? మన మాదిమధ్యాంత రహితముగా, అప్రతిహతముగా, విశ్రాంతి పొందుటకు సహితము సాధ్యముగాక ముందుకు సాగిపోవుచున్న సంఘటనల పరంపరయందు తేలిపోవుచున్న కెరటములవంటివారము గాక మఱేమి? మీరు, నేను నీటిబుడగలవంటి యల్పులము. జగద్వ్యాపారములనెడి సాగరమున మహోత్తుంగ తరంగము లెప్పుడును ఉండును. మీయందు, నాయందు గతజీవితము స్వల్పముగానే వ్యక్తమైనది; గతమును సంపూర్ణముగా హృద్గతము చేసికొని,

ముందుకు చేతులు చాచి దారిచూపుచుండు మహాత్ములు కలరు. వారు మానవకోటి పురోగతిని సూచించుచు, మన మక్కడక్కడ కనుచుండు సంకేతస్తంభములవంటి వారు; వారు నిజముగా మహాపురుషులు. వారి ఛాయలు పృథ్వినంత నాచ్ఛాదించును. వా రమర జీవులు. ఆ దివ్యదూత ప్రవచించినట్లు, ''కుమారునిద్వారా గాక, దేవుని చూచినవారెవ్వరేనాడును లేరు.'' ఈ మాట నిజము. పుత్త్రునియందు గాక జనకుని మరెక్కడ చూడగలము ? మీరు, నేను, మనలోని గర్భదరిద్రులు, నీచాతినీచులును ఈశ్వరాంశసంభూతులే, ఈశ్వరుని వ్యక్తము చేయువారే. ఈమాటకూడ నిజమే. కాంతిప్రసార మంతటను గలదు. అది సర్వవ్యాపకమే ; కాని, మనము వెలుగును చూచుటకు దీపము వెలిగింపవలెను. పృథివికి జ్యోతులగు ప్రవక్తలలో మహాత్ములలో అవతార పురుషులలో, ప్రతిఫలించినగాని మనము జగదీశ్వరుని కాంచలేము.

భగవానుడున్నాడని మనకు తెలియును. కాని, మన మతని జూడలేము; అర్థము చేసికొనలేము. ఈ దివ్యజ్యోతి దూతలలో నొకరిని తీసికొనుడు. వాని శీలమును భగవంతుని గుఱించి మీరు భావించిన మహోత్కృష్టమైన ఆశయముతో పోల్చి చూడుడు. మీ భావన లన్నిటికంటె ప్రవక్తలశీలము మహోన్నతముగా నుండును. ఉపాధి ధరించి, సాక్షాత్కారము పొందిన ప్రవక్తలు మనకు చూపుచున్న ఆదర్శములకంటె భగవంతుని గుఱించి మీ రెక్కువగా భావన చేయజాలరు. కనుక వీరిని భగవత్స్వరూపులనుగా ఆరాధించుట దోషమగునా ? వీరి చరణములకు ప్రణమిల్లి లోకములోకెల్ల వీరే దేవుడని పూజించుట పాపమగునా? భగవంతుని గుఱించి మనకు గల భావనలన్నిటికంటె వీరు నిజముగా నధికులయినచో, వీరిని పూజించుటలో హాని యేమున్నది? హాని లేకపోవుటే కాదు; అదే స్పష్టమైన పూజ, సాధ్యమైన పూజ. మీ రెంతగా శ్రమపడి ప్రయత్నించినను, ఎంతగా భావనచేసినను, ఏవిధాన మనుసరించినను—మీరు మానవలోకములో వ్యవహరించెడి మానవమాత్రులే

అయినంతకాలము మీ ప్రపంచము మానవ ప్రపంచమే; మీ మతము మానవమతమే. మీ దేవుడు మానవుడయిన దేవుడే. ఇది యనివార్యము. ప్రత్యక్షముగా నెదుట కనబడుచున్న నిదర్శనమును గ్రహించి, భావనను—దుర్గ్రాహ్యమైన భావనను, స్థూలమైన ఉపకరణముద్వారా కాక మఱొకతీరున పొందుట కలవిగాని భావనను విడనాడనివారెవరు? ఆ మాత్రము కార్యవాదులుకానివారెవరు? అందుచేతనే ఈ భగవదవతారములు సర్వకాలములలో, సర్వదేశములలో ఆరాధింపబడుచువచ్చినవి.

యూదులలో నవతరించిన ఏసుక్రీస్తు జీవితము నొకింత మన మిప్పుడు పరిశీలింతము. క్రీస్తు జన్మించినప్పుడు యూదులు రెండు దశలమధ్య పతనావస్థయందున్నారు; ఎదుగు బొదుగు లేక తత్కాల వ్యవస్థనంటి పెట్టుకొనియున్న స్థితి; మనస్సు పురోగమించుటకు శక్తి విహీనమై, అంతవఱకున్న దానినీ భద్రపఱచుకొనుటయందే శ్రద్ధ వహించిదశ; ఉత్కృష్టము, స్థూలమునయిన సాధారణజీవితసమస్యలపై గాక, ప్రత్యేకాంశములమీద, సూక్ష్మ వివరణములమీద పట్టుదల వహించిన కాలము; పురోగతి లేక చలనము లేని యవస్థ; క్రియాపరత్వము లేని బాధామయస్థితి. ఈ పరిస్థితిని నేను దూషించుట లేదన్న సంగతి గుర్తించుకొనుడు. విమర్శించుటకు మనకధికారము లేదు—ఏలయనగా యింతటి పతనావస్థ లేనియెడల నాజరెత్ ప్రవక్త జీసస్ ప్రాతినిధ్యము వహించిన అభ్యుదయము సాధ్యమైయుండెడిది కాదు. ఫారసీలు, సద్దూసీలు చిత్తశుద్ధి లేనివారయి యుండవచ్చుగాక. వారు కానిపనులే చేయుచుండియుండవచ్చుగాక; వారు వంచకులే అయియుండవచ్చుగాక. ఏమైనను, దివ్యదూతయవతారమునకివే కారణములయినవి. ఈ హేతువుల ఫలితమే జీసస్ అవతరణ. ఫారసీలు, సద్దూసీలొకప్రక్క కలిగించిన ప్రేరణకు ఫలితమే మఱొకప్రక్క నాజరెత్‌లో ప్రతిభాశాలిఅయిన జీసస్ జననము,

రూపకల్పనలు, నియమములు, నిత్యమతానుష్ఠానవివరణ ములు, కర్మకలాపములు—ఇవి ఒక్కొక్కప్పుడు పరిహసింపబడు చుండును. కాని, వీనియందే బలమున్నది. నిజమునకు విశాలభావ ములుగలవానికంటె స్వమతదురభిమాని ఎక్కువ శక్తిమంతుడు. స్వమత దురభిమానిలోగూడ నొక సుగుణముగలదు. అతనియందు శక్తి విశేషముగా భద్రమైయున్నది. వ్యక్తి విషయమువంటిదే జాతి విషయముగూడ; శక్తి భద్రపఱుపబడుటకు సేకరింపబడును. వెలు పల శత్రువులు చుట్టిముట్టినను, ఒక వంక రోమన్‌లు, మఱొకవంక విద్యాధిక ప్రపంచమునుండి గ్రీకుప్రభావములు, వేఱొకవంక పర్షియా, ఇండియా, అలెగ్జాండ్రియాలనుంచి ప్రసరించిన ప్రభావ ములు అన్నిప్రక్కలనుండి శారీరకముగా, మానసికముగా, నైతిక ముగా నిర్బంధములకు గుఱియైనను యూదుజాతి నశింపక, తన సహజశక్తితో నిలిచియున్నది. ఆ జాతి సంతతి నేటికిని తన పటి మను కోల్పోలేదు. ఆజాతి తనశక్తియుక్తులన్నిటిని జెరూసలేమ్‌పైన, యూదు మతముపైన కేంద్రీకరింపవలసి వచ్చినది. శక్తియంతయు నొకచోట పుంజీభూతమైనప్పుడు, అటులనే యుండజాలదు. అది వినియోగముకావలెను; వ్యాకోచము పొందవలెను. సంకుచితమైన పరిమితిలో చిరకాలము నిలిపియుంచుటకు వీలయినశక్తి యేదియును లేదు. ఏనాటికిని వ్యాప్తి చెందనీయక దాని నణచియుంచుట సాధ్యముకాదు.

యూదు జాతిలో కేంద్రీకృతమైన ఈ శక్తి తరువాత దశలో క్రైస్తవమతావతరణరూపములో వ్యక్తమైనది. పాయలుగావచ్చి చేరిన కాల్వలన్నియు పెద్ద వాహినియైనవి. క్రమముగా పిల్లకాల్వ లన్నియుకలసి, ఉత్తుంగతరంగితమైనవి. తరంగముమీాద నాజరెత్ నగర ప్రవక్త జీసస్ శీలము కనబడుచున్నవి. ప్రతి ప్రవక్త తన కాలపరిస్థితుల ఫలితమే; తన జాతి గతచరిత్రఫలితమే; అతడు భవిష్యత్తుకు కర్త. వర్తమానము భూతమునకు ఫలితము; భవిష్య

త్తుకు కారణము. దేవుని దూతస్థితి యిది. అతనియందు తన జాతిలోని యుత్కృష్టత, ఘనత పుంజీభూతమైనవి. తనజాతి దేనికొఱకు యుగయుగములుగా పోరాటము సాగించినదో అది, ఆ జీవితము, దాని అంతర్యము అవన్నియు అతనియందున్నవి; అతడు భవిష్యన్నిర్మాణమునకు ఉత్తేజకశక్తి; తనజాతి భవిష్యత్తుకేగాదు, ప్రపంచములోని సకలజాతుల భవిష్యత్తుకు కూడ అతడు త్తేజకశక్తియే.

మఱొకవిషయముగూడ మనము గుర్తించుకొనవలెను. నాజరెత్ ప్రవక్తను గుఱించిన నా యభిప్రాయము ప్రాచ్యదృక్కోణమునకు చెందినది. అతడు ప్రాచ్యులలో ప్రాచ్యుడను విషయము మీరు పలుమాఱు విస్మరించిరి. నీలినేత్రాలతో, పసుపు పచ్చని కేశములతో మీరతని నెన్నిమాఱులు చిత్రించుటకు ప్రయత్నించినను అతడు ప్రాచ్యుడే. బైబిలు భాషలో ప్రయోగింపబడిన అలంకారములు, సామ్యములు, చిహ్నములు, అందలి దృశ్యములు, సన్నివేశములు, స్థానికపరిస్థితులు, మానసికవైఖరులు, వర్ణములు, కనినపుడు—ప్రాచ్యుడు మీతో ప్రసంగించుచున్నట్లుండును. వినిర్మలాకాశము, ఆతపము, ఉష్ణము, ఎడారి, దాహబాధితులగు మానవులు. పశువులు, స్త్రీపురుషులు కుండలు నెత్తిన పెట్టుకొని బావుల యొద్దకువచ్చి వానిని నీటితో నింపుట, గొఱ్ఱెలమందలు, సేద్యగాండ్రు, చుట్టు జరుగుచున్న వ్యవసాయము, నీటి యంత్రము, చక్రము, తిరుగళ్లు—ఇవన్నియు నేడాసియాలో గలవు.

ఆసియా ప్రబోధము మతప్రబోధమే. ఐరోపా ప్రబోధము రాజకీయ ప్రబోధము. దేని రంగమున నది గొప్పదే. ఐరోపావాణి ప్రాచీన గ్రీసువాణి. గ్రీకుమనస్తత్వమునకు ప్రస్తుత సమాజమే సర్వస్వము. అంతకు మించినది అయోమయము. గ్రీకులకు దక్కవేఱెవ్వరికి జీవించెడి హక్కు లేదు. గ్రీకులు చేయునదెల్ల న్యాయమైనది, నిర్దుష్టమైనది; తద్భిన్నముగా లోకములో నేదేని కలదేని న్యాయముకాదు, నిర్దుష్టముకాదు; అందు కనుమతింపరాదు. కనుక దాని యభిమానములు మానవతాపూరితములు, స్వాభావిక

ములు, కళాత్మకములు. గ్రీకువ్యక్తి పూర్తిగా ఈ ప్రపంచములోనే నివసించును. భావనచేయుటయందతని కాసక్తిలేదు. అతని కవిత్వము సహితము వాస్తవికతాప్రపూరితమే. అతని దేవుళ్లు, దేవతలు మానవతాప్రపూరితులు. దాదాపు మనవంటివారి భావములు, ఆవేశములుగలవారు. సుందరమైనదానినతడు ప్రేమించును. అయితే, సర్వదా బాహ్యప్రకృతినే: కొండలు, మంచు, పూలు, రూపలావణ్యము, విగ్రహ సౌందర్యము, మానవముఖసౌందర్యము, మానవాకృతి—ఇవి గ్రీకుల కిష్టమైనవి. తరువాత వెలసిన ఐరోపా నాగరకతకు, సంస్కృతికి ఆచార్యులు గ్రీకులే. కనుక ఐరోపావాణి గ్రీకులదే!

ఆసియాలో మఱియొక సువిశేషముగలదు. విశాలమైన ఆ ఖండమునుగుఱించి యోచింపుడు: మేఘములను దాటిపోయి, ఆకాశపుటంచులను స్పృశించు పర్వతశిఖరములు; నీటిచుక్కగాని, గడ్డిమొక్కగాని యెక్కడను కనుపింపని వందలకొలది మైళ్ల దూరము వ్యాపించిన ఎడారులు; దుర్గమారణ్యములు; సాగరసంగమ మభిలషించి శరవేగముతో ప్రవహించు మహానదులు. ఇవి అచ్చటి ప్రకృతిలో దృగ్గోచరమగు వివిధదృశ్యములు. ఇటువంటి పరిసరములమధ్య ప్రాచ్యుల సౌందర్యపిపాస, మహోత్కృష్టమైన భావన మఱొకరూపమున ప్రకటితమైనవి. ప్రాచ్యుని మనస్సు బహిర్ముఖముగాక అంతర్ముఖమైనది. ప్రకృతికొఱకు, శక్తికొఱకు ప్రాచ్యునికి తృష్ణకలదు. సుందరమైన దానికొఱకు అభిలాష కలదు. ఆదిగ్రీకుల, అనాగరకుల పిపాసవంటిదే,అది. అది విస్తృతరంగమున పరివ్యాప్తమైనది. నేటికిని. ఆసియాలో జాతిని నిరూపించునది జన్మకాదు, రంగుకాదు, మతము. మేమందఱము క్రైస్తవులము; మేమందఱము మహమ్మదీయులము; మేమందఱము హిందువులము; లేదా, మేమందఱము బౌద్ధులము. బౌద్ధుడు చైనాదేశీయుడయినను, పర్షియాదేశీయుడయినను సరే, తామందఱు సహో

దరులని భావింతురు: ఇందుకుకారణము వారందఱు ఒకే మతమునకు చెందినవారగుటే. మతమే అనుబంధము, మానవ సమైక్యసాధనము. ఈ కారణముచేతనే ప్రాచ్యులు భావనాదృశ్యములను గనుదురు; స్వప్నములు గనుట వారికి పుట్టుకతో కలిగిన ప్రజ్ఞ. జలపాతముల వంపు సొంపులు, పక్షుల కలకలారావములు, సూర్యచంద్రులకాంతులునక్షత్రముల అందచందములు, పృథ్వీ సౌందర్యము, సుఖము కలిగింపజాలునవే. కాని, ప్రాచ్యుని హృదయమున కవి చాలవు. అతడతీతవిషయములను గుఱించి స్వప్నము కనవలెను. అతడు ప్రత్యక్షము నధిగమించి పోవలెను. ప్రత్యక్షవస్తువుతో నతనికి తృప్తి లేదు. ప్రాచ్యసీమలోనే మానవజాతి పెరిగినది. సకలకష్టసుఖానుభవము లక్కడివారికి కలిగినవి. రాజ్యములవెంట రాజ్యములు, సామ్రాజ్యములవెంట సామ్రాజ్యము లక్కడ నేర్పడినవి. మానవ శక్తి, అధికారము, వైభవము, ఐశ్వర్యములు అక్కడగలవు. శక్తికి, విద్యలకు నిలయమది. ప్రాచ్యుని తత్త్వమది. ప్రతాపమునకు, రాజ్యములకు, విద్యాపీఠములకు నిలయమది. అందువలన ప్రాచ్యుని మనస్సు ఇహలోక విషయముల నేవగించుకొనుటలో నాశ్చర్య మేమున్నది? మార్పు మృత్యుమయము, దుఃఖమయమునగు నీ ప్రపంచమధ్యమున నిత్యము, ఆనందదాయకమునగు వస్తువు కొఱకతడన్వేషించుట సహజమేకదా! ఈ యాశయముల ప్రాధాన్యమును గుఱించి పదేపదే నొక్కి-వక్కాణించుటకు ప్రాచ్యప్రవక్త సందేహింపడు. అందుకతడు విసువుచెందడు. ఇక ప్రవక్తల విషయమా? ఒక్కమినహాయింపుకూడ లేక, ప్రవక్తలెల్లరు ప్రాచ్యదేశీయులే యని మీరు గ్రహింపుడు.

కనుక జీసస్ మనకందజేసిన మహత్తరమైన జీవిత సందేశములోని ప్రప్రథమ విషయమేమో తెలియునా? ''మనకు కావలసినది ఈ జీవితముగాదు. ఇంతకంటె ఉత్కృష్ట జీవితము'' అని; ప్రాచ్యసీమలోపుట్టిన ఉత్తమ పుత్త్రునివలె అతడీవిషయములో అనుష్ఠానపరుడు. పశ్చిమసీమలోని మీవ్యవహారములలో, సైనిక

శాఖలో, రాజకీయవర్గముల నిర్వహణలో మీరు కార్యశీలురు గదా! ప్రాయశః ప్రాచ్యులా వ్యవహారములలో కార్యశీలురు కారేమో! తనరంగములో ప్రాచ్యుడు కార్యశీలుడే. ఒకరు తత్త్వ బోధ చేసినచో మఱునాడు వందలకొలది జనులు దానిని తమ జీవితములలో ననుష్ఠించుటకు సర్వవిధముల ప్రయత్నింతురు. ఒంటి కాలిమీద నిలుచుండుటవలన మోక్షము లభించునని ఒకడు చెప్పినచో ఆపనికి వెంటనే అతడయిదువందలమందిని సమావేశపఱచును. అది హాస్యాస్పదమని మీరనవచ్చును; కాని, ఒక్క విషయమును గమనింపుడు—దాని మఱుగున నున్నది వారితత్త్వ దృష్టి—తీవ్రమైనక్రియాపరత్వము. పాశ్చాత్య దేశములలో మోక్షమునకు సాధన ప్రణాళికయనగా బుద్ధిగతమైన వ్యాయామము. ఆప్రణాళిక లేనాడును కార్యరూపము దాల్చునవిగావు; క్రియా జీవితములోని కవెన్నడును రావు. పాశ్చాత్యదేశములలో ఎవరు అధికముగ వచఃకౌశలమును ప్రదర్శింతురో వారు గొప్పబోధకులని ఎన్నబడుచుందురు.

కాబట్టి, ప్రాచ్యదేశముగనిన ఉత్తమ పుత్త్రిడు ప్రచండమైన క్రియాపరుడను విషయమును మనము ప్రప్రథమముగా గమనింపవలసియున్నది. నిరంతరము మాఱిపోవుచున్న ఈ యిహలోకమునందుగాని, ఈ లోకములోని వస్తువులందుగాని అతనికి విశ్వాసము లేదు. ఈ కాలమున పాశ్చాత్య దేశములలో నాగరకలక్షణముగా పరిగణింపబడుచున్నట్లు గ్రంథములలోని వాక్యములను విఱిచివేయవలసిన పనిలేదు. ఇక సాధ్యముకాదనిపించునంతవఱకు వానిని విఱిచి అర్థము చెప్ప నవసరము లేదు. ఈనాటి స్వాతిశయ భావములను ప్రోత్సహించుటకు వీలుగా మతము నేర్పాటుచేయ నగత్యము లేదు. మనమందఱము ఋజువర్తనము నలవఱచుకొందము. ఆదర్శము ననుసరింపలేని పక్షమున మన దౌర్బల్యమునయినను గుర్తింతము. అంతేగాని యాదర్శమును పతనము చెందనీయవలదు; ఎవరుగాని దానిని క్రిందికిలాగి వేయదగదు. పాశ్చాత్యులు జీసస్

జీవితమును గుఱించి వేర్వేరుగా చెప్పుకథలు వినినప్పుడు హృదయము క్షోభపడును. అతడెట్టివాడో, ఎట్టివాడుకాడో నాకు తెలియదు. అతడు గొప్ప రాజకీయవేత్తయని ఒకరనును; బహుశః మఱొకరతనిని గొప్ప సేనాపతిగా చిత్రించునేమో! వేఱొకరతనిని స్వదేశాభిమాన ప్రపూరితుడయిన యూదీయునిగా వర్ణించును; ఇంక నీవిధముగానే పలువురు చిత్రింతురు. ఈ విధమైన భావనలకు తగిన యాధారము లేవయిన గ్రంథములలో గలవా? ఒక మహాత్ముని భావములకు సరియైనభాష్యమతని జీవితమే. "నక్కలకు బొరియలు కలవు. గాలిలో విహరించు పక్షులకు గూండ్లుగలవు. కాని, ఈశ్వర పుత్త్రునకు తలదాచుకొనుటకు తావులేదు." మోక్షమార్గమదే యని జీసస్ చెప్పెను; అతడు మఱొకమార్గమును సూచించలేదు. కాషాయాంబరములు ధరించి, భస్మము పూసికొనినను మేమట్టిస్థితికి రాలేదని యొప్పుకుందుముగాక. "నేను", "నాది" అను మమకారమింకనుగలదు. మనకు ఆస్తిపాస్తులు, ధనము, ఐశ్వర్యము కావలెను. మనకు దుఃఖముకలుగుగాక! మన యశక్తత నంగీకరించుట మేలు. ఆ జగద్గురువు నవమానింపకుందుముగాక! అతనికి సంసారబంధములు లేవు. శారీరక ప్రేరణలకు సంబంధించిన భావములతనికిగలవని మీరు భావింతురా? ఆ తేజఃపుంజము, ఆ దేవుడు—మానవుడుకాడు పశువులకు సోదరుడగుటకే అతడు పృథివిమీఁది కవతరించెనా? అతడు నానావిషయములు బోధించెనని చెప్పుటకు జనులు ప్రయత్నింతురు. అతనికి కామమునుగుఱించిన భావము లేనేలేదు! ఆత డాత్మస్వరూపుడు! మఱేమికాడు—మానవకోటి శుభమును కాంక్షించి — కేవలమందుకొఱకే — దేహముద్వారా కృషిచేసినాడు. అతనికి దేహముతోగల సంబంధ మంతమాత్రమే. ఆత్మయందు లింగభేదములేదు. వి దేహాత్మకు పశువుతో, శరీరముతో సంబంధములేదు. ఈ యాశయము మనకందరానిదే కావచ్చును. అయిన నేమి? ఆశయమును విడనాడకుడు. అదే మన

ఆశయమని, మనమిప్పుడు దాని నందుకొనలేకున్నామని ఒప్పు కొందుము.

అతనికి జీవితములో మఱొక వ్యాపకము లేదు. తా నాత్మ ననుభావము తక్క వేఱొక్క తలంపు ఆతనికి లేదు. ఉపాధి విరహితమై, ఎట్టి శృంఖలములు లేని, ఏవిధముగాను బద్ధముకాని ఆత్మ యతడు. అంతమాత్రమే కాదు. యూదుడుగాని మఱొకడుగాని; ధనికుడుగాని పేదవాడుగాని, తాపసిగాని పాపిగాని—ప్రతిపురుషుడు, ప్రతిస్త్రీ తనవలె అమృతమైన ఆత్మస్వరూపియని అద్భుతసాక్షాత్కారముచేత నతడు తెలిసికొనెను. కనుక వారందఱు తమ ఆత్మతత్త్వమును గ్రహింపవలెనని ప్రబోధముచేయు టొక్కటే అతని కర్తవ్యమైనది.

ఇట్లని ఆమహనీయుని జీవితమువలన స్పష్టమగుచున్నది. మీరు, తక్కువవారు నిర్భాగ్యులు అనెడి మూఢవిశ్వాసములను విసర్జింపుడని యాతడుద్బోధించెను. మీ రణగద్రొక్కబడుచున్నారని, అత్యాచారమునకు గుఱియగుచున్నారని తలంపకుడు. అణగద్రొక్కుటకు, క్రూరముగా బాధించుటకు, హింసించుటకు, వధించుటకు సాధ్యముకాని దొకటి మీలోగలదు. మీరందఱు ఈశ్వరునిబిడ్డలే, అమృతపుత్త్రులే. "స్వర్గరాజ్యము మీలోనేకలదు." "నేను, నా జనకుడు ఒక్కరమే" అని యాతడుద్ఘోషించెను. "నే నీశ్వరుని బిడ్డను" అని మాత్రమేగాక, నా అంతరంగమున "నేను, నా తండ్రి ఒక్కరమే" అన్న అనుభూతిని సహితము పొందుదుమని మీరు చెప్పసాహసింపగలరా? కాని, నాజరెత్ ప్రవక్త జీసస్ ఆవిధముగా వక్కాణించెను. ఈ ప్రపంచమును గుఱించి, ఈ జీవితమును గుఱించి అతడెన్నడును ముచ్చటింపడు. వీనియందతని కాసక్తి లేదు. లోకమును ఉన్నది యున్నట్లుగా స్వీకరించి, దానిని ముందు కొక్కత్రోపుత్రోసి,—సమస్త విశ్వము దివ్యతేజస్సు పొందువఱకు, ప్రతి వ్యక్తి తన ఆత్మతత్త్వమును సాక్షాత్కరింప జేసికొనువఱకు,

మృత్యువు, దుఃఖము అంతరించువఱకు—పురోగతికి తోడ్పడుటకే అతనికి లోకముతో సంబంధము కలదు.

అతనిని గుఱించి రచింపబడిన నానావిధ కథలు మనము చదివితిమి. మనకు విద్వాంసులసంగతి, వారి రచనల సంగతి తెలియును. ఉత్తమ విమర్శలుకూడ మనకు తెలియును. అవన్నియు అధ్యయనము చేసి రచించినవేయని తెలియును. బైబిలు క్రొత్తనిబంధనములోని దెంతవఱకు నిజమనిగాని, ఆతని జీవిత మెంతవఱకు చారిత్రకమనిగాని మన మిప్పుడు చర్చింపబోవుటలేదు. అతడు పుట్టిన అయిదు శతాబ్దములలో నది రచింపబడినను, ఆ జీవితమెంతవఱకు యథార్థమైనదనుచర్చ మన కవసరములేదు. కాని, దాని వెనుకనున్న మహాద్విషయమును మన మనుకరింపవలెను. అసత్యమాడుటకుకూడ సత్యము ననుకరింపవలెను, ఆ సత్యము వాస్తవికసంఘటన అయియుండవలెను. ఎన్నడు లేనిదానిని మన మనుకరింపజాలము. మన మెప్పుడును చూడనిదాని ననుకరింపజాలము. బీజప్రాయముగా నయిన నేదో యుండవలెను. అత్యద్భుతమైన ఆధ్యాత్మికశక్తి విభూతి పృథివిమీఁది కవతరించి యుండవలెను—దానిని గుఱించియే మన మిప్పుడు ముచ్చటించుచున్నది. అది యుండనే యున్నది. కనుక మనము విద్వాంసుల విమర్శలకు భయపడ నవసరములేదు. ప్రాచ్యదేశీయుడనుగా నేను నాజరెత్ జీసస్‌ను ఆరాధించవలెననిన, అందుకు నాకొక్కటే మార్గము. అతనిని కేవలము భగవంతునిగా ఉపాసింపవలసినదే. మఱొకమార్గము లేదు. ఆ విధముగా నతనిని ఉపాసించుటకు మా కధికారము లేదని మీరనగలరా? అతనిని మనస్థాయికి దింపి, ఒక మహాపురుషునిగా కొంచెము గౌరవించుటే చాలునను కొన్నచో, అసలాతనిని ఉపాసింపనేల? "జ్యోతిర్మయుని ఈ యుత్తమ పుత్త్రిలు, జ్యోతిని ప్రసరింపజేసెడి వీరు, జ్యోతిర్మయులే. వీరిని ఉపాసించుటచేత వీరు మనతో నొకటి యగుదురు. మనము వీరితో నొకటి యగుదుము." అని మా ధర్మగ్రంథములు చెప్పుచున్నవి.

మానవుడు భగవంతుని మూడువిధములలో గుర్తించును. ప్రాథమికదశలో విద్యాగంధము లేనివాని సంస్కారవిహీనమైన బుద్ధికి భగవంతు డెక్కడో దూరముగా, స్వర్గములో సింహాసనము మీద కూర్చొనియున్న న్యాయాధిపతిగా తోచును. నిప్పును చూచి నట్లు భీకరునిగా భావించును. ఇది మంచిదే. ఇందు తప్పేమియు లేదు. మానవకోటి అసత్యమునుండి సత్యమునకుగాక సత్యమునుండి సత్యమునకు పయనించుచున్నదన్న సంగతి మనము గుర్తింపవలెను. లేదా, క్రిందియంతస్తు సత్యమునుండి పై యంతస్తు సత్యమునకు ప్రయాణము సాగుచున్నదని చెప్పవచ్చును. అంతేగాని అసత్యము నుండి సత్యమునకు మాత్రముగాదు. మీ రిక్కడ బయలుదేరి తిన్నగా సూర్యునియొద్దకు ప్రయాణముచేయుదురనుకొందము. ఇక్కడకు సూర్యుడు చిన్నవాడుగా కనబడును. పదిలక్షలమైళ్లు అభిముఖముగా పోయినతరువాత సూర్యుడు చాలపెద్దవాడుగా కనబడును. ముందుకు పోవుకొలది ఒకచోటికంటె మఱొకచోట పెద్దవాడుగా కనబడును. అనేకచోట్లనుంచి సూర్యునిఫొటో లిరువది వేలు తీసితిమనుకొనుడు. ఈ యిరువదివేల ఫొటోలలో ఒకదాని నొకటి పోలినది యుండదు. దేనికది వేఱుగానే యుండును. అయితే, వీనిలో ఏదిగాని సూర్యునిఫొటో కాదనగలరా? అదే విధముగా అన్ని మతవిధానములు—ఉత్కృష్టమైనవి, నికృష్టమైనవి—శాశ్వతమైన జ్యోతికి దారిచూపు వివిధదశలు. కొన్ని పరిమిత దృష్టిగలవి. మఱికొన్ని ఉన్నతదృష్టి గలవి. భేదమంతయు నింతే. సర్వేశ్వరుడే ఆరనిజ్యోతి. కనుక ప్రపంచమంతటను సంస్కారములేని ప్రజా బాహుళ్యము మన్నించు మతములన్నియు విశ్వమునకు వెలుపల నున్న దేవుని గుఱించినవే. అతడు స్వర్గలోకములోనుండి జగత్తును పరిపాలించును. అతడు దుష్టులను శిక్షించును; శిష్టులను రక్షించును. అతడింకను ఇత్యాదిలక్షణములు గలవాడు. మానవుడాధ్యాత్మిక వికాసముపొందు కొలది భగవంతుడు సర్వవ్యాపియనియు తనలో

గూడ, కలడనియు, అతడంతటను నిండియున్నాడనియు, ఎక్కడో దూరముగా నున్నవాడు కాడనియు అత డాత్మలకాత్మయనియు భావింపసాగెను. నాయాత్మ నా దేహము నెట్లు నడిపించుచున్నదో అట్లే భగవంతుడు నాయాత్మను నడిపించుచున్నాడు. అతడు నా యాత్మకు ఆత్మ. కొలదిమంది మహాత్ములు, విశేషముగా ఆత్మోన్నతి పొంది పవిత్రులయినవారు మఱికొంత ముందుకు పోయి భగవంతుని దర్శించిరి. బైబిలు క్రొత్త నిబంధనము చెప్పినట్లు "నిర్మల హృదయులు ధన్యులు, వారీశ్వరుని దర్శింతురు." చివరకు తాము, భగవంతుడైన తమ జనకుడును ఒక్కటేయని వారు కనుగొనిరి.

బైబిలు క్రొత్త నిబంధనమునందీ మూడు దశలను జగద్గురువు పేర్కొనెను. అతడు బోధించిన సమష్టిప్రార్థనను పరిశీలింపుడు: "స్వర్గలోకమందున్న జగత్పితా! నీ నామము పవిత్రమగుచుండు గాక!" అని ప్రారంభమగును. ఇది యల్పప్రార్థన. ఇది సమష్టి ప్రార్థనయను విషయము మీరు మఱువరాదు. ఇది విద్యాగంధము లేనివారికొఱకు సూచింపబడినది. ఇంతకంటె కొంత సంస్కారము పొంది, పురోగమించిన వారి కతడు ఉత్కృష్టమైన యుపదేశము చేసెను. "నేను నా జనకుని యందున్నాను. మీరు నాయందున్నారు. నేను మీ యందున్నాను." ఇది మీకు జ్ఞాపకమున్నదా? తరువాత యూదు లతనిని నీ వెవరవని యడుగగా తాను తన తండ్రి ఒక్కటే యని అతడు చెప్పెను. అతడు దైవదూషణ చేయుచున్నాడని వా రనుకొనిరి. అట్లనుటలో నతని యాంతర్యమేమి? మీ పూర్వ ప్రవక్తలు గూడ నీవిధముగానే చెప్పిరి. "మీరు దేవతలు, మీ రందఱు పరాత్పరుని పుత్త్రిలు." ఈ త్రివిధదశలను గమనింపుడు. మొదటి దశతో ప్రారంభించి కడపటి దశతో ముగించుట మీకు సులభము కావచ్చును.

దివ్యదూత మనకు దారిచూపుటకు వచ్చెను. బాహ్యరూపములలో ఆత్మలేదు. తల దిమ్మెక్కించెడి తత్త్వమీమాంసవలన

ఆత్మవస్తువు తెలియరాదు. విద్యాధిక్యము లేకపోవుటే మంచిది. మీ జీవితమంతటిలో నొక్క పుస్తకమైన చదివి యుండక పోవుటే మేలు. ధనము, పదవి, పాండిత్యము—మోక్షమునకివేవియు నక్కఱ లేదు. కావలసిన దొక్కటే, విశుద్ధహృదయము. "విశుద్ధ హృదయులు ధన్యులు." ఆత్మవస్తువు స్వతస్సిద్ధముగానే విశుద్ధమైనది. అది మఱొక విధమైన దెట్లుకాగలదు? అది ఈశ్వరాంశ, ఈశ్వరుని నుండివచ్చినది. బైబిలు భాషలో నది "ఈశ్వరుని శ్వాస". కొరాన్ భాషలోనది "దేవునియాత్మ". ఈశ్వరుని ఆత్మ యేనాడు గాని మలినముకాగలదని మీ రనగలరా? కాని, యుగయుగములుగా మన సత్కార్యములవలన, దుష్కార్యములవలన నది దుమ్ములో, మురికితో కప్పబడియున్నది. యుగయుగముల అజ్ఞానమువలన మనము చేసిన పనులు...సరియైనవి, సత్యమైనవి కాని పనులు కారణముగా ఆత్మను దుమ్ము, మురికి కప్పివేసినవి. ఆ మురికిని, దుమ్మును తొలగించుటే యవసరము. అంతట ఆత్మ తన సహజకాంతితో ప్రకాశించును. "విశుద్ధహృదయులు ధన్యులు, వా రీశ్వరుని దర్శింతురు." "స్వర్గరాజ్యము మీలోనున్నది." స్వర్గరాజ్యము "మీలో నుండగా దాని కొఱకు మీ రెక్కడ వెదక బోవుచున్నా"రని నాజరెత్ వీరుడు జీసస్ ప్రశ్నించుచున్నాడు. హృదయములను నిర్మలము చేసికొనుడు. అది యక్కడనే కలదు. అది యీ వఱకే మీలోనున్నది. మీది కాని దానిని మీ రెట్లు పొందగలరు? అది మీ జన్మహక్కు. మీ రమృతత్వమునకు వారసులు, శాశ్వతుడగు జనకుని పుత్త్రిలు.

ఇది మనకు దివ్యదూత చేసిన గొప్పబోధ. సకల మతములకు ప్రాతిపదికమైన వైరాగ్యమును గుఱించికూడ ఆతడు బోధచేసెను. ఆత్మను మీ రెట్లు నిర్మలము చేయగలరు? వైరాగ్యముచేతనే. ధనికుడయిన యువకుడొకడు జీసస్‌ను, "ప్రభూ! నే నమృతజీవనము పొందుట కేమిచేయవలెను?" అని యడిగెను. జీసస్ ఇట్లు చెప్పెను:

"నీలోనొక్క విషయము లోపముగానున్నది. నీవు పోయి నీ యావదాస్తిని విక్రయించి పేదలకు పంచిపెట్టుము. స్వర్గములో నీకు ధనరాసులు లభించును. తరువాత నీవు దీక్షాస్వీకారము చేసి, నా వెంట రమ్ము." ఆ మాటల కతడు ఖిన్నుడయి వెళ్ళిపోయెను; పాపము! అతనికి 'ఆస్తిపాస్తులు' విస్తారముగానున్నవి. మన మందఱము కొంచెమించు మించుగా ఆస్థితియందే ఉన్నాము. ఆ వాణి యహోరాత్రములు మన చెవులలో గింగుర్వెట్టుచున్నది. సుఖ సంతోషముల మధ్య, ప్రాపంచిక విషయముల మధ్య మనము సర్వము మఱచిపోయినా మనుకొనుచుందుము. ఎప్పుడో క్షణకాలము చిత్తము నిలిచిపోవును. "నీ సర్వస్వమును పరిత్యజించి నా వెంట రమ్ము." అను మాటలు మన చెవులలో ధ్వనించుచుండును. "ఎవరు తమ ప్రాణరక్షణమునకు సర్వప్రయత్నములు చేసికొందురో వారు ప్రాణములను కోల్పోవుదురు. ఎవరు నా కొఱకు ప్రాణముల నర్పింతురో వారు జీవింతురు" ఎవరతనికొఱకు జీవితము నర్పింతురో వా రమృతజీవనము పొందుదురు. మన దౌర్బల్యముమధ్య క్షణమాత్రము విరామము కలుగును. అంతట ఆపలుకులు చెవులలో ప్రతిధ్వనించుచుండును: "నీకున్న దంతయు నిచ్చివేయుము, పేదల కిచ్చివేసి నా వెంటరమ్ము". ఈ యొక్క ఆశయము నతడు బోధించెను. గొప్పప్రవక్త లెల్లరు ఈ యాశయమునే బోధించిరి. వైరాగ్యమే ఆ యాశయము. వైరాగ్య మననేమి? నీతి యందలి ఆశయమొక్కటే, నిస్స్వార్థము. స్వార్థరహితుడవు కమ్ము. సంపూర్ణ నిస్స్వార్థమే ఆశయము. ఈ చెంపమీద గొట్టిన ఆ చెంపకూడ చూపవలెను. ధరించియున్న కోటు ఎవరయిన తీసికొనిన పక్షమున చొక్కాగూడ ఇచ్చివేయవలెను.

ఆశయమును దిగువకులాగక మనకు సాధ్యమైనంత యుత్కృష్టముగా సేవ చేయవలెను. ఈ యాశయమున్నది. ఒకనిలో స్వార్థచింత, యాజమాన్య ప్రవృత్తి, నేను, నాదియను

భావము పోయినతరువాత ఆత్మార్పణ చేసినపిదప, అహం కారము నశించినపిమ్మట — అతనిలో నప్పుడుండునది దేవుడే ; అతనిలో అహంకారము పోయినది, నిర్మూలనమైనది, కరగి పోయినది. ఆదర్శప్రాయుడయిన మానవు డతడు. మనమా స్థితిని ఇంకను పొందలేదు. అయినను మన మా యాదర్శము నుపాసింతము. నిదానముగా ఆ యాశయము నందుకొనుటకు సాధన చేయుదము. సాధనలో తప్పటడుగులు పడినపడుగాక. రేపే కావచ్చు, లేదా, వేయిసంవత్సరముల పిదప కావచ్చును. మన మా యాశయసిద్ధి బడసియే తీఱవలెను. అది మన లక్ష్యమే కాదు; లక్ష్యసిద్ధికై అవలంబింపబడుసాధనకూడ. నిస్స్వార్థము, సంపూర్ణ మైన నిస్స్వార్థము మోక్షమే; లోపల మానవు డంతరించును; ఈశ్వరుని ఆవిష్కార మగును.

మఱొక్కవిషయము. జగద్గురువు లెల్లరు నిస్స్వార్థులే. నాజరెత్ ప్రవక్త జీసస్ ధర్మబోధ చేయుచుండగా ఒక రతనికడకు వచ్చి, "మీరు చేయు బోధ మనోహరముగా నున్నది. పరిపూర్ణ త్వము పొందుట కది మార్గమని నేను విశ్వసించుచున్నాను. నేనా పథము ననుసరించుటకు సంసిద్ధముగా నున్నాను; అయితే మీ రొక్కరే ఈశ్వరుని తనూభవులని భావించి, మిమ్మారాధింపజాలను." అనినాడనుకొందము. అందుకు జీసెస్ ఏమి సమాధానము చెప్పును? "మంచిది, సహోదరా! ఈ యాదర్శమును గొని నీకు తోచినపద్ధతి ననుసరింపుము. నా బోధకు నీవు నన్ను కీర్తింతువా లేదా యను విషయము నా కనవసరము. నేను దుకాణదారుడను కాను. మతము నాకు వ్యాపార విషయముకాదు. నేను సత్యము బోధింతును. సత్యమే యొక్కరిసొత్తు కాదు. ఎవ్వరును సత్యముపై తమ ముద్ర వేయజాలరు. సత్యము దేవుడే. ముందుకు సాగిపొమ్ము." అని యతడు చెప్పును. కాని, యీ దినములలో అతని శిష్యులు చెప్పుచున్న దిది: "అతని బోధలు నీవాచరించినను సరే, ఆచరింపకపోయినను

సరే. ఆప్రవక్తను పూజింతువా? పూజించుచో నీవు రక్షింపబడుదువు. పూజింపవా, నీకు మోక్షము లేదు.'' ఈవిధమున జీసస్ బోధయంతయు కళంకితమైనది, ఆ వ్యక్తి ప్రాధాన్యము కొఱకే శ్రమపడుచున్నారు, పోరాడుచున్నారు. ఇట్టి విభేదము కలిగించుటవలన ఎవరిని తాము కీర్తింప గాంక్షించుచున్నారో వాని కొకవిధముగా అవమానము కలిగించుచున్న సంగతి వారు గుర్తించుట లేదు.— అట్టి యాలోచన కాతడు మిగుల లజ్జజెంది యెంతగా బాధపడు వాడో! తన్ను సంస్మరించువాడొక్కడయిన లోకమున నున్నను, లేకున్నను అతని కేమి లక్ష్యము? తాను లోకమున కందజేయవలసిన సందేశ మొకటికలదు. దాని నత డందజేసెను. అతని కిరువది వేల జీవితములున్నను వాసినన్నిటిని ఆత డొక్క నిరుపేదకొఱకు విని యోగించును. లక్షలకొలది సమేరియన్ల కొఱ కతడు లక్షపర్యాయములు చిత్రహింస చేయబడినను, వారిలో నొక్కొక్కరి కొఱకు తను ప్రాణత్యాగము చేయుటే తన మోక్షమున కుపాయమైనచో, నిస్సంకోచముగా తన ప్రాణము లిచ్చివేసెడివాడే. ఇంతపని చేయుట తనపేరొక్కరయినను తెలిసికొనవలెననెడి కోర్కెతో కాదు. ప్రశాంతముగ, అజ్ఞాతముగ, నిశ్శబ్దముగ నతడు కర్తవ్యము నిర్వహించును. జగదీశ్వరుడు పనిచేయునట్లె చేయును. ఇప్పుడు శిష్యు డేమని చెప్పును? నీవు పరిపూర్ణుడ వగుదువుగాక. సంపూర్ణముగ నిస్స్వార్థుడ వగుదువుగాక; అయినను, నీవు మా ప్రవక్తను, మా తపస్విని కీర్తింపవేని, నీకేమియు ఫలితము కలుగదు. ఎందుచేత? ఈ గ్రుడ్డినమ్మకమునకు, ఈ యజ్ఞానమున కేమి కారణము? జగదీశ్వరుడు తన్నుతా నొక్కపర్యాయమే ప్రకటించుకొనునని శిష్యుని యభిప్రాయము. అనర్థమంతయు ఉన్నదిక్కడ. నీకు దేవుడు మానవుని ద్వారా వ్యక్తమగును. ప్రకృతియంతటను ఒక్క పర్యాయము జరిగినది యితఃపూర్వము జరిగియుండవలెను; ఇకముందును జరుగగలదు. శాసనబద్ధము కానిది ప్రకృతియం దేదియును

లేదు; అనగా ఒక పర్యాయము జరిగినది ఎప్పుడును జరుగవలసినదే, పూర్వమునుండి జరుగుచునే యున్నది.

భారతదేశములో కూడ ఈశ్వరావతారములను గుఱించి జనులకు గల యభిప్రాయము లిటువంటివే. మిక్కిలి గొప్ప యవతారములలో నొకటి కృష్ణావతారము. అతడు చేసిన మహోత్కృష్టమైన ధర్మోపదేశమే భగవద్గీత. దానిని మీలో కొందఱు చదివి యుందురు. ఆ యుపదేశములలో నొక ప్రవచనమిది: "నాకు పుట్టుక లేదు. నా తత్త్వము మార్పు చెందునది కాదు. అఖిలజీవులకు నేనే ప్రభువును. అయినను నా ప్రకృతిని నేను స్వాధీనము చేసికొని నా మాయచేతనే అవతరించితిని. ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించునో, అధర్మము ప్రబలునో అప్పుడప్పుడు నేనవతరించుచుందును. సాధుజనుల రక్షణకు, దుష్టజనుల సంహారమునకు, ధర్మసంస్థాపనకు యుగయుగములందు నే నవతరించుచుందును." "ఎప్పుడెప్పుడు లోకము పతనము చెందుచుండునో అప్పుడప్పు డెల్ల భగవానుడు వచ్చి పురోగతికి సహాయపడుచుండును; అత డావిధముగా ప్రతి యుగమున, ప్రతిదేశమున చేయుచుండును. మఱొకచోట అతడు చేసిన ప్రవచనమునకు తాత్పర్యమిది: "ఎక్కడయినను శక్తిసమన్వితుడు, పూతచరిత్రుడు నయిన మహాత్ము డొకడు మానవకోటి సముద్ధరణకు పాటుపడుచున్న పక్షమున అత డస్మదంశసంభూతుడని, నేనే అతనిద్వారా పనిచేయుచున్నానని గ్రహింపుడు".

అందువలన భగవంతుని నాజరెత్ పౌరుడయిన జీసస్‌లోనే గాక, అతనికి పూర్వము పుట్టిన మహాపురుషులలోను, అతని తరువాత వచ్చిన మహాత్ములలోను, ఇకముం దవతరింపగల లోకోత్తరులలోను దర్శింపుడు. మన పూజ్యభావము నిరవధికము, నిర్నిబంధము. మహాపురుషులందఱు నా యనంతుడగు భగవంతుని అంశసంభూతులే. వారందఱు పవిత్రులు, నిస్స్వార్థులు. వారు మనవంటి దీనులకొఱకు కష్టించి, యసువుల బాసినవారు. మనలోని ప్రతి

యొక్కరికొఱకు, భావితరముల వారందఱికొఱకు నా మహాపురుషు లందఱు, వారిలో ప్రతియొక్కరు ప్రాయశ్చిత్త మనుభవించిరి.

ఒక విధముగా మీరందఱు ప్రవక్తలే; మీలో ప్రతియొక్కరు భుజముల మీద ప్రపంచభారము మోయుచున్న ప్రవక్తయే. మౌనముగా, ఓర్మితో జీవితభారము వహింపకున్న పురుషునిగాని, స్త్రీనిగాని మీరు చూచితిరా? మహాపురుషులయిన ప్రవక్తలు ప్రచండ శక్తిసంపన్నులు. వారు ప్రపంచభారము నధికముగా వహించిరి. వారితో పోల్చినచో నిస్సందేహముగా మన మర్భకులమే. కాని, మనముకూడ ఆపనినే చేయుచున్నాము. మన పరిమిత రంగములలో, మన గృహములలో మన బాధలు మనము పడుచున్నాము. "పరమపాపి, బొత్తుగా ఎందుకు పనికిమాలినవాడు" అనదగిన వారెవ్వరు లేరు. కాని, తన కష్టములు తాననుభవింప వలసినదే. మన ప్రమాదము లెన్నియైనను, మన చింతలు, చేష్టలు ఎంతగా దుష్టమైనను మనలో నెక్కడో సుగుణముకూడ నున్నది. భగవంతునితో అనుక్షణము మనల ననుసంధించు స్వర్ణసూత్ర మొకటి యెక్కడో మనలోనున్నది. క్షణమాత్రమైనను ఆదివ్య స్పర్శ లేకున్నచో మనము నశించుట తథ్యమను సంగతి జ్ఞప్తియందుంచుకొనుడు. ఎవరును నాశన మొందువారు కారుకనుకనే మన హృదయగుహలో ఎక్కడో ఒకమూల—మనమెంత క్షుద్రులము, పతితులము అయినను—అనుక్షణము దివ్యస్పర్శ ననుభవించుచున్న జ్యోతిర్మండల మొకటికలదు.

ఏ దేశస్థులయినను, ఏ జాతివారయినను, ఏ మతమువారయినను ఎవరెవరిబోధలు పరంపరగా మనకందినవో అట్టిపూర్వ ప్రవక్తలందఱకు మన ప్రణామములు! జన్మ, జాతి, రంగు ఏదయినను మానవకోటి కళ్యాణమునకు తోడ్పడుచున్న దివ్యమానవు లెల్లరకు—స్త్రీలకు పురుషులకు—మన ప్రణామములు! మన సంతతి క్షేమము కొఱకు నిస్వార్థముగా సేవచేయుటకై ముందవతరింపనున్న దైవాంశ సంభవులందఱకు మన ప్రణామములు!

---

# మహమ్మద్ పైగంబరు

## (శాన్‌ఫ్రాన్సిస్కోబే ప్రాంతమున 1900 వ సంవత్సరము మార్చి 25 వ తేదీని స్వామిజీచేసిన ఉపన్యాసము)

బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు బోలువారు బోధించిన ధర్మములకు సామరస్యము సాధించుటే పూర్వము శ్రీకృష్ణుడు మనకిచ్చిన సందేశము. ఈమూడు ధర్మములలో ఒక్కొక్కటి ఒక్కొక్క భావముతో ప్రారంభమైనది. ఆభావములు కొట్టుకొనవఱకు గొనిపోబడినవి. ప్రవక్తలందఱికంటె కృష్ణుడు పూర్వీకుడు అయినను అతని సందేశము ప్రాచీనతమమైనను, అతడు ప్రాచీనభావములను సమన్వయ పఱచినాడని తెలుపజెల్లును. కొంతకాలము అతని సందేశమునకు, బౌద్ధమత ప్రాభవమువలన ప్రాబల్యముతగ్గినది. నేడా సందేశము భారతదేశమునకు వైశిష్ట్యసూచకముగా నున్నది. మీరు కోరెడు పక్షమున నేటి మధ్యాహ్నము మహమ్మదును గుఱించి ముచ్చటించెదను. అరేబియా ప్రవక్త సాధించిన విశిష్టకార్యమును తెలిపెదను.

మహమ్మదు చిఱుతప్రాయమున మతమునందు విశేష శ్రద్ధ వహించినట్లు అగపడడు. అప్పుడతనికి ధన సంపాదనయం దాసక్తి యుండెను. అతడు బుద్ధిమంతుడుగా, సుందరరూపిగా భావింపబడుచుండెడివాడు. సంపన్నురాలయిన ఒక వితంతువు ఆ యువకుని ప్రేమించెను. వారికి వివాహము జరిగినది. విస్తారమయిన రాజ్యమునకు మహమ్మద్ చక్రవర్తి అయిన తరువాత రోమన్, పర్షియన్ రాజ్యము లతని పాదాక్రాంతము లయ్యెను. అతని కనేకమంది భార్యలయిరి. ఒకనాడు "ఎవరియందు నీ కెక్కువ యిష్ట"మని యడుగగా, అతడు జ్యేష్ఠ భార్యవైపు చూపెను. ఏమియనగా నన్ను ప్రప్రథమముగా విశ్వసించినది ఆమె, "అని చెప్పెను"..."తల్లులారా! విశ్వాసముగలిగి యుండుడు. స్వాతంత్ర్యమును సాధింపుడు.

# మహమ్మద్ పైగంబరు

## (శాన్‌ఫ్రాన్సిస్కోబే ప్రాంతమున 1900 వ సంవత్సరము మార్చి 25 వ తేదీని స్వామిజీచేసిన ఉపన్యాసము)

బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు బోలువారు బోధించిన ధర్మములకు సామరస్యము సాధించుటకే పూర్వము శ్రీకృష్ణుడు మనకిచ్చిన సందేశము. ఈమూడు ధర్మములలో ఒక్కొక్కటి ఒక్కొక్క భావముతో ప్రారంభమైనది. ఆభావములు కొట్టకొనవఱకు గొనిపోబడినవి. ప్రవక్తలందఱికంటె కృష్ణుడు పూర్వీకుడు అయినను అతని సందేశము ప్రాచీనతమమైనను, అతడు ప్రాచీనభావములను సమన్వయ పఱచినాడని తెలుపజెల్లును. కొంతకాలము అతని సందేశమునకు, బౌద్ధమత ప్రాభవమువలన ప్రాబల్యముతగ్గినది. నేడా సందేశము భారతదేశమునకు వైశిష్ట్యసూచకముగా నున్నది. మీరు కోరెడు పక్షమున నేటి మధ్యాహ్నము మహమ్మదును గుఱించి ముచ్చటించెదను. అరేబియా ప్రవక్త సాధించిన విశిష్టకార్యమును తెలిపెదను.

మహమ్మదు చిఱుతప్రాయమున మతమునందు విశేష శ్రద్ధ వహించినట్లు అగపడడు. అప్పుడతనికి ధన సంపాదనయం దాసక్తి యుండెను. అతడు బుద్ధిమంతుడుగా, స్ఫురద్రూపిగా భావింపబడుచుండెడివాడు. సంపన్నురాలయిన ఒక వితంతువు ఆ యువకుని ప్రేమించెను. వారికి వివాహము జరిగినది. విస్తారమయిన రాజ్యమునకు మహమ్మద్ చక్రవర్తి అయిన తరువాత రోమన్, పర్షియన్ రాజ్యములతని పాదాక్రాంతములయ్యెను. అతని కనేకమంది భార్యలయిరి. ఒకనాడు ''ఎవరియందు నీ కెక్కువ యిష్ట''మని యడుగగా, అతడు జ్యేష్ఠ భార్యవైపు చూపెను. ఏమియనగా నన్ను ప్రప్రథమముగా విశ్వసించినది ఆమె, ''అని చెప్పెను''...''తల్లులారా! విశ్వాసముగలిగి యుండుడు. స్వాతంత్ర్యమును సాధింపుడు.

సర్వము పొందుడు. స్త్రీజన స్వాభావికమైన అబల లక్షణమును విడిచిపెట్టకుడు!...''

పాపము, విగ్రహపూజ, చిత్తశుద్ధిలేని ఉపాసన, మూఢ విశ్వాసము, నరబలులు మున్నగువానిని చూచినపుడు మహమ్మదు హృదయము క్షోభిల్లినది. యూదులు క్రైస్తవుల వలన హీనదశకు వచ్చిరి. ఆతని దేశస్థులకంటె క్రైస్తవులు మఱింత హీనస్థితిలో నుండిరి.

మనకు తొందరపాటు ఎక్కువ. కాని, ఏదయిన మహత్తర కార్యము నిర్వహింపదలచినప్పుడు ముందుగా సన్నాహము, ప్రాథమిక ప్రయత్నము చాల అవసరము. రేయింబగళ్లు ప్రార్థన చేయగా చేయగా మహమ్మదుకు స్వప్నములు కలిగినవి. దివ్య దృశ్యములు కనబడినవి. ఒకనాడు గేబ్రియల్ స్వప్నములో అగపడి తాను సత్య దూతనని చెప్పెను. ''జీసెస్, మోసెస్ మున్నగు ప్రవక్తల సందేశములు కాలగర్భమున కలసిపోవు''నని పలికి సంచారము చేసి ధర్మమును బోధింపుమని ఆతనితో చెప్పెను. క్రైస్తవులు ఏసు పేరిట రాజకీయవిషయములను, పర్షియనులు ద్వైతమును బోధించుచుండుట చూచి ''మా దేవుడు ఒకే ఒకడు. సర్వమున కతడే ప్రభువు. అతనికిని మఱెవరికిని, మఱి దేనికిని పోలిక లేదు'' అని మహమ్మదు వక్కాణించినాడు.

దేవుడు దేవుడే. అందు తత్త్వసిద్ధాంతము లేదు. జటిలము, క్లిష్టము అయిన నీతిశాస్త్రము లేదు. ''మా దేవుడు ఏకమేవాఽద్వితీయుడు...మహమ్మదు ప్రవక్త.'' ఈ సందేశమును మహమ్మదు మక్కావీధులలో బోధింపసాగెను....అచ్చట జను లతనిని బాధించిరి. అంతట అతడు మదీనాకు పాఱిపోయినాడు. అతడు పోరాటము ప్రారంభించినాడు. జాతియంతయు నేకమైనది. దేవుని పేరుతో మహమ్మదీయమతము ప్రచండమైన శక్తితో లోకమును ఆకర్షించినది. ఎంతటి అద్భుత వశీకరణ శక్తి!...

ప్రజల భావములు చాల కరడుకట్టినవి ; మూఢవిశ్వాస ములతో, దురూహలతో కూడినవి ! ఈ మహనీయులు దేవుడు పంపిన దూతలే అయి యుండవలెను. కాకున్న నింతటి మహిమా న్వితులెట్లు కాగలిగిరి ! మీరు ఒక్కొక్క లోపమువైపు చూచె దరు. మనలో ప్రతి ఒక్కరిలోను ఏవోలోపములు కలవు. లోపము లెవరిలోలేవు ? యూదులలో నేను పెక్కు లోపములు చూపగలను. దుష్టులు దోషములనే చూచెదరు.

ఈగలు గాయములకొఱకు వెదకును. తుమ్మెదలు పువ్వు లోని తేనెకొఱకు అన్వేషించును... ఈగను కాక తుమ్మెద ననుస రింపుడు.

అనంతరము మహమ్మదు పెక్కుమందిని పరిణయమాడెను. మహాత్ములు ఒక్కొక్కరు రెండువందలమందిని కూడ పెండ్లిచేసి కొనవచ్చును. రాక్షసబలముగల మీవంటివారు ఒక్కరినేని వివాహ మాడుటకు నే నంగీకరింపను. మహాత్ముల మనస్తత్వము మన కగ్రాహ్యము. వారి విధానముల ఆంతర్యము మనకర్థముగాదు. వారిని మనము విమర్శింపగూడదు. ఏసుక్రీస్తు మహమ్మదును విమర్శింప వచ్చును. మీరు, నేను ఏపాటివారము ? పసిబిడ్డలము. ఈ మహా పురుషుల ఆంతర్యము మన కేమి తెలియును?......

మహమ్మదీయమతము ప్రజాసామాన్యము నుద్ధరించుటకు వెలసి నది... దాని మొదటి ధర్మము సమత్వము... మత మొక్కటే—అది ప్రేమ. జాతి, వర్ణము తదితర విషయముల ప్రసక్తిలేదు. దానిలో చేరుడు ! ఆ క్రియాశీలమే దానికి విజయము సాధించిపెట్టినది...... మహత్తరమైన ఆసందేశము బహుసూక్ష్మమైనది. భూలోకమును, స్వర్గలోకమును సృష్టించిన ఒకే ఒక దేవుని విశ్వసింపుడు. అతడే ఈ సర్వమును శూన్యమునుండి సృష్టించెను. ప్రశ్న లేవియు వేయకుడు.

వారి ఉపాసనాలయములు ప్రాటెస్టెంటుల ఛర్చిల వలె నుండును... సంగీతముగాని, చిత్తరువులు, పటములుగాని వానిలో

ఉండవు. ఒకమూల నొకడు ధర్మోపదేశము చేయుతావున వేదిక కలదు; దానిమీద కొరాన్ ఉండును. ఉపాసకులందఱు వరుసగా నిలిచియుందురు. పురోహితుడు, ఆచార్యుడు, అర్చకుడు ఎవరు ఉండరు...ప్రార్థనచేయునతడు శ్రోతలున్న వైపునే నిలబడవలెను. కొన్ని అంశములు చక్కనైనవి.

పూర్వకాలమందలి ఈ మహనీయులందఱు దేవుని దూతలే. నేను మోకరిల్లి వారిని ఆరాధించెదను; వారిపాద ధూళి నాశిరమున దాల్చెదను. అయితే వారు చనిపోయిరి. మనము జీవించియున్నాము. మనము ముందుకు సాగిపోవలెను...మతము జీసెస్సును, మహమ్మదును అనుకరించుటకాదు. అనుకరణము మంచిదని ఊహించినను, అది స్వాభావికమైనదికాదు. జీసెస్సును అనుకరింపవలదు. జీసెస్సు అగుము. నీవు జీసెస్సు. బుద్ధుడు, తదితర మహాపురుషులంతటి గొప్పవాడవే నీవు......ఇప్పుడంతటివారము కాకపోయినను సాధనచేసి అంతటివారము కావలెను. సరిగా నేను జీసెస్‌గా మాఱిపోవుటకు యూదుడనుగా పుట్ట నవసరములేదు.

నీకు స్వతస్సిద్ధమైన ప్రకృతి కనుగుణముగా జీవించుటే పరమోత్కృష్టమైన మతము. ఆత్మవిశ్వాసము నలవఱచుకొనుడు! మీరే లేనియెడల, దేవుడుగాని మఱెవరుగాని ఎట్లుండగలరు? మీరెందున్నను, ఈమనస్సేకదా, అనంతుని సహితము దర్శించగలుగునది. నేను భగవంతుని దర్శింతును. కనుక, అతడున్నాడు. నేను దేవుని భావింపలేనియెడల అతడు నాకులేడు. అద్భుతమైన మానవ పురోగతి యిది.

ఈ మహామహులు ప్రయాణములో మనకు దారిచూపు స్తంభములవంటివారు. అంతే. "సహోదరులారా! పురోగమింపుడు!" అని వారు మనలను హెచ్చరించుచుందురు. మనము వారినంటిపెట్టుకొని యుందుము; ఉన్నచోటునుండి కదలుట మన కిష్టములేదు. మనకాలోచించుటే యిష్టములేదు; దేవుని దూతలు

తమధర్మము నిర్వహింతురు. ఒరులు మనకై చింతింపవలెనని ఆశపడుదుము. నడుముగట్టి కర్తవ్యమును నిర్వహింపుడని మనలను వారు హెచ్చరింతురు. ఒక శతాబ్దముతరువాత మనము వారిసందేశమును మది నిడికొని నిద్రింతుము.

విశ్వాససిద్ధాంతములను గుఱించి మాట్లాడుట సులభమే. శీలము నలవఱచుకొని, ఇంద్రియోద్వేగములను శమింపజేయుట కష్టము. వానికి మనము వశమైపోవుదుము వంచకుల మగుదుము...

మతమొక సిద్ధాంతముకాదు, నిబంధనకాదు. అది పురోగతి. అంతే. సిద్ధాంతములును నిబంధనములును సాధన కవసరములు. అట్టి సాధనవలన మనము శక్తిమంతుల మగుదుము. తుదకు శృంఖలములను త్రెంచి, స్వతంత్రుల మగుదుము. సాధనతప్ప సిద్ధాంతమువలన వేఱు ప్రయోజనము లేదు...సాధనవలన ఆత్మ పరిపూర్ణవికాసమునందును. ''నేను విశ్వసింతును'' అని నీ వెప్పుడు చెప్పుదువో అప్పుడు సాధన ఆగిపోగలదు.

''ఎప్పుడెప్పుడు ధర్మమడుగంటి, అపనీతి పెచ్చుపెఱుగునో నేను మనుష్యరూపమున అవతరింతును. యుగయుగమున నేను దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు, ఆత్మతత్త్వమును ప్రతిష్ఠించుటకు ధర్మ సంస్థాపనార్థము అవతరింతును''...... మహనీయులైన ఆలోక దూతలట్టివారు. వారుమనకు సద్గురువులు. మన అగ్రసోదరులు. కాని, మనము మనపథము ననుసరించి, అగ్రేసరులము కావలెను.

---

# నా గురుదేవుడు

## (న్యూయార్కునగరమున ప్రదత్తమైన ఉపన్యాసము)

'ధర్మము క్షీణించి అధర్మము వృద్ధినందినప్పుడు, నే నీ మనుష్యలోకము నుద్ధరింప నవతరించుచుందును' అని శ్రీకృష్ణుడు గీతలలో (४-८) ప్రకటించి యున్నాడు. పరివర్తనాశీలమగు ఈ జగత్తున స్థితిగతులుమాఱి, సమన్వయ మావశ్యకమైనపట్ల, శక్తి తరంగ మొకటి వచ్చుచుండును. మనుష్యజీవనము ఐహికాముష్మిక విషయముల రెంటితోడను సంబంధము కలిగియుండుటవలన సమన్వయము ఉభయత్ర ప్రయోజన మగుచున్నది. ఆధునిక యుగమున, ముఖ్యముగ, ఐరోపాఖండమే లౌకికవిషయములను సంస్కరించు ప్రధాన పీఠమై యొప్పుచున్నది. ఇక, ఆసియాఖండము ఆదిమయుగమునుండియు ఆధ్యాత్మిక సమన్వయమునకు మూలమై తనరుచున్నది. నేడు, మరల, మనుష్యు డాధ్యాత్మిక ప్రబోధమును గోరుచున్నాడు. జడభావముల ప్రభావము మిక్కుటముగ వ్యాప్తమగు దినములలో, మనుష్యుడు తన బ్రహ్మభావమును విస్మరించుచు, జడశక్తి నాశ్రయించుచు, అర్థోపార్జనా యంత్రముగ మాఱనున్న ఈ సమయమున; సమన్వయము ఆవశ్యకమగుచున్నది. ఆ సమన్వయవాణి ఉద్ఘోషితమైనది. మేఘశకలములవలె పరివ్యాప్తమగు ఈ జడవాద-సిద్ధాంతములను ఎగురగొట్టుటకుగాను ఆ మహాశక్తి అరుదెంచుచున్నది. అది తన కార్యము నారంభించినది. అచిరముననే అయ్యది మానవజాతికి, మరల నొకమాఱు, స్వస్వరూప-స్మృతిని ప్రసాదింప నున్నది. ఈమాఱుకూడ, ఆసియాఖండమే ఈ శక్తికి లీలారంగ మగుచున్నది. క్రియా విభజనప్రణాళికపై ఈ మన జగత్తు ఆధారపడియున్నది. 'కష్టేఫలీ' అను నీతివిధానముననే మన జగత్తు నిలిచియున్నది. సమస్తమును ఒక్కడే అనుభవించునని వచించుట వ్యర్థము. అట్లయ్యు, మన మూఢత్వము నేమని చెప్పుదును!

అజ్ఞానదశలోనున్న పసికూన, తన ఆటబొమ్మగాక మఱియొక వాంఛనీయార్థ మీప్రపంచమున లేదని తలచును. అట్లే, భౌతిక శక్తులను హస్తగత మొనర్చుకొని మహిమాన్వితమైన దేశము, సర్వార్థసిద్ధి నొందితి ననియు, తానభివృద్ధిని బొందవలసినవిషయము లింకేమియును లేవనియు, సభ్యతయొక్క పరమావధి ఇంతటితో సమాప్తమనియు, ఎంచుకొనుచున్నది. మఱియు ఐశ్వర్యాపేక్ష లేని దేశములు కొన్నియుండి, భౌతిక శక్తులపై అధీశ్వరత్వమును సంపాదింపనియెడల వానికి ప్రపంచమునం దుండుట కర్హతయే లేదనియు, వాని అస్తిత్వమే వ్యర్థమనియు ఎన్నుచుండును. ఇక, మఱియొక దేశము జడసభ్యత సంపూర్ణముగ నిరర్థకమని తలపోయవచ్చును. పరమార్థసంపద లేని సార్వభౌమత్వముకూడ వ్యర్థమేయని ప్రాచ్య వాణి ఒకపరి జగత్తున నుద్బోధించినది. ఇదియే ప్రాచ్యుల ఆదర్శము. వెనుక చెప్పినది పాశ్చాత్యుల ఆదర్శము.

ఈ భావముల రెంటిలో నేయొక్కటియును ఔన్నత్య వైభవములందు తీసిపోదు. ఈ ఆదర్శద్వయసమ్మేళనమే వర్తమానసమన్వయము. ప్రాచ్యులకు ఆత్మలోకమే సత్యము. పాశ్చాత్యులకు ఇంద్రియానుభూతమగు ప్రపంచమే నిక్కము. ప్రాచ్యులకు ఈప్సితార్థము లన్నియును ఆధ్యాత్మికానుభూతియందే లభించుచున్నవి. ఈ అనుభూతియందే వారు జీవితసాఫల్యము నందగల్గుచున్నారు. పాశ్చాత్యుడీ ప్రాచ్యుని స్వప్నముగ్ధునిగ దలచును. ప్రాచ్యుడు, పాశ్చాత్యుని అనిత్యవస్తువులతో క్రీడించు వ్యర్థుడనును. పరిణతబుద్ధులగు స్త్రీపురుషులే అశాశ్వతములగు జడపదార్థములయందు ప్రీతిని బూనుచున్నారను విషయమును తలచి ప్రాచ్యుడు నవ్వుకొనును. ఒకరినొకరు పిచ్చివారిగ నెన్నుకొనుచున్నారు. ప్రాచ్య పాశ్చాత్యాదర్శములు రెండునుగూడ మానవాభ్యుదయమునకు సమానముగనే ప్రయోజనకరము లగుచున్నవి. ప్రాచ్యుల ఆదర్శము పాశ్చాత్యుల ఆదర్శముకంటెను ప్రాముఖ్యమును వహించుచున్నదని

నా అభిప్రాయము. యంత్రములు మనుష్యునకు సుఖము నొసగవు, ఒసగజాలవుకూడ. ఈ విషయమును మానవులచే విశ్వసింప జేయ గోరువాడు యంత్రములకు సుఖప్రదానశక్తి యున్నదని వచించును. కాని, సుఖమునకు ఆశ్రయభూత మగునది మనస్సు. మనోజయము నందిన వాడొక్కడే సౌఖ్యమునందగలడు. తదితరులెవ్వరికిని శాంతి లేదు. వాస్తవమునకు యంత్రశక్తియన నేమి? తంత్రీద్వారమున విద్యుత్-శక్తిని పంపగలిగినవాడే శక్తిశాలియును, ప్రతిభావంతుడును అనుట ఏల? ప్రకృతి ప్రతినిమిషమునను సహస్రగుణాధికముగ ఈ కార్యము నొనర్చుచున్నదే! కనుక, ప్రకృతికే దోసిలొగ్గి 'దాసోఽహం' మ్మననగునే? విశ్వమునంతటిని లోంగదీసికొని, ప్రతి అణువును వశపఱచుకొనినను నీకు గలిగెడు పురుషార్థమేమి? ఆనంద మునకు మూలకందమగుశక్తి నీహృదయమున లేకుండిన, నీవు ఆత్మ విజయమును బడయకుండిన, ఈ భౌతికవశీకరణము లెవ్వియును నీకు శాంతిని బ్రసాదింపజాలవు. మనుష్యుడు ప్రకృతిని జయించుటకే జన్మించినాడను విషయము వాస్తవమేకాని, పాశ్చాత్త్యులు ప్రకృతి యనిన భౌతికప్రకృతియో లేక బాహ్య ప్రకృతియోయని భావింతురు. నదీసాగరపర్వత సంశోభితమును, అనంతశక్తియుక్తమును, వైచిత్ర్యదీప్తమును అగు బాహ్యప్రకృతి అద్భుతమై వెలయుచున్న విషయము సత్యమే కాని, దీనికంటెను అత్యంతాద్భుతమై, మనుష్యుని అంతఃప్రకృతి దీపిల్లుచున్నది. చంద్రతారార్కులను మించుచు, భౌతిక-విశ్వము నతిక్రమించుచు, మన క్షుద్రజీవితముల కతీతమై, మన గవేషణకు మఱియొక క్షేత్ర మును కల్పించుచు, ఈ అంతఃప్రకృతి విలసిల్లుచున్నది. పాశ్చా త్త్యులు బాహ్యప్రకృతి విషయమున వైశిష్ట్యమును సంపాదించినట్లే, ప్రాచ్యులు అంతర్-జగదన్వేషణమున శ్రేష్ఠతను వహించినారు. కనుక, ఆధ్యాత్మికసమన్వయము ప్రయోజనమైనప్పుడు, అది ప్రాచ్యదేశముల నుండియే ఉద్భవమగుచుండుట కడుంగడు సమంజ

సమైయున్నది. ఇట్లే యంత్రనిర్మాణ శిక్షను ప్రాచ్యుడు బడయ నభిలషించిన, పాశ్చాత్యుని పాదసన్నిధియం దాసీనుడై, దానిని నేర్చుకొనుట సముచితము. పాశ్చాత్యుడు బ్రహ్మము, ఈశ్వరుడు, ఆత్మ మున్నగు విషయములను, విశ్వరహస్యమును గ్రహింపగోరు నెడల ప్రాచ్యులకు శుశ్రూష నొనర్పనగును.

భారతదేశమున ఈవిధమగు ఆధ్యాత్మిక — సమన్వయ తరంగమును పుట్టించిన ఒక మహాత్ముని చరిత్రమును నేను మీకు జెప్పెదను. ఈ విషయమును ప్రారంభించుటకు బూర్వము, భారత దేశ మే యాదర్శమును పాలించునదియు, దాని మర్మమేమైనదియు మీకు తెలుపుటకై ప్రయత్నింతును. భౌతిక వస్తువుల ప్రభాపుంజమున అంధులై, జీవితమును అన్నపాన భోగములకు సంపూర్ణముగ అంకిత మొనరించి భోగభాగ్యములనే పరమపురుషార్థములుగ తలచుచు, ఇంద్రియసుఖమునే పరమావధిగ ఎన్నుచు ధనమే దైవమని నమ్ముచు, ఐహికసౌఖ్యమునే ఆదర్శముగ గ్రహించి పరలోకమును విశ్వసింపక, దూరదృష్టివిహీనులై ఇంద్రియ విషయలోలురై తదతీతమగు వస్తువునుగుఱించి చింతింపజాలని జనులకు భారతదేశమున ప్రత్యక్షమగునదేమి ? దారిద్ర్యము, మాలిన్యము, అజ్ఞానము, మౌఢ్యము, భీభత్సములే వారికి గోచరించును. ఏలయన, వీరు వేషభాషల ఆడంబరమును, సంఘమర్యాదలను విజ్ఞానమని భావింతురు. పాశ్చాత్యులు తమ ఐహికసంపదల అభివృద్ధికై భగీరథప్రయత్నముల నొనర్చియుండ, భారతీయులు ఈ విషయముపై లక్ష్యముంచక ఊరకుండిరి. భారత దేశప్రజలకును ఇతర దేశవాసులకును పోలికయే లేదు. ప్రపంచచరిత్రమును గాలించినను ఇట్టివారు కనబడరు. వారు తమ దేశపు పొలిమేరలను దాటి జైత్రయాత్రల నొనర్పలేదు. పరుల ఐశ్వర్యముపై వారి కన్నుపడలేదు. వారి భూములు సారవంతములై, వారు పడినశ్రమకు ఫలితముగ ఐశ్వర్యమును ప్రసాదించి, విదేశీయులకు లోభమును కల్గించి,

దండయాత్రల నొనర్ప ప్రోత్సాహ మొసగెను. ఇదియే వారి వినాశమునకు కారణమైనది. పరులు తమ్ము నిర్ధనులుగ జేసి, అనాగరికులని నిందించినను వారి కిసుమంతయును ఆగ్రహము కల్గలేదు. తమపై దాడి జరిగినను తాల్మిని సడలనీయక వారు జగత్తున ఆత్మసాక్షాత్కార సత్యములను ప్రచార మొనర్పవలెనని మనుష్య ప్రకృతియొక్క రహస్యమును తేటతెల్ల మొనర్పవలెనని మనుష్యుని దివ్యత్వము నావరించియున్న తెరను ఉన్మోచన మొనర్పవలెనని మక్కువపడిరి. ఏలయన, ఈ ప్రపంచము స్వప్నసమమనియు, ఈ జడదృశ్యములమఱుగున సత్యమును దివ్యమును అగు ఆత్మ అపాపవిద్ధమును, అకళంకమును, కామగంధరహితమును అనియు వారెఱుంగుదురు. మఱియును, ఈ ఆత్మ అగ్నికి అదాహ్యమై, జలమునకు అస్పృశ్యమై, తాపమునకు అశుష్కనీయమై, అమరణ ధర్మియై వెలయుచున్నదని వారికి దెలియును. ఇంద్రియగ్రాహ్యమగు ఏ జడపదార్థమునైనను, పాశ్చాత్త్యులు అసందిగ్ధ సత్యమని విశ్వసించురీతిగ, వీరు మనుష్యుని దివ్యప్రకృతిని సత్యమని విశ్వసింతురు.

మీరు, సింహనాదము నొనర్చుచు ఆగ్నేయాస్త్రముల మ్రోల దుముకుచు ఎట్టి ధైర్యసాహసములను ప్రదర్శింతురో, దేశభక్తాగ్రగణ్యులై స్వదేశమాతకు ప్రాణముల నర్పించుటలో ఎట్టి వీరత్వమును జూపుదురో, అట్టి ధైర్యవీర్యాదులను భారతీయులు భగవదన్వేషణా విషయమున జూపగలరు. ఈ ప్రపంచము కల్పనా సమిష్టియనియు, స్వప్నసమమనియు ఘోషించి, తమ వాక్యముల యథార్థతను నిరూపించుటకై వారు సర్వసంగత్యాగ మొనర్చుటలో ఈ ధీరత్వమే ప్రకటితమగుచున్నది. భారతీయుడు, ఆత్మయొక్క అమృతస్వరూపమును సాక్షాత్కార మొనర్చుకొని, నదీతీరస్థితుడై మీరు తృణకణములను పరిత్యజించునట్లు పాంచభౌతిక దేహమును తుచ్ఛముగనెంచి, పరిత్యజించుటలో నీ సాహ

సమే ప్రత్యక్షమగుచున్నది. వారు మృత్యువును సోదరునివలె నాలింగనమొనర్చుకొన సంసిద్ధులై తమ శౌర్యమును జూపుచున్నారు; ఆత్మకు మృత్యువు లేదను దృఢవిశ్వాసమే వారి కిట్టి సామర్థ్యమును లభింపజేసినది. పెక్కుసంవత్సరములు విదేశీయులు దాడిసల్పుచు, అణగద్రొక్కుచు, ఉపద్రవ మొనర్చుచున్నను భారతీయులు అప్రతిహతులై అపరాజితులై యుండగల్గిన దీ ఆత్మశక్తివలననే. భారతదేశము నేడుకూడ ప్రతిభాసందీప్తమై విలసిల్లుచున్నది. అత్యంత దుర్దశాపన్నమైన విషమపరిస్థితులలోగూడ ఆ దేశమున సిద్ధపురుషు లుదయించుచునే యున్నారు. ప్రాచ్యదేశములు రాజ్యాంగకోవిదులకును, ప్రకృతిశాస్త్రవేత్తలకును నిలయమైనట్లు, ఆసియాఖండము మంత్రద్రష్టలగు ఋషిపుంగవులకు జన్మభూమియైనది.

వర్తమాన శతాబ్దారంభమున పాశ్చాత్య - సాంస్కృతిక - పూరము భారతదేశమున ప్రవహింప నారంభించినప్పుడు, పాశ్చాత్యవిజేతలు ఖడ్గహస్తులై ఋషీంద్రవంశసంజాతులగు భారతీయులను సంస్కృతిరహితులనియు, స్వప్నముగ్ధజాతిలోని వారనియు నిరూపింపగోరినప్పుడు వారి మతము పుక్కిటిపురాణమనియు, వారి ఆధ్యాత్మికాన్వేషణ మంతయునుగూడ అర్థములేని వాక్యాడంబరమ మాత్రమే యనియు, వారు కృతయుగమునుండి నేటివఱకు ఆచరించుచుండిన తపోత్యాగములు వ్యర్థములనియు నిరూపింపగోరినప్పుడు ఆధునిక విశ్వవిద్యాలయములలో సరస్వతీదేవి నుపాసించెడి యువకుల మనస్సు సందేహడోలల నూగసాగెను. వారు, అనుపూర్వికమగు జాతీయజీవనము భ్రష్టమైపోవుటవలన, మరల పాశ్చాత్య విధానము ననుసరించి తమ జీవితమును సమగ్రముగ సంస్కరించుకొనవలసియుండునేమో యని శంకింపదొడిగిరి. ప్రాచీనశాస్త్ర గ్రంథములను త్రోసిరాజని, దర్శనసిద్ధాంతములకు స్వస్తివాచకము పఠించి, మతాచార్యులకు మంగళహారతినెత్తి, దేవాలయ

ములను మంటిదిబ్బలుగ మార్పవలసియుండునాయని భావింపసాగిరి. పాశ్చాత్యప్రభువులు—బాహుబలమున స్వమతౌన్నత్యమును ప్రకటించిన పాశ్చాత్య ప్రభుపుంగవులు-ప్రాచీనాచారముల నన్నిటిని అజ్ఞానజనితము లనియు, మూఢములనియు బోధించుచుండగా వీనికి స్వస్తి చెప్పుటకంటె గత్యంతర మేమియున్నదని తలపోయు చుండిరి. ఆ బాల్యము పాశ్చాత్యవిధానము ననుసరించి నిర్మింపబడిన విద్యాలయములలో శిక్షణమును బడయుచు, పాశ్చాత్యభావ పూరితులైనవారి డెందములిట్టిసందేహముల గేహములగుటలో విచిత్రమేమున్నది? మూఢసంస్కారములను పరిత్యజించి, సత్యాన్వేషణాతత్పరులగుటకు మారుగ వారు పాశ్చాత్యుల వచనములనే పరమప్రమాణములుగ పరిగ్రహింపసాగిరి. మతాచార్యుల ఆధ్వర్యము, శాస్త్రవిశ్వాసమును అంతరింపవలెను. ఏలయన, పాశ్చాత్యు లిట్లు ప్రబోధించుచున్నారు. ఈరీతిగ తటస్థమైన చిత్తసంక్షోభమే కారణముగ సంస్కారోద్యమ మొకటి భారతదేశమున పొడసూపెను.

సంస్కరణమునే ప్రధానాశయముగ గ్రహించినవ్యక్తికి ముఖ్యముగ మూడుగుణము లుండవలయును. మొదటిది, సదయాంతఃకరణము. నీవు సోదరమానవకోటినిమిత్తము యథార్థముగ పరితపించుచుంటివా? ప్రపంచము నావరించియున్న అజ్ఞానమౌఢ్యశోకములు నిన్ను వాస్తవముగనే కలవరపెట్టుచున్నవా! మనుష్యమాత్రుడే సహోదరుడని నిజముగనే పల్కుచుంటివా? ఈ భావము నీయందు పరిపూర్ణముగ నున్నదా? ఇది రక్తముతో సమానముగ నీలో ప్రవహించుచున్నదా? ఇది నీ రక్తనాళముల నుబుకజేయుచున్నదా? ఈ భావము నీ నాడులన్నిటియందును, నీ అవయవ సంధులన్నిటిలోను ప్రతిస్పందించుచున్నదా? ఈ సానుభూతియందు నీ కద్వైతసిద్ధి కలిగినదా? నీ యందింతటి భావప్రాబల్యమున్న యెడల, ఈ విషయమున కనుకూలమగు సాధన

సంపత్తియందు నీ కొక్కటి మాత్రమే లభించినదని గ్రహింపుము. తరువాత, నీవు చింతింపవలసిన విషయము ప్రతిక్రియయై యున్నది. ప్రాచీనభావములన్నియును విజ్ఞానసమ్మతములు కాకుండినను, ఆ అజ్ఞానస్తూపములలో సువర్ణశకలములవలె మిలమిలలాడు సత్య కణము లున్నవి. మట్టితో బంగారము కలసియున్నది. మట్టిని గడిగివైచి బంగారమును శుద్ధమొనర్చు ఉపాయము నావిష్కరించి తివా? ఉపాయము నీకు లభించినయెడల, సాధనసంపత్తియందు రెండవదానిని చేకూర్చుకొంటివని విశ్వసింపుము. మఱియొకటి ఆవశ్యకమైయున్నది. నీ ఉద్దేశ్యమేమి? నీవు సంపూర్ణముగ నిష్కా ముడవై, ఐశ్వర్యమును 'పేరుప్రతిష్ఠల'ను గోరుచుండుట లేదను విషయమున నీకు దృఢవిశ్వాసమున్నదా? నీవు నీ ఆదర్శమును పట్టుదలతో గట్టిగ పట్టుకొని, ప్రపంచమంతయు నిన్ను నులిమివేయ బ్రయత్నించినను, నీ పనిని నీవు చక్కబెట్టుకొనుచుండగలవా? నిగూఢచేతనయందు సుషుప్తములైయున్న భావములు నీకు విదిత ములా? కత్తి గొంతుకపైననున్నను కర్తవ్యనిష్ఠను బ్రదర్శింప గలవా? 'బొందెలో ప్రాణమున్నంతవఱకు', తుది నిశ్వాసమును విడుచువఱకు, పూనికను విడచిపెట్టకుందువను ఆత్మవిశ్వాసము నీ కున్నదా? ఇట్టి ఆత్మవిశ్వాసము నీ కున్నయెడల, నీవు యథార్థ సంస్కర్తవు, నీవు ఉపదేశకుడవు, జగద్గురుడవు; నీవలన లోక సంగ్రహము సాధింపబడగలదు. కాని, మనుష్యుని ఫలాసక్తిని గుఱించియు, సంకుచితదృష్టిని గుఱించియు ఏమని చెప్పుదును? ఫలితములయెడ నుదాసీనతను దాల్చి, తుదివఱకు పూను శక్తి లేదు. మనుష్యుడు అధికారమును ప్రదర్శింపగోరును; తక్షణమే ఫలితములను బొందగోరును. ఏలయన, వాస్తవమున కాతడు స్వార్థకామియే కాని ఇతరుల శుభమును ఆకాంక్షించుచుండుట లేదు. నిష్కామ కర్మము ఆతనికి రుచించుట లేదు. 'విహిత కర్మముల నాచరించుటకే గాని, వాని ఫలముల గోరుటకు నీ కెన్నడును అధి

కారము లేదు', (గీత: ౨—౪౩) అని శ్రీకృష్ణుడు వచించెను. ఫలముల గోరనేల? కర్తవ్యానుష్ఠానమే మనవంతు, ఫలితము లేమియైనను అగుగాక! కాని మనుష్యునకు ఫలాసక్తి అపరిమితము. అతఁ డేకాగ్యమునైన నొనర్ప నుత్సహించును. ప్రపంచమున సంస్కర్త నామధారులగువారిలో పెక్కుమంది ఈ తరగతిలోనివారే యగుచున్నారు.

ఋషి ప్రవరుల సిద్ధాంతములు జడవాదతరంగములబడి కొట్టుకొనిపోవుతఱి భారత దేశమున సంస్కరణోద్యమ మొకటి బయలు దేఱునని మీకు చెప్పియుంటిని. భారత దేశమున కిట్టి విపత్పరంపరలు పూర్వము బహుళముగనే ఘటిల్లియున్నవి. వానితో సరిపోల్చి చూచినయెడల నియ్యది అత్యంత సామాన్యమని తోఁచును. అసంఖ్యాకములగు ప్రళయములు సమస్తమును విధ్వంసమొనర్చెను. నిశితకరవాలములు ఝుళిపింపబడెను. 'అల్లాహో అక్బర్' అను ధ్వనులు భారత దేశ గగనతలమును విదీర్ణ మొనర్చెను. కాని, భారతీయుల ఆదర్శముల కెట్టి మార్పును గలిగింపకయే ఈ వెల్లువలన్నియు నింకిపోయెను.

భారతీయుల నెవ్వరును విధ్వంస మొనర్పజాలరు. వారు మృత్యుంజయులు. ఆత్మతత్త్వమునే ఆదర్శముగ నొనర్చుకొని, ఆధ్యాత్మికవిషయానురాగమును విడువనంతవఱకు వారు అమరులై వెలుగొందుదురు. లక్ష్మీప్రసాదము కలుగకపోయినను, చిరకాలము పెద్దమ్మయే అనుగ్రహము చూపుచున్నను, వారు ఈశ్వరుని విస్మరింపకుందురుగాక! తమ వంశములకు మూలపురుషులు ఋషీశ్వరులని జ్ఞప్తియందుంచుకొందురుగాక! పాశ్చాత్య దేశములలో వీథులయందు తిరుగాడు నికృష్టుడు గూడ తాను మధ్యయుగమున విలసిల్లిన ఒకానొక చోరప్రభుని వంశమున జన్మించితినని నుడువనుత్సహించునట్లు, భారత దేశమున సింహాసనాసీనుడగు సమ్రాట్టుసైతము అరణ్యవాసియును, నిష్పచ్చరమును స్వీకరించిన యోగియు జటావల్కలాజిన

ధారియును, కందమూలాశనుడును, బ్రహ్మధ్యానపరాయణుడును అగు ఒకానొక ఋషీంద్రుని గోత్రమున జన్మించితినని చెప్పనుత్స హించును. మే మిట్టియోగుల కులముననే పుట్టగోరుదుము. ఎంత వఱకు పవిత్రగుణము పరమపూజ్యముగ భారతీయులచే పరిగ్ర హింపబడుచుండునో, అంతవఱకు వారికి మృతిలేదు.

ఇటీవల 'నైన్టీన్త్ సెంచురీ' అను పత్రికలో మోక్షమూలరు భట్టాచార్యులవారు ప్రకటించిన 'ఒక యథార్థమహాత్ముడు' అను వ్యాసమును మీలో పెక్కుమంది పఠించియే యుందురు. శ్రీరామ కృష్ణుని జీవితము ఆయన బోధనలకు దృష్టాంతస్థానీయమగుటవలన ఆకర్షణీయముగ నున్నది. పాశ్చాత్య దేశములందలి పరిస్థితులకును, భారత దేశమందలి స్థితిగతులకును విశేషమగు తారతమ్యముండుట వలన మీకు ఈ జీవితచరిత్రము ఒకింత ఆశ్చర్యమును కలుగ జేయవచ్చును. దైనికజీవితముయొక్క చంచల పరిస్థితుల ననుస రించి పాశ్చాత్య దేశముల నుద్భవించిన ఆచారవ్యవహారములు భారతదేశపు రీతినీతులతో సంపూర్ణముగ భేదించుచున్నవి. అయి నను, పూర్వ శ్రుతములగు విషయములకు నవీనభాష్యమా యని పించునదగుటవలన, ఈ జీవితచరిత్ర మీకు రుచించునదియే యగును.

భారత దేశమున వివిధములగు సంస్కరణోద్యమములు పొడ సూపుచుండిన సమయమున, వంగ దేశమునందలి ఒకానొక కుగ్రామ ముననున్న దరిద్రబ్రాహ్మణ కుటుంబమున క్రీ. శ. ౧౮౩౬ ఫిబ్రవరి పదునెన్మిదవ తారీఖున ఒక శిశువు జన్మించెను. ఆ శిశువుయొక్క తల్లి దండ్రులు పూర్వాచారపరాయణులు. సనాతనధర్మానుక్రమమగు బ్రాహ్మణజీవితము గడపుచుండిరి. వారిగృహము తపోత్యాగనిలయమై వఱలుచుండెను. ఆ జీవితమునకు లౌకిక వ్యవహారసంబంధ ముండ రాదు. పొట్టకూటికై ఏ వృత్తిని పరిగ్రహింపకూడదు. అపాత్రులనుండి వారుదానములను గ్రహింపకూడదు. ఇట్టి జీవిత మెంత కష్టదాయ కమో మీరే యూహించుకొనుడు. మీరు బ్రాహ్మణులను గుఱిం

చియు, వారిపౌరోహిత్యమును గుఱించియు పలుమాఱులు వినియుంటిరి; కాని, వీరి కీ యధికార మెట్లు లభించినదను విషయమును మీ రెవ్వరును పర్యాలోచింప లేదు. తదితర వర్ణములవారికంటె వారే కడుంగడు బీదలు; కాని త్యాగమందే వారిశక్తి అంతర్నిహితమై యున్నది. వారెన్నడును ధనము నాకాంక్షింపరు. జగత్తునందున్న మతగురు-సంప్రదాయములలో ఈ బ్రాహ్మణులే బీదలుగ నున్నారు. కనుకనే వీరి కపరిమితమగు శక్తి లభించినది. ఇట్టి దారిద్ర్యవ్రతమును పాలించుచుండినను బ్రాహ్మణగృహిణి అభ్యాగతులగు పేదసాదలకు భోజనమిడియే గ్రామమునుండి తరలించును. అన్నప్రదానము భారత దేశమున గృహిణియొక్క ప్రధానతమ కర్తవ్యముగ పరిగణింప బడును. అందఱను భుజింప జేసియే తుదకామె భుజించును. తాను భుజించుటకు పూర్వము అభుక్తు లెవ్వరును లేకుండగ జూచుభార మామెకున్నది. కనుకనే, భారతదేశమున తల్లి దేవీస్వరూపిణిగ పూజింపబడుచున్నది. మన కథానాయకుని తల్లి ఇట్టి ఆదర్శములకు నిలయమై యుండెను. వర్ణభేదమున ననుసరించి నియమ కాఠిన్య ముండును. నిమ్నవర్ణములవారు స్వేచ్ఛానుసారము అన్నపానములను గ్రహింపవచ్చును. వర్ణశ్రేష్ఠత ననుసరించి క్రమముగ నిబంధన లెక్కువగుచు, వైదిక బ్రాహ్మణుల జీవితమును అత్యంత నిష్ఠతో బిగించుచున్నవి. పాశ్చాత్యులదృష్టితో పరికించినయెడల, వారి జీవితమంతయును తపోమయముగనే పొడగట్టును. ఆంగ్లేయుల యందు తోచు స్థైర్యగుణమే సహస్రకృతమై వారియందు నెలకొని యున్నది. వారు ఒకానొక ఆదర్శమును గ్రహించినయెడల, పురుష పురుషాంతరములుగ దానిపస జూచి విడచెదరు. దొరకినదానిని ఒక పట్టున విడువరు. కాని, క్రొత్తవిషయములను వారు అంత తేలికగ గైకొనరు.

కనుక, నిష్ఠావంతులగు హిందువులు తమకు తాముగనే యుండి, నిజభావ సామ్రాజ్యసీమలలోనే కట్టువడియుండువారని తేలు

చున్నది. ఆమరణము జీవితక్రమ ముండవలసినరీతి, సూక్ష్మాతి సూక్ష్మ విషయములతోబాటు, వారి శాస్త్రగ్రంథములు నిర్వచించు చున్నవి. ఆ శాస్త్రము లుపదేశించెడి ప్రతియంశమును వారు నిరంతరదృఢవ్రతులై పాలింతురు. వారు ఉపవాసము నొనర్చుటకైన సమ్మతింతురుగాని, తమ వర్ణమునందలి శాఖకు జెందనివాని వంటకమును దిన నుత్సహింపరు. దృఢత్వమును, తీవ్రమగు భావ సంశుద్ధియును వారి యందున్నవి. దృఢవిశ్వాసమును, నైష్ఠిక జీవిత ప్రభావమును ప్రాయికముగ మనము సనాతనహిందువుల యందు జూడగలము. ఏలయన, తమ ఆచరణము భ్రమరహితమను ప్రబలవిశ్వాస ముండుటవలననే, వారికిట్టి నిష్ఠాపరత్వము చేకూరు చున్నది. వారిట్టి దృఢత్వముతో ప్రతిపాదించు విషయములు భ్రమ రహితములను విశ్వాసము మనకు లేకపోయినను, వారి కీ విశ్వాస మున్నది. పరోపకార మొనర్చుటలో ప్రాణత్యాగ మొనర్చుటకు గూడ వెనుదీయరాదని మా శాస్త్ర గ్రంథములు నుడువుచున్నవి. మనుష్యుడు తా నుపవసించి ప్రాణముల బోగొట్టుకొనినైనను ఇతరులను కాపాడవచ్చును. ఇట్టి ఆచరణమే మనుష్యోచితము. బ్రాహ్మణుడగువాడు ఈ విషయమున అపారమగు సాహసమును జూపనగును. భారతీయవాఙ్మయముతో పరిచయమున్నవారికి ఈ నీతినిబోధించు మహాభారతకథ—సక్తుప్రస్థుడను బ్రాహ్మణుని కుటుంబము అతిథికి ఆహారమును సమర్పించి మరణించినవిషయము— తెలిసియేయున్నది. ఇందతిశయోక్తి ఏమియును లేదు. ఇట్టివి నేడుకూడ జరుగుచునే యున్నవి. నాగురుదేవుని తల్లితండ్రుల శీల మీ రీతిగనే యుండెను. నిరుపేదరాలైన ఆ తల్లి, పరులకు సాహాయ్యమొనర్చి తాను పస్తుండెడిది. ఇట్టి బ్రాహ్మణదంపతుల గర్భమున నా గురుదేవుడు జన్మించెను. ఆబాల్య మాతని చరిత్రము విచిత్రముగనే యుండెను. ఆయన జాతిస్మరత్వముతో నొప్పుచు, తా నేవిషయమును సాధించుటకై ధరణీతలమున అవతరించినదియు తెలిసికొన గలిగెను.

ఆ విషయమును సాధించు నిమిత్తమే ఆయన శక్తినంతటిని ధారవోసెను.

చిన్నతనముననే తండ్రి గతించెను. బాలుడు పాఠశాలకు బంపబడెను. బ్రాహ్మణబాలురు విధాయకముగ విద్యనభ్యసింప వలెను. అధ్యయనాధ్యాపనములే వారి జీవితమునకు దోడ్పడు వ్రత ములు.* నేటికిగూడ భారతదేశమున పలుతావులందు నిలచియున్న ప్రాచీన విద్యావిధానమునకును, వర్తమాన విద్యావిధానమునకును ప్రభేదము మిక్కుటము. విద్యార్థులు జీతముకట్ట నక్కఱలేదు. పరమపవిత్రమగు జ్ఞానము విక్రయింపబడకూడదు. నిష్కామ బుద్ధితో విద్యాదాన మొనర్పవలెను. ప్రతిఫలమును గోరక, విద్యా దాన మొనర్చుటయేగాక పెక్కుమంది ఉపాధ్యాయులు విద్యార్థులకు అన్నవస్త్రముల గూడ నొసగుచుందురు. ఈ ఉపాధ్యాయులకు సాహాయ్యకరముగ నుండుటకై, ధనవంతులు వివాహశ్రాద్ధాదిసమ యములందు దానముల నొసగుచుందురు. కొన్ని విశేషదానములను గ్రహించు ముఖ్యాధికారము ఈ ఉపాధ్యాయులకే యున్నది. ఈ దానములను గ్రహించి, వారు విద్యార్థులను పోషింపవలెను. కనుక, వివాహసమయములలో, ముఖ్యముగ గొప్పవారి ఇండ్లకు, ఈ ఉపా ధ్యాయు లాహ్వానింప బడుదురు. వారు అరుదెంచి శాస్త్రవిషయ మగు తర్కము నొనర్తురు. ఈ బాలుడు ఇట్టి వివాహ సభ కొక దానికి బోయి, తన వయస్సునకందని తర్కజ్యోతిషాది విషయ ములను పండితులు ప్రసంగించుచుండగ వినెను. విచిత్రుడగు ఈ బాలుడు వారి విద్యయొక్క పరిణతి ఇదియేకదాయని వితర్కించు కొనెను. "వారు ఇంతగ కష్టపడి వాగ్వాద మొనర్చుచుండుట దేనికి? ధనార్థము. విశేషమగు ఉపజ్ఞను చూపినవానికి, వెలగల వలువలజత లభించును. వీ రింతగ పెనుగులాడుచుండుట దీనికొఱకే. నేను పాఠ

---

* ద్విజాతీ నామధ్యయనమిజ్యా దానమ్, బ్రాహ్మణ స్యాధికాః ప్రవచన యాజన ప్రతిగ్రహాః.— గౌతమ ధర్మసూత్రములు ౧౦-౧,౨.

శాలకింక వెళ్లను''. మఱి ఆతడు పాఠశాలకు పోలేదు. అతని విద్యాభ్యాసము ఈ రీతిగ ముగిసెను. కాని, పండితుడగు జ్యేష్ఠసోదరుడీ బాలుని చేవిద్యనభ్యసింప జేయుటకై తనతో కలకత్తాకు కొనిపోయెను. అచిరముననే ఈ బాలుడు లౌకికవిద్య ఐహికసుఖముల నొసగునదియే కాని మఱి దానివలన నెట్టిలాభమును కలుగదని నిశ్చయించుకొనెను. కనుక, ఈ చదువును విడిచి, ఆధ్యాత్మికజ్ఞానము నన్వేషింప దనశక్తినంతటిని ఆతడువినియోగింపదలచెను. తండ్రిలేని నిరుపేదయగుటవలన జీవికకుగాను కలకత్తాకు దగ్గిరలోనున్న దేవాలయమున పూజారి అయ్యెను. మా దేవాలయములకును మీ చర్చికిని సంబంధము లేదు. అవి సార్వజనీన ప్రార్థనామందిరములు కావు. భారతదేశమున సార్వజనీన-ఉపాసనయే లేదు. పుణ్యప్రదమగు ధర్మకార్యముగ భావించి ధనవంతులే ముఖ్యముగ దేవాలయములను నిర్మింతురు.

ఆస్తిపరులు దేవాలయ సంప్రోక్షణమును జరుప వాంఛింతురు. ఆ దేవాలయమున భగవంతుని ప్రతీకమో, విగ్రహమో, లేక అవతారమూర్తియో ప్రతిష్ఠింపబడును. అందు ఈశ్వరారాధనము జరుగును. ఈ అర్చనావిధానము మీ క్యాథలిక్ చర్చిలో జరుగునట్లుగనే యుండును. స్తవపఠనము, పవిత్ర గ్రంథపారాయణము, ధూపదీపనీరాజన సమర్పణము మున్నగునవి జరుగును. మహాత్ములగువారికి మన మే విధమగు భక్తిప్రపత్తులను గనపరతుమో, అట్టి భక్తిప్రపత్తులనే ఈ విగ్రహములపట్లకూడ వారు చూపెదరు. ఆ దేవాలయములలో జరుపబడు పూజావిధాన మిదియే. మందిరమునకు బోవువాడు శ్రేష్ఠుడు, వెళ్లనివాడు నికృష్టుడను భావములకు తావే లేదు. యథావిధిగ చూచిన, భారతదేశమున ధర్మసాధన వ్యక్తిగతమగుటవలన, దేవాలయమునకు అరుగనివానినే శ్రేష్ఠునిగ జెప్పవలసియున్నది. ప్రతిగృహమందును దేవతార్చననిమిత్తమొకగది ప్రత్యేకముగ నుండును. లేదా, ఒకగది ధ్యానాదికము నొనర్చు

కొనుటకై వినియోగింపబడును. గృహయజమాని ప్రాతస్సంధ్యల నటకుబోయి పూజనొనర్చును. ఆపూజ కేవలము మానసికము. అతడే మొనర్చునదియు ఇతరులకు తెలియదు. అతని పలుకులు ఇతరుల వినులబడవు. అతడచ్చట ఆసీనుడై యుంటయే ఇతరులకు కనబడును. లేక, చేతివ్రేళ్లను విచిత్రముగ కదిలించుచుండుటయో, నాసికాపుటమును అదిమి వింతరీతిని గాలిని పీల్చుచుండుటయో కాన వచ్చును. మఱి విశేషమేమియును అతని సోదరునకైనను, భార్య కైనను తెలియదు. ఇట్లు పూజావిధాన మంతయును రహస్యముగ నింటనే జరుపబడును. ఇంట ప్రత్యేకమగు వసతి లేనివారు నదీతీరమునకుగాని చెఱువుగట్టునకుగాని వెళ్లుదురు. దగ్గర సముద్రమున్న యెడల సముద్రకూలమునకుకూడ పోవుటకలదు. కొన్ని వేళల పూజాపురస్కారముల నొనర్చుటకై దేవళమునకుకూడ చనెదరు;ఇంతటితో దేవాలయసంబంధము ముగియును. ప్రాచీనకాలమునుండియు మా దేశమున, మనుస్మృతి తెల్పినరీతిగ, పూజారి పతితుడుగ నెంచబడుచున్నాడు.౨ తదితర స్మృతులు దేవాలయార్చకుని సంఘబహిష్కృతునిగ నొనర్చు చున్నవి.౩ విద్యావిక్రయమే నిషిద్ధమైన యెడల అర్చనకార్యమునకై ప్రతిఫలమునుగొనుట పవిత్రవిషయములతో వర్తకవ్యాపార మొనర్చుట యగుచున్నదని దీనిభావము. దారిద్ర్యమునకులోనై అర్చకత్వమును విధిలేక స్వీకరించిన ఆ బాలుని మనఃస్థితి ఎట్లుండునో మీరే యూహింపుడు.

---

౨ మనుస్మృతి. ౩-౧౫౨ చూ:

౩ (అ) దేవార్చనపరో విప్రో విత్తార్థీ వత్సరత్రయం,
స వై దేవలకో నామ సర్వకర్మ బహిష్కృతః.
— మహాభారతమ్. అశ్వమేధ ప.

(ఆ) అర్థార్థీ కాలనిర్దేశీ యో దేవం పూజయేత్ సదా,
కర్మదేవలకో నామ సర్వకర్మ బహిష్కృతః.
—పుష్కర సంహితా.

౪ మనుస్మృతి. ౩-౧౫౬ చూ:

గింపబడును. గృహయజమాని ప్రాతస్సంధ్యల
...నర్చును. ఆపూజ కేవలము మానసికము.
...యు ఇతరులకు తెలియదు. అతని పలుకులు
... అత డచ్చట ఆసీనుడై యుంటయే ఇతరులకు
...త్రివేళ్లను విచిత్రముగ కదిలించుచుండుటయో,
...దిమి వింతరీతిని గాలిని పీల్చుచుండుటయో కాన
...శేష మేమియును అతని సోదరునకైనను, భార్య
...ఇట్లు పూజాప్రధాన మంతయును రహస్యముగ
... ఇంట ప్రత్యేకమగు వసతి లేనివారు నదీతీర
గట్టునకుగాని వెళ్లుదురు. దగ్గిర సముద్రమున్న
మునకుకూడ పోవుటకలదు. కొన్ని వేళల పూజా
...ర్చుటకై దేవళమునకుకూడ చనెదరు; ఇంతటితో
... ముగియును. ప్రాచీనకాలమునుండియు మా
...తి తెల్పినరీతిగ, పూజారి పతితుడుగ నెంచబడు
...ర స్మృతులు దేవాలయార్చకుని సంఘబహి
...చు చున్నవి.౩ విద్యావిక్రయమే నిషిద్ధమైన
...ర్యమునకై ప్రతిఫలమునుగొనుట పవిత్రవిషయ
...పార మొనర్చుట యగుచున్నదని దీనిభావము.

అర్చకత్వమును విధిలేక స్వీకరించిన ఆ
...ప్లుండునో మీరే యూహింపుడు.

---

-౧౫౨ చూ :

...పరో విప్రో విత్తార్థీ వత్సరత్రయం,
...కో నామ సర్వకర్మ బహిష్కృతః.

— మహాభారతమ్. అశ్వమేధ ప.

...ర్ద్రేశీ యో దేవం పూజయేత్ సదా,
...మ సర్వకర్మ బహిష్కృతః.

—పుష్కర సంహితా.

-౧౫౬ చూ :



వంగదేశమున పూర్వకవులచే రచింపబడిన గేయములు చాలవఱకు నేటికిగూడ నిలిచియున్నవి. కలకత్తానగర-వీథులలోను కుగ్రామములలోను వానిని వినగలము. ఈ పాటలు ఆధ్యాత్మిక గేయములు. వానిభావము, భారతదేశ - మతములకు మూలసూత్రమగు సాక్షాత్కారము. ఈ తత్త్వమును తెలియజెప్పని మతగ్రంథ మొక్కటియైనను భారతదేశమున కనబడదు. మనుష్యుడు ఈశ్వర-తత్త్వమును సాక్షాత్కార మొనర్చుకొనవలెను. ఈశ్వర-సత్తను అనుభూత మొనర్చుకొనవలెను, ఈశ్వరుని జూడవలెను. ఈశ్వరునితో సంభాషింపవలెను. ఇదియే మతసంగ్రహము. భగవద్రూపములను దర్శించిన మహాత్ముల గాథలతో భారతదేశము నిండియున్నది. ఇట్టి తత్త్వములే వారిమతమునకు మూలభూతములై యున్నవి. మా ప్రాచీనశాస్త్రగ్రంథకర్తలు అపరోక్షానుభవసంపన్నులు. మా గ్రంథములు పండితుల చిత్తవినోదమునకు వ్రాయబడలేదు. అవి తర్కమునకు లొంగునవి కావు. అనుభవసంపన్నులగు మహాత్ములచే వ్రాయబడిన విషయములగుటవలన, తుల్యానుభవభూమికల నధిరోహించిన మనస్సునకే అవి బోధగమ్యములగును. జీవన్ముక్తియనున దొకటి యున్నదనియు, సర్వులకు నది సుసాధ్యమనియు, ఇందు ఆరూఢత్వము నందినప్పుడే ధర్మసాధన ప్రారంభ మగుచున్నదనియు వారి అభిప్రాయము. ఇదియే మతములన్నిటియొక్క సారాంశము. కనుకనే; మహావాగ్మియును, తర్కశాస్త్రపారంగతుడును అగువాడు పరతత్త్వమునుగూర్చి ప్రసంగించుచుండగా వినువారు దొరకకుండుటయును, నగణ్యుడును, స్వభాషాజ్ఞానరహితుడును అగువాని వచనముల నాలకించి అవతారమూర్తియని దేశమంతయు అసంఖ్యాకులు పూజించుచుండుటయును సంభవించుచున్నవి. భారతదేశమున ఒకడు ఆత్మసాక్షాత్కారమును బడసినాడను విషయము ఎటులనో వెల్లడియైన మాత్రముననే, జనులు నలువైపులనుండి ఆతని దర్శన మొనర్పవత్తురు. పిదప నాతని బూజింప నారంభింతురు. ఈ

సాక్షాత్కారమునకు అర్థము : ఇక మతము ఆతనికి కేవలము 'ఊహాగానము' కాదు ముఖ్యవిషయములగు ధర్మసాధన, ఆత్మయొక్క అమృతత్వము. ఈశ్వరుడు మున్నగు తాత్త్వికవిషయములు ఆతనికి విస్పష్టములైనవి—వానిని గుఱించి అతడు చీకటిలో తారాడుచుండుట లేదు.

అత డర్చించు దేవాలయమున ఆనందమయియగు జగన్మాత విగ్రహము ప్రతిష్ఠితమైయుండెను. అత డా విగ్రహమును ప్రాతస్సంధ్యల పూజించుచుండెను. "ఇది కేవలము పాషాణమూర్తియేనా? కాక మఱియేమైనను దీనియందున్నదా? ప్రపంచమున ఆనందమయియగు జగదంబ వాస్తవముగ విలసిల్లుచున్నదా? ఆ సన్మాత్రస్వరూపిణి ఈ జగత్తును నియమించుచుండుట నిజమేనా? మతవిషయములు సత్యములా?" అను సందేహములు క్రమముగా నాతని మనస్సును పీడింప దొడగెను.

మా హైందవబాలుర కిట్టి సందేహములు పొడసూపుచుండును. తమ ఆచరణముయొక్క యాథార్థ్యమును శంకించుటయే భారతీయుల వైశిష్ట్యము. జీవేశ్వరులను గుఱించిన సిద్ధాంతములను బహుళముగనే మేము వినుచున్నను, అవి మాకు పరితృప్తి నొసగజాలవు. గ్రంథములతోడను, వాదములతోడను మే మాగము. వేలకొలదిగ జనులకు ఈ సాక్షాత్కారోన్మాదము కలుగుచున్నది. ఈశ్వరు డనువా డొకడుంట వాస్తవమేనా? వాస్తవమైననే నీశ్వరుని దర్శన మొనర్పగలనా? సత్యము నాకు కరతలామలక మగునా? పాశ్చాత్యుల కీ విషయములన్నియును అసాధ్యములుగ తోచవచ్చును. కాని, మాకు ఈ సాక్షాత్కార మత్యంతసహజముగనే తోచును. దీనికొఱకు మేము ప్రాణములనుగూడ నర్పింపగలము. ప్రాచీనకాలమునుండియు మా దేశమున పెక్కుమంది ఈ సత్యమును సాక్షాత్కార మొనర్చుకొనుటకై సుఖభోగములను పరిత్యజించి గిరిగుహావాసులగుచుండు విషయమును మీరు వినియుంటిరి. నేడు

కూడ పరిష్కృతముగ జనులు సంసారమును త్యజించి పవిత్రనదీతీరము లందు ఈ సత్యవస్తువును సాక్షాత్కార మొనర్చుకొను కోర్కెతో వ్యాకులచిత్తులై ఆక్రందించుచున్నారు. ఈ సాక్షాత్కారమున కర్థము మనము సామాన్యముగ తలచు బుద్ధిగ్రాహ్యమును, హేతువాదసమ్మతమును అగు ఎఱుక కాదు. కాక, ఊహింపదగు విషయమును కాదు. పంచేంద్రియానుభూతమగు ఈ జగత్తుయొక్క అస్తిత్వముకంటెను గంభీరమైనది అపరోక్షానుభూతి. ఈ అనుభూతిని సమర్థించు విషయములను నే నిప్పుడు నుడువబోను. కాని, ఇది యొక్కటియే వారి అంతరాత్మ కోరునది. వేలకువేలుగ జనులు ఈ ఆశనే హృదయమున నిడికొని తనువులను త్యజించుచున్నారు. వేలకువేలుగ జనులు ఈ ఆశనే హృదయమున నిడికొని తపోరంగమున నిలబడుచున్నారు. యుగములతరబడిగ దేశమంతయును ఈ సాక్షాత్కార వాంఛతోడనే తపోత్యాగముల ననుష్ఠించుచున్నది. ఈసాక్షాత్కారవాసనాప్రాబల్యమున ప్రతిసంవత్సరమందును సంసారమును పెక్కుమంది త్యజించి తపోఽగ్నికి ప్రాణముల నాహుతి నొనర్చుచున్నారు. ఈ మాట పాశ్చాత్యులకు నీటిమూటవలె తోచవచ్చును. ఇట్లు భావించుటకుగల కారణములను నే నెఱుంగుదును. పాశ్చాత్యదేశములందు నేను మెలగితిని. అయినను జీవితమున ఇంతకంటె యథార్థమగు విషయము వేఱొండు నాకగపడుట లేదు.

ఆ ఈశ్వరవస్తువును విస్మరించిన నిమిషము వ్యర్థమగుచున్నది.* భౌతికశాస్త్రముల అద్భుతవిషయములను జింతించినను వ్యర్థమేయగును. ఈశ్వరవిస్మృతిని గలిగించు విషయములన్నియును తుచ్ఛములే. నీవు బుద్ధిలో బృహస్పతివైనను, మూర్ఖశిరోమణివైనను జీవితము క్షణభంగురమని గ్రహింపుము. నీవు గర్భదరి

* స హాని స్తన్మహచ్ఛిద్రం సా చాంధజడమూఢతా, యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవం న చింతయేత్.

—ప్రసన్నగీతా. ౩౦.

ద్రుడవైనను, ధనకుబేరుడవైనను జీవితమనిత్యమని తెలిసికొనుము. నీవు పాశ్చాత్యదేశములలోని మహానగరవీధులలో 'దిక్కులేక అల్లాడు పక్షి' వైనను, కిరీటధారివగు సమ్రాట్టువైనను జీవిత మశాశ్వతమని ఎఱుంగుము. నీవు జబ్బనిన ఏమియో ఎఱుగని ఆరోగ్యవంతుడవైనను, ఆరోగ్యమనిన నేమియో ఎఱుగని రోగి వైనను జీవితము క్షణికమని తెలిసికొనుము. నీకు కళానుభూతినంద గల సుకుమారచిత్తమున్నను, హింసాక్రౌర్యయుతమగు చిత్తమున్నను జీవిత మతిశయచపలమని నీవు గుర్తించుట పాడి. ఈ జీవితరహస్యము నెఱుంగుటకు కేవల మొక్క ఉపాయమేయున్నదని హిందువుడనును. ఈ ఉపాయమునే వారు భగవంతుడనియు, ధర్మమనియు వాకొందురు. ఈ రెండును సత్యములైనయెడలనే జీవితరహస్యము తేటతెల్లమగును, జీవితభారము తేలికయగును, జీవితము ఆనందమయమగును. కానియెడల, జీవితమొక గుదిబండ యగును. ఇదియే మా సునిశ్చితాభిప్రాయము. ఏ హేతువాదమైనను ఈ విషయమును బలపఱుపజాలదు. కేవలము 'అస్తిమాత్రవాచ్యము' అని నుడివిన హేతువాదము వీగిపోవును. ఎంతటి సూక్ష్మవాద కౌశలమైనను, ఏ శాస్త్రశాఖకు జెందినదైనను విషయములను చూచాయగ ప్రదర్శించుటయేగాని ఇదమిత్థమని నిర్ణయింపజాలదు. నేడు భౌతికశాస్త్రములు ప్రత్యక్షముగ ప్రదర్శించు విషయములుకూడ అనుమానములే కాని నిర్ణీతసత్యములు కావు. వస్తుతంత్రమగు సత్యములు సాక్షాత్కారార్హము లగును. సత్యమును ప్రత్యక్షమొనర్చుకొనవలెను. ఇట్లే ధర్మమునుగూడ ఉపలబ్ధమొనర్చుకొనవలెను. ఈశ్వరుడను వాడొకడున్నాడను విశ్వాసము కుదురుటకుగాను, తత్సాక్షాత్కార మావశ్యకమైయున్నది. శాస్త్రతత్త్వముల యాథాత్మ్యమును అంగీకరించుటకు పూర్వము ఆ తత్త్వముల అపరోక్షానుభూతి కావలెను. స్వానుభూతికాక మఱి అన్యమేదియును, ఎంతటి హేతువాదమైనను, ఈ తాత్త్వికవిషయముల సత్యమును

మనకు ప్రమాణిత మొనర్పజాలదు. అచంచలమగు విశ్వాసమును కలుగజేయజాలదు. ఇది నా మనోభావము. ఇయ్యదియే భారత దేశముయొక్క అభిప్రాయముకూడ.

ఆ బాలు డీ సాక్షాత్కారావేశమునకు లోనయ్యెను. అతని మనస్సు ఈ విషయముననే ఏకాగ్రమయ్యెను. 'తల్లీ! నీవు ఉంటివను విషయము వాస్తవమా? లేక కల్పనయా? ఆనందమయియగు జగన్మాత కవులయొక్కయు భ్రాంతులయొక్కయు సృష్టియా, లేక అట్టి తత్త్వము వాస్తవముగ నున్నదా?' అని దినములతరబడి ఆతడు పల్కుచు రోదించుచుండెను. గ్రంథపఠనమే విద్యాగ్రహణ మను అభిప్రాయముగల మనము గ్రంథములను పఠించిచూచితిమి. అతని కిట్టి విద్యాలేశముకూడ లేకుండెను. కనుక, అతని మనస్సు నైసర్గికస్థితిని గోల్పోవక, పరిశుద్ధమై, పవిత్రభావసందీప్తమై, ఒప్పుచుండెను. ఆ మనస్సు పరప్రత్యయనేయముగాక, అకలుషితమై యుండెను. అతడు విశ్వవిద్యాలయమున కరుగనివాడగుటవలన స్వయముగనే ఆలోచింపదొడగెను. మనము సగపాలు జీవితమును విశ్వవిద్యాలయముననే గడుపుటవలన, మనబుద్ధులు ఇతరులభావముల తోడనే నిండువడియున్నవి. నే నింతకుపూర్వము నుడివియున్న వ్యాసమున మోక్షమూలరు మహాశయుడు ఈతనిగుఱించి ప్రసంగించుచు 'నిష్కళంకుడగు అచ్చపుమనిషి' అనియు, ఈతని స్వాభావిక ఉపజ్ఞ (అకృత్రిమత్వము) యొక్క రహస్య మాతడు విశ్వవిద్యాలయ ప్రాంగణమున పెరుగకపోవుటయేయనియు వచించియుండుట ఎంతయును సమంజసమై యున్నది. అతని మనస్సును తీవ్రముగ వేధించుచున్న చింత, తా నీశ్వరుని జూడగల్గుదునా యనుచింత, అతడు మఱి అన్యమును చింతింపజాలనంత ప్రాబల్యమును వహించెను. ఇక, నాతడు పూజను యథావిధిగ నొనర్పజాలడయ్యెను. పూజావిధానమునందలి వివిధవిషయములను పాలింప నశక్యుడయ్యెను. నైవేద్యమును ధూపదీపములను విగ్రహమునకర్పింప నాతడు తఱ

చుగ మఱచుచుండెను. కొన్ని వేళలయం దాతడు కేవలము నీరాజనమునే గంటలకొలది అర్పించుచు, పారవశ్యము నందుచుండెను.

'తల్లీ! నీవు ఉంటివను విషయము వాస్తవమా? పలుకాడ వేల? నీ మనస్సు కరుగదా?' అనియే ప్రతిదిన మాతడు తీవ్రమగు వ్యాకులత నందుచుండెను. మన జీవితమునకుగూడ ఒక్కొక్కప్పుడు ఇట్టి ముహూర్తములు తటస్థించుచుండును. నిస్సారములును జటిలములును అగు తర్కవిచారములతో మనస్సు విసుగుజెందినప్పుడు, గ్రంథపఠనమునిన ఏవగొన్నప్పుడు, గ్రంథము లంతగ బోధింపగలిగిన దేమియును లేదనియు, కేవల ముబుసుపోకకు నల్లమందువలె వానిని నియమిత సమయముల సేవించుచున్నారమనియు, ఈ పఠన మొనర్పకున్న ప్రాణము లేచిపోవునట్లుండు ననియు, ఇందతయును వ్యర్థ కాలక్షేపమనియు, సర్వాత్మనా మనము గ్రహింపగలిగినప్పుడు, మన అంతరాత్మనుండియుగూడ ఇట్టి ఆక్రందనమే వెలువడును. 'ఈ విశ్వమున నాకు జ్ఞానాలోకము ననుగ్రహింపగలిగిన వా రెవ్వరును లేరా? సర్వేశ్వరా! నీవున్నయెడల జ్ఞానజ్యోతిని ప్రసాదింపుము, పలుకకున్నా వేమి? నీ దర్శనమునే దుర్లభ మొనర్చుచున్నావే! ఇంతమంది ప్రవక్తలను బంపనేల?. నీవే రారాదా? వాగ్యుద్ధముల సహస్రధా విక్షుబ్ధమైన ఈ జగత్తున నే నెవ్వరిని అనుసరింతును? నే నెవ్వరిని విశ్వసింతును? నీవు అందఱివాడవేయైనయెడల నీవరుదెంచి నీ బిడ్డతో సంభాషింపవేల? దోషములను దెలియజెప్పవేల?'* అని మన అంతరాత్మ ఘోషపెట్టుచుండును. మనస్సు మిక్కుటముగ

* ఓ సత్యమా! సర్వేశ్వరా! చిరంతన కారుణ్యమున నాకు నీతో నేకత్వమును ప్రసాదింపుము. నా కంటబడు బహుళాంశములును చెవిబడు అశేష విషయములును నా మనసును పీడించును. నీలో నా సమస్తకాంక్షలు కేంద్రీకరింపబడియున్నవి. ఆచార్యపరంపర, చెప్ప నేల సృష్టిలోని సమస్తవస్తు నిచయము నీ మ్రోల మౌనము వహించియుండు గాక! నీ యొక్కడవే నాతో ప్రసంగింపుము.

—"ఏసు అనుకరణము" 1. 3. 2.

కళవళపాటు పడునప్పుడు మనమందఱమునుగూడ ఇట్లే ఎలుగెత్తి విలపించుచుందుము. నలువైపులనున్న మోహవిషయముల మాహాత్మ్యమున మన మిద్దానిని మఱునిముసముననే మఱుతుము అప్పటికప్పుడు, స్వర్గద్వారము తెఱవబడు దివ్యముహూర్త మేతెంచిన దనిపించును. అప్పటికప్పుడు, జ్ఞానసలిలములందు మునుకలిడ బోవుచుంటిమా యనిపించును. కాని మరల మనలోనున్న పశుప్రవృత్తి ఈ దివ్యభావముల నన్నిటిని మఱపింప జేయును. మనము, మరల అధఃపాతాళమును జేరుకొందుము. పశుప్రవృత్తి మఱల పొడచూపును. ఆహారనిద్రా మైథునముల నాశ్రయించి, మృత్యుముఖమున బడుదుము. 'పునరపి జననం పునరపి మరణం'. కాని, మహాత్ములగువారు ఈ విషయమును ఇంత చులకనగ విడువరు. ఒక పరి మనస్సు అంతర్ముఖీనమైనయెడల, ఎన్నివిఘ్నములు లకుదెంచి నను వెనుకకు అడుగిడరు. జీవిత మనిత్యమని ఎఱిగి, సత్యవస్తువునే వారాకాంక్షింతురు. వినాశ మవశ్యంభావ్యమైనతఱి, ఈశరీర మొక మహావిజయము నభిలషించియే సమయుగాక!* పశుప్రవృత్తిని జయించుటకంటె దివ్యమగు విజయము మఱేమికలదు? "జననమరణముల రహస్యమును శుభాశుభముల రహస్యమును ఎఱుగుటకంటె ఉత్తమమగు విషయము మఱేమియున్న"ది అని వారందురు.

కడ కాతడు పూజాకృత్యములను నిర్వహింపలేని స్థితికి వచ్చెను. ఆత డా కార్యమును విడచి పొంతనున్న ఒక వనమున నివసింప దొడగెను. ఈ సమయమున ఎప్పుడు ప్రొద్దు పొడిచినదియు, ప్రొద్దు గ్రుంకినదియును ఆతనికి దెలియకుండెను. దినము లెట్లు మళ్లుచుండినదియును గూడ ఆత డెఱుగజాలకుండెను. ఈ విషయము నాతడు నాకు పలుమాఱులు వర్ణించి చెప్పెను. ఆత్మవిస్మృతినందిభుజింపడయ్యెను. ఈ పరిస్థితులలో ఆత్మీయుడొకడు కడుంగడు

* 'సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి.'

ప్రేమమీఱ నతనిని గాచియుండెను. భోజనమును నోటిముందఱ నుంచ నాత డెట్లో దిగమ్రింగెడువాడు.

రేయింబవళ్లు ఇట్లు గడవజొచ్చెను. దినాంతమున సంధ్యా సమయమున దేవాలయమునందలి ఘంటాధ్వనులును, ప్రార్థనాస్వర ములును వీనులబడ నాతనిదుఃఖము పొంగిపొరలుచుండెను. 'తల్లీ! మరల నింకొక దినము వ్యర్థముగ గడచినది. నీ దర్శనము లభింప లేదు. అనిత్యజీవితమునందలి దిన మొకటి గడచి వమ్మైనది. సత్య మును గ్రహింపజాలకుంటిని' అని రోదించెడువాడు. ప్రాణములు ఉస్సురుమన ఒక్కొక్కప్పు డాతడు మోమును నేలకురుద్దుచు ఏడ్చును. 'హే జగదంబా! నాహృదయమున ఆవిర్భవింపుము, నేను నిన్నుగాక మఱి అన్యమును గోరకుండున ట్లనుగ్రహింపుము!' అనియే ఆతడు ప్రార్థించుచుండెను. అతడు తన ఆదర్శమును త్రికరణశుద్ధిగ పాలింపనెంచెను. సర్వత్యాగ మొనర్పనియెడల మాతృదర్శనము లభింపదని ఆతడు వినియుండెను. జగన్మాత అందఱకును గనబడ సిద్ధముగనే యున్నదనియు, కాని ఆమెను కోరువారెవరును లేరనియు, జనులు తుచ్ఛవిషయములనే కాంక్షింతు రనియు, విషయలౌల్యమే గాని మాతృచరణాసక్తి వారికి లేదనియును, సర్వాత్మనా అన్యము నపేక్షింపక ఆమెదర్శనము నపేక్షించినయెడల మఱునిముసముననే లభించుననియు ఆతడు వినియుండెను. ఆతడు ఈ భావైక్యమును బొంద సమకట్టెను. ఐహికవిషయములను గూడ త్యజింపదొడగెను. తనకుండిన లవలేశమును గూడ పరిత్యజించి, ధనమును ముట్టనని ప్రతిజ్ఞ జేసెను. ఈ ప్రతిజ్ఞ అతనితో నైక్యము నందెను. ఇదియొక గొప్పమహిమగ తోపట్టవచ్చును కాని. కాలాంతరమునగూడ నేను నాణెమును ముట్టింప సుషుప్తియందున్నను ఆతని హస్తము ముడుచు కొనిపోయి శరీరమునకు పక్షవాతము కలిగినట్లు తోచుచుండెను. కామము మఱియొక శత్రువని ఆతడు గ్రహించెను. మనుష్యుడన నాత్మ. ఆత్మ లింగరహితము, పురుషుడును కాదు, స్త్రీయును కాదు.

ఈ కామకాంచనములే అమ్మనుండి తన్ను వేఱుపఱచుచున్న వని ఆతడు తలచెను. ఈ విశ్వమంతయును జగజ్జననియొక్క విభూతి విస్తారము. ప్రతివారియందు ఆమె నెలకొని యున్నది. 'అదృశ్య యగు జగన్మాతయొక్క ప్రతిరూపమగు యువతిని కామదృష్టితో నెట్లు వీక్షింతును?' అని ఆతడు తలచెను. ప్రతిరమణిని తల్లిగ భావించి, స్త్రీలందఱి యందు జగన్మాతను సాక్షాత్కరింపజేసి కొనుట తన విధియని ఆత డెన్నుకొనెను. ఈ సాక్షాత్కార మాతనికి లభించెను.

మానవహృదయ మిట్లు తృషార్తమగును. కాలాంతరమున అతడు నా కిట్లు చెప్పెను: 'వత్సా! దొంగవా డుండిన ప్రక్క గదిలో కాసులసంచి యున్నయెడల, ఆతడు నిద్రింపగలడా? నిద్రింపజాలడు. ఎట్లు ప్రక్కగదిసొచ్చి సొమ్మును తీసికొందునని ఆతని మనస్సు రెపరెపలాడుచుండును. అట్లే ఈ నామరూపాత్మక మగు ప్రపంచమున కవ్వల పరతత్త్వమొకటి కలదనియు, ఈశ్వరు డను వాడొకడున్నాడనియు, అతడమృతస్వరూపు డనియు, ఆనంద స్వరూపు డనియు, ఇంద్రియభోగము లన్నియును ఆ ఆనందము యొక్క కణామాత్రములనియు స్థిరవిశ్వాసముగల వ్యక్తి దానిని బొందు ప్రయత్న మొనర్పక ఊరకుండగలడా? ఒక్క నిముసమైనను అతడు ప్రయత్నహీనుడై మనగలడా? మనజాలడు. ఈ కోర్కె అతనిని వెఱ్ఱివానిగ జేసివైచును.' ఇట్టి దివ్యోన్మాదమే ఆతనికి కలిగెను. ఆ సమయమున ఆతనికెట్టి గురువులును లభింపలేదు. ఏ విషయమునైనను తెలియజెప్పువారు లేకుండిరి. అందఱును ఆతనికి పిచ్చిపట్టినదని భావింపసాగిరి. సామాన్యు లిట్లే తలతురు. ఒక డైహిక విషయములను పరిత్యజించినయెడల జనులాతనిని పిచ్చివా డందురు. కాని, లోకమునకు వీరే జీవగఱ్ఱలు. ఇట్టి ఉన్మాదము నుండియే మన జగత్తును ఉఱ్ఱూతలూగింపగల శక్తు లుద్భవించినవి. ఇట్టి ఉన్మాదమునుండియే భవిష్యత్తునగూడ జగత్తు నాడింపగల శక్తు లుద్భవిల్లగలవు.

నిరంతరసాధనలతో దినములు, వారములు, నెలలు కడచి పోసాగెను. అప్పుడాతనికి దివ్యదర్శనములును, అద్భుతములగు రూపములును ప్రత్యక్షము కాదొడగెను. స్వస్వరూపరహస్యము విడివడుచుండెను. క్రమముగ తెరలన్నియును లేవనెత్తబడుచుండెను. జగదంబయే గురుడై కాంక్షితసత్యములను దెల్పసాగెను. అప్పుడటకు విద్యారూపసంపన్నయగు యువతి యొకర్తుక ఏతెంచెను. కాలాంతరమున ఆతడామెనుగూర్చి ప్రసంగించుచు విద్యాధికయనిన చాలదనియు, సాక్షాత్తుగ చదువులరాణియేయనియు, చదువుల యవతారమని మూర్తీభవించిన వైదుష్యమని వచించుచుండెడివాడు. ఇటగూడ మీరు భారతీయుల వైశిష్ట్యమును గమనింపగలరు. సామాన్యహిందూవనితలనందఱను ఆవహించుకొనియుండిన అజ్ఞానాంధకారమును భేదించుకొని, మీరు స్వాతంత్ర్యమని వచించు వస్తువు యొక్క పరిచయము లేకుండినను అపూర్వాధ్యాత్మిక శక్తిసంపన్నయగు ఇట్టి రమణీమణి యుద్భవింపగల్గెను. ఆమె సన్న్యాసిని. మా దేశమున వనితలుగూడ సంసారత్యాగ మొనర్తురు; ఐశ్వర్యమును త్యజింతురు; వివాహ మొనర్చుకొనక జీవితమును భగవదారాధనమందే గడపెదరు. ఆమె యరుదెంచి వనవాసియగు ఈతని విషయమును విని, ఈతనిని జూడదలచెను. ఈమెగో మొదటగ నాతనికి సాహాయ్యమొనర్చెను. వెనువెంటనే ఈతనికష్ట మేమైనది యును ఆమె గ్రహింపగల్గెను. "వత్సా! ఇట్టి ఉన్మాదమునకు లోనగువారు ధన్యులు. ఈ విశ్వమంతయునుగూడ ఉన్మత్తమే. కొందఱకు డబ్బుపిచ్చి, కొందఱకు భోగములపిచ్చి, కొందఱకు పేరు ప్రఖ్యాతులపిచ్చి—ఇట్లు శతధా జగమున్మత్తమై యున్నది. జనులు ధనమునకనియో, భర్తలకనియో, భార్యలకనియో, తుచ్ఛ విషయములకనియో, ఇతరుల నణగద్రొక్కవలయుననియో, ఐశ్వర్యములకనియో మతిభ్రష్టత నందుచున్నారు. ఈశ్వరుడుగాక తదితరములగు ప్రతిహాస్యకరవిషయములకొఱకును లోకుల మతి చెడు

చున్నది. 'ఎవరిపిచ్చి వారి కానందము.' ఒకడు ధనపుపిచ్చితో కొట్టుకొనుచుండ జనులు తాముగూడ అట్టి పిచ్చిగలవారేయగుట వలన సానుభూతిని కనపఱచుచు 'ఈతడు సరియైనవ్యక్తి' యని వాకొందురు. పిచ్చివారు పిచ్చివారినే తెలివిగలవారని అనెదరు గదా! ఈ పిచ్చి వారి కర్థమగును. కాని పరమప్రేమాస్పదుని నిమిత్తము, ఈశ్వరునికొఱకు, ఉన్మాదులైనవారి విషయమును వారెట్లు గ్రహింపగలరు? వారాతనిని మతిభ్రష్టునిగనే తలచి, 'ఆతని జోక్యము మనకేల?' అని చెప్పెదరు. కనుకనే "వారు నిన్ను పిచ్చివాడనుచున్నారు. కాని నీ పిచ్చియే సిసలైనపిచ్చి. ఈశ్వరునినిమిత్తము ఉన్మత్తులైనవారు ధన్యులు. ఇట్టి వా రరుదుగ నుందురు." అని ఆమె అతనితో జెప్పెను. ఈ రమణి అతనియొద్ద కొన్ని సంవత్సరములుగ నుండి, భారతదేశీయములగు వివిధసంప్రదాయముల తత్త్వములను బోధించెను. వివిధములగు యోగసాధనల నుపదేశించెను. అతివేగముగ పరుగిడు ఈ ఆధ్యాత్మిక-నదిని ప్రణాళీబద్ధమొనర్చెను.

తరువాత ఆ తావునకు భిక్షాజీవియగు సన్న్యాసి యొకడరుదెంచెను. ఆతడు శాస్త్రవేత్త, పండితుడు. ఆతడు ఇతరులకొకింత ఆశ్చర్యమును కలుగజేయుచుండెను. అతడు అద్వైతవాది. జగన్మిథ్యాత్వ మాతనిసిద్ధాంతమగుటవలన, తాను నమ్మినదానిని ప్రతిష్ఠించుటకోయన, ఎండవానలనక ఆరుబయలుననే నివసించెడివాడు. తలదాచుకొనుటకై వలసిన గృహాశ్రయము ఆతనికి అక్కఱలేకుండెను. ఇతడా బాలునకు ఉపనిషత్-సిద్ధాంతములను బోధింపదొడగెను. త్వరలో, గురునికంటె శిష్యుడే కొన్నిపట్ల మేధాశక్తినత్యధికము కలిగియుండెనని గ్రహించి ఆతడు విన్నబోయెను. కొన్ని నెలలపాటు అతడు బాలునియొద్దనుండి, సన్న్యాసదీక్ష నొసగి, నిష్క్రమించెను.

అత డర్చకుడుగ నుండిన తఱి, అతడొనర్చు అద్భుతపూజావిధానమును గాంచి జనులాతని మతిచెడినదనియే తలచిరి. అతనిని

స్వగ్రామమునకు గొనిపోయి బంధుగులొక చిన్న బాలికతో వివాహ మొనర్చిరి. వివాహానంతరము మనస్సు కుదుర్కొనునని వారు భావించిరి. కాని వారు తలచినట్లుగాక, అతడు మరల తానుండు వనమున కరుదెంచెను; ఆ ఉన్మాదము తత్తోఽధిక మయ్యెను. మాదేశమున బాల్యవివాహాచార మున్నది. దీనిని కేవలము సంబంధమును కుదుర్చుకొనుటయే యననగును. వివాహానంతరము వధూవరులు వారివారి తల్లిదండ్రులకడనే యుందురు. వధువు వయస్కురాలైన పిదప, వరుడరిగి ఆమెను తన గృహమునకు గొనివచ్చును. కాని, ఇతడు తనకు వివాహమైనవిషయమునే విస్మరించెను. దూరస్థ కుగ్రామమునను్న ఆ వధువు తన భర్తకాధ్యాత్మికోత్సాహ మత్యధికమని వినెను. కొందఱతనిని ఉన్మత్తుడని నుడువుటనుగూడ వినెను. ఆమె నిజము నెఱుగగోరి తనభర్తయుండు తావునకు ప్రయాణమయ్యెను. ఆమెనుగాంచి అతడు భార్యగనే స్వీకరించెను. భారతదేశమున సన్న్యాసగ్రహణ మొనర్చినవారికెట్టి ఋణానుబంధమును ఉండదు. ఈ యువకు డామె చరణములపొంత మోకరిల్లి, "జగదంబ తాను స్త్రీలయందు నెలకొనినట్లు నాకు దెల్పినది. కనుక, యువతులనందఱిని జగన్మాతస్వరూపిణులుగ చూడనభ్యస్తుడనైతిని. నిన్నుగూడ నిట్లే వీక్షింతును. కాని, నీవు మరల నన్ను సంసారములోని కీడ్వదలచితివేని నిన్ను వివాహమాడితిని గావున నీకు సేవకుడనై మనియుందును" అని పల్కెను.

ఈ మహిళాలలామ పూతచరిత్ర. కనుక భర్త ఆశయములను గ్రహించి సానుభూతి నొసగగల్గెను. వెనువెంటనే ఆమె తనకు సంసారమున బంధించు వాంఛలేదనియును, తోడునీడగనుండి సేవలనొనర్చుచు తత్త్వవిషయముల నెఱుగు కోర్కె తనకుగలదనియు వచించెను. ఆమె అతనికి ప్రధానస్థానము నలంకరించిన శిష్యురాలై, భర్తను దేవుని భావనతో సేవింపదొడగెను. ఈరీతిగ భార్యయొక్క

అనుమోదముతోడనే, శేషప్రతిబంధకముకూడ తొలగిపోవ దాను కోరి ఏటుకొనిన మార్గమున నతడు యథేచ్ఛగ జనగల్గెను.

పిదప, సర్వమతతత్త్వము నెఱుగగోరు అభిలాషతో నతని హృదయము నిండుకొనెను. ఇంతవఱ కాతడు ఆర్యమత–సాధనల యందే తన్మయుడై యుండెను. అతడు ఇతరమతములరీతి యెట్టిదో తెలిసికొనగోరెను. కనుక, అతడు ఈ పర్యాయము ఇతరమత–గురువుల నాశ్రయించెను. గురువనగా మా యభిప్రాయము గ్రంథకీటకము కాదు. అపరోక్షానుభూతి నందినవాడు, తనయంతట దానే సత్యమును గుర్తెఱింగినవాడు,—ఇతరులనుండి వినినవాడు కాడు. అత డొక మహమ్మదీయయోగిపుంగవునిజూచి, ఆతని నాశ్రయించెను. తదుపదిష్టములగు సాధనల నభ్యసించెను. భావశుద్ధితో నతడుపదేశించిన భక్తిమార్గమున పయనించి తాను ఏతత్పూర్వము చేరుకొనిన గమ్యమునే మరల పొందుట ఆతని కచ్చెరువును గొల్పెను. ఏసుక్రీస్తు బోధించిన సత్యమతసాధనలగూడ నొనర్చి, ఇట్టివేయగు అనుభూతులను బడసెను. కంటికి గానవచ్చిన మతముల నన్నిటిని అతడు సాధించెను. అత డెద్దానిని గ్రహించినను హృదయపూర్వకముగ స్వీకరించెడివాడు. ఉపదేశానుసారము 'తు, చ' తప్పకుండ అతడు నియమపాలన మొనర్చుచుండెను. పదే పదే, అత డొకేగమ్యమును జేరుకొనుచుండెను. ఇట్లు, నిజానుభవమువలన ప్రతిమతమును ఒకేగమ్యమును ఉపదేశించుచున్నదనియు, ప్రతి మతమును ఒకేవిషయమును బోధించుచున్నదనియు, కేవలము సాధనావిధానమునను తతో౽ధికముగ భాషావిషయమునను అవి భేదించుచున్నవనియు అతడు గ్రహింపగల్గెను. వాస్తవమునకు మతము లన్నిటియొక్కయు, తదంతర్గతములగు సంప్రదాయములయొక్కయు లక్ష్యమొక్కటియే; కాని స్వార్థసిద్ధినిమిత్తము ఒకదానితోనొకటిగ అవి పోరాడుచున్నవి. సత్యము నాకాంక్షించుటలేదు, పేరుకొఱకు తహతహ లాడుచున్నవి. ఏ రెండు మతములను గైకొనినను, అవి ఒకే సత్యమును బోధించుచున్నవని

తెలిసికొనగలము. కాని ఒకమతస్థుడు, "అది సత్యము కాదు. దాని మీద నా ముద్ర పడలేదు, దానిని వినబోకుము" అనుచున్నది. ద్వితీయ మతస్థుడు, "ఆ మతబోధలు ప్రాయోసత్యములైనను చెవియొగ్గకుము. ఆ మతమింకను పరిపూర్ణసత్యము కాదు, ఏలయన నా పేరిట నది బోధింపబడుచుండుట లేదు" అని చెప్పును.

పరిస్థితు లిట్లుండుటను గాంచి నా గురుదేవుడు వినయ సంపన్నతనంద గాంక్షించెను. ఏలయన, ఇది సర్వమతసాధారణమగు బోధ; మతము లన్నియును అడకువను గర్వరాహిత్యము నుపదే శించుచున్నవి. 'నాహం' — నేను కాదు. 'తుహు'—నీవు. అహంకార రహితుడైన వాని హృదయముననే ఈశ్వరుడు నెల కొనును. అపరిపక్వమగు ఈ 'నేను' తొలగినకొలది భగవద్భావము ప్రతిష్ఠిత మగుచుండును. ప్రపంచమందలి మతము లన్నియును ఒక్కపెట్టున ఈ సత్యమును దెల్పుచుండుటవలన, అతడిద్దానిని సాధింప సమకట్టెను. అత డెద్దానినైన సాధింప బూనుకొనినయెడల, కేవలము శ్రవణపేయములగు సిద్ధాంతములతో నాగిపోక, వెను వెంటనే తీవ్రముగ కృషిజేయు వాడని మీకు దెల్పియేయుంటిని. పరోపకారము, సర్వభూతసమత్వము, ఇతరుల అధికారములు మున్నగు మంచివిషయములను గురించి సుందరప్రసంగముల నొనర్పగలవారు అధికముగనే కనిపింతురు; కాని, వారు వ్యర్థ జీవులు మాత్రమే అగుచున్నారు. పూర్వ పుణ్యావశమున మాటలను చేతలుగ చేయగల వాని దర్శనము నాకు లభించినది. తాను ధర్మమని విశ్వసించిన ప్రతివిషయమును ఆచరణలోనికి గొని వచ్చు శక్తి అతనియందు అద్భుతముగ నుండెను.

ఆ సమీపముననే పంచమజాతికుటుంబ మొకటి నివాస మేర్ప రచుకొని యుండెను. భారత దేశమునందలి పంచముల సంఖ్య కొన్ని లక్షలుండును వారు అతినికృష్టులుగ పరిగణింపబడుదురు. కొన్ని స్మృతులు బ్రాహ్మణు డింటనుండి వెలువడు సమయమున

పంచము డెదురైన, ఉపవసించి ప్రార్థనాదికముల నొనర్ప వలయు ననియు, అట్లొనర్చినయెడలనే అతడు మరల శుద్ధుడగు ననియు చెప్పుచున్నవి.౮ కొన్ని పట్టణములలో ప్రవేశించుటకు బూర్వము పంచముడు తనజాతిని సూచించుటకుగాను నెత్తిన కాకి ఈకను పెట్టుకొని, 'పంచముడు వచ్చుచున్నాడు, తొలగుడు' అని ఇతరులను సావధానపఱచవలసియున్నది. ఆ మాటలువిని జనులు అత్యంతము ఆతురతతో తొలగిపోవుచుందురు. ఏలయన పొరపాటున అతనిని దాకిన స్నానాదిక మొనర్చి వస్త్రపరివర్తన మొనర్పవలయును.౯ ఈ పంచములుకూడ చాలకాలమునుండి తమ్మపవిత్రులనుగ భావించుకొనుచు, తమస్పర్శ ఇతరులను మైలపడజేయుననియే విశ్వసించుచున్నారు. నాగురుదేవు డిట్టి పంచమునికడకరిగి అతనిగృహమును పరిశుభ్ర మొనర్తునను. పంచముల వృత్తి గృహములను వీథులను శుభ్ర మొనర్చుట. పంచము డే గృహమును ప్రధానద్వారమున బ్రవేశింపజాలడు. దొడ్డిద్రోవనుండియే ప్రవేశించును. అతడు వెళ్లిన పిమ్మట ఆదారి అంతయును నీరుచిమ్మి, గంగాజలముచల్లి పవిత్ర మొనర్తురు. బ్రాహ్మణమాత్రుడు పవిత్రుడుగను, పంచము డశుద్ధుడుగను ఎన్నబడుచున్నారు. ఈ బ్రాహ్మణుడు పంచమగృహమున హేయకార్యము నొనర్పగోరెను. పంచము డిద్దాని కంగీకరింపడు. బ్రాహ్మణు నట్టి కార్యమొనర్పజేసిన తమకు పాపము కల్గుననియు, తత్ఫలితముగ వంశనాశ మగుననియు పంచముల భయము. కనుక, అర్ధరాత్రివేళ అందఱును నిద్రించుసమయమున రామకృష్ణుడు వారి

---

౮ చండాలోపస్పర్శనే సంభాషాయాం దర్శనే చ దోషః-తత్ర ప్రాయశ్చిత్తమ్. అవగాహనమపాముపస్పర్శనే. సంభాషాయాం బ్రాహ్మణ-సంభాషా దర్శనే జ్యోతిషాం దర్శనమ్.

—ఆపస్తంబధర్మసూత్రమ్. ౨. ౧. ౨. ౯.

౯ యస్తుచ్ఛాయాం శ్వపాకస్య బ్రాహ్మణోహ్యధిరోహతి,
తత్రస్నానం ప్రకుర్వీతఘృతం ప్రాశ్య విశుధ్యతి.

—అత్రిస్మృతి. ౨౮౭-౨౮౮.

యింట ప్రవేశించును. అతని కప్పుడు దీర్ఘమగు కేశపాశముండెను. ఆ కేశములతో నా ప్రదేశమును శుభ్రపఱచుచు, "తల్లీ! నన్ను పంచముని సేవకునిగ నొనర్పుము. పంచముని కంటెను హీనుడనని గ్రహింపజేయుము" అని నుడువును. "నా భక్తులను అర్చించువారే యథార్థముగ నన్ను పూజించుచున్నారు.౧౦ వీరందఱును నా బిడ్డలు, వీరిని సేవించుటవలననే నీజన్మ సాఫల్యము నందగలదు"౧౧ అని మాశాస్త్రములు ఉపదేశించుచున్నవి.

అతని సాధనావిధానములు ఇంకను పెక్కులుగ నున్నవి. వానిని వర్ణించుటకు చాలగ సమయము పట్టును. నేను మీ కాతని సంగ్రహ జీవితమునే తెల్పెదను. ఈ రీతిగ బహువర్షము లాతడు సాధనల నొనర్చెను. కామమును నిర్మూలమొనర్ప నతడొనర్చిన ప్రయత్న మీ సాధనాంతర్గతమే. ఆత్మ లింగరహితము; స్త్రీయును కాదు పురుషుడునుకాదు. లింగాభిమానము శరీరముననే సంస్థితమై యున్నది. ఆత్మను బొందగోరినయెడల లింగభేదమును, వివక్షింపగూడదు. పురుషశరీరధారియగు ఈ మహనీయుడు తనయందు స్త్రీభావమును నెలకొల్పుకొనగోరెను. అతడు తన్ను యువతిగ భావించుకొనజొచ్చెను; ఆడువారివలె బట్టల కట్టుకొని, వారివలె భాషించుచు. పురుషోచితములగు కార్యములను త్యజించెను. ఒక జమీందారుని రాణివాసమున స్త్రీలతో నివసింప దొడగెను. ఇట్లు కొంతకాల మత డీ సాధనయందు నిమగ్నుడైయుండ నాతని మనస్సున పరివర్తనము పొడసూపెను. కామభావ మంతర్హిత మయ్యెను, జీవనదృక్పథము సంపూర్ణముగ మార్పునందెను.

---

౧౦ యే యే భక్తజనాః పార్థ న మే భక్తాశ్చ తే జనాః,
మద్భక్తానాంచ యే భక్తా స్తే మే భక్తతమా మతాః.

—ఆదిపురాణమ్.

౧౧ ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరం,
తస్మాత్ పరతరం దేవి తదీయానాం సమర్చనమ్.

—పద్మపురాణమ్.

పాశ్చాత్యదేశములలో నారిని అధికముగ సమ్మానింతురని చెప్పగ వినియుంటిని. కాని, ఈ గౌరవము ఆమె యౌవనసౌందర్యములకు లభించును. ఇంక ఇతని నారీపూజయనిన ప్రతియువతి యొక్క వదనమునను ఆనందమయియగు జగజ్జననిని వీక్షించుటగాక మఱి అన్యమేమియును కాదు. నేను అతడు సంఘబహిష్కృతలగు యువతుల కడ మోకరిల్లి, బాష్పగద్గదుడై, "తల్లీ! నీ వీ రూపమున వాకిలి ముంగిట నిలబడియుంటివి, అన్యవిధమున నీవే ఈ విశ్వమై వఱలుచున్నావు, నీకు నమోవాకములు" అని వచించుచుండగా నేను ప్రత్యక్షముగ వినియుంటిని. ఎవని జీవితమునుండి కామప్రవృత్తి తొలగిపోయినదో, ఎవడు యువతులను కేవలము భక్తిప్రపత్తుల తోడనే వీక్షింపగల్గునో, ఎవడు వనితావదనములను జగత్త్రాణకర్త్రియగు జగదంబారూపముననే వీక్షించునో, అట్టివాని జీవిత మెంతగ ధన్యమో ఒక్కపరి యోజించుకొనుడు. ఇట్టి ధన్యతయే వాంఛనీయము. శక్తిస్వరూపిణులగు స్త్రీలను కళంకితల జేయదలచుచుంటిరా? ఇంతవఱ కెవ్వరును ఇట్టి దుస్సాధ్యము నొనర్చియుండలేదు. ఒనర్పజాలరు కూడను. వారియందున్న దివ్యత్వ మనుక్షణము దీప్తి నందుచునేయున్నది. ఆ తేజము విధిగా తప్పిదమును, కాపట్యమును కనుగొనగలదు. ఆ తేజము అమోఘముగ సత్యముయొక్క సౌంద్యమును, ఆత్మయొక్క మహిమను, పవిత్రతయొక్క పూజ్యతను తెలిసికొనగలదు. ఆధ్యాత్మికోన్నతి నందగోరినయెడల దోషరహితమగు చరిత్ర అత్యంత మావశ్యకమగును.

తపఃపూతమును నిరంజనమును అగు పవిత్రత నత డీ రీతిగ సాధించెను. మన జీవితమున పొడసూపు అల్లకల్లోలము లన్నియును అతనికి అతీతప్రాయములయ్యెను. అతడు చెమటోడ్చి సంపాదించిన ఆధ్యాత్మికభూషణములు, జీవితమునందలి ముప్పావు-భాగమును వెచ్చించి నిలువజేసికొనిన ఆధ్యాత్మిక-ధనరాసులు ఇప్పుడు జగత్తున కర్పింపదగినవై యుండెను. తోడ్తోడనే అతని ప్రచారకార్య మారం

భింపబడెను. అతని బోధనావిధానము, ప్రచారములు అద్భుతములుగ నుండెను. మా దేశమున గురువు నత్యధికముగ సమ్మానింతురు. గురుని దేవునిగనే భావింతురు. గురునియెడల ప్రదర్శింపబడు భక్తిని మేము తల్లిదండ్రులయెడగూడ జూపము. తల్లిదండ్రు లొసగినది కేవలము పాంచభౌతికమగు శరీరమే. గురుడన్ననో మోక్షమార్గమును ప్రదర్శించుచున్నాడు. మే మాతని బిడ్డలము, తత్తపఃఫలము ననుభవించు మానసిక-పుత్రులము.౧౨ అలోకసామాన్యుడగు గురుని దర్శనమొనర్ప జనులు తండోపతండములుగ వత్తురు. శ్రీరామకృష్ణు డట్టివాడుగ పరిగణింపబడెను. కాని అతడు నిందాస్తుతులను సమానముగ జూచెను. స్వీయగురుత్వమునుగుఱించిన తలపే అతనికిలేకుండెను. జగన్మాతయే నియంత్రియనియు, తాను కేవలము నిమిత్తమాత్రుడననియు ఆతడు తలచెను. సర్వదా ఆత డిట్లనుచుండెను: ''నా నోటినుండి మంచి పలుకేమైన వెలువడిన జగదంబయే పల్కించుచున్నది. దానితో నాకేమియును సంబంధము లేదు.'' ఇట్టి స్వాభిప్రాయవిశేషముతో నతడొప్పుచుండెను. మరణపర్యంతము ఆత డిదే యభిప్రాయమును గలిగియుండెను. అతడు శిష్యులను ప్రోగుచేసికొన ప్రయత్నింపలేదు. 'యమనియమముల నభ్యసింపుడు; ఆత్మసాక్షాత్కార మొనర్పుడు; సంభావ్యమును గుఱించి ఆతురతనందకుడు' అని అత డుపదేశించుచుండెను. 'పద్మము వికసించిన మధుపములు తేనియలగ్రోల పిలుపులేకుండినను అరుదెంచును. అట్లే నీ హృదయ-సారసము సంపూర్ణవికాసము నందినయెడల సంభావ్యమున కెట్టి ఆటంకమును ఉండబోదు' అను ఉపమావాచక మతని కత్యంత ప్రీతికరమై యుండెను.

---

౧౨ (అ) స హి విద్యాతస్తం జనయతి, తచ్ఛ్రేష్ఠం జన్మ, శరీరమేవ మాతపితరౌ జనయతః.

—ఆపస్తంబ ధర్మసూత్రమ్, ౧-౧-౧౬-౧౮.

(ఆ) ఆచార్యం పితరం పరిచక్షతే.

—మనుస్మృతి. ౨-౧౪౦.

ఇది ఉత్తమమగు బోధ. నా గురుదేవుడు శతఃపరముగ నాకీ విషయమును బోధించియుండెను. అయినను నేను తఱచుగ మఱచుచుందును. సంకల్ప-ప్రభావమును, భావశక్తిని ఎఱుంగ గలిగిన వారరుదు. ఒకడు గుహాభ్యంతరమున ప్రవేశించి, ఎవ్వరి తోడను సంపర్క ముంచుకొనక, సత్సంకల్పపూరితచిత్తుడై మరణించినను ఆ సంకల్ప మా గిరిగుహాను భేదించుకొని ఆకాశమండలమును ప్రతిస్పందింపజేసి ప్రపంచము నందంతటను వ్యాప్తమగును. సంకల్ప - మహిమ మిట్టిది. కనుక. సంకల్పములను ఇతరుల కందజేయుటకై తొందరపడవలసిన అగత్యము లేదు. మొదట దేయమును సముపార్జించుకొనుము. దేయవిషయము కలవాని బోధయే యథార్థ బోధనము. బోధయన శుష్క-ప్రసంగము కాదు. బోధయన తత్త్వముల ప్రపంచించుటయునుగాదు. బోధయన భావప్రదానము—హృదయమును వెలుగొందజేయుట. మన మొక పుష్పమును ఇతరుల హస్తమున నుంపగలిగినట్లుగనే, సాక్షాత్కారప్రభలతో ఇతరుల హృదయములనుగూడ నింపగలము ; పుష్ప ప్రదాన తుల్యమగు వాస్తవతయే దీనియందుకూడ ఉన్నది, ఇది అక్షరాల నిజము. ఈ తత్త్వమును భారతీయులు బహుప్రాచీన కాలముననే గ్రహించియుండిరి. పాశ్చాత్య దేశములనున్న గురుశిష్యపరంపరావిశ్వాసముకూడ ఈ విషయమునే నిరూపించుచున్నది. కనుక, ప్రథమమున సచ్ఛీలమును సంపాదింపుము—ఇదియే నీ ప్రధానతమకర్తవ్యము. అపరోక్షానుభూతిని బొందుము. ప్రబోధము నందగోరువారు నీకడకు తామరతంపరగ అరుదెంచెదరు. నా గురుదేవు డిట్టి అభిప్రాయమునే కలిగియుండెను. పరనింద అనిన నేమియో అతడెఱుగకుండెను. నే నతనియొద్ద బహువర్షము లుంటిని. అతని నోటినుండి ఇతరసంప్రదాయములను విద్వేషించు పలు కెన్నడును వెలువడలేదని చెప్పగలను. ఎట్టి సంప్రదాయముపైనను సమగౌరవమునే ప్రదర్శించెడువాడు. వీని సమన్వయము నతడు గ్రహించెను.

జ్ఞాన-భక్తి-కర్మ-రాజ-యోగములు రుచివైచిత్ర్యము ననుసరించి ఏర్పడియున్నవి. మతము లన్నియును వీనిలో నొకదానిని బోధించు చున్నవి. అయినను ఒకని యందే ఈ యోగ చతుష్టయము సమన్వితము కాగలదు. భవిష్యద్యుగమువారీ కార్యమునే సాధింతురు. ఇట్టి సునిశ్చితాభిప్రాయముండుటవలననే అతడు పరవిద్వేషము లేక సర్వత్ర మంచినే చూడగలిగెను.

వేలకువేలుగ జను లీతని దర్శించి, వాగమృతమును గ్రోల రాదొడగిరి. అత డత్యంత సాధారణమగు గ్రామ్యభాషలో సంభాషణ మొనర్చెడువాడు. కాని ప్రతిమాటయును శక్తి గర్భితమై, జ్ఞాన దీపికయై వెలువడుచుండెను. పదములును భాషయును బహిరాడంబరములు మాత్రమే; వక్తయొక్క వ్యక్తిత్వమే పలుకులలో పొదగబడి హృదయమును స్పృశించుచున్నది. ఈ విషయ మొక్కొక్కప్పుడు మనకు బోధపడుచున్నది. మనము అత్యంతాద్భుతములగు ఉపన్యాసములను, ప్రజ్ఞాధురీణములగు ప్రసంగములను ఆలకించి ఇంటికి పోయినంతనే మఱతుము. కాని, అన్యసమయములందు వినిన ఒకటి రెండు సాధారణ-వాక్యములు హృదయమున ప్రవేశించి అంగీభావమునంది ఉత్తమోత్తమములగు ఫలితములను ప్రసాదించు చున్నవి. ఏ వాక్యములయందు వక్తయొక్క శక్తి నిహితమగు చున్నదో ఆ వాక్యములే ఫలప్రదము లగుచున్నవి. కాని, అపార శక్తిసమన్వితుడే ఇట్టిపని నొనర్పగలడు. బోధయన దాన---ప్రతిగ్రహణములు. గురుడొసగును, శిష్యుడు గ్రహించును. గురున కిచ్చుశక్తియును శిష్యునకు పుచ్చుకొనుశక్తియును ఉండవలెను.

ఈతడు భారతదేశమునకు ముఖ్యపట్టణమగు కలకత్తా నగరమున కతిసమీపముననే నివసించుచుండెను. కలకత్తా విశ్వవిద్యాలయమే మా దేశమునందలి విశ్వవిద్యాలయములలోనికెల్ల ప్రధానమైనది. ఈవిశ్వవిద్యాలయమునుండియే ప్రతిఏటను వందలకొలదిగ

నాస్తికులును, జడవాదులును వెలువడుచుండిరి. కాని, నాస్తికులును అజ్ఞేయవాదులును అగు ఈ పట్టభద్రులే ఎక్కుడుగ ఈ మహాత్ముని వచనామృతమును వినవరిగెడువారు. ఇతనిని గుఱించి నేను వింటిని. విని చూడబోయితిని. చూచుటకు సామాన్యుడుగనేయుండెను. అసాధారణత్వ మేమియును నాకగపడలేదు. అతని భాషయందు కూడ విశేషమేమియును లేకుండెను. 'ఇట్టివాడు గురూత్తముడా?'— అని నేననుకొంటిని. సమీపించి, యావజ్జీవముగ నేనందఱను అడుగు ప్రశ్నను, 'మీకు భగవంతుడనిన నమ్మక మున్నదా?' అని ప్రశ్నించితిని. 'ఉన్నది' అని అతడు ప్రత్యుత్తర మొసగెను. 'ఈ విషయమును నిరూపింపగలరా?' అని మరల నేనడిగితిని. 'నిరూపింపగలను' అని ఆయన నుడివెను. 'ఎట్లు?' అంటిని. 'నేను భగవంతుని నిన్ను ఇప్పుడు చూచుచున్నట్లే, మఱింత ప్రగాఢముగ దర్శనమొనర్చుచుంటిని' అని జవాబొసగెను. ఈ ప్రత్యుత్తరమును విని నేను సమ్మోహితుడనైతిని, ఏలయన, నే నదియే తొలిసారిగ భగవంతుని చూచితిననియు, ధర్మము సత్యమే అనియు, అది అనుభవైకవేద్యమనియు, మన జగదనుభూతికంటెను ఈ అనుభూతి సుప్రగాఢమనియు వచించు సాహసముగల మహనీయుని దర్శించితిని. నేను అనుదినము అతనిని చూడ దొడగితిని—ధర్మానుభూతి ప్రసాదింపదగినదియే యని నేను తెలిసికొంటిని. ఒక స్పర్శ, ఒక వీక్షణము జీవితమును మొదలంట మార్చివేయగలవు. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు మొదలుగాగల ప్రాచీన మహాపురుషులు 'పరిపూర్ణుడవు కమ్ము' అని ఆశీర్వదించినతోడనే జనులు పరిపూర్ణత నందిన విషయము నేను గ్రంథములలో చదివియుంటిని. ఆ విషయము లన్నియును సత్యములేయని నే నితనిని జూచినపిదప నిశ్చయించుకొంటిని. నా అవిశ్వాసము లన్నియును తొలగిపోయెను. అనుభూతిని ప్రసాదింపవచ్చును. నా గురుదేవు డిట్లు చెప్పుచుండెడివాడు: ''అనుభవజ్ఞానమును అనుగ్రహింపగలము, ఇంత స్పష్టముగ

ఇతరులకు ప్రసాదింపదగు వస్తువు మఱియొకటి ఈ జగత్తున లేదు.'' కనుక, ప్రథమమున అనుభూతి-సంపన్నుడవు కమ్ము, ప్రదాన యోగ్యమగుదానిని సముపార్జింపుము. పిదప, జగద్రంగమున నిలబడి దానిని పంచిపెట్టుము. ప్రసంగములలోను, సిద్ధాంతముల లోను, వాదములలోను, సంప్రదాయములలోను ధర్మము గూడు కట్టుకొనియుండదు. ఉప-శాఖలలోను సమాజములలోను ధర్మము గోచరింపదు. ధర్మమనిన జీవేశ్వరుల సంబంధము. ఇది సంఘబద్ధ మగుట ఎట్లు పొసగును? సంఘబద్ధమైన తావుల నది వర్తకవ్యాపార ముగ మాఱుచున్నది. వర్తక-తత్త్వము ధర్మమున కండమైన తావులందు 'అనుభూతి' శూన్యమగును. గుడిగోపురములను కట్టించుట మత మనబడదు. ధర్మమనిన సార్వజనీనోపాసన, మంతకంటెను గాదు. గ్రంథములు, నీతులు, ఉపన్యాసములు దానిని తెలియజెప్ప జాలవు. అపరోక్షానుభూతియందే ధర్మతత్త్వము నిహితమైయున్నది. స్వయముగ సత్యమును గ్రహింపనియెడల పరితృప్తి లభింపదను విషయము మన కందఱకును దెలిసియేయున్నది. శ్రవణమననములే కేవలము మనకు సంతుష్టి నొసగజాలవు; సాక్షాత్కారానుభవ మొక్కటియే అఖండపరితృప్తి నొసగగలదు. ఇందులకు ప్రతివాడును అర్హుడు. ప్రయత్న ప్రాబల్యము ననుసరించి ఇది సర్వులకును లభింప గలదు. ఈ సాక్షాత్కారానుభవమునకు త్యాగమే ప్రథమసోపా నము. ఎంతగ త్యజింపగలిగిన అంతగ మంచి చేకూరగలదు. అంధకారము, ఆలోకము, విషయానందము; బ్రహ్మానందము—ఇవి ఒక్కట నుండజాలవు. 'దైవమును ధనదేవతను ఒక చేతితో పూజింపజాలము'. ఈ అసాధ్యమును సాధింపగోరు వెఱ్ఱులుండిన ఉండురుగాక, ఈ ప్రయత్నము నిష్ఫలమగుట నేను కనులార జూచి యుంటిని. కొన్ని దేశములవారు ప్రయత్నించియుండిరి కూడ. పైన జెప్పబడిన వాక్యము సర్వమును ఈశ్వరుని నిమిత్తము త్యజింప వలయునను సత్యమునే ఉపదేశించుచున్నది. ఈ క్రియ, దీర్ఘకాల

నైరంతర్య సాపేక్షము. దీనిని సాధింప నీ ముహూర్తమునుండియే ప్రయత్నింపుము. 'శనైః శనైః ఉపరమేత్'.—నెమ్మదిగ అడుగులను వైచుకొనుచు పోవలయును.

నేను నా గురుదేవుని నుండి గ్రహించిన ద్వితీయసిద్ధాంతము ఏమనిన: జగత్తున నున్న ధర్మమతములు పరస్పరవిరుద్ధములు కావు. పరస్పరవైరభావ-సంబద్ధములును కావు; అవి సనాతనమగు ఒకే ధర్మసిద్ధాంతముయొక్క వివిధరూపములు; దేశకాలపాత్రముల ననుసరించి, భావభూమికల ననుసరించి ఆ సనాతన ధర్మమే పాత్రోచితముగ సమన్వితమొనర్పబడుచున్నది. ఇదియే అతని బోధనల లోనికెల్ల సర్వప్రధానమగు బోధ, అత డావిష్కరించిన మహాసత్యము. నీ మతము నా మతము అనుట తప్పు; ఆ జాతివారి మతము ఈ జాతివారి మతము అనుట పొల్లు. పెక్కుమతము లున్న వనుట భ్రాంతి. ఉన్నది ఒకే ధర్మము. 'ఏకమేవాద్వితీయ' మ్మను మహాసత్యమే అనాదికాలమునుండియు వెలయుచున్నది. అదియే చిరంజీవమై నిత్యసిద్ధమై భవిష్యత్కాలమునగూడ వెలుగొందును. ఈ ధర్మమే నానాదేశముల నానారూపములను ధరించుచున్నది. కనుక, వివిధమతములును సమానయోగ్యములే యగుచున్నవి. సాధ్యమైనంతవఱకు వాని నన్నిటిని మన్నించుచుండవలెను. ధర్మము దేశభేదమును జాతీయవైశిష్ట్యమును అనుసరించియేగాక, ఆధికారిక-ఔన్నత్యము ననుసరించిగూడ ప్రకాశితమగుచుండును. ఒకనియందు ఈ ధర్మము తీవ్రకర్మపరత్వముగ — కర్మయోగముగ — వెలుగొందును; మఱియొకనియందు పరభక్తిరూపమున, అన్యునియందు యోగరూపమున, ఇంకొకనియందు జ్ఞానరూపమున, ఇట్లే బహువిధముల ఆ సనాతనధర్మము పరివ్యక్తమగుచున్నది. కనుక, ఇతరుల సాధనామార్గమును దోషభూయిష్టమనజెల్లదు. ప్రేమభక్తి ననుసరించువ్యక్తి, పరోపకారపరాయణుడగు కర్మయోగిని స్వమార్గానువర్తనుడు కాకపోవుటవలన భ్రాంతుడని తలచుట యుక్తము

కాదు. జ్ఞానయోగి అన్యసాధకులనుగూర్చి, 'అజ్ఞానప్రాయులు, ఈశ్వరుని గుఱించిగాని, తత్ప్రేమమును గుఱించికాని వారి కేమి తెలియును? వారి విషయము వారికే అర్థము కాకున్నది' అని తలపోయుట న్యాయము కాదు. ఏలయన, ఉభయులును ధర్మపథానువర్తులే. సత్యము ఏకాత్మకమును అనేకాత్మకమునుగూడ అనియు, ఆ అద్వితీయవస్తువే వివిధదృష్టులకు వివిధరూపముల సాక్షాత్కరించుచుండు ననియు మనము అవశ్యము గ్రహింతుముగాక! ఇదియే ఉత్తమమగు రహస్యము.* ఇట్లు గ్రహించినయెడల మన కెవ్వరితోడను విరోధముండదు. అందఱును స్నేహాస్పదులే యగుదురు. జగత్తున వేఱువేఱు ప్రకృతులతోగూడిన మనుష్యులు జన్మించుచుండునంతవఱకు ఆ అద్వితీయమగు సత్యవస్తువే పాత్రోచితమగు మార్పుల నందుచుండునని గ్రహించినయెడల, మనము పరస్పర సహనమును జూపుకొనుటకు బాధ్యుల మగుదుము. నానాత్వమున ఏకత్వము ప్రకృతిసిద్ధము. అనంతభేదయుక్తమగు ఈ దృశ్యప్రపంచము మఱుగున అపరిణామియును, ఐక్యసంధాయకమునుఅగు వస్తువు ఒకటి వెలయుచున్నది. ప్రతి మనుజునకును అనుభవనీయమగు బహుత్వబోధ ఏకత్వముననే సంఘాతమగుచున్నది. బ్రహ్మాండము యొక్క క్షుద్రపునరావృత్తియే అండాండము. నానాత్వబోధయందుకూడ ఓతప్రోతభావమున ఏకత్వమే సమన్వితమై విరాజిల్లుచుండుట మనము గమనింపదగిన విషయము. వర్తమానకాలమున

---

* (అ) ఇంద్రం మిత్రం వరుణ మగ్నిమాహురథోదివ్యః స సుపర్ణో గరుత్మాన్, ఏకం సద్ విప్రా బహుధావదం త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః.

---ఋగ్వేదమ్ ౧-౧౬౪-౪౬.

(ఆ) సుపర్ణం విప్రాః కవయోవచోభి, రేకం సంతం బహుధా కల్పయంతి.

—ఋగ్వేదమ్-౧౦-౧౧౪-౫.

(ఇ) వదంతి తత్తత్త్వవిదస్తత్త్వం యజ్జ్ఞానమద్వయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే.

—శ్రీమద్భాగవతమ్-౧-౨-౧౧.

ఈ సిద్ధాంత మత్యంత ప్రయోజనమైయున్నది. మా దేశమునయున్న మతసంప్రదాయ–శాఖల కంతులేదు. విచిత్రముగ పరమతములవారు ఆ దేశముననే తమ మతప్రచారకులను 'అహమహమిక'గ పంపు చున్నారు. కనుక, నాకు చిన్నతనమునుండియే ప్రపంచమునందలి మతశాఖలన్నిటితోడను పరిచయము లభించియున్నది. మార్మనులు కూడ * మా దేశమునకు ధర్మప్రచారమొనర్ప నరుదెంచియుండిరి. అందఱకును ఆహ్వానము! మా దేశము ధర్మక్షేత్రము, ధర్మ ప్రచారమునకు అనువైనతావు. భారతీయుల హృదయమున తదితర దేశస్థులహృదయమునకంటె, ధర్మప్రచారమే ప్రగాఢముగ హత్తు కొనును. మీరు రాజ్యాంగవిషయములను ప్రసంగించిన, భారతీయులు డిల్లవోవుదురు. కాని మీరు ఎంత విచిత్రమైన ధర్మసిద్ధాంతము లను బోధించినను వారు చెవికోసికొని విందురు. లక్షలకొలదిగ శిష్యులు లభింతురు. జీవత్కాలముననే మిమ్ము భగవంతునిగ పూజించెదరు. ఈ విషయము నా కానందమునే కలుగజేయు చున్నది. మేము ధర్మమునుగాక అన్యమును వాంఛింపము.

హిందూమతము బహుశాఖాబంధురము. ఈ శాఖలలో కొన్ని ఆపాతవిరుద్ధములై తోచును. అయినను, ఆ మతము లన్నియును సనాతనమతాంతర్గతములుగనే పరిగణింపబడును. "నదులన్నియును వేఱువేఱుతావుల జన్మించి ఋజు కుటిలములగు వివిధ మార్గముల ననుసరించి సముద్రముననే అస్తంగతము లగు నట్లు, వివిధమతములవారు వివిధదృష్టుల నాశ్రయించి తుదకు నిన్నే పొందు చున్నారు." * ఇది కేవలము నోటిమాట కాదు, వాస్తవముగ గ్రహింపనగును ; కాని, మహనీయులు కొందఱు కృపాపరవశులై

* క్రీ. శ. ౧౮౩౦ న జోసఫ్ స్మిత్ అనునతడు అమెరికా సంయుక్త రాష్ట్రములలో ఈ సంప్రదాయమును స్థాపించెను. వీరు బైబిలులో ఒక క్రొత్త అధ్యాయమును జేర్చిరి. వీరు దివ్యశక్తులు కలవారమని చెప్పుకొందురు. బహుభార్యా వివాహము నంగీకరింతురు.

* రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానాపథజుషాం నృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవ ఇవ. —మహిమ్నాస్తోత్రమ్. ౭.

"అవునవును, ఈ మతములలో కొంత మంచియున్నది. ఇవి అనార్య మతములు. వీనియందుకూడ కొంత మంచియున్నది" అని నుడువు నట్లు కాదు. ఇతరమతములన్నియును చరిత్రయుగమునకు బూర్వము సంఘటిల్లిన క్రమపరిణామమును సూచించు శకలములనియు, తమ మత మొక్కటియే పరిపూర్ణమగు పరిణామము నందినదనియు వచించు మహోదారతా సంపన్నులు కొందఱున్నారు. కొందఱు తమ మతము అత్యంతము ప్రాచీనమగుటవలన సర్వశ్రేష్ఠతను దాని కాపాదించుచున్నారు. కొందఱు తమ మతము నవీనతమమగుట వలన నదియే సర్వోత్తమ మనుచున్నారు. కాని, వీని యన్నిటికిని సముద్ధరణశక్తి సమముగనే యున్నదని మనము గ్రహింపవలసి యున్నారము. మనకు కనిపించు ప్రభేదములు కేవలము గౌణ విషయములనే ఆశ్రయించుకొని యున్నవి; ఈ గౌణవిషయములన్ని యును మూఢాచార ప్రసూతములు. పిలిచెడివారల కందఱకును భగవంతుడే బదులుపల్కును. నీకుగాని నాకుగాని మఱి యే ఇతర మానవ మాత్రులకుగాని జీవుల ముక్తిని గుఱించి తలకొట్టుకొనవల సిన అగత్యము లేదు. సర్వశక్తిమంతుడగు సర్వేశ్వరుడే జీవోద్ధరణ మునుగుఱించి యోచింపగలడు. ఒకే భగవంతుడు జీవులందఱి మొఱలను ఆలకించి, ముక్తి నొసగుచున్నాడు. తమ కీశ్వర విశ్వాస మున్నదని పలుకుచు, మరల తమ మతస్థుల భుజస్కంధముననే మానవకోటికి ముక్తినొసగు భారము నిలచియున్నదని అసంబద్ధముగ ప్రలాపించువారి రీతియెట్టిదో నాకు తెలియకున్నది. దీనిని ధర్మమన జెల్లునా? ధర్మమనిన సాక్షాత్కారము. ప్రసంగములు, వాఙ్మాత్రమగు విశ్వాసము, అంధకారమున తడుముకొనుట. పూర్వుల సిద్ధాంతము లను చిలుకలవలె ఏకరువుపెట్టుట, ధర్మము పేరిట రాజకీయములను గుదిగ్రుచ్చి ధర్మమని భ్రమించుట : ఇవి యెన్నటికిని ధర్మమనిపించు కొనజాలవు. ప్రతిసంప్రదాయముననుఁ—తుదకు మనము సహృద యత లేదని భావించు మహమ్మదీయులలోఁగూడ—సాక్షాత్కార

ప్రయత్నమతితీవ్రమైన తావులనుండి, "ప్రభూ! నీవు సర్వేశ్వరేశ్వరుడవు. నీవు అందఱి హృదయములందు వెలయుచున్నావు. నీవే ప్రతివారికిని కర్ణధారుడవు. నీవే జగద్గురుడవు. నీ ప్రజ నివసించు భూమిని రక్షింప నీవే మా అందఱికంటెను ఎక్కుడుగ ప్రయత్నింతువు" అను అమోఘవాక్యములు వెలువడియున్నవి. ఎవరి విశ్వాసమును చెఱుపకుము. మంచినొసగ గలశక్తి యున్నయెడల ఒసగుము. శక్తియున్నయెడల ఇతరులమనస్సును గదల్పకయే, ఉచ్చతరభావభూమికల నధిరోహింపజేయుము. దీని కేమియును అభ్యంతరము లేదు. కాని, ఉభయభ్రష్టత నాపాదింపకుము. తత్క్షణము సహస్రరూపములను ధరింపగలుగువాడే యథార్థగురుడు – బోధగురుడు. వెనువెంటనే శిష్యుని మనస్సు విహరించుచుండిన మనోభూమికకు దిగి, తన ఆత్మను శిష్యుని ఆత్మతో ఐక్యము ఘటిల్లచేసికొని, శిష్యుని శ్రవణ నేత్రములను తాను ధరించి అతనిమనస్సున జరిగెడుదాని నంతటిని కనిపెట్టగలుగువాడే నిక్కపు గురుడు. ఇట్టివాడే బోధగురువు, మిగిలినవారు బాధగురువులు. ఈ గురువులు శుభప్రదులుకారు. జగత్తున కమంగళదాయకులు.

గురుచరణసాన్నిధ్యమున నేను గ్రహింప గలిగిన మఱియొక విషయము : ఇహజీవనముననే మనుష్యుడు పరిపూర్ణత నందగలడు. నా గురుని నోటినుండి యెన్నడును కఱకు పలుకులుగాని నిందావాదములుగాని, వెలువడియుండలేదు. చెడుగును గాంచగల్గెడు శక్తిగాని, చెడుగును చింతింపగల శక్తిగాని ఆయనకు లేకుండెను. అన్నిటను అంతటను మంచియే ఆయనకు గోచరించెడిది. ఉజ్జ్వలములగు పవిత్రతా త్యాగములే సాక్షాత్కారరహస్యముయొక్క కీలకములు. "ధనము, సంతానమును అమృతత్వము నొసగజాలవు ; త్యాగ మొక్కదానివలననే అమృతత్వము లభించును" అని వేదములు వచించుచున్నవి.* "నీ కున్నదానిని అమ్మి బీదలకొసగి నన్ననుస

* న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః.
—కైవల్యోపనిషత్ ౧. ౨.

రింపుము'' అని క్రీస్తు వచించినాడు. ఇట్లే జగత్తున గల మహా పురుషు లందఱును ఐక్య కంఠముతో నీ విషయమును జెప్పి, తమ జీవితమును దృష్టాంత మొనర్చినారు. ఈ త్యాగమే లేకుండినయెడల ప్రబలమగు ఆధ్యాత్మికశక్తి ఎట్లు లభింపగలదు? జగత్తునగల మతములన్నియును సాక్షాత్కారమునకు త్యాగమునే ఉపాయముగ ఉపదేశించుచున్నవి. త్యాగభావము హ్రస్వమైన తావులు విషయానందమునకు లోబడి, తదనుపాతముగ ఆధ్యాత్మికశక్తిని శిథిల మొనర్చుకొనుచున్నవి.

నా గురుదేవుడు త్యాగమూర్తి. మా దేశమున సన్న్యాసాశ్రమమును స్వీకరించినవారు ధనమును, ప్రతిష్ఠను త్యజింతురు. మనోవాక్కాయకర్మముల నిట్టి త్యాగమును నా గురుదేవు డనుష్ఠించి చూపెను. అత డేదైన చిన్నవస్తువును తమనుండి తీసికొనినయెడల ధన్యుల మగుదుమని తలచువారు చాలగనుండిరి. వేలకొలది రూప్యములనొసగ ననేకులు సిద్ధముగ నుండిరి. కాని అతడు వీరినుండి దూరముగ తొలగిపోయెడువాడు. కామ కాంచన త్యాగవిషయమున అతని జీవితము విజయభూషితమగు దృష్టాంతము; జీవు డీ విషయమున సాఫల్యము నందగలడని తెలియజెప్పు సిద్ధావస్థయది. అతని మనస్సు కామకాంచన భావముల కతీతమై వెలయుచుండెను. వర్తమాన-యుగమున ఇట్టివారి ప్రయోజన మపరిమితముగ నున్నది. ప్రస్తుతము జనులు 'ఆవశ్యకము' లను కొన్నిటిని సృష్టించుకొని, అవి లేనియెడల ఒక్క-నిముసమైనను బ్రతుకజాలమని భావించుచున్నారు. ఈ ఆవశ్యకములు అనుదినము పరిమితిలేక పెరిగిపోవుచున్నవి. ఇట్టి విషమపరిస్థితులలో సమలోష్టాశ్మకాంచనుడును, అమానియునుఅగు మహనీయుడొకడు ఇంకను జీవించియున్నాడని ప్రపంచమునందలి అవిశ్వాసులకు దృష్టాంతప్రదర్శన మొనర్చుటకు

నా గురుదేవుడు



గాను ఇట్టివాడొకడు ప్రభవించుట ఆవశ్యకమైనది. లోకమున ఇట్టి వారలకు కొదువలేదు.

ఇతరులనిమిత్తము పరమవ్యాకులతాపూర్ణమగు ప్రేమ అతని జీవితవిశేషములలో మఱియొకటి. నా గురుదేవుని జీవితమునందలి ప్రథమభాగము ఆధ్యాత్మికానుభూతులను సాధించుటలో గడచెను. శేషభాగము ఆ ఆధ్యాత్మిక-ధనమును ఇతరులకు పంచిపెట్టుటతో ముగిసెను. ధర్మప్రబోధకులను దర్శనమొనర్పబోవు విషయమున మీ ఆచారములకును మా ఆచారములకును భేదము కనబడును. తఱచుగా నందఱును ఏదియో ఒక విషయమును ప్రశ్నించి ప్రత్యుత్తరమును బడయు నుద్దేశ్యముతోడనే యరుదెంతురు. కొందఱు వేలకొలదిమైళ్లదూరము నడచి వత్తురు-కేవలమొక ప్రశ్నను దెలిసికొనుటకు, ఒక్క పలుకును వినునిమిత్తము "నాముక్తికొక మంత్రమును నుడువుడు" అందురు. ఇంతగ శ్రమపడి వారరుదెంతురు. ఎట్టి ఆడంబరమును లేకుండగనే అసంఖ్యాకముగ జనులు అతడు సామాన్యముగా నుండు తావునకు వచ్చెదరు. ఆ చోటు వృక్షతలమై యుండును. వారి సంభాషణము ముగియునంతలోనే ఇంకొక జట్టు వచ్చిచేరును. కనుక, ఒక ధర్మప్రబోధకునకు అత్యధికసమ్మానము లభించుటతోడనే విశ్రాంతియనునది బొత్తుగ లేకుండును. రేయింబగళ్లు ప్రసంగములతోడనే గడచిపోవును. విరామములేకుండ జనులు వచ్చుచుపోవుచుందురు. అతడు, గంటలకొలది ప్రబోధమొనర్చుచుండును.

ఈతనియొద్దకుగూడ జన మసంఖ్యముగ రాదొడగిరి. ఇరువది గంటలుగ ప్రతిదినమతడు ప్రబోధ మొనర్చుచుండెను. ఇట్లు ఒక దినమా? రెండుదినములా? నెలలతరబడిగ అతడు ప్రసంగ మొనర్చుచుండెను. తుదకాతని శరీరము విశ్రాంతిరహితమగు ఈ కార్యపు

టొత్తిడికి నిలబడజాలకపోయెను. వేలకొలదిగ అరుదెంచుచుండిన జననిచయమునందలి హీనతమవ్యక్తిగూడ అతని సాయమును బొంద గలిగియేయుండెను ; మానవకోటియెడల అతని కిట్టి ప్రేమాను రాగము లుండెను. అతని కంఠదేశమున వ్యాధియొకటి అంకురించి, తీవ్రము కాదొడగెను. అయినను అతడు ప్రబోధమొనర్చుచునే యుండెను. ఎవరును అతనిని నిరోధింపజాలకుండిరి. ఎవరైనను వచ్చిరని వినినతోడనే వారిని లోపలకు దీసికొనిరమ్మని పట్టుపట్టి, వారి సందేహములనుదీర్చి పంపుచుండెను. మేము మందలించిన యెడల, "ఈ శరీర మేమగునదియును నేనంతగ పరిగణింపను. ఒక్క మనుష్యునకైన సాహాయ్యమొనర్ప నిరువదివేల శరీరములను త్యజింప గలను. ఒక్క మనుష్యునికైన సాహాయ్యమొనర్పగల్గుట ఘనతయే" అని నుడువుచుండెను. అతనికి విశ్రాంతి లేకుండెను. ఒకరు ఆయ నతో నిట్లనిరి : "అయ్యా! తమరు యోగివర్యులు, తమ మనస్సును రవ్వంత శరీరముమీద నిలిపి వ్యాధిముక్తులు కాకూడదా?" మొదట నతడేమియును ప్రత్యుత్తరమొసగకుండెను. పదేపదే ప్రశ్నింపగ, "మిత్రుడా! నీవేమియో యోగివని తలచుచుంటిని. కాని నీవుకూడ సంసారులరీతిగనే పలుకాడుచున్నావు. ఏ మనస్సును ఒకపరి భగవ త్పాదార్పిత మొనర్చియుంటినో ఆ మనస్సును మరల శరీరమువైపు నకు మరలింపు మనుచుంటివా? ఈ శరీరము ఆత్మకు కేవలము తొడుగే కదా!" యని ప్రత్యుత్తరమొసగెను.

అత డీ రీతిగ ప్రబోధ మొనర్చుచునేయుండెను. అతని శరీర మిక నిలువదనువార్త నలుగడల ప్రాకిపోయెను. జనులు ఇతోఽధిక ముగ రాదొడగిరి. భారతదేశమున జనులేరీతిగ సాధుపుంగవులను దర్శనమొనర్ప నరుదెంచునదియు, వారిని ప్రత్యక్షదైవతములుగ కొల్చునదియును మీరూహింపజాలరు. చరణములనంటుటకై వేల కొలదిగ జనులు వేచియుందురు. ఇట్లు పరుల ఆధ్యాత్మిక మహిమను

పూజించినయెడలనే మనయందుకూడ ఆధ్యాత్మికవికాస మగును. మనుష్యులు కోరి గౌరవించెడి విషయములనే పొందెదరు ; జాతులయెడ గూడ ఈ విషయము సత్యమగుచున్నది. మీరు భారతదేశమున కరిగి రాజకీయోపన్యాసముల నొసగుడు ; అవి యెంత గొప్పగ నున్నను విను వా రరుదుగనే యుందురు. కాని ధర్మప్రచార మొనర్పుడు, సాధుజీవితమును పరిగ్రహింపుడు, కేవల ప్రసంగములతో గాక మీ బోధనల నాచరించి చూపుడు. మిమ్ము జూచుటకై, మీ పాదములనంటుటకై, జనము విరగబడును. లోకులు అతి డిహమును శీఘ్రముగనే వీడునని గ్రహించి, పూర్వముకంటె నెక్కుడుగ రా దొడగిరి. నా గురుదేవుడు శరీరము నెడల లక్ష్యమొనర్పక ప్రబోధ మొనర్చుచునే యుండెను. మే మాతనిని ఆపజాలకుంటిమి. జను లత్యంతదూర దేశములనుండికూడ రాదొడగిరి. వారి సందేహములు తీరువఱు కాత డూరకుండెడివాడు కాడు. ''నా నోటినుండి మాట వెలువడునంతవఱకు ప్రసంగించుచుందును'' అని అతడనును. ఈ మాట కిక తిరుగు లేకుండెను. ఒకదినమున ఆయన మాతో శరీర మును విడుతునని పల్కి, పవిత్రములగు వేదమంత్రముల నుచ్చ రించుచు మహాసమాధియందు - నిమగ్ను డయ్యెను. అనంతరము అస్తమించెను.

ఈ మహాపురుషుని భావములను ఉపదేశములను ప్రచారము నొనర్పగల సమర్థు లల్పముగనే యుండిరి. తదితరశిష్యులతో బాటుగ, ఈయనకొక యువక-శిష్యబృంద ముండెను. వా రీతని బోధలను ప్రచార మొనర్ప సంసిద్ధులుగ నుండిరి. వారిని నిర్మూల మొనర్చు ప్రయత్నములు జరిగెను. కాని వారు ఆ మహాత్ముని పూతచరిత్రమే ఉత్సాహమునొసగు అవలంబనముకాగా జంకును గొంకును లేక నిలబడిరి. ఆ ధన్యజీవితము కట్టెదుటనే కాంచినవా

రగుటవలన దృఢవ్రతులై మనగల్గిరి. ఈ యువశిష్యబృందము సన్న్యాసదీక్షను స్వీకరించి తాము పుట్టిపెరిగిన కలకత్తానగర - వీథులలోనే భిక్షుకులై కడంగిరి. వీరిలో కొందఱు ధనాఢ్యకుటుంబముల వారై యుండిరి. ప్రథమమున ప్రతిఘటనము చాలగనే పొడ సూపెను. కాని, వీరు ధైర్యస్థైర్యముల నవలంబించి, ఆసేతుశీత నగము గురువర్యుని సందేశము ప్రచారమగువఱకు అనుదినము ప్రయత్నముల నొనర్చిరి. వంగదేశమున మారుమూలనున్న ఒకానొక కుగ్రామమున జన్మించిన మహాపురుషుడు విద్యయనిన నేమియో యెఱుగకున్నను, కేవలము దృఢసంకల్పబలముననే పరమార్థమును సాక్షాత్కరింప చేసికొని ఇతరులకుగూడ ప్రసాదించెను. స్వీయ సాక్షాత్కారానుభవములు జగత్తున సంప్రతిష్ఠిత మొనర్చు భారమును కొందఱుయువకుల కర్పించి మహాప్రయాణ మొనర్చెను.

జనకోటిపూర్ణమగు భారతదేశమునకు నేడు శ్రీరామకృష్ణ పరమహంసపేరు సుపరిచితమై తనరారుచున్నది. అంతియెకాక భారతేతర దేశములందుగూడ ఆ మహనీయుని శక్తి వ్యాపించుచున్నది. నేను ప్రపంచమునందలి ఏ తావుననైన సత్యసంభావితమైన పలుకు నొక్కటియైన పల్కియున్నయెడల, ఆధ్యాత్మిక భావసందీప్తమైన శబ్దము నొక్కదానినైన ఉచ్చరించియున్నయెడల, అయ్యది నా గురుదేవునిది ; దోషములు నావి.

వర్తమానప్రపంచమునకు శ్రీరామకృష్ణు డొసగు సందేశమేమన : "సిద్ధాంతములు, మతవాదములు, సంప్రదాయములు, ఉపాసనామందిరములు, దేవాలయములు మున్నగువానినిగుఱించి భావింపకుము ; మనుష్యహృదయమున దీపిల్లుచున్న ఆత్మవస్తువుతో సరిపోల్చి చూచినయెడల ఇవి యెందులకును కొఱగావు. ఈ ఆత్మ

వస్తువే ఆధ్యాత్మికశక్తి. ఈ శక్తి యెంతగ అభివృద్ధినందిన, మనుష్యునియందు జగన్మంగళకరమగు శక్తి అంతగ అభివృద్ధిని గాంచును. మొదట ఈశక్తిని సముపార్జింపుము, దీనినే పొంద ప్రయత్నింపుము. ఇతరధర్మములను నిందింపకుము. ప్రతి మతమునను, ప్రతిసిద్ధాంతమునను ఏదియో కొంత మంచి ఉండును. ధర్మము మాటలలోను సంప్రదాయములలోను దాగియుండదని, నీ జీవయాత్రలవలన ప్రదర్శింపుము. సాక్షాత్కారానుభవమును బొందినవారే సత్యమును గ్రహింపగలరు. ఆధ్యాత్మికశక్తిని సముపార్జించినవారే ఇతరులకు దానిని అనుగ్రహింపగలరు; ఇట్టివారే జగద్గురుపట్టమున నభిషిక్తులగుదురు. జ్ఞానజ్యోతిని ప్రసాదించు శక్తికేంద్రములు వీరే.''

ఇట్టి సిద్ధపురుషు లేదేశమున నెంతగ జన్మించుచుందురో, ఆ దేశమున కంతగ అభ్యుదయ నిశ్శ్రేయసములు చేకూరగలవు. ఇట్టి ఆత్మవేత్త లేదేశమున కలికమునకైన లభింపకుందురో, ఆదేశముయొక్క వినాశ మనివార్యము. దాని నెవ్వరును ఉద్ధరింప జాలరు. కనుకనే నా గురుదేవుడు, ''ఆధ్యాత్మిక శక్తి-సంపన్నుడవు కమ్ము, అపరోక్షానుభూతిని బడయుము'' అని మనుష్యలోకము నుద్బోధించు చున్నాడు. ఆయన మీనుండి అపేక్షించునది సోదరమానవులనిమిత్తము అపారత్యాగము. సహోదర ప్రేమప్రసంగముల నాపి, ఆ ప్రేమను కార్యరంగమున ప్రదర్శింపుడనియే ఆయన మీకు జెప్పునది. త్యాగ మొనర్పవలయుతరుణ మాసన్నమైనది. సాక్షాత్కారానుభవమును బడయదగు సమయమాసన్నమైనది. నీయందు త్యాగము, అనుభూతియును నెలకొనిన యెడల ప్రపంచమునందలి సర్వమతములలోను ఓతప్రోతభావమున వెలయుచుండిన సమన్వయసూత్రమునే వీక్షింపజాలుదువు. వ్యర్థములగు వివాదముల కాస్కారము లేదని గ్రహింపగలుగుదువు. గ్రహింప

గలిగినయెడలనే, నీవు మానవకోటిని సేవింప సంసిద్ధుడ వగుదువు. సర్వధర్మసమన్వయసత్యమును జగత్తునకు ప్రకటించి పరిస్ఫుట మొనర్చుటయే నా గురుదేవుని జీవితోద్దేశ్యము. ఇతరమతాచార్యు లందఱును స్వనామాంకితములగు విశేషమతములను ప్రచార మొనర్చియుండిరి. కాని, ఈ యుగాచార్యుడు తనశ్రేష్ఠతను ప్రక టింపబూనలేదు. అత డేమతమును నిందింపలేదు. బుద్ధిభేదమును సృష్టింపలేదు. ఏలయన, 'వాస్తవమున కీ మతము లన్నియును ఆ సనాతనమతాంతర్గతములు' అను మహాసత్యము నతడు గ్రహించి యుండెను.

---

# వర్ణానుక్రమిక సూచి